శ్రీరస్తు.

శ్రీసకలభాషావాగనుశాసనబిరుదాభిరామ

శ్రీ మన్నన్నయ భట్టారక

కవిసార్వభౌమప్రముఖసత్కవిప్రణీతంబును

నిఖిలపురుషార్థసాధకంబును కలికల్మషధ్వంసంబును పంచమవేదంబును నై

యెల్లవిద్వజ్జనంబులకు నత్యంతాదరణీయంబగు

# శ్రీమదాంధ్రభారతము.

మున్నుచెన్నపురిగవర్నమెంటు నార్మలుస్కూలునందాంధ్రప్రధానపండితులును

సుజనరంజనీముద్రాక్షరశాలాధికారులలోనొకరునగు

వింజమూరు, కృష్ణమాచార్యులవారిచేఁబరిష్కరింపఁబడినది.

ఇది,

మహారాజరాజశ్రీ

పెన్నాలూరుపేటలోనుండు

## వేముల, వేంకటరామానాయనివారి

అనుమతిచేత

ఆర్కాడు, ముత్యాలునాయనివారిచే

స్వకీయ వాణీనికేతనముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

శాలివాహనశకము ౧౭౮౯వసంవత్సరమైనప్రభవనామసంవత్సరము

చైత్రమాసమునందుఁబ్రచురముచేయఁబడియెను.

౧౮౬౭సంవత్సరము - ఏప్రల్ నెల.

చెన్నపట్టణము.

శ్రీ

—

శ్రీహయగ్రీవాయనమః

శ్లోకము. శ్రేయశ్శశ్వదుదఙ్చయన్తుజగతాంశ్రీవేఙ్కటాద్రీశితుః।
కారుణ్యామృతపూరపుఙ్ఖలదలాఃకమ్రాఃకటాక్షాఙ్కురాః
యేరాగారుణితాశ్శుచిస్మితహితానమ్రాస్సరోజాసనా।
వక్షోజద్వితయేపటీరఘుసృణాలేపశ్రియంబిభ్రతి॥

సీసపద్యము. ఏరాజశేఖరుండిలసర్వమంగళాశ్లేషభూషితమూర్తిఁజెలఁగుచుండు।
నేపురుషోత్తమునిందిరారమణిసల్లలితలీలలసదావలచుచుండు।
నేలోకబాంధవునాలోకములఁజేసివగదీఱిచక్రముల్సొగియుచుండు।
నేప్రసన్నునిఁజేరిమెలమిసద్వర్గంబుపాయకయుదయంబుఁబడయుచుండు।
నతఁడుదామర్లకులకలశాబ్ధివిధుఁడు । వెలయశ్రీకాళహస్తినివేంకటప్ప।
భూధురంధరుఁడారాజుభూరిసార । కార్యనిర్వాహధుర్యతాకలనఁబూని॥

ఉత్పలమాల. శ్రీమహిమంబులుల్లసిలఁజిత్తముధర్మమునందనిల్పుచున్।
సేమములంతటందనరఁజేయుచునిర్మలకీర్తిపర్వఁగా।
వేములవంశమౌక్తికమువేంకటరామఘనుండుదారతం।
దామరతంపరైకులముఁదానునుమేలువహించునిచ్చలున్॥

కందపద్యము. మానితసుగుణుండగునీ । మానవధుర్యుండులీలమదిఁజిగురొత్తం।
గానాంధ్రభారతంబును । జానుగముద్రింపనసదుసన్నలొసంగన్॥

సీసపద్యము. ఆయభిప్రాయంబుసేయంగసమకొనియానందభరితుఁడైయారుకాడు।
ముత్యాలునాయఁడుమొనసినన్నయభట్టరచితమౌనాంధ్రభారతమునుజన।
రంజనీముద్రాక్షరసభకధ్యక్షులైపరగినార్మలుస్కూలుపాఠశాల।
నాంధ్రపండితులలోనాద్యులౌవింజమూర్‌కృష్ణమాచార్యులుకృత్రిమంపు।
నెరసులనుమాన్పఁదనదువాణీనికేత । ముద్రికాక్షరశాలనచ్ఛిద్రవృత్తి।
జరుగుచుండెడిప్రభవాబ్దచైత్రమందు । నచ్చువేయించిపుడమియందలరఁజేసె॥



శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రభారతము.

కథానుక్రమసూచిక.

| పుటసంఖ్య. | విషయము. |
|---|---|
| ౩౬ | నలుఁడు నిజరూపంబుతో దమయంతిం గూడుట. |
| ౩౭ | ధర్మరాజునొద్దకు నారదమహాముని వచ్చుట. |
| ౪౨ | రోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట. |
| ౪౩ | రోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషంబులు చెప్పుట. |
| ౪౪ | అగస్త్యుఁడు లోపాముద్రను వివాహంబయ్యెడు కథ. |
| ౪౫ | —*తృతీయాశ్వాసము*— |
| ౪౬ | దేవతలు వైకుంఠమునకుఁబోయి విష్ణుని స్తుతియించుట. |
| ౪౭ | అగస్త్యుఁడు సముద్రోదకంబు పానంబు చేయుట. |
| ౪౮ | సగరసుతులు కపిలమహామునికోపాగ్నిచే భస్మమగుట |
| ౫౦ | రోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగుని చరిత్రము చెప్పుట. |
| ౫౦ | ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునిగా భావించుట. |
| ౫౧ | విభాండకుఁడు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చుట. |
| ౫౨ | కృతప్రవణుఁడు ధర్మరాజునకుఁ బరశురాముని మహిమ చెప్పుట. |
| ౫౩ | పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట. |
| ౫౪ | రోమశుఁడు ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు చెప్పుట. |
| ౫౫ | చ్యవనుఁడశ్వినుల సోమపీథులం జేయుట. |
| ౫౬ | మాంధాతృచరిత్రము. |
| ౫౬ | సోమకుండను రాజర్షి చరిత్రము. |
| ౫౭ | శిబియను రాజర్షి చరిత్రంబు రోమశుఁడు ధర్మజునకుఁ జెప్పుట. |
| ౫౮ | రోమశుఁడు ధర్మజునకు నష్టావక్రచరిత్రంబు చెప్పుట. |
| ౫౯ | రోమశుఁడు ధర్మజునకు యవక్రీతుచరిత్రంబు చెప్పుట. |
| ౬౦ | దేవతలర్థావసునకు మెచ్చి కోరినవరంబు లెల్లనిచ్చుట. |
| ౬౧ | పాండవులు గంధమాదనపర్వతంబునకుఁ బోవుట. |
| ౬౨ | భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట. |
| ౬౪ | భీమునకు హనుమంతుఁడు చతుర్యుగాచారవర్తంబులను దెలుపుట. |
| ౬౪ | హనుమంతుఁడు భీమునకుఁ దన పూర్వరూపంబు [చూపుట. |
| ౬౫ | భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు చేయుట. |
| ౬౬ | భీముఁడు జటాసురునితో యుద్ధంబు చేయుట. |
| ౬౭ | —*చతుర్థాశ్వాసము.*— |
| ౬౮ | భీముఁడు ద్రౌపది కోరిన పుష్పంబులం దేఁ బోవుట. |
| ౬౯ | కుబేరుఁడు ధర్మజుతో మణిమంతునకుఁ గలిగిన శాపంబు చెప్పుట. |
| ౬౯ | ఇంద్రుఁడు పాండవులయొద్దకు వచ్చుట. |
| ౭౦ | అర్జునుఁడు నివాతకవచులను రాక్షసుల జయించిన |
| ౭౨ | అజగరోపాఖ్యానము. |
| ౭౩ | ధర్మరాజు భీమసేనుని వెదకఁబోవుట. |
| ౭౩ | ధర్మరాజు నహుషు ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరలిచ్చుట. |
| ౭౪ | { ఆరణ్యపర్వశేషము. ఎఱ్ఱప్రగడకవిత్వము. } |
| ౭౫ | శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట. |
| ౭౬ | మార్కండేయుఁడను మహాముని పాండవులయొద్దకు వచ్చుట. |
| ౭౭ | మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబు చెప్పుట. |
| ౭౮ | అత్రిగౌతముల పరస్పరసంవాదము. |
| ౭౯ | మార్కండేయుఁడు ధర్మరాజునకు వైవస్వతవృత్తాంతంబుఁ దెల్పుట. |
| ౮౦ | మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ బ్రళయప్ర...మును జెప్పుట. |
| ౮౧ | నారాయణుఁడు మార్కండేయునకుఁ దన ప్రభావంబు చెప్పుట. |
| ౮౨ | మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గలియుగధర్మంబులు చెప్పుట. |
| ౮౩ | కలియుగంబున విష్ణుండు కల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట. |
| ౮౪ | మార్కండేయుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు చెప్పుట. |
| ౮౫ | శలుఁడను రాజు వామదేవమునినిఁ దిరస్కరించు... |
| ౮౬ | మార్కండేయుఁడు ధర్మజునకు నింద్రద్యుమ్నరాజుచరిత్రంబు చెప్పుట. |
| ౮౭ | మార్కండేయుఁడు ధర్మజునకుఁ గువలాశ్వచరిత్ర చెప్పుట. |
| ౮౮ | మార్కండేయుఁడు ధర్మజునకు మధుకైటభుల...త్రంబు చెప్పుట. |
| ౯౦ | —*పంచమాశ్వాసము.*— |
| ౯౧ | మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబుఁ జెప్పుట. |



(*)విరాటపర్వము.(*)



శ్రీమదాంధ్రభారతంబున, ఆదిపర్వ, సభాపర్వ, ఆరణ్యపర్వ, విరాటపర్వ, ఉద్యోగపర్వములయందలికథానుక్రమసూచిక

సమాప్తము.



# శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# శ్రీమదాంధ్రభారతము.

## ఆదిపర్వము - ప్రథమాశ్వాసము.



శ్లోకమ్॥ శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్య విహతాం స్త్రీపుంసయోగోద్భవామ్,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సమ్పూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే॥

వ॥ అనిసకలభువనరక్షణప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును - నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుండును - నఖిలజగజ్జేగీయమాన నానాగుణ రత్నరత్నాకరుండు నై పరగుచున్న రాజరాజ నరేంద్రుండు॥ ఉ॥ రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజతేజోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా। రాజితసర్వలోకుఁడపరాజితభూరిభుజాకృపాణధా। రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్॥ క॥ విమలాదిత్యతనూజుఁడు। విమలవిచారుఁడు కుమారవిద్యాధరుఁడు। త్తమచాళుక్యుఁడు వివిధా। గమవిహితశ్రముఁడు తుహినకరుఁడురుకాంతిన్॥ చ॥ ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిం। దనయుదయప్రభావమునఁ దవ్వుగఁ జోపిజగజ్జనానురం। జనముగ రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం। దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై॥ ఉ॥ ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషివి। ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ। ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో। కాశ్రయుఁడాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్॥ సీ॥ నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ బరమండలంబులధరణిపతుల। నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును బలిమి నియ్యని భూమివలయపతుల। నుక్కడఁగించుచు దిక్కులఁ దన యాజ్ఞ వెలిఁగించుచును విప్రకులము నెల్లఁ। బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల నగ్రజన్ములకు ననుగ్రహమున - ఆ॥ జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు। దేవభోగములమహావిభూతిఁ। దనరఁ జేయుచిట్టు మనుమార్గుఁడగు విష్ణు। వర్ధనుండు వంశవర్ధనుండు॥ వ॥ అఖిలజలధివేలావలయిత వసుమతీవనితావిభూషణంబైన వేఁగిదేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువన లక్ష్మీవిలాస నివాసంబైన రమ్యహర్మ్యతలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంతసామంతవిలాసినీ పరివృతుండై యపారశబ్దశాస్త్రపారగులైన వైయాకరణులును భారత రామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును మృదుమధుర రసభావభాసురనవార్థ వచనరచనావిశారదులైన మహాకవులును వివిధతర్క విగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయఃప్రతిభులైన తార్కికులును నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండై యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాఁడు॥ సీ॥ తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు విపులశబ్ద। శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞా

ననిరతుఁ। జాత్రునాపస్తంబసూత్రు ముద్గలగోత్రజాతు సద్వినుతావదాతచరితు। లోకజ్ఞునుభయభాషాకావ్యరచ
భిశోభితు సత్ప్రతిభాభియోగ్యు - ఆ॥ నిత్యసత్యవచనుమత్యమరాధిపా। చార్యుసుజనునన్నపార్యుఁ జూచి। పరమధర్మ
దుఁడువరచళుక్యాన్వయా। భరణుఁడిట్టులనియెఁగరుణతోడ * చ॥ విమలమతింబురాణములువింటిననేకములర్థధర్మశా
స్త్రములతెలుంగెటింగితినుదాత్తరసాన్వితకావ్యనాటక। క్రమములుపెక్కుచూచితిజగత్పరిపూజ్యములైనయీశ్వ
రాగమములయందునిల్పితిఁ బ్రకాశముగాహృదయంబుభక్తితోఁ * వ॥ అయినను నాకుననవరతంబును శ్రీమహాభా
తంబునందలియభిప్రాయంబువిననభిలాషపెద్దయైయుండు * మ॥ ఇవియేనుఁ సతతంబునాయెదఁ గరంబిష్టంబులైయు
డుఁ బ్రాయవుభూదేవకులాభితర్పణమహీయఃప్రీతియుఁ భారత। శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజా
హా। త్సవముఁ సంతతదానశీలతయుశశ్వత్సాధుసాంగత్యముఁ * వ॥ మఱియదియునుంగాక * మ॥ హిమకరుఁదొ
ట్టిపూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్। క్రమమునవంశకర్తలనఁ గామహినొప్పినయస్మదీయవం। శమునఁ బ్ర
ద్ధులైవిమలసద్గుణశోభితులైనపాండవో। త్తములచరిత్రనాకుసతతంబువినంగనభీష్టమెంతయుఁ * చ॥ అమలసువర్ణ
శృంగఖురమైకపిలంబగుగోశతంబును। త్తములగువేదవిప్రులకుదానముచేసినతత్ఫలంబుత। థ్యముసమహాఋభా
తకథాశ్రవణాభిరతిఁ బుదీయచి। త్తముననిశంబుభారతకథాశ్రవణప్రవణంబుగావునఁ * క॥ బహుభాషలబహు
విధముల। బహుజనములవలనవినుచుభారతబద్ధ। స్పృహులగువారికినెప్పుడు। బహుయాగంబులఫలంబుపరమార్థ
మిలఁ * వ॥ అనియానతిచ్చినవినియక్కవివరుండిట్లనియె * చ॥ అమలినతారకాసముదయంబులనెన్నను సర్వవేదశా
స్త్రములయశేషపారముముదంబునఁ బొందనుబుద్ధిబాహుఁబ। క్రమమునదుర్గమార్గజలగౌరవభారతవాహినీసము। ద్రప
ఋుఁదఱియంగనీఁదనువిధాతృనకైననువేరఁబోలునే * వ॥ అయిననుదేవా నీయనుమతంబున విద్వజ్జనంబులయను గ్ర
హంబునంజేసినానేర్చువిధంబున నిక్కావ్యంబురచియించెదనని * తరల॥ హరిహరాజగజాననార్కషడాస్యమాతృస
రస్వతీ। గిరిసుతాదికదేవతాతతికిన్నమస్కృతిచేసిదు। ర్ధరతపోవిభవాధికుఁ గురుపద్యవిద్యకునాద్యనం। బురుహ
ఖ్యనిభుంబ్రచేతసుపుత్రుభక్తిఁదలంచుచుఁ * ఉ॥ భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసిఘోరసం। సారవికా
సంతమసజాలవిజృంభమువాపిసూరిచే। తోరుచిరాబ్జబోధనరతుండగుదివ్యపరాశరాత్మజాం। భోరుహమిత్రుఁ గొల్చి
మునిపూజితుభూరియశోవిరాజితుఁ * చ॥ పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో। త్కరరుచిరంబులైసకల
గమ్యసుతీర్థములైమహామనో। హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైనసత్సభాం। తరసరసీవసంబులముదంబో
సరంగొనియాడివేడుకఁ * ఉ॥ సారమతింగవీంద్రులుప్రసన్నకథాకవితార్థయుక్తితో। నారసిమేలునానితరులక్షర
వ్యతనాదరింపనా। నారుచిరార్థసూక్తినిధినన్నయభట్టుతెనుంగునన్మహా। భారతసంహితారచనబంధురుఁడయ్యె జగ
ద్ధితంబుగఁ * ఉ॥ పాయకపాకశాసనికిభారతఘోరరణంబునందునా। రాయణునట్లు దానుసుధరామరవంశవిభూష
ణుండునా। రాయణభట్టువాఙ్మయధురంధరుఁడుండనకిష్టుఁడున్సహా। ధ్యాయుఁడునైనవాఁడభిమతంబుగఁదోడయి

—(*) ఉపోద్ఘాతము. (*)—

నిర్వహింపఁగఁ * వ॥ తత్కథాప్రారంభంబెట్టిదనిన * సీ॥ నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ గులపతిశౌనకుండనుపరమ
మౌని। బ్రహ్మర్షిగణసముపాసితుండై సర్వలోకహితార్థంబులోకనుతుఁడు। ద్వాదశవార్షికోత్తమసత్త్రయాగంబు
మొగిఁ జేయుచున్నయమ్మునులకడకు। వచ్చితానుగ్రశ్రవసుఁడనుసూతుఁడురౌమహర్షణిసుపౌరాణికుండు - ఆ॥ పరమ
భక్తితోడఁ బ్రణమిల్లియున్నయ। కథకువలనమునినికాయమెల్ల। వివిధపుణ్యకథలువినువేడ్కనతనిఁ బూజించిరపరి
మితవిశేషవిధుల * వ॥ అక్కథకుండువెండియునమ్మునిసంఘంబునకునమస్కారంబుచేసియనేకపురాణపుణ్యకథాక
నడతుండవ్యాసశిష్యుండైనరోమహర్షణునకుఁ బుత్రుండనావలననెక్కథవినవలతురనిననమ్మునులతనికిట్లనిరి * క॥
యదిహృద్యమపూర్వం। బేయదివెద్దానివినిననెలుకసమగ్రం। బైయుండునఘునిబర్హణ। మేయదియక్కథయెవినఁగ
ష్టముమాకర్ణ * వ॥ అనినను గ్రశ్రవసుం ... పుణ్యకథఁ జెప్పెదదత్తావధానులరై వినుండని శౌనకా

మహామునులకుం జెప్పందొడంగె నాదియుగంబునందుఁ గృష్ణద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వణంబులుగా విభాగించి తన శిష్యులైన పైల వైశంపాయన సుమంత జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుం డయి నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై యష్టాదశపురాణంబులును ధర్మశాస్త్రార్థతత్త్వంబులును, జతుర్వేదవేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గవర్గానుబంధబంధురకథేతిహాసంబులును, జతుర్యుగమహర్షి రాజవంశచరితంబులును జతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులును జతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుమాహాత్మ్యంబును - బాండవాదిభారతవీరులమహాగుణంబులును - దనవిమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగుచుండ * సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బనియ ధ్యాత్మవిదులు వేదాంత మనియు। నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బనికవివృషభులు మహాకావ్య మనియు। లాక్షణికులు సర్వలక్షణం బనియును నైతిహాసికు లితిహాస మనియుఁ। బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బనిమహిఁ గొనియాడుచుండ - ఆ॥ వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ। డాదిముని పరాశరాత్మజుండు। విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై। పరఁగుచుం

—(*) పర్వానుక్రమణిక. (*)—

డఁజేసె భారతంబు * వ॥ అదియునుఁ బౌష్యంబు పౌలోమం బాస్తీకం బాదివంశావతారంబు సంభవపర్వంబు జతుగృహదాహంబు హైడింబంబు బకవధ చైత్రరథంబు ద్రౌపదీస్వయంవరంబు వైవాహికంబు విదురాగమనంబు రాజ్యార్ధలాభంబ ర్జునతీర్థయాత్ర సుభద్రాకల్యాణంబు హరణహారిక ఖాండవదహనంబు మయదర్శనంబు సభాపర్వంబు మంత్రపర్వంబు జరాసంధవధ దిగ్విజయంబు రాజసూయం బర్ఘ్యాభిహరణంబు శిశుపాలవధ ద్యూతంబ నుద్యూతం బారణ్యకంబు కిమ్మీరవధ యింద్రకీలాభిగమనంబు కైరాతంబు ధర్మజతీర్థయాత్ర జటాసురవధ యక్షయుద్ధం బాజగరంబు మార్కండేయోపాఖ్యానంబు సత్యాద్రౌపదీసంవాదంబు ఘోషయాత్ర ప్రాయోపవేశంబు వ్రీహిద్రోణకాఖ్యానంబు ద్రౌపదీహరణంబు కుండలాహరణం బారణేయంబు వైరాటంబు కీచకవధ గోగ్రహణం బభిమన్యువివాహంబు ద్యోగంబు సంజయయానంబు ధృతరాష్ట్రప్రజాగరంబు సానత్సుజాతంబు యానసంధి భగవద్యానంబు సేనానిర్యాణ యులూకదూతాభిగమనంబు సమరథాతిరథసంఖ్యానంబు కర్ణభీష్మవివాదంబు నంబోపాఖ్యానంబు జంబూషండవినిర్మాణంబు భూమిపర్వంబు భీష్మాభిషేకంబు భగవద్గీత భీష్మవధ ద్రోణాభిషేకంబు సంశప్తకవధ యభిమన్యువధ ప్రతిజ్ఞాపర్వంబు జయద్రథవధ ఘటోత్కచవధ ద్రోణవధ నారాయణాస్త్రప్రయోగంబు కర్ణపర్వంబు శల్యపర్వంబు హ్రదప్రవేశంబు గదాయుద్ధంబు సారస్వతంబు సౌప్తికపర్వం బైషీకంబు జలప్రదానంబు స్త్రీపర్వంబు శ్రాద్ధపర్వంబు రాజ్యాభిషేకంబు చార్వాకనిగ్రహంబు గృహప్రవిభాగంబు శాంతిపర్వంబు రాజధర్మానుకీర్తనం బాపద్ధర్మంబు మోక్షధర్మంబు నానుశాసనికంబు భీష్మస్వర్గారోహణం బాశ్వమేధికం బనుగీత యాశ్రమవాసంబు పుత్రసందర్శనంబు నారదాగమనంబు మౌసలంబు మహాప్రస్థానికంబు స్వర్గారోహణంబు హరివంశంబు భవిష్యత్పర్వంబు ననుశతపర్వంబులు గలిగి * సీ॥ ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు నర్థార్థులకు విపులార్థములును। ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు వినయార్థులకు మహావినయమతియుఁ। బుత్రార్థులకు బహుపుత్రసమృద్ధియు సంపదర్థులకిష్టసంపదలును। గావించు నెప్పుడు భావించి వినుచున్నవారలకిమ్మహాభారతంబు - ఆ॥ భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ।వల్లభుండు భక్తవత్సలుండు। భవభయంబు లెల్లఁ బాపి యిష్టార్థసం।సిద్ధిఁ గరుణతోడఁ జేయుచుండు * వ॥ మఱియుఁ బౌష్యోదంక మాహాత్మ్యంబును, భృగువంశకీర్తనంబును, నాగగరుడసంభవంబును, సముద్రమథనంబు, నుచ్చైశ్శ్రవోజన్మంబును, సౌపర్ణోపాఖ్యానంబును, నాస్తికచరితంబును, జనమేజయసర్పయాగంబును, శ్రీమహాభారతకథాశ్రవణప్రవృత్తియు, వ్యాసజన్మంబును, దేవదైత్యదానవమునియక్షపక్షిగంధర్వాది నానావిధభూతసంభవంబును, దదంశావతారంబును, రాజవంశానుకీర్తనంబును, యయాతిచరితంబును, భారతవంశానుకీర్తనంబును, గంగాశంతనుసమాగమంబును, వసూత్పత్తియు, స్వర్గగమనంబును, దదంశసంభూతంబున గాంగేయజన్మంబును, దద్రాజ్యనివర్తనంబును, బ్రహ్మచర్యవ్రతప్రతిజ్ఞాపరిపా

లనంబును, సత్యవతీవివాహంబును, చిత్రాంగదవిచిత్రవీర్యజన్మంబును, చిత్రాంగదరాజ్యాభిషేకంబును, చిత్రాంగద మరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యుఁ గౌరవరాజ్యంబున నభిషిక్తుం జేయుటయు, వానిపరోక్షంబునఁ గృష్ణద్వైపాయనమునివలన ధృతరాష్ట్ర పాండురాజుల జన్మంబు, నాణిమాండవ్యోపాఖ్యానంబును, ధర్ముండు మాండవ్యశాపంబున శూద్రయోనియందు విదురుండై పుట్టుటయును, ధృతరాష్ట్ర పాండురాజుల వివాహంబును, గాంధవధార్తరాష్ట్రసంభవంబును, పాండునిర్యాణంబును, కృపద్రోణ జన్మకథనంబును, కుమారాస్త్రవిద్యాగ్రహణంబు, నస్త్రసందర్శనంబును, కర్ణార్జునుల పరస్పరక్రోధంబును, ద్రుపదగ్రహణమోక్షణంబును, యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషిక్తుం జేయుటయు, దుర్యోధనుదుర్మంత్రంబును, వారణావతయాత్రయు, జతుగృహదాహంబును, సురోపదిష్టద్వారంబునఁ బాండవాపక్రమణంబును, హిడింబాదర్శనంబును, హిడింబ వధయును, ఘటోత్కచ సంభవంబును, పాండవుల యేకచక్రపురంబున విప్రగృహంబున నజ్ఞాతచర్యయు, బక వధయును, ధృష్టద్యుమ్న ద్రౌపదీ జన్మకథనంబును, కృష్ణద్వైపాయన సందర్శనంబును, గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు జయించుటయుఁ, దాపత్య వసిష్ఠౌర్వోపాఖ్యానంబులును, పాండవులు పాంచాలదేశంబునకుం జనుటయు, ద్రౌపదీ స్వయంవరంబును, పంచేంద్రోపాఖ్యానంబును, ద్రౌపదీ వివాహంబును, విదురాగమనంబును, కృష్ణ సందర్శనంబును, రాజ్యార్ధలాభంబును, ఖాండవప్రస్థనివాసంబును, సుందోపసుందోపాఖ్యానంబును, నారదువచనంబున ద్రౌపదియందు సమయక్రియయును, నర్జునుతీర్థాభిగమనంబు, నులూపీసమాగమంబును, చిత్రాంగదయందు బభ్రువాహను జన్మంబును, ద్వారకాగమనంబును, వాసుదేవానుమతంబున నర్జునుండు సుభద్ర వివాహంబగుటయు, సుభద్రాహరణంబును, హరణహారికయు, నభిమన్యు సంభవంబును, గాండీవ దేవదత్త దివ్యరథాశ్వ లాభంబును, ఖాండవదహనంబు, నగ్నిభయంబువలన మయభుజంగ మోక్షంబును, మందపాలోపాఖ్యానంబు, నను వృత్తాంతంబులనొప్పి తొమ్మిదివేలుం దొమ్మన్నూట యెనుబదినాలుగు శ్లోకంబులుగలిగి * క॥ మహితపౌష్యపర్వమాదిగఁ। బహునెనిమిదిపర్వములనుబర్వమునఁ గ్రీ।తిదమగుచు నాదిపర్వం। బదివినఁగా నొప్పు భారతాద్యంబగుచున్ * వ॥ మఱియు ధర్మరాజు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదువలన లోకపాలసభాశ్రవణంబును, రాజసూయమహాధ్వరారంభంబును, జరాసంధవధయును, గిరివ్రజనిరుద్ధులైన రాజులఁ గృష్ణుండు విడిపించుటయును, దిగ్విజయంబును, రాజసూయంబు, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాలవధయును, రాజసూయవిభూతికి మనఃఖితుండై సభాస్థలితుండైయు దుర్యోధనుం జూచి ద్రౌపదీభీమసేనులు నగుటయును, దత్కారణంబున జూదంబాడుటయు, నందు శకుని కైతవంబున ధర్మజపరాజయంబును, ద్యూతదుఃఖార్ణవమగ్నులైన పాండవులం బాంచాలి యుద్ధరించుటయును, బునర్ద్యూతపరాజితులై పాండవులు వనవాసగతులగుటయు, నను వృత్తాంతంబులనొప్పి నాలుగు వేలు మున్నూట పదునొకొండుశ్లోకంబులు గలిగి * క॥ పర్వసభాప్రభృతిగనవ।పర్వములను విస్తరిల్లి పండితచేతో।నిర్వృతిఁ జేయుచు రెండవ।పర్వము నారమ్యసభాపర్వమిలన్ * వ॥ మఱియు మహారణ్యంబునందుఁ గిమ్మీరవధయును, కృష్ణపాంచాలాగమనంబును, సౌభోపాఖ్యానంబును, యుధిష్ఠిరభీమసేనసంవాదంబును, గురూపదేశంబున నర్జునుండు దివ్యాస్త్రంబులువడయఁ దపశ్చరణంబు చేయుటయు, నీశ్వరునితోడి యుద్ధంబును, లోకపాలసందర్శనంబును, దివ్యాస్త్రలాభంబును, స్వర్గగమనంబును, బృహదశ్వుండను మహామునిం గాంచుటయు, యుధిష్ఠిరాదులపరిదేవనంబును, నలోపాఖ్యానంబును, దమయంతీపతివ్రతాస్తుతియు, యుధిష్ఠిరాదులకు నర్జునకుశలవార్త రోమశుండు సెప్పుటయును, ధర్మజు తీర్థాభిగమనంబును, జటాసురవధయును, పాంచాలీనియుక్తుండై భీముండు సౌగంధికపుష్పహరణార్థంబు గంధమాదనంబునందలి కొలనికిఁ జనియందు మణిమంతుండు మొదలుగాఁగల యక్షరాక్షసులం జంపుటయు, నాజగరంబు, నగస్త్యోపాఖ్యానంబును, వాతాపిభక్షణంబు నపత్యార్థంబగస్త్యమహాముని లోపాముద్ర నభిగమించుటయు, శ్యేనకపోతంబులైన యింద్రాగ్నులు శిబిమానంబు గొనుటయు, ఋశ్యశృంగు చరితంబును, పరశురామ చరితంబును, కార్తవీర్యవధయును, మాంధాతృజన్మంబును,

కన్యాఖ్యానంబును భార్గవుండైనచ్యవనుండు సంయాతియజ్ఞంబున నశ్వినులసోమపీథులంజేసి వారిచేతజవ్వనంబు వడయుటయు జంతూపాఖ్యానంబును యజ్ఞపుత్రుండైన సోమకుండు బహుపుత్రార్థంబు యజ్ఞంబు సేసి పుత్రశతంబును బడయుటయు వంద్యష్టావక్రుల వివాదంబును సముద్రంబునుజయించి తిత్తిరియనుమహర్షి తనతండ్రిం బడయుటయు దివ్యాస్త్రంబులువడసియర్జునుండు హిరణ్యపురనివాసులయినపౌలోమకాలకేయనివాతకవచాదులంజంపుటయు గంధమాదనంబునకందఱుంగూడవచ్చుటయు మార్కండేయునివలనబహువిధోపాఖ్యానంబును కృష్ణసందర్శనంబును సత్యాద్రౌపదీసంవాదంబును ఘోషయాత్ర చిత్రసేనాదిగంధర్వులఁబెక్కండ్రజయించి దుర్యోధనునివిడిపించుటయుదుర్యోధనుప్రాయోపవేశంబును వ్రీహిద్రోణికాఖ్యానంబును సరస్వతీగీతయుగలియుగధర్మంబును వామ్యాశ్వహరణంబును నింద్రద్యుమ్నోపాఖ్యానంబును దుంధుమార చరితంబును జయద్రథుండాశ్రమాంతరంబున ద్రౌపదినపహరించుటయుభీముండువానింబరిభవించుటయు నుద్దాలకోపాఖ్యానంబును వైన్యోపాఖ్యానంబును శ్రీరామాయణకథయును సావిత్ర్యుపాఖ్యానంబును బాండవులుక్రమ్మఱిద్వైతవనంబునకు వచ్చుటయుఁగర్ణుకవచకుండలంబులింద్రుండుగొనుటయు నారణేయోపాఖ్యానంబును యముండుధర్మజునను శాసించుటయుయమువలనవరంబులువడసిపాండవులుపశ్చిమదిక్కునకుంజనుటయునను వృత్తాంతంబులనొప్పిపమూఁడువేలు నాలునూటయఱువదినాలుగు శ్లోకంబులంగలిగి * క॥ ఆరణ్యపర్వమనఁగా। నారణ్యప్రముఖషోడశాంతర్గపర్వా। ధారమయిసకలసూరిస। భారమ్యంబగుతృతీయపర్వము వెలయుఁ * వ॥ మఱియువిరాటనగరంబునకుం జనుచుండి తత్సమీపశమీవృక్షంబునఁ బాండవులుతమయాయుధంబులు నిక్షేపించితమ్మెవ్వరు నెఱుంగకుండ విరాటుంగొలిచి యునికియునందుభీముండుసింహబలుందొట్టిసకలకీచకుల వధించుటయుగోగ్రహణంబునఁగురుబలంబుల నెల్లనొక్కరుండజయించిధనంజయుండుగోగణంబులంగ్రమ్మఱించుటయువిరాట రాజపుత్త్రియైనయుత్తరనభిమన్యుండు వివాహంబగుటయు ననువృత్తాంతంబుల నొప్పి మూఁడువేలు నేనూఱుశ్లోకంబులుగలిగి * క॥ పర్వుచువైరాటాదిక। పర్వచతుష్టయమునను సభారంజనమై। సర్వమనోజ్ఞమునాలవ। పర్వమునాఁదగివిరాటపర్వము వెలయుఁ * వ॥ మఱియుభారతరణోద్యోగులైనపాండవులుపప్లావ్యంబునవిడియుటయు నర్జునదుర్యోధనులు ద్వారకానగరంబునకుంజని శ్రీకృష్ణునింగని సహాయత్వంబునకుం బ్రార్థించుటయు నారాయణుండు వారినాశ్వాసించి తన్ను నారాయణగోపాలబలంబుల నిరూపించి వారలంగోరికొండనుటయు నారాయణగోపాలబలంబుల దుర్యోధనుండుగోరికొనుటయు నారాయణునినొక్కరుని నర్జునుండుగోరికొనుటయు ధృతరాష్ట్రుండువనుప శమనార్థంబు పప్లావ్యంబున సంజయుండు పాండవులకడకుంబోవుటయు వాసుదేవసహితులయినపాండవులరణప్రారంభంబువిని ధృతరాష్ట్రుండునిద్రాహారంబులువిడిచి చింతాక్రాంతుండగుటయు హితవచనుండైన విదురుపలుకులువినమియు ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగా సనత్సుజాతుం డధ్యాత్మకథలుచెప్పుటయు వాసుదేవార్జునులయత్యంతసాంగత్యంబెఱింగివచ్చి సంజయుండు సకలరాజసమక్షంబునవిస్తరించుటయు సర్వభూతహితుండైన శ్రీకృష్ణుండు పాండవధార్తరాష్ట్రులకు సంధిగావింపందలంచి హస్తిపురంబునకుంజని యందుఁ గర్ణాదిదుష్టశిక్షితుండైన దుర్యోధనుదుర్మంత్రంబెఱింగి విశ్వరూపంబుఁజూపుటయుఁ గృష్ణుండు కర్ణునిం దనరథంబెక్కించుకొనియుపాయంబుననునయించి యొడంబఱుపనేరక కర్ణుచేతంబ్రత్యాఖ్యాతుండయి క్రమ్మఱివచ్చుటయు బలాతిబలసంఖ్యానంబు నెల్లియుద్ధంబు సేయవలయునని కురుపతివనుప నులూకుండనునూత పాండవులసాలికినచ్చిపరుసంబులువలుకుటయు సమరథాతిరథసంఖ్యానంబు నర్ధరథులలోనంగలయందన్నెన్నిననలిగి కర్ణుండుభీష్ముపదిదినంబులుసమరపరాఙ్ముఖుండగుటయు రామభీష్ములయుద్ధకీర్తనంబు నంబోపాఖ్యానంబును సంక్రందనోపాఖ్యానంబును శ్వేతాభిషేకంబుననువృత్తాంతంబులనొప్పి యాఱువేలందొమ్మన్నూటతొంబదునెనిమిదిశ్లోకంబులుగలిగి * క॥ విదితంబైయుద్యోగము। మొదలుగఁబదునొక్కపర్వముల నెంతయునొ। ప్పిదమైయేనవపర్వం। బిదినానుద్యోగపర్వమిమ్మగుసభలకు * వ॥ మఱియు జంబూషండవినిర్మాణంబు సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పుటయు భూవిస్తా

రంబును భీష్మాభిషేకంబును బాండవసుధ్యమవిషాదంబును వాసుదేవుండు మోక్షదర్శన హేతువులం జెప్పియ
ను మోహభ్రాంతిం జెఱుచుటయు శిఖండిం బురస్కరించుకొని యర్జునుండు భీష్ము నివధియించుటయు ననువృత్తాం
బులనొప్పినయైదు వేలు నెనమన్నూటయెనుబది నాలుగుశ్లోకంబులం గలిగి ✻ క॥ జంబూషండవినిర్మాణం బాదిగహృద
రంజనములగు నేన్పర్వంబులను భీష్మపర్వము। పంబివినంబొలుచుషష్ఠపర్వంబగుచుఁ ✻ వ ॥ మఱియు ద్రోణాభిషే
బును సంశప్తకులర్జును౦బాపికొనిపోయి యేకతంబు యుద్ధంబు సేయుటయు నర్జును చేతసుప్రతీకగజంబుతోడ
భగదత్తుచావును ద్రోణకర్ణాదులు పెక్కం డ్రుగూడుకొని యధర్మయుద్ధంబున నభిమన్యుం జంపుటయు నర్జును ప్ర
యు నభిమన్యువధకుం గ్రుద్ధుండై యర్జునుం డేడక్షౌహిణీబలంబుల నొక్కరుండ చంపి సైంధవుం జంపుటయును ద్రో
దికొల్లుసంశప్తకుల నర్జునుండు నిశ్శేషంబు సేయుటయు నలంబుస శ్రుతాయుజలసంధభూరిశ్రవో బాహ్లీకవిరాట
పదఘటోత్కచధార్తరాష్ట్రినారాయణీయగోపాలాదివధయును ద్రోణవధయు నశ్వత్థామ నారాయణాగ్నేయ
ప్రకీర్తనంబును కృష్ణార్జునులమాహాత్మ్యంబును ననువృత్తాంతంబుల నొప్పి పదివేలుం దొమ్మన్నూటపందొమ్మిదిశ్లో
కంబులం గలిగి ✻ క॥ విన నేడవపర్వము మేలనఁగా ద్రోణాభిషేకమాదిగఁ గలయ। య్యెనిమిదిపర్వములను న। త్యనస
మమై ద్రోణపర్వ మమరుఁ సభలఁ ✻ వ॥ మఱియుఁ గర్ణాభిషేకంబును గర్ణునకు రథంబు గడప శల్యుం బూన్చుటయు
త్రిపురదహనోపాఖ్యానంబును గర్ణశల్యులపరస్పరవివాదంబును హంసకాకీయోపాఖ్యానంబును యుధిష్ఠిరార్జును
పరస్పరక్రోధంబు నర్జునానునయంబును వృషసేనువధయును భీముండు దుశ్శాసనుం జంపి తద్వక్షోరక్తంబు ఆస్వా
దించుటయు విప్రశాపనిమిత్తంబునఁ గర్ణురథచక్రంబు భూమియందుఁ గ్రుంకుటయు నాగాస్త్రభయంబున నర్జు
రథంబు శ్రీకృష్ణుండు భూమియందుఁ జొనుపుటయు నింద్రాదిత్యులపరస్పరసంవాదంబును గర్ణువధయును ననువృ
త్తాంతంబుల నొప్పి నాలుగువేలుం దొమ్మన్నూటముప్పదిశ్లోకంబులం గలిగి ✻ క॥ అనుపమబలులగు కర్ణా। ర్జునవీరుల శౌర్యమహిత
మశోభిల్లంగా। నెనిమిదియగు పర్వం బిది। యనఁ బరఁగుం గర్ణపర్వ మతిహృద్యంబై ✻ వ॥ మఱియు భారతవీరులెల్లఁ
లోకగతులయిన శల్యుండు రణభారంబు పూనుటయుఁ గురుకుమారవధయును ధర్మజురోషంబున శల్యుమరణం
ను గురుముఖ్యులవధయును సహదేవునిచేత సపుత్రకుండైన శకునిచావును సంజయుగ్రహణమోక్షంబును ప్రా
వేశంబును భీమదుర్యోధనుల గదాయుద్ధంబును సరస్వత్యాదిపుణ్యతీర్థకీర్తనంబును ననువృత్తాంతంబుల నొప్పి మూ
డు వేలు నిన్నూట యిరువది శ్లోకంబులం గలిగి ✻ తే॥ సభల విస్తరిల్లి శల్యాదికము లైన। నాల్గుపర్వములవినంగ జాలి। నవమ
పర్వమయ్యె నవ్యార్థరమణీయ। మగుచు శల్యపర్వ మతిశయిల్లి ✻ వ॥ మఱియు భీముగదాభిఘాతంబున దుర్యోధనుం
తొడలు విఱిగిపడినఁ బాండవులు రణంబుపసంహరించి చనిననాఁటిరాత్రి కృపకృతవర్మాశ్వత్థామలు పాండవశిబిరంబు
పయిం జనుటయు నందశ్వత్థామ కోపోద్దీపితుండై తనప్రతిజ్ఞ దీర ధృష్టద్యుమ్నపురోగములయిన సర్వపాంచాలురను
ప్రతివింధ్యాదిద్రౌపదేయులను బాండవామాత్యులను సుఖసుప్తులయినవారి వధియించుటయు నందు శ్రీకృష్ణప్రసా
దంబునఁ బాండవులేవురు సాత్యకియుం దప్పుటయుఁ బుత్రభ్రాతృవధదుఃఖితయైన పాంచాలి యనశనంబు సంకల్పిం
చుటయుఁ దద్వచనంబున భీముం డశ్వత్థామ పిలుందం జనుటయు భీమసేనభయార్తుండయి యశ్వత్థామ యపాండవ
మయ్యెడు మని శిరమోక్షణంబు సేయుటయు నట్లుగాకుండెడు మని శ్రీకృష్ణుండు దానిం బరిహరించుటయు దానిం
యనర్జునుండు తనదివ్యబాణంబున నేయుటయు వ్యాసాశ్వత్థామలయన్యోన్యశాపంబులు నశ్వత్థామశిరోరత్నంబుఁ బాం
డవులు గొనుటయు ననువృత్తాంతంబుల నొప్పి రెండువేలు నెనమన్నూట డెబ్బదినాలుగు శ్లోకంబులం గలిగి ✻ క॥ నా
సౌప్తికాదిపర్వ। త్రితయము నందనరి వసుమతీసురవరస। మ్మతమైన సౌప్తికపర్వము। ప్రతిభవినం బొలుచు దశమపర్వ
మగుచుఁ ✻ వ॥ మఱియు వీరపత్నీవిలాపంబును ధృతరాష్ట్రగాంధారుల కోపప్రసాదంబులును ధర్మజుం డురణనిహతు
లయిన పితృపితామహభ్రాతృపుత్రభృత్యామాత్య మాతులాచార్యమిత్రాదులం బరీక్షించి యథావిధి సత్కరిం
పఁదగువారలం బంచుటయు భారతవీరులకు నుదకదానంబు సేయుటయుఁ దత్సమయంబునఁ గుంతీదేవి పాండవులకుఁ గర్ణు

గూఢోత్పన్నుండని యెఱింగించుటయు ధర్మజువిలాపంబును ననువృత్తాంతంబులనొప్పి వేయునేడునూట డెబ్బదియు నైదుశ్లోకంబులంగలిగి ✱ క॥ పర్వుచుస్త్రీపర్వాదిక। పర్వంబులనెనిమిదిటఁగృపాయితమై స్త్రీ। పర్వంబుపదునొకండగు। పర్వమునా వెలయుసుకవిపండితసభలన్ ✱ వ॥ మఱియుధర్మజురాజ్యాభిషేకంబును జార్వాకనిగ్రహంబును గృహప్రవిభాగంబును బంధువర్గంబునెల్లవధియించి పరమనిర్వేదనపరుండైయున్న ధర్మజునకు భీష్ముండు ధర్మవిదులయిన రాజులకెల్లహితంబుగా రాజధర్మంబులు నాపద్ధర్మంబులే వానినెఱింగిన సర్వజ్ఞానసంపన్నులగుదురట్టి మోక్షధర్మంబులు సెప్పుటయు ననువృత్తాంతంబులనొప్పి పదునాలుగు వేలు నేనూటయిరువదియైదుశ్లోకంబులంగలిగి ✱ క॥ సకలహితంబై శాంత్యా। దికపర్వచతుష్టయమువిదితమై సముబు। ద్ధికిఁబండ్రెండవపర్వం। బకడుగ మేలనఁగ శాంతిపర్వము వెలయున్ ✱ వ॥ మఱియుఁబితామహుండగు గాంగేయువలన సర్వధర్మనిశ్చయంబును దానవిధులను ధర్మరాజెఱుంగుటయుఁ బుత్త్రానుశాసనంబును భీష్మస్వర్గారోహణంబు ననువృత్తాంతంబులనొప్పి పండ్రెండు వేలశ్లోకంబులంగలిగి ✱ క॥ ఒనరుఁద్రయోదశపర్వం। బనఁగానను శాసనాద్యమగుపర్వయుగం। బున మేలై విబుధశ్రే। ణినుతంబై యానుశాసనికపర్వమిలన్ ✱ వ॥ మఱియునశ్వమేధారంభంబును సంవర్తమరుత్తీయోపాఖ్యానంబును స్వర్ణకోశసంప్రాప్తియు నుత్తరగర్భంబున నశ్వత్థామాస్త్రదగ్ధుండై శ్రీకృష్ణుచేత సంజీవితుండైన పరీక్షితుని జన్మంబు నర్జునునశ్వానుసరణంబు నెడనెడ రాజులతోడియుద్ధంబును జిత్రాంగదపుత్త్రుండైన బభ్రువాహనుండాహవంబున నర్జునుం బరిభవించుటయు నశ్వమేధమహాయజ్ఞంబునందు నకులోపాఖ్యానంబును ననుగీతయు బ్రాహ్మణగీతయు గురుశిష్యసంవాదంబును ననువృత్తాంతంబులనొప్పి నాల్గువేలునన్నూటయిరువది శ్లోకంబులంగలిగి ✱ తే॥ అభిమతంబగు నశ్వమేధాదికద్వి। పర్వయుతమై చతుర్దశపర్వమనఁగ। నాశ్వమేధికపర్వమత్యంతవివిధ। వస్తువిస్తరమగు బుధవరులసభల ✱ వ॥ మఱియుధృతరాష్ట్రుండును గాంధారియు రాజ్యంబువిడిచి విదురసంజయసహితంబుగా నాశ్రమవాసంబునకుఁ జనుటయు సకలరాజ్యభారధౌరేయులయిన కొడుకులవిడిచి కుంతీదేవి గురుశుశ్రూషాపరయై వారిపిఱుందనపోవుటయు సమరనిహతులయిన పుత్త్రపౌత్త్రులనెల్ల ధృతరాష్ట్రుండు వ్యాసవరప్రసాదంబునం గాంచి విగతశోకుండయి గాంధారీకుంతీవిదురసంజయులతోఁ బరమసిద్ధికింజనుటయును బాండవులు నారదువలన నిఖిలయాదవవ్యసనం బెఱుంగుటయు ననువృత్తాంతంబులనొప్పి వేయునునూటయాఱుశ్లోకంబులుగలిగి ✱ క॥ అమితార్థయుక్తితో నా। శ్రమవాసాదిత్రిపర్వసహితంబయియా। శ్రమవాసపర్వనుత్యు। త్తమకథలను వెలయుఁబంచదశపర్వంబై ✱ వ॥ మఱియాదవులెల్లమదిరాపానపరవశులై శాపనిమిత్తంబు సముద్రతీరంబునఁ దమలోఁబోరిపొడిచికొని పరలోకగతులగుటయు దాని నెఱింగి రామకృష్ణాదియాదవవిరహితంబైన ద్వారవతికర్జునుండరిగి విషణ్ణచిత్తుండై వసుదేవాదియాదవులనెల్ల సంస్కరించియాదవకళత్త్రంబులనెల్లఁ దోడ్కొనివచ్చుచో గాండీవదివ్యబాణంబుల శక్తిదఱిగిన వనచరభయంబువలనఁ దత్కళత్త్రంబులరక్షింపనోపమియు నర్జునుండు ధర్మరాజుకడకువచ్చి వ్యాసవాక్యప్రబోధితుండై సన్న్యసించుటయు ననువృత్తాంతంబులనొప్పి మున్నూఱుశ్లోకంబులుగలిగి పదునాఱవపర్వంబై మౌసలపర్వంబు నాఁబరఁగె ✱ వ॥ మఱియుఁబరీక్షిద్రాజ్యాభిషేకంబును రాజ్యపరిత్యాగముచేసి పాండవులేవురుద్రౌపదీసహితులై పరమసిద్ధికింజనుటయు ననువృత్తాంతంబులనొప్పినూటయిరువదిశ్లోకంబులుగలిగి పదునేడవపర్వంబై మహాప్రస్థానికంబు నాఁబరఁగె ✱ వ॥ మఱియుఁగర్జునరకప్రాప్తియుఁదన్మోక్షణంబును స్వర్గంబున భారతవీరులసంగమంబును గర్మపరిపాకోపభోగంబు ననువృత్తాంతంబుల నెప్పి యిన్నూఱుశ్లోకంబులుగలిగి పదునెనిమిదవపర్వంబై స్వర్గారోహణంబు నాఁబరఁగెనిట్లష్టాదశపర్వంబులుగలిగి ✱ మ॥ అమితాఖ్యానకశాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై। సుమహావర్గచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో। త్తమనానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా। తమహాభారతపారిజాతమమరున్ ధాత్రీసురప్రార్థ్యమై ✱ వ॥ ఇట్టిమహాభారతంబు ననేకవిధపదార్థప్రపంచసంచితంబై యుపపర్వమహాపర్వోపశోభితంబై యుపద్వీపమహాద్వీపసంభృతంబైన భువనంబజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు మునిఖిలలోకహితార్థంబు ధర్మప్రధానుండై సంవత్సరత్రయంబు

నిర్మించిదాని దేవలోకంబునందువక్కాణింపనారదుంబనిచెం బితృలోకంబున వక్కాణింపనసితుండైన దేవలుంబని
గరుడగంధర్వయక్షరాక్షసలోకంబులందువక్కాణింపశుకుంబనిచె నాగలోకంబునందువక్కాణింపసుమంతుంబని
మనుష్యలోకంబునజనమేజయునకువక్కాణింపవైశంపాయనునింబనిచె నేనావైశంపాయనమహామునివలన వి
చ్చితిఁదొల్లికృతత్రేతావసానసమయంబునదేవాసురరామరావణయుద్ధంబులునుంబోలె ద్వాపరాంతంబునంబాం
డవధార్తరాష్ట్రులకుమహాఘోరయుద్ధంబయ్యె నందు ✱ తరల॥ పదిదినంబులుభీష్ముఁడాహవభారకుండుగురుండుపం
చసంబులుకర్ణుఁడుర్విదివసద్వయంబుదినార్ధమం। మదితతేజుఁడుశల్యుఁడత్యధికోగ్రవీరగదారణం। బదిదినార్ధముగా
నిట్లుమహాభయంకరవృత్తితోఁ ✱ క॥ పదిదినములైదుప్రొద్దులు। పదపడిరెన్నాళ్లునొక్కపగలుం రేయుం। మదమున
ణమొనంచిరి। నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్ ✱ శా॥ ఏడక్షౌహిణులెన్నఁబాండవబలంబేకాదశాక్షౌహిణు। ల్గా
ఢింగౌరవసైన్యమీయుభయముం రోషాహతాన్యోన్యమై। యీడంబోవకవీఁకమైఁబోడువఁగా నేపారుఘోరాననల్లి
డెంధా। త్రిశమంతపంచకమునం దష్టాదశాహంబులం ✱ వ॥ ఇట్టిమహాభారతంబు కృష్ణద్వైపాయనమహాముని
రచితంబై ప్రవర్తిల్లుచుండు ✱ సీ॥ ఇమ్మహాభారతంబిమ్ములఁబాయక విహితావధానులై వినుచునుండు। వారికివిప్ర
ధర్మారంభసంసిద్ధియగుఁబరమార్థంబునశ్రమమున। వేదముల్నాలుగు నాదిపురాణముల్పదు నెనిమిదియుఁదత్ప్ర
తధర్మ। శాస్త్రంబులును మోక్షశాస్త్రతత్త్వంబులు నెఱిఁగినఫలమగు నెల్లప్రొద్దు- ఆ॥ దానములను బహువిధక్రతుహు
తజప। బ్రహ్మచర్యములనుబడయఁబడిన। పుణ్యఫలమువడయఁబోలునశేషపా। పక్షయంబునగుశుభంబు పెలుగ ✱ ఉ
సాత్యవతేయవిష్ణుపదసంభవమైవిబుధేశ్వరాబ్ధిసం। గత్యుపశోభితంబయిజగద్విదితంబగుభారతీయభా। రత్యమలా
గౌఘమునిరంతరసంతతపుణ్యసంపదు। న్నత్యభివృద్ధి సేయువినినంగొనియాడిననెల్లవారికిన్ ✱ వ॥ అనినవినిశౌనకా

—✱శమంతపంచకాక్షౌహిణీసంఖ్యానిర్ణయము.✱—

మహామునులు శ్రీమహాభారతకథాశ్రవణపరులై యక్కథకునకిట్లనిరి ✱ మ॥ అనఘామున్నశమంతపంచకమునం
క్షౌహిణీసంఖ్యయుం। వినఁగామాకెఱిఁగించిభారతకథావిర్భూతికింగారణం। బునుదద్భారతవిస్తరోక్తివిభవంబు
బాండవాడంబరం। బునుభీష్మాదికురుప్రవీరచరితంబుం జెప్పుముద్యన్మతిన్ ✱ క॥ అనినవినిరోమహర్షణ। తనయుండన్న
నులకతిముదంబునవినయా। వనతుఁడయిగురులఁదనహృ। ద్వనజంబుననిలిపికొలిచివాగ్గణపతులన్ ✱ ఉ॥ ఇమ్మగసర్వలో
కజనులెవ్వనిరమేనిముఖామృతాంశుబిం। బమ్మననుద్భవంబయినభారతవాగమృతంబుకర్ణరం। ధ్రమ్మునఁజలిం
త్రావుచురట్టిమునీంద్రులోకవం। ద్యుంబరముంబరాశరసుతుంబ్రణమిల్లికరంబుభక్తితోన్ ✱ వ॥ అమ్మునులడిగినక
యథాక్రమంబునసవిస్తరంబుగాఁజెప్పఁదొడంగె ✱ శా॥ త్రేతాద్వాపరసంధినుద్ధతమదాంధీభూతవిద్వేషిజీ
తోగ్రశ్వసనుండురాముఁడలుకన్ నుయ్యేడుమాఱుల్రణ। ప్రీతినైర్విరిథరాతలేశ్వరులఁజంపెంబల్ఫ్వరన్ దీర్ఘని
క్రూరకుఠారలూననిఖిలక్షత్త్రోరుకాంతారుఁడై ✱ వ॥ అప్పరశురాముండునిజనిశితకుఠారధారావిదళితసకలక్ష
రుధిరాపూర్ణంబుగా నేనుమడుఁగులుగావించి తద్రుధిరజలంబులఁ బితృతర్పణంబుచేసి తత్పితృగణప్రార్థననుపశ
మితక్రోధుండయ్యె దానం జేసితత్సమీపప్రదేశంబు శమంతపంచకంబునాఁబరఁగె మఱియక్షౌహిణీసంఖ్యవినుండు
సీ॥ వరరథమొక్కండువారణమొక్కండుతురగములమ్మూఁడుకాల్వురును నేవు। రనుసంఖ్యగలయదియగుఁబత్తి
త్రిగుణంబైన సేనాముఖంబుదీని। త్రిగుణంబుగుల్మంబుదీనిముమ్మడుఁగగుగణముతద్గణముత్రిగుణితమైన। వాహిని
గుధానివడిమూఁటగుణియింపఁబృతననాఁబరఁగుదత్పృతనమూఁట- ఆ॥ గుణితమైనఁజమువగున్మఱిదానిము। మ్మడుఁ
క్కినిసమాఖ్యనొనరు। నదియుఁబదిమడుంగులైననక్షౌహిణి। యానిరంతరప్రమాణసంఖ్య ✱ వ॥ ఇరువదియొక్క వేలు
మన్నూటడెబ్బదియొక్క రథంబులు నన్నియేనుంగులు నఱువదేనువేలునాలునూటపదిగుఱ్ఱంబులు లక్షయుందొమ్మి
వేలుం మున్నూటయేఁబండ్రు వీరభటులునుంగలయది యొక్కయక్షౌహిణియయ్యె నట్టియక్షౌహిణులుపదు నెనిమి
దసన్నద్ధులై కురుపాండవులుయుద్ధంబు సేయుటం జేసియాశమంతపంచకంబుకురుక్షేత్రంబునాఁబరఁగె నట్టికురు

త్రంబునందు * చ॥ ప్రతిహతశత్రువిక్రముఁడు పాండవవంశవివర్ధనుండును । బ్రతుఁడు పరీక్షిదాత్మజుఁ డవద్యవిదూరుఁడు దారకీర్తిని । ర్మితవివిధాధ్వరుండు జనమేజయుఁ డర్జునపాలుఁ డుత్తమ । స్తుతమతిదీర్ఘసత్రమున జితుండ నరించె శుభాభికాంక్షియై॥ * వ॥ ఆ ప్రదేశంబునకు సరమ యను దేవశునికొడుకు సారమేయుం డనుకుర్కురకుమారుండు క్రీడార్థంబు వచ్చి త్రస్మరుచున్న నలిగి జనమేజయుతమ్ములు శ్రుతసేనుండును భీమసేనుండును నుగ్రసేనుండును ననువారలా సారమేయు నడిచిన నదియ జచుచుం బఱతెంచి తల్లికిం జెప్పిన నాసరమ యనతికోపాన్వితయై జనమేజయు నొద్దకు వచ్చి యిట్లనియె॥ * క॥ క్షితినాథ కడు నధర్మా । న్వితులై నీతమ్ములతివివేకవిదూరు । ల్మతిఁ దలఁపక నాపుత్త్రకు । నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్ * క॥ తగునిది తగ దని మొదలో । వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్ । మ్మొగిఁ జేయు దుర్వినీతుల । కగు నని మిత్తాగమంబులై నభయంబుల్ * వ॥ అని సరమ యదృశ్యయైన నతివిస్మితుండై జనమేజయుండు కొన్నిదినంబులకు దీర్ఘసత్రంబు సమాప్తంబు చేసి హస్తిపురంబునకుం జని సుఖంబుండి యొక్కనాఁడు దేవశునీవచనప్రతీకారార్థంబు శాంతికపౌష్టికక్రియలు నిర్వర్తింప ననురూపపురోహితు నన్వేషించుచు ననేకమునిగణాశ్రమంబులకుం జని యొక్కమునిపల్లెంగని యందు శ్రుతశ్రవసుఁ డను మహామునిఁ గని వారికి నమస్కరించి యిట్లనియె * క॥ కరుణించి యిండు నాకుం । బురోహితునిఁ గాఁగ మీసుపుత్త్రుఁ బవిత్రుం । బరమతపోనైష్ఠికు భా । సురయమనియమాభిరాము సోమశ్రవసున్ * వ॥ అని యడిగి వారి యనుమతంబున సోమశ్రవసుం డనుసంబు రోహితుంగా వించికొని వారి నభీష్టసత్కారంబుల సంతుష్టులం జేసి తదుపదేశంబున * ఉ॥ ఆయతకీర్తితో వివిధయాగములన్ సురధారుణీసురా । మ్నాయము నాహుతాహుతిసమంచితదక్షిణలిచ్చి తన్పుచుం । జేయుచునుండె రాజ్యము విశిష్టజనస్తుతవర్ధమానల । క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁ డాదినరేంద్రమార్గుఁడై * వ॥ ఇట్లనవరత శాంతికపౌష్టికక్రియలు నిర్వర్తించుచు గురుదేవమహీదేవతర్పణాభిరతుండై యుండు నంత * క॥ పంకజభవసన్నిభుఁ డఘ । పంకక్షాళనమహాతపస్సలిలుఁ డనా । తంకమతి పైలశిష్యుఁడు । దంకుం డను మునివరుండు తద్దయుఁ బ్రీతిన్ * క॥ గురుకులమునందు గురులకుఁ । బరిచర్యలొనర్చి తానపరిమితనిష్ఠా । పరుఁడై జ్ఞానము

—* ఉదంకుఁడు పౌష్యమహాదేవికుండలంబులఁ దేఁబోవుట *—

వడసెను । గురుదయననిమాదికాష్టగుణములతోడన్ * వ॥ అయ్యుదంకుఁడు గురుహితకార్యధురంధరుండై గురుపత్నీనియోగంబునం బౌష్యుం డను రాజుదేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరం బూని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్కమహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్కదివ్యపురుషుంగని వానిపన్నినవృషభగోమయభక్షణంబు సేసి యమ్మహాత్మునను గ్రహంబువడసి యతిత్వరితగతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె * తే॥ పనుగుర్వర్థమర్థినై మానవేశ । కడఁగివచ్చితి నిపుడు నీకడకు వేడ్క । దండి తారాతినీదేవికుండలంబు । లిమ్ము నాపూనికయిది సఫలమ్ము గాఁగ * వ॥ అనినఁ బౌష్యుం డిట్టిమహాత్మునకీఁ గాంచితిఁ గృతార్థుండనైతి ననిమనంబున సంతసిల్లి యుదంకున కిట్లనియె నయ్యా మదీయధర్మపత్ని యకుండలంబులు దొడుగనవసరంబై యున్న యది మద్వచనంబున వానినిప్పించుకొమ్మనిన నుదంకుండంతఃపురంబునకుం జని పౌష్యమహాదేవిం గానక క్రమ్మఱి పౌష్యుపాలికి వచ్చి నీదేవి నెందును గానక యిటవచ్చితి నీవ యకుండలంబులు దెప్పించియిమ్మనిన నుదంకునకుఁ బౌష్యుం డిట్లనియె* క॥ భూవినుత నిన్నుఁ ద్రిభువన । పావను నశుచివని యెట్లు పలుకఁగ నగు న । ద్దేవి పవిత్ర పతివ్రత । గావున నశుచులకుఁ గానఁ గాదనవద్యా * వ॥ అనిన విని యుదంకుం డప్పుడు దలంచి యావృషభగోమయభక్షణంబు ననైన యశుచిభావంబునఁ గానమి యప్పరమపతివ్రత మదీయదృష్టిగోచర గాకున్నదయ్యె నని పూర్వాభిముఖుండై శుద్ధోదకంబులం బ్రక్షాళితపాణిపాదవదనుండై యాచమించి పౌష్యానుమతంబున నద్దేవియొద్దకుం జనిన నదియు నమ్మహామునికి నమస్కరించి కుండలమ్ములిచ్చి యిట్లనియె * క॥ తక్షకుఁ డీకుండలముల । పేక్షించుచునుండు వాఁడ భేద్యుఁడు మాయా । దక్షుండు వానివలనను । రక్షితముగఁ జేసి చనుము రవినిభతేజా * వ॥ అనిన నుదంకుం డట్ల చేయుమనని యద్దేవి వీడ్కొని రాఁ బౌష్యుండ య్యా నీవ లతిథివి మా యింటం గృతభోజనుండవై [illegible] యుదంకుండు గుడుచుచో నన్నంబు కేశ

దుష్టంబై నరోమకరంబలిగి యిట్లపరీక్షితంబైనయశుద్ధాన్నంబు వెట్టినవాఁడవంధుండవగుమని శాపంబిచ్చిననల్పదో
షంబుననాకు శాపంబిచ్చినవాఁడవునీవనపత్యుండవగుమని ప్రతిశాపంబిచ్చిన నుదంకుండు నేననపత్యుఁడఁగానోపదీని
గ్రమ్మఱింపుమనినఁ బౌష్యుండిట్లనియె * ఉ॥ నిండుమనంబునవ్యనవనీతసమానముపల్కు దారుణా। ఖండలశస్త్ర
తుల్యముజగన్నుతవిప్రులయందునిక్కమీ। రెండునురాజులందు విపరీతముగావునవిప్రుఁడోపునో। పండితశాంతు
య్యునరపాలుఁడుశాపముఁగ్రమ్మఱింపఁగన్ * వ॥ కావుననాకశక్యంబునీయిచ్చినశాపంబుగ్రమ్మఱింపుమనిన ను

—*తక్షకుండుకుండలంబులపహరించుట.*—

కుండ్లనీకునల్పకాలంబున శాపమోక్షంబగునని పౌష్యునకు ననుగ్రహించిమగిడిపోవునెడ గురుపత్నికిఁగుండ
బులీఁగంటిననిమనంబునసంతోషించిచనువాఁడెదురనొక్కజలాశయంబుగని శుచిప్రదేశంబునఁదనచేతికుండలం
లువెట్టి యాచమించుచున్నంతఁ దనతోడనవచ్చితక్షకుండు నగ్నవేషధరుండై యక్కుండలంబులుగొనిపాఱినను
కుండువానిపిఱుందనపాఱిపట్టికొనుడు * క॥ విడిచిదిగంబరవేషము।విడువక మణికుండలములువిషధరపతియే। ర్వడ
జరూపముతోన।ప్పుడయహిలోకమునకరిగెభూవివరమునన్ * వ॥ ఉదంకుండును వానితోడనెతగిలియవ్వివరంబునను
గలోకంబునకరిగినాగపతులనెల్లనిట్లనిస్తుతియించె * చ॥ బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ।సహితమ
హామహీభరమజస్రసహస్రఫణాళిఁదాల్చిదు। స్సహతరమూర్తికిన్జలధిశాయికిఁబాయకశయ్యయైనయ। య్యహిపతి
దుష్కృతాంతకుఁడనంతుఁడుమాకుఁబ్రసన్నుఁడయ్యెడున్ * చ॥ అరిదితపోవిభూతినమరారులబాధలువొందకుండఁగృ
గానురగులనెల్లఁగాచినమహోరగనాయకుఁడానమత్సరా। సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదునకద్రినందనేశు
శ్వరునకుభూషణంబయినవాసుకిమాకుఁబ్రసన్నుఁడయ్యెడున్ * ఉ॥ దేవమనుష్యలోకములఁద్రిమ్మరుచున్ విపులప్రదీ
పసం।భావితశక్తిశౌర్యులనపారవిషోత్కటకోపవిస్ఫుర। త్పావకతాపితాఖిలవిపక్షులునైనమహాసుభావులై। రావ
తకోటిఘోరఫణిరాజులుమాకుఁబ్రసన్నులయ్యెడున్ * ఉ॥ గోత్రమహామహీధరనికుంజములన్విపినంబులంగురు। క్షే
త్రమునం ప్రకామగతిఖేలనఁనొప్పిసహాశ్వసేనుఁడై। ధాత్రిఁబరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁడీక్షణ।శ్రోత్రకు
భుండుతక్షకుఁడుశూరుఁడుమాకుఁబ్రసన్నుఁడయ్యెడున్ * వ॥ అనియిట్లునాగకులంబునెల్లస్తుతియించి యందుసితాజన
తతంతుసంతానపటంబును వయించుచున్న వారినిద్దఱఁస్త్రీలను ద్వాదశారచక్రంబుం బరివర్తింపించుచున్నవారి
నాఱుగ్వురఁగుమారులనతిప్రమాణ తురంగంబునెక్కినవానిమహాతేజస్వినొక్కదివ్యపురుషుంగని విపులార్థవంతంబు
లయినమంత్రంబులనతిభక్తియుక్తుండయిస్తుతియించినంబ్రసన్నుఁడయియద్దివ్యపురుషుఁడయ్యుదంకునకిట్లనియె * క॥ య
మితవచనానియితార్థ।స్తుతులకతిప్రీతమానసుఁడనైతిననిం।దితచరితనీకునభివాం। ఛితమెయ్యదిదానిఁజెపుమచేయుదు
చుననినన్ * వ॥ ఉదంకుండు గరంబు సంతసిల్లి యిన్నాగకులంబెల్లనాకు వశంబగునట్టులుగ ననుగ్రహింపుమనిన
నప్పురుషుండట్లేనినీయశ్వకర్ణరంధ్రధ్మానంబుచేయుమనిననట్లయనితద్వచనానురూపంబుసేయుడు * శా॥ పాతాళా
కనికేతనాంతరమునంబర్వెందదశ్వాఖిల।స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్పన్నగవ్రాతము। ద్భీతిల్లెన్భుజగా

—*తక్షకుఁడుకుండలంబులఁదెచ్చియుదంకునకిచ్చుట.*—

నాథుమనమున్భేదిల్లెఁగల్పాంతసం। జాతప్రోద్ధతబాడబానలశిఖాశంకాధికాతంకమై * క॥ శంకరనిభుఁడగువిప్రుభయం
కరకోపాగ్నిమొక్కయనుచునుజాతా।తంకుఁడయికుండలంబులు।దంకునకును దెచ్చియిచ్చెఁదక్షకుఁడంతన్ * వ॥
నాగకులంబునకెల్ల మహాక్షోభంబుగావించి తక్షకుచేతఁగుండలంబులుగొనియుదంకుండాత్మగతంబున * సీ॥ కుండ
మ్ములువేగఁగొనిరమ్మునాలవనాఁటికినిపూనినన్నుఁబనిచె।గురుపత్ని నేఁడయక్కుండలంబులుదొడ్గు దివసమీదివస
తిక్రమింప।కుండంగఁబోకమెట్లోడఁగూడునోనాగభవనమెప్పాటవెల్వడఁగఁబోలు। నేఁడుపోవనినాఁడునిష్ఫల
మ్మహాయత్నమంతయుననియధికచింతఁ-ఆ॥ దవిలియున్నయయ్యుదంకునభిప్రాయ।మెఱిఁగిదివ్యపురుషుఁడిట్టులనిదా
నీహయంబునెక్కిరేమగుమయిదివడి। గలదుమనసుకంటెగాఢ్యకంటె * వ॥ అనవుడునద్దివ్యపురుషవచనంబున

రంగంబు నెక్కి తత్క్షణంబయ్యుదంకుండు గురుగృహంబునకువచ్చి నటగురుపత్నియుశుచిస్నాతయై నూతనపరిధానశో
భితయైకుండలంబులు దొడుగనవసరంబైన నుదంకాగమనంబుగోరుచున్నయప్పుడయ్యుదంకుంగనితద్దయుసంతసిల్లి త
దానీతరరత్నకుండలభూషితయై బ్రాహ్మణులంబూజించి నిజసంకల్పితమహోత్సవంబొనరించె నట్లుగురుకార్యం
బునిర్వహించినయుదంకుంజూచిగురుండిట్లనియె * క ॥ ఈయున్నపౌష్యుప్రోలికిఁ। బోయికడుం బెద్దదవ్వుపోయినయ
ట్లు। త్యాయతవిమలతపోమహి।మాయిన్నిదినంబులేలమసలితిచెపుమా * వ॥ అనిననుదంకుండిట్లనియెనయ్యామీయాన
తిచ్చినట్లుమసలవలవదు తక్షకుండను దుష్టోరగంబుచేసినవిఘ్నంబున నింతమసలవలసె వినుఁడు మిమ్ముఁవీడ్కొనిచను
వాఁడనెమరనొక్కమహోక్షంబు నెక్కిచనుదెంచువానిమహాతేజస్వినొక్కదివ్యపురుషుంగనివానిపన్నినవృషభ
గోమయభక్షణంబుసేసిచనిపౌష్యమహాదేవికుండలంబులుప్రతిగ్రహించివచ్చితక్షకుచేత నపహృతకుండలుండనైవా
నితోడనపాతాళలోకంబునకుంబోయినాగపతులనెల్లస్తుతియించియందు సితాసితతంతుసంతానపటంబుననువయిం
చుచున్నవారినిద్దఱస్త్రీలను ద్వాదశారచక్రంబుఁబరివర్తింపించుచున్నవారినాఱ్వురఁగుమారులనతిప్రమాణతురగా
రూఢుండయినయొక్కదివ్యపురుషుంగనితత్ప్రసాదంబునఁ గుండలంబులువడసి తదాదేశంబుననత్తురంగంబు నెక్కివ
చ్చితినిదియంతయు నేమికారణంబునా కెఱింగింపుఁడనినగురుండిట్లనియె * సీ॥ అప్పురుషుండింద్రుఁడయ్యుక్షమైరావ
తంబుగోమయమమృతంబునాగ। భువనంబులోఁగన్నపొలఁతులిద్దఱుధాతయునువిధాతయువారియనువయించు।సిత
కృష్ణతంతురాజితతంత్రమదియహోరాత్రముల్ద్వాదశారములుగలుగు। చక్రంబుమాసాత్మసంవత్సరంబు గుమా
రులయ్యాఱ్వురుమఱియుఋతువు - ఆ ॥ లక్షురంగమగ్నియప్పురుషుండుపర్జన్యుఁడింద్రసఖుఁడుసన్మునీంద్ర।యా
దినింద్రుఁగాంచియమృతాశివగుటనీ।కభిమతార్థసిద్ధియయ్యెనయ్య * క॥ కరమిష్టముచేసితివిమా ।కరిసూదనదీననీకున
నాసత్ఫలము।ల్గురుకార్యనిరతులగుస।త్పురుషులకగుటరుదెయధికపుణ్యఫలంబుల్ * వ ॥ నీవలననంబరమసంప్రీత
హృదయుండనైతినీవుసర్వార్థంబులనందుఋణవిముక్తుండవైతివి నిజేచ్ఛనుండుమనినఁదదనుజ్ఞవడసి యుదంకుండనేక
కాలంబుదపంబుసేసెనట్టియుదంకుండుదక్షకుచేసినయపకారంబునకుంబ్రతీకారంబుచేయంజింతించియొక్కనాఁడు
జనమేజయుపాలికింబోయియిట్లనియె * చ॥ మితహితసత్యవాక్యజనమేజయభూజనవంద్యయేనుసు। స్థితిసురదేవకా
ర్యములుసేయఁగఁబూనుటెఱింగివంచనో। న్నతమతియైయకారణమనాకపకారముసేసెఁదక్షకుం। డతికుటిలస్వభా
వుఁడుపరాత్మవిశేషవివేకశూన్యుఁడై * వ॥ మఱియదియునుంగాక * చ॥ అనవరతార్థదానయజనాభిరతుఁ భరతాన్వ
యాభివ। ర్ధనుసకలప్రజాహితవిధానుధనంజయసన్నిభుఁ భవ। జ్జనకుఁబరీక్షితుఁ భుజగజాల్మఁడసహ్యవిషోగ్రధూ
మకే।తనహతిఁజేసిచేసెనటిదాంతుఁగృతాంతనికేతనాతిథిఁ * ఉ॥ కాదనకిట్టిపాటియపకారమునక్షకుఁడేకవిప్రసం।
బోధనఁజేసిచేసెనృపపుంగవనీవునునేకభూసురా। పాదితసర్పయాగమునభస్మముసేయుమువానికాదికా। కోదరసం
హతిఁ హుతవహోగ్రసమగ్రశిఖాచయంబులఁ * ఉ॥ ప్రల్లదుఁడైనయొక్కకులపాంసనుచేసినదానఁదక్కెలం।
బెల్లనుదూషితంబగుటయేమియపూర్వముగావునన్మహీ। వల్లభతక్షకాధమునెపంబునసర్పములెల్లనగ్నిలోఁ। ద్రెళ్లఁగ
సర్పయాగమతిధీయుతచేయుమువిప్రసన్నిధిఁ * వ॥ అనియిట్లయ్యుదంకుండుజనమేజయునకుసర్పయాగబుద్ధిపుట్టించెన
నినవినిశౌనకాదిమహామునులకక్కథకునకిట్లనిరి * చ॥ అమితజగద్భయంకరవిషాగ్నియునప్రతిహన్యమానవీ।ర్యముఁగలయ
ట్టిసర్పములకాజనమేజయుచేయుసర్పయా। గమునను దగ్రపావకశిఖాతతులందొరుగంగఁగారణం।బమలచరిత్రమే
మిచెపుమయ్యవినంగడువేడ్కయయ్యెడుఁ * వ॥ అనియడిగినవారికిగక్కథకుండిట్లనిచెప్పెఁదొల్లి సర్పకులజననియై
నకద్రువశాపకారణంబునంజేసి జనమేజయుసర్పయాగంబున సర్వభక్షకుండైనయగ్నియందు సర్పంబులకెల్లనకాం
డప్రళయంబైనదానిభృగువంశజుండైనరురుండుగావించు సర్పఘాతంబుసహస్రపాదుండుడిగించినట్లుజరత్కారు
సుతుండైనయస్తీకుఁడుడిగించెదీనిసవిస్తరంబుగాఁజెప్పెదదత్తావధానులరై వినుండని భృగువంశకీర్తనంబున నస్తీకుచరి
తంబునుజెప్పందొడంగె * సీ॥ భృగుఁ [illegible] ఁదనధర్మపత్ని।నగ్నిహోత్ర

మునకునగ్నులువిహరింపుమనిపంచియభిషేచనార్థమరుగ నంతఁబులోముఁడర్ణవింతరక్కసుఁడగ్నిహోత్రగృహ
బునకొయ్యవచ్చి యత్తన్విఁజూచియున్మత్తుఁడై యెవ్వరిసతియిది సెప్పుమాజాతవేద - అ॥ యనఁగనగ్నిదేవుఁడన్నృ
బునకువిప్ర శాపమునకు వెఱచి శాపభయము దీర్చుకొనఁగఁబోలుఁదీవ్ర గాదనృతాభి భాషణముననైనపాపచయమ్ము
వ॥ అనివిచారించియప్పరమపతివ్రతభృగుపత్నియనికలరూపుఁజెప్పిననప్పులోముండు నిదినాకుఁదొల్లివరియింపంబ
నభార్యపదంపడిభృగుండు పెండ్లియయ్యెననివరాహరూపంబున నాసాధ్వినతిసాధ్వసచిత్త నెత్తుకొనిపల్వంబఱ్వఁ

——*చ్యవనునివలనఁబులోముఁడను రాక్షసుండుచచ్చుట*——

ర్భంబుననున్న యర్భకుండుకరంబలిగికుక్షిచ్యుతుండై చ్యవనుండునాఁబరఁగెనమ్మునికుమారుని * క॥సముదితసూర్య
హస్రోపమదుస్సహ తేజుజగదుపప్లవసమయా సమదీప్తితీవ్రపావక సముఁజూచుచునసురభస్మసాత్కృతుఁడయ్యెః
వ॥ పులోమయనకొడుకుభృగుకులవర్ధను నెత్తికొనినిజాశ్రమంబునకువచ్చెముందర నారక్కసునకు వెఱచియక్కో
మలివేడ్చుచుంబోయినఁదద్బాష్పధారాప్రవాహంబుమహానదియైయతదాశ్రమసమీపంబునంబాఱెనదానికివధూసర
నునామంబులోకపితామహుండు సేసె నంతఁగృతస్నానుండయిభృగుండుచను దెంచిబాలారుణుంబోనిబాలకునె
కొనియున్ననిజపత్నింజూచియసురసేసినయపకారంబునకలిగియయ్యసురని న్నెట్లెఱింగె నెవ్వరుసెప్పిరనినవినిపుల
మయిట్లనియె * క॥ఈయగ్నిదేవుఁడసురకునోయన జెప్పుటయువినిమహోగ్రకృతితో నాయసురనన్నుసూకరరూ
యప్పుడయెత్తుకొనిరయంబునఁజనుచో * క॥కుక్షిచ్యుతుఁడయిసుతుఁడా రాక్షసుభస్మంబు సేసిరాజిత[illegible]
చెనన్నుననవుడు నాతుణమమునీంద్రుఁడగ్నికతిరోషమునన్ * వ॥ నీవతిక్రూరుండవుసర్వభక్షకుండవుగమ్మనిశాప
బిచ్చిననగ్నిదేవుండిట్లనియె * క॥ తనయెఱిఁగినయర్థంబొరుఁడనఘాయిదియెట్లు సెప్పుమనియడిగినఁజెప్పనివాఁడు
సత్యముచె । ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁబడున్ * వ॥ కావున నేన సత్యభయంబునకు వెఱచి యక్కో
మలిభృగుపత్నియనికలరూపుఁజెప్పితినఖిలజగత్కర్మసాక్షినయియుండియసత్యంబెట్లుపలుక నేర్తునదినిమిత్తంబుగా
నాకుశాపంబిచ్చిననేనలిగిప్రతిశాపంబీనోపనివాఁడనుగాను వినుము*చ॥అడిచినఁదిట్టినన్నలిమహాపరుషంబులుపలి
యక్కలితోఁబొడిచిననుత్తమద్విజులుపూజ్యులువారలకెగ్గుసేసినం జెడునిహముంబరంబునిదిసిద్ధముగావుటెఱింగి
త్తినె । ప్పుడుధరణీసురోత్తములఁబూజలఁదన్పుదునల్గనోడుదున్ * వ॥ కావుననీవుబ్రాహ్మణుండవునీవెద్ది చేసిన
చనులోకహితుండనైన నాకుశాపంబిచ్చిలోకంబులకెల్లఁజెట్టచేసితివదెట్లనిన వేదోక్తంబులైననిత్యనైమిత్తికబలి
ధానంబులందుమహాద్విజులచేత నాయందు వేల్వంబడినహవ్యకవ్యంబులనాముఖంబున దేవపితృగణంబులుపయోగిం
తురట్టియేనుసర్వభక్షకుండనైయశుచినైనఁగ్రియానివృత్తియగుఁగ్రియానివృత్తియైనలోకయాత్ర లేకుండుననియగ్ని
భట్టారకుండునిఖిలలోకవ్యాప్తంబైనతనమూర్తియుపసంహరించిన*సీ॥త్రేతాగ్నులెల్లను దేజరిల్లమిఁజేసిక్రతుకృ
త్యములువినిర్గతములయ్యె । నగ్నిహోత్రములందునౌపాసనాదిసాయంప్రాతరాహుతులంతనుడిగె। దేవతార్చన
లందుదీపధూపాదిసద్విధులువర్తిల్లకవిరతిఁబొందెఁ । పితృకార్యములఁబితృపిండయజ్ఞక్రియలడఁగెవిచ్ఛిన్నంబులైధరి
త్రి-ఆ॥నంతజనులుసంభ్రమాక్రాంతులై మహా।మునులకడకుఁజనిరిమునులునమర।వరులకడకుఁజనిరి వారునువారును
బ్రహ్మకడకుఁజనిరిభయముఁబొంది* వ॥బ్రహ్మయుభృగుశాపనిమిత్తంబుననగ్నిభట్టారకునుపసంహారంబును సకలలో
కవ్యవహారవిచ్ఛేదంబును నెఱింగియగ్నిదేవు రావించియిట్లనియె * చ॥ప్రకటితభూతసంతతికిభర్తవునీవుచరాచర
వృ । త్తికిమఱి హేతుభూతుఁడవు దేవముఖుండవునీవలోకపా।లకుఁడవునీవయిట్టియనవద్యగుణుండవునీకువిశ్వభా
భువనప్రవర్తనపరాఙ్ముఖ భావముఁబొందఁబాడియే * వ॥అమ్మహామునివచనంబమోఘంబుగావున నీవుసర్వభ
కుండవయ్యునుశుచులయందెల్లనత్యంతశుచివై పాత్రులయందెల్లఁబరమపాత్రుండవై పూజ్యుల యందెల్లనగ్రపూ
జ్యుండవై వేదచోదితవిధానంబుల యందు విప్రసహాయుండవై భువనంబులనడపుమని విశ్వగురుండువై శ్వానరుం బ్రా
ర్థించినయోగించి భృగువచనంబు ప్రతిష్ఠాపించెనట్టి భృగునకుఁబుత్రుండయిపుట్టిపరఁగిన * క॥ చ్యవనునకుసుకన్యక

ద్భవమయ్యె ఘనుండు ప్రమతి ప్రమతికి నమృతో | ద్భవయగు ఘృతాచికి నిభా | ర్గవముఖ్యుఁడు రురుఁడు పుట్టెఁ గాంతియుతుం డై * వ॥ అట్టి రురుండను మునివరుండు విశ్వావసుండను గంధర్వరాజునకు మేనకకుం బుట్టి స్థూలకేశుండను మహామునినివాసంబునఁ బెరుఁగుచున్న దాని రూపలావణ్యగుణంబులఁ బ్రమదాజనంబులయందెల్లను త్కృష్టయగుటం జేసి ప్రమద్వరయ

——*ప్రమద్వర సర్పదష్టయై చచ్చి మరల బ్రదుకుట.*——

ననొప్పుచున్న కన్యకనతిస్నేహంబున వివాహంబుగా నిశ్చయించియున్నంత * తే॥ కన్నియలతోడ నాడుచున్న దానిఁ | బాదమర్దితమై యొక్క పన్నగంబు | గఱచెఁ గన్నియలందఱు వెఱచి పఱచి | యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్లె * వ॥ దాని నెఱింగి కరుణాకలితహృదయులై గౌతమ కణ్వ కుత్స కౌశిక శంఖ మేఖల భరద్వాజోద్దాలక శ్వేతకేతు ప్రముఖులు ప్రమతియు రురుండును స్థూలకేశాశ్రమంబునకు వచ్చి విషవిగతప్రాణయై పడియున్న యక్కన్యకం జూచి దుఃఖితులై యుండున చ్చోట నుండనోపక రురుండు శోకవ్యాకులుండై యేకతంబ వనంబునకుం జని * చ॥ అలయక యేను దేవయజనాధ్యయనవ్రతపుణ్యకర్మము | ల్సలుపుదు నేనియేను గురుసద్ద్విజభక్తుఁడ నేనియే నయ | త్యలఘుతపస్వి నేని దివిజాధిపభూసురులారమ్మనో | నిలయకు నీ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేఁడు మీదయన్ * చ॥ అపరిమితాజ్ఞఁ జేసియు మహాపురుషుల్ విషతత్త్వసంహితా | నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికి న్విష | వ్యపగతమైన జీవమది వచ్చు నుపాయము సేయరొక్కొ నా | తపము ఫలంబు నధ్యయనదానఫలంబులు నిష్టువారికిన్ * వ॥ అని దీనవదనుండై యాక్రోశించు వానికి నాకాశంబున నుండి యొక్క దేవదూత యిట్లనియె నయ్యా కాలవశంబైన నెవ్వరికిం దీర్పఁ దరంబు గాదొక్క యుపాయంబు గలదు చేయ నోపుదేని చెప్పెద వినుము నీ యాయుష్యంబున నర్ధంబిక్కన్యకిమ్ము నిన్ను రురుండట్ల చేయుమనని తనయాయుష్యంబున నర్ధంబక్కన్యక కిచ్చిన నక్కోమలి తొల్లింటికంటె నధిక శృంగారసమన్వితయై విషనిర్ముక్తయయ్యె నట్లు దేవదూత ధర్మరాజానుమతంబునఁ దనచెప్పిన యుపాయంబునం బ్రమద్వరను బంచత్వంబువలనం బాపె రురుండును దాని వివాహంబై యిష్టోపభోగంబుల ననుభవించుచునుండి * క॥ తనసతికపకారము సే | సిన పాముల కలిగి బాధ సేయుదునని చి | క్కనిదండము గొని పాములఁ | గనినప్పుడ యడువఁ దొడఁగె గహనములోనన్ * చ॥ తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల రోసి రోసి ని | ష్ఠురతరదీర్ఘదండమున డొల్లఁగ వ్రేయుచు వచ్చి యొక్కచో | నెరి నొక డుండుభంబును నహింగని వ్రేయఁగ దండమెత్తుడున్ | హరి హరి యంచు డుండుభము మహాభయంపడి పల్కె భార్గవున్ * మత్తకోకిల॥ ఏమి కారణమయ్య పాములకేల యల్గితివీవు తే | జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు నావుడుం | బాము లెగ్గొనరించె మత్ప్రియభామ కే నురురుండను | ద్దామసత్త్వుఁడ నిన్ను నిప్పుడ దండతాడితుఁ జేసెదన్ * వ॥ అని రురుండలిగి కృతాంతకరదండంబునుంబోని తనదండంబెత్తికొను డుండుభంబు మునియై యెదుర నిలిచినం జూచి రురుండట్లనియె * క॥ ఉరగమవై యుండి మునీ | శ్వరవేషముఁ దాల్చియున్నవాడ వెంతయున | చ్చెరువిది యెట్టులు నావుడు | రురునకు నిట్లనియె మునివరుం డనురక్తిన్ * వ॥ పసుసహస్రపాదుండను మునిముఖ్యుండ నా సహాధ్యాయుండైన ఖగముఖుండను మునిముఖ్యుండగ్నిహోత్రగృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయసర్పంబమ్మునిపై వైచిన నతండులికిపడి నాకలిగి నీవు నిర్వీర్యంబైన యురగంబవగుమని శాపంబిచ్చిన నేనును మేలంబు సేసిన నాపయి నింత యలుగ నేల తమియింపుమనినం బ్రసన్నుండై ఖగముఖుండు నా వచనంబమోఘంబు గావున గొండొక కాలంబు డుండుభంబవై యుండి భార్గవకులవర్ధనుండైన రురుం గనినయప్పుడు శాపవిముక్తుండవగుదువని సహస్రపాదుండు రురునకుఁ దనవృత్తాంతం బంతయుం జెప్పి వెండియు నిట్లనియె * ఉ॥ భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడన పుట్టునుత్తమ | జ్ఞానము సర్వభూతహితసంహితబుద్ధియుఁ జిత్తశాంతియున్ | మానసుదప్రహాణముశమంబును సంతతవేదవిద్యయు | స్థానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్ * వ॥ అయ్యా నీవు బ్రాహ్మణుండవు భృగువంశసముత్పన్నుండవు గుణసంపన్నుండవు ఇది యేమి దొడంగితి ఇట్టి దారుణక్రియారంభంబు క్షత్త్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే బ్రాహ్మణులు అహింసాపరులు ఒరులు సేయు హింసలు వారించు పరమకారుణ్యపుణ్యమూర్తులు జనమేజయుండను జనపతి చేయు సర్పయాగంబునందుఁ గద్రూశాపంబున నయ్యెడు సర్పకులప్రళయంబు భవత్పితృని

ష్యుండై నయ స్త్రీకుండను బ్రాహ్మణుండ కాఁడె యుడిగించెనని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్ప ఘాతంబునందు
మనబుద్ధి పుట్టించె నని నవిని శౌనకాదిమహామునులకు కథకు నకిట్లనిరి * ఆ॥ ఒరులవలనఁ బుట్టునోటమియును
బొరయకుండ నరసి పుత్రవరులఁ। బగిలి కాచునట్టి తల్లి సర్పములకు । నేల యలిగి శాపమిచ్చెనయ్య * వ॥ అని సౌపర్ణా
న శ్రవణకుతూహలపరులై యడిగిన॥ ..........................................................

క॥ ఆదిత్య స్తుత్రిచరిత్రుఁ। రాదేవాశీగ్గిపరంపరావర్ధితని। త్యోదయసద్యోదితవిమ। లాదిత్యతనూజవిక్రమాదిత్యని
తోటకవృత్తము॥ నిరవద్యనరేశ్వరనిత్యనిరం। తరధర్మమతీగుణధామజగ। త్పరిపూరితకీర్తివిభాసితభా। స్కర
జనృపోత్తమకాంతినిధీ * క॥ రాజకులాగ్రగణ్యమృగరాజపరాక్రమరాజరాజవి। భ్రాజితశుభ్రకీర్తిపరిపాండురసర్వ
గంతరాళఘో। రాజిముఖోపలబ్ధవిజయప్రమదాశ్రితబాహుదండని। స్తేజితవైరివీరకులదీపమృడప్రియవిష్ణువర్ధనా

గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు ఆదిపర్వంబునందు నను క్రమణిక
యును బౌష్యోదంకమాహాత్మ్యంబును భృగువంశకీర్తనంబును న స్తీకచరితంబును నన్నది ప్రథమాశ్వాసము.

---

శ్రీహయగ్రీవాయనమః.

## శ్రీమహాభారతము - ఆదిపర్వము - ద్వితీయాశ్వాసము.

శ్రీవనితావల్లభ వే। గీవిషయాధీశ కావ్యగీతప్రియ నా। నావనినాథకిరీటత। టీవిలసద్రత్నసంఘటితపదక
లా * వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నాదియుగంబునఁ గశ్యపప్రజాపతిభార్యలైన కద్రు
వినతయనువారలు పుత్రార్థినులై యనేక సహస్రవర్షంబులు కశ్యపు నారాధించినం గశ్యపుండును బ్రసన్నుం
మీకోరిన వరంబు లిచ్చెదవేఁడుం డనిన * తరల॥ అనలతేజులు దీర్ఘదేహులునైన యట్టి తనూజులన్। వినుతసత్త్వులఁగోర్వ
గద్రువ వేవురం గడు వేడ్కతో। వినత గోరెను పుత్రులన్ భుజవీర్యవంతులవారికం। టెను బలాధికులైనవారిఁ గడిందివీ
నిద్దఱన్ * వ॥ కశ్యపప్రజాపతి దొల్లి పెద్దకాలంబు తపంబు చేసి పుత్రకామేష్టిఁ జేసెం గావునఁ గద్రువకు వేవురఁ గొడు
లను వినతకు నిద్దఱఁ గొడుకులను వారు కోరినయట్ల యిచ్చి గర్భంబు లిమ్ముగా రక్షింపం బనిచిన నయ్యిద్దఱును సంతసిల్లి
న్నంత గర్భంబులు కొండొక కాలంబునకు నండంబులైన నయ్యండంబులు ఘృతకుండంబులం బెట్టి రక్షించుచున్నంత నేను
ఱేండ్లకుఁ గద్రూగర్భాండంబులు దరతరంబ విసిన నందు శేషవాసుకైరావతతక్షకకర్కోటకధనంజయకాళియ
నాగాపూరణ వంజర కైలాపుత్ర నీలానీక కల్మాష శబలార్యకార్ద్రక హలపోతక సుముఖ దుర్ముఖ విముఖ దధిముఖ విమలపిం
డక ఆపూరితశంఖ వాలశిఖ నిష్ఠురాంక పోతశిఖ నహుష పింగళ బాహ్యకర్ణ హస్తికర్ణ ముద్గరపిండక కరిలాశ్వతర కాలాయ
త్తసంవర్తక పద్మ శంఖణక వ్రజకోపన క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్ర బిలక బిల్వపాండుర మూషికాద శంఖశిర
పూర్ణదంష్ట్ర హారిద్రక అపరాజిత జ్యోతిక శ్రీవహ పన్నగ కౌరవ్య ధృతరాష్ట్ర పుష్కర శల్యక విరజస్సుబాహు శాలిపిం
హస్తిభద్ర పీఠక ముఖర కోణనాసిక కుంజర కురక ప్రతారక కుముద కుముదాక్ష తిత్తిరి వావిల కర్దమ బహుమూలక
ర్క రాకర్క రకుండోదర మహోదరులాదిగాఁ గల వేవురు నాగముఖ్యులు పుట్టిన * క॥ తనగర్భాండంబుల రెంటను
యనందనులు వెలువడమి నతిలజ్జా। వనతయయి వినత పుత్రా। ర్థిని యొక యండంబు విగతధృతి నవియించె * క॥ దాన
రార్ధకాయవిహీనుఁడు పూర్వార్ధతనుసహితుఁ డరుణుఁడనం। గా నుదయించెను సుతుఁడు మ। హానీతియుతుండు
—* అనూరుఁడు వినతకు శాపమిచ్చుట.

ప్రియమెసఁగన్ * వ॥ ఇట్లు వికలాంగుండై పుట్టిన యనూరుండు వినతకు నలిగి నన్ను సంపూర్ణశరీరుం గాఁనీక యండ
వియించిన యవినీతవు గావున నీ సవతికి దాసివై యేనూ ఱేఁడులుండు మని శాపం బిచ్చి యింక నీ రెండవ యండంబు తనకు
నేయవియు నంతకు నుండ నిమ్మందుఁ బుట్టెడు పుత్రుండు మహాబలపరాక్రమ సంపన్నుండు నీ దాసీత్వంబు వాపు

చెప్పి యనూరుండుసూర్యరథసూతుండై యరిగె వినతయునయ్యండంబతిప్రయత్నంబునరక్షించుకొనియుండెనంత* క ॥ అసురాసుర వీరులును । న్నమలపయోరాశిఁద్రచ్చియమృతమువడయ । సుమకట్టిసురేంద్రపురో । గములయిహరి హర హిరణ్య గర్భుల తోడన్ * ఉ ॥ మేరుమహా మహీధరము మీఁదికినందఱువోయి యేక్రియన్ । వారిధిఁద్రచ్చువారముధ్రువంబుగ దానికిఁగవ్వ మెద్ది యా । ధారముదాని కెద్ది యనితద్దయు వెన్బడియున్నసచ్యుతాం । భోరుహగర్భులిద్దఱునుబూనిరిసర్వమునిహింపఁగన్ * చ ॥ అరుదుగసర్వశైలములయంతఁటనర్పునునార్జవంబును । స్థిరతయునోషధీరసవిశేషతయుంగలమత్తమంబుమం । దరకుధరంబుగవ్వమగుదానికినంచుసునిశ్చయించియ । య్యిరువురునంపఁగాఁబెఱికియెత్తెననంతుఁడుతన్గిరీంద్రమున్ * వ ॥ ఇట్లుపదునొకండు వేలయోజనంబులతనర్పునునంతియలోతునుంగల మందరనగంబనంతుండనంతశక్తింబెఱికియెత్తిన నందఱునుసప్పర్వతంబుదెచ్చి సముద్రంబులోవైచిదానిక్రిందనాధారంబుగాఁగూర్మరాజునియమించియోక్త్రింబుగావాసుకినమర్చి * శా ॥ క్షోణీచక్రభరంబుగ్రక్కదలదిక్కుల్మ్రోయఁగానార్చియ । క్షీణోత్సాహసమేతులై రయమునన్గీర్వాణులుంబూర్వగీ । ర్వాణవ్రాతమునబ్ధిఁద్రచ్చునెడఁదద్వ్యాకృష్టనాగానన । శ్రేణీప్రోత్థవిషాగ్నిధూమవితతుల్సైసెన్బయోదావలిన్ * క ॥ ఉరగపతితలలవలనురు । తరజవముననసురలూఁదితత్పుచ్ఛమునిఁ । ర్జరవరులూఁదినుమోము । త్సరమునవడిఁద్రచ్చిత్రచ్చిజవమఱియున్నన్ * క ॥ నారాయణుండువారిక । వారితజవసత్త్వములుధ్రువంబుగనిచ్చెన్ । వారునుదొల్లిటికంటెన । పారప్రారంభులై రపరిమితశక్తిన్ * చ ॥ ఉడుగక యొండొరుంజఱచియొక్కబలంబునదేవదానవుల్వడిగొనివార్ధినిట్లుదరువందరువన్విషముద్భవిల్లినన్ । ల్గడలనువిస్ఫులింగములుగప్పఁగఁబర్వినదానిఁజెచ్చెరన్ । మృడుఁడుగడంగిపట్టుకొనిమ్రింగిగళంబుననిల్పెఁబొల్పుగన్ * వ ॥ మఱియునమృతంబును శ్రీయునుచ్చైశ్శ్రవంబును గౌస్తుభంబును ధన్వంతరియునాదిగాననేకంబులుద్భవిల్లిననందుఁద్రిభువనవంద్యయైనశ్రీదేవియునిజప్రభాపటలపర్యస్తోదస్తప్రభాకరగభస్తివిస్తారంబైనకౌస్తుభంబును నారాయణ వక్షస్థలంబునవిస్తరిల్లెనుచ్చైశ్శ్రవంబను యుగ్యంబుసురరాజయోగ్యంబయ్యెనంతనయ్యమృతంబునసురులుచేకొనిన * క ॥ నారాయణుండుకృత్రిమ । నారీరూపమునఁదన్మనంబునకతిమోహారంభకారుఁడై యమ । రారులచేఁగ్రమ్మఱంగనమృతముగొనియెన్ * వ ॥ ఇట్లుపాయంబుననసురులవంచించియమృతముఁగొనివిష్ణుండుదేవతలకిచ్చిననయ్యమృతంబు దేవతలుపయోగించుచో దేవరూపంబుదాల్చి రాహువువేల్పులబంతినమృతంబుపయోగించుచున్నఁదత్సమీపంబుననున్నచంద్రాదిత్యులువానినెఱింగినారాయణునకుంజెప్పిననయ్యమృతంబువానికంఠబిలంబుసొరకమున్దర * క ॥ అసురారిమర్దనుఁడుచ । క్రముగ్రక్కున నేయరాహుకంఠముదెగిదే । హముధరణిఁబడియెఁదన్ముఖ । మమృతస్పర్శముననక్షయంబయినిలిచెన్ * వ ॥ నాఁటంగోలెరాహువునకుఁజంద్రాదిత్యులతోడివి

—*దేవదానవులయుద్ధము*—

రోధంబుశాశ్వతంబై ప్రవర్తిల్లుచుండె * సీ ॥ అంత దేవాహితులమృతంబుఁగానకయెంతయువగచిబలీంద్రుఁగూడి । మంతనంబుండియమర్త్యులతోడిపొందింతియచాలునింకేలయనుచు । సంతనకట్టియుత్సాహసమేతులై యంతంబులేనిరథాశ్వములను । దంతులనమితపదాతులనొడఁగూర్చియంతకాకారులై యార్చియమర । వరులఁదాఁకియేసిరురుతరశరపక్ష । జాతవాతరయవిధూతమగుచుఁ । జెదరజలదపఙ్క్తి బెదరవజ్రాయుధు । హృదయముదిలకొనఁగఁద్రిదశగణము * మహాస్రగ్ధర ॥ అమరేంద్రారాతులిట్లాహవముఖమున నేయంగఁదత్తీక్ష్ణబాణౌ । ఘము ఘోరంబై సురానీకమువయిఁబెలుచం గప్పినంజూచిదైత్యో । త్తములంగోదండచక్రోద్యతభుజులుమహాదారుణుల్వీరలక్ష్మీ । రమణుల్దుర్వారవాత్యారయమున నరనారాయణుల్దాఁకిరలుకన్ * మ ॥ నరచాపప్రవిముక్తదారుణబృహన్నారాచధారల్భయం । కరదైతేయనికాయకాయములపైఁగప్పెన్ దిశల్నిండఁబం । ధురధాత్రీధరతుంగశృంగతటసందోహంబుపైఁగప్పుచు । ద్ధరధారాధరముక్తసంతతపయోధారావళింబోలుచున్ * మ ॥ పతదుర్వీధరధాతునిర్ఘరజలాభంబై మహాదేహని । ర్గతసాంద్రారుణపూర మొక్క మొగినొల్కంద్రెస్సినారాయణో । న్నతదోర్గండవిముక్తచక్రనిహతిన్నాకద్విషన్మస్త । ప్రతతుల్ఘోరరణం

బునంబడియెభూభాగంబుగంపింపఁగ౯ * వ॥ ఇట్లుసముద్రతీరంబుననమరాసురులకునతిఘోరయుద్ధంబయ్యెనందు
నాయణులపారపరాక్రములైయసురవీరులనుక్కడంగంజెక్కడంచ్రఁజంపినచెసచెడిసముద్రంబుసొచ్చిననమరులు
మరలబ్ధవిజయులైయమరపతినమృతరక్షణార్థంబుప్రార్థించియథాస్థానంబునమందరనగంబుఁబ్రతిష్ఠాపించితమత
నివాసంబులసుఖంబుండిరంత * క॥ అమృతముతోనుద్భవమై। యమరేశ్వరయోగ్యమైనహయరత్నముడ।ద్వీపములో
రంబునఁ। గొమరుగనేకతమయిచ్చఁద్రుస్మరుచున్న౯ * వ॥ కద్రువయువినతయువినోదార్థంబువిహరించువార
మకరనికరకరాఘాతజాతవాతోద్ధూత తుంగతరంగాగ్రసముచ్చలజలకణాసార చ్ఛటాచ్ఛాదితగగనతలంబైనదా
నుద్యానవనంబునుంబోలెబహువిద్రుమలతాలంకృతంబైనదాని నాటకప్రయోగంబునుంబోలెఘనరసపాత్రశో
రంగరమ్యంబైనదానిదివంబునుంబోలెనహిమకరభరితంబైనదానిమఱియు * చ॥ అలఘుఫణీంద్రలోకకుహరా
రదీప్తమణిస్ఫురత్ప్రభా। వలిగలదానిశశ్వదుపవాసమహావ్రతశీతపీడితా। చలమునిసౌఖ్యహేతువిలసద్బడబాగ్ని
చయంబుల౯। వెలిఁగెడుదానిఁగాంచిరరవిందనిభాననలమ్మహోదధి౯ * మ॥ వివిధోత్తుంగతరంగఘట్టనచలద్వేలా
నైలావలీ।లవలీలుంగలవంగసంగతలతాలాస్యంబులీక్షించుచు౯। ధవళాంశుల్ప్రసికాంచిరంతనెమరంద తీరదేశం
నం।దవదాతాంబుజఫేనపుంజనిభునయ్యశ్వోత్తముండవ్వల౯ * వ॥ కనికద్రువవినతంజూచిచూడవెయల్లయతిధవ
బైనయశ్వంబునందుసంపూర్ణచంద్రునందునల్లయుంబోలె వాలప్రదేశంబుననల్లనైయున్నదియనినవినివినతనగి
కన్నులంజూచితే యక్కడెక్కడిదినల్లయీయాయశ్వరాజుమూర్తిమహాపురుషుని సత్కీర్తియుంబోలెనతినిర్మలంబ

## ———*కద్రూవినతలొండొరులుప్రతిజ్ఞచేయుట*———

మొప్పుచున్నదనినవినినవ్వివినతకుఁగద్రువయిట్లనియె * తే॥ అమ్మహాశ్వంబుధవళదేహంబునందు।నల్లగలిగిననీవిప్డు
కుదాసి। వగుముమఱియందునల్లలేదయ్యేనేని।నీకునేదాసినగుదుఁబన్నిదముసఱుము * వ॥ అనియిట్లిద్దఱునొండొరుల
కుదాసీత్వంబుపణంబుగానాఁడివిపన్నిదంబుచఱిచిన వినతయయ్యశ్వంబుడాసిచూతమురమ్మనినఁగద్రువిప్డుడప్ర
లేదు రేపకడఁజూతమనితమతమనివాసంబులకుంబోయియున్నయప్పుడు * సీ॥ కద్రువకొడుకులకడకేగియేనుమిమ్మ
డఱ వేఁడెదనన్నలార। నాపంపుసేయుఁడునన్నురక్షింపుఁడుగామచారులకుదుష్కరముగలదె। యొడలు తెల్లనితురగో
త్తమువాలంబునల్లచేసితిరేనినాకుదాసి।యగుమనవినతమీరట్లుసేయనినాఁడుదానికిమఱియేనుదాసినగుదు * ఆ॥ ఆం
పన్నిదంబుచఱిచితిమట్లుగా।ననినఁబాములెల్లననయమిదియుఁ।దల్లిపనిచెననియధర్మువుసేయంగ।నగునెయెఱుకగలి
మగువలెందు * వ॥ అనియందఱుదమలోవిచారించి యధర్మారంభంబునకుసమ్ముఖులుగాకయున్నఁగద్రువకోపో
తముఖయై * క॥ అనుపమమగుజనమేజయుఁ। డనుజనపతిచేయుసర్పయాగనిమిత్తం। బునఁబాములుపంచత్వము
యెడుమనియురగములకుశాపంబిచ్చె౯ * వ॥ అంతశాపానుభవభీతచిత్తుండైకర్కోటకుండనువాఁడుదల్లిపంచిన
పంబుననుచ్చైశ్శ్రవంబువాలంబునీలంబుగాఁబట్టివ్రేలుచున్నమఱునాఁడు రేపకడఁగద్రువయువినతయుంజనియ

## ———*వినతకుగరుడుండుజనియించుట*———

గంబునుజూచి వినతయోటుపడికద్రువకుదాసియై యొపినపనులు సేయుచున్నంతఁ బంచశతవర్షంబులునిండి
మయుండంబవిసినందు * ఉ॥ ఆతతపక్షమారుతరయప్రవికంపితఘూర్ణితాచల। వ్రాతమహార్ణవుండుబలవన్ని
సముజ్జ్వలప్రభా। ధూతపతంగతేజుఁడుదితుండయితార్క్ష్యుఁడుదల్లికిన్మనన్। ప్రీతియొనర్చుచున్నెగసెభీమజవంబున
భ్రవీథిక౯ * క॥ దారుణకల్పాంతమరు। త్ప్రేరితహవ్యవహశిఖలపెల్లిదియనిబృం। దారకమునిబృందస్తుతి।భో
గ్నిసూక్తములతోనెగసె౯ * క॥ హరికులిశక్షతియెఱుఁగని।గురుతరపక్షములతోడికులగిరివోలె౯।గరుడుండుగగన
నురు। తరజవమునసరుగుదెంచితల్లికిమ్రొక్కె౯ * చ॥ తడయకమ్రొక్కియున్నవినతాసుతునప్పుడుసూచి
లో।నిడుగడఁజేయుచుంగడుసహింపకకద్రువవానిఁబిల్చినా। కొడుకులనెల్లనెత్తికొనిద్రుస్మరుచుండుమయేమి
న౯।మడువకచేయుమీవనిసమర్పణఁజేసెఁబ్రభుత్వమేర్పడ౯ * వ॥ గరుడుండునుగద్రువపంచినపనులెల్లసువిన

మతంబున నతివినయపరుండై చేయుచు ✻ క॥ ఆపన్నగముఖ్యులఁ దన। వీపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా। ద్వీపము లుగిరులు నఖిలది। శాపాలపురములుఁ జూపెఁ జని వారలకున్ ✻ వ॥ ఒక్కనాఁడు సప్తమారుతజవంబున సప్తాశ్వమండలంబుదాఁక నెగసిన నమ్మార్తండు చండకిరణంబుల వేఁడిమి తాఁకి గరుడుని వీపుననున్న యురగులు దొరిఁగి నేలంబడి మూర్ఛవోయినం జూచి కద్రువ గడు నలిగి గరుడునిం బదరి యతిభక్తి నింద్రు నారాధించి నానావిధస్తుతుల నిట్లనియె ✻ చ॥ నరసురసిద్ధకింపురుషనాగనభశ్చరముఖ్యులెల్ల నీ। కరుణయ వేచి మంత్రు త్రిజగంబులు నీకులిశాభిరక్షణ। స్ఫురణను జేసి సుస్థిరతఁ బొందుఁ బురందర సర్వలోకసుం। దరశరణంబు నాకగుము దానవసూదన పాకశాసనా ✻ వ॥ అని స్తుతియించి పర్జన్యప్రసాదంబు వడసి కొడుకుల పయిని మహావృష్టి గురిపించి విగతపరితాపులం జేసి కద్రువ గర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులు గొనుచున్నంత నొక్కనాఁడు గరుడుండు దల్లి కిట్లనియె ✻ ఉ॥ ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్లను గ్గుగాఁ। జేయు మహాబలంబును బ్రసిద్ధియునుం గల నాకు నీపనిం। బాయక యొమ్మునం దెపుడుఁ బాముల మోవను వారికిం బను। ల్సేయఁగ నేమి కారణము సెప్పుము నాకుఁ బయోరుహాననా ✻ వ॥ అనియడిగిన వినత దనకుఁ గద్రువతోడి పన్నిదంబున నైన దాసీత్వంబును దత్కారణంబయిన యనూరుశాపంబునుం గొడుకున కేర్పడం జెప్పి యిట్లనియె ✻ క॥ నీకతమున నా దాస్యము। ప్రాకటముగఁ బాయు ననిన పలుకెద లోనం। జేకొని యుండుదు నిర్గత। శోకస్థితి నున్న దానఁ జూవె ఖగేంద్రా ✻ వ॥ కొడుకులు సమర్థులైనఁ దల్లిదండ్రుల యిడుమలు వాయుట యెంతయునుం గలయది గావున నీ యట్టి సత్పుత్త్రుం బడసి దాసినై యుండుము నే యనిన వైనతేయుండు దద్దయు దుఃఖితుండై యొక్కనాఁడు కాద్రవేయుల కిట్లనియె ✻ క॥ మాయాదాస్యము వాయును। పాయము సేయుండు నన్నుఁ బనుపుం డిష్టం। బేయది దానిని దెత్తున। జేయుఁడనై యమరవరులఁ జేకొని మై ...న్ ✻ వ॥ అనిన నయ్యురగులు గరుడున కిట్లనిరి ✻ చ॥ అమితపరాక్రమంబును రయంబును లావును గల్గు ఖేచరో। త్తముఁడవు నీ ...దయిన దాస్యము వాపికొనంగ నీకుఁ జి। త్తము గలదేని భూరిభుజదర్పము శక్తియు నేర్పడంగ మా। కమృతము దెచ్చియిమ్మనిన నవ్విహగేంద్రుఁడు సంతసంబునన్

—✻ గరుత్మంతుఁ డమృతంబు దెచ్చుటకుఁ దల్లి యనుమతి గొనుట ✻—

✻ వ॥ అట్ల చేయుదు నే నమృతంబు దెచ్చి మీ కిచ్చి యేనును దల్లియు మీ దాసత్వంబువలన విముక్తుల మగువారమని నొడివి తద్వృత్తాంతం బంతయుఁ దల్లికిం జెప్పి యమృతహరణార్థం బరిగెదనని మ్రొక్కినఁ సంతసిల్లి కొడుకుం గౌఁగిలించుకొని ✻ చ॥ అనిలుఁడు పక్షయుగ్మ మమృతాంశుఁడు వీపనలుండు మస్తకం। బినుఁడు సమస్తదేహమును నెప్పుడుఁ గాచుచు నీకభీష్టము। ల్లనముగఁ జేయుచుండెడు జగన్నుతయున్న శ్రియుక్ జయంబుఁ జే। కొనుమని యిచ్చె దీవనలు గోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్ ✻ వ॥ గరుడుండు దల్లి దీవనలు గైకొని గమనోన్ముఖుండై యమృతంబు దెచ్చునప్పుడు నాకు లావు గలుగవలయు నాహారం బుపదేశింపుండని నవినత యిట్లనియె ✻ క॥ విషనిధికుక్షి ననసంఖ్యాకము। నిషాదగణముండి ధారుణీప్రజకుఁ గడున్। విషమమును జేయుదానిని। మిషమున భక్షించి చనుమమిత్రవిఘాతీ ✻ వ॥ భక్షణవిషయంబులందు బ్రాహ్మణునిం బరిహరింపుమనిన గరుడుండు నాకు బ్రాహ్మణు నెఱుంగు తెఱంగెఱింగింపుమనిన వినత యిట్లనియె ✻ క॥ రయమున మ్రింగుడు గాలము। క్రియ నెవ్వఁడు గంఠబిలము క్రిందికిఁ జనక। గ్నియుఁ బోలె లోఁ దపించును। భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణకులుఁ గాన్ ✻ తే॥ కోపితుండైన విప్రుండు ఘోరశస్త్ర। మగు మహావిషమగు నగ్నియగు నతండు। నర్చితుండైన జనులకు నభిమతార్థ। సిద్ధికరుఁడగు గురుఁడగుఁ జేయుఁ బ్రీతి ✻ వ॥ అని బ్రాహ్మణస్వరూపంబుఁ జెప్పిన విని యెఱింగి వినత వీడ్కొని గరుడుం డతిత్వరితగతిం బఱచి సముద్రోపకంఠంబున నున్న నిషాదుల ననేకసహస్రసంఖ్యలవారిం బాతాళవివరంబునుం బోని తన కంఠబిలంబుఁ దెఱచి యందఱ నొక్క పెట్టున మ్రింగిన నందొక్క విప్రుండు ...ండి పుత్త్రక కుడిగక నిప్పునుం బోలె నేర్చుచున్న నెఱింగి నా కంఠబిలంబున విప్రుండున్నవాఁడేని వెలువడి వచ్చున...డియనిన గరుడున కవ్విప్రుం డిట్లనియె ✻ ఉ॥ విప్రుఁడ నున్నవాఁడ నపవిత్రనిషాదిమదీయభార్య కీ। ర్తిప్రియ దీనిఁ బెట్టి చనుదెంచుట యుక్తమె నాకు నావునన్। విప్రులఁ బొందియున్న యపవిత్రులుఁ బూజ్యులు గారె కావునన్। విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్ ✻ వ॥ అనిన నాగరుడుని యనుమతంబున బ్రాహ్మణుండు నిషాదీసహితుండై వెలువడి

వచ్చిగరుడునిదీవించియతఁడిచ్ఛంజనియెగరుడుండుగగనంబునఁబఱచికశ్యపుంగనినమస్కరించి జననీదాస్యనిరా
కరణార్థంబురగులకమృతంబుఁదేరనరిగెదనిపాదఘాతంబుననాఁకలిపోవకున్నయది నాకాహారంబుఁబ్రసాదింపుమనినఁగొ
డుకకుమెచ్చికశ్యపప్రజాపతియిట్లనియె॥ క॥అనలనిభుండువిభావసుఁ।డనువిప్రుఁడునియమవంతుఁడర్థాఢ్యుండై।సు
ఖమున్ననాతని।యనుజుండగుసుప్రతీకుఁడను వాఁడతనిన్ ॥ క॥మనపితృవర్గముపడసిన।ధనమువిభాగించియిమ్ముధ
నాఁకనివానినడుగఁబోయిన।ననుజునకువిభావసుండహంకారమునన్ ॥ క॥తానలిగియిచ్చెశాపం।బేనుఁగవైయు
నిసహింపకవాఁడున్।మానుగఁగూర్మమవగుమని।వానికిఁబ్రతిశాపమిచ్చెవసులోభమునన్ ॥ వ॥ ఇట్లిన్నయుండన్న
సునన్యోన్యశాపంబులంజేసి యోజనత్రయోత్సేధముగలిగిదశయోజనవిస్తీర్ణంబైనకూర్మంబును షడ్యోజనో
బుగలిగిద్వాదశయోజనవిస్తృతంబైనగజంబునునైసరోవరవిపినంబులనుండియర్థనిమిత్తంబైనపూర్వవైరంబు
మలోనిత్యంబునొండొంటితోడంబెనంగి పోరుచుండునవినీకాహారంబుసుమ్మరుగుముకార్యసిద్ధియయ్యెడు
డుండునుమనోవేగంబునంబఱచియారెంటినింగాంచి॥ క॥చఱచియొకచేతఁగూర్మముఁ।బెఱచేతగజంబుఁబట్టి
గేంద్రుఁ।డిఱికికొనిగగనవీథిం।బఱచెవియచ్చరవిమానపఙ్క్తులుదూలన్ ॥ క॥కనకప్రతతీవితతులు।పెనఁగిన
రుహములఁబెద్దయుబెడగై । తనరినయలంబతీర్థం।బునకరిగెనగంబులొక్కమొగిగ్రక్కదలన్ ॥ వ॥ అం
ణంబనుపాదపోత్తమంబుగరుడునింగనిసంభావించిశతయోజనాయతంబైన మదీయశాఖపైనుండియిగ్గజకచ్ఛ
లభక్షించిపొమ్మనినగరుడుండమ్మహాశాఖపైనూఁదనమకట్టియందు ॥ క॥ పాదంబులువెట్టుడుఁడు।త్పాదపఘనశా

——*గరుత్మంతుఁడుగజకచ్ఛపంబులంగొనికశ్యపునొద్దకుఁబోవుట.*——

ఱిగిభల్లననుచ్చె।ర్నాదమునదిక్కులద్రువఁగ।ఖేదిల్లెవిహంగతతులుభీతింబఱవన్ ॥ వ॥ అమ్మహాశాఖనవలంబి
లక్రిందైయానిత్యకిరణంబులుదమకాహారంబులుగాఁ దపంబుసేయుచున్నవాలఖిల్యమహామునిగణంబులంజూచి
భూమిపయింబడిననిమ్మునులకుబాధయగుననిదానిగఱచికొనిగజకచ్ఛపంబులంగరంబులనిఱికికొనిగరుడుండుగ
బునంబఱచితనకునూఁదనిమ్మగుప్రదేశంబెందునుగానకగంధమాదనంబునకుంజనియందుఁదపంబుఁజేయుచున్న
పుంగనిమ్రొక్కినంగశ్యపప్రజాపతియును॥ చ॥కనకమహీధరప్రతిమకాయుమహాజవనిర్జితత్రిభం।జనునవిచింత్య
ఱిభుజసత్త్వసమన్వితదీప్తమహత్త్వవా। మనసమువైనతేయునిఁదపాస్యగతద్రుమశాఖనున్నయ।య్యనఘులవా
లనునమ్మునినాథుఁడుసూచెనెమ్మితోన్ ॥ వ॥ఇగ్గరుడుండుభువనహితమహారంభుండు బలసమన్వితుండు
గుననియుత్తరుశాఖవిడువనేరకున్నవాఁడువీనింగరుణించిమీరొండుకడకరుగుండనినవాలఖిల్యులుకశ్యపుప్రార్థనం
నంజేసిదానివిడిచిహిమవంతంబునకుంజనిరిగరుడుండునుముఖనిక్షిప్తశాఖాస్ఖలితవచనుండగుచుఁదండ్రికిట్లనియె
ధరణీసురవిరహితమగు।నరణ్యదేశంబునాకునానతియిండి। త్తరుశాఖవిడువవలయును। గరమునిరోధమిదియని
పుఁడనియెన్ ॥ క॥హిమశైలకందరాభా।గముకడనిప్పురుషనగముగలదచ్చోనీ।ద్రుమశాఖవిడువుమదిదా।సమ
గమ్యమీశ్వరాదులకైనన్ ॥ వ॥అదియిచ్చటికిలక్షయోజనంబులుగలదరుగుమనినగరుడుండునుమనోవేగంబున
యానిప్పురుషనగంబునందత్తరుశాఖవిడిచి హిమవంతంబుమీఁదికింబోయిగజకచ్ఛపంబులభక్షించిమహాసత్త్వ
న్నుండైనాకలోకంబునకెగయసమకట్టిపక్షవిక్షేపంబుఁజేసిన ॥ క॥ ఘనపక్షానిలచలితా।వనిరుహములవలన
గురుపుష్పచయం।బనిమిషజయార్థసురిగెడు।వినతాసుతుమీఁదఁబుష్పవృష్టింబోలెన్ ॥ వ॥ అట్లమృతహరణో
గరుడుండుగగనంబునకెగసిననటదేవలోకంబునందు ॥ మాలినీవృత్తము॥సురపతిసభఁజూడంజూడనంగారవృష్టిన
సెఁగులిశధారల్గుంఠితంబయ్యెదిక్కుం। జరమదములడంగెన్సర్వదిక్పాలకాంతర్గ।కరణములుభయోద్వేగంబులం
చలించెన్ ॥ వ॥ ఇట్టిమహోత్పాతంబులుపుట్టినసురపతిబృహస్పతింజూచియిదియేమినిమిత్తంబనియడిగినదే
యునెఱింగిబృహస్పతిసురపతికిట్లనియె॥ సీ॥బ్రహ్మణ్యుఁడగుకశ్యపబ్రహ్మవరమునవినతకుఁబుట్టినయనఘమూర్తి
య్యులదయవరపక్షికులమునకింద్రుఁడై పరఁగినయుద్ధతేజుఁ। [illegible] యత్యుగ్రనిషాదులనారంగమ్రింగి

వీరుఁ। డిభకచ్ఛపములరోహిణశాఖతో నెత్తికొని దివిఁ బఱచిన యనిలవేగి- తే॥ వీఁగి తనతల్లి దాస్యంబు నీఁగఁ బూని। తడయ కమృతంబు గొనిపోవఁ గడఁగి వచ్చెఁ। గామరూపసంపన్నుండు గామగమనుఁ। డతఁడు నీకును సాధ్యుండు శతముఖుండ * వ॥ అగ్గరుడుని మాహాత్మ్యంబు నీవును నెఱుంగు దెల్లనినఁ గశ్యపప్రజాపతి పుత్త్రార్థి యై భవత్ప్రభృతులను మహామునిగణంబులను దనకు సహాయులనుగాఁ బడసి పుత్త్రకామేష్టి సేయునాఁడు నీవు నీ బలంబునకుం దగిన యిధ్మభారంబు మోచికొనియును శ్రమంబున వచ్చిన వాఁడవై యల్పకుశపలాశేధ్మభారంబులు మోచికొని వడవడవడంకుచు వచ్చు వారి నల్పసత్త్వుల నంగుష్ఠప్రమాణదేహుల ననవరతోపవాసకృశీభూతశరీరుల వాలఖిల్యమహామునులం జూచి నగిన నమ్మునులు సిగ్గనడికడు నలిగి * క॥ గణవిజయుఁ డనలతేజుం। డణిమాదిగుణాఢ్యుఁ డుదితుఁ డయ్యెడు వీరా। గ్రణి శతమఖుకంటెను శత। గుణవీర్యుం డయిన పుత్త్రకుండ జితుండై * వ॥ వాఁడు రెండవ యింద్రుం డయ్యెడు మని మహావీర్యవంతంబులైన మంత్రంబుల వేల్చుచున్నంత నంతయు నెఱింగి నీవు కశ్యపు పాలికిం బోయి నాకుం గరుణింపుండని వానిం బ్రార్థించినఁ గశ్యపప్రజాపతి యమ్మునుల కిట్లనియె * ఉ॥ ఉండు నితండు పద్మజు వియోగమునం ద్రిజగంబులందు నింద్రుండయి భూతరాశిఁ దనదోర్బలశక్తిఁ గడంగి కాచుచుఁ। రెండవ యింద్రుఁడైన విపరీతము గున్నుభువనప్రవృత్తి మీ। రొండు విధంబు సేయుటిది యుక్తమె బ్రహ్మ నియుక్తి యుండఁగన్ * వ॥ మీవచనం బమోఘంబు గావున నింక నాకును బుట్టువిల్లెడు పుత్త్రుండు పక్షికులంబున కెల్ల నింద్రుం డయ్యెడు మని కశ్యపుండు వారల నొడంబఱిచి నీ యింద్రత్వంబె కాధిష్ఠితంబు సేసె నట్టి కశ్యపప్రజాపతియను మహిమను వాలఖిల్యుల తపోమహిమను వినతకుం బుట్టి విహగేంద్రుడైన యగ్గరుడుం డిప్పు డమృతహరణార్థంబరుగుదెంచుటం జేసి స్వర్గలోకంబున మహోత్పాతంబులు పుట్టెనని సురపతికి బృహస్పతి సెప్పిన విని యింద్రుం డమృతరక్షుల నెల్ల రావించి మీర లతిప్రయత్నంబున నమృతంబు రక్షించుకొని యుండుండని పంచిన వల్లె యని * క॥ వారలు బహుప్రకారా। కారులు వీరులు నిశాతఖడ్గాదిమహో। దారుణశస్త్రధరులు కృ। ష్ణారుణసితపీతఘనతరాంగత్రాణుల్ * క॥ సనుకట్టి మొక్కలమొగిన। ప్రమాదులై నిలిచి రేయుఁ బవలు నురక్షా। క్షములై యమృతము చుట్టును। నమేయబలు లుండి రంత నతిరభసమునన్ * మ॥ వితతోల్కాశనిపుంజ మొక్కొ యనఁగా విస్ఫీత నిక్షిప్తప। క్షతివాతాహతిఁ దూలి తూలశకలాకా

—— *గరుఁడమృతరక్షకులతో యుద్ధము చేయుట.* ——

రంబులై వారిద। ప్రతతుల్ స్రుల్పడినల్ల డం జెదరఁగాఁ బాఱెన్మనోవేగుఁడై। పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలుర్భయం బందఁగన్ * వ॥ అంత * క॥ కల్పాంతానలకీలా। కల్పాయతపక్షుఁ బక్షిఘననిభశౌర్యా। కల్పుఁ గని యమృతరక్షుల। నల్పక్రోధులయి తాఁకి గార్చికడంకన్ * క॥ తడఁబడ నేసియు వైచియుఁ। బొడిచియు వివిధాస్త్రశస్త్రముల నుద్ధతులై। కడుకొని యుద్ధము సేసిరి। కడిమి మెయిన్ విబుధవరులు గరుడునితోడన్ * వ॥ గరుడుండును నిజపక్షవిక్షిప్తరజోవృష్టి నమరవరుల దృష్టిపథంబు గప్పి స్వర్గలోకంబు నిరవలోకంబుగాఁ జేసిన నమరేంద్రు పనుపునఁ బవనుండా రజోవృష్టి చెదరవీచెనంత * మాలినీవృత్తము॥ పరశుకులిశకుంతప్రాసబాణాసనోద్య। త్పరిఘకణయచక్రప్రస్ఫురద్బాహుసేనా। పరివృతుఁడయి తాఁకెన్ భౌవనుం డన్మహాకిం। కరుఁడు సమరకేళీగర్వితున్ వైనతేయున్ * క॥ బలవత్పక్షగేంద్రకోపా। నలభస్మీభూతుఁడై క్షణంబున వాఁడున్। బలమఱి క్రాఁగెను దగ్ర। జ్వలనజ్వాలావలీఢశలభము వోలెన్ * సీ॥ పక్షతుండాగ్రనఖక్షతదేహులై భోరన నవరక్తధారలొలుక। విహగేంద్రునకు నోడి నిహతులై సురవరుల్ సురరాజు మఱువు సొచ్చిరి కడంగి। సాధ్యులనాయాససాధ్యులై పాఱి రిపూర్వాభిముఖులయి గర్వముడిగి। వసువులు రుద్రులు వసుహీనవిప్రుల క్రియ దక్షిణాశ్రితులయిరి భీతి – ఆ॥ నొంది యపరదిక్కుఁ బొందిరాదిత్యులు। శ్వినులును త్తరమునకొనరఁ బఱచి। రనలవరుణపవనధనదయమాసురుల్ వీఁకదఱిగి కాందిశీకులయిరి * క॥ తలరఁగ రేణుకకదన। ప్రలిహప్రరుజాశ్వకృంతపవనఖులనుప। క్షులఁ గులిశనిశాతనఖావలిఁ బక్షీంద్రుండు వ్రచ్చి వండఱులాడెన్ * వ॥ ఇట్లు నిర్జరవరుల నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడుం డమృతస్థానంబున కరిగి దానిం బరివేష్టించి ఘోరసమీరప్రేరితంబై దుర్వారశిఖాజిహ్వల నంబరంబు నాస్వాదించుచున్న త్రిక్న యనలనుం బుంగని తత్క్షణంబ సకలనదీజలంబుల నెల్ల ... యయ్యనలంబు నాఱఁజల్లి తీక్ష్ణధారంబై

దేవనిర్మితంబై పరిభ్రమించుచున్నయంత్రచక్రంబునరాంతరంబునసంక్షిప్తదేహుండై చొచ్చియచ్చక్రంబుక్రిం
ఉ॥ ఘోరవికారసన్నిహితకోపముఖంబులుదీప్తవిద్యుదు । ల్కారుణదారుణాక్షములునై నిజదృష్టివిషాగ్నినన్యు
రంగనీకయేర్చుచుంబ్రసిద్ధముగానమృతంబుచుట్టురన్।ఘోరతినున్నయుగ్రభుజగంబులరెంటినిగాంచిచెచ్చెరన్ *
య్యురగంబులందనపక్షరజోవృష్టినంధంబులంజేసి వానిశిరంబులుద్రొక్కి పరాక్రమమెసంగనమృతంబుగొనిగ
డుగగనంబునకెగసి * క॥ కలహముననిట్లుసురవీ । రులఁబల్వురనోర్చి యొక్కరుండయమృతముం దె।క్కలిక్
స్వాదింపక।యలోలుఁడగువానిఁజూచిహరియిట్లనియెన్ * క॥ నీవిజయోత్సాహమునకు।లావునకుజవంబునకున
మునకుస। ద్భావమునకుమెచ్చివరం।బీవచ్చితి వేఁడు మెచ్చి యిష్టమునీకున్ * వ॥అనిప్రసన్నుండై యానతిచ్చినయ
పుండగుశ్రీమన్నారాయణునకునమస్కరించిగరుడుండిట్లనియె*సీ॥అమృతాశనంబు సేయక యును దేవ నాకజ
రత్వంబునందుటయును।నఖిలలోకంబులకగ్రణివైననీయగ్రంబునందునిన్నధికభక్తిఁ। గొలుచుచునునికియుఁగో
రుణతోడయ సేయుమున్నతదైత్యభేది।యనవుడువానికినభిమతంబులుప్రీతుఁడై యిచ్చిహరి యిష్టులనియెనాకు
ఘువాహనంబవై మహోధ్వజమవై ।యుండుమనినఁబక్షియును బ్రసాద।మనుచుమ్రొక్కిపఱచెనంత నాతనిమీఁ
త్తివై చెవాసవుండు*వ॥అదియునునంబరంబుననగ్నికణంబులుచెదరంబఱతెంచిపక్షిరాజుపక్షంబులుదాఁకవచ్చి
చిగరుడుండునగినీచేయు వేదననన్నుందాకనోపమనీవుమహామునిసంభవంబవగుటను దేవేంద్రునాయుధంబవగు
న్నునవమానింపరాదుగావునమదీయైకపర్ణశకలచ్ఛేదంబు సేయుము నాయందు నీశక్తియింతియయనినసకలభూ
ఘంబెల్ల నాతనిపర్ణంబులసుస్థిరత్వంబునకుమెచ్చి సుపర్ణుండనిపొగడిరిసురేంద్రుండునువ్విహగేంద్రమాహా

—*ఇంద్రుఁడుగరుడునిప్రభావంబునకుమెచ్చి స్నేహించుట*—

బునకుమెచ్చియచ్చెరువందియిట్లనియె*ఆ॥నిరుపమానశౌర్యనీతోడఁజెలిమిసే।యంగనాకభీష్టమైనయదియు।నిట్టి
మంబునిట్టిసామర్థ్యంబుఁ।గలదెయొరులకిజ్జగంబునందు*క॥అమరుఁడవజరుఁడవజితుఁడ।వమేయుఁడవునీకునమృత
యేలఖగో।త్తమదీనినొరులకిచ్చిన।నమరులకునువారసాధ్యులగుదురుపోరన్ * క॥ నీవొరులకునీయమృతము।నీర్చి
దునాకుమఱలనిచ్చిననీకి ।స్తోవాప్తియగువిధంబేఁ। గావించెదననినహరికిగరుడుండనియెన్ * వ॥ ఏనుమదీయమా
దాసీత్వనిరాసార్థంబమృతంబుదెచ్చియిత్తుననికాద్రవేయులతోనొడివివచ్చినవాఁడ నీయమృతంబుగొనిపోయినా
కిచ్చిమదీయజననీదాస్యంబువాపికొనినసురగులీయమృతంబుపయోగింపకుండ ముందరనీవుగొనిచనుమనినన్గరు
మహానుభావంబునకుమెచ్చినీబలపరాక్రమంబులువినవలతుంజెప్పుమనిననయ్యింద్రునకుగరుడుండిట్లనియె * క ।
నిందయునాత్మగుణో।త్కరపరికీర్తనముంజేయఁగానుచితమెస । త్పురుషులకైననునీక।చ్చెరువుగనాకలతెఱంగు
ప్పెదఁబ్రీతిన్*ఉ॥స్థావరజంగమప్రవితతంబగుభూవలయంబునెల్లనా । లావునఁబూనితాల్తునవిలంఘ్యపయోధి
బులెల్లర । త్నావళితోనచల్లుదుబృహన్నిజపక్షసమీరణంబునన్ । దేవగణేశ యీక్షణమత్రిప్పురివత్తుఁద్రిప్పి
లన్ * వ॥అనిచెప్పినగరుడునిజవసత్త్వసామర్థ్యంబులకుమెచ్చిసంతసిల్లినాతోడనెప్పుడుబద్ధసఖ్యుండవై
యుననివేఁడియుదేవేంద్రుండుగరుడునకిట్లనియె * క ॥నాకభిమతమొనరించిన।నీకిష్టముసెప్పికొనుమనినదు
మాకిట్లహితముచేసిన। యాకద్రువపుత్త్రులశనమయ్యెడునాకున్ * క ॥ భవదభిరక్ష్యములగుసీ।భువనంబుల
సర్పములుద్రిప్పరుటన్ । దివిజాధిపనీకేటికిఁగిం। పవలసెనీయాజ్ఞ నాకుఁబడయఁగవలసెన్ * వ॥అనిగరుడుండు
నురగభోజనత్వంబుసురపతిచేత వరంబువడసి తదనుగమ్యమానుండై యురగులయొద్దకువచ్చిమరకతహరిత
శాస్తరణంబుననమృతకలశంబునిలిపి యురగులంజూచియిట్లనియె * క ॥ అనిమిషనాథసుగుప్తమ। యినయ
తెచ్చిమీకునిచ్చితినస్మ । జ్జననీదాస్యమువాసెను । దినకరపవనాగ్నితుహినదీప్తులుకరిగాన్ * వ ॥ మీరలు
లంకృతులరైవచ్చి దీనినుపయోగింపుండనిపంచి తల్లిందనవీపెక్కించుకొని విహగేంద్రుండురగులకదృశ్యుం
న్నసురేంద్రు వీఁడొనిచనియెనంతనురగులును నమృతోపయోగ కుతూహలంబున నొండొరులం గడవఁ గృత

లంకృతులై చనుదెంచుటకు ముందర * క ॥ అమరాధిపుఁడమృతముఁగొని।యమరావతికరిగితొంటియట్లసుఖస్థా।న
మునవిచలితరక్షా।క్షముఁడై రక్షించుకొనిసుఖస్థితినుండెన్ * వ ॥ ఉరగులునిటనమృతం బుపయోగింపం గానక
దానియున్నస్థానంబని దర్భలునాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటంజేసి నాఁటంగోలె ద్విజిహ్వులునాఁ బరఁగిరి
యమృతస్థితింజేసి దర్భలుపవిత్రంబులయ్యె * క ॥ ఈసౌపర్ణాఖ్యానము । భాసురముగవినినపుణ్యపరులకునధిక।శ్రీ
సంపదలగుదురితని । రాసంబగుఁబాయునురగరక్షోభయముల్ * వ ॥ ఇట్లురగులమృతంబుపయోగింపంగానకచని
నశేషుండుతల్లియుందమ్ములుఁజేసినయధర్మంబునకునిర్వేదించి వారలవిడిచికడునిష్ఠతోఁగంధమాదనబదరీతపోవనగోక
ర్ణపుష్కరారణ్యహిమవంతంబు లాదిగాఁగల పుణ్యస్థానంబులం దనేక శతసహస్రవర్షంబులు బ్రహ్మనుద్దేశించిత

—*బ్రహ్మయనుజ్ఞవలన శేషుఁడుభూభారంబుదాల్చుట.*—

పంబుచేసినబ్రహ్మయుఁబ్రత్యక్షంబై వరంబు వేఁడుమనిన శేషుండిట్లనియె * సీ॥తల్లియునాసహోదరులునుమూర్ఖ
లైధర్మువునుచితంబుఁదప్పివినత । కావైనతేయునకపకారములుచేసిరిప్పుడువారిసహింపకెగ్గు। సేయుదురేనుబాసితి
వారితోడిపొత్తొల్లఁదపంబుసేయుచుశరీర । భారంబువిడిచెదఁబరమేష్ఠియనవుడు నాతనిసమబుద్ధికజుఁడుమెచ్చి-ఆ॥
నిత్యసత్యధర్మనిరతుండవఖిలంబు। దాల్పనోపునట్టిధైర్యయుతుఁడ ।విదియనన్యవిషయమిమ్మహీభారంబు। నీవతాల్ప
వలయునెమ్మితోడ * చ ॥ వినతకునాత్మజుండయినవీరుఁడుకశ్యపవాలఖిల్యస । న్మునులవరంబుగన్నఖగముఖ్యుఁడు
వాసవునోర్చియున్నస।ద్వినుతబలుండుగావునవివేకమునన్వినతాతనూజుతో । ఘనముగఁజెల్మిఁజేయుమిదికార్యము
నీకుభుజంగమేశ్వరా * వ ॥ అనిబ్రహ్మనియోగించినశేషుండశేషమహీభారంబుదాల్చి గరుడునితో బద్ధసఖ్యుండై
యుండెనిటవాసుకియుం దల్లిశాపంబునజనమేజయు సర్పయాగంబునందయ్యెడుసర్పకులప్రళయంబునకు వెఱచి తన
నిట్టికష్టశపులనై రావతాది సహోదరులనురావించి విషణ్ణహృదయుండై యిట్లనియె * చ॥చిరముగబ్రహ్మకుండపము
సృతసంసేయనంతుఁడనంతధారుణీ।భరగురుకార్యశక్తుఁడయిపన్నగముఖ్యులపొత్తుఁబాసిచె।చ్చెరఁజనయంతనుండిమదిఁజే
యు।నీర్చితలంపుఁడయొక్కనాఁడుదు । ర్భరతరదండశూకములశావిభయప్రతిఘాతకృత్యముల్ * వ॥ మఱియమృతమథ
నంబునాఁడుమందరమహానగంబునకు వేత్రంబనయిన నాక్లేశంబునకుమెచ్చియమరులెల్లఁబితామహుం బ్రార్థించినా
కునవ్యయత్వంబును సకలభయమోక్షణంబునుగా వరంబిచ్చిరైననుజననీశాపభయంబుననురగప్రళయంబగుటకుమ
నోదుఃఖంబు దుస్సహంబైయుండు దానినుడిగించు నుపాయంబెద్దియేమిచేయువారమని చింతించుచున్నయన్నాగ
రాజునకునాగకుమారులత్యుద్ధతులైయిట్లనిరి* సీ॥జనమేజయుఁడుసేయుసర్పయాగమునకువిఘ్నమొండజముగావిం
తమతఁడు । ధర్మార్థిగావునధారుణీసురులమైయడుగుదమీక్రతువుడుగుమనియుఁ।గొందఱమతనికిఁగూర్చుమంత్రుల
మునైయీక్రతుక్రియఁజేసియిహపరములకగుఁబెక్కుదోషంబులనిహేతువులుసూపియుడిగింతమందఱమొక్కమొ
గిన - ఆ ॥భక్ష్యభోజ్యలేహ్యపానీయములమీఁద। సదములోనివిప్రజనులమీఁద। వెగడుపడఁగఁబాఱివెఱపింతమొజ్జలు।క
తృవిధియోగవిధులుదప్పిపఱవ * వ॥అనినవారలలోఁగొందఱుబుద్ధిమంతులయినభుజంగముఖ్యులిట్లనిరి* క॥ఇవిమీకన్ని
యుఁజేయఁగ। నవునితలఁపకుఁడుభూసురావలిమంత్రో।ద్భవదారుణదహనశిఖ।ల్గవిసిననెద్దియునుజేయఁగానెడగల
దే * వ॥అనిననాగరాజానుజుండైనయేలాపుత్రుండిట్లనియె ॥ ఆ॥ శాపమిచ్చునాఁడుజననియుత్సంగంబు।నందునిద్ర
వోయినట్లయుండి। యమరవరులకజునకైనయన్యోన్యసం। భాషణంబులెఱుకపడఁగవింటి * వ॥ అప్పలుకులుసెప్పెద
వినుండుశాపానంతరంబుననమరులెల్లనజునకిట్లనిరయ్యాకద్రువయిట్టియనంతబలవీర్యసంపన్నులయినకొడుకులంబడ
సికడునిర్దయురాలై వారికకారణంబైనదారుణశాపంబిచ్చెమీరునువారింపక యుపేక్షించితిరి దీనికింబ్రతీకారంబొం
డెద్దిగలదేయనిననమరులకుఁగమలసంభవుండిట్లనియె*క॥క్రూరాకారులజగదప। కారులఁబన్నగులఁదాల్పఁగానోపని
యి।ద్ధారుణికిహితంబుగదు।ష్టోరగసంహారమిప్పుడొడఁబడవలసెన్ *వ॥మఱియుసకలలోకహితాచారులైననాగము
ఖ్యులనెల్లవాసుకిచెలియలైనజరత్కారువునకుజరత్కారుండనుమహామునికింబుట్టెడువాఁడధిక తేజస్వి యస్తీకుండ

నమహామునిజనమేజయసమారబ్ధసర్పప్రళయంబువలనరక్షించునని పితామహుండు దేవతలకుం జెప్పిన తెఱంగు
జెప్పినవాసుకిప్రముఖనాగముఖ్యులెల్ల సంతసిల్లియేలాపుత్త్రు నెత్తుకొనిసాధువాదంబులనభినందించిరి వాసుకియునా
గోలెజరత్కారుమునీంద్రుం డెన్నఁడుదారపరిగ్రహంబు సేయునో యనితత్సమయంబ పేక్షించియుండునంత* క॥
ఘుతపోనిధియాయాయావరవంశోత్తముఁడునియమవంతుఁడులోకో। త్తరుఁడుజరత్కారుఁడునాఁ। బరఁగినముని బ్రహ్మచ
ర్యపరిపాలకుఁడై * క॥ ఘోరవ్రతములుసలుపుచు । దారపరిగ్రహము సేయఁదానొల్లకసం। సారపునర్భవభీతిన। వ్యా
వ్యాపారమోహపాశచ్యుతుఁడై * వ॥ తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యంబులం జేసిఋషులఋణంబులనీఁగుచుఁ
భ్రమించువాఁడు వనంబులోనొక్కపల్వలంబుగనియందు మూషికవిలూనంబయియొక్కమూలంబతక్కయున్న వీ
రణస్తంబంబు నవలంబించి తలక్రిందైయాదిత్యకిరణంబులాహారంబుగా వ్రేలుచున్నఋషులం గొందఱం జూచి
యంబోయిజరత్కారుండట్లనియె* క॥ కడునుగ్రముదలక్రిందుగఁ। బడియుండుటయదియునొకతపంబా కొనాకే। ర్పడ
జెప్పుఁడీతపంబే। దొడఁగెదననవుడునుసయ్యధోముఖవిప్రుల్ * క॥ అనఘుయిదియేటితపమే। మసుపమదుర్గఖుతులఁ
గుటనాధారములే। కనుసంతానోచ్ఛేదం। బున వ్రేలెదమధమలోకముల తెరువుచనన్ * వ॥ మంద భాగ్యులమయి
మావంశంబునజరత్కారుండనుపాపకర్ముండుపుట్టిదారపరిగ్రహము సేయనుసంతానంబువడయనొల్లకున్నవాఁడే
మాతని పితృపితామహులముమాపట్టిన యవురుగంట వ్రేళ్లెల్లంగాలుండుమూషికవ్యాజంబు నందరతరంబకాలుకీని
నొక్కవేరతక్కయున్నయదియదియును జరత్కారుండనపత్యుండైనం డెగు మేమధఃపాతులమగుదు మాతండపత్యం
బువడసెనేనియూర్ధ్వగతులమగుదుము॥ తే॥ నీవుమాచుట్టమవపోలె నెమ్మితోడ। నవహితుఁడవయిమాపల్కులాదరిం
చియాజరత్కారుఁగని చెప్పుమయ్యవాని। నెఱుఁగు దేనిమాపడియెడునీయవస్థ * వ॥ అనినవినిజరత్కారుఁడతికారుణ్యచి
త్తుండైయపత్యార్థంబవశ్యంబువివాహంబుగావలయుననియెంతయుం బ్రొద్దుచింతించితనపితృవర్గంబునకిట్లనియె* క॥
మీరలునాపితృదేవత। లారాధ్యులరేనుమీకునాత్మజుఁడజర। త్కారుఁడనువాఁడముందర। దారపరిగ్రహము సేయఁదగు
లదుబుద్ధిన్ * క॥ మిమ్మిట్లుచూచిమీకుహి। తమ్మెట్లగునట్లుగామదంబునదారా। ర్థమ్ముప్రవర్తింపఁగఁజి । త్తమ్మిప్పుడు
నాకుఁబుట్టెధర్మస్థితిమై * వ॥ అనినవినియమ్మహామునులు జరత్కారుపల్కులకుసంతసిల్లియిట్లనిరి* చ॥ తగినసుపు
త్త్రులంబడసి ధర్మువుదప్పకతమ్మునుత్తము । ల్గొగడఁగ నమ్మహామతులు వొందుగతుల్గ మ ఘోరనిష్ఠతోఁ । దగిలిత

—*జరత్కారుఁడు తనపితృదేవతలయను మతివివాహంబుచేసికొనఁబూనుట.*—

పంబుచేసియునుదక్షిణలిమ్ముగనిచ్చియజ్ఞము। ల్నెగడఁగఁజేసియుంబడయనేరరపుత్త్రకులైనమర్త్యతుల్ * వ॥ కావుననీవు
కృతదారపరిగ్రహుండవైసంతానంబువడసిమమ్మునూర్ధ్వగతులఁ జేయుమనిన జరత్కారుండట్లనినాకుసనామయ
యినదానివివాహంబుగావలయుననివారికినమస్కరించివీడ్కొని సనామకన్యాన్వేషపరుండై భూవలయంబెల్లఁగల
యఁద్రిమ్మరి * తరువోజ॥ అనవరత వ్రతాయాసఖేదముననతికృశమగు చున్నయంగంబునందుఁ । దనరియేర్పడినర
ల్లధ్వయుముదిసీ తలవడంకుచునుండు తనపితృవరుల । ఘనముగానూర్ధ్వ భిగతులఁగాఁ జేయఁ గడఁగివివాహంబుగా
జరత్కారుఁ। డనఘుండుదనకోర్కికనుకూలమైనయట్టికన్యకఁగానఁడయ్యెమర్త్యమున* వ॥ ఇట్లుజరత్కారుండువివా
హాపేక్షుం బ్రతీక్షించుచున్నవాసుకియుందనచారులవలననంతయునెఱింగినిజసహోదరియైన జరత్కారుందోడ్కొ
నిజరత్కారుమహామునిపాలికింబోయియిట్లనియె * శా॥ ధన్యంబయ్యెభవత్కులంబతికృతార్థంబయ్యెనస్మత్కులం బ
న్యోన్యానుగుణాభిధానములఁజిత్తానందమొందెన్ని వే। కన్యాయాన్వితభూసురోత్తమజరత్కారూ జగన్మాన్యయిక
న్యాభిక్షుఁబరిగ్రహింపుముజరత్కారున్మదీయానుజన్ *వ॥ అనినవినియొడంబడిజరత్కారుండు సనామ యగుటం జేసి
యకన్యక__వాహంబయిప్రథమసమాగమంబునందనధర్మపత్నికిసమయంబు సేసెనాకునీవెన్నఁడేని యవమానం
బుదలం___ మునిన్నుంబాసిపోవుదుననినాఁటంగోలె * క॥ వాలుపయినడచునట్లు। బ్బాలికవడవడవడంకిభయమున
____ గుపతికిఁబవలున్। రేయును నేమ ఱకపరిచరించుచునుండెన్ * క॥ అనవరతభక్తిబాయక। తనపతికిం బ్రి

యముచేసి తద్దయు గర్భంబున రక్తిఁ దాల్చి యొప్పెను దినకరగర్భ యగు పూర్వదిక్సతి వోలెన్ * వ॥ అక్కోమలి యొక్క
నాఁడు తనయూరువు తలయంపిగాఁ గృష్ణాజినాస్తరణంబున నిజనాథుండు నిద్రితుండై యున్న యవసరంబున నాదిత్యుం
డస్తగిరిశిఖరాసన్నుండగుటయు సంధ్యాసమయోచితక్రియలు నిర్వర్తింపఁ దదాశ్రమవాసులైన మును లేగుటం జూచి
యాత్మగతంబున * సీ॥ సంధ్యలందొనరించు సద్విధుల్ గడచిన ధర్మలోపంబగుఁ దడయ నేల। బోధింపవైతని భూసురప్రవరుం
డుపవరునో బోధింపఁబడియవజ్ఞ। తగునె నాకిట్లు నిద్రాభంగమొనరింప ననియల్గునో దీనికల్గె నేని । యలుక నేఁబడుదుఁగా
కగునె ధర్మక్రియాలోపంబు హృదయంబులో సహింప — ఆ॥ ననివినిశ్చితాత్మయయి నిజపతిఁ బ్రబోధించె ముని యనిద్ర
చేఁజెయల్గి। యేల నిద్రఁ జెఱిచి తీవు నావుడు జరత్కారువిట్టులని యెఁగరము వెఱచి * క॥ ఇనుఁ డస్తమింపఁబోయిన నన
ఘా బోధింపవలసె ననవుడు నా మేల్కను నంతకు నుండక యినుఁ డొరఁగ నస్తాద్రి కేగనోడఁడె చెపుమా * వ॥ నీవు నాక
వమానంబు దలంచితివి నీ యొద్ద నుండనొల్లఁ దొల్లి నీకు నా చేసిన సమయంబు నిట్టిది నీ గర్భంబున నున్నవాఁడు సూర్యానలస
మప్రభుండైన పుత్రుం డుభయకులపక్షరక్షణసమర్థుండు సుమ్ము నీవు వగవక నీ యగ్రజునొద్ద నుండు మని జరత్కారువు నా
రార్చి జరత్కారుండు తపోవనంబునకుం జనియె నట జరత్కారువును దన యగ్రజుండైన వాసుకియొద్దకు వచ్చి తద్వృత్తాం
తంబంతయు నెఱింగించి యుండె నంత * క॥ ఆపూర్ణతేజుఁ డపగతపాపుఁ డసాకృతభవానుబంధుండు నిజమాతాపితృపక్ష
ప్రబలభయాపహుఁ డాస్తీకుఁ డుదితుఁడయి పెఱిఁగెఁ బ్రభర్షన్ * తే॥ చ్యవనసుతుఁడైన ప్రమతితోఁ జదివె సకలవేదవేదాంగ
ములు నిజవిమలబుద్ధి। నెఱిఁగె సకలశాస్త్రంబులనెల్ల నెంమ । నధికసాత్త్వికుఁ డాస్తీకుఁ డనఁగ జనులు * వ॥ అట జనమేజ
యుండు తక్షకవిషానలంబునం దన జనకు పంచత్వంబు దంకువలన నెఱింగి మంత్రులం జూచి యిది యేమినిమిత్తంబు దీనిస

—— * జనమేజయునకుఁ బరీక్షితు శాపకారణంబు మంత్రులు చెప్పుట. * ——

స్తరంబుగాఁ జెప్పుండనిన మంత్రు లిట్లనిరి * సీ॥ అభిమన్యునకు విరాటాత్మజయైన యుత్తరకును బుట్టిన యనఘుమా
। కౌరవాన్వయపరిక్షయమున నుదయించి ప్రథఁ బరీక్షితుఁ డనఁ బరఁగువాఁడు । ధర్మార్థకామముల్ దప్పక సలుపు
చుఁ బూని భూప్రజ నెల్లఁ బుణ్యచరిత। ననఘుఁడై రక్షించి యరువదియేఁడులు రాజ్యంబు సేసిన రాజవృషభుఁ — ఆ॥ ధధికధ
ర్మమార్గుఁడైన నీయట్టి సత్పుత్రుఁ బడసియున్న పుణ్యుఁ డన్య । నాథమకుటమణిగణప్రభారంజిత। పాదపంకజుండు భరత
నిభుఁడు * వ॥ భవత్ప్రపితామహుండైన పాండురాజునుంబోలె మృగయాసక్తుండై యొక్కనాఁడు మహాగహనం
బులఁ బెక్కు మృగంబుల నెగచి చంపి తనచేత నేటువడి పాఱిన మృగంబు వెంటందగిలి మహాధనుర్ధరుండై యజ్ఞమృగంబు
పిఱుందం బఱచు రుద్రుండునుంబోలె * పృథ్వీవృత్తము॥ అమిత్రమదభేది యొక్కరుఁడ యమ్మృగాన్వేషణ। భ్రమాకులిత
చిత్తుఁడై తగిలి పాఱుచు న్మందరన్ । శమీకుఁడను వానినొక్క మునిసత్తముఁ గాంచె సంతత। క్షమాదమసమన్వితుం గనియెఁ గాన
నాంతంబునన్ * వ॥ కని మునీంద్రా నా చేత నేటువడిన మృగం బమ్ముతోడ నిటవచ్చె నెక్కడం బోయె నెఱుంగుదేని చెప్పుమ
నిన నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్నం గినిసి తత్సమీపంబున నపగతప్రాణమై పడియున్న పాముం దనవింటి
కొప్పున నెత్తి యమ్ముని యఱుతం దగుల వైచి క్రమ్మఱి హస్తిపురంబునకు వచ్చి యున్నంత — ఆ॥ ఆశమీకు పుత్రుఁ డంబు
జసంభవుఁ గుఱిచి భక్తితోడ ఘోరతపము । సేయుచున్న సుప్రసిద్ధుండు శృంగియన్ । వాఁడు శృంగి సముఁ డవంధ్యకో
పి * క॥ తనజనకున నఱుతఁ బవనాశనశవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షిజ్జనపాలుఁ చను టకృశుఁడను మునివలన నెఱింగి కో
పమూర్ఛాన్వితుఁడై * వ॥ శాపజలంబులెత్తికొని విజనంబైన విపినస్థానంబున విజితేంద్రియుండై మొదవుల చన్నులువ
త్సంబులు గుడుచునప్పు డుద్గతంబగు పయఃఫేనం బాహారంబుగా మానవ్రతంబు సేయుచున్న మహావృద్ధు మదీయజన
కు నవమానించిన పరీక్షితుండు నేఁడు మొదలుగా సప్తదివసంబులలోనఁ దక్షకదష్టుండై యమసదనంబునకరిగెడు మని
శాపంబిచ్చి తండ్రి పాలికిం జని * క॥ ఉరగకళేబర మంసాంతరమునఁ బడి క్రేలుచునికిఁ దలఁపక యును సుస్థిరుఁడై పరమ
ధ్యానోపరతేంద్రియవృత్తి నున్నవానిఁ శమీకున్ * వ॥ కని యయ్యురగకళేబరంబుఁ బాఱవైచి తత్క్షణంబ ప్రబుద్ధనయ
నుండైన తండ్రికభివందనంబు సేసి బాష్పపూరితనయనుండై శృంగి పరీక్షితు నుద్దేశించి తనయిచ్చిన శాపక్రమంబు నె

ప్పినవిని శమీకుండుదుఃఖితుండై యిట్లనియె * క॥ క్రోధముదపముం జెఱుచును। గ్రోధమయణిమాదులయినగుణ
బాపుఁ। గ్రోధమధర్మక్రియలకు। బాధయగుం గ్రోధిగాఁదపస్వికిఁజనునే * క॥ క్షమలేనితపసితపమును। బ్రష్ట
పదయుఁధర్మబాహ్యప్రభురా। జ్యముభిన్నకుంభములతో।యములట్టులయధ్రువంబులగునవియెల్లన్ * వ॥ క్షమ
చినీవుదృష్టాదృష్టవిరుద్ధంబైనక్రోధంబుఁ జేకొనిసకలరక్షకుండైన పరిక్షితుంబరీక్షింపక శాపంబిచ్చితివి చెట్టచేసి
రాజరక్షితులయికాదె మహామును లధికతపంబులు సేయుచు వేదవిహితానుష్ఠానధర్మంబులునడపుచుమహాశ్ర
తులయియున్న వారట్టిరాజుల కపకారంబుదలంచునంతకంటెను మిక్కిలిపాతకంబొండెద్ది మఱిభరతకులపవిత్రు
డైనపరిక్షితు రాజసామాన్యుంగావగచితే * ఉ॥ క్షత్త్రియవంశ్యులై ధరణిఁగావఁగఁబుట్టినవారుబ్రాహ్మణక్షత్త్రియ
వైశ్యశూద్రులనఁగాఁగలజాతులవారలన్ స్వచా। రిత్రముదప్పకుండఁగఁబరిక్షితుకాచినయట్లు రామమాంధా
ఘుక్షితీశులుమున్దంబునఁగాచిరె యేయుగంబునన్ * వ॥ అతఁడు మృగయావ్యసనంబున నపరిమితక్షుత్పిపాసా
తుండై యెఱుంగక నాకవజ్ఞఁ జేసె నేనుదానిసహించితి నమ్మహాత్మునకునీయిచ్చినశాపంబుఁ గ్రమ్మఱింపనేర్తేని
శృంగియిట్లనియె * క॥ అలుక మెయిమున్నపలికితి।నలుక నెనాపలుకుతీక్ష్ణమయియింతమను।జ్జ్వలదహనాకృతి
లరఁగఁద్రేరేప కేలతానెడనుడుగున్ * వ॥ నావచనంబమోఘంబనినశమీకుండుశోకాకులితచిత్తుండై తనశిష్యుఁడై
రముఖుండనువానింబిలిచి దీనినంతయుఁబరిక్షితునకెఱింగించితక్షకువలనిభయంబు దొలంగునట్టియుపాయంబు
కొనుమని చెప్పిరమ్మనినవాఁడునప్పుడపరిక్షితుపాలికిం జనియిట్లనియె * సీ॥ అడవిలోనేకాంతమతిఘోరతపమునై
మాగురులపైనురగశవము। వైచుటవినియల్గి వారితనూజుండుశృంగియన్వాఁడు కార్చిచ్చువంటి। శాపంబునీకిచ్చె
హాములలోననాపరిక్షితుఁడునాయలుకఁజేసి। తక్షకవిషమునదగ్ధుఁడయ్యెడుమని దానికిగురులుసంతాపమంది-ఆ
లేశనస్నుఁబుత్తెంచిరిప్పుడు। తద్భయంబు లెల్లదలఁగునట్టి। మంత్రతంత్రవిధులమర్చియేమఱకుండు।నదినిరంతర
యుఁగఆపి * వ॥ గౌరముఖుండరిగినంబరిక్షితుండుపరిక్షీణహృదయుండయితనచేసినవ్యతిక్రమంబునకుసంతాపించి
కునుపశమనంబునకుమెచ్చి శృంగిశాపంబునకు వెఱచి మంత్రివర్గంబుతో విచారించియాత్మరక్షయందప్రమాదుఁడ
మ॥ సకలోర్వీశుఁడతిప్రయత్నపరుడై సర్వక్రియాదక్షత। క్షకకోట్లుపని సేయఁగాఘనతరైకస్తంభహర్మ్యం
క్షకభీతిన్ రచియింపఁబంచిదృఢరక్షన్ దానిలోనుండెఁబా। యకరాత్రిందివజాగరూకహితభృత్యామాత్యవర్గం
తోన్ * వ॥ మఱియువిషోపసంహారంబులయిమహావీర్యవంతంబులయినమంత్రతంత్రంబులుగలిగియాజ్ఞాసిద్ధులయి
న వైద్యులనొద్దఁబెట్టుకొనిపరిక్షితుఁడున్నంతటఁదక్షకుండు విప్రవచనప్రచోదితుండయిపరిక్షితునొద్దకు నెవ్విధంబు

—*తక్షకుఁడు పరీక్షితుసంజీవితుఁ జేయంబూనుకశ్యపునకుఁ గోరినధనంబిచ్చిమరల్చుట.*—

బోవనగునోయనిచింతించుచుండెనటఁదొల్లి * మధ్యాక్కర॥ ధరణిఁజరాచరభూతసంఘంబుదమవిషవహ్ని।నురగ
లేర్చుచునునికిఁబరమోరుమహాగర్వ్వ।మురగవిషాపేతజీవసంజీవనోపదేశంబు। కరుణఁగశ్యపునకునిచ్చెనఖిలలోకేశ
బుహాంబె * వ॥ అట్టికశ్యపుండనుబ్రహ్మర్షి శృంగిశాపంబునఁబరిక్షితుండుతక్షకదష్టుండగునేఁడుసప్తమదివసంబగు
వానినపేతజీవుసంజీవితుంజేసినావిద్యాబలంబుమెఱయుదుమఱియదియునుంగాక * తే॥ ధరణియెల్లనురక్షించుధ
రిత్రు। నాపరిక్షితురక్షించియతనిచేత। నపరిమితధనప్రాప్తుండనగుదుఁగీర్తి। యనుధనంబునుధర్మువుఁగనుటయరు
వ॥ అనివిచారించిహస్తిపురంబునకుంబోవువానిఁదక్షకుండువృద్ధవిప్రుండయివనంబులో నెదురంగనిమునీంద్రయెందు
బోయెదేమికార్యంబునకనినవానికింగశ్యపుఁడిట్లనియె * క॥ తక్షకుఁడనుపన్నగుఁడు పరిక్షితుఁగఱచునట నేఁడరింద
మనిన్। రక్షింపఁగఁబోయెదశుభ। దక్షతనామంత్రతంత్రదాక్షిణ్యమునన్ * క॥ అనినవినినగుచువాఁడిట్లనియెనుదక్ష
నేనయశనినిపాతంబుననయినబ్రతుకనగుఁగా। కనఘామద్విషనిహతులకగునేబ్రదుకన్ * వ॥ నీమందులుమంత్రం
నాయందునీకుంబనిసేయవుక్రమ్మఱిపొమ్ము కాదేనినీవచూడనివ్వటవృక్షంబుగఱచినావిషానలంబునభస్మంబు
నోపుదేసదీనిసంజీవితంబుఁ జే  హీంద్రవిషమహాశనిదగ్ధమై। విపుల

ర్ణవిటపతతులు గగనమండలంబు గప్పిన యవ్వట తరువు భస్మమయ్యెం దక్షణంబ * వ ॥ కశ్యపుండు నా భస్మచయంబు గూడం ద్రోచి తన మంత్రతంత్రశక్తిం జేసి యెప్పటియట్ల వృక్షంబుం జేసిన నంజూచి తక్షకుండతివిస్మయం బంది మునీంద్రా నీ విద్యాబలంబున నిది సంజీవితం బయ్యెనే నియ్యనతికుపిత విప్రశాపవ్యపగతాయుష్యుండై న పరిక్షిత్తుండు సంజీవితుండుగా నోపండు వాని యిచ్చు ధనంబు కంటె నా యొసంగెడు నధిక ధనంబు గొని పొమ్మనిన గశ్యపుండును దన దివ్యజ్ఞానంబున నట్లకా నె ఱింగి తక్షకు చేతననంతం బైన యర్థంబు గొని క్రమ్మఱిచనియె నిట్లు విజనంబైన విపినాంతరంబుననైన యయ్యిరువుర వృత్తాంతంబు మీ రెట్లెఱింగితి రంటేని వినుము * తే ॥ ఇప్పరంబున బ్రాహ్మణుం డింధనార్థి మేగి మున్న యా వృక్షంబు నెక్కి దాని తోన దగ్ధుండై మఱి దానితోన లబ్ధ జీవుం డయి వచ్చి జనులకుం జెప్పెదీని * వ ॥ అట్లు గశ్యపుం గ్రమ్మఱించి తక్షకుండు తత్క్షణంబ నాగకుమారులం బిలిచి మీరలు విప్రులరయి సురభికుసుమ స్వాదువన్యఫలంబులు పలాశపర్ణపుట్టికలం బెట్టుకొని పరిక్షిత్తు పాలికిం జని యిండని పంచి తానును వారితోడ నయదృశ్యరూపుండయి వచ్చిన * చ ॥ ద్విజవరులం గుమారులనతిప్రియదర్శనులైనవారి బుద్ధి ఋజుపవక్రమంబులు క్రియలు గుణించుచు నచ్చు వారిన గ్గజపురవల్లభుండు గని గ్రక్కున డాయంగఁ బిల్చి మెచ్చి భాజనసుభగుండు సేకొనియె వారలు దెచ్చిన వానినన్నియుః * క ॥ వారలన ర్ఘ్యప్రియసత్కారులఁగాఁ వించి పుచ్చి కాలనియోగ ప్రేరితుండయి యమరేంద్రా కారుఁడు దద్వన్యఫలజిఘత్సాపేతుఁడ * వ ॥ మఱియును * ఉ ॥ సూరెలనున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చు మిత్రులన్ సారబలుండు సూచి ముని శాపదినంబులు నోవు దెంచెనే భోరుహమిత్రుండస్తగిరిఁ బొందెడు నంచు నొగిం దత్ఫలావలుల్ ల్వారల కెల్లఁ బెట్టి యనవద్యుఁడు దానొకపండు చెచ్చెరన్ * క ॥ కొని ప్రచ్ఛన్నుడు లోపలన ల్లని క్రిమియయి తోంచి మఱియులత్తుకవర్ణం । బునం బామై విషవహ్నులు దనుకంగఁ గురువీరుంగఱచి తక్షకుండరిగెన్ * వ ॥ తత్పరిజనంబులందఱు నశనిపాతంబున బెదరి చెదరినట్లు కనుకనిం బఱచిరయ్యేక స్తంభహర్మ్యంబును దక్షకువిషాగ్నిదగ్ధంబయ్యె నట్లు భవజ్జనకుండు పరలోకగతుండైనం బురోహితపురస్సరానేక భూసురవరులు యథావిధిం బరలోకక్రియలు నిర్వర్తించిరంత * క ॥ ఆయుష్మంతుఁడ వయిలక్ష్మీయుత బాల్యంబు నందమీయన్వయరాజ్యాయిత్తమహీభారం బాయతభుజ నీవు తాల్చితభిషిక్తుండవై * ఉ ॥ పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చు చు ధాత్రిఁ బ్రజల్ మంచిత నేకయాగములమానుగ దక్షిణలిచ్చి విప్రులన్ । నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్ సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీ సమానులే * ఉ ॥ కాదన కిట్టి పాటియపకారము దక్షకుఁ డేక విప్రసంబోధనం జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా । పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షు కాదికా । కోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్రశిఖాచయంబులన్ * వ ॥ అనిన జనమేజయుండు కోపోద్దీపితచిత్తుండయి సర్పయాగంబు సేయ సమకట్టి

—*జనమేజయమహారాజు సర్పయాగము చేయుట*—

ట్టి పురోహితులను ఋత్విజులను బిలువం బంచి వారలకిట్లనియె * చ ॥ తన విషవహ్నిమజ్జనకుఁ దక్షకుఁ డెట్లు దహించె నట్ల యే సునుసహమిత్రబాంధవజనుండగు తక్షకు నుగ్రహవ్యవాహనశిఖలన్ దహించి దివిజాధిపలోకనివాసుడైన మజ్జనకున కీయుదంకునకు సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్ * వ ॥ సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబుగల దేని చెప్పుండని న ఋత్విజులిట్లనిరి * మత్తకోకిల ॥ నీతదర్థముగాఁగ దేవవినిర్మితంబిది యన్యులుర్వీతలేశ్వరదీనిఁ జేయరు వింటి మేము పురాణవిఖ్యాతమాద్యము నావు డుర్వినికౌరవప్రవరుండు సంజాతనిశ్చయుండయ్యె నప్పుడు సర్పయాగము సేయఁగన్ * వ ॥ ఇట్లు కృతనిశ్చయుండై జనమేజయుండు కాశిరాజపుత్రియయిన వపుష్టయను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుండయి శాస్త్రోపదిష్టప్రమాణలక్షణ నిపుణశిల్పాచార్యవినిర్మితంబును యజ్ఞోపకరణానేకద్రవ్యసంభారసంభృతంబును బ్రభూతధనధాన్యసంపూర్ణంబును స్వస్వనియుక్తక్రియారంభసంభ్రమపరిభ్రమద్బ్రాహ్మణనివహంబును నయిన యజ్ఞాయతనంబుననున్న యా రాజునకు నొక్క వాస్తువిద్యానిపుణుండయిన పౌరాణిక పండితుండిట్లనియె * క ॥ అనఘ యీ యాయజ్ఞము విధిసనాథ ఋత్విక్ప్రయోగసంపూర్ణంబ । య్యును గడచన నేరమనఁడు మనయుడుగును భూసురోత్తమునిమిత్తమునన్ * వ ॥ అనిన వాని వచనంబాకర్ణించి గాజనియు స్థలయిచ్యవనకులవిఖ్యాతుండయిన చండభార్గవుండు హోతగాఁ

బింగళుండధ్వర్యుఁడుగా శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ గౌత్సుండుద్గాతగా వ్యాసవైశంపాయనపైలజైమినిసుమంతు శ్వేతకేతుమాండల్యోద్దాలకమాండవ్యకౌశికకౌండిన్యశాండిల్యశ్రామతకహారీతాసితదేవలనారదపర్వతమైత్రేయకణ్వజఠరకపింగళవాత్స్యశ్రుతశ్రవోదేవశర్మశర్మదరోమశహారితరురుపులోమసౌమశ్రవసులాదిగాఁ హోమనులుసదస్యులుగానీలాంబరపరిధానులును ధూమసంరక్తనయనులునునయియాజ్ఞికులగ్నిముఖంబు సేసి దొడంగిన* క॥ ధరణిసురమంత్రసోహామ।స్ఫురణనువివశులయి భూరిభుజగప్రభులొం।డొరుఁబిలుచుచునధిక తురులయికుండాగ్నులంమఁదొరిగిరి పెలుచన్ * వ॥ మఱియుఁగోటికమానసపూర్ణసదయలహాలఖగపిచ్ఛిలకోణ వేగప్రకాశన హిరణ్యవాహశరణతక్షక కాలదంతనాదులయినవాసుకికులసంభవులును చ్చండకఖండభేత్తృహరేణకోచ్ఛిర స్సరభసంఘపీనయోధాధిరోహణ సల్లసల్లగణమూకసుకుమారప్రలేపనముదర్గ మనోమేఘవాహనామలయినతక్షకకులసంభవులును పారావతపారియాత్రపాండరహారిణకృశవిహంగ దప్రమోదసంహతాంగకామలయినయైరావతకులసంభవులును జటిలకుండకుండలఫణిస్కంధకుమారకబాహు వేష్టధూర్తకపాతపోతకాదులయినకౌరవ్యకులసంభవులును శంకుకర్ణపింగళకకుఠారముఖసేవకపూర్ణాంగదపూర్ణ ప్రహాసశకునిహార్యదామకకామరికశ్వసనమానసపోటకభైరవమంత్రవేగపింగళచారుపారగవృషభవేగవక్రగ కమహాహనురక్తాంగసర్వసారంగసమృద్ధపాటలాతువలాహకవారణసుమిత్రచిత్రవేదికాపరాశరతారుణ స్కంధారుణ్యాదులయినధృతరాష్ట్రకులసంభవులునునయియొక్కొక్క మొగిసహస్రాయుతసంఖ్యలుగలిగి* తివేగాహులతీక్ష్ణులై పడిరుదాత్తాశీవిషాగ్నుల్సితా। సితపీతారుణవర్ణదేహులునవాసృగ్రక్తనేత్రుల్మహా।సంతులేకత్రికపంచసప్తనవనానామస్తకుల్పల్వురు। గ్ధతనాగేంద్రులుబ్రహ్మదండహతినార్తధ్వానులైవహ్నిలోనుబ క॥ తడఁబడఁబడియెడురవమును। బడికాలెడురవముకాలిపలుదెఱఁగులవ్ర। స్సెడురవమునుదిగ్వలయముఁగడుం మోగించెనురగకాయోత్థితమై * క॥ తక్షకుఁడతిభీతుండై।యాక్షణమునఁనరిగెసురగణాధిపునన్నన్।రక్షింపురక్షింపుము।రక్షింపుమయనుచునప్పురందరుకడకున్* వ॥ అప్పురందరుండునుదొల్లికమలజువాక్యంబునవాసుకిప్రముఖ ర్పకులముఖ్యులకుసర్పసత్రభయంబులేమియెఱింగినవాఁడుగావునవానినొడకుండుమనిచేకొనియుండెనవ్వాసుకి జనమేజయసమారబ్ధసర్పసత్రపరిత్రస్తుండై ద్వియోజనత్రియోజనాయామస్థూలవ్యాళనివహంబులునిజభ్రాతృ శజనితంబులయినవిజనన్లీవాగ్దండపీడితంబులయియగ్నికుండలంబులంబడుటకుశోకించితనచెలియలిజరత్కారు యిట్లనియె* క॥ ప్రస్తుతఫణిసత్రభయ।త్రస్తాత్ములమైనయస్మదాదులకెల్లన్।స్వస్తియొనర్పఁగనవసర।మాస్తీకు నిప్పుడంబుజనేత్రా * క॥ విపులతపోవిభవంబునఁ।గమలజునట్టిఁడునువిగతకల్మషుఁడాస్తీ।కమహామునియాతని మునమహాహికులరక్షణంబగుఁజేర్మిన్ * వ॥ బ్రహ్మవచనంబునిట్టిదిగావినియేలాపుత్రుండుమాకుఁజెప్పెజర మునికినిన్నువివాహంబుసేయుటయునేతదర్థంబయింకొక్కనిమేషంబేనియుపేక్షించినసకలసర్పప్రళయం పునస్తీకుండుజనమేజయమహీపాలుపాలికింబోయిసర్పయాగంబుడిగించిరక్షింపవలయుననినన్గ్రజువచనంబు నిజరత్కారుపుకొడుకుమొగంబుసూచిభవన్మాతులనియోగంబుసేయుమనినన్నాస్తీకుండిట్లనియె* క॥ కడవఁబడు

——* ఆస్తీకుఁడుసర్పయాగంబునివారించుట. *——

వహ్నిం।గడుకొనిపడినవియెకానికద్రూసుతులం।బడనీనింకనవశ్యం।బుడిగింతునుసర్పయాగమోడకుఁడింకన్* యాస్తీకుండువాసుకిప్రముఖులనెల్లనాశ్వాసించిసకలవేదవేదాంగపారగులయినవిప్రవరులతోడంజనిజనమేజ ర్పసత్రసదనంబునకుంజనుదెంచిస్వదేహకాంతిసభాంతరంబెల్లవెలుంగుచుండస్వస్తివచనపూర్వకంబుగానిట్లని యించె* మ॥ రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారుణీ।ప్రజనెల్లన్దయతోడధర్మచరితంబాలించుచుం ధర్మజునాభాగుభగీరథున్దశరథున్ మాంధాతృరాముల్రఘున్। విజయుంబోలితిసద్గుణంబులజగద్విఖ్యాతస తా * తరల॥ కువలయంబునవారుకోరినకోరికిందగనీపుమాం।కువలయంబువెలుంగఁబుట్టితిదృఢంబుగానృప

నవని రాజ్యభరంబు దాల్చి నయంతను డిమ్మఖంబులం। దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులై రిమహాద్విజుల్ * ఉ॥ అమ్మ
నుజేంద్రుఁడై ననలుయజ్ఞముఁ ధర్మజురాజసూయయ। జ్ఞమ్ముఁ బ్రయాగఁ జేసిన ప్రజాపతియజ్ఞము పాశపాణియ। జ్ఞమ్ము
నుగృష్ణుయజ్ఞము నిశాకరయజ్ఞము నీమనోజ్ఞయ। జ్ఞమ్ము ననొక్క రూపవిలసన్మహిమం గురువంశవర్ధనా * చ॥ వితతమఖ
ప్రయోగవిధివిత్తములుత్తమధీయుతుల్ జగ। న్నుతసుమహాతపోధనులను గ్రహనిగ్రహశక్తియుక్తులీ। క్రతువున బుఋ
త్విజులు కమలగర్భసమానులు పూర్వదిక్పతి। క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్ * శా॥ విద్వ
న్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాత తేజుండు గృ। ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతోఁ। స
ర్వంబున్ యుండు సదస్యుఁడయ్యె నని నిన్నక్కంబె వర్ణింపసా। ధ్యావ్విష్ణుండవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా * ఉ॥ ఆ
ర్తిహరక్రియాభిరతుఁడై కృతసన్నిధియై ప్రదక్షిణా। వర్తశిఖాగ్రహస్తములవహ్నిమహాద్విజదివ్యమంత్రని। ర్వర్తి
తహవ్యముల్ గొనుచు వారిజవైరికి సలేశ నీకుసం। పూర్తమనోరథంబులును బుణ్యఫలంబులు నిచ్చుచుండెడున్ * వ॥ అని
జనమేజయునాతని యజ్ఞమహిమయు ఋత్విజులను సదస్యులను నగ్నిభట్టారకుననురూపశుభవచనంబులఁ బ్రస్తుతించిన
న స్తీకునకం దఱును బ్రీతులయి రంత జనమేజయుండ స్తీకుం జూచి మునీంద్రా నీకెద్ది యిష్టంబు దానిన యిత్తునడుగు మనినఁ
గరంబు సంతసిల్లి య స్తీకుండిట్లనియె * ఉ॥ మానితసత్యవాక్య యభిమన్యుకులోద్భవ శాంతమన్యుసం। తానుఁడవై దయా
నిరతస్థితి నీవు మదీయబంధుసం। తానమనోజ్వరంబు పరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహాత్మా। ర్వినుతసర్పయాగము
* కవింపుము కావుము సర్పసంహతిన్ * చ॥ అనిన సదస్యులందఱుఁ బ్రియంబున నిట్టి విశిష్టవిప్రము। ఖ్యునకు మహాతపోధనున
కు। సందగు పాత్రున కెద్ది యిచ్చినన్। ఘనముగ నక్షయంబగును గావున నీ ద్విజనాథుకోర్కిఁ జెం। పునవృథ సేయఁగాఁదగ
లోకభూవలయేశ్వరయిమ్మ నెమ్మితోన్ * వ॥ అనిన సర్వజనానుమతంబుగా జనమేజయుండ స్తీకసాప్రార్థనంజేసి సర్పయా
గంబుడిగించె నయ్యవసరంబున * మ॥ అతులోర్వీసురముఖ్యమంత్రహుతమాహాత్మ్యంబునన్ వాసవా। చ్యుతుఁడై ముం
దుఁ బురందరుండురువిషార్చిర్జ్వాలవాత్యారయో। ద్ధతినుద్ధూతవివర్ధితాయతబృహద్దావాగ్నివోలెన్ విచే। ష్టితుఁడై నే
ప్రసుపథంబునం దిరుగుచుండె న్విస్మితుల్ గా జనుల్ * క॥ ఆతనినత్యుగ్రానల। పాతోన్ముఖుఁడై నవానిఁ బడకుండఁగనో।
హో తక్షక క్రమ్మమని। యాతతభయుఁ గ్రమ్మఱించె న స్తీకుఁడొగిన్ * మ॥ జననీశాపభయప్రపీడితమహాసర్పేం
ద్రులన్ సర్పయా। గనిమిత్తోద్ధతమృత్యువక్త్రగతులం గాకుండఁ గాఁగాచెనం। చును న స్తీకమునీంద్రునం దులసదస్యు
లంతసంబంధిభో। రనఁ గీర్తించిరి సంతతస్తుతిపదారావంబు రమ్యంబుగన్ * క॥ ఒనర జరత్కారుమునీం। ద్రునకు జరత్కా
రునకు సుతుండై నమహా। మునివరున స్తీకుని ముద। మునఁ దలఁచిన నురగభయము వొందదు జనులన్ * వ॥ మఱియు నయ్య
స్తీకుచరితంబు విన్నవారికి సర్వపాపక్షయంబగు ననీ * క॥ రాజమహేంద్రకవీంద్రస। మాజసురత్నాజరాజమార్తాండ
। శ్రీజననుతచారిత్రవి। రాజితగుణరత్నరాజరాజనరేంద్రా * వసంతతిలకవృత్తము॥ వీరావతారసుకవిస్తుత నిత్యధర్మ।
ప్రారంభశిష్టపరిపాలనశక్తరాజా। నారాయణాఖ్య కరుణారసపూర్ణవీర। శ్రీరమ్యరాజకులశేఖర విష్ణుమూర్తీ . . . *

గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబయిన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబు
నందు నాగగరుడోత్పత్తియు సముద్రమథనంబును నమృతసంభవంబును సౌపర్ణాఖ్యానంబును జన
మేజయసర్పయాగంబును న స్తీకుచరితంబును నన్నది ద్వితీయాశ్వాసము . . . . . . . . . . . . . . . . *

శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీమహాభారతము – ఆదిపర్వము – తృతీయాశ్వాసము.



శ్రీ మెచ్చ ళుక్యవంశశి। ఖామణిమనుమార్గ రాజకంఠీరవదై। ర్యామరధరణీధరధర। ణీమండనధర్మనిరత నిత్యాఖ్యా
హా * వ॥ అక్క థకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు జనమేజయుండు పన్నాతసర్పసత్త్రుండయి యథావిధిస

పూర్ణదక్షిణలబుత్విజులనుసదస్యులనుంబూజించి దీనానాథజనంబులకుఁగోరినధనంబులిచ్చి యనేకపుణ్యకథ
ణకుతూహలపరుండగుచువిద్వజ్జనగోష్ఠినుండియొకనాఁడు * మ॥పరమబ్రహ్మవిదుంబరాశరసుతుబ్రహ్మ
ఋషిర్దయా।పరుఁగౌరవ్యపితామహుజనహితప్రారంభుఁగృష్ణాజినాం।బరునీలాంబుదవర్ణదేహునుపా
శునుద్యద్దివా । కరరుక్పింగజటాకలాపుగతరాగద్వేషునిర్మత్సరు * వ॥వైశంపాయనప్రభృతిశిష్యవర్గంబు
నేకమునిగణపరివృతుండయి కనకమణిమయోచ్చాసంబుననున్నవ్యాసభట్టారకు నతిభక్తి నర్ఘ్యపాద్యాదుల
బూజించి వినయవినమితశిరస్కుండయి నమస్కరించిజనమేజయుండిట్లనియె * సీ॥ప్రీతితోమీరునుభీష్మాదిదా
రాజులునుండిభూరాజ్యవిభవ। మెల్లవిభాగించియిచ్చినందముతమవృత్తులనుండకవీఁగిపాండు । ధృతరాష్ట్ర
ధృతిచెడి వారేమికారణమునఁబ్రజాక్షయముగాఁగ ।భారతయుద్ధమపారపరాక్రములేసిరి మీపంపుసేయ
ఆ॥మెఱిఁగిమెఱిఁగివారినేటికివారింప।రిట్టిగోత్రకలహమేలపుట్టె। దీనికలతెఱంగుతెలియంగనానతి । య
సన్మునీంద్రవంద్య * వ॥ అనియిట్లుపాండవధార్తరాష్ట్రవిభేదనకథాశ్రవణకుతూహలపరుండయియడిగిన
యునింగతుణించికృష్ణద్వైపాయనుండువైశంపాయనమునింజూచిశ్రీమహాభారతకథాఖ్యానంబాద్యంత
స్తరంబుగాఁజెప్పుమనిపంచిచనిన*క॥జనమేజయుండువిద్వ।జ్జనపరివృతుఁడయిసమస్తజనపాలసభా।జనమో
వైశంపా।యనమునిఁబూజించెభక్తుఁడయివినువేడ్కన్ * వ॥ ఆవైశంపాయనుండునునిఖిలభువనవంద్యుండు
ష్ణద్వైపాయనమునీంద్రునకునమస్కారంబుసేసివిద్వజ్జనంబులయనుగ్రహంబువడసి * సీ॥కమనీయధర్మార్థ
మోక్షములకునత్యంతసాధనంబయినదాని । వేడ్కతోఁదగివినుచున్నవారలకభిమత శుభకరంబయినదాని ।
జులకఖిలభూరాజ్యాభివృద్ధినిత్యాభ్యుదయప్రదంబయినదాని। వాఙ్మనఃకాయప్రవర్తితానేక జన్మాఘనిర్ణ
నదాని - ఆ॥ సత్యవాక్ప్రబంధశతసహస్రశ్లోక।సంఖ్యమయినదానిసర్వలోక। పూజ్యమయినదానిబుధనుతా
ము । హోమునిప్రణీయమయినదాని * చ ॥ వినుతపరాక్రముల్ధృతవివేకులుసత్యసమన్వితుల్యశో। ధనులుకృ
త్తములుధర్మపరుల్శరణాగతానుకం । పనులనఁగాఁబ్రసిద్ధులగు భారతవీరులసద్గుణానుకీ । ర్తనములనొప్పెడ
తంబగుదానిసభాంతరంబులన్ * శా॥ఆయుష్యంబిలిహాసవస్తుసముదాయంబైహికాముష్మిక।శ్రేయఃప్రా
త్తముత్తమసభాసేవ్యంబులోకాగమ।న్యాయైకాంతగృహంబునాఁబరఁగునానావేదవేదాంతవి । ద్యాయ

—*పాండవధార్తరాష్ట్రభేదకారణసంగ్రహము.*—

దానిఁజెప్పఁదొడఁగెందద్భారతాఖ్యానము * సీ॥ పాండుకుమారులుపాండుభూపతిపరోక్షంబునహస్తిపు
డు। ధృతరాష్ట్రునొద్దఁదత్సుతులతోనొక్కటఁబెరుగుచుభూసురవరులవలన । వేదంబులునుధనుర్వేదాదివిద్య
చుచుఁగడలేనిమెఱుకఁదనరు।చున్నఁదద్విపులగుణోన్నతిసైఁపకదుర్యోధనుండుదుష్కార్యమైత్రి-ఆ॥దుర్య
నికర్ణదుశ్శాసనుల్గలుపఁబాండవులకునలయచేయఁ। గడఁగెఁబాండవులునుగడుధార్మికులుగానఁ।బొరయ
రితవిధుల * వ॥అదియెట్లనిననొక్కనాఁడుజలక్రీడాపరిశ్రమవిచేష్టితుఁడయిప్రమాణకోటిస్థలంబుననిద్ర
ను సేనునతిఘనలతాపాశబద్ధుంజేసి గంగమడువునంద్రోచిననాతఁడనంతసత్త్వుండుగావునఁ దద్బంధ
గనీల్గి మీఁదికినెగసెమఱియునొక్కనాఁడతివ్యాయామఖేదంబుననుప్తుండైనవానిసర్వాంగంబులయందు
బులంబట్టికఱపించిననాతండువజ్రమయదేహుండుగావునఁ దద్విషదంష్ట్రలునాటవయ్యె మఱియునొక్క
జనసమయంబునవానికివిషంబువెట్టిననతండుదివ్యపురుషుండుగావునఁదద్విషంబన్నంబుతోడనజీర్ణ
వారలకెల్లనపాయంబుసేయసమకట్టి * సీ॥వదలకకురుపతివారణావతమునలక్కయిల్లావించియకట
జొన్పియందనలంబుదరికొల్పబనిచినఁబాండునందనులెఱింగి।విదురోపదిష్టభూవివరంబునందపక్రాంతులై
తులయిరి।ధర్మజునుచితంబుఁదప్పనివారలసదమలాచారులనుదితసత్య- ఆ॥ రతులనఖిలలోకహితమహో
రిగుణులనిర్జితారివర్గు।లై వెలుంగువారిదైవంబరక్షించు।దురితవిధులనెపుడుఁబొరయకుండ * వ॥ ఇట్లు

డు సేయునపాయంబులవలనం బాయుచుఁ బాండవులు లాక్షాగృహదాహంబువలననక్షయులై జననీసహితంబుగావ
నంబునకుం జనిన నందు భీమసేనుండు హిడింబాసురుం జంపి వాని చెలియలి హిడింబను వివాహంబై యేకచక్రపురంబున
కేగి యందు బకాసురుం జంపి విప్రులం గాచె మఱి యందు విప్రవేషంబున ద్రుపదపురంబునకుం జని యందు ద్రౌపదీస్వ
యంవరంబున మత్స్యయంత్రం బర్జునుం డశ్రమంబున నురుల నేసి సకలరాజలోకంబు నోడించి ద్రౌపదిం జేకొని
దాని నేవురు గురువచనంబున వివాహంబయి ద్రుపదపురంబున నొక్కసంవత్సరంబున్న నెఱింగి ధృతరాష్ట్రుండు వా
రిం రావించి యర్ధరాజ్యం బిచ్చి యింద్రప్రస్థపురంబున నుండం బనిచిన నందుఁ బాండవులు రాజ్యంబు సేయుచున్నంత * క॥
ద్వారవతికేగి యర్జునుఁ డారంగ సుభద్ర బెండ్లియయి వచ్చి మహావీరు నభిమన్యుఁ గులవి । స్తారకు సత్పుత్రు నతిముదం
బునఁ బడసెన్ * వ॥ మఱియు నగ్నిదేవుచేత దివ్యరథంబును దివ్యాశ్వంబులును గాండీవ దేవదత్తంబులును నక్షయ
బాణతూణీరంబులుం బడసి సురగణంబులతో సురపతి నోర్చి ఖాండవ దహనంబున నగ్నిదేవుం దనిపి మయువలన సభా
ప్రాప్తుండై భీముని చేత జరాసంధుం జంపించి దిగ్విజయంబు చేసిన సార్వభౌముండై ధర్మరాజు రాజసూయమహాయజ్ఞం
బు చేసెనది మొదలుగాఁ గల పాండవుల గుణసంపదలు సూచి సహింపక దుర్యోధనుండు శకుని కైతవంబున మాయాద్యూ
తంబున ధర్మరాజుం బరాజితుం జేసి పండ్రెండేఁడులు వనవాసంబును నొక్కయేఁడు జనపదంబున నొరులెఱుంగకుండ
నజ్ఞాతవాసంబుఁ జేయునట్లుగా సమయంబు చేసి భూమి వెలువరించినం జని పాండవులు వనవాసంబున నున్నయంత *
చ॥ పరమగురూపదేశమునఁ బార్థుఁడు పార్థివరత్నశేఖరుం । డరిదితపంబునన్ భుజబలాతిశయంబున నీశుఁ బన్నగా।
భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ బాశుపతాదిక దివ్యబాణము । ల్సురసురరాజదేవనివహంబులచేఁ బడసెం బ్రియంబు
నన్ * అక్కర॥ వనమునఁ బదియు రెండేఁడులజ్ఞాతవాస మొక్కేఁడు । జనపదంబునసుండి తగఁ గనయ్యేండులు సలిపిస
త్యవ్రతులనఘులు మును వేఁడికొనక మదిభారతాజి సేయంగ। మొనసిరి పాండవకౌరవుల భేదమూలమిట్టిదయ్య * వ॥ ఇ
ట్టి భరతకులముఖ్యుల వంశచరితానుకీర్తనంబునం జేసి యిక్కథ శ్రీమహాభారతంబునాఁ బరఁగె * శా॥ ఆనారాయ
ణపాండవేయగుణమాహాత్మ్యామలజ్యోత్స్నఁ జిత్తానందంబొనరించుచుం జనులకర్థాంశుప్రకాశంబుతో । మానైస
ర్గ్యవతేయనీవనధిజన్మ శ్రీమహాభారతా । ఖ్యానాఖ్యామృతసూతి యొప్పె నిఖిలాఘధ్వాంతవిధ్వంసియై * వ॥ మఱి

——*ఉపరిచరవసుమహారాజువృత్తాంతము*——

యు నిట్టి శ్రీమహాభారతంబునకుఁ గర్తయైన శ్రీవేదవ్యాసుజన్మంబు సవిస్తరంబుగాఁ జెప్పెద నినుము * సీ॥ వాసవప్ర
తిముండు వసువను నాతండు చేదిభూనాథుండు శిష్టలోక।నుతకీర్తి మృగయావినోదార్థ మడవికిఁ జని యొక్క మునిజనాశ్ర
మమునందు । నిర్వేదమున మహానిష్ఠతో సన్న్యస్తశస్త్రుఁడై తపమొప్ప సలుపుచున్న। నాతని పాలికి నమరగణంబుతో నిం
ద్రుండు వచ్చి తా నిట్టులనియె - ఆ॥ ధరణిఁ బ్రజఁ గరంబు దయతోడ వర్ణధ।ర్మాభిరతుఁ జేసి యమలచరిత। నేలి రాజ్యవిభవము
డియేలయని తప । శ్చరణనునికినీకచనియె ననఘ * వ॥ నీ వర్ణధర్మప్రతిపాలనంబునకుఁ దపంబునకు మెచ్చితి నీవు నాతోఁ
జెలిమి చేసి నాయొద్దకు వచ్చుచుం బోవుచు మహీరాజ్యంబు సేయుచు నుండుమని వానికి దేవదత్వంబును గనకరత్నమ
యంబైన దివ్యవిమానంబు నేదాని నెన్నితాల్చిన నాయుధంబులు దాఁకనోడు నట్టి వాడని వనజంబులు గలిగిన యింద్రమాల
యను కమలమాలికయును దుష్టనిగ్రహశిష్టపరిపాలనక్షమంబైన యొక్క వేణుయష్టియు నిచ్చిన నవ్వసువును దద్విమా
నారూఢుండై యుపరిలోకంబునఁ జరించుటం జేసి యుపరిచరుండు నాఁ బరఁగి యక్కమలమాలికయుఁ దనకు జిహ్నంబు
గాన వేణుయష్టికి మహావిభవంబు మెఱయ నేఁటేఁట నింద్రోత్సవంబను నుత్సవంబు సేయుచు నీశ్వరునకు నింద్రాది దేవ
తలకు నతిప్రీతి సేసె నది మొదలుగా రాజులెల్లం బ్రతిసంవత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు * క॥ ఘనముగన
య్యింద్రోత్సవ। మొనరించు మహీపతులకు నొగి నాయుర్వ । ర్ధనమును గుఁబెఱుగు సంతతి। యనవరతము ధరణిఁ బ్రజకును
వృద్ధియగున్ * వ॥ అట్టి యింద్రోత్సవంబున నతిప్రీతుండయి నయింద్రువరంబున నుపరిచరుండు బృహద్రథమణివా
హనసౌబలయదురాజన్యులనియెడు నేవురు కొడుకులం బడసి వారలం బెక్కుదేశంబుల కభిషిక్తులం జేసిన నవ్వేపుర

వసువులు వేఱు వేఱ వంశకరులయి పరఁగి రట్లు పరిచరుండు లబ్ధసంతానుండయి రాజర్షి యయి రాజ్యంబు సేయుచున్న
సమీపంబునం బాఱిన శుక్తిమతి యను మహానదిం గోలాహలంబను పర్వతంబు గామించి యడ్డంబు వడిన దానిం ద
దంబునం జేసి తలఁగం ద్రోచిన నన్నదికిం బర్వతసమాగమంబున వసుపదుండను కొడుకును గిరిక యను కూఁతురు
నయ్యిరువురను శుక్తిమతి తద్దయు భక్తి సతియయి గిరినిరోధంబు వాయ నుపకారంబు చేసిన యుపరిచరునకు మెచ్చి
క యిచ్చిన నతండు వసుపదుం దనకు సేనాపతిం జేసికొని గిరికం దనకు ధర్మపత్నిఁగాఁ జేకొని యున్నంత నగ్గిరిక ఋతు
యయిన దానికి మృగమాంసంబు తెచ్చి పెట్టుమని తన పితృదేవతలు పంచిన నప్పు డయ్యుపరిచరుండు మృగవధార్థం
బున కరిగి * సీ॥ పలుకుల ముద్దును గలికి క్రాల్గన్నుల తెలుపును వలుదచన్నుల బెడంగు। నలఘు కాంచీపదస్థలముల యొ
లలితానన నేందుమండలము రుచియు। నళినీలకుటిలకుంతలముల కాంతియు నెలజవ్వనంబును విలసనమును। నల
ను బొలుపును మెలపును గలుగు నగ్గిరిక నుదలఁచి తలఁచి - ఆ॥ ముదితయందుఁ దనమహృదయంబు నిలుపుటఁ
డర భాసురముగ। రమణతో వనాంతరమున రేతస్స్యంద।మయ్యె నవనిపతికి నెయ్యమమర * వ॥ అయ్యమోఘ
క యజీర్ణపర్ణపుటంబున నిమ్ముగా సంగ్రహించి యొక్క డేగ యఱుతం గట్టి దీని నింగొని పోయి గిరికకిమ్మని యుపరి
వనిచిన నదియును నతిత్వరితగతి నాకాశంబునం బఱచునప్పుడు * క॥ ఆమిషమని దానిం గొనఁ। గా
నకట్టి యొక్క ఖగమా ఖగముఁ। వ్యోమమునం దాఁక దివిసం। గ్రామంబా రెంటికయ్యెఁ గడు రభసమునన్ *
శితతుండహతి నిర్భిన్నం బర్ణపుటంబు వాసి చెదరుచు నృపునం। దనవీర్యము యమునానది। వనమధ్యమునందు వాయఁ
మునఁ బడియెన్ * వ॥ తొల్లి బ్రహ్మశాపనిమిత్తంబున నద్రిక యను నప్సరస యమునయందు మీనయి త్రిమ్మరుచున్న
దియవ్వసువీర్యబిందుద్వయంబు త్రావి గర్భంబు దాల్చి నదశమమాసంబునందు * తే॥ తెరల వలవైచి జాలరి దివిచి దాని
యుదరదళనంబు సేయ నందొక్క కొడుకు। నొక్క కూఁతును గని వారి నొనరఁ దెచ్చి। దాశరాజున కిచ్చె నుదగ్ర

## —*మత్స్యగంధివృత్తాంతము*—

అయ్యద్రికయు మానుషప్రసవం బొనరించినఁ దనకు శాపమోక్షణంబగునని బ్రహ్మవచనంబు గలుగుటం జేసి మీనరూ
ని విడిచి దివ్యవనితయయి దేవలోకంబునకుం జనియె మఱియును మత్స్యోదరంబునఁ బుట్టిన యక్కొడుకు మత్స్యరా
బరఁగి ధర్మపరుండయి మత్స్యదేశంబున కధిపతియయ్యె నక్కూఁతును దాశరాజు తనకూఁతుంగాఁ జేకొని పెంచి
నుచు * క॥ అంబుజముఖి యక్కన్య ప్రి।యంబొనరఁగ మత్స్యగంధియనఁ గా ధర్మా।ర్థంబుగఁ దన తండ్రి నియో
య్యమునం నోడఁ గడపుచునుండెన్ * చ॥ గతమదమత్సరుండు త్రిజగద్వినుతుండు వసిష్ఠపౌత్రుఁడు। న్నతపతి
డఘునాశన ఘోరతపోధనుండును। వ్రతుఁడయి తీర్థయాత్ర చను వాఁడు పరాశరుఁ డమ్మునీంద్రుఁడ। య్య
రింగని యెనయ్యమునానదియోడ రేవునన్ * వ॥ ఇట్లేకతంబ యేకవస్త్రయై యోడ నెక్క వచ్చువారి నిరీక్షి
సత్యవతిం జూచి యమ్మునివరుండు మదనపరవశుండయి దానిజన్మంబు తన దివ్యజ్ఞానంబున నెఱింగియదా
క్క దానితో నొక్కట జనిచని * సీ॥ చపలాక్షిచూపుల చాడ్పున కెదమెచ్చుఁ జిక్కనిచనుఁగవఁ జీఱుగో
న్నవకొఁదీగయందంబు మదినిల్పు జఘనతలంబుపై జరుపు దృష్టి। యభిలాష మేర్పడు నట్లుండఁగాఁ బలు
పలుకుమాట వినఁగఁ దివురు। సతిఘనలజ్జావనతయగు నక్కన్యపయిఁ బడి లజ్జయుఁ బాపఁగడఁగు - ఆ॥ నెంతొ
య్యునెంత జితేంద్రియు। లయ్యుఁ గడు వివిక్తమయిన చోట। సతులగోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ।
శక్తి నోర్వఁగల రె జనులు * వ॥ ఇట్లు విగతలజ్జాపరవశుండయి మునివరుండు దనయభిప్రాయం బకన్యకు
సించిన నదియును దీని కొఱఁతంబడసినాఁడు నాకలిగి యిమ్ముని శాపంబిచ్చునో యని వెఱచి యిట్లనియె * తరల
మీనొప్పిలపల్కు జాలరిదాననట్లును గాకయే। ననఘుకన్యకఁ గన్యకావ్రతమంతరించిన నెట్లుమ। జ్జనకునింటికి
స్త్రుఁ బ్రసాదబుద్ధి యొనర్పుస। న్మునిగణోత్తమ నా తుదోషవిముక్తి యెట్లగు నట్లు గాన్ * వ॥ అనిన నమ్ముని
రంబు సంతోషించి నాకు [illegible] సెయ్యెంబు పూతంబుగా దోడకునుసి దానికి వరంబిచ్చి

రాజర్షి వీర్యంబునం బుట్టిన దానవు గాని సూతపుల ప్రసూతవు కావని చెప్పి దాని శరీర సౌగంధ్యంబు యోజనదూ
రంబున జనులకు నేర్పడునట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతియనియు యోజనగంధియనియుఁ బరఁగి పత్ప్రసాదంబు
ననేక దివ్యాంబరాభరణ భూషితయు నయి యమునానదీ ద్వీపంబున నోడ సేర్చి * తే॥ ఎల్లవారును జూడంగ నిట్టి భయ
నెట్లు సంగమమగునని యింతి యన్న । నమ్మునీంద్రుండు గావించె నప్పుడఖిల । దృష్టిపథ రోధనీహార తిమిరమంత * క॥ ప
మేష్ఠి కల్పుఁడగున । ప్పరాశర సమాగమమునఁ బరమగుణైకా । భరణమున ననవద్యమనో । హరమూర్తి కి సత్యవతికి నమ్ము

—*శ్రీ వేదవ్యాసమహామునీంద్రుని యవతారము.*—

శక్తిః * క॥ సద్యోగర్భంబున నహి । మద్యుతి తేజుండు వేదమయుఁడఖిల మునీం । ద్రాద్యుఁడు వేదవ్యాసుం । డుద్యజ్ఞా
నంబుతోడ నుదితుండయ్యెన్ * క॥ ఆయమునాద్వీపమునన । మేయుఁడు కృష్ణుండు మెలఁగ మేదినిలో ద్వై । పాయనుఁ
డనఁ బరఁగి వచ । శ్శ్రీయుతుఁడు దపంబునందుఁ జిత్తము నిలిపెన్ * వ॥ పరాశరుండు సత్యవతి కోరిన వరంబు లిచ్చి నిజేచ్ఛ
నరిగె నంతఁ గృష్ణద్వైపాయనుండును కృష్ణాజిన పరిధానకపిల జటామండల దండకమండలు మండిత కరకమలుం డై తల్లి
యుండ నిలిచి కరకమలంబులు మొగిచి మ్రొక్కి మీకుం బనికలయప్పుడ నన్నుం దలంచునది యాతుణంబ వత్తునని సకల
లోకపావనుండు తపోవనంబునకుం జని ఘోరతపంబు సేయుచు * ఉ॥ సంచితపుణ్యుఁడంబురుహసంభవునంశమునం
బుట్టి లోకాంచితుఁ డైనవాఁడు నిఖిలాగమపుంజము లేర్పడన్ విభా । గించి జగంబులందు వెలిఁగించి సమస్తజగద్ధితంబు
గాఁ బంచమవేద మై పరఁగు భారతసంహితఁ జేసె నున్నతిన్ * వ॥ మఱియు దేవదైత్యదానవముని యక్షపక్షి గంధ
ర్వపన్నగాదుల యంశావతారంబులు దాల్చి భీష్మాది వీరులు భారతయుద్ధంబు సేయ ననేకులు పుట్టిరి వారలకొలంది యెఱింగి చె
ప్పఁ బ్రదాన నేక కాలంబుల ననేకసహస్ర ముఖంబుల వారికైనను లవి కాదనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె * క॥
సమరాసురవీరుల యంశములను మహిఁ బుట్టి సకలజనపాలకసం । ఘములకు భారతరణరం । గమున నలయ మొందనేమి
కారణమనినన్ * వ॥ అనిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె * సీ॥ పరశురాముండు భీకర నిజకోపాగ్నిఁ
బ్రదీప్తుఁడై యిరువదియొక్క మాఱు । ధాత్రీతలంబ పక్షత్రంబు సేసిన ద క్షత్ర సతులు సంతానకాంక్ష । వెలయంగ ఋతు
కాలముల మహావిప్రుల దయఁ జేసి ధర్మ్యువుతప్పకుండఁ । బడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల నిప్పాటఁ దక్షత్ర మెసఁగి
యుర్విఁ – ఆ॥ బర్వి రాజధర్మ పక్షనీతి విడువక । జారచోర దుష్టజనుల బాధఁ । బొరయకుండ నిఖిలభూప్రజాపాలనఁ । జేయు
చుండెఁ శిష్టసేవ్యమగుచు * వ॥ ఇట్లు బ్రాహ్మణవీర్యప్రభవులయిన క్షత్రియులు ధర్మమార్గంబునం బ్రజాభిరక్షణంబు సే
యుటం జేసి వర్ణాశ్రమధర్మంబులు దప్పక ప్రవర్తిల్లుటయుఁ బ్రహ్మక్షత్రంబున కాయుర్వర్ధనంబును ననవరతయాగత
ర్పితపర్జన్యప్రసాదంబునం జేసి కోరినయప్పుడు వానలు గురియుచు సకలసస్యసమృద్ధియుఁ బ్రజావృద్ధియు నయిన భూ
దేవి ప్రజాభారపీడిత యై సురాసుర మునిగణపరివృతు లై యున్న హరిహరహిరణ్యగర్భులకడకుం జని యిట్లనియె * క॥
మూరిప్రజానిరంతర । భారము దాల్చుటది కరము భారము దయతో । మీరీభారమునకుఁ బ్ర్రతి । కారము గావించి నన్నుఁ
గావుండనినన్ * క॥ వనజాసనుననుమతమున । వనరుహనాభుండు వాసవప్రముఖసుప । ర్వనికాయాంశంబులతోఁ
జనఁగఁ బుట్టించె నుర్విఁ దనయంశమునన్ * క॥ దితిసుత దానవ యక్ష । ప్రతతుల యంశములఁ బుట్టి ప్రజలకు విహితా
హితులగుచుండిర నేకులు । జితకాశులు ధరణిపతులు శిశుపాలాదుల్ * చ॥ అతులబలాఢ్యులై నయము రాంశసముద్భవు
లెల్లఁ బాండుభూ । పతిసుతపక్షమై సురవిపక్షగణాంశజులెల్ల దుర్మదో । ద్ధత కురురాజపక్షమయి ధారుణిభారము సాయ
భారభా । రతరణభూమి నీల్గిరి పరస్పరయుద్ధము సేసి వీరులై * వ॥ అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె *
ఆదిత్యదైత్యదానవు । లాదిగఁ గలభూతరాశి నగు సంభవమున్ । మేదినిఁ దదంశములను । రోత్పాదయములు నాకుఁ జెప్ప
నగి నేర్పడఁగన్ * వ॥ అనిన విని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనిచెప్పెఁ దొల్లి సకలజగదుత్పత్తినిమిత్తహేతు
భూతుండైన బ్రహ్మకు మానసపుత్రులైన మరీచియు నంగిరసుండును నత్రియుఁ బులస్త్యుండును బులహుండును గ్రతువు
నను నార్వురు పుట్టిరందు మరీచికిఁ గశ్యప ప్రజాపతి పుట్టె ... తరాశియెల్లను ధ్వనిల్లె నెల్లనన

——*దేవదానవప్రముఖులయుత్పత్తిక్రమము*——

బ్రహ్మదక్షిణాంగుష్ఠంబున దక్షుండును వామాంగుష్ఠంబునధరణియను స్త్రీయును బుట్టిననయ్యిరువురకును య
తులనఘులు వేవురుదమ । యుతులయియుదయించిసాంఖ్యయోగాభ్యాసో।న్నతిఁజేసిముక్తులయిరి భూ। రితేజ
సునూర్ధ్వరేతసులయినర * వ॥ పదంపడియేఁబండ్రు కూఁతులుంబుట్టినవారలనెల్లదక్షుండపుత్రుండుగావున
కరణంబుసేసియందుఁ గీర్తిలక్ష్మీధృతిమేధాపుష్టిశ్రద్ధాక్రియాబుద్ధిలజ్జామతులను వనితలఁబదుండ్రనుధర్మ
నునకిచ్చె నశ్విన్యాదులయినయిరువదేడ్వురనుజంద్రునకిచ్చె నదితిదితిదనుకాలానాయు సింహికాముని క్రో
ధాప్రాధావినతాసురభికద్రువులనుపదుమువ్వురను గశ్యపునకిచ్చె నందదితియనుదానికిధాతృశక్రార్యమమిత్ర
భగవివస్వత్పూషసవితృత్వష్టృవిష్ణులనంగాద్వాదశాదిత్యులుపుట్టిరిమఱియును * క॥ దితియనుదానికిన
తబలుఁడుహిరణ్యకశిపుఁడనఁబుట్టెసుతుం।డతనికినేవురుపుట్టిరి ।ప్రతాపగుణయుతులుసుతులుప్రహ్లాదాదుల్
ప్రహ్లాదసంహ్లాదానుహ్లాదశిబిబాష్కళులయందుఁబ్రహ్లాదునకు విరోచనకుంభనికుంభులనంగామువ్వురుపుట్టి
రోచనునకుబలిపుట్టె బలికిబాణాసురుండుపుట్టెం దనువనుదానికి విప్రచిత్తిశంబరనముచిపులోమాసి
యామ్ములయినదానవులు నలువండ్రుపుట్టిరివారలపుత్రపౌత్రవర్గం బసంఖ్యాతంబై ప్రవర్తిల్లెఁగాలయనుదా
శక్రోధాదులెనమండ్రుపుట్టిరి * ఆ॥ అజితశక్తియుతులనాయువనుదాని । కజరులధికవీరులతులభూరి ।
క్రరిపులుపుట్టిరినలువురు।విజయవిపులవీరవృత్రులనఁగ * వ॥మఱియుసింహికయనుదానికిరాహువుపుట్టెమ
దానికిభీమసేనోగ్రసేనాదులయిన గంధర్వులుపదాఱ్వురుపుట్టిరిసురభియనుదానికినమృతంబునుగోగణంబులు
తాచీమేనకాదులయినయప్సరసలుసుబుట్టిరివినతయనుదానికి ననూరుండునుగరుడుండును బుట్టిరంసనూరునకు
యనుదానికిసంపాతిజటాయువులుపుట్టిరిక్రోధవశయనుదానికిగణుండు పుట్టెననుగయనుదానికిసిద్ధాదులుపుట్టి
రయనుదానికిసుచంద్రచంద్రహర్త్రాదులుపుట్టిరి కద్రువయనుదానికి శేషవాసుకిపురోగమానేకభుజంగముఖ్య
ట్టిరి * సీ॥ మఱియంగిరసుఁడను మానసపుత్రునకయ్యుతథ్యుండు బృహస్పతియును । సంవర్తుఁడునుగుణాశ్రయ
గశుద్ధిసాఁగూఁతులుఁబుట్టిరకొడుకులందు। వినుముబృహస్పతి వేల్పులకాచార్యుఁడై లోకపూజితుఁడై వెలింగె
గానత్రియన్మానసపుత్రునకుద్భవించిరిధర్మయుతచరిత్రు*ఆ॥లఖిలవేదవేదులాద్యులనేకులు।దీప్తరవిసహస్ర
ఘు।లధికతరతపోమహత్త్వసంభృతవిశ్వ।భరులుసత్యపరులుపరమమునులు* వ॥మఱియుఁబులస్త్యుండనుమా
నసున నేకరాక్షసులుపుట్టిరిపులహుండనుమానసపుత్రునకుఁ గిన్నరకింపురుషాదులుపుట్టిరి క్రతువను మా
కుసత్యవ్రతపరాయణులైన పతంగసహచరులుపుట్టిరి పైతామహుండైన దేవలుండను మునికిఁబ్రజాపతిపుట్టె
ధూమ్రాబ్రహ్మవిద్యామనస్విసీరసాశ్వసాశాండిలీప్రభాసలనంగానేడ్వురు భార్యలైరందు ధూమ్ర
బ్రహ్మవిద్యకుధ్రువుండునుమనస్వినికిసోముండును రసకునహుండును శ్వసకుననిలుండును శాండిలికినగ్ని
సకుఁబ్రత్యూషప్రభాసులనంగానెనమండ్రువసువులుపుట్టి రందువరుణుండనువసువునకుద్రవిణుండు పుట్టె
పనువసువునకుఁగాలుఁడుపుట్టె సోముండనువసువునకుమనోహరయనుదానికిఁ బురోజవుండును సువర్చ
శిరుండును బ్రాణుండునుగరుణుండునురమణుండును బృధయనుకూఁతురుంబుట్టిరిపృథకుఁబదుండ్రు గంధర్వ
ట్టిరిసహుండను వసువునకుజ్యోతిపుట్టెననిలుండను వసువునకుశైవయను దానికిఁబురోజవుండును విజ్ఞానగతియు
ట్టిరియగ్నియనువసువునకుఁ గుమారుండుపుట్టెఁబ్రత్యూషుండనువసువునకు ఋషియైనదేవలుండుపుట్టె
పనువసువునకు బృహస్పతిచెలియలైనయోగసిద్ధికివిశ్వకర్మపుట్టె * క॥ ఆవిశ్వకర్మనిర్మిత। దేవవిమాన
వ్యాభరణ।శ్రీవిరచనపరితోషిత । దేవుఁడు శిల్పప్రజాపతియునై నెగడెన్ * వ॥ మఱియుస్థాణునకుమా
లైనమృగవ్యాధశర్వనిరృత్యజైక పాదాహిర్బుధ్న్యపినాకి వామదేవేశ్వరకపాలి స్థాణుభర్గులనంగా నేకాదశ
లుపుట్టిరిమఱి బ్రహ్మదక్షిణ పాదాంగుష్ఠంబునధర్ముండనుమనువుపుట్టె వానికిశమకామహర్షులనంగా ముగ్గురు

యాముప్వురకుఁ గ్రమంబున సంప్రీతిరతినందలనంగా మువ్వురుభార్యలైరి సవితృనకు బడబారూపధారిణియైన త్వాష్ట్రికినశ్వినులుపుట్టిరి బ్రహ్మహృదయంబున భృగుండుపుట్టె వానికిఁగవిపుట్టె వానికిశుక్రుండుపుట్టి యసురులకాచార్యుండయ్యె వానికి శండామర్కదంష్ట్రిత్వష్టృభద్రకర్ములనంగా నలువురుకొడుకులుపుట్టిరి వారసురులకుయాజ్ఞికులైరిమఱియును * సీ॥ విగతాఘుఁడైనయాభృగునకుఁబుత్రుఁడై చ్యవనుండుపుట్టెభార్గవవరుండు। జనవంద్యుఁడతనికిమనుకన్యకకుఁబుట్టెనూరులనౌర్వుండుభూరికీర్తి। యతనికినూఱ్వురుసుతవరుల్రుచికాదులుదయించిరఖిలభూవిదితతేజులనఁగనారుచికునకొనరంగజమదగ్నియనుమునిపుట్టె నాతనికిఁబుట్టి— ఆ॥ రలఘుమతులుసుతులునలువురువారిలోఁ బరశురాముఁడాదిపురుషమూర్తి। దండితాహితుండుకొండికయయ్యును।దగ్ధగుణములందుఁబెద్దయయ్యె * వ॥ మఱియుబ్రహ్మకు ధాతయువిధాతయుననంగా నిద్దఱుమనుసహాయులైపుట్టిరి వారితోడన జేష్ఠయులక్ష్మియుంబుట్టిరందులక్ష్మికి మానసపుత్త్రులనేకులుపుట్టిరి మఱివరుణునకు జ్యేష్ఠకధర్ముండు సురనిందని యనుకూఁతురును బుట్టిరి యాయధర్మునకు నిరృతికి భయమహాభయమృత్యువులనంగా మువ్వురుపుట్టిరిమఱియుఁ దామ్రకుఁ గ్రౌంచియుభాసియుశ్యేనియుధృతరాష్ట్రియుశుకియుననునేవురుకన్యలుపుట్టిరి యందుఁ గ్రౌంచియనుదానికిగమడునకుఁ గ్రౌంచంబులుపుట్టెభాసియనుదానికిభాసగృధ్రములుపుట్టె శ్యేనియనుదానికిశ్యేనకపోతంబులుపుట్టెధృతరాష్ట్రియనుదానికిహంసచక్రబకటిట్టిభంబులుపుట్టెశుకియనుదానికిశుకంబులుపుట్టెమఱియుంగమలజువలన మృగియు మృగమందముహరియుభద్రమందయు మాతంగియుశార్దూలియు శ్వేతయుసురభియు సురసయుననలయుననఁబదుండ్రుపుట్టిరందుమృగియనుదానికిమృగంబులుపుట్టె మృగమందయనుదానికి ఋక్షచమరసృమరాదులుపుట్టెహరియనుదానికి వానరగణంబులుపుట్టె భద్రమందయనుదానికి నైరావణంబుపుట్టె నైరావణంబునకు దేవనాగంబులుపుట్టె మాతంగియనుదానికిగజంబులుపుట్టె శార్దూలియనుదానికిసింహవ్యాఘ్రంబులుపుట్టె శ్వేతయనుదానికిదిగ్గజంబులుపుట్టెసురభియనుదానికిరోహిణియుగంధర్వియుననంబుట్టిరందురోహిణికిఁబశుగణంబులుపుట్టె గంధర్వియనుదానికిహయంబులుపుట్టెసురసకుసర్పంబులుపుట్టె ననలకుగిరివృక్షలతాగుల్మలంబులుపుట్టె నిదిసకలభూతసంభవప్రకారంబు * చ॥ దివిజమునీంద్రదానవదితిప్రభవాదిసమస్తభూతసంభవముగృతావధానులయిభక్తిమెయిన్వినుచున్నపుణ్యమా। నవులకునిక్కువంబ

—* దేవదానవాద్యంశములచేభూమియందుఁబుట్టినవారిక్రమము. *—

గుమనఘప్రియనిత్యసుఖంబులుంజిరా।యువుబహుపుత్త్రలాభవిభవోన్నతియున్దురితప్రశాంతియున్ * వ॥ మఱియు మర్త్యలోకంబునందు దేవదైత్యదానవులయంశావతారంబులవివరించెదవినుము * క॥ యాదవవంశంబునజగ। దాదిజుఁడగువిష్ణుదేవునంశంబునను।త్పాదిల్లెఁగృష్ణుఁడపగత।ఖేదుఁడువసుదేవదేవకీదేవులకున్ * క॥ శ్రీ వెలుఁగరోహిణికివసు।దేవునకుదయించెవిష్ణుదేవాంశమునన్।భూవంద్యుఁడనంతుఁడుబల।దేవుండుప్రలంబముఖ్యదితిజాంతకుఁడై * వ॥ మఱియులక్ష్మియంశంబునరుక్మిణియుదయించె సనత్కుమారునంశంబునఁబ్రద్యుమ్నుండుపుట్టె నప్సరసలయంశంబులఁగృష్ణునిషోడశసహస్రాంతఃపురవనితలుపుట్టిరయ్యాయి వేల్పులయంశంబుల వృష్ణియదుభోజాంధకవంశంబులవీరులనేకులుపుట్టిరిమఱియు * క॥ ముదమునఁబ్రభాసుఁడను నెని।మిదియవవసునంశమునను మేదినిభీష్ముం।డుదయించెసర్వవిద్యా।విదుఁడపగతపరశురామపీర్యుఁడుబలిమిన్ * క॥ అనఘుఁడుశుక్రునియంశం।బుననుభరద్వాజుకలశమునఁబుట్టెశరా।సనవిద్యాచార్యుఁడుభూ।వినుతుఁడుద్రోణుండునిఖిలవేదవిదుండై * క॥ అలఘుఁడుకామక్రోధా। దులయేకత్వమునఁబుట్టె ద్రోణునకుమహా। బలుఁడశ్వత్థామరిపు।ప్రళయాంతకుఁడస్త్రశస్త్రపరిణతుఁడగుచున్ * వ॥ మఱియు నేకాదశరుద్రులయంశంబునఁగృపుండుపుట్టె సూర్యునంశంబునఁగర్ణుండుపుట్టె ద్వాపరాంశంబునశకునిపుట్టెనరిష్టాపుత్రుండయినహంసుండను గంధర్వవిభుండుధృతరాష్ట్రుండయిపుట్టె మతియను వేల్పుగాంధారియైపుట్టె మఱియున య్యక్షలఅసంగలియంశంబునదుర్యోధనుండుపుట్టెఁ బౌలస్త్యభ్రాతృవర్గంబుదుర్యోధనానుజశతంబైపుట్టె హిరణ్యాకశిపుండుశిశుపాలుండైపుట్టెప్రహ్లాదుఁ [illegible] డైపుట్టెశిబియనువాఁడుద్రుమసే

నుం డై పుట్టె బాష్కళుండు భగదత్తుం డై పుట్టె విప్రజిత్తియను దానవుండు జరాసంధుం డై పుట్టె నయశ్శిరుండు సు
ష్ణుండును నయశంకుండును గగనమూర్ధుండును వేగవంతుండును ననువారేవురు దానవులు కేకయరాజు లయి పుట్టిరి
సుంతుండ మితౌజుం డై పుట్టె స్వర్భానుం డుగ్రసేనుం డై పుట్టె జంబుండు విశోకుం డై పుట్టె నశ్వపతి కృతవర్మ యై పు
షపర్వుండు దీర్ఘప్రజ్ఞుం డై పుట్టె నజరుండు మలుం డై పుట్టె నశ్వగ్రీవుండు రోచమానుం డై పుట్టె సూక్ష్ముండు బృ
థుం డై పుట్టె మహుండను వాఁడు సేనాబిందుం డై పుట్టె నేకచక్రుండు ప్రతివింధ్యుం డై పుట్టె విరూపాక్షుండు
ర్మ యై పుట్టె హరుండును నహరుండును గృపబాహ్లికు లై పుట్టిరి చంద్రవక్త్రుండు ముంజకేశుం డై పుట్టె నికుంభు
వాపి యై పుట్టె శరభుండు సోమదత్తుం డై పుట్టెఁ జంద్రుండు చంద్రవర్మ యై పుట్టె నర్కుండు రుచిరుం డై పుట్టె మ
డు విశ్వుం డై పుట్టె సుపర్ణుండు క్రోధకీర్తి యై పుట్టె రాహువు క్రోధుం డై పుట్టెఁ జంద్రహంతయను కుం డై పుట్టె
డను వాఁడ శోకుం డై పుట్టె భద్రహస్తుండు నందుం డై పుట్టె దీర్ఘజిహ్వుండు కాశిగా డై పుట్టె జానకియను వాఁడు
త్రమత్స్యుం డై పుట్టె వృత్రుండు మణిమంతుం డై పుట్టెఁ జంద్రవినాశుండు చేకితానుం డై పుట్టెఁ గాలాపుత్రు
త్రుక్రమంబున జయత్సేనాపరాజిత నిషధాధిప శ్రేణిమన్మహౌజో మతిమత్సముగ్రసేన బృహత్తు లై పుట్టిరి క్రోధ
శాది పుత్రగణంబు వలన సంధకర్ణ వేష్టసిద్ధార్థకీలక సురభిసుబాహు మహావీర కురుక ధరక్రోధ విచిత్రసురస శ్రం
తానిలపారిత వీరరామ భూమిపాల దంతవక్త్ర రుక్మి జనమేజయాషాఢ వాయువేగ భూరితేజ నైకలవ్య సుమిత్ర
ముఖక రూశ క్షేమధూర్తి శ్రుతాయు రుద్ధవ బృహత్సేన కేతుమాగ్ర తీర కుహక మతిమ ద్రాజపు రాము ల నేకులు పుట్టిరి సు
నేమి కంసుం డై పుట్టె స్త్రీపుంసత్వధరుం డైన గుహ్యకుండు శిఖండి యై పుట్టె బృహస్పతి యంశంబున బృహత్క్ష
సు రాజర్షి పుట్టె మరుద్గణాంశంబునఁ బాండురాజు పుట్టె ✽ క॥ సురుతులయంశంబునఁబు । ట్టిరి ముప్పురు వివిధ రణ జ
యబలులుసు। స్థిరయశులు ద్రుపద సాత్యకి । విరాటభూపతులు భువనవిశ్రుతశౌర్యుల్ ✽ క॥ మాండవ్యుండను ముని
చండతరక్రోధజనితశాపంబున ధ। ర్ముం డఖిలధర్మతత్త్వవి। దుం డై విదురుఁ డనఁ బేర్మితో నుదయించెన్ ✽ క॥ ప్రియ
రంగసిద్ధియుఁ బు। ద్ధియునను దేవతలు వసుమతిని గుంతియుమా। ద్రియు నై పుట్టిరి పాండు। ప్రియపత్నులు సకలజగ
త్రల్ ✽ సీ॥ యమునంశమునఁ బుట్టె నధిపతి ధర్మజుం డనిలాంశమునఁ బుట్టె ననిలజుండు। శక్రాంశమున ధనంజయుం
డుంచె నశ్వినులయంశములనూర్జితులు నకుల । సహదేవు లనవద్యచరితులు పుట్టిరి శ్రీమూర్తి యై యాజ్ఞసేని పుట్టె
యంశమున జితారి ధృష్టద్యుమ్నుఁ డనఁ బుట్టె ద్రుపదరాజాన్వయమున -ఆ॥ ననఘ యిది సురాసురాంశావతా
దీని విని నఁ దగిలి భక్తిఁ। జదివినను సమస్తజనులకు నఖిలదే। వాసురాదులిత్తురభిమతములు ✽ వ॥ అనిన విని జన మేజయుం
వైశంపాయనున కిట్లనియె ✽ సీ॥ అభ్యస్తవేదవేదాంగులు విధ్యుక్తదక్షిణా తర్పితధరణిదేవు । లనవరతాశ్వమేధా
థస్నానపూతమూర్తులు కృతపుణ్యులహిత । వర్గజయులు ప్రాప్తవర్గ చతుష్టయులు సత్త్వాదిసద్గుణజన్మనిలయు
తాదిమహామహీపాలకులిద్ధయశో మూర్తు లెందు బుట్టి -ఆ॥ రట్టి కౌరవాన్వయంబుఁ బాండవనృప। రత్నములకు
మైన। దాని విన గవలతుఁ దద్దయుఁ బ్రీతితో। విప్రముఖ్య నాకు విస్తరింపు ✽ వ॥ అనియడిగిన జనమేజయునకు వైశం
సుం డిట్లనియె ✽ చ॥ నిరుపమధర్మమార్గపరినిష్ఠితు లై మహి నెల్లఁ గాచుచుఁ। బరఁగిన త్రాంటి పూరుకురుపాండు
లపేర్మిఁ జేసి భూ। భరవహనక్షమం బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం। బురుగుణసంపదం బెరిగి యొప్పె సు
ప్రసిద్ధ మై ✽ వ॥ అది యెట్లనిన నందొల్లి దాక్షాయణి యైన యదితికిఁ గశ్యపునకుం బుట్టిన వివస్వంతునకు వైవస్వ
మనువును యముండును శనైశ్చరుండును యమునయుఁ దపతియు ననం బుట్టిరందు వైవస్వతుండను మను
బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లైన మానవులు పుట్టిరి మఱియు వానికి వేనప్రముఖు లైన రాజులేఁబండ్రు
శకటు లై తమలోన యుద్ధంబు చేసి చనిరి మఱియు నమ్మనుపుత్రి యైన యిలయను దానికి సోమపుత్రుం డైన బుధు
రూరవుండు పుట్టి చక్రవర్తి యై ✽ క॥ ఇమ్మహీంద్రు యోదశద్వీ । పమ్ములు తనశౌర్యశక్తిఁ బాలించి మదాం । ధ
విప్రోత్తమవి । త్తమ్ములు దానపహరించె ✽ వ॥ వాని దుర్నయంబునకు సంగా బ్రహ్మనియుక్తుం డైన

మహికిం।జనుదెంచె బ్రహ్మలోకం।బుననుండియ నేకదివ్యమునిసంఘములతోఁ * వ॥ పురూరవుండును రాజ్యగర్వంబున
మ్మునులకుదర్శనంబీనొల్లకయపహసించిననలిగి వారలువానినున్మత్తుంగాశపియించిన వాఁడు గంధర్వలోకంబున
నూర్వశీసహితుండై యుండె నట్టిపురూరవునకునూర్వశికినాయువుధీమంతుండువసువుధృతాయువు వనాయువుశతా
యువునను నార్వురుకొడుకులువుట్టిరందాయువునకు స్వర్భానవియనుదానికినహుషవృద్ధశర్మాజరా సేనసులనంగాన
వురువుట్టిరి వారియందునహుషుండురాజ్యాభిషిక్తుండై * మ॥ చతురంభోధిపరీతభూవలయమున్సద్వీపసారణ్యస।క్షి
తిభృత్కాంబసుదానిభూరిభుజశక్తిం జేసిపాలించుచుం।గ్రతువుల్నూటొనరించికీర్తివెలయంగాదిక్పాలన్నిర్జితా।హ్వా
నుఁడై యానహుషుండుదాఁబడసెదేవేంద్రత్వముంబేర్మితోఁ * వ॥ అట్టినహుషునకుఁ బ్రియంవదయనుదానికియతియ
యాతిసంయాత్యాయాత్యుద్ధవులనంగా నేవురువుట్టిరందుయయాతిరాజై యనేకయాగంబులుచేసిశుక్రపుత్రియయి
దేవయానియందుయదుతుర్వసులనునిద్దఱుకొడుకులంబడసె వృషపర్వపుత్రియయినశర్మిష్ఠయందుదుహ్యానుపూరు
నంగాముగ్వురుకొడుకులంబడసిరాజ్యంబు సేయుచు శుక్రశాపంబునజరాభారపీడితుండై కొడుకుల నందఱంబిలిచి
యిట్లనియె * సీ॥ విషయోపభోగాభిలషణమింకను నాకువదలక పెరుగుచున్నదియుఁగాన।నందనులారమీయందొక్క
రుండునాదగుజరాభారంబుదగిలితాల్చి । తనజవ్వనంబునాకొనరంగ నెవ్వఁడీనోపునాతండసద్వీపసకల। ధారుణీసా
మ్రాజ్యభారయోగ్యుండగుననియడిగిననగ్రతనయుఁడయిన - ఆ॥ యదువుఁదొట్టిసుతులుముదిమికినోపక।తలలువాంచి
యున్నవెలయఁదండ్రి।పనుపుఁజేసిముదిమిగొనిజవ్వనంబిచ్చెఁ।బూరుఁడనుసుతుండుభూరియశుఁడు * వ॥ అనినవిన్నిజన

—*యయాతిమహారాజుచరిత్రము*—

మేజయుండు వైశంపాయనునకిట్లనియె * తే॥ వర్ణధర్మముల్గాచువసుధయెల్ల।ననఘచరితుఁడై యేలినయయ్యయాతి।
భూసురోత్తమభార్గవపుత్రియయిన। దేవయానినిదానెట్టుదేవిఁజేసె * తే॥ విపుల తేజంబునసుదపోవీర్యముననుజగద
నుగ్రహనిగ్రహశక్తియుక్తుఁ।డయినయట్టియయాతికినలిగియేమి।కారణంబునశాపంబుగావ్యుఁడిచ్చె * వ॥ మఱియు
సర్వకల్మషధ్వంసకరుండయిన యయాతిచరితంబువినవలతుం జెప్పుమనియడిగినవానికి వైశంపాయనుండిట్లనియె * క॥ మను
జాధిపవృషపర్వుం। డనుదానవపతికిశుక్రుఁడాచార్యుండై। యనిమిషవిరోధులకుఁబ్రియ। మొనరించుచువివిధవిధిన
నుపాయములన్ * క॥ దేవాసురరణమునగత। జీవితులగునసురవరులఁజెచ్చెరమృతసం। జీవనియనువిద్యఁబున
ర్జీవులఁగాఁబ్రతిదినంబు సేయుచునుండెన్ * వ॥ దానినెఱింగి దేవతలెల్లనతిభీతులై యసురులనోర్వనోపకశుక్రువల
ననమృతసంజీవనిబడసి తేనోపునట్టిమహాసత్త్వుండెవ్వండగునోయనివిచారించి బృహస్పతిపుత్రుండయిన కచునికడకుఁ
జనియిట్లనిరి * క॥ పోరునమృతసంజీవని।కారణముననిహతులయ్యుఁగారసురవరు।ల్వాగలనోర్వఁగమనకతి।భారము
దుర్వారవీర్యబలయుతులగుటన్ * క॥ మనపక్షంబునవార।ద్దనుజులచేనిహతులయ్యుఁదగమృతసంజీ।వనిలేమిఁజేసిశ
ననుస।దనమునకరుగుదురువీర్యదర్పితులయ్యున్ * క॥ కావునమృతసంజీవనిఁ। దేవలయుసుశుక్రువలనధృతిఁబడసితప।
స్సంభవదానిబలమునఁ।గావంగావలయుసురనికాయబలంబున్ * క॥ బాలుండవునియమవ్రత।శీలుండవునిన్నుఁబ్రీతిఁ
గొనితద్విద్యాలలనాదానముఁగరు।ణాలయుఁడై చేయునన్మహామునిసీకున్ * వ॥ దుహితృస్నేహంబునంజేసియ
దేవయానిపలుకులుశుక్రుఁడతిక్రమింపండుగావున నీనేర్చువిధంబునదానిచిత్తంబువడసిశుక్రునారాధించిన నీకిష్టసి
ద్ధియగునని దేవతలువంచినంగచుండును దేవహితార్థంబువృషపర్వపురంబునకుంజనియచ్చట వేదాధ్యయనపరుండయి
సకలదానవగణోపాధ్యాయుండయియున్నశుక్రుంగనినమస్కరించియిట్లనియె * క॥ ఏనుగచుఁడనువాఁడమహానియ
మసమన్వితుఁడబృహస్పతిసుతుఁడన్।మానుగవచ్చితినీకును।భానునిభాశిష్యవృత్తిఁబని సేయంగన్ * వ॥ అనినవమ్ముని
కుమారునిసుకుమారత్వంబునువినయప్రియవచనమృదుమధురత్వంబుసునవరతనియమవ్రతప్రకాశితప్రశాంతత్వం
బునుంజూచిశుక్రుఁడతిస్నేహంబునవీనింబూజించినబృహస్పతింబూజించినయట్లయనియభ్యాగతపూజలవానిసంతు
ష్టుంగాఁజేసిశిష్యుంగాఁజేసికొనియున్నంతనక ... * సీ॥ ... బనపడి చేసెదననకతన్పంచినయతఁ

ణంబు చేయుచు నిజగురుచిత్తవృత్తికిఁ గడు ననుకూలుఁడై వినయంబుతోడ । మనమునఁ జెయ్వులమాటల భక్తినెక్కుడై మఱియంతకంటె । దేవయానికి సువిధేయుఁడై ప్రియహితభాషణములఁ బుష్పఫలవిశేష—ఆ॥ దానములను సంతసిల్లఁజేయుచు । నివ్విధమునఁ బెక్కులేండ్లు నిష్ఠ । గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర । నెమ్మి వడసె ధనమునెక్కు

వ॥ ఇట్లు గురుశుశ్రూషాగౌరవంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండయి యున్న నెఱింగి దానవులు సహింపక బృహస్పతితోడి వైరంబున నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచు చు వనంబున నేకతంబ యున్నవాని విశాలసాలస్కంధంబున బంధించి చనిరంత నాదిత్యుండస్తగిరిశిఖరగతుండగుడు మగిడి హోమధేనువులింటికి వానితోడ నకచుండు రాకున్న దేవయాని తనమనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె * ఉ॥ డమయాఖమల్లలుగు వాఁడపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్ । న్నేఁ డిటవచ్చె నేకతమ నిష్ఠ మెయిన్ భవదగ్నిహోత్రవృ లొప్పఁ డిగ వేల్వఁ గాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండ దేమొకో । రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధకు

—*కచుండు దానవహతుండై మృతసంజీవనిచే బ్రతుకుట.*—

డెనో * వ॥ అనిన విని శుక్రుండు దన దివ్యదృష్టిం జూచి యసురవ్యాపాదితుండైన కచుం గని వానిం దోడ్కొని తెచ్చి సంజీవనిం బంచిన నది యును బ్రసాదంబని యతిత్వరితగతిం జని విగతజీవుండయిన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొనివచ్చె నంజూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యున్నంతఁ గొన్ని దినంబులకు వెండియు నొక్కనాఁడు* క॥ అడవికి బట్టు బుచేరఁ గ । వడి నరిగిన కచుని జంపి వానిని దనుజు । ల్పొడవు సెడఁ గాల్చి సురతోఁ । దడయక యబ్భాది శుక్రుఁ ద్రావఁగ రొగిన్ * వ॥ శుక్రుండును సురాపానమోహితుండయి యున్నఁ దొల్లింటి యట్ల దేవయానికచుంగానక దుఃఖితయై డుసు గచుండు రాక మసలెన సురులచేత నిహతుండయ్యెఁ గావలయునని శోకించిన దానిం జూచి శుక్రుం డిట్లనియె* క కసంజీవని పెంపగణితగర్వమున నసురులాకచుతోడం । బగఁ గొని చంపెద రాతఁడు । సుగతికిఁ జనుఁ గాక యేల శోకింపంగన్ * వ॥ అనిన దేవయాని యిట్లనియె* మ॥ మతిలోకోత్తరుఁడై నయంగిరసు మన్మండాశ్రితుండా బృహస్పతి పుత్రుడు మీకు శిష్యుఁడు సురూప బ్రహ్మచర్యాశ్రము । వ్రతసంపన్నుఁడ కారణంబ దనుజవ్యాపాదితుండైన నిమ్మహాత్ముఁ డక్కచునకై శోకింప కెట్లుండుదున్ * వ॥ వానిం జూచి కానికుడువ నొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బ్రొద్దున మఱ్ఱి సన్నుండయి శుక్రుండు దన యోగదృష్టిం జూచి లోకాలోకపర్యంత భువనాంతరంబునఁ గచుం గానక సుర మిశ్రభస్మమయుండయి తనయుదరంబుననున్నయక్కచుం గని సురచేసిన దోషంబును నసురులవలన నైన యపకారంబును నెఱింగి* ఆ॥ మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మములు పరఁగఁ బెక్కు చేసి పడయఁబడిన । యట్టి యెఱుక సురామాత్రన । చెఱుచు మద్యసేవ సేయనగునె* క॥ భూసురులాదిగఁ గలజను । లీసుర సేవించిరేని యిది మొదలుగ ని క్కిఁ బతితులగుదురు । చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్ * వ॥ అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా నియమించి తనయుదరంబునన్నున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన నందయుండి కచుండు శుక్రునకిట్లనియె* క॥ తనువు త్త్వంబును బడసితి నీ ప్రసాదమున నీ యుదరంబున ఘూ వెలువడు మార్గంబు నాకు భూసురోత్తమ వ॥ అనిన నా యుదరంబు భేదిల్లినం గాని యిమ్ముని కుమారుండు వెలువడ నేరండుదరభేదనంబున మూర్ఛితుండనయిన సంజీవితుం జేయవలయునని శుక్రుండు గచునకు సంజీవని నుపదేశించిన* క॥ ఉదరభిదాముఖమునను భ్యుదితుండయి చెలువమసుతుఁడు గచుండు । ఉదయాద్రిదరీముఖమున । నుదితుండగు పూర్ణహిమమయూఖుఁడపోలెన్ ॥ అంత* క॥ మృతుఁడై పడియున్న వేదమూర్తి । యతని చేత సంజీవితుఁడయి వెలింగె । దనుజమంత్రియుచ్చారణదక్షుచేత । నభిహితం బునట్ల పోలె* వ॥ ఇట్లతి ప్రయత్నంబునఁ గచుండు శుక్రువలన సంజీవని వడసి పెద్దకాలంబుండి యొక్కనాఁడు శుక్రు నను జ్ఞాతుండయి దేవలోకంబునకుం బోవుచుండి దేవయానికతి ప్రియపూర్వకంబుగాఁ జెప్పిన నదియును దద్వియోగ దుఃఖిత యయి కచున కిట్లనియె* ఉ॥ నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యక న్మహీ । దేవకులాపతంసరవి తేజ వివాహ కుము । న్నా వచశ ...నైన యసన్నెఱుగు... జీవ సతీ ... డ శుక్రుఁ దయఁ జేయుము నాకుఁ బ్రియం

షర్ * క॥ఆకచుఁడత్యంతవిషా।దాకులుఁడై లోకనింద్యమగునర్థముఁ నీ। వాకునకుఁ దెచ్చుటుచితమె।నాకుసహోదరివినీ
పునాచిత్తమునర్ * క॥గురులకుశిష్యులుపుత్రులు।పరమార్థముఁ లోకధర్మపథమిదిదీనిం।బరికింపకయీపలుకులు।తరుణీగు
సపుత్రినీకుఁదగ్గునేపలుకర్ * వ॥ అనిననాకచునకుదేవయానికరంబలిగినీవునామనోరథంబువిఫలంబుగాఁజేసినవాఁ
కవునీకుసంజీవనిపని సేయకుండెడుమని శాపంబిచ్చినఁగచుండేనుధర్మపథంబుదప్పనివ్వాఁడనునీవచనంబుననాకుసంజీవ
నిపని సేయదయ్యె నేనినాచేతనుపదేశంబుగొన్నవారికిఁబని సేయుంగాక మఱినీవుధర్మవిరోధంబు దలంచితివి కావున
నిన్నుబ్రాహ్మణుండువివాహంబుగాకుండెడుమని దేవయానికిఁబ్రతిశాపంబిచ్చితత్క్షణంబ * క॥ దేవగురునందనుఁ
డమ।రావాసంబునకునరిగియమరులకునుసం।జీవనియుపదేశించిను। ధీవిభుఁడొనరించుచుండె దేవహితంబుల్ * వ॥ఇ
ట్లువృషపర్వుకూఁతురుశర్మిష్ఠయనుకన్యకయొక్కనాఁడుకన్యకాసహస్రపరివృతయయి దేవయానీసహితంబువనంబు
నకుంజని యొక్కసరోవరతీరంబునఁ దమతమపరిధానంబులువెట్టి జలక్రీడలాడుచున్నవిసురకరువలి చేతంబ్రేరితం
బులయికలసిన నొండొరులంగడువఁగొలను వెలువడి సంభ్రమంబుననక్కన్యకల న్యోన్యపరిధానంబులువీడ్వడంగొని
కట్టు నెడ దేవయానిపుట్టంబు శర్మిష్ఠగట్టికొనిన మఱిదానిపరిధానంబు దేవయానిపుచ్చుకొనక రోసిశర్మిష్ఠంజూచియి
ట్లనియె * క ॥ లోకోత్తరచరితుండగు।నా కావ్యతనూజనీకునారాధ్యను నేఁ। బ్రాకటభూసురకన్యక।నీకట్టినమయిల
పట్టనేర్తునెయనిన్ * వ॥శర్మిష్ఠయిట్లనియె * క॥మాయయ్యకుఁబాయకపని। సేయుచుదీవించిప్రియము సేయుచునుం
దుర్।మీయయ్యయేటిమహిమలు। నాయొద్దనెపలుకనీకునానయు లేవే * వ॥నాకట్టినపుట్టంబునీకుంగట్టంగాకేమిటు
గర్వంబుననెగ్గులాడి దేవయానినొక్కనూతంద్రోచి శర్మిష్ఠకన్యకాసహస్రపరివృతయయిక్రమ్మఱివచ్చినిజనివా

——*యయాతిచేనూతంబడినదేవయానినుద్ధరించుట.*——

సంబుననుండెనంత * ఉ॥ఆనహుషాత్మజుండగుయయాతియధిజ్యధనుస్సహాయుఁడై।యానతశాత్రవుండొకమృగయా
లసలోలనిబద్ధబుద్ధియై।తాకొనమెల్లఁగ్రుమ్మరినికామధృతశ్రముఁడై గుడెంచెనం।దానలినాక్షియున్నవిపినాంతరకూప
తటంబునొద్దకున్*సీ॥చనుదెంచియమ్మహాజనపతిజలమపేక్షించియచ్చోవిశ్రమించి చూచి।తత్కూపమునవిలసత్కూ
లఘనవల్లియన్నిష్టసఖిఁ దియున్నదాని। గురుకుచయుగముపైఁబరువడిఁదొరిగెడుకన్నీరుపూరించుచున్నదాని।స
మీపమునకుజనులయాగమనంబుపన్నుగాఁగోరుచునున్నదాని -ఆ॥ వరుణదేవుతోడఁగరమల్గిజలనివాసంబువిడిచి
భూస్థలంబువలని। కరుగుదేరనున్న వరుణేంద్రుదేవియోయనఁబోనిదాని దేవయానిఁగనియె*వ॥కనినీవెవ్వరిదానవిక్లేశ
మేకతంబ యివ్విపినాంతరకూపంబునన్నుదానవనినవిని దేవయాని యెప్పుడునుండమువిహరించుచున్న యవ్వనంబున
మృగయావినోదార్థంబుయయాతివచ్చుటంజేసితొల్లియుఁజూచినదై యతనికిట్లనియె * తరల॥అమరసన్నిభయేను
ఘోరసురాసురాహవభూమిన। య్యమరవీరులచేతమర్దితులైనదానవులగత। భ్రములఁగాఁదనవిద్యపెంపునఁ
బ్రాప్తజీవులఁజేసియ। త్యమితశక్తి మెయిన్వెలింగినయట్టిభార్గవుకూఁతురన్ * క॥దేవయానియనుదానప్రమాద
వశంబున నినూతంబడి వెలువడ నేరకున్నదానననన్నుద్ధరించిరక్షింపుమనిననవ్విప్రకన్యకయందుఁదగ్గయుదయాళుం
డై * చ॥జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీ। తలవహనక్షమంబయినదక్షిణహస్తమునందమన్నమ్రద్ధ
దురుఘర్మవారికణక్రమకరాబ్జమువట్టినూతిలో। వెలువడఁగోమలిందిగిచెవిశ్రుతకీర్తియయాతిప్రీతితోన్ * వ॥ ఇ
ట్లు దేవయానినుద్ధరించి యయాతినిజపురంబునకరిగెనిట దేవయానియు శర్మిష్ఠ సేసినయెగ్గువలనవిముక్తయయితన్న
రయుచువచ్చుదాని ఘూర్ణికయనుపరిచారికంగనియేనువృషపర్వుపురంబుసొరనొల్లశర్మిష్ఠచేతనాపడిన యపయానం
బమదీయజనకునకెఱింగింపుమనిపంచిన నదియునునతిత్వరితగతింజనితద్వృత్తాంతంబంతయు శుక్రునకుంజెప్పిన శు
క్రుండును నాతఃక్షణంబకోపఘూర్ణితబాష్పపూరిత నయినయైయున్న దేవయానింగనియిట్లనియె * క ॥ అనుపమనియ
మాన్వితులై।యనూనదక్షిణలఁగ్రతుసహస్రంబులచే। సినవారికంటెనక్రో।ధనుఁడుకరంబధికుఁడం శ్రుతత్త్వవిధి
జ్ఞుల్ * క॥అలిగిననలుగక యెగ్గులు । [illegible] కబన్నమునవడియెదఁ।దలఁపకయు

న్నతఁడచూవే ధర్మజ్ఞుఁడిలన్ * వ॥ కావునబుద్ధిగలవారికిఁ గ్రోధంబుగొనియాడందగదు శర్మిష్ఠ రాచకూఁతు
డికయదిదానితోడివిరోధంబేమిరమ్మనిన దేవయాని యిట్లనియె * క॥ కడునసురక్తియు నేర్పును। గడఁకయుఁగ
సురకకడవఁగ నెగ్గు।ల్నొడివెడు వివేకశూన్యుల । కడనుండెడునంతకంటెఁ గష్టముగలదే * వ॥ ఈవృషపర్వు
బేనుజొరనొల్ల నేటనేనియుంబోదుననిన శుక్రుండు నాకునీవగతివి నీతోడనేనును వత్తు ననుచుఁ గూతునొడఁబఱ
న్నంత నంతయుఁజారులవలన నెఱింగి వృషపర్వుండు శుక్రునొద్దకువచ్చి నమస్కరించి యిట్లనియె * ఉ॥ దే
యించుచునతిస్థిరసంపదలం ద్వదీయవి। ద్యావిభవంబు పెంపునను దానవులుద్ధతులైరి కానినాఁ। డీవనరాశిలో
యింతకునంతకుంగోవులైనయ । ద్దేవపతాకినీపతుల దివ్యనిశాతమహాయుధాహతిన్ * క॥ వారణఘోటక
గారంబులు మొదలుగాఁగఁగల ధనములతో। సూరినుతయుండుమునీ। వారకములుగాఁగ మమ్ముఁ బగవుము బుద్ధిన్
ఈ దేవయానికెద్దియిష్టంబు దానినేనిచ్చెదననడుగుమనిన దేవయాని సంతసిల్లి యట్లైని శర్మిష్ఠం గన్యాకాసహస్ర
నాకుదాసిగానీవలయునిదియ నాకిష్టంబు దీనినిచ్చునదియనిన వృషపర్వుండప్పుడకూఁతు రావించి కన్యాసహస్ర
తో దేవయానికి దాసిగానిచ్చి శుక్రునకు మనఃప్రియంబు సేసిన శర్మిష్ఠయు నగ్గురువచనంబునఁ గన్యాసహస్రంబు
నిత్యంబును దేవయానింగొలుచుచుండె నంతనొక్కనాడు * క॥ వనకేళీకౌతుకమునఁ। జనియెను శర్మిష్ఠఁదోడ్కొ దేవ
ల్లముదం। బునఁగొలిచిరాఁగ విభవము। తనకమరఁగ దేవయాని తద్వనమునకున్ * వ॥ ఇట్లరిగి దేవయాని యమ్మంత
నఁ గన్యకలుం దానును బుష్పాపచయంబు సేయుచు విమలజలనిర్ఝరవిలసితంబైన యొక్కసెలయేటికెలన సునో
కుసుమసుకుమార కోరకనికరభరితసహకార కురువకవకుళాశోక తమాలసాలచ్ఛాయాశీతల సికతాతలంబున జే
వినోదంబులనున్నయవసరంబున * సీ॥ అంగనాజనులయుత్తుంగసంగతకుచకుంభముచందనపంకములయుఁ గో
మ్మిల్లభారాళికలితదివ్యామోదనవపుష్పదామములయు। వారివముఖసకర్పూరతాంబూలాదివాసనాసురభిప్రద
ములయు। వారివపరిధానచారుధూపములయు విలసితసౌరభావలులు దాల్చి * తే॥ యనిలుఁడనుమాతవోయితో।
యుఁదెచ్చె। దేవయానిపాతికి మృగతృష్ణఁజేసి । కాననంబునఁ గ్రుమ్మరువానినీరు। నతిపరిశ్రాంతుఁడైన యయా
త * క॥ తరళనయనాబ్జదళములు। నెరయఁగఁబై మున్నుచల్లి నృపసుతుఁబూజిం। చిరి నవకుసుమమయాలంకారబ

—*యయాతిమహారాజు దేవయానివివాహంబగుట*—

షములనచటికాంతలు ప్రీతిన్ * వ॥ అయ్యయాతియుఁ దత్ప్రదేశంబున సుఖోపవిష్టుండయి తొల్లి దేవయా
వాఁడయ్యు నతిశయరూపలావణ్యగుణసుందరియయిన శర్మిష్ఠ నెఱుంగ వేఁడి మీరెవ్వరివారలు మీకులగోత్రనా
లెఱుంగవలతుఁ జెప్పుండనిన రాజునకు దేవయాని యిట్లనియె * తే॥ నన్నుమున్న యెఱుంగుదిత్యాతి నాకు।
పర్వుఁడను మహాదానవేంద్రు। కన్య నాయొద్ద నెప్పుడుఁ గదలకుండు । ననఘ మఱి దీని శర్మిష్ఠయండ్రు జనులు *
హ మేదినన్ను ధరణీవర కూపము వెల్వరించునాఁ। డుగ్రమయాఖసాక్ష్యముగనున్న తదక్షిణపాణిఁ జేసిభూ।
నాదుదక్షిణకరాబ్జము వట్టితి కానమున్నపా। ణిగ్రహణంబు సేసితది నీయెద విస్మృతిఁ బొందఁ బాడియే * ఉ॥
వాహమైన హుషనందన యీ లలితాంగిఁ దోట్టియీ। కన్నియలండఱున్ ద్విజకన్యలతో నెనమైనవారునీ।
తి సేయఁగ నృపోత్తమ వాసవుఁబోలి లీలతో। నిన్నరలోకభోగముల నేకములందుము నీవు నావుడున్ * వ॥ క్షత్త్రియు
ల బ్రాహ్మణులు వివాహంబగుదురు కాక యథర్మోత్తరంబు గా క్షత్త్రియులు బ్రాహ్మణకన్యకల వివాహంబగుట
కులధర్మవిరుద్ధంబులు మఱియు సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులుగాకుండ రక్షించుచున్నవాఁడనయిట్టి
బునకొడంబడితి నేని జగత్ప్రవృత్తివిపరీతంబగుననిన నయ్యయాతికి దేవయాని యిట్లనియె * క॥ వెలయఁగ ధర్మ
బులు నడపుచు నిఖిలలోకపూజ్యుండైని। ర్మలుఁడగు శుక్రుఁడు వంచిన। నలఘుభుజా నను వివాహమగు దేయని
అమ్మహాముని వచ్చి యిది ధర్మవిరుద్ధంబుగాదని చెప్పె నేని నిన్ను వివాహంబగుదునని యయాతి యొడంబడిన
యప్పుడ శుక్రు రావించిన * క॥ తనదివ్యతేజమునన। వ్వన మెల్ల వెలుంగుచుండ వచ్చెను భృగునం। దనుడు నిజ

యు। మొనరింపఁగఁదలఁచిదానియొద్దకుఁబ్రీతిన్ * క॥ అతిసంభ్రమముననవనీపతివిహితోత్థానుఁడై తపశ్శక్తిఁబ్రజా
నిభుఁడగుభార్గవునకు। నతిభక్తింబ్రణమితోత్తమాంగుండయ్యెన్ * వ॥ మఱియు దేవయానియుఁశర్మిష్ఠయుంగన్యా
సహస్రంబును నత్యంతభక్తితోఁగ్రమంబుననమస్కరించిరంత దేవయానిశుక్రునకిట్లనియె * ఆ॥ ఇన్నరేంద్రుచే
నన్నగృహీతనై। యున్ననాకరంబుగ్రన్ననింక। నొరులకర్హమగునె పరిణయవిషయమై। ధరఁబరిగ్రహింపఁబర
మూర్తి * వ॥ కావుననాకునీజన్మంబునఁ బతియయాతియయితండును భవద్వచనంబున నన్ను వివాహంబగుమనని
నిందుధర్మవిరోధంబులేకుండునట్లుగాఁ బ్రసాదింపవయ్యుననిన శుక్రుండుగరుణించియయాతికినీకును నయినయీవి
వాహంబునందపక్రమదోషంబులేకుండెడుమనివరంబిచ్చియయ్యిరువురకుంబరమోత్సవంబున వివాహంబుసేసిశ
ర్మిష్ఠంజూపియిది వృషపర్వునికూఁతురు దీనికింబ్రియంబున నన్నపాన భూషణాచ్ఛాదన మాల్యానులేపనాదులఁబో
షంబు సేయునదిశయనవిషయంబుఁబరిహరించునదియనిపంచికూఁతునల్లునింబూజించిన నయ్యయాతియుశుక్రుని
క్కొని దేవయానినిశర్మిష్ఠనుగన్యాకాసహస్రంబుఁదోడ్కొని నిజపురంబునకుంజనియంతఃపురరమ్యహర్మ్యతలంబున
దేవయానినునిచితదనుమతంబున నశోకవనికాసమీపంబుననొక్కగృహంబునందుఁగన్యకాసహస్రంబుతోశర్మిష్ఠనుని
దేవయానియందుసుఖోపభోగపరుండై యున్నఁగొండొకకాలంబునకు దేవయానికియదుదుర్వసులనుకొడుకులువు
ట్టనంతశర్మిష్ఠసంప్రాప్తయౌవనయు ఋతుమతియునై యాత్మగతంబున * చ॥ అసదృశయౌవనంబిదియనన్యధనం
లనసునొక్కొ నాకునిక్కుసుమసముద్గమంబుననగోచరదుర్గమదుర్గవల్లరీ। కుసుమసముద్గమంబగునొకో పతిలాభము లే
జేసెమొ। ప్పెసఁగఁగ దేవయానిపతి నేమితపంబొనరించికాంచెనో * క॥ పతిఁబడసిసుతులఁబడయఁగ। నతివలుగోరుదు
గోరినట్టులతనకుం। బతిఁబడసిసుతులఁబడసెను। సతులీభార్గవికిభాగ్యసంపద వెనయే * తరువోజ॥ ఈరాజునందనా
హృదయంబుదగిలియెప్పుడునుండునన్నీతఁడుగరము। కారుణ్యమునఁబ్రీతిగలయట్లుచూచుఁగమలాక్షిభార్గవకన్యదానై
। గోరియీతనిఁదనకునుబతిఁజేసికొనినయట్టులతమేనుగోరిలోకైక। భారధురంధరుఁబరహితధర్మపరునహుషాత్మ

—*యయాతిశర్మిష్ఠకుఁబుత్రదానంబుచేయుట*—

బతిఁజేసికొందు * వ॥ అనివిచారించుచున్నయవసరంబున దానిపుణ్యస్వరూపంబు సన్నిహితంబైనయట్లొక్క
ఁడుయయాతియశోకవనికాలోకనతత్పరుండై వచ్చువాఁడేకతంబయున్నశర్మిష్ఠంగనిన నదియును సంభ్రమవిన
తావనతమైతనవలననమ్మహీపతిప్రసన్నచిత్తుండగుటయెఱింగి కరకమలంబులుమొగిచియిట్లనియె * ఉ॥ నీలగళోప
మానకమనీయగుణోన్నతిఁజెప్పఁజాలున। న్నేలినదేవయానికినరేశ్వరభర్తవుగాననాకునుం। బోలఁగనీవభర్తవిది
తానుతధర్మపథంబునిక్కువం। బాలునుదాసియుంసుతుఁ డునన్నవిపాయనిధర్మముల్మహిన్ * వ॥ అద్దేవయానిం
గ్రహించినప్పుడతద్ధనంబగుట నేనునుభవత్పరిగ్రహంబకావున నన్నుంగరుణించి నాకుఋతుకాలోచితంబుఁబ్ర
దింపవలయుననిననయ్యయాతియిట్లనియె * క॥ లలితాంగిశయనమొక్కఁడు। వెలిగారుచిరాన్నపానవివిధాభర
ణాదులశర్మిష్ఠకునిష్టము। సొలయకచేయుమనిననన్నుశుక్రుండువంచెన్ * వ॥ ఏనమ్మహామునివచనంబునకప్పుడొడం
తినెట్లుబొంకనేర్తుననినశర్మిష్ఠయిట్లనియె * క॥ చనుబొంకఁగఁబ్రాణవ్యయ। మునసర్వధనాపహరణమునవధగా
ప్పినవిప్రార్థమునగవా। శనయానంబులవివాహసమయములందున్ * వ॥ ఈయేనింటియందుననసత్యదోషంబులే
మునివచనప్రమాణంబుగలదు నీవువివాహసమయంబుననొడంబడితివి కావుననసత్యదోషంబునిన్నుఁబొందదనినన
య్యయాతియొడంబడిశర్మిష్ఠకునభిమతంబొనరించెనదియుఁదత్సమాగమంబున గర్భిణియైకొడుకుంగనినవిస్మయంబం
దేవయానిదానికడకువచ్చియిట్లనియె * తే॥ బాలవయ్యునత్యుత్తమశీలవినయ। గౌరవాన్వితవైనిర్వికారవృత్తి। నున్న
నికికినీకునుసన్నుతాంగి। సుతుఁడువుట్టుటయిదికడుచోద్యమయ్యె * వ॥ అదియెట్లనియడిగిన శర్మిష్ఠలజ్జావనతవదన
యిట్లను నెందేనియుండి యొక్కమహామునినిఖిలవేదవేదాంగపారగుండువచ్చిఋతుమతినైయున్ననన్నుం
చినాకుఁబుత్రోత్పత్తిఁబ్రసాదించెనని [illegible] శర్మిష్ఠయునయ్యయాతివంకఁ

గ్రమంబునమహాత్మునుపూరులనంగాముప్పురుకొడుకులంబడసియున్నంతనొక్కనాఁడు * సీ॥ కరువలిచేసు॥అ
సిలజటావళికరమొప్పశిఖలుగాఁగనకరత్న। మయజాలభూషణామలదేహదీప్తులు తేజంబుగానతిదీప్యమాన వదే
గశతంబులనర్చితంబైనమూఁడగ్నులుప్రత్యక్షమైనయట్లు। తన మ్రోలశర్మిష్ఠతనయులుక్రీడించుచుండంగన్గొను
య్యూర్వీతేని- ఆ॥కడకునేగుదెంచెఁగన్యలుదనుజాధి।రాజసుతయుఁదోడరాఁగనొప్పి।దేవి దేవయాని దేవేంద్రకయి
పోలెనంతయనువిభూతిమెఱసి * వ॥ ఇట్లరుగుదెంచియధిక తేజస్వులైయయాతిరూపంబులఁబోలియున్నవనిచి
కులఁజూచియిక్కుమారులెక్కడివారెవ్వరికొడుకులనియయాతినడిగి దేవయాని యలబ్ధప్రతివచనయైయక్కుమా
లమీతల్లిదండ్రులెవ్వరనియడిగిన * క॥తరుణప్రదేశినులమా।సరముగవారలుయయాతిశర్మిష్ఠలఁజూ।పిరిదయుండ
ల్లియుననిIకరమనురాగిల్లెఁగన్యకానివహంబుల్ * వ॥ఇట్లుత న్నెఱుంగకుండనయ్యయాతిశర్మిష్ఠవలనలబ్ధపుత్రపుట్టిన
డగుటయప్పుడెఱింగి * చ ॥ పతివిహితానురాగమున భార్గవపుత్రియయాతిచేతవం। చితయయివాడుదూసులు
సిననెయ్యమెఱింగికోపమగ్గి। ఖితయయితండ్రిపాలికతిఖేదమునంజనిదీర్ఘనేత్రని। ర్గతజలధారలంగడిగెనాశ
దీయపదాబ్జయుగ్మముల్ * వ॥ అయ్యయాతియు దానింబట్టువఱుచుచుఁదోడనచనిశుక్రుంగనినమస్కరించుఁ
దేవయాని గద్గదవచనయై యధర్మంబునధర్మంబుగెడ్పలిచియిమ్మహీశుండాసురంబుననాసురియందసురక్షిత్వం
త్రిత్రయంబువడసినాకవమానంబుసేసెననినవినిశుక్రుండుయయాతికలిగినీవు యౌవనగర్వంబునరాగా
నాకూఁతునకప్రియంబుసేసితివి కావునజరాభారపీడితుండవుగమ్మనిశాపంబిచ్చిననయ్యయాతిశుక్రునకిట్లను
ఋతుమతియైపుత్రార్థము। పతిఁగోరినభార్యయందుఁబ్రతికూలుండై।ఋతువిఫలత్వముసేసిన।నతనికిమహా
హత్యయగునంద్రుబుధుల్ * క॥దానికిభీతుఁడనై య। మ్మానవతీప్రార్థనంగ్రమంబొనరఁగసం।తానము
దలో।దీనికినలుగంగఁదగునెదివ్యమునీంద్రా * వ॥ ఏనిద్దేవయానియందు విషయోపభోగతృప్తుండఁగానుడా
బుఁదాల్పనోపననినవిని వానికిశుక్రుండుగరుణించినీముదిమినీకొడుకులయందొక్కనిపయింబెట్టి వానిజవ్వన
గొనిరాజ్యసుఖంబులనుభవింపుము నీవువిషయోపభోగతృప్తుండవైమఱియునీముదిమినీవతాల్చి వానిజవ్వన
కినిచ్చునదినీముదిమిదాల్చిన పుత్రుండరాజ్యంబునకర్హుండునువంశకర్తయునగుననినయయ్యయాతిశుక్రుమీ
యానీసహితుండయితనపురంబునకువచ్చి శుక్రశాపంబున జరాభారంబుఁదాల్చినవానికి * క॥ తలవడక
నింద్రియములగర్వమడంగెనంగములువదలెవళీ। పలితంబులయ్యెవగరును। దలయేరుననుక్కిసయ్యమునలు

—*యయాతియదుప్రముఖులకుశాపంబిచ్చుట.*—

చెర్ * వ॥ ఇట్లుజరాక్రాంతుండైనయయాతికొడుకులనెల్లరావించినాకువిషయసుఖతృప్తిలేమున్నయదిగా
యందొక్కరుండునాముదిమిగొనితనజవ్వనంబునాకిచ్చునదియనినవిని యదుమర్వసుద్రుహ్యానులుదండ్రి
ఆ॥తగిలిజరయురుజయుదైవవశంబున। నయ్యెనేనివానిననుభవింత్రు।కాకయెఱిఁగియెఱిఁగికడఁగియారెం
చురయ్యయెట్టికుమతులయిన * క ॥ నరలుగలకామునైనను।దరుణులురోయుదురుడాయధనపతియయ్యు
డునర్వారజరా।పరిభూతినభీష్టభోగబాహ్యుఁడకాఁడే * వ ॥ అనియొడంబడకున్ననలిగియయాతియదువ
రురాజ్యంబునకనర్హులుగా దుర్వసువంశంబు వారుధర్మాధర్మవివేకశూన్యులైసంకీర్ణవర్ణకిరాతదేశంబున
గాదుహ్యువంశంబువారుదకప్లవవితహితంబైన దేశంబునకు రాజులుగా జరాదూషకుండగుటననువంశ
ముదిమియగునంతకునుండక జవ్వనంబునఁబంచత్వంబును బొందువారునుగాశాపంబిచ్చి యానలువురకు
వానిశర్మిష్ఠాపుత్రుఁబూరుంబిలిచియడిగినవాఁడు దండ్రికోరినయట్లచేసిన నవయౌవనుండై యయాతియు
ఖంబులు సహస్రవర్షంబు లనుభవించితృప్తుండై పూరుజవ్వనంబువానికినిచ్చి తనజరాభారంబు దానిచే
జ్ఞావిధేయచతురంతమహీతలబ్రహ్మక్షత్రియాది వర్ణముఖ్యులనెల్ల రావించి మంత్రిపురోహితసామంత
సమక్షంబునసకలక్షోణీచక్రసామ్రాజ్యంబునకుఁ బూరునభిషిక్తుంజేసిన సర్వప్రకృతిజనంబులారాజు

చేసి॥అవిచారంబనిపల్కె నోడుదుమధర్మాభిజ్ఞనీయగ్రసం।భవుఁడత్యున్నతశక్తియుక్తుఁడుమహీభారప్రగల్భుండుభా।
వదౌహిత్రుఁడుపౌత్రుఁడీయదుఁడులోకఖ్యాతుఁడుండంగనీ । భువనేశత్వభరంబుఁబూన్పఁడగునే పూరున్లఘున్యా
యంగన్మజుఁ ✻ వ॥అనినవారలకయ్యాయాతియిట్లనియె ✻ క॥ యదుఁడగ్రతనూజుఁడునా । హృదయసముద్భవుఁడువా
క్రమయినమద్వచనం।బదియట్టిదయనికడుదుర్మదుఁడై చేయకకృతావమానుండయ్యెన్ ✻ క॥తనయుండుతల్లిదండ్రులు।
పన్నినచినపనిసేయఁడేనిపలుకెదలోఁజే । కొనఁడేనివాఁడుతనయుం।డనఁబడునేపితృధనమునకర్హుండగునే✻ క॥పూరుఁ
డకొండికయయ్యును।భూరిగుణజ్యేష్ఠుఁడునుసుపుత్త్రుఁడునవనీ। భారకుఁడును నాతఁడునా।కోరినకార్యంబు సేసికుశ
లుఁడయ్యెన్ ✻వ॥నాజరాభారంబుఁదాల్చినపుత్త్రుండరాజ్యంబునకర్హుండునువంశకర్తయునగుననిశుక్రవచనంబును
గలదుపుట్టిదయనియయాతిప్రకృతిజనంబులనొడంబఱిచిపూరునఖిలభూభారధురంధరుంజేసియదుప్రభృతులఁబ్రత్యంతభూ
ములకు రాజులంజేసితాను వేదవేదాంగపారగులయిన బ్రాహ్మణులతోడందపోవనంబుకుంజని యందుఁగందమూలఫ
లాశనుండై వన్యంబులయినఫలంబులు హవ్యకవ్యంబుల నగ్నిభట్టారకుంబితృదేవతలందనుపుచు వానప్రస్థవిధానం
బుఁదప్పక శిలోంఛవృత్తినతిథిభుక్తశేషంబుపయోగించుచు నియతాత్ముండునుజితక్రోధాదిషడ్వర్గుండునయిసహస్ర
వర్షంబులుతపంబుసలిపిసర్వసంగవిముక్తుండయిసర్వద్వంద్వంబులునువిడిచిముప్పదియేండ్లునిరాహారుఁడయియొక్క
యేఁడు వాయుభక్షకుండయిపంచాగ్నిమధ్యంబుననిల్చియొక్కయేఁటనేకపాదంబుననీటిలోనిలిచి మహాఘోరతపం
బు సేసిదివ్యవిమానంబునదేవలోకంబునకుంజనియందు దేవర్షిగణపూజితుండయిబ్రహ్మలోకంబునకుంజనియందుబ్ర
హ్మర్షిగణపూజితుండై యనేకకల్పంబులుండిక్రమ్మఱనింద్రలోకంబునకువచ్చిననింద్రుండువానింబూజించియిట్లనియె✻
క॥ కొడుకుజవ్వనంబుఁగొనినీవునిజరాజ్య । భూరిభరముఁవానిఁబూన్పనప్పు।డతనికెద్దిగఱపితనియడిగినహరి।కయ్యా
యాతియిట్టులనుచుఁబలికె ✻క॥ఎఱుకగలవారిచరితలు।గఱచుచుసజ్జనులగోష్ఠిఁగదలకధర్మం।బెఱుఁగుచునెఱిఁగినదా
ని।ననువకనుష్ఠించునదిసమంజసబుద్ధిన్ ✻క ॥ ఇచ్చునదిధనముపాత్త్రున।కచ్చుగనోరువేఁడకుండునదియభిముఖులై।
వచ్చినయాశార్థులవృథ।పుచ్చకచేయునదిసర్వభూతప్రీతిన్ ✻ క॥మనమునకుఁబ్రియంబునుహిత । మునుబథ్యముఁద
థ్యమునునమోఘమునుమధురం।బునుపరిమితమునునగుపలు।కొనరఁగఁబలుకునదిధర్మయుతముగసభలన్ ✻ సీ॥వదనబా
ణాసనవ్యక్తముక్తములైన పలుకులఁగడువాఁడిబాణతతులఁ । బరమర్మలత్యములప్పాయక భేదించుచుండెడుదుర్జన
క్రోధవరుల। కడనుండకున్నదికరుణయార్జవముక్షజయముసత్యంబునుశమముశౌచ । మనువినియెదనిల్పునదిశత్రుష
డ్వర్గజయమునుంచునదిశుద్ధిశాంతబుద్ధి – తే॥మదముకామంబుక్రోధంబుమత్సరంబు।లోభమును మోహమునునను లోనిస
రాజ।వైరివర్గంబునోడించినవాఁడెయొడుచు।నశ్రమంబునవెలుపలియహితతతుల✻ వ॥అనిపూరుంగఱపితినన్నునావుర
ఘండొరులకుంగఱపునట్టిసర్వగుణసంపన్నుండనినవినియింద్రుండు వెండియునయ్యాయాతికిట్లనియె ✻ క॥ఏమితపంబా
చరించితి।భూమీశ్వరపుణ్యలోకభోగంబులఁదే।జోమహిమననుభవించితి। సామాన్యమెశతసహస్రసంవత్సరముల్ ✻
వ॥అనినయ్యింద్రునకయ్యయాతియిట్లనియె✻క॥సురదైత్యయక్షరాక్షస।నరఖేచరసిద్ధమునిగణప్రవరులభా।సురతప

—✻ఇంద్రుఁడుయయాతినిస్వర్గలోకభ్రష్టునిఁజేయుట.✻—

ములునాదగుదు।ష్కరఘోరతపంబునవతుకావమరేంద్రా ✻వ ॥అనితనతపోభిమానంబునమహాత్ములతపంబులవమానిం
పలికినయయ్యాయాతిగర్వంబునకు సహింపకయింద్రుండలిగినీకుదేవలోకసుఖానుభవంబులందుఁ బుణ్యసమాప్తియ
య్యెనీగర్వంబునిన్నింతచేసె నింకమనుష్యలోకమునకరుగుమనిన వాఁడును మనుష్యలోకంబునకుంబోవనోపకనంత
క్షుంబున సచ్ఛవనంబునసత్సంగతినుండునట్లుగానాకుఁబ్రసాదింపవలయుననియింద్రుననుమతంబువడసి✻ తే ॥అంత
క్షుంబునఖిలదిగంతములును। వెలుఁగఁజనుదెంచునాతనివిమలదీప్తి।చూచిసద్గుణములుగడుఁజోద్యమందె। నురుతరద్యు
యుదియేమియొకొ–యనుచు✻వ॥అంతనయ్యాయాతిదౌహిత్త్రులయినయష్టకుండును బ్రతర్దనుండునువసుమనుండును

నాశీనరుండయినశిబియునను వారలుసద్భువననివాసులు దమయొద్దకుం జనుదెంచినయయాతినధిక తేజోమయు
పుణ్యమూర్తిం గనినిసర్గస్నేహంబునన భ్యాగతపూజలసంతుష్టుం జేసినీవెవ్వండ వెంచుండియేమి కారణంబున
కువచ్చితనియడిగినవారలకునయ్యయాతియిట్లనియె * క॥ అనవద్యధర్మచరితం। బుననున్నతుండైననహుషపుత్రు
బూరుం।డనుమధ్యమలోకేశ్వరు। జనకుండయయాతియనం గనడిచనువాండన్ * క॥ అమితతపోవిభవంబున
లోకంబు మొదలుగాంగలసురలో।కములందుం బుణ్యఫలములం। గ్రమమునభోగించియింద్రుకడకేం జనినన్ *క
నాతపమునక।చ్చెరువడినీతపము పేర్మిం జెప్పుమయనినన్।సురసిద్ధమునీంద్రతప।శ్చరణలునాతపముతోడసరి
చ॥ అమరవిభుండుదానివినియల్గి మదంబుననుత్తమావమా।నముతగునయ్య చేయననినన్నునధోభువనప్రపా
మువివశాత్ముం జేసెనదిపాడియయెందునునల్పమయ్యెద। ర్పముబహుకాలసంచితతపఃఫలహానినొనర్పకుండు
స్లుకుసితశతమఖవచనప్రపీడితుండనయితదాదేశంబుననసద్భువనంబునకువచ్చితిననిన నాతండుతమకుమా
గుటయునతనిమహత్త్వంబును సర్వజ్ఞానసంపత్తియునెఱింగి యష్టకాదులుసకలధర్మాధర్మంబులును
పంబులుజీవులగర్భోత్పత్తిప్రకారంబులువర్ణాశ్రమధర్మంబులునడిగినవారలకయ్యయాతియిట్లనియె *ఆ॥సర్వ
దయకుసత్యవాక్యమునకు।నుత్తమంబుధర్మునొండెఱుంగ।నొరులనొప్పికోడకుపతాపమొనరించు । నదియక
మనిరిమునులు * ఆ॥ వేదవిహితవిధులనాదరించుటయూర్ధ్వ।గతికిం దెరువువిధులం గడచియెందు।నాంగబడినవాంబ
గంగం జేయుట।యధమగతికిమార్గ మనిరిబుధులు* వ॥ మఱియుగర్భయోనియందుఋతుపుష్పరససంయుక్తంబు
తంబుగాడ్పుచేతం బ్రేరితంబయికలసిననంతం బంచతన్మాత్రలుపొడవయిక్రమంబున నవయవంబులేర్పడిలబ్ధ
యుద్భవిల్లిశ్రోత్రంబులశబ్దంబును నేత్రంబులరూపంబును ఘ్రాణంబునగంధంబును జిహ్వనురసంబును
బును మనంబున సర్వంబును నెఱుంగుచుం బూర్వకర్మయోగంబుననైన దుష్కృతబాహుళ్యంబునం బుణ్యంబు
బుద్ధివిరహితంబులయినతిర్యగ్యోనులందుం బుట్టుదురు సుకృతబాహుళ్యంబునం బాపంబుగీడ్పఱిచి బుద్ధియుక్త
ష్యయోనులందుం బుట్టుదురు యుక్తాచారులును దత్త్వవిదులునునయి దేవత్వంబునం బొందిపరిశుద్ధజ్ఞానులయి
మరుమఱియుక్తాచారులెవ్వరనిన గురుశుశ్రూష సేయుచు నిత్యాధ్యయనాగ్నికార్యంబులయందప్రమత్తులయి
శౌచంబులుదాల్చియధిగతబ్రహ్మచర్యులయినబ్రహ్మచారులును బాపంబునకు వెఱచిధర్మవృత్తినతిథులం బూజించు
జ్ఞంబులు సేయుచుం బరధనంబులుపరిగ్రహింపక నిత్యానుష్ఠానపరులయినగృహస్థులును నియతాహారులై సర్వ
లువిడిచి గ్రామ్యవస్తువులుపయోగింపక వనంబుననుండిజితేంద్రియులైన వానప్రస్థులును గ్రామంబుననుండి
ణార్థంబునియతస్వల్పభోజనులయినగరప్రవేశంబులుపరిహరించి కామక్రోధాదులం బొరయకలోకాచార
హితులయిసర్వద్వంద్వంబులునోడిచి సర్వసంగవివర్జితులయియేకచరులయి యనేకనికేతనులయినయతులు
లుతమతమపుణ్యాచారంబులం జేసి క్రిందంబడితరంబులవారిని మీఁదంబడితరంబులవారినిదమ్మునుద్ధరింతురు
న * క॥ మానాగ్నిహోత్రమును మఱి।మానాధ్యయనమును మానమానంబును వి।జ్ఞానమును మానయజ్ఞము
తార్థంబులివియు నాలుగునుర్విన్ *వ॥ అనియయాతియష్టకాదులడిగినవానినెల్ల సంక్షేపరూపంబునం జెప్పుట
లిట్లనిరి* తే॥ సకలధర్మవిదుండవు సర్వలోక । వర్తనము లెఱింగినపుణ్యకర్తవీవు। నెయ్యమొనరంగ నెఱిగింప
మాకు। వెలయం బుణ్యలోకంబులుగలవెయనిన * వ॥ మీకుం బుణ్యలోకంబులుగలవనియయాతి సెప్పినవిని
రుసంతోషించియేమునీదౌహిత్రులముసుమ్మనితమ్మెఱింగించిన వారికిం బుణ్యలోకంబులిచ్చి యయాతిసత్య
తానునుదౌహిత్రులునూర్ధ్వలోకంబునకుం జనిరని * క॥ ఆయతులపుణ్యునకునన।నూయునకుం బరీక్షిదగ్రసుత
శం।పాయనుండనంతపుణ్యఫ । లాయత్తముగాంగం జెప్పెననికడుం బ్రీతిన్॥ ........

క॥ వీరశ్రీవనితాశ్రిత। భూరిస్థిరబాహుదండ బుధనుతసుగుణా। ధారకలియుగపవిత్రపు। రారాతిపదాబ్జపూజనా
సక్తమతీ ❋ మత్తకోకిల॥ దండితాహితవీరసూరినిధానదానవినోదకో। దండపార్థపరాక్రమప్రియధామదిక్ప
రిపూరితా। ఖండపాండుయశోనిధీపరగండభైరవవైరివే। దండమండలచండతుండవిదారణాసిభుజార్గళా॥
గద్య ❋ ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబయిన శ్రీమహాభారతమునం దాదిపర్వంబునందు
శ్రీమహాభారత కథాప్రారంభంబును వ్యాసుజన్మంబును దేవ దైత్య దానవ మునియక్షపక్షి గంధర్వాది
నానావిధ భూతసంభవంబును రాజవంశోత్పత్తియు యయాతిచరితంబును నన్నది తృతీయాశ్వాసము॥❋

శ్రీహయగ్రీవాయనమః.

శ్రీమహాభారతము – ఆదిపర్వము – చతుర్థాశ్వాసము.



శ్రీలలనాస్తనఘటితవి। శాలోరస్థ్సలవివేకచతురాననవా। ణీలీలాస్పదవిలస। చ్చాళుక్యాన్వయపయోధిసంపూ
ర్ణశశీ ❋ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు యయాతికిం బుత్త్రుండయిన పూరుండు సకలమహీరా
జ్యపాలనంబు సేయుచు వంశకర్తయయినవానికిం గౌసల్యయను దానికి జనమేజయుండు పుట్టి రాజయి యశ్వమేధత్రయంబు జేసి
ఖ్యాతి నొందె నా జనమేజయునకు ననంతయను దానికిం బ్రాచీశుండు పుట్టి పరాక్రమంబున నుదయాచలపర్యంతంబు ది
గ్విజయంబు జేసెఁ బ్రాచీశుండు నాఁ బరగెనట్టి ప్రాచీశునకు నశ్మకియను దానికి శర్యాతి పుట్టె వానికి వరాంగియను దానికి
సంయాతి పుట్టె వానికిం గృతవీర్యపుత్త్రియైన భానుమతికి సార్వభౌముండు పుట్టె వానికి గేకయరాజపుత్త్రియైన సునంద
యను దానికి జయత్సేనుండు పుట్టె వానికి వైదేహియైన సుభద్రకు సురాచీనుండు పుట్టె సురాచీనునకు విదర్భరాజపుత్త్రియైన
మర్యాదకు మహాభౌముండు పుట్టె నా మహాభౌమునకుం బ్రసేనపుత్త్రియైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె వానికిం బృథు
శ్రవదపుత్త్రియైన భానుమతికి నక్రోధనుండు పుట్టె వానికిం గాళింగియైన కరండవ యను దానికి దేవాతిథి పుట్టె వానికి వైదే
హియయిన మర్యాదకు ఋచీకుండు పుట్టె వానికి వైరాంగియయిన దేవకి యను దానికి ఋక్షుండు పుట్టె ఋక్షునకుఁ దక్ష
కపుత్త్రియయిన జ్వాలయను దానికి మతివరుండు పుట్టి ❋ క॥ ఇమ్ముగ సరస్వతీతీ। రమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధిమా। ర్గ
మ్మున సద్గుణసముదా। యమ్మెసఁగఁగఁ జేసె సత్త్రయాగము నిష్ఠన్ ❋ క॥ అతనికి సరస్వతీనది। పతి నను రక్తయయి వానిమహా
మతిఁ దనకుం బతిఁ జేసికొని యె ధర్మ। స్థితి నయ్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్ ❋ వ॥ ఆత్రసునకుఁ గాళిందియను దాని

———❋దుష్యంతమహారాజుచరిత్రము.❋———

కి నిళిలుండు పుట్టె వానికి రథంతరియను దానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్యసాధారణగుణయుక్తుండై ❋ క॥ బాలహరి
ణములఁ బట్టెడు। లీలను విషమాటవీచలితకేసరిశా। ర్దూలేభశరభములఁ దన। బాలత్వమునందె యెగచి పట్టుచుమట్టి
యెన్ ❋ క॥ ఉర్వీరుహానివహముతోఁ। బర్వతములు పెఱికి యొండుపర్వతముల పైఁ। బర్వఁగ వైచుచు యౌవన। గర్వంబు
దొప్పెనుర్విఁ గడు నధికుండై ❋ శా॥ ఆ దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగమ। ర్యాదాలంకృతమైన
భూవలయమాత్మాయత్తమై యుండఁగా। నాదిత్యాంశుసమీరదుర్గమమహోగ్రారణ్యదేశాళితో। నాడిత్రచ
క్రేశ్వ, నేలె నజితుండై బాహువీర్యంబునన్ ❋ క॥ ఆతని రాజ్యంబునను। ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో। కాతంక
రహితవర్ణసంకరశంకా। పేతంబై ధర్మచరితఁ బెలుగుచునుండెన్ ❋ వ॥ అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థియ
ఆదిత్యహయంబులకంటె వడిగలవాహంబులం బూన్చిన రథంబెక్కి యాజానేయతురంగారూఢులైన యాశ్వికు
లు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తిచాపకృపాణపాణులయిన వీరభటసహస్రంబులతోఁ జనివనంబులో నిమృగంబులం
బట్టి ముట్టి ❋ క॥ కలయఁగ నార్పును బొబ్బయు। నులివును నవ్విపినమును మహాబ్ధ్యావధి పెలుచం। గలఁచెను దుష్యంతమహా।
మందరనగము సత్త్వభయజననంబై ❋ క॥ సరభసపరిచలితమహా। శరభద్వీపరిపువరాహశార్దూలమద। ద్విరదాదిప్ర

కరభయంకరవనమధ్యమునన్నృపతిగడుకడిమి మెయిన్ * క॥ ఓసరిలిపఱచుమృగములఁ నేసియుఁడాసినమృగ
చిభుజాసిన్। ద్రేసియుఁజంపెనుమృగయా। వ్యాసక్తినపార ఘోరవన్యమృగాలిన్ * వ॥ ఇట్లుపెక్కుమృగంబుల
చంపెడువేడుకనతిదూరంబునకరిగిన నాతనిరథవేగంబుననుగమింపనోపక యధికక్షుత్పిపాసాపరవశులయిన
య్యాయిప్రదేశంబులవిశ్రమించి రంతదుష్యంతుండుకతిపయామాత్యపరిజనపురోహితుండయికొండొకసైన్య
ముందటనొక్కపుణ్యనదీతీరంబునవివిధసురభికుసుమఫలభారవినమ్రతరులతాగుల్మపరిశోభితంబయినయొక్క
గని * క॥ అమరపతినందనమునకు। రమణను వైశ్రవణుచైత్రరథమునకుసమా। నముగాదీనినిభూభా। గమున
చెనొక్కకమలజుఁడుదయన్ * వ॥ అనిదానిరమణీయభావంబుఁబొగడుచుఁజనుదెంచియవ్వనంబుఁజొచ్చి
చ॥ అతిరుచిరాగతుండయిననయాతనికిన్హృదయప్రమోదమా। తతముగనవ్వనంబునలతాలలనల్మృదులాని
కుసుమాక్షతావళులుసేసలుపెట్టినయట్టులైరిసం। పతదళిసీనినాదమృదుభాషలదీవనలొప్పనిచ్చుచున్ * క॥ కా
అచుమృగములనూఱడకందిగిచిడస్సియున్నతనిశ్రమం। బాఱఁగనెదఁబరితాపము। దీఱఁగఁబైవీచెనన్నదీ
మానినీవృత్తము॥ ఏచితనర్చితలిర్చినక్రొవ్వులనిమ్మగుతావులజొంపములన్ । బూచినమంచియశోకములన్
బొన్నలఁగేదఁగులన్। గాచిబెడంగుగఁబండినయా సహకారములంగదళీతతులం। జూచుచువీనులకింపెసఁగన్
శుకకోకిలసుస్వరముల్ * కవిరాజవిరాజితము॥ చనిచనిముందటనాజ్యహవిర్ధృతసౌరభధూమలతాతతులం
మ్రాఁకులకొమ్మలమీఁదనపేతలతాంతములైననుబా। యనిమధుపప్రకరంబులజూచిజనాధిపుఁడంతనెఱింగె
నమిదియల్లదెదివ్యమునీంద్రనివాసముదానగునంచునెదన్ * వ॥ ఇట్లుహృదయసుఖావహంబగుచున్నయవ్వన
నరిగియరిగియనవరతమహాద్విజపఠ్యమానపదక్రమవేదధ్వనులును నవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రసేవన
శబ్దంబులును ననేకమునిగణప్రణీతవచనవిషయవిభాగవినిర్ణయన్యాయనిపుణవిద్వత్సంభాషణ ఘోషణంబులు
తిపక్షువిభేదనవిచార్యమాణప్రమాణవేదార్థమీమాంసకగోష్ఠీవి వాదనాదంబులును జేసి మ్రోయుచుయజ్ఞప్ర
ప్రవీణులయినయాజ్ఞికులకునువిహితానుష్ఠానాసక్తులయినయనుష్ఠాతలకు నధికతపోనిరతులయినమహాతపోధ
నునివాసంబయినపుణ్యనదీతీరంబునఁదద్దయురమ్యంబైన నరనారాయణస్థానంబునుంబోలెజగత్పావనంబు
ణ్వమహామునియాశ్రమంబుగనియందు * సీ॥ శ్రవణసుఖంబుగాసామగానంబులుచదివెడుశుకములచదువు
లకవినుచుండుకరులయుఁగరికరశీతలచ్ఛాయదచ్ఛీకరంబు। కణములచల్లనిగాడ్పునపడివానిఁజెందిసుఖంబున్న
ములయు। భూసురప్రవరులుభూతబలుల్దెచ్చి పెట్టునీవారాన్నపిండతతులు — తే॥ కడఁగిభక్షింపనొక్కటఁగలసియాత
చున్నయెలుకలపిల్లులయొండుసహజ। వైరసత్త్వంబులయుసహవాసమహిమ। చూచిమునిశక్తికెంతయుఁజోద్యపడుచు
వ॥ ఇక్కాశ్యపుండైనకణ్వమహామునీంద్రునకునమస్కరించివచ్చెదనావచ్చునంతకు నందఱిచ్చోటనయుండ
చ॥ వలయునమాత్యులందగినవారలనుండఁగఁబంచిధారుణీ। తలవిభుఁడొక్కరుండచనితన్వీఁబయోజదళాయతా
కులమిళితాళినీలపరికుంచితకోమలకుంతలన్ శకుం। తలయనుకన్యకంగనియెఁదన్మునివల్లభమందిరంబునన్ *
మునునంతవిలాసంబున జయంతుండపోలెనున్న యతనిదుష్యంతుఁగానెఱింగి యతిసంభ్రమంబుననాసనా
ద్యాదివిధులంబూజించికుశలంబడిగిననకన్యకంజూచిదుష్యంతుండిట్లనియె * ఉ॥ క్రచ్చఱవేఁటవచ్చియిటఁ
మునిఁజూచిపోవఁగా। వచ్చితిమెంముఁబోయిరొక్కొవారనినన్వినియాలతాంగివా। రిచ్చటనుండియాశ్రమఫ
కుఁబండ్లుదేరమీ। వచ్చుదెఱింగిరేనిజనవల్లభవారునువచ్చురింతకున్ * వ॥ వారువచ్చునంతకునొక్క
మాత్రంబుండుమనదియనిసవినియకోమలివినయంబునకుమృదుమధురవచనంబులకుసంతసిల్లిదానింగన్యక
గిమనోజరాజ్యలక్ష్మియుంబోలెసర్వలక్షణలక్షితంబులైన దానిసర్వావయవంబులుచూచి సంచలితహృదయు

——*శకుంతలదుష్యంతునికిఁదనజన్మక్రమంబెఱిఁగించుట.*——

వెవ్వరికూఁతుర విట్టిరూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరి వింధుల కేలవచ్చితనియడిగిన నదియిట్లనియె *

ల్లభమేన । త్యాగశీలధర్మస్వరూపుఁడనిజనములర్థిఁ । భోగదుఁగజగదారాధ్యుం । డగుకణ్వమహామునీంద్రునాత్మ జనినిఁ * చ॥ ఇదిమునికన్యయేనిమతిమేలొకొయీలలితాంగియందునా । హృదయముతద్దయుందగిలెనిప్పలుకింక నమ్మనేరన । వ్యేదవిజితేంద్రియుండనఁగ నిమ్మునిఁబాయకవింమనంచుఁడా । నిదికలరూపెఱుంగనవనీపతియుత్సు కడయ్యెనాత్మలోఁ * వ॥ ఇట్లుదుష్యంతుండాశకుంతలజన్మంబెఱుంగవేఁడి వెండియుదానికిట్లనియె * తే॥ ఉత్తమాశ్ర మనిష్ఠితుఁడూర్ధ్వరేతుఁ । డయినకణ్వమహామునియనఘచరితుఁ । డట్టిమునికెట్లుకూఁతురవై తిదీని । నాకునెఱుఁగంగఁజె ప్పుమునలిననేత్ర * వ॥ అనియడిగిననారాజునకుశకుంతలయిట్లనియె * క॥ ఇకఁ మలాక్షిశకుంతల । యొకఁ డియదిదీనిజ మెవ్విధమనిత । న్మొకఁ మానినాథుఁడడిగిన । నికాఁశ్యపులర్థిఁజెప్పిరేనువినంగఁ * వ॥ నాజన్మప్రకారంబుమాయ య్యయమ్మునికింజెప్పినవిధంబుచెప్పెదఁజిత్తగించివినుమనియాదుష్యంతునకుశకుంతలయిట్లనియె * సీ॥ అనఘుఁడు రాజర్షియయితపశ్శక్తిమైబ్రహ్మర్షిభావంబుఁబడసియున్న । సమ్మునీశ్వరుఁడువిశ్వామిత్రుఁ డతిఘోరతపముసేయు చున్నఁదత్తపమున । కెంతయువెఱచి దేవేశ్వరుఁడప్సరోగణములలోనగ్రగణ్యయైన । దానిమేనకయనుధవళా క్షిఁబిలిచివిశ్వామిత్రుపాలికిఁజనితదీయ- ఆ॥ ఘోరతపముచెఱిచికోమలినాదైన । దేవరాజ్యమహిమఁదివిరనీవు । గావు మనినదియుఁగడుభయంపడియను । రేశ్వరునకుమ్రొక్కి యిట్టులనియె * చ॥ వనజభవప్రభావుఁడగువానివసిష్ఠునపత్య శతముఁ । వననిధిలోనముంచినయవారితసత్త్వుఁడునిన్నుఁదొట్టియా । యనిమిషులెల్లవానికిభయంపడుచుండుదురట్టి యుగ్రుకో । పనుకడకిప్డేగుమనిపాడియెయిప్పనినన్నుఁబంపఁగఁ * ఉ॥ అమ్మునియల్గిచూచుడుసునత్క్షణమాత్రన ధారుణీధ్రమ్ములువ్రయ్యనయ్యెసుముదక్కఁగనంబుధులింకుమూఁడులో । కమ్ములుదిర్దిరందిరుగుగాడ్పుచలిం పోఁడునుగ్రతం । బమ్మినయట్టికోపపరుపాలికిభామలువోవనోడరే * వ॥ అయిననునానేర్చువిధంబుననమ్మునివ తంబుచిత్తంబుమెత్తనయిచిత్తజాయత్తంబగునట్లుచేసెదనని వాసవువీడ్కొని మేనకతనకుమందమలయానిలంబుతోడు జనుదెంచిహిమవత్పర్వతప్రదేశంబునందపంబుసేయుచున్నవిశ్వామిత్రువనంబుసొత్తెంచెనంత * క॥ చల్లనిదక్షి ణమారుత । మల్లనవీతెంచెఁదగిలియాలలనాథ । మ్మొల్లకుసుమాంగరాగస । ముల్లసనసుగంధియగుచుమునివరుమీఁదఁ * చ॥ మిషకాంతయున్నవలతాంతవిభూషణలీలనల్లన । ల్లనవనకేళిలాలసవిలాసగతింజనుదెంచిముందటఁ । గనియెమునీశ్వ రుఁగాశికుఁగాశికచిత్తభీతిసం । జననమహాతపశ్చరణసంయతచిత్తునిరస్తచిత్తజుఁ * క॥ అంబుజలోచనగనివిన యంబుననమ్మునికిమ్రొక్కి-యనురాగముతో । డంబుప్పావచయవ్యా । జంబునవిహరించుచుండెసఖులుండానుఁ * చ॥ అ తమొప్పఁగాఁదరుణియమ్మునివల్లభుమోవిలనున్ననా । మిళితసుగంధబంధురసమీరవశంబునఁదూలిబాలపై । వలు వలఁబయల్పడియెవల్లకుచంబులుఁగతయుక్మముఁ । లలితకృశోదరంబుఁదరళత్రివళీయుతరోమరాజియుఁ * క॥ డుఁదనదృష్టినాటుడుఁ । గందర్పునిశాతసాయకంబులుపెలుచఁ । డెందమునన్నాటధృతిచెడి । కందిమునీంద్రుండుదా నవయందివిరెఁ * వ॥ మేనకయువిశ్వామిత్రునిష్టంబునకుందగినకామోపభోగంబులఁబెద్దకాలంబురమియించిన వృద్ధఁఱకునికన్యకపుట్టినదీనిమాలినియనునొక్కయేటిపులినతలంబునంబెట్టి మేనకదేవలోకంబునకుంజనియెవిశ్వా మిత్రుండునుదపోవనంబునకుంజనియెనంతనమ్మునిప్రభావంబునంజేసియన్నదీతీరంబున * ఆ॥ చెలఁగిలేవనేడ్చుచిఱు దానిఁగ్రవ్యాదఘోరమృగములశనబుద్ధిఁ । బట్టకుండఁజెట్టుపలఁగప్పిరక్షించు । కొనిశకుంతతతులుకాడియుండె * అంతనేమునుశిష్యగణంబులతోడసమిత్కుసుమఫలాహరణార్థంబకఁడకుంజనియమ్మాలినీపులినతలంబునశకుం తరక్షితమైయున్నకూఁతు నత్యంతకాంతిమతినవనీతలంబున కవతరించిన తరుణశశిరేఖయుంబోలెనున్నదాని నెత్తు కొనివచ్చిశకుంతరక్షితయగుటంజేసిశకుంతలయనునామంబిడి కరంబుగారవంబునంబెనిచితిమి * మధ్యాక్కర॥ తన నకుండునన్నప్రదాతయునుభయత్రాత । యనునననఁగనింతులకుమువ్వురొగినయిరిగురువులు । అనఘయుపనేత ప్రశియునిరంతరాధ్యాపకుండు । ననఁగఁబురుషునకయ్యేవురనయంబుగురువులైరి * వ॥ అనంబరఁగినశాస్త్రార్థంబు ముదీనికిభయత్రాతలమగుటంజేసి గురులమిదియునుమాచేనభివర్ధితయగుటంజేసి మాకుహృదయానందనిమైన

కూఁతురనికణ్వమహామునులమ్మునికింజెప్పినవిధంబంతయుసవిస్తరంబుగాశకుంతలచెప్పినవినిదుష్యంతుఁడా

——*దుష్యంతుండుశకుంతలనువివాహంబు చేసికొనఁగోరుట.*——

బున * చ ॥ ఇదిమునినాథకన్యయనియెంతయునిస్పృహవృత్తినున్ననా।హృదయమురాజపుత్రిననియిక్క
జాభిజాత్యసం । పదనెఱిఁగించినన్మదన బాణపరంపరకిప్పుడుండెనా । స్పదమయిసంచలించెనళిపాతవి
జాకృతిక్ * వ॥అనుచుమదనాతురుండయిదుష్యంతుండుతనయందకోఁ-మలియనురాగంబుపలక్షించియిట్ల
-ఈవల్క-లాజినములకు।నీవన్యఫలాశనములకీవిటపకుటీ । రావాసములకునుచితమె।నీవిలసితరూపకాంతి
ల్ * ఉ॥ఈమునిపల్లెనుండుటిదియేలకరంబనురాగమొప్పఁగా । భామినినాకుభార్యవయిభాసురలీలన
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగనందుమనిందితేందుపా। దామలతుంగహర్మ్యములహారిహిరణ్మయకుట్ట
సీ॥బ్రాహ్మంబుదైవంబుపరఁగనార్షంబుప్రాజాపత్యమునురాక్షసంబునాసు । రంబుగాంధర్వంబురమణ
బుననునెనిమిదివివాహములయందుఁ।గడుఁబ్రశస్తంబులుక్షత్రవైశ్యులకుగాంధర్వరాక్షసములుధర్మయు
నాకునునెమ్మిఁబరస్పరప్రేమంబుగాముండుపెంపఁదొడఁగెఁ-ఆ॥గాననెడయుఁజేయఁగా నేలగాంధర్వ
మగుటవిననెయుక్త।మనినలజ్జఁజేసియవనతవదనయై।యాలతాంగియిట్టులనియెఁబతికి * క॥కరుణానిరతు
నూపులింతకుమదీయజనకులుసనుదెం।తురువారువచ్చినీకి।చ్చిరేనిపాణిగ్రహణముచేయుమునన్నుక్ * వ॥
ష్యంతుండిట్లనియె* తే॥తనకుమఱితానెచుట్టంబుతానెతనకు।గతియుఁదన్నిచ్చుచోఁదానకర్తయనఁగ।వనజ
ధర్వవివాహమతిర।హస్యమునునమంత్రకమునునగుచునొప్పు*వ॥అనిదుష్యంతుండుగాంధర్వవివాహస్వ
ప్పిశకుంతలనొడంబఱిచిననదియిట్లనియె * చ॥ నరనుతనీప్రసాదముననాకుదయించిననందనున్మహీ । గురు
రాజ్యమునకుందయతోనభిషిక్తుఁజేయఁగా । వరముప్రసన్నబుద్ధిననవద్యముగాదయసేయునెమ్మితో। ని
యట్లయిననీకునునాకునుసంగమంబగుక్ *వ॥అనినవినిశకుంతలకెంతయుసంతోషంబుగాదానికోరినవరం
ధర్వవివాహంబుననభిమత సుఖంబులనుభవించియకోఁ-మలిపీడకొఁ-ని నిన్నుఁదోడ్కొఁ-ని తేరనమ్మత్పృథానవ
ణ్వమహామునిపాలికింబుత్తెంచెదననిఁయూఱడనొడివిదుష్యంతుండునిజపురంబునకుంజనియె నిటశకుంతలయుఁ
నదానిమునివరుండెఱింగి యలిగెడునోయనివెఱచుచుండెనంతనమ్మహామునివనంబుననుండికందమూలఫల
నిచనుదెంచి లలితశృంగారభావంబున లజ్జావనతవదనయు నతిభీతచిత్తయునై నకూఁతుంజూచి తనదివ్య
నంతవృత్తాంతంబు నెఱింగిక్షత్రియులకుగాంధర్వవివాహంబువిధిచోదితంబయనిసంతసిల్లిశకుంతలకిట్లనియె
నీకులగోత్రసౌందర్యములకుఁ।దగినపతిఁగంటిదానికిఁదగఁగగర్భ।మయ్యెనీదుగర్భమునవాఁడఖిలభువన । వ
యుఁడగుచక్రవర్తిసుమ్ము * వ॥నీధర్మచరితంబునకుమెచ్చితినీవుకోరినవరంబిచ్చెదవేఁడుమనినశకుంతలయు
జెప్పడుధర్మునందతగిలియుండను నాకుద్భవిల్లెడుపుత్త్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్యబలసమన్వి
కర్తయుఁగావలయుననినన్నమ్మహామునికరుణించిదానికోరినవరంబిచ్చియథాకాలవిధులగర్భసంస్కా-రర
యుంచియున్నంతవర్షత్రయంబుసంపూర్ణంబయినశకుంతలకుభరతుండుదయించికణ్వనిర్వర్తితజాతక
కలాపుండయి పెఱుగుచుఁగరతలాలంకృతచక్రుండును జక్రవర్తిలక్షణలక్షితుండునుసింహసంహనను
ర్ఘబాహుండుననంతజవసత్త్వసంపన్నుండును నై పెఱుగుచు * మ॥ అమితోగ్రాటవిలోనఁగ్రుమ్మరు
శశార్దూలఋ । క్షమదేభాదులఁబట్టితెచ్చిఘనుఁడైకణ్వాశ్రమోపాంతభూ।జములందోలినకట్టుచుంబలి
తలుండొప్పెవ।న్యమదేభంబులనెక్కు-చుందగిలినానాశైశవక్రీడలక్ * వ॥ ఇట్లువనంబులోనిసర్వసత్త్వ
నమహాసత్త్వంబునం జేసిదమియించుచున్నయాతనిఁజూచియాశ్చర్యంబందియందలిమును లెల్లనాతనికిసర్వ
డనునామంబుఁజేసిరికణ్వమహామునియునక్కు-మారునుదారతేజోరూపవిక్రమగుణంబులకుసంతసిల్లి వీ
యౌవరాజ్యాభిషేకంబు

కూఁతునకిట్లనియె * ఆ॥ఎట్టిసాధ్వు

నెవ్వండేనిమూఁడులోకంబులంజూడనిచ్చగించునాతండు దనకుండగనీవిద్య పెంపునసర్వంబునుజూచు నేమదీనంజేసి
కాదేమానవులకువిశిష్టులమయి వేల్పులచేతశాసింపంబడక జీవించెదమది కాపురుష ప్రాప్తంబయిఫలియింపదునీవుతా
పత్యవంశవర్ధనుండవు మహాపురుషుండవునీకుసఫలంబగునీవిద్యగొనునప్పుడుషాణ్మాసిక వ్రతంబు సేయవలయునీవునా
కునాగ్నేయాస్త్రంబిచ్చునదిమహాజవసత్త్వసంపన్నంబులు కామగమనంబులునయినగంధర్వహయంబులమీ కేవుర
కునూ తేసియిచ్చెద*సీ॥వృత్రుపైగీర్వాణవిభుఁడల్గి వజ్రంబువైచిననదివానివజ్రకరిన। పటుమస్తకంబునఁబడిపాతర
యమునఁబదివ్రయ్యలైనఁదద్భాగచయము। క్రమమునబ్రాహ్మణక్షత్రవిట్ఛూద్రులయందు వేదంబులునాయుధములు।
హలముశుశ్రూషయునయ్యెవజ్రంబులువాహంబులందుజవంబువజ్ర- తే॥మయ్యెనట్టిజవంబుననభిమతంబు।లగుచును
న్నహయంబులెయ్యవనిపులకు।నఖిలభువనమురక్షించునపుడుసకల। సాధనములలోనుత్తమసాధనంబు*వ॥అనినవిని
యర్జునుండువానికిట్లనియె*ఆ॥ఎంతమిత్రులయిననెన్నండునోరులచే।విద్యయనుశుభంబువిత్తచయముఁ।గొనఁగనొల్ల
నాకుఁగూర్తేనిననలాస్త్ర।మనఘనీవుగొనుముహయములిమ్ము*వ॥నీతోడసఖ్యంబుఁజేసెదమఱిమమ్ముఁబరమధార్మిక
లంబరమబ్రహ్మణ్యులనేమికారణమదరిపలికితనినగంధర్వుండిట్లనియె*క॥విమలములయిలోకత్రితయములఁబ్రవర్తిల్లు
మీమహాగుణములునిత్యమువిందునారదప్రముఖమునీశ్వరసిద్ధసాధ్యగణములవలనన్*క॥మేరునగోత్తంసమహీభార
ధురంధరులమిమ్ముఁబాండవులగుణాధారులనిలలోనెఱుఁగని।వారెవ్వరుగలరెభరతవంశోత్తములన్*వ॥పనుమిమ్ముఁ
నెఱింగియుమీకునగ్నిపరిగ్రహంబునుబ్రాహ్మణసంగ్రహంబును లేమింజేసిపరుసంబులువలికితిమఱియును*ఉ॥ఇంతులగో
ష్ఠినున్నయతడెంతవివేకముగల్గెనేనియ।త్యంతమదాభిభూతుడగుధర్మువుదప్పిప్రియంబెఱుంగఁడే। నెంతవివేకినయ్యును
సహింపకయింతులయొద్దబలికితిన్।వింతయెకాముశక్తియుడివింపఁగశక్యమెయెట్టివారికిన్*క॥సురగరుడవిషోరగయ।
క్షరాక్షసపిశాచభూతగంధర్వులునో।పరుధిక్కరింపభూసుర।పురస్కృతులఁబుణ్యమతులభూతలపతులన్*సీ॥అనవద్య
వేదవేదాంగవిశారదుజపహోమయజ్ఞప్రశస్తుసత్య।వచనువిప్రోత్తమువర్గచతుష్టయసాధనసఖుసదాచారుసూరి।శి
ష్టుఁబురోహితుఁజేసినభూపతియేలునుర్వీతలంబెల్లనిందుఁ।బరలోకమునఁబుణ్యపరులలోకంబులువడయుజయస్వర్గఫల
ముసూవె- ఆ॥రాజ్యమదియునుర్వరాసురవిరహితుఁ।డయినపతికిఁగేవలాభిజాత్య। శౌర్యమహిమమెఱయసమకూఱున
య్యతా।పత్యనిత్యసత్యభాషణుండ*వ॥మీరుధర్మానిలశక్రాశ్వినులవరంబునంబాండురాజునకుఁగుంతికింబుట్టినవారలు
ధర్మవిదులరువేదవేదాంగధనుర్వేదపారగుండయినభారద్వాజుశిష్యులరఖిలలోకహితులరుగావునంబురోహితరహి
తులరయియుండఁదగదు*ఆ॥పాండుపుత్రనీవుబ్రహ్మచర్యస్థుఁడ।వగుటఁజేసిమన్మథార్తునన్ను।నెడిచితిందురాత్రియుద్ధ
బుఁజేసికా।మోపభోగనిరతుఁడోటువడఁడె* వ॥మఱియుఁగామప్రవృత్తుండయ్యును మహీపతిమహీసురవరపురస్సరుండ
గునేనియెల్లయుద్ధంబులజయించు*ఉ॥వేదమువేదియుంగలుగువిప్రవరేణ్యుఁడగణ్యపుణ్యసం। పాదిపురోహితుండయి
నఁబాపములొందునెభూపతింబ్రతా। పోదయకానమీదగుగుణోన్నతికిందగధర్మతత్త్వసం। వేదిఁబురస్కరింపుఁడుప
విత్రచరిత్రుమహీసురోత్తమున్* తే॥అనినవానికినర్జునుండనియెమమ్ము।ననఘతాపత్యులనిపల్కఁదతిముదమున। నేము
కౌంతేయులముమఱియెట్లుచెప్పు।మయ్యతపతికపత్యులమయినతెఱఁగు * వ॥అనిననర్జునునకునంగారపర్ణుండిట్లనియె*

——*తపతీసంవరణోపాఖ్యానము*——

సీ॥ ఆదిత్యునకుఁబుత్రియనఁగసావిత్రికిననుజయుత్తమలక్షణామలాంగి ।తపతియనఁగన్యకధవళాయతేక్షణయౌవన
సంప్రాప్తయైనదానిఁ।జూచియక్కన్యకసురుచిరగుణములకనుగుణుఁడగునిర్మలాభిజాత్యుఁ। బతినెవ్విధంబునఁబడ
యుదునోయనితలఁచుచునున్నయత్తపనుఁగూర్చి- ఆ॥భక్తిఁదపముఁజేసెఁబ్రభుఁడజామీఢునఁ।దనుఁడుభరతకులుఁడు
ధర్మవిదుఁడు।సర్వగుణహితుండుసంవరణుండను।వాఁడుకృతజపోపవాసవిధుల * చ॥గగనమునందునెందునధికప్రభ
నేనువెలుంగునట్టులి।జ్జగతిఁబ్రసిద్ధుఁడైవెలుఁగుసంవరణుండుమదీయపుత్రికిన్।దగుపతివీనికిచ్చెదముదంబుననీలలితాం
గింజుమా।నుగనెదనిశ్చయించెఁదపనుండుదదియతపఃప్రసన్నుఁడై*వ॥[illegible]నాఁడుసంవరణుండుమృగయా

వినోదార్థియయి వనంబునం బరిభ్రమించి క్షుత్పిపాసాపీడితతురంగుండయి యేకతంబ పాదచారియగుచుం జని యొక్క
పర్వతప్రదేశంబునందు * క॥ కనియె నొకకన్యం గోమల। కనకప్రభ నిజశరీరకాంతిను పొంతం। బునవృక్షలతావలిం గా

———*సంవరణుండు తపతిం జూచి మోహించుట*———

చననుయ యముగం జేయుచున్న చంద్రనిభాస్యన్ * వ॥ కనియనిమిషలోచనుండయి మనంబున నిట్లని వితర్కించె * సీ॥ త్రి
భువనలక్ష్మియే తెంచియే కాంతమి ట్లెల్లలో కోయున్నది యివ్వనమున। గగనమణిప్రభ గగనంబునం దుండి యవనీతలప్రా
ప్తయయ్యెనొక్కొ। శంభుని లావణ్యసద్గుణసముదాయ మిందయి మ్మగసంగ్రహించెనొక్కొ। దీని యంగములం బొందిన
ద్విభూషణశ్రీయే మిపుణ్యంబుం జేసెనొక్కొ - ఆ॥ యమరకన్యయొక్కొ యక్షకన్యక యొక్కొ। సిద్ధకన్య యొక్కొ త్రి
మృద్ధి। సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్య। కన్యయగు ననంతకాంతి పేర్మి * చ॥ నెఱికురులున్ విలోలసిత నేత్రయుగంబును
ష్పులొప్పవా। తెఱయను దీనియాననము తెల్వికరంబు మనోహరంబు నే। నెఱింగిన యంతనుండియు నుసిట్టిలతాలలితా
గిం జూచియే। నెఱుంగను రేంద్రకన్యకలు నిట్టి రెరూపవిలాససంపదన్ * వ॥ అని వితర్కించుచు మదనకర్కశమార్గణ
భూతచేతస్కుండయి తదీయగుణమయ పాశబద్ధుండును బోలెం గదలనేరక తన్నివేశితమానసుండును బోలెంద
ఱుంగక తద్రూపామృతపానంబున ననిమిషత్వంబు వొందిన తననయనంబులు దానియందనిలిపి సంవరణుండక్కన్యకకి
ట్లనియె * ఆ॥ ఎఱుంగం జెప్పుమబల యెవ్వరిదాన వి। ట్లేల యున్నదాన వేకతంబ। క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్నయీ। వి
విషమశైలవిపినభూమి * క॥ అనిపలుకుచున్న నృపనం। దనునకు మఱుమాటయీక తామరసనిభా। ననమేఘమధ్యసౌదా
మనివోలె నడంగె దృష్టిమార్గము గడవన్ * వ॥ ఇట్లు దృశ్యంబయిన యక్కన్యకం గానక మానవపతి మానరహితుండు
మహీతలంబున బడి ప్రలాపించుచున్న నాతని నభినవయౌవనోద్భాసితు ననంగజాకారుం జూచి తపతియు మదనబా
ణబాధితయయి క్రమ్మఱం దనరూపంబుం జూపి మధురవచనంబుల నిట్లేల మోహగతుండవయితని యడిగిన దానికి సంవర
ణుండిట్లనియె * చ॥ ధరణి నతిప్రతాపబలదర్పమునం గడునేన పెద్దనై। వ్వరికి నిముకన్ భయంపడనివాండ భయార్తుండనైతి
పుపం। కరుహదళాయతాక్షి దయం గావుము నన్ను భవన్నిమిత్తదు। ర్భరతర పంచబాణహతిం బంచతం బొందకయుండ
ట్లుగాన్ * వ॥ నన్ను గాంధర్వవివాహంబున వరియింపుమనిన సంవరణునకుం దపతి యిట్లనియె * క॥ భువనైకదీపకుండగు
సవితృనకుం దనూజ మఱియు సావిత్రికి నే। నవరజనవినయవర్జిత। నవనీశ్వర వినుము తపతి యనుసురకన్యన్ * వ॥ నాయ
దునీకుం బ్రియంబుగల దేని మదీయజనకు నడుగు నది యాతండు నన్నిచ్చు నింతులకు స్వాతంత్ర్యంబులేమి నీ వెఱుంగవే
పున ననవరతజపనియమప్రణిపాతంబుల నాదిత్యు నారాధింపుమని చెప్పి తపతియాదిత్యమండలంబునకరిగె నంతసంవ
రణుండు మూర్ఛాగతుండయి యున్న నాతని యమాత్యుండు వచ్చి శీతలజలంబులం బరిషేచనంబు సేసిన మూర్ఛదేఱి య
మ్మహీపతి యప్పర్వతంబుననుండి మహాభక్తితో సూర్యు నారాధించుచు * చ॥ ప్రతిహతరాగకోపభయుం బంకరుహ
ప్రభవప్రభావుడూ। రితచరితున్ మునీశ్వర వరిష్ఠు వసిష్ఠు మహామునిం బురో। హితు నతిభక్తితోం దలంచె నిష్టమెఱింగి వ
ష్ఠుండున్ సమా। హితమతి నేగుదెంచి కనియెం బ్రభు సంవరణుం బ్రియంబునన్ * వ॥ ఇట్లు తలంచిన పండ్రెండవ దివసంబు
న వచ్చి వసిష్ఠుండ విరళవ్రతోపవాసకృశీభూతశరీరుండయి యున్న సంవరణుం జూచి యాతండు తపనసుతయందు యో
తపతియందు బద్ధానురాగుండగుట తనయోగదృష్టి నెఱింగి * చ॥ జగదభివంద్యుండాత్మణమ సన్మతి సంవరణప్రయోజ
నం। బొగినొనరింపంగా నయుతయోజనముల్సని లోకలోచనుం। డగు దిననాథునాతత సహస్రకరుం గనిసన్నుతించె
త్యగణిత వేదమంత్రముల నమ్ముని నాథుండతిప్రియంబుతోన్ * వ॥ సూర్యుండు వసిష్ఠమహామునిన్ నతిగౌరవంబున సంభా
వించి భవదాగమనప్రయోజనంబు సెప్పుమనిన వసిష్ఠుం డిట్లనియె * సీ॥ అలఘుండు పౌరవకులశేఖరుండు సంవరణు
న్వాండనవరతకీర్తి। విదితుండు ధర్మార్థవిదుండు నీపుత్త్రికి ననగణితగుణములం దగువరుండు। కావున నతనికిం దేవి గాందపతి
లయుంగూంతుల గన్నఫలము దగిన। వరునకు సద్ధర్మపరునకు నీగానంగాదె నావుడు సూర్యుండాదరించి - ఆ॥ నరుండు రాజ
శేఖరుండు సంవరణుండ। యనుగుణుండు దీనికనికరంబు। గౌరవమున నిచ్చియాభూషితోడంబు। త్తెంచెం గురుకులాగ్ర

కునకు * వ॥ ఇట్లొక్క నిమిషంబునలక్షయునూటయఱువదినాలుగుయోజనంబులుపఱచు నాదిత్యురథంబుతోనశ్రమం బుననరిగితపనదత్తయయినతపతిందోడ్కొని వచ్చి విధివంతంబుగావివాహంబు సేసె మహాత్ములయినపురోహితులంబ డసినరాజులకునిష్టంబులయినశుభంబులగుటనిశ్చయంబయిట్లుసంవరణుండుదపతివివాహంబయి* క॥ఆతరుణియందుఁ జేతో।జాతసుఖప్రీతిఁదగిలి శైలాటవులఁ । వీతనృపకార్యధర్మ।వ్రాతుండయిపదియు రెండువర్షములుండెఁ * వ॥ దా నంజేసిమహీతలంబునకనావృష్టియయిన నెఱింగివసిష్ఠుండుశాంతికపౌష్టికవిధులొనరించి సంవరణుందోడ్కొనిహ స్తి పురంబునకరిగిననఖిలప్రజలకునను రాగంబయ్యెననావృష్టిదోషంబునుంబాసె నంతసంవరణునకుందపతికిందాపత్యుం డనఁగురుండుపుట్టెనది మొదలుగామీరు తాపత్యులరయితిరనిగంధర్వుండు సెప్పిననర్జునుండిట్లనియె * క॥నుతముగనస్మ త్కులభూ।పతులకునామ్యులకుఁబుణ్యభాగులకుఁబురో। హితుఁడయినవసిష్ఠుమహా। త్మతఁజెప్పుమువినఁగవలతుమదినే ర్పడఁగాఁ *వ॥అనినగంధర్వుండిట్లనియె*క॥ధృతినెవ్వనినేనిఁబురో।హితుఁగాఁబుణ్యమునఁబడసియిక్ష్వాకుకులో।క్షి తులయినపతులురాజ్యో।న్నతినొప్పచుఁజేసిరుర్వినానాక్రతువుల్ * క॥బలమతికామక్రోధం।బులు రెండుజయింపఁ బడితపోవీర్యబలం।బులఁజేసి చేయనవిన।చ్చలు నెవ్వనియేనిపాదసంవాహంబుల్ * సీ॥శమహీనుఁడయినవిశ్వామిత్రు చేసినయపకారమునఁజేసియాత్మసుతులు । యమసదనంబునకరిగినవారలఁదనతపోవీర్యసత్త్వములపేర్మిఁ।గ్రమ్మఱిం పఁగశక్తిగలిగియు వేలనయ్యంబుధిగడువనియట్లుశాంతుఁ । డయియెవ్వఁడేనికృతాంతకుఁగడవంగనొల్లండాయట్టియ త్యుగ్రతేజుఁ – ఆ॥ డగువసిష్ఠమునిమహాత్మతఁజెప్పనా।కలవియగు నెయనిననవ్వసిష్ఠ।గాధిసుతులకేమికారణంబునని

——*అంగారపర్ణుఁడర్జునునకువసిష్ఠుమహిమచెప్పుట.*——

ట్టి।వైరమయ్యె నెఱుఁగవలతుదీని*వ॥చెప్పుమనియర్జునుండడిగినగంధర్వుండిట్లనిచెప్పెఁదొల్లికన్యాకుబ్జంబునంగాధిపు త్రుండువిశ్వామిత్రుండనువాఁడునిరమిత్రంబుగాధాత్రి నేలుచునొక్క నాఁడు మృగయావినోదార్థంబపారబలసమే తుండయిమహారణ్యంబునంగ్రుమ్మరికడుడస్సి వసిష్ఠాశ్రమంబునకువచ్చిన నమ్మునివరుండువిశ్వామిత్రునతిప్రీతింబూ జించివానికినివాని సేనకునభిమతంబులయినయాహారంబులఁగురియ నందినియనుహోమధేనువుంబంచిననదియు* క॥ఘృతనదములును నోదనప।ర్వతములుదధికుల్యములునవారితరసపూ। రితబహువిధోపదంశో।న్నతపుంజంబులునుదక్ష ిణంబునఁగురిసెఁ*వ॥ఇట్లుచతుర్విధాహారంబులనందఱందృప్తులంజేసియున్ననందినింజూచివిశ్వామిత్రుండువిస్మితుం డయియాత్మగతంబున* అక్కర॥మృదురోమములునుశంఖనిభకర్ణముల్మెత్తనివలుద।పొదుగునిడుదచన్నులునుగుఱుచ లయిపొలుచుకొమ్ములును। సదమలశరదిందుతారనిభమైనచాయయుఁగలుగు। నొదవిదినిధిసేరినట్లుసేరెనిమ్మునికిఁబు ణ్యమున*వ॥అనిపెద్దయుంబ్రొద్దుచింతించితత్పరిగ్రహకుతూహలస్వాంతుండయివిశ్వామిత్రుండువసిష్ఠునకిట్లనియె* తే॥దీనికంటెనునొప్పెడిదానినొక్క।లక్ష మొదవులనీకిత్తునక్షయముగ। రాజ్యమయిననిచ్చెదజగత్పూజ్యనాకు।నిమ్మనీ హోమధేనువునెమ్మితోడ*చ॥అనినవసిష్ఠుఁడిట్లనియెనంతధనంబునునట్టిరాజ్యముం।గొననగునయ్యెయిచ్చెడిపికుల్జ్ఞి కిసీకిదియేలయేనుదీ।ననపితృదేవతాతిథిజనంబులఁదృప్తులఁజేయుచుండుదుఁ। జననుతదీనిఁబ్రోచుటయచాలుఁదపస్వుల కేలసంపదల్ * వ॥ దీనినొరులకీఁగాదనిననలిగివిశ్వామిత్రుండు నేనుక్షత్రియుండనిగ్రహానుగ్రహమర్థుండనీవుబ్రా హ్మణుండవుశాంతుండ వేమిచేయనోపుదు దీనికిలక్ష మొదవులంగొనుమనియీవచ్చిననొల్లవైతి విమ్మొదవునవశ్యం బుబలిమింజేసియైననుబరిగ్రహింతుననినందినింబట్టికొనంబంచినంబలుకకవసిష్ఠుండుసూచుచుండె* ఆ॥పరులవలనబా ధవొరయకుండఁగసాధు।జనులధనముగాచుజనవిభుండు । కరుణదప్పితానహరియించువాఁడగు।నేనిసాధులొకనేమి చేయు * వ॥ఇట్లువిశ్వామిత్రుండునందినింబట్టుకొనంబంచిననదిపట్టికజనులవలనికశాదండతాడనంబులంబీడింపంబడి యఱచుచువసిష్ఠునొద్దకువచ్చియిట్లనియె * క॥నన్నేలయుపేక్షించిలి।రిన్నరులకధర్మపరులకిచ్చితిరేవి।ద్వన్నాథయిఁది యుధర్మ్మవె।యన్ననువినిపలుకకుండెనమ్మునియంతఁ * వ॥తదీయాభిప్రాయంబెఱింగితన్నువారికియ్యరనినందినిత నవత్సంబుఁబట్టుకొనవచ్చినజనులకలిగి ఛిందఱరేఁగినిదాఘసమయమధ్యందినదినకరమూర్తియుంబోలెదుర్నిరీక్షయ

యియంగవిక్షేపంబుననంగారవృష్టిఁగురియుచు వాలంబునశబరులను శకృన్మూత్రంబులశకయవనపుండ్రపుళింద్ర శవింహళులను ఫేనంబునదరదబర్బరులను బుట్టించిన * క॥నలిరేఁగి చెలఁగితద్బలములు విశ్వామిత్రుసైన్యముల కేసు పుంగులు పెరిగిమూఁడు యోజనములుపఱవఁగనెగిచె నొక్కమొగిఁబ్రతిబలముల్ * వ॥అట్టిబ్రహ్మ తేజోజనితంబై నప్రభావంబుఁజూచివిశ్వామిత్రుండువిలక్షముఖుండయిక్షత్రబలంబునిందించి యెల్లబలంబులకుమిక్కిలితపోబలంబు ని* చ॥పొలుపగు రాజ్యసంపదలభోగము లెల్లఁదృణంబుగామదిందలఁచివిరక్తుఁడై విడిచిదారుణశైలవనాంతరంబుల వెలయఁదపంబు సేసిగుణవిశ్రుతుఁడై పడసెన్ మహాతపోబలమునసర్వసంపదలుబ్రహ్మఋషిత్వముదివ్యశక్తియు న॥ ఆవిశ్వామిత్రుండిక్ష్వాకుకులసంభవుండయినకల్మాషపాదుండనురాజునకు యాజకత్వంబపేక్షించితత్పురో తుండయినవసిష్ఠుతోబద్ధమత్సరుండయితదపకారంబురోయుచున్నంతనొక్కనాఁడుకల్మాషపాదుండు వేటఁజనిరణ్యాగిరిభ్రమణఖిన్నుండయి విశ్రమార్థంబువసిష్ఠాశ్రమంబునకుంజనువాఁడుదనకభిముఖుండయివచ్చువానివసిష్ఠ త్రుంబుత్రశతాగ్రజునధికతపశ్శక్తియుక్తుశక్తియనుమహామునింగని తెరువుఁదొలంగుమని రాజాభిమానంబునఁ కిననమ్మునివరుండిట్లనియె * ఆ॥ఎట్టిరాజులును మహీసురోత్తము లెదురుగు దెంచునప్పుడధికభక్తిఁ నెరఁగిప్రియ

——*శక్తిమహామునికల్మాషపాదునిశపియించుట*——

లికి తెరువిత్తురిట్టిద ధర్మువెఱఁగిదీనిఁదలఁపవెట్టు * వ॥ఏనుధర్మపథంబుననున్నవాఁడ నేలతొలఁగుమనిననలిగికల్మా పాదుండుదనచేతికశచేనమ్మునివరుఁ వ్రేసిననవమానితుండయి కోపారుణనయనంబులనతనిఁజూచి నీవు రాక్షస వంబున నకారణంబనాకవమానంబుఁ జేసితికావునరాక్షసుండవయి మనుష్యపిశితంబశనంబుగానుండుమనివానికి పంబిచ్చిననమ్మహామునివరువసిష్ఠతనయుంగా నెఱింగి నాకుశాపమోక్షంబుప్రసాదింపవలయుననిప్రార్థించుచు నచ్చోటికవిశ్వామిత్రుండరిగియంతర్హితుండయికల్మాషపాదునంతర్గతుఁడయియుండ నొక్కరక్కసుంగింకరుండను నింబంచినవాఁడువిశ్వామిత్రునాదేశంబునను శక్తిశాపంబుననుంజేసికల్మాషపాదునంతరాత్మనావేశించియుండె త* తే॥రాక్షసావిష్టుఁడయియప్డు రాజ్యలీలవిడిచితన్నెఱుఁగకతదావేశరహితుఁ డయినయప్పుడు రాచకార్యంబు మబద్ధబుద్ధియై కల్మాషపాదుఁడుండె* వ॥ఆకల్మాషపాదుండొక్కనాఁడొక్కబ్రాహ్మణుండధికక్షుధార్తుండయి నాకుసమాంసంబయినభోజనంబిమ్మనియడిగిననిచ్చెదపోయివాఁడంతఃపురంబుననుండిమఱచియర్ధరాత్రంబునందు చితనబానసంబువానింబిలిచి యొక్కబ్రాహ్మణునకుంగుడువనిచ్చెదవచ్చి మఱచియుంటింజెచ్చెరనవ్విప్రునకుమాం బుతోడంగుడువంబెట్టుమనిపంచిన వాఁడునింతప్రొద్దుమాంసంబువడయనేరననిననప్పుడు రాక్షసాధిష్ఠితుండగుట సిమనుష్యమాంసంబుతోనయినంబెట్టుమనినసూపకారుండువధ్యస్థానంబునకుంజనిమనుష్యమాంసంబుఁదెచ్చియి గావండిపెట్టిననవ్విప్రుండుతనదివ్యదృష్టింజూచిదానిమానవమాంసంబుగా నెఱింగికడునలిగి*క॥తివిరియభోజ్యం మానవమాంసముతోడభోజనము వెట్టినవాఁడవునీవుమనుష్యాదుఁడవవుమనివాఁడిచ్చెశాపమన్నరపతికిన్ * వ॥ఇ బ్రాహ్మణశాపంబునం గల్మాషపాదుండు మానుషభావంబువిడిచి రాక్షసుండయి శక్తియొద్దవచ్చి నీకారణం నిట్టివ్యాపారంబుసంభవించె దీనిఫలంబుముందరనీవయనుభవింపుమని శక్తినపగతప్రాణుంజేసి విశ్వామిత్రుచే ప్రబోధితుండయిపదంపడివసిష్ఠుపుత్రులనందఱవధియించిన* తే॥సుతులరాక్షసనిహతులఁజూచిపరమయోగధ ర్యుఁబుత్రవియోగశోకభరముఁదాల్చెవసిష్ఠుఁడపారభూరి । ధరణిభరమురగేంద్రుండుదాల్చునట్లు * చ॥అమిత వృద్ధశోకవివశాత్మకుఁడై మదినాత్మఘాతదోషమునుదలంపకెంతయువిషాదమునన్ బలవద్దవాగ్నిమ । ధ్యమువడిఁ చ్చినన్ బృహదుదగ్రశిఖానలవఃక్షణంబయుక్షణముసెడిశీతమయ్యెమునినాథునకుగ్రతపంబుపెంపునన్ * ఉ॥పంబి కభారమునప్రాణవిమోక్షముఁగోరికంఠదేశంబునరాయికట్టుకొనిసమ్మునినాథుఁడునిశ్చితాత్ముఁడై యంబుధిఁజొ నంగమభయంపడివార్ధిచలత్తరంగహస్తంబులనెత్తిపట్టెనుచితస్థితిఁదీరముఁజేరనమ్మునిన్ *చ॥సుతశతవర్జితా ముసూడఁగనోపకమేరుపర్వతోన్నతపృథుశృంగమెక్కిపడినన్ మునివల్లభుదేహబంధము తృతమయితూలసంచ

శాశ్వతనొప్పెననంతసంతత। వ్రతనియమప్రభావులగువారలఁ బొందు నెదేహదుఃఖముల్ * అక్క॥ వదలకమరణా
ర్థియగుచుమునినాథవరుఁడుదానొక్క। నదినుగ్రగ్రాహవతిఁ బ్రవేశించినను మునినంట। నదియోడిశతవిధంబులఁ బరి
వ్రతయయిస్థలంబయిన । నదియాదిగాఁ గశతద్రునామనదియైయన్నదియొప్పె * అక్క॥ ఘనపాశములఁ జేసియెల్ల
యంగములఁగలయబంధించు। కొనియొక్క నదిఁజొచ్చిమునిఁగినను వంతఁగూరియన్నదియుఁ । దనదివ్యశక్తినప్పాశములవి
డిచితన్మునినాథుఁ। బనిగొనఁదీరంబుచేరఁ బెట్టిని పాశనాఁ బరఁగె * వ॥ ఇట్లు పెక్కువిధంబుల శరీరపరిత్యాగంబునందుఁ గృ
తనిశ్చయుండయ్యును నప్రాప్తమరణుండయి వసిష్ఠుండు నిజాశ్రమంబునకువచ్చువాఁడు తనపిఱుందవచ్చుకోడలినదృ
శ్యంతియనుదానిశక్తిభార్యనప్పుడెఱింగి దానియుదరంబుననుండి షడంగాలంకృతవేదధ్వనికరంబు మధురంబయివీతెం
చినవిస్మితుండయి * తే॥ శక్తిచదువునుబోలెసువ్యక్తమగుచు। వీనులకునిదియమృతోపమానమయ్యె। వేదనాదంబుదీనిపు
ణ్యోదరమున। నున్నవాఁడుసుతుండువిద్వన్నుతుండు * వ॥ అనవరతవేదాధ్యయనశీలుఁడయి శక్తిచదువువినుచుంబం
డ్రెండేఁడులుగర్భంబుననుండి సకలవేదంబులుధరియించినవాఁడీ పౌత్త్రముఖంబుసూచియేను కృతార్థుండనగుదుననిమ
రణవ్యవసాయనివృత్తుండయి నిజాశ్రమంబుననుండునంత నొక్కనాఁడు రాక్షసరూపధరుండయి రౌద్రాకారంబున వ
చ్చుకల్మాషపాదుం జూచియదృశ్యంతి వెఱచినదానినోడకుండుమని మునివరుండు హుంకారంబున రాక్షసు వారించి వాని

——* వసిష్ఠువలనఁ గల్మాషపాదుండు శాపవిముక్తిఁ జెందుట *——

పయిమంత్రపూతంబులయిన కమండలుజలంబులం జిలికిన * క॥ భూపాధముండు బ్రాహ్మణ। శాపంబునఁ బడియు రెండుసం
వత్సరములు పాపమతినుండి రాక్షస। రూపము చెడియపుడు మనుజరూపముఁ దాల్చెన్ * వ॥ ఇట్లు శాపవిముక్తుండయి కల్మా
షపాదుండు వసిష్ఠునకు నమస్కరించి ముకుళితకరకమలుండయి మునీంద్రా నీప్రసాదంబున శాపంబువాసి కృతార్థుం
డనయితి నిన వానికి వసిష్ఠుండిట్లనియె * చ॥ గుణములనొప్పి బ్రాహ్మణులకుం గడుభక్తుఁడవై సమస్తధా। రుణిప్రజఁ బ్రో
చుచుఁ గావిగతరోషుఁడవై సుఖముండు మింక బ్రా। హ్మణులకవజ్ఞ సేయక శమంబును జేకొను మింద్రుఁడైన బ్రాహ్మణుల
కవజ్ఞ సేసియవమానముఁ బొందుఁ బ్రతాపహీనుఁడై * వ॥ అనికఱపిననట్ల చేయుదునని యమ్మహీపతి వసిష్ఠుం దోడ్కొనియ
యోధ్యాపురంబునకరిగి సకలప్రజానురాగకరుండయి యమ్మునివరునతిభక్తిం బూజించుచుఁ దొల్లి రాక్షసుండయి మద
యంతీసమేతుండయి వనంబునఁ గ్రుమ్మరుకాలంబునందొక్క బ్రాహ్మణమిథునంబు ఋతుకాలప్రవృత్తి నున్నం గనియాఁ
కలిపెలుచననంచు బ్రాహ్మణుం బట్టుకొని భక్షించిన నతిదుఃఖితయయి బ్రాహ్మణభార్య పరమపతివ్రతయాంగిరసియను
నదిపురుషవియోగంబునకుం బుత్త్రార్థంబయిన నిజప్రయత్నంబు విఫలంబగుటకును శోకించి వనితాసంభోగంబున నీవు నా
పురుషునట్ల పంచత్వంబునొందుమని శాపంబిచ్చి వసిష్ఠువలన నీకుఁ బుత్త్రలాభంబగునని చెప్పి యగ్నిప్రవేశంబుఁ జేసినం
బదంపడి దీనినంతయు మదయంతివలన నెఱింగి తనకుఁ బుత్త్రోత్పాదనసామర్థ్యంబు లేమిం దలంచి కల్మాషపాదుండు పు
త్త్రార్థియయి వసిష్ఠునకిట్లనియె * క॥ మనుకులపవిత్రుఁ బుత్త్రకు। నినసన్నిభు నాకుఁ బడయుమే నెట్లయినన్। మునినాథ నీప్ర
సాదం। బునఁ బితరులవలన ఋణవిముక్తుఁడ నగుదున్ * వ॥ అనితనభార్య మదయంతియనుదాని ఋతుమతి సమర్పించి
ననదియు వసిష్ఠుప్రసాదంబున గర్భిణియయి పండ్రెండేఁడులు గర్భంబు మోచి వేసరి యొక్కయశ్మశకలంబున నుదరభే
దనంబుఁ జేసిన నశ్మకుండను రాజర్షి పుట్టె నటనదృశ్యంతికిం బరాశరుండుదయించి వసిష్ఠనిర్మితజాతకర్మాదికుండయి పె
రుగుచు నొక్కనాఁడు రాక్షసభక్షణంబునం దనజనకు పంచత్వంబు తల్లివలన విని కోపదహనదందహ్యమానహృదయుండ
యి తపోమహత్త్వంబున నఖిలలోకసంహారంబు సేయుదునని యున్నమనుమని వారించి వసిష్ఠుండిట్లనియె * సీ॥ వినవయ్య
కృతవీర్యుఁడను జనపతితొల్లి భృగువంశయాజ్యుఁడై పెక్కుక్రతువు। లొనరించి యగణితధనదానముల వారిఁ దృప్తులఁగా
వించి దివికిఁజనిన। నతనివంశమున వారలిధనలుబ్ధులై కృతవీర్యునర్థంబు గిలుబు సేసి। కొనిడాచియున్నవారని భార్గవుల నె
ల్లఁ బలికిన భార్గవుల్ భయముఁ బొంది - తే॥ కొంద ఱర్థము వారికిఁ గూడియిచ్చి। రవనిసురవంశ్యులకు నిచ్చిరందుఁ గొంద। ఱె
వ్వరికి నీక తమతమయిండ్ల బాఁతి। కొనిసుఖంబుండిరధములై కొంద ఱందు * వ॥ అంతనాక్షత్త్రియులొక్కభార్గవునియిలు గ్రొ

చ్చియనంతంబయినయర్థంబుగనియలిగిరాజధనవంచకులయిరనిభార్గవులనెల్లనిగ్రహించిగర్భంబులనున్నయర్భక
మొదలుగావధియించినవెఱచి భార్గవులభార్యలెల్లహిమవంతంబునకుంబాఱినయందొక్క భార్గవపత్నిభయంబున
యూరుదేశంబునగర్భంబుధరియించిననెఱింగిక్షత్రియులుదానిభేదింపసమకట్టివచ్చిననంతకుముందర * క॥ భువన
ప్లవసమయో।ద్భవభానునిభప్రభావిభాసితుఁడయిభా।ర్గవుఁడూరుదేశమునను।ద్భవిల్లిమహివెలుఁగుచుండెఁబ్రభ
ర్వుఁడనఁగ * వ॥ అమితోగ్రుండగువానిఁజూచికృతవీర్యాన్వయజక్షత్రియా।ధములెల్లఁ హతదృష్టులై కృప
దత్పర్వతారణ్యదే।శములం గ్రుమ్మరుచుండిరంధులయినిశ్శంకం బ్రబలక్రూరక।ర్మములందుద్వృత్తులైనవారికినధర్మప్ర
వృత్తిగానుండునే * వ॥ అట్లుక్షత్రియులెల్లనంధులయిభృగుపత్నియొద్దకువచ్చిమాకుదృష్టిదానంబుఁబ్రసాదింపవల
నని వేఁడిననదివారలకిట్లనియె * అక్కర॥ ఏనుమీదృష్టులుగొన్నదానఁగానిక్కుమారుండు। భానుతేజుండుమీచేఁ
రులుపరిభూతులయిన। దానికినలిగిమీపాపబుద్ధికిఁదగనిట్లుసేసె। వీనిమీరెఱుఁగరె భార్గవకులమువెలిఁగించువాని *
ఇక్కుమారుండునూఱుసంవత్సరంబులునాయూరుగర్భంబుననుండిసకలవేదవేదాంగంబులునేర్చినవాఁడు మహా
నిధిమీకుంగరుణించునితనింబ్రార్థింపుండనిన నాక్షత్రియులునతిభక్తులయియౌర్వుంబ్రార్థించితత్ప్రసాదంబునదృష్టి
వడసిచనిరంతనౌర్వుండుదనపితృబంధుజనులెల్లనొక్కటఁబరలోకగతులగుటకుదుఃఖించి సకలలోకప్రళయార్థం
గాఘోరతపంబుసేయఁదొడంగిన * చ॥ అతనితపంబుపెంపునఁజరాచరసంవృతమైనవిష్టప।త్రితయముభీతిఁబొందిన
తిఁ బితృలోకనివాసులైనత।త్పితృవరులెల్లవచ్చికడుఁబ్రీతినపాకృతగర్వునౌర్వున।ప్రతిమతపోవిభాసిఁగనిపల్కిరిట

—*పితృదేవతలౌర్వునిశాంతచిత్తునిఁజేయుట*—

యుశాంతచిత్తులై * వ॥ అయ్యా నీతపోమహత్త్వంబుఁజూచిలోకంబులెల్లభయంపడియెలోకానుగ్రహంబుగారోషం
విడువు మేమసక్తులమైక్షత్రియులచేతవధియింపంబడినవారముగాముధనలుబ్ధులమయిధనముదాఁచినవారముగాముధ
మువలసినంగుబేరుండుదానమాకుఁదెచ్చియిచ్చుందపోమహత్త్వంబునమాకునాయుష్యంబుగడుఁబెద్దయైననిర్వేదంబ
మనుష్యలోకంబుననుండనొల్లకయాత్మఘాతంబునంబుణ్యలోకంబులేమింజేసి దానింబరిహరించియాక్షత్రియులతో
వైరంబమర్చికొనితన్నిమిత్తంబునదేహంబులువిడిచితిమి భార్గవులతేజంబునొరులుపరిహరింపనోపుదురె కావుననీవుదీ
కింగాసర్వజనోపద్రవంబుసేయవలవదదిమాకనిష్టంబనిననౌర్వుండువారలకిట్లనియె * మత్తకోకిల॥ మానితంబగునాతప
మహిమంద్రిలోకపరాభవం। బేను జేయఁగఁబూనిచేసితినిట్టిదొక్కప్రతిజ్ఞమున్ ।దీని నెట్టులు గ్రమ్మఱింతుమదీయభా
తమెన్నఁడా। నేనిమోఘముగాదుదిగ్ధరణీరవీంద్రులెఱుంగఁగాన్ * క॥ మతిమఱచియనిస్తీర్ణ।ప్రతిజ్ఞుఁడగువానికోపవ
హనముని।ర్గతమయిపడిధరణిసము।త్థితదహనముపోలెనాత్మదేహము నేర్చున్ * క॥ అలయకనిమిత్తజంబగు।నలుకనుత
యించిశాంతుఁడగుపురుషుండి।మ్ములరక్షింపఁగనోపునె।పొలుపుగధర్మార్థకామములుసమములుగాన్ * తే॥ పాపులైత
యాధములట్లుభార్గవులకు।నట్లుహింసగావించునాఁడార్తనాద।మూరుగర్భయుతుండనైయుండివినిన।నాఁడకోపమసహ
మైననన్నుఁబొందె * తే॥ ఎఱుకగలఁడేనిమఱిశక్తుఁడేనినన్యు।లన్యులకుహింసగావించునపుడుదానిఁ। బూనివారింపకున్న
యప్పురుషుఁడేగు।హింసచేసినవారలయేగుగతికి * వ॥ కావునలోకంబులయందుసామర్థ్యంబుగలిగిపాపప్రతిషేధంబు
యనివారలనుద్దేశించియలిగితి నేనునుమీవచనంబునతిక్రమింపనోప నఖిలలోకదహనోద్యతంబయిననాకోపదహనంబు
గృహీతంబయిననన్నుదహించు నేమిసేయువాఁడ మీరుసర్వహితులరు నాకునులోకంబులకుహితంబవునట్లుగాను
దేశింపుఁడనిననౌర్వునకుంబితరులిట్లనిరి * ఆ॥ జలములందునుండుసర్వలోకంబులు।గాననీమహోగ్రకలుషవహ్ని
జలధిలోనవిడిచిసత్యప్రతిజ్ఞుండ।వగుముజలధిజలములదిదహించు * వ॥ అనిననౌర్వుండుపితృదేవతాదేశంబునఁదనకో
నలంబుసముద్రంబులోపలవైచిననదియౌర్వానలంబననశ్వముఖంబుననబ్ధిజలంబులుద్రాగుచుండెననివేదంబులయం
దువినంబడియెడుఁగదకావున నౌర్వునట్లధర్మవిదుండవు భువనపరిభావివైనయీక్రోధంబువిడువుమనిన వసిష్ఠు
నంబులఁబరాశరుండుకోపంబుపసంహరించిరాక్షసవినాశంబుగాసత్త్రయాగంబుసేయందొడంగిన * తే॥ శక్తిరా

సనిహతుఁడై చనినశోక । దహనహతుఁడై వసిష్ఠుండు దానిఁ బలంచి । కడుఁ బ్రశాంతాత్ముఁడయ్యె రాక్షసవినాశ। మొ
లసిమనుమని వారింపకుండెనంత ✱ క॥ ఘోరాకారులు కృతహా । హారవులు సబాలవృద్ధులయి పడిరిదురా । చారులు
రాక్షసులుముని । ప్రారబ్ధాధ్వరసమిద్ధపావకశిఖలన్ ✱ వ॥ ఇట్లు పరాశరుఁ డొనరించు సత్త్రయాగంబున నయినరా
క్షసకులప్రళయంబుఁ జూచి పులస్త్యపులహక్రతువులు మహామునిసంఘంబుతో వసిష్ఠాశ్రమంబునకు వచ్చి ✱ క॥ అ
గ్నిహుతిఁ జేసి మానవ । భుగ్నివహము మరణబాధఁ బొందించుచు మూఁడగ్నులయొద్దను నాలవ । యగ్నిం బొనర్ప వెలుఁ
గుచున్న యమ్ముని నాథున్ ✱ క॥ పరమతపోనిలయుఁడవు నే । శ్వరతీవ్రసహస్రతేజు శాక్తేయుఁ బరా । శరుఁ గనియండబు
ప్రార్థించిరి రాక్షససమారణంబు సేయక యుండన్ ✱ వ॥ పరాశరుండును బులస్త్యాదిమహామునిప్రార్థితుండయి రాక్షస
సత్త్రయాగంబుపసంహరించి తన్నియోగంబున నయ్యగ్ని హిమవదుత్తరపార్శ్వంబునవైచిన నది పర్వతంబులయందు
వృక్షగుల్మశిలాభక్షణంబు సేయుచుండె నని యిట్లు గంధర్వుండు తాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబు సెప్పిన విని యర్జును
ఁడు వానికిట్లనియె ✱ ఉ॥ మాకునతిప్రియుండవు ప్రశస్తవిదుండవు సెప్పవమయ్య యీ। లోకములోన వర్తనములుండఁగ వారి
నెఱుంగు దెవ్వనిం। బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ। జేకొనువారమట్టి బుధసేవితుఁ గా
నఁగ మాకు నెందగున్ ✱ వ॥ అనిన గంధర్వుండు పెద్దయుం బ్రొద్దు చింతించి యిచ్చోటికిం గురంగటను తక్కెచంబను పుణ్యతీ
ర్థంబునందు తపంబుఁ జేయుచున్న వాని ధౌమ్యుండను బ్రాహ్మణునిఁ బురోహితుఁగాఁ బ్రార్థింపుం డమ్మహాత్ముండు బురోహి
తుంగాఁ బడసిన మీకు సర్వార్థసిద్ధి యగు ననిన సంతసిల్లి వానికి నాగ్నేయాస్త్రంబు విధివంతంబుగా నిచ్చి మాకు నీవిచ్చిన
హయంబులు నీయొద్ద నుండనిమ్ము ప్రయోజనంబు గలనాఁడు గొనిపోయెద మని గంధర్వువీడ్కొని యప్పాండవులు భాగీరథి

——✱ పాండవులు ధౌమ్యునిఁ బురోహితుఁగా వరియించుట ✱——

నుత్తరించి యుత్కచంబను పుణ్యతీర్థంబున కరిగి యందు ✱ ఉ॥ వీతసమస్తదోషుఁడయి వేడ్కఁ దపంబొనరించుచున్న వి।
ఖ్యాతుఁ బురోహితప్రవరుఁ గా వరియించిరి భక్తితోఁ జగ। త్పూతచరిత్రు సాధుజనపూజితు ధార్మికు ధౌమ్యు దేవల। భ్రా
తృ నరున్ మహాత్ము మితభాషణు భూసురవంశభూషణున్ ✱ వ॥ ధౌమ్యుండును వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వం
బుఁ బరిగ్రహించె నట్లు తేజోరూపబుద్ధివిభవంబుల బృహస్పతిసదృశుండయిన ధౌమ్యుఁ బురోహితుంగాఁ బడసి పాండు
నందనుల శేషమహీరాజ్యంబు వడసినంత సంతసిల్లి తత్కృతస్వస్త్యయనులయి జననీసహితంబుగా దక్షిణపాంచా
లంబునకరుగువారు ముందర ద్రుపదపురంబునకుఁ బోయెడు బ్రాహ్మణులం గని మీరెందులకుం బోయెద రనియడిగిన వా
రిట్లనిరి ✱ సీ॥ యాజ్ఞసేన ప్రభు యజ్ఞమహావేదిఁ గవచశరాసనఖడ్గబాణ । రథయుక్తుఁడై మహారథుఁ డుధృష్టద్యుమ్నుఁ డ
నను దయించిన నతనితోడ। నొక్కటఁ బుట్టెను నొక కన్య కృష్ణ నా నసితోత్పలశ్యామలామలాంగి । మెఱుపును బోలె నవఱ
లుసుత్పలగంధిబంధురతరసౌరభంబుగలుగు – తే॥ దానిద్రుపదరాజతనయఁ దదీయస్వ। యంవరోత్సవంబునందుఁ జూడ।
గనినవారు దృష్టి గనినఫలంబెల్లఁ। గనినవారు పరమకౌతుకమున ✱ వ॥ అట్టిమహోత్సవంబు చూడ ద్రుపదపురంబునకుం
బోయెద మందులకు నుత్సవదర్శనోత్సుకులయిన దర్శనీయులుం దరుణులును నపారభూరిదక్షిణయజ్ఞకరులును ననేకశ
స్త్రాస్త్రవిదులును నయిన నానాదేశాధిపతులు నింతకుఁ జను దెంతురనంతధనంబులు బ్రాహ్మణులకు వారిత్తురఁట మీరలు
వారలం జూడవచ్చెద రేని యొక్కటఁ బోద మురండు ✱ క॥ మీ యందును గృష్ణునుదం। సాయతభుజుఁ జూచి తానహర్షముతో
డం । దోయజముఖి వరియించును। మాయెఱిఁగిన కార్యమిది సమంజసబుద్ధిన్ ✱ వ॥ అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణుల
తోడఁ బాండునందనులు బ్రాహ్మణరూపధరులయి ద్రుపదపురంబునకుఁ జను వారెదుర ✱ క॥ కృష్ణమృగాజినధరు నరు।
ష్ణోష్ణద్యుతి తేజుఁ బంకజోద్భవసదృశుం। గృష్ణద్వైపాయను గత। తృష్ణాముఁ గాంచిరరుగు దెంచు మహాత్మున్ ✱ వ॥ కని
వినయంబున నమ్మునీంద్రునకు నందఱు నమస్కారంబు చేసి కృతాంజలులయి యున్నవారికి హృదయానందంబుగా సత్యవ
తీసూనుం డాగామికశుభంబులావేదించి చనినఁ బాండవులు కతిపయదినంబుల ద్రుపదపురంబుఁ జొచ్చి నాలుగు సము
ద్రంబులం బోలె ఘూర్ణిల్లి మ్రోయుచున్న పురంబు నాలుగుదిక్కులవిడిసియున్న నానాదేశాగతమహీనాథులబహువి

ధన్యాంధావారంబులఁ జూచుచుం జని యొక్కకుంభకారగృహంబున విడిసి తమ్మెవ్వ రెఱుంగకుండ బ్రాహ్మణవృ
న్నంతఁ బాంచాలపతి పార్థునకుఁ గూఁతు నీ సమకట్టి పాండవుల నన్వేషించి యెందును గానక * సీ॥ వైహాయసంబైన
మత్స్యయంత్రంబు నివ్విల్లు మోపెట్టి యెవ్వఁడేను। శరముల నేయ నత్రుసును నసతఁడు నా తనయకు వరుఁడు సద్ధ
ర్తి నని చాటఁబంచిన నా ఘోషణము విని యుర్వీశులెల్ల నొండొరులఁ గడవఁ। గడు వేడ్కఁ దోడిపూసి కట్టి విభూతితో
తమ చిహ్నముల్ దనరి యెలుక - ఆ॥ పడఁగ వేలు వేలు పన్ని భూతలము గ్రక్కదల సైన్యపాదఘట్టనమునఁ। బోలుచు ద్ర
రాజపుత్రీస్వయంవర। రంగమునకుఁ జనిరి రమణతోడ * వ॥ అదియును బురంబు పూర్వోత్తరదిగ్భాగంబున
నోదకసంసిక్తసమీకృతస్థలంబయి యగాధోన్నతపరిఘాప్రాకారంబులును విశాలద్వారతోరణంబులును సైలాస
విలాసాపహాసి భాసురగగనతలోల్లేఖనశిఖరహర్మ్యరేఖలను బహుప్రకారంబులయిన సోపానంబులం జేసి యొప్పుచు
నందు యథాస్థానంబుల నానాదేశాధిపతులనుండం బంచి ద్రుపదుండు వారల నెల్లం బూజించెఁ బరమబ్రహ్మణ్య
బ్రాహ్మణులతోడం గలసియున్న పాండవులు పాంచాలరాజును దగ్రాజ్యసమృద్ధి నిం జూచి సంతసిల్లి రంత * సీ॥ ధవ
భూషణదామాను లేపనామలినాంగి సితపుష్పమాలచేతఁ। గొని పుష్పసాయకకును మేతరంబై నయా అవసాయకం
గఁబరఁగు। ధవళాక్షి రంగమధ్యంబునఁ దను మధ్య తా నొప్పె పాంచాలతనయయున్న। భూసురప్రవరుల పుణ్యాహ
షముల్ వెలసె నాశీర్వాదవృద్ధితోడ- ఆ॥ ద్రుపదపతి పురోహితుండు సుకృతపరి। స్తరణుఁడయి ప్రయోగవతుఁ డగ్ని
ఖముఁ జేసి వేల్చె మొనసి వివాహోపకరణవస్తుచయము గాచియుండె * వ॥ అట్టి యవసరంబున భోరన బ్రా
నులయు లివ్వును వాదిత్రనాదంబును వారించి ధృష్టద్యుమ్నుండు మూఁగిన రాజలోకంబు నెల్లం జూచి యగ్నిసమీపంబు
గంధపుష్పధూపదీపార్చితంబయిన విల్లును నమ్ములును వైహాయసంబయిన లక్ష్యంబును వారలకుం జూపి యిట్లనియె * త
వో॥ ఈవిల్లు మోపెట్టి యేను బాణముల నీయంత్రమత్స్యంబు నేసినవాఁడు। భావజప్రతిముఁడి బ్బాలకుఁ దగినపతి యె
మునిశక్తిఁ బడసిన విద్య। గావున మీరిష్టగా వింపుఁడి దియ ఘనతరకార్ముకకౌశలోన్నతియు। లావును గల వారలకును
రమాలలితయశంబు కల్యాణంబు వడయ * వ॥ అని ధృష్టద్యుమ్నుండు రాజపుత్రులను నెల్ల నెఱుంగం జెప్పె ద్రుపద
పుత్రిం జూచి యఖిలజలధివేలావలయవలయితమహీతలంబునం గల రాజనందనులెల్ల నీస్వయంవరంబునకు వచ్చినవా
వీరిం జూడుమని దుర్యోధన దుశ్శాసన దుర్ముఖ ప్రముఖులయిన ధృతరాష్ట్రనందనుల నూర్వురం దత్సమీపంబున నున్న
ణాశ్వత్థామ సోమదత్త భూరిశ్రవశ్శ్రుతసేనాదులను బుత్రభ్రాతృసమేతులయియున్న శల్య విరాట జరాసంధగ
ధార పతులను నక్రూర సాత్యకి సాంబ సంకర్షణ ప్రద్యుమ్న కృష్ణ కృతవర్మానిరుద్ధ యుయుధాన బలదేవులు మొదలుగా
యదువృష్ణిభోజాంధకవరులను సుమిత్ర సుకుమార సుశర్మ సుదక్షిణ సుషేణ సేనాబిందు చంద్రసేన సముద్రసేన
రచేకితాన శిశుపాల శ్రేణిమజ్జన మేజయ జయద్రథ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద భగీరథ భగదత్త పౌండ్రక
సుదేవ వత్సరాజప్రభృతులయిన నానాదేశాధీశులను వేదధ్వని నొప్పుచున్న బ్రాహ్మణసమూహంబునుం జూపి *
ఇంమలక్ష్య మెవ్వఁడేసె నాతని వరి। యింపు నెమ్మితోడ నిందువదన। యనిన రాజపుత్రు లవ్విల్లు మోపెట్టఁ। జేయఁ దొ
వచ్చి రెల్లవారు * సీ॥ అప్పు డుత్సవము నెయ్యమ్మునఁ జూడంగఁ దివిరి యేతెంచిన దివిజఖచర। గరుడగంధర్వకిన్న
ల విమానముల్ వెలసిల్లె నంబరతలమునందుఁ। బణవవీణావేణురణితానుసారమై సంగీతరవము చేసల నెసంగె। భోరన
ధతూర్యారవంబులు మహార్ణవనినాదంబున ననుకరించె- ఆ॥ దివ్యమాల్యములయు దివ్యానులేపన। ములయు సౌరభ
వెలయఁ దాల్చి। రంగమధ్యజనులకుం గడుముదము గాఁ। జేరి వీచె దివ్యమారుతంబు * చ॥ అవిరళభస్మనుధ్యమున నగ్ని
ణంబులుబోలె బ్రాహ్మణ। ప్రవరులలోన నేర్పడక పాండవులేవురునున్నఁ జూచియా। దవవృషభుండు కృష్ణుఁడు
బునవారి నెఱింగి పార్థుఁడీ। యువతిఁ బరిగ్రహించు నని యుండెఁ జేకొని హృదయంబులోపలన్ * వ॥ అంత నారాజ
నులు ద్రుపదరాజనందనం జూచి కందర్పబాణబాధితులయి తమ్ము నుదమ సామర్థ్యము నెఱుంగక యర్థిత్వంబున న
మోపెట్టఁ బోయి * క॥ వడి నొడుకఁ జివలకే। ల్విండు చనగొనయమునఁ జెనచిన్నీల్గ బలంబే। గృడని ల్లువంపనోపఁగ

డిగిరి నృపసుతులు గొండఱొయ్యనలజ్జన్ * క॥ బలవంతులు బలమఱఁగా। మలపక మాత్రిన్మాని పాడమా యాధనువి। మ్మలఁ
జేసెను మోపెట్టఁగఁ। గొలఁదియె యని డాయరైరి కొండఱు దానిన్ * మ॥ ఇదియెట్లున్ సమకూఱు దెవ్వరికి మున్నీవిల్లు మో
పెట్టఁబో। లమ మోపెట్టియు నంతరిక్షమున నాలక్షంబు భేదింపఁగా। నది బ్రహ్మాదులకైన నిందలవిగాదంచున్ విచారించి

——*అర్జునుఁడు మత్స్యయంత్రంబుఁ దెగనేయుట*——

నిర్మనులై కొండఱు రాజులేగిరి నిజధామమార్గములున్ సొచ్చుచున్ * వ॥ ఇట్లు రాజపుత్రులవ్విల్లు మోపెట్టనోపక నివృత్తుల
యిరి మఱియు వృష్ణిభోజాంధకులు కృష్ణానుమతంబున సజ్యకర్మంబునందనారబ్ధులయి మిన్నకుండిరంత శిశుపాలజరా
సంధశల్యకర్ణులు దర్పించి తమలావు మెఱసి పరాక్రమంబున నలువురు మాషయవముద్గతిలమాత్రంబులు దక్కఁగొనయం
బెక్కించియు మోపెట్టనశక్యంబయినను దక్కఁజెడి ప్రముక్కఁనవారలం జూచి విప్రసభ వెలువడి విజయుండు దనలావు మెఱసి
ధనుస్సమీపంబునకరిగిన నతని యుత్సాహంబునకచ్చెరువంది కొండఱు బ్రాహ్మణులు దమలోనిట్లనిరి * ఉ॥ ఇమ్మనుజేం
ద్రనందనుల హీనబలులు దృఢదీప్తబాహువుల్ । ర్యమ్ములవారిలోపల శరాసనకర్మమునందయుక్తద । ర్పమ్మున నిష్ఠనవ్వుప
హాసముకైటనితండు విప్రవం। శమ్మునవారికెల్లఁ దనశక్తి యెఱుంగక దుర్విదగ్ధుఁడై * క॥ అనువారునంతఁ గొండఱు।
ఘనుఁడీతఁడు వీరికంటెఁ గాత్మక విద్యం। బనరిన వాఁడయి దీనికిఁ। మొనసెం గాకన్యుఁ డిట్లు మొనయంగలఁడే * మ॥ అమితో
త్సాహుఁడు దీర్ఘబాహుపరిఘుం డత్యంత తేజస్వి స। ద్వ్రమలాచారుఁడు విష్ణుభక్తిపరుఁడీ విప్రుండు విప్రప్రసా। దమునన్
విప్రులకెల్ల సంతసముగాఁ దత్కార్మసంసిద్ధిను। త్తముఁడై పొందెడు మంచునుండిరి దయన్ ధాత్రీసురుల్ ప్రీతితోన్ * వ॥
అవ్విప్రుండు నవ్వింటి సమీపంబునకు వచ్చి గురువులకు నమస్కారంబుఁ జేసి ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి పు
చ్చుకొని పూర్వపరిచితంబైన విల్లు మోపెట్టినట్ల క్రమంబున మోపెట్టి జనులాశ్చర్యపడుచుండ నేనమ్ముల నమ్మత్స్యయం
త్రంబు నత్క్షణంబ యురులం దెగనేసినం జూచి బ్రాహ్మణక్షత్రియప్రముఖులయిన జనులెల్ల విస్మితులయి యిట్లనిరి * చ॥ ఫల
పవనాంబుభోజనశుభవ్రతవృత్తులఁ జేసి చూడ దు। ర్బలతనులయ్యు బ్రాహ్మణులపారతపోబలసంపదన్ మహా। బలయుతు
లట్టివారలకు భవ్యుల కెంత మసాధ్యమెద్దియుం। గలదె చరాచరాఖిలజగంబులఁ బెద్దలుగారె సద్ద్విజుల్ * క॥ నిమిషాం
తరమున నిట్లు। క్రమమున మర్త్యులకు నేయ సమకూఱునె యు। త్తముఁడీతఁడు బ్రాహ్మణరూ। పమున సురేశ్వరుఁడొ హరుఁ
డొ భానుఁడొ గుహుఁడో * క॥ అనిధరణినుండి పొగడెడు। జనులనిరంతరరవంబు జలధరమార్గం। బుననుండి పొగడు దివ్యు
లయనవరతరవంబునొక్కఁడుకకు నొప్పెన్ * క॥ చెలఁగె సురదుందుభిస్వన। ములు ముదమున భూసురోత్తములు ప
యిపుట్టం। బులు విడిచి వీచి యార్చిరి । వెలయఁగ నరుమీఁదఁ బుష్పవృష్టియుఁ గురిసెన్ * వ॥ అయ్యవసరంబున ధర్మనం
దనుండు నకులసహదేవానుగమ్యమానుండయి నిజనివాసంబునకుం జని యెనిట ధృష్టద్యుమ్నయుతుండయి యజ్ఞసేనుం
మహాసేనతో నర్జునునకు సహాయుండయి నిలిచెనంత * సీ॥ ధరణీశనందనుల్దన్నతిప్రీతితోఁ జూచుచునుండంగ సుం
దరాంగి । తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ కమనీయగజరాజగమనలీలఁ। జనుదెంచి సురరాజసన్నిభు నభినవయౌవ
నోద్భాసితు నసితరత్న। రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ దన చేతిసితపుష్పదామకమున – ఆ॥ బొలఁతి ముదముతోడఁ
బూజించె నట్టియు। త్సవముఁ జూచి దాని సైఁపకపుడు । కౌరవేంద్రుఁడాదిగాఁ గలభూపతు। లెల్లనలిగి కలయ నేపు రేగి *
మత్తకోకిల॥ పిలరాఁ బనిచెన్మహీశుల నెల్లఁ జుట్టమపోలె ము । న్నేల సత్కృతిఁ జేసె నిందఱకిమ్మహారథులుండఁగా। నేల
కన్యక నిచ్చె విప్రునకిప్పుడెందు శతుండు పాం। చాలుఁడీతఁడు వీని నిర్గతసత్త్వుఁ జేయుద మాజిలోన్ * క॥ తనవిద్యాపేర్మి
నృపనం। దనఁబడసెను విప్రుఁడితని తప్పేకడుదు । ర్జనుఁడీ ద్రుపదుఁడు నృపతుల। ననయముఁ గడు మెచ్చఁ డయ్యెనతిగర్వి
తుఁడై * వ॥ ఏమిదోషంబు సేసియు బ్రాహ్మణుండు వధ్యుండుగాఁడు మనరాజ్యంబు నర్థంబును బ్రాహ్మణార్థంబ కావు
నన వ్విప్రుతోడి దేమని ద్రుపదుపయి నేగుదెంచిన ద్రుపదుండును బ్రాహ్మణుల మఱువు సొచ్చె నిట్లు శరణాగతుండయిన
ద్రుపదునోడకుండుమని బ్రాహ్మణులు దమతమదండాజినంబులెత్తి ప్రతిబలంబులపయి వీచుచున్న వారలం జూచి నగు
చునర్జునుండిట్లనియె * క॥ కడఁగి మదీయాస్త్రములని। యెడు పటుమంత్రముల నిప్పుడీ నృపరిపులన్। గడిఁది విషాహులద

——*అర్జునుండు కర్ణుతో యుద్ధంబు చేసి జయించుట.*——

ర్పం బుడిగించెదం దొలంగి చూచుచుండుండు మీరల్ * వ॥ అని తాను భీమసేనుండును ద్రష్టుమ్న జేరి పుబలంబు పయి
శరంబులేసె భీముండు నొక్క వృక్షంబు పెఱికికొని దండహస్తుండయిన దండధరుండునుం బోలె నర్జును నకు సహా
యునిలిచె నంత నయ్యిరువుర మహాసంరంభంబుం జూచి కృష్ణుండు బలదేవున కిట్లనియె * సీ॥ తాలాభ మగు విల్లు దాల్చి
ఘుల నెగుచుచునున్నవాఁ డింద్రతనయుం। డాతని కెలన మహావృక్షహస్తుండై యున్న వీరుండు వృకోదరుండు। య
బునరుం డేసినప్పుడు వోయిన యాగౌరవర్ణుండు యమతనూజుం। డాతని తోడనయరిగిన యిరువురు కవలవార ల్ప్ర
తేజ-ఆ॥ లనిన నలక్క యింటనగ్ని దాహంబున। నెట్లు బ్రతికిరొక్కొ యిమ్మహాత్ము। లెట్టిపుణ్యదిన మొ యేవురం జూచిత
చు సంతసిల్లె హలధరుండు * క॥ కురుపతి సూడంగ గర్ణుండు। నరుం డాంకెను శల్యుండనిలనందనుం డాంకెన్। సరభసము
యమందిరి ధరణీదేవ మనుజదివిజ ప్రవరుల్ * శా॥ కర్ణుం డున్విజయుండు నొండొరులం జుల్కం దాంకి చాపంబులా। క
తంబగుచుండంగాం దిగిచియుగ్ర క్రోధులై యేసిరా। పూర్ణంబయ్యెం దదీయబాణతతి నంభోభృత్పథం బెల్ల నా। స్త్రీ
య్యెధరిత్రి యెల్లనవి సెక్ దిక్చక్ర మెల్లన్వడిక్ * క॥ వీరుండర్జునుం డేయున। పారశరావలులనడుమ వారింపంగా
యెటుడిగి మహా శూరుండు రాధేయుం డింద్రజున కిట్లనియెన్ * క॥ నాయెదురం జక్క నైయని। నేయంగ భార్గవున
రేశ్వరునకుం గాం। తేయుండగు విజయునకుం గా। కాయత భుజశక్తి నిలువ నలవి యె ధరణిన్ * క॥ నీవప్రాకృత బలుండ
విక్రమమునకు విల్లు నేర్పునకు మహీ। దేవకులోత్తమ మెచ్చితి। నావుడుం బార్థుండు గర్ణునకు నిట్లనియెన్ * అక్కర॥
చెప్పినవారిలోపల నెవ్వండం గాను। గానీన సర్వశస్త్రాస్త్రవిద్యలం గడుం బ్రసిద్ధుండ। భూసుత బ్రహ్మతేజోధికుండ
బోరిలో నోర్వం। గానున్న వీరుండ నెండు దక్కి లోంగక చక్క నిలుము * వ॥ అనిన విని కర్ణుండు బ్రాహ్మణ తేజంబ జే
బని విజయుతోడ యుద్ధంబు సేయనొల్లక క్రమ్మఱియె మఱి శల్యభీమసేనులు పెనంగి మల్లయుద్ధంబు సేయ నెడ భీము
భీమబలంబునం బట్టుకొని శల్యుం ద్రెళ్లవైచిన * ఆ॥ శల్యుం డట్లు నేలం ద్రెళ్లి చెచ్చెర లేచి। యొడలు దుడిచికొను
య్యెం జనియె। వానిం జూచి నగుచు మానుగా విప్రులు। భూరిసత్త్వ భీముం బొగడి రంత * ఆ॥ పరశురాముండొ డేహ
డొండెనరుండొండెం। గాక యొరులు గలరె కర్ణు గెలువ। బలిమి భీముండొండె బలదేవుండొండెంగా। కొరులు నరులు
నోర్వం గలరె * వ॥ వీరెవ్వరో యెటుంగవలయు ననిదుర్యోధనాదులయిన రాజపుత్రు లెల్ల విస్మితులయి యున్నవా
జూచి కృష్ణుం డిట్లనియె * చ॥ పరులకు దుష్కరంబయిన భాసుర కార్యము సేసి యీ స్వయం। వరమునం బత్నిగాం
వారిరుహాయతనేత్ర గృష్ణనీ। ధరణిసురాన్వయోత్తముండు ధర్మవిధిం జెపుండయ్యె యింక నెవ్వరికి నిజన్నె వీని నస
పరాక్రమునాక్రమింపంగన్ * వ॥ వలవదు దుర్గుండని విచారించిన నట్లు కృష్ణుని చేనివారితులయి రాజపుత్రులు దమ
దేశంబులకుం జనిరంత భీమార్జునులు బ్రాహ్మణ పరివృతులయి ద్రుపదరాజపుత్రిం దోడ్కొనిచని రంత కుమ్మరి * సీ॥ వె
త్సవ సందర్శనోత్సుకులయి పోయి కడుం బెద్దప్రొద్దయ్యెం గొడుకు లేల। మసలిరొక్కొ రవుల్పి సువక వైరంబు భావించి పొ
భావులెటిఁగి। క్రందునం జంపిరో యందుల కేవురు లీలతో నొక్కట నేలయరిగి। రవ్వయుండయిన వేదవ్యాసవచన
క్కంబుగాకుండునొక్కొ వేల్పు-ఆ॥ లార భూసురేశులార మీ శరణంబ। కాని యొండుగతియుం గాన నాకు। శరణమ

——*అర్జునుండు ద్రౌపదిం దెచ్చి తల్లికిని వేదించుట.*——

సుతులం గరుణతో రక్షింపుం। డనుచుం గుంతి వగచి వనరుచుండె * వ॥ అట్టియవసరంబునం దల్లి యొద్దకు ధర్మరాజును
వారుమున్న వచ్చియున్న యనంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితులయి వచ్చి మే మొక్క భిక్ష. తెచ్చితిమని తల్లి
దించిన నెటుంగక యెప్పటియట్ల కావగచి కుంతీదేవి దానిమీ రేవురు పరియోగింపుండని కొడుకుల నియమించి భువన
య రాజ్యలక్ష్మియుంబోలె నున్న యక్కన్యకం జూచి లజ్జించి ధర్మభీతయయి ధర్మతనయున కిట్లనియె * సీ॥ ఈతన్వి
క్కనిసీత మ్మలిరువురు ప్రీతి సేతెంచి యాభిక్ష యొప్పం। గొనుమని నాకుం జెప్పినను నేవురును పరియోగింపుండంటి
క్తిదొల్లి। యనృతమెన్నండు గాదనక మీరెప్పుడు మద్వచనాతిక్రమంబు సేయు। రిదిలోకమున లేనియది యేమి

గనుసునని చింతాకులాత్మయయిన — తే॥ కల్లినూరార్చి వానవతనయుఁ జూచి । పార్థునిచేతఁ బడయంగఁ బడిన దీని । నగ్ని
సన్నిధిఁ బాణిగ్రహంబు నీవ । చేయుమనె ధర్మజునకు జిష్ణుఁడనియె ❋ వ॥ పెద్దవాఁడుండఁ గొండికవాఁడు వివాహంబగుట
ధర్మవిరుద్ధంబు గావున దీని నగ్రమహిషిఁగాఁ బరిగ్రహింపుము మా నలువురయందును మతంబిట్టిది యనుచున్న యవసరం
బున విధిప్రేరణంబునఁ జేసి ❋ ఉ॥ ఆలలితాంగియందమహృదయంబులు దృష్టులు నిల్చి పాండుభూపాలతనూజపంచకము
పంచశరాహతిం బొందె నొక్కట । బాలికఁ దొల్లి యేవురకు భామినిఁగా సృజియించియున్నయ । య్యాలరి బ్రహ్మ చెయ్వు
పరమార్థము గాక దియేల యొండగుఁ ❋ వ॥ ఇట్లు పాంచాలియందు బద్ధానురాగులయియున్న తమ యేవురయభిప్రాయం
బెఱింగి వేదవ్యాసవచనంబులు దలంచి ధర్మతనయుం డనుజులకిట్లనియె ❋ క॥ గురువచనస్థితి మనకే । గురకును నిది పల్కిగాఁ
దగుం గావునని । తరుణినిఁ బరిగ్రహింతము । తిరముగ గురువచనమొండు దెలఁగఁ గేలయగుఁ ❋ వ॥ అని పలుకునవసరంబున ❋
శా॥ రాజత్కీర్తులు వచ్చి కాంచిరనఘుల్ రాముండుఁ గృష్ణుండు న । య్యాజానీ ఘనజాతశత్రునృపలోకారాధ్యు సద్వ్య
ష్ణుని । భ్రాజిష్ణుం దనమేనయత్తకొడుకుం బాలార్కతుల్యోజ్జ్వల । త్తేజుం భ్రాతృచతుష్కమధ్యమునఁ గాంతేయా
గ్రజుం ధర్మజుం ❋ వ॥ కని తమ్మెఱింగించి యతిస్నేహంబున యుధిష్ఠిరునకుం గుంతికి మ్రొక్కి భీమార్జుననకులసహదేవు
లం గౌఁగిలించుకొని పరమసమ్మదరసపూరితులై యున్న వారి కుశలంబడిగి ధర్మజుం డిట్లనియె ❋ క॥ ఒవ్వమిఁ గౌరవులకుఁ
గడు । దవ్వయి నుఱి విప్రవేషధారుల మయిమ । మ్మెవ్వరు నెఱుంగకుండఁగ । నివ్విధమున నున్న నెట్టులెఱిఁగితిరీరల్ ❋ వ॥
అనిన నగుచు వాసుదేవుం డిట్లనియె ❋ ఉ॥ అంబుజమిత్రుఁ డంబుదచయాంతరితుండగుచుండ దీయ తే । జంబు జగజ్జనంబు
లకు శక్యమె కప్పఁగ మీరు గూఢభా । వంబున నున్న మీదగు నవారిత తేజము భూజనప్ర । సిద్ధంబగుఁ గాక దానిఁ బిహితంబు
గ నెవ్వరు సేయ నేర్తురే ❋ వ॥ సకలరాజసమక్షంబున నట్టి యతిమానుషంబయిన యద్భుతకర్మం బర్జునునకుఁ గాక న్యుల
కుఁ జేయనగునే యని యెఱింగితిమి మీపరాక్రమంబు మిమ్ము నెఱింగించె ధర్మరహితులగు ధృతరాష్ట్ర దుర్యోధనులు సే
సిన లాక్షాగృహదానంబువలన విముక్తులరయితి రింక మీకు లగ్గగునని చెప్పి బలదేవసహితుండయి వాసుదేవుం డరిగె నిట
ద్రుపదుండు దనకూఁతు నకుఁ బరుండయిన వాఁ డెవ్వఁడే వంశంబు వాఁడొ వాని చరితం బెఱింగి రమ్మని ధృష్టద్యుమ్నుం బని
చిన నతండు భీమసేనార్జునుల పిఱుందన వచ్చి తన్నెఱుంగకుండ నక్కుంభకారగృహంబు నందియంతయు నెఱింగిపో
యి ద్రుపదునకిట్లనియె ❋ సీ॥ అయ్యిద్దఱును గృష్ణ నట్లొప్పఁ దోడ్కొని చని యొక్క ముదుసలి సానికపుడు । మ్రొక్కియ క్కన్య
ను మ్రొక్కించి మఱి యొక్క గౌరవగణ్యుఁ డువంపఁగ డక్కతోడ । నలువురు భూసురనాథగృహంబుల కరిగి భైక్షము తెచ్చి
యంతకూఁడు । నొగి నినయ్యవ్వకు నొప్పించి యున్న నయ్యవ్వ యుద్రౌపదినంతఁ బిలిచి — ఆ॥ బలివిధానములకు బ్రాహ్మణాతి
థులకు నన్నకాంక్షులయిన యతిథులకును । నగ్ర మంచునుంచి యయ్యన్నశేషంబు । చెలువ రెండుపాళ్లు సేయుమనెర ❋ క॥
వెడఁదయురంబును నున్నవ । కడుపును దృఢకఠినతనువు గలయాతనికిం । దొడరనొకపాలు పెట్టుము । వడి నాగాయుతబలం
బువాఁ డతఁ డబలా ❋ వ॥ మఱియు రెండవపాలన్నలువురకుం బెట్టి తద్భుక్తశేషంబు నీవును నేనును భుజియింతమని పం
చినఁ గృష్ణయు నయ్యవ్వ పంచినరూపున నందఱకుం గుడువం బెట్టి దానును గుడిచి దర్భలు విదిర్చి యందఱకు వేఱువేఱ శయ
నమ్ము లిమ్ముగా రచియించి దానిపయి వారలు కృష్ణాజినంబులు వఱచిన నందఱు సుఖశయనులయియున్న వారిపాదంబులకు
నుపధానభూతయై శయనించె ❋ ఆ॥ కలుషదర్పపూరితులు పుల్లభిదానన్న । మొనసమట్టి వారి సరిమువమున । నాపరించెఁ
బ్రీతినాదిగర్భేశ్వరి । యయ్యు నేవగింపదయ్యెఁ గృష్ణ ❋ క॥ కడివాసములు గోలలుగ । స్పడములు వీరలధనంబు పరికింపఁగ నె ।
—డి దేశికులని వగవక । మడపకతను మధ్యనిందు మనమున నుండెన్ ❋ సీ॥ అంతనయ్యేవురు నయ్యైకథల నొప్పఁ జెప్పుచుమ
రథసింధురాశ్వ । విషయంబులును సమవిషమమహావ్యూహనిర్భేదనోపాయనిపుణవిధులు । నాయుధవిద్యారహస్య
ప్రయుక్తులు పలికిరి పలికిన బాసఁ జూడ । నత్యుత్తమక్షత్రియాన్వయులగుదురు చరితఁ జూడఁగ విప్రజాతులగుదు — ఆ॥ రెలుఁగ
రాచవారిసీ రెండుజాతుల । వారుకాని కారు వైశ్యశూద్ర । హీనజాతులనిన నెంతయు సంతస । మందె ద్రుపదపుత్రుఁ డా
మనస్సులోన ❋ వ॥ వెండియు వారలసిమ్ముగా నెఱుంగ వెడలి నప్పుర ... తుండును బ్రాహ్మణాకారు మహా

ముతోడవచ్చి పాండవులంగని ధర్మరాజుని యోగంబున భీము చేతఁ బూజితుండయి యిట్లనియె * ఉ॥ మీకులగోత్రనామ
ములు నిమ్మును నెమ్మి నెఱుంగ వేఁడిచిం । తాకులుఁడైనవాఁడు ద్రుపదాధిపుఁ డాతనికిం బ్రియంబుగా । నాకెఱిఁగింపు
తయు మనంబున నచ్యుత మత్స్యయంత్రముర్వీ । వీకున నిట్లు లేసిన సువిక్రము నాతఁడు చూడఁ గోరెడున్ * వ॥ అనిన విని
చు ధర్మతనయుండు ద్రుపదపురోహితున కిట్లనియె * క॥ ఇవ్వైవాహ్యసలత్యుం । బివ్విలు మోపెట్టి నెట్ట నేసిన వీరుం
నితఁ బతియగునని । నెవ్వగ మీరాజు చులక నియమము సేసెన్ * తే॥ అతఁడు నియమించి నట్టులయ్యంత్ర మేసి । యీ
డిక కన్యఁ బడసె సురీశులార్ద । నేల మమ్ము నెఱిఁగెడు నెఱిఁగి యేమి । చేయువాఁడింక మీపతి చెప్పుమయ్య * క॥ బలహీ
డైనవానికి । నలవియె మోపెట్టి తివియ నకార్ముకముం । గులహీనునకకృతాస్త్రు । నకు లవియె నాలక్ష్య మేయ నస్త్ర

——*పాండవులు ద్రుపదమహారాజు గృహంబునకుఁ బోవుట.*——

లక్ * వ॥ మీరాజు మనోరథంబు సఫలంబయ్యె వగవ నేలయనిన ధర్మరాజు పలుకులు విని పురోహితుండు ద్రుపదునకెఱిఁ
చిన ద్రుపదుండు ధృష్టద్యుమ్నుఁ జూచి చాతుర్వర్ణోచితంబులయిన రథంబులు గొనిపోయి వారలం దోడ్కొని రమ్మనిన
నవాఁడును నాక్షణంబ పాండవుల పాలికి వచ్చి యారథంబు లెక్కి మారాజునొద్దకు రండనిన నాక్షణంబ పాండవులు
యోగ్యంబులయి రత్నాంచితంబులగు రథంబులెక్కి కుంతీదేవిని ద్రౌపదిని నొక్క రథం బెక్కించుకొని తోడ్కొని ధృష్ట
మ్నుతోడ ద్రుపదరాజమందిరంబునకరుగు దెంచునంత ద్రుపదుండును వారల కనేక వస్తువాహననివహంబులతి ప్రీతిఁ
త్తెంచినఁ బరార్థ్యంబులయిన యొండు వస్తువులఁ గైకొనక సాంగ్రామికంబులయిన యసి కార్ముక బాణతూణీర వారా
రణంబులఁ బరిగ్రహించి తనయొద్దకు వచ్చు వారల * సీ॥ అజినోత్తరీయుల నతిసంభృత బ్రహ్మతేజుల సముదితాదిత్యస
ల । నాజానులంబి మహాబాహుపరిఘుల నత్యున్నతాంసుల నతివిశాల । వక్షుల నవిరళ వ్యాయామదృఢకఠినాంగుల వ్య
ఖ్యాతులయిన వారిఁ । బాండుకుమారుల భరతవంశేశులఁ జూచి సుత భ్రాతృ సుహృదమాత్య – ఆ॥ బంధుజనులతోడఁ బరమ
ద్వన్మహీ । సురగణంబులతోడ సోమకుండు । కరము సంతసిల్లి ఘనుల నత్యుత్తమ । క్షత్రవంశవరులఁగా నెఱింగి * వ॥
యుం దన యొద్దకు వచ్చి యశంకితులయి క్షత్రియోచిత మహాసనంబుల నున్నవారల రాజపుత్రులంగా నెఱింగి సంశయ
పనోదనపరుండయి ధర్మతనయునకు ద్రుపదుండిట్లనియె నయ్యా మీరు క్షత్రియులరో బ్రాహ్మణులరో మాయావులయి
రుచున్న మంత్రసిద్ధులరో కాక కన్యాపరిగ్రహణార్థంబు దివంబుననుండి వచ్చిన దివ్యులరో యెఱుంగము మాకు సందేహ
బయి యున్నయది మీకులరూపెఱింగి కాని యిక్కన్య వివాహంబు సేయ నేరమనిన ద్రుపదునకు ధర్మతనయుం డిట్లనియె
క॥ క్షత్రియులము పాండుప్రియ । పుత్రుల మేనగ్రజుండ భూనుతులు మరు । త్పుత్రాగ్నిజ నయములు మలచ । రిత్రులు నకు
రును వీరరిందములెందున్ * వ॥ వీరు కుంతీమహాదేవులని తన్ను నుం దమ్ములనుం దల్లిని నెఱింగించిన ద్రుపదుండతి హర్షర
వేశపరవశుండయి పెద్దయుం బ్రొద్దు నమ్ముం దెలిసి యానంద జలభరితనయనుండగుచు నాపుణ్యంబున లాక్షాగృహ
హంబువలన విముక్తులరయితిరని సంతసిల్లి తద్వృత్తాంతం బంతయు ధర్మతనయువలన విని ధృతరాష్ట్ర దుర్యోధనులని
చి సామప్రియభాషణంబుల నభీష్టప్రియసత్కారంబులను వారిం బూజించి యొక్కనాఁడు పుత్ర మిత్ర బ్రాహ్మణ నివ
పరివృతుండయి ద్రుపదుండు సుఖాసీనులయి యున్న పాండవుల కిట్లనియె * క॥ సుత్రామపుత్రుఁ డభినవ । పాత్రుండ
చిత్రవీర్యపౌత్రుఁడు శుభచా । రిత్రుండీ విజయుఁడు మ । త్పుత్రికి వరుఁడయ్యె నెట్టి పుణ్యోదయమో * వ॥ స్వయంవర
యయిన యిక్కన్యక నర్జునుండు ధర్మవిధిం బాణిగ్రహణంబు సేయునని ద్రుపదునకు ధర్మజుండిట్లనియె నదియెట్లు
వివాహంబయిన పదంపడి భీమసేనుండు వివాహంబయిన మఱియర్జునుండు వివాహంబగుఁ గాక మున్ద అర్జునునకు
ణిగ్రహణంబు సేయ నెట్లగుననిన ద్రుపదుండు ధర్మతనయున కిట్లనియె * తే॥ అట్టులగు నేని యిక్కన్య సభిమతముగ । వసు
తీనాథ నీవ వివాహమగుము । ధర్మమార్గ మెవ్వరికిని దప్పనగు నె । యనిన నాతనికనియె ధర్మాత్మజుండు * వ॥ పనకానికి
క నేమేవురము వివాహంబయ్యెద మస్మన్మాతృ నియోగం బిట్టిద యది మాకు నలంఘనీయంబనిన విని విస్మితుండయి ద్రు
దుండిట్లనియె * క॥ ఒక్కపురుషునకు భార్యలు । పెక్కండ్రగు టెందుఁ గలదు పెక్కండ్రకు నా । లొక్కతయగు టే

గములు నెక్కుడు కథలను విని యు నెఱుంగ మెవ్వరివలనన్ * వ॥ నీవు లౌకిక వైదిక ధర్మస్వరూపవేదివి ధర్మాత్మజుండవు నీపలుకులు ధర్మవిరుద్ధంబులని పలుకనోడుదు మయినను లోకంబునందు నశ్రుతపూర్వంబిది యింక నీవును నేనును గుంతీదేవి

——*వ్యాసమహాముని ద్రుపదుని యొద్దకు వచ్చుట.*——

యు ధృష్టద్యుమ్నుండును విచారించి యెల్లి నిశ్చయింతము * ఉ॥ ఈహిత కార్యసిద్ధి యిది యెట్లొకొ తా సమకూఱునంచు సం। దేహముఁ బొంది సోమక యుధిష్ఠిరు లున్నఁ దదీయ ధర్మసం। దేహనివృత్తి పుట్టఁ జనుదెంచెఁ బరాశరసూనుఁ డాత్మతే। జోహృతసూర్యతేజుఁడగుచున్ దిశలెల్ల వెలుంగుచుండఁగన్ * వ॥ ఇట్లు వచ్చిన కృష్ణద్వైపాయనునకుఁ గుంతీదేవియుఁ బాండవపాంచాలురు నతిభక్తి మ్రొక్కి యమ్మహామునిం గాంచనమణిమయోచ్చాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్న వారల కుశలంబడిగి హితమధురసత్యసంభాషణామృతరసప్రవాహసందోహంబున నందఱం బరమానందహృదయులం జేసి యున్న నమ్మునీంద్రునకు ముకుళితకరకమలుండయి ద్రుపదుం డిట్లనియె * క॥ తన పలుకులు లోకమెల్లను। గొనియాడఁగఁ దగిన లోకగురుఁ డీ యమనం। దనుఁడే మేవురము నునీ। తనుమధ్య వివాహమయ్యెదమని పలికెన్ * క॥ మీ రెఱుఁగనట్టి లోకా। చారము గలదయ్య తొల్లి చన్న మహాత్ము। ల్ధీరమతు లిట్లు చేసిన। వారెవ్వరుఁ గలరె యాప్తవచనానుమతిన్ * క॥ విమలమతి యన్యులకు విష। యమె ధర్మాధర్మనిర్ణయము సేయఁగ ది।వ్యమునీంద్ర దీనిసువి। చారము సేయుము ధర్మసంకరము గాకుండన్ * వ॥ అనిన నా ద్రుపదునకుఁ గృష్ణద్వైపాయను సమక్షంబున ధర్మజుం డిట్లనియె * చ॥ నగియును బొంకు నందు వచనంబున ధర్మువు నందుఁ జిత్తముం। దగులదు నాకు నెన్నఁడును ధర్మువ వశ్యము నట్ల కావునన్। వగవక మాకు నేవురకు వారిజలోచనఁ గృష్ణ నీఁదగుం। దగదని దుర్విచారములు దక్కు వివాహ మొనర్పు మొప్పఁగన్ * వ॥ మఱియుం దొల్లి గౌతముండయిన జటిలుం డను ఋషికూఁతు రుతపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కత భార్య యయ్యెనని యును దాక్షాయణి యను మునికన్యక యొక్క నామంబునం బ్రచేతసు లనం జరఁగిన పదుండ్రకు నొక్కతె భార్య యయ్యెనని యును గథలు వినంబడు నట్లుం గాక * ఆ॥ గురులలోనఁ బరమగురువు తల్లి యయ్యెఁ। దల్లి వచనమును విధాతకృతియు। నన్యథాకరింపనలవియె యనిననం। దొఱకు నిట్టులనియె ద్రుపదవిభుఁడు * వ॥ ధర్మసూక్ష్మత నిర్ణయింప మనకశక్యంబు త్రిలోకవంద్యుండు త్రికాలప్రవర్తనజ్ఞాననిధి యీ కృష్ణద్వైపాయనుండు విచారించి యెవ్విధి యానతిచ్చు నది యయిప్పుడు కర్తవ్యంబనిన విని యమ్మునివరుండు ద్రుపదునకిట్లనియె * సీ॥ ధర్మతత్త్వజ్ఞుఁ డీ ధర్మతనూజుండు ధర్మమార్గంబె లతప్పఁ బలుకు। దేవతామూర్తి యిద్దేవి మాధవి యేల తా నెఱుంగక యనృతంబు వలుకు। వీరలపలుకులు వేల్పులమతము నొక్కండు గావున నొండు దక్కు। యేవురకును గూఁతు నిచ్చి వివాహంబుఁ గావింపు మఱి వీరికలతెఱంగు వినఁగ నిష్టమేని విను మని ద్రుపదుచే। యాఁదియింటిలోనికొనర నరిగి। తానునతఁడు నేకతమ యుండి వానికిం దత

——*ద్రుపదునకు వేదవ్యాసుండు పంచేంద్రోపాఖ్యానంబుఁ జెప్పుట*——

యును జెప్పఁ దొడఁగె ధర్మవిదుఁడు * వ॥ తొల్లి నాలాయని యయిన యింద్రసేన యనం బరఁగిన పరమపతివ్రత మౌద్గల్యుండను మునికి భార్య యయి యున్నఁ గర్మవశంబున నమ్ముని కుష్ఠవ్యాధిబాధితత్వగస్థిభూతశరీరు వయోవృద్ధు వలీపలితతనుదుర్గంధవదను నతిదుర్గఖజీవు నతికోపను వికీర్యమాణనఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు గుడుచుచున్న నొక్కనాఁడు * తే॥ కుడుచు నెడ వాని పెను వ్రేలు కూటిలోనఁ। దునిసి పడ నట్టి వ్రేలు వుచ్చి తోయజాక్షి। యేవగింపక యుచ్ఛిష్టమిష్టలీలఁ। దగిలి కుడుచుచున్న నత్తరుణిఁ జూచి * వ॥ దాని దయిన పతిభక్తికి మెచ్చి మౌద్గల్యుండు ప్రసన్నుండయి నీ కెద్ది యిష్టంబు వేఁడు మిచ్చెద ననిన నదియిట్లనియె మునీంద్ర నాకుం గామభోగేచ్ఛ పెద్దయుం గలదు నీవు నందపశ్శక్తిఁ గామరూపధరుండవయి యీ భీభత్సంబగు రూపంబు డిగి మనోహరంబయిన రూపంబులు దాల్చి పంచధావిభక్తుండవయి నన్ను రమియించి కామభోగంబు లందను మనిన నమ్ముని దానికిష్టంబయిన విధంబున దేహంబు దాల్చి మర్త్యదేవలోకంబులయందు బ్రహ్మర్షి దేవర్షి పూజితుండయి సూర్యరథం బెక్కి చని యాకాశగంగాజలంబుల నాప్లుతుండయి శీతాంశునంశుజాలంబుల వసియించి కైలాసమేరువులయందు శ్రీశైలంబున నేకస్థానంబుల నేకసహస్రవర్షంబులు నాలాయని యైనయిం

ద్రసేనను భోగించి తృప్తుండై మాండల్యుండు గాని విడిచి ఘోరతపంబు సేసి బ్రహ్మనయుండైన నది కామభోగం బు
ననియక కాలవశంబున శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికిం బుట్టి పెరుగుచుం గన్యాత్వంబునం బెద్దకాలముండి తన
సౌభాగ్యంబున మనిర్వేదించి పతిం గోరి పశుపతిను ద్దేశించి యుగ్రతపంబు సేయుచున్నంత* తే॥ దానికడకుం బ్రత్యక్షం
బ్మనాయు । వాసవాశ్వినుల్ ప్రీతులై వచ్చి దానినాత్మ దేహాంశజులకు దేహాంతరమునం । బత్నిం గాం గోరి రధికసౌ
గ్యయుక్తి* వ॥ అదియును గొండొక కాలంబు జలానిలాహారిణియయి కొండొక కాలంబేక పాదంబున నిల్చి కొండొక కా
బు పంచాగ్ని మధ్యంబున నిల్చి యత్యుగ్రతపంబు చేసినం బ్రసన్నుండయి యీశ్వరుండు వరంబు వేఁడుమనిన నక్కన్య
నాకుం బతిదానంబుం బ్రసాదింపుమని యర్థిత్వంబున నేను మాటలు వేడినం గరుణించి నీకు దేహాంతరంబునం బతులే
గుమరనిననదియిట్లనియె * ఆ॥ సతికి నొక్కరుండు పతిగాక యొండువాసు । బతులుపలువురగుటగతులుగలవె। లోకనాథ యీ
లోకవిరుద్ధంపు। వరము వడయ నమరవరద యొల్ల * వ॥ అనిన దానికి రుద్రుండిట్లనియె * క॥ నా వచనంబున నీకగు। నేవురు
తులం దమ ధర్మ్మ వెడపక యుండుం। గావున నట్టి వరంబిం। దీవరదళనేత్ర యిచ్చితి నిదయతోడన్ * వ॥ అనిన నక్లేనినయ్యేలు
రుపతులయందును నాకుం బ్రత్యేక సంగమంబును గౌమారత్వంబును బతిశుశ్రూషయు భోగేచ్ఛయు సౌభాగ్యంబును
బ్రసాదింపవలయు ననిన రుద్రుండు దానికోరిన వరంబు లెల్ల నిచ్చి గంగాతీరంబున నున్న యింద్రు నా యొద్దకుం దోడ్కొ
చ్చు మనిపంచిన వల్లెయని * క॥ దక్షాధ్వరమథనునకుం బ్రదక్షిణపూర్వముగ మ్రొక్కి తడయక చనిప। ద్మేక్షణ సహస్ర
క్షుం బ్రతీక్షించుచునుండె సురనదీతీరమునన్ * వ॥ అట వైవస్వతుండును నైమిశారణ్యంబున సత్రయాగదీక్షితుండై
ప్రాణిహింసకు నోపకుండుటం జేసి మానవులు ప్రాప్తమరణులయి వర్తించుచున్న సహింప నోపక యింద్రాదిదేవ
లంబు బ్రహ్మపాలికిం జని భట్టారకా మర్త్యులెల్ల నమర్త్యులయి వర్తిల్లుచుండురు కావున వారికి మాకును విశేషం బెద్దియని
నిమగ్గించిన నమరులకు నమరజ్యేష్ఠుండిట్లనియె * క॥ ఇంతకుం గృతకార్యుండగు । నంతకుం డీరంతకును భయంబుడకుమా
స్త్యంతముగ నుండుం డాతం। డంతము నొందించుం దొంటియట్టులజనులన్ * క॥ అవైవస్వతువీర్యము। మీవీర్యముం దాల్చి
సూర్యమిత తేజులు వా। రేవురు దయింతు రాతని । కావించువిధానములకుం గారణమగుచున్ * వ॥ అనిన నమరపతిపురో
గములయిన యమరులెల్ల నమరాపగా సమీపంబునకుం జను నప్పుడు తత్సలిలమధ్యంబున నొక్క కన్యక యేడ్చుచున్నదా
నికన్నీళ్లు కనకకమలంబులయిన జూచి వేల్పులుం దానును విస్మయంబంది యక్కన్య యొద్దకుం జని యింద్రుండు
నవేల యేడ్చెదవని యడిగిన నది యింద్రున కిట్లనియె * ఆ॥ నా దురోదనంబు నన్ను నెఱుంగఁగ । వలతువేని నమరవల్లభ
డ। నా పిఱుందరమ్ము నావుడు నప్పుడు । వనితవజ్జనరిగె వాసవుండు * వ॥ అక్కన్య పిఱుందనరుగు వాఁడు ముందర హిమవ
వచలకందరాగ్ర విరచిత రత్నవేదికాతలంబున సింహాసనాసీనుండయి వరుణరూపంబున నొక్క తరుణితో జూదంబు
డుచున్నయాదిదేవుం గని వరుణుండకా వగచి సురపతి గరంబలిగి యిట్లనియె * మ॥ అమిత స్థావరజంగమంబయిన బ్రహ్మాం
డంబుదానెంతయున్ । మమతాగోచరమీ త్రిలోకములు నస్మద్బాహువజ్రానుపా । ల్యము లేనిం ద్రుండనట్టినన్ను
కలీలన్ జూదమాడంగను । త్తమసింహాసనమెక్కి నీమంజను నేదర్పించినాముందరన్ * వ॥ అనిన సలిగిరుద్రుండు రౌద్రా
కారంబున వానిం జూచి మదీయక్రీడారసభంగంబుం జేసినయద్దురాత్మ్ముం బట్టి తెమ్మని యక్కన్యకం బంచిన నప్పుడు
నికరస్పర్శనంబునం జేసి నిశ్చేష్టితుండయి మహీతలంబు పయిం బడిన యయ్యింద్రునకు రుద్రుండిట్లనియె* క॥ గర్వించి
కిటివి। గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ। పర్వతశిఖరం బెత్తివి। గుర్వింపు చూతుమని నగో త్రభిదుండున్ *సీ॥ హ
వచనమున నాగిరిరాజశిఖరంబు గరములం బట్టి చెచ్చెరది నేశ। చండమయూఖము ల్రెండు విధంబులై యుండంగ దీర్చి య
ఖండులుండు। దనయట్టి వారలఘునశరీరుల నంచు నలువుర నన్యుల వెలయం జూచి। యేనిట్టు లేలొకొ యేను బ్రకారంబులయి
నిందనుచు విస్మయము బొంది- ఆ॥ యున్న జూచి హరుఁడు గ్రన్నన నింద్రుల। నేవురను మహానుభావ మెసఁగ। మనుజయోని
బుట్టుండని పంచె గీర్వాణ। హితము సేయుపొం టెమతిదలంచి*వ॥ వారు ధర్మానిలశక్రాశ్వినులు దమకు నాధారకర్తలుగా
గృజభీమార్జుననకుల సహదేవులయి వురు పుట్టిరి మఱి కమలభవప్రముఖనిఖిలసురగణప్రార్థితుండయిన నారాయణుసిత

సితకేశద్వయంబుబలదేవవాసుదేవులయి దేవహితార్థంబుద్భవించిననందువాసుదేవుండువారలకుఁగార్యసహాయు డయ్యెనయ్యింద్రులకేవురకును నేకపత్నికాఁదపంబు సేసిశ్రీమూర్తియయినయాజ్ఞసేనియజ్ఞవేదింబుట్టెనమ్మ వేనిపీర లపూర్వదేహంబులఁజూడుమనికృష్ణద్వైపాయనుండుద్రుపదునకుదివ్యదృష్టియిచ్చిచూపిన॥ ఉ॥ చారుమణిప్రభాపట లజాలవిచిత్రకిరీటమాలికా। భారములఁ సముద్యదినపావకవర్ణములఁ సువర్ణకే।యూరవిభూషణావళులనొప్పచునున్న తదీయదేహముల్ధీ।రుఁడుసూచెదాళ్ళసమదీర్ఘతఁబొల్చినవాని నేనిటిఁ॥ వ॥ మఱియుసకలలావణ్యమూర్తియయివారల కేవురకుఁబత్నిగాఁదపంబుఁజేసినయకన్యకపూర్వదేహంబునుంజూచివిస్మితుండయిహర్షించియున్నద్రుపదునకు వెం డియుంగృష్ణద్వైపాయనుండిట్లనియెఁదొల్లి నితంతుండను రాజర్షికొడుకులనంతవీర్యబలపరాక్రములు సాల్వేయశూర సేనశ్రుతసేన సేనాబిందుసారాలిసారులనువారేవురుఁబరస్పరస్నేహంబులనతిప్రసిద్ధులయి పెఱుగుచు నౌశీనరపతికన్యక నజితయనుదానిస్వయంవరంబునఁబడసివివాహంబయి॥ క॥ కాంతివిశేషవిలాసా।నంతశ్రీఁదనరునజితయందనఘులునై।తంతువులేవురువడసిరి।సంతానము వేలు వేఱసత్కులమెసఁగఁ॥ వ॥ తొల్లింటిమహాత్ములయందునునిట్టిచరితంబులుగలవుకావునఁబాండవులకేవురకుద్రౌపదింగ్రమంబునఁబాణిగ్రహంబు సేయింపుమిదిమనచేసినయదిగాదుదైవాధిష్ఠితంబనిద్రుపదునొడంబఱిచికుంతియుఁబాండవులున్నచోటికిద్రుపదరాజసహితుండయివచ్చికృష్ణద్వైపాయనుండుయుధి

## ——*ద్రౌపదీవివాహమహోత్సవము.*——

ష్ఠిరునకిట్లనియె॥ ఆ॥ నేఁడుపుణ్యదినము నెమ్మితోరోహిణీ।యుక్తుఁడయిశశాంకుఁడున్నవాఁడు। మంత్రవంతముగఁగ్రమంబున నేవురు। పెండ్లియగుఁడుకృష్ణప్రీతితోడ॥ వ॥ అనినిశ్చయించిపంచినపాంచాలపతియునుగరంబను రాగంబునఁబురంబి శోభనంబు సేయించిసమారబ్ధవివాహోత్సవుండయ్యెనంతనిరంతర క్రముకకదళీస్తంభసంభృతనవాశ్వత్థపల్లవ మాలాలంకృతద్వార.తోరణంబులనుజందనోదకసంసిక్తప్రాంగణరంగవల్లీకృతకర్పూరమౌక్తికప్రకరంబులనుగౌతు కోత్సవమంగళశృంగారవారాంగనాప్రవర్తమానస్వనియోగకృత్యంబులను నుత్సవసందర్శనాగతానేకరాజన్యసుహృద్బాంధవసంకులత్వంబుననుం జేసియొప్పచున్నద్రుపదరాజమందిరంబునంబూర్వోత్తర దిగ్భాగంబునవిచిత్రనేత్రవితతవితానమమౌక్తికకుసుమాలికాలంకృతంబునుసమీచీనచీనాంశుకవిరచితస్తంభవేష్టనంబును బ్రత్యగ్రపల్లవశాల్యక్షతాంచితకాంచనపూర్ణకలశోపశోభితంబునులాజాజ్యపూర్ణసౌవర్ణపాత్రసమిత్కుశాశ్మరమ్యంబునునవగోమయశ్యామమరకతమణిప్రభాపటలవిలిప్తహిరణ్మయవేది మధ్యసమిద్ధాగ్నికుండమండితంబునునయినవివాహమంట పంబునకుఁజనినిజపురోహితుండయిన ధౌమ్యుండాదిగానేకవిద్వన్మహీసురనివహంబుతోఁగరంబొప్పి * సీ॥ అనఘులుగృతమంగళాభిషేకులుధృతసముచితవేషప్రశస్తరత్న।భూషణులౌరవపుంగవులేవురు నేతెంచిరంతఁ బూర్ణేందువదన। యధికవిదగ్ధపుణ్యాంగనావిరచితలలితప్రసాధనాలంకృతాంగి । కమలాక్షికమనీయకాంతాసహస్రంబుతోఁ జనుదెంచినద్రుపదతనయ - ఆ॥ భూరిభూసురేంద్రపుణ్యాహరవమును । మంగళప్రగీతమధురరవము।వివిధతూర్యవేణువీణారవంబును।విస్తరిల్లెవిపులవిభవయుక్తి * క॥ వితతప్రదక్షిణావ।ర్తితదీప్తశిఖానలమునధృతివ్రేల్చెఁబురోహితుఁడగుధౌమ్యుఁడుబుధస।మ్మతుఁడువివాహప్రయుక్తమంత్రాహుతులఁ * వ॥ ఇట్లువ్రేల్చిధర్మపుత్రునకుద్రుపదరాజపుత్రిం బాణిగ్రహణంబు సేయించెఁ దొల్లి యేవురకు వివాహంబు సేయునప్పుడు కన్యాత్వంబుదూషితంబుగాకుండనీశ్వరునివరంబునంగౌమారంబువడసిన యకన్యకంగ్రమంబునభీమార్జుననకులసహదేవులకుఁబాణిగ్రహణంబు సేయించిన * తే॥ జనులయాశీరవంబునుజవలఁదివురు । దేవమందుభినాదంబుదివ్యగంధ । మందగంధవహామోదమానకుసుమ। వృష్టియును మహాముదముతోవిస్తరిల్లె * వ ॥ అని వైశంపాయనుండుజనమేజయునకుం జెప్పెనని॥ మా॥ విద్యావిలాసపార్థివ।విద్యాధరనిఖిలరాజ్యవిద్యానిధీ।తమ్యతివిశదయశఃప్రక।రద్యోతితసర్వలోకరాజమహేంద్రా॥ స్వాగతవృత్తము॥ రాజరాజగుణరాజివిరాజ। తేజరాజకులదీపవిశిష్టాం। భోజమిత్రనృపపూజితపాదాం।భోజసంభవినుతపుణ్యవరేణ్యా॥ * ........

గద్య ✻ ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబయిన శ్రీమహాభారతంబునం దాదిపర్వము నందు ద్రౌపదీసంభవంబును గృష్ణద్వైపాయనసందర్శనంబును గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు జయించుటయుం దాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబును ద్రౌపదీస్వయంవరంబున కుంజనుటయుం బంచేంద్రోపాఖ్యానంబును ద్రౌపదీవివాహంబును నన్నది సప్తమాశ్వాసము ॥ .............................. ✻



# శ్రీరస్తు.

## శ్రీమహాభారతము-ఆదిపర్వము-అష్టమాశ్వాసము.



శ్రీవిభవనిత్యనిలయ ప్రావర్ధితధారుణీసురాన్వయ వేగీ । భూవల్లభ నిఖిలజగ త్పావనశుభచరిత భావభవసుభగా ✻ వ ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు పాండవులకుం బాంచాలిం బరమోత్సవంబున వివాహంబు సేసి ద్రుపదుం డేవురకు వేలు వేలు ననర్ఘ్యరత్నఖచితంబులయిన యాభరణంబులును నపరిమితంబులయిన యర్థరాసులును సౌవర్ణంబులయిన శయ్యాసనంబులును నూటేసి కాంచనరథంబులును వేవేసి కాంభోజహయంబులు ననేకశతంబులయిన దాసీజనంబులను నూఱువేలు మొదవులను నగ్నిసాక్షికంబుగా నిచ్చిన ✻ క ॥ చతురుదధివలయవలయిత క్షితితలసామ్రాజ్యలక్ష్మికి నిమూలంబై । సతియాజ్ఞ సేనిపతులకు । నతిముద మొనరించెం దుల్యవసుశుశ్రూషణ ✻ సీ ॥ కలియుత్తమగుణముల కెంతయు సంతుష్టచిత్తయై కుంతిదేవి । లలితాంగి హరియందు లక్ష్మి నిమఱి చంద్రునందు రోహిణి యింద్రునందు శచి ని । నవ్వసిష్ఠమునీంద్రునందు నరుంధతిం బోలి సుందరి నీపతులందు ప్రీతి । నత్యంతభక్తి నపత్యంబు వడయుము గురువృద్ధబాంధవాతురవిశిష్ట- ఆ ॥ జనుల నతిథిజనుల సతతంబుం బూజింపు । మన్నదానమునను ధరామరేంద్ర । వరుల దనుపు మఖిలవసుమతీప్రజ కెల్లం । గరుణగలుగుము సుమాంశుకమలనేత్ర ✻ ఉ ॥ పూని పరాక్రమంబె సంగభూతలనాథుల నోర్చి వీరు పెంపున నవఖండమండితమహీతల మేలుచు నీపతుల్ ప్రమోదా । జాననరాజసూయమఖ మాదిగ నధ్వరపఙ్క్తి సేయుచో । నసుగం బత్నివి నీవగుము మానిని ధర్మవిధానయుక్తితోన్ ✻ క ॥ ఇందీవరలోచన నీ । యందే నభినందితాత్మనై నట్టులు నీ । నందనులయందుం బుత్రుల । యందును నభినంద్యవగుము యనిదీవించెన్ ✻ వ ॥ అట వాసుదేవుండు ద్రౌపదిని బాండవులేవురు వివాహంబగుట విని సంతసిల్లి వారికి వజ్రవైదూర్యమరకతమౌక్తికవిభూషణంబులును నానాదేశవిచిత్రవస్తువులును ననేక కరితురగరథరథ్యశిబికాందోళవిలాసినీనివహంబులుం గొనివచ్చి యిచ్చి ద్రుపదుపురంబున నున్న ✻ చ ॥ విలసితరాజ్యలీలం బరవీరభయంకరులై గుణంబులన్ । వెలయుచుం బాండవుల్ విదితవిక్రములుం డుటం జేసి దేవతా । దులవలన న్భయంబు ద్రుపదుం డెఱుంగండు తదీయదేశము । ల్దలంకక యుండు రోగభయతస్కరడాంబరవర్జితంబులై ✻ వ ॥ ఇట్లు పాండవులు ద్రుపదుపురంబున సఖిలరాజ్యసమన్వితులయి యొక్కసంవత్సరం బుండునంత నంతయు నెఱింగి దుర్యోధనచారులరిగి కర్ణదుశ్శాసనసౌబలసోమదత్తసహితుండయి యున్న దుర్యోధనునకు మ్రొక్కి యిట్లనిరి ✻ సీ ॥ కర్ణశల్యులు మొదలుగాఁగల భూపతు లత్యంతబలవంతు లస్త్రవేదు । లుద్ధతుల్ మోపెట్ట నోపని చాపమస్త్రముమున మోపెట్టి చక్రమం దిరుగు । నయ్యంత్ర మేసి మీయందఱు ముందఱం గృష్ణదోడ్కొని యొక్క కృష్ణవర్ణుం । డెక్కటిం గానీను సేపు సరణములోనం దలంచి విజయలీల నున్నయాతం- తే ॥ డర్జునుండు మహామహాబాహుబలమున । శల్యుం ద్రెళ్లవైచి శత్రువరుల । నెల్లం దల్లడిల్లఁ జేసి గిచి నయాతండు । భీమసేనుం డమితభీమబలుండు ✻ చ ॥ అని మొననట్లు దాంకిన మహారథులన్ ధృతగాత్రరాజనంబలాఢ్యులన్ దళితదర్పులం జేసినవారు ధర్మనం । దనయములుగ్రవీరులని తద్విధమంతయు నేర్పడంగ జెప్పిన విని కౌరవప్రభుండు పెల్కురి తద్దయు మగ్గి ఖిన్నాత్ముండై ✻ వ ॥ అక్కటా యటం బురోచనుం డొక్కరుం డపస్థుం డయ్యెంగా కేమి సేయును కూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమి సేయుం బాండవు లెంత దైవసంపన్నులో యని వగచి యియ్యవసరంబున ద్రుపదు భేదించి పాండవులను తాసాదింపవలయు నెట్లనిన ✻ ఉ ॥ యాదవవృష్ణిభోజవరులందఱు పాండవపక్షపాతుల ।

విభుండు వారలను జేకొనియుండును వారలెల్లనా ।త్మోదయసిద్ధికంటెను దదున్నతిం గోరుదురట్లు గావునన్ ।భేదము సే

——*దుర్యోధనుఁడు తండ్రితో నాలోచించుట*——

యఁగావలయుఁ జెల్చననందఱుగూడకుండఁగన్ * వ॥ అని దుర్యోధనుండు పాండవపాంచాలవిభేదనోపాయంబుఁ జిం
తించుచుండె నంత విదురుండు పాండవాభ్యుదయంబును బాంచాలీస్వయంవరంబును దుర్యోధనాదులు భగ్నదర్పులగు
టయు విని సంతసిల్లి పాండవులు ద్రౌపదిం బెండ్లియై ద్రుపదపురంబున నున్నవారని ధృతరాష్ట్రునకుం జెప్పిన నతం డిట్ల
నియె* ఆ॥ యజ్ఞసేనుకూఁతు నభిజాతసాతని। యజ్ఞవేదినుదితయయిన దాని।ననఘవిధివివాహమయి పాండునందను।
లిమ్ముల మిత్రబలసమృద్ధులయిరి * క॥ కొడుకులయభ్యుదయము విని।కడు సంతసమయ్యె నిపుడు కౌరవకులమే।ర్పడ వెలిఁ
గె నెల్లవారల।నొడిచిరి భుజవీర్యమునను హోత్సాహమునన్ * వ॥ అని విదురునకు మనఃప్రియంబుగాఁ బలికి యంతః
పురంబునకుం జని యంతస్సంతాపం బేర్పడకుండు నంతఁ గర్ణదుశ్శాసనసౌబలులతో దుర్యోధనుండు దండ్రిపాలికిం జని యి
ట్లనియె* క॥ విదురుఁడు పాండవహితుఁడని। మొదల నెఱింగియును నతివిమోహంబునన।వ్విదురువచనములు నిలుపుదు।
హృదయంబున నతఁడు పెద్దయిష్టుఁడు మీకున్ * క॥ రేయును బగలును విదురుఁడు। నీయొద్ద నెయ్యనికిఁ జేసి నేరము పలు
కన్ ।నాయిష్టం బెఱింగింపఁగ।నీయుత యెడఁ గంటి మిన్ని దివసంబులకున్ *వ॥ అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె* సీ॥ పలుకులఁ
జెయ్వుఁ బాండవులకుఁ జీఁకటి గలిగినట్లుండుఁ గాని నాదు।హృదయంబు విదురునకెన్నఁడు నెఱింగింప నేను మీ తలఁచిన
యివ్విధంబ। తలఁచుచునుండుదు దైవసంపద గలవారలఁ బాండవవరుల నేమి। చేయంగనగు నెద్ది చెప్పుఁ డిష్టంబింక నసి
నవిచిత్రవీర్యాత్మజునకు-ఆ॥ దుష్టచేష్టితుండు దుర్యోధనుం డిట్టులనియెఁ జిత్తగింపుమవనినాథ।పాండురాజసుతులు పాం
చాలపతి యొద్ద। నుండకుండఁ జేయుటుచితమిపుడు * వ॥ ఎట్లనినం బుత్రమిత్రబాంధవబలసమేతుండయిన ద్రుపదు
నొద్దఁ బాండవులుండువారైన వారలఁ గృష్ణబలదేవులు యదువృష్ణిభోజాంధకవర్గంబులతో వచ్చి కూడిన నెవ్వరు సా
ధింపనోపరు కావున నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింతమొండె వలసుగలవారలం బంచికొం
తేయ మాద్రేయులను దమలో విరక్తులగునట్లుగాఁ జేయింతమొండె నతిలలితప్రమదాజనంబులఁ బ్రత్యేకంబ యేవుర
కుం బ్రయోగించి ద్రౌపదియందు విరక్తిఁ బుట్టింతమొండె నేవురకు నొక్కతియ యాలగుట కష్టంబని ద్రౌపదిఁ బాండవుల
వలన విగతస్నేహఁగా వింతమొండె నుపాంశుప్రయోగంబున భీము వధియించి తక్కిన వారల బలహీనులం జేయుదము*
ఆ॥ గాడ్పుచూలిపిఱుఁదఁ గావంగ నర్జును। నోర్వ నమరులైన నోపరాజి। నతఁడు నిహతుఁడగుడు నశ్రమంబునఁ బా
ర్థు నొక్కరుండు గర్ణుఁ డోర్వఁ గలఁడు * వ॥ ఈయుపాయంబులలో నెయ్యది యుచితంబు నపగతదోషంబు నుదీర్ఘసూ
త్రంబును నగు నట్టి దానిం జెచ్చెర ననుష్ఠించునది యనినఁ గర్ణుం డిట్లనియె *సీ॥ ఆర్యవర్తనుఁడు రాజాన్వయసమ్మతుఁడభి
మతసంబంధుఁడయినవాఁడు।గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు పాంచాలుఁ డేలయిప్పాండుసుతుల। వినయ
సంపన్నుల విడుచువాఁడగు మఱి పాండునందను లేకపత్నియందుఁ। గరమనురక్తులు గావునఁ దమలోన నేల భేదిల్లుదు రె
న్నఁడయిన-ఆ॥ నొక్క సతికిఁ బతులు పెక్కండ్రులగుటిది।సతులకోర్కిగాన నతివ కృష్ణ।సుందరాంగి వారియందేల యపర
క్త।యగుమనోరథంబు దసులుగాక* వ॥ మఱి భీమసేనుండు దొల్లి మీ చేసిన యుపాంశుప్రయోగంబుల నేమియయ్యె నింక
నట్లు కావున నయ్యుపాయప్రయోగంబులన్నియు డిగి యిప్పుడ పాండవులయందు విక్రమంబు ప్రయోగించుట కార్యంబు* చ॥
ఘనమగు విక్రమంబునను గాదె జగత్త్రితయంబుఁ బాకశా।సనుఁడు జయించె భూతలము సర్వమునున్ భరతుండు విక్ర
మం।బునను జయించె విక్రమము భూరియశఃప్రియులైన రాజనం।దనులకు సర్వసాధనము ధర్మువు శత్రునిబర్హణంబిలన్ *
వ॥ కావున విగతస్నేహులమయి చతురంగబలసన్నద్ధులమయి యుద్ధంబునం బాంచాలుర భంజించి పాండవుల నొండుక
డనుండనీయక తోడ్కొని తెత్తమనినఁ గర్ణు పలుకులాలించి ధృతరాష్ట్రుఁ డిది యకార్యంబయినను మతిమంతులతో విచారిం
చి చేయుదమని భీష్మద్రోణవిదుర కృపాశ్వత్థామసోమదత్తాదులం బిలిచి యంతయు నెఱింగించిన విని భీష్ముండు దుర్యోధ
నుం జూచి యిట్లనియె * మత్తకోకిల॥ ధీరులీ ధృతరాష్ట్రపాండులలిప్తయశస్సగుణుల్ప్రసి ।ద్ధోరుకీర్తులు నాకు నిద్దఱునొక

—— ✻భీష్మద్రోణులుదుర్యోధనునకుఁబుద్ధిచెప్పుట.✻ ——

రూపతలంపఁగా । వీరువారనునట్టిబుద్ధి విభేదమెన్నఁడు లేదుగాం । ధారిపుత్రశతంబునందుఁబృథాతనూజులయం
దుర్ ✻ వ॥ అప్పాండవులతోడివిగ్రహంబు సేఁతకెన్నండును నొడంబడఁ బితృపైతామహంబయినరాజ్యంబునకు
యట్ల వారునర్హులుగావునవారలకునర్ధ రాజ్యంబిచ్చిననీకును నీబాంధవులకును మేలగునట్లుగాని నాడపకీర్తియగుఁ
నిలుపుటయకాదె రాజులకుజన్మఫలంబు ✻ ఆ॥కీర్తి లేని వానికినిజీవనంబుని।రర్థకంబుసూవెయవనిమీఁద।నిత్యము
నమునిర్మలకీర్తియ।యట్టికీర్తివడయుటశ్రమంబె✻క॥ఇలఁగీర్తియెంతకాలము।గలిగిప్రవర్తిల్లునంతకాలంబునునిశ్చ
గారెకీర్తిగలపుణ్యులుకీర్తివిహీనుఁడెందునుంబూజ్యుండే✻వ॥కీర్తియునపకీర్తియుస్వర్గనరకనిమిత్తంబులుగావున
ర్తిపరిహరించికీర్తిం బ్రతిష్ఠించి పైతృకంబగురాజ్యంబుపాండవులకిచ్చి వారితోడబద్ధప్రణయుండవయి కీర్తినిలుపు
నభీష్మువచనంబులకుసంతసిల్లి ద్రోణుండుదుర్యోధనునకిట్లనియె ✻ చ॥బహుగుణవస్తుభూషణముపథ్యముధర్మ్యము
ధుసమ్మతం ! బహితబలప్రభేదివిపులార్థయుతంబగుటర్ భవత్పితా।మహువచనంబుఁ జేకొనుము మానుగవారల
నీవువి।గ్రహమొనరింప నేమిటికిఁగౌరవసౌబలకర్ణశత్రులర్ ✻ చ॥విలసద్ధర్మవిశుద్ధవృత్తులుయశోవృద్ధుల్గుశాస్త్రియ
ద్ధులుమధ్యస్థులుగార్యనిర్ణయసమృద్ధుల్మానమాత్సర్యదూ।రులు నాఁజాలినవారిపల్కులకువై రుధ్యంబుగావించున
లుభూనాథులకాప్తులుర్ సఖులునై శోభింతురత్యంతమున్ ✻ చ॥ తనరుచుదైవయుక్తిమెయిధర్మువుసత్యముఁదప్ప
న్నయ । య్యనఘులపైతృకంబయినయంశముమిన్నకవజ్రపాణికై । ననుగొనఁబోలునయ్యకురునందనపాండుతన
జులున్నవా।రనివినివారికిందగుప్రియంబొనరింపకయునికి యుక్తమే ✻ వ॥వారితోవిగ్రహించుటకార్యంబుగాదు
వునఁ బాండవద్రుపదధృష్టద్యుమ్నకుంతీద్రౌపదులకుఁ బ్రియపూర్వకంబుగా సుచితభూషణాంబరావలులు వేఱు
అనిచ్చియప్పాండవులనిందులకుఁదోడ్కొనివచ్చువారిఁగాదుశ్శాసనవికర్ణప్రభృతులనంపుమనినద్రోణువచనంబుల
కర్ణించికర్ణుండిట్లనియె✻ తే॥మానుసఖులుదమకిమ్ముగఁజదివికొం।డ్రు।గాకపతులకుహితముగుకర్జ మేల।యొలసిచెప్ప
రహితులఁగలిపికొనుట।ధర్మువనిరిదినయవిరుద్ధంబుగాదె ✻వ॥మంత్రులుతమబుద్ధిదోషంబులనెట్లునుంబలుకుదురు
తులపోలెనుండి యహితంబాచరింతురుగావునవీరాయిద్దఱపలుకులు మాకుఁజూడనహితంబులనిననలిగి వారికిద్రోణు
డిట్లనియె✻క॥ఉడుగక మేమహితముఁబలి। కెదువారమునీవుహితముక్రియఁగొనఁగాఁబ।లెదువాఁడవుమాకంటెన
గడుహితుఁడవునీవకావెకౌరవ్యులకున్ ✻ క॥ నీకజపులనీకురుకుల।మాకులతంబొంటు టేమియాశ్చర్యముసొ।మ్యా
తులుగానివారల।వాకులశిశులనుపద్రవంబులుగావే✻ వ॥అనుచున్నవారినిద్దఱవారించివిదురుండు ధృతరాష్ట్రునకి
నియె ✻ సీ॥ ధర్మార్థవిత్తముల్దక్షవాదులువయోవృద్ధులుమధ్యస్థవిమలమతులు ।ద్రోణగాంగేయులుదరితవిమ
లునిన్నెడ్డిగఱపిరినెమ్మితోడ । దానినచేయుట ధర్మువువారలకంటెనునీకొరుల్గలరెహితులు । దుర్యోధనుండుదు
శ్శాసనుండునుగర్ణుండుశకునియుఁగరముబాలు- ఆ॥ రెఱుఁగరిదియుధర్మువిదియధర్మంబని।యట్టివారిపలుకులాదరిం
వినకపాండుసుతులవేగరావించివా।రలకుఁబ్రీతినర్ధరాజ్యమిమ్ము✻మ॥తమకుందారయజేయుతెవ్వరికిదోర్దర్పంబున
దానిపై।శమితారాతిబలుండువారలకుఁబాంచాలప్రభుండిప్డుచు । ట్టముదానయ్యెఁదదాత్మజుండయినధృష్టద్యుమ్ను
డుర్ వారితో। సమవీర్యుండొడఁగూడెనిష్టుఁడయితాసంబంధబంధంబునర్ ✻ మ॥బలదేవాచ్యుతసాత్యకుల్దమకు
ప్పర్ మిత్రులుంగూర్చుమం । త్రులుగాదైవముమానుషంబుగలనిత్యుల్నీకుదుర్యోధనా । దులకంటెంగడుభక్తులం
యువినీతుల్ధీరులప్పాండుపు।త్రులునీపుత్రులుగారెవారిఁదగనేనూరస్థులంజేయఁగర్ ✻ ఉ॥ ఆహవభూమిలోనఁ
మార్థముపార్థుఁడువైరివాహినీ । వ్యూహముప్రచ్చుచోటమఘువుండును వానికెదుర్కొనంగను । త్సాహము సేయ
డన్నలఘుసారులధీరులసాహసుల్నిరు । త్సాహులుద్రోహులై యెదిరిచత్తురొనొత్తురొమానవేశ్వరా ✻ ఉ॥ ఆ
తబాహుఁడాతనికినగ్రజుఁడగ్రణిపోరులందునా। గాయుతసత్త్వుఁడుద్ధతయుగాంతకృతాంతనిభుండుభీముఁడు।
యుజసవ్యసాచుల నవార్యబలోన్నతిఁబోలుచున్నవా । ద్రేయులఁజేయు లెవ్వరికిదేవసముల్సమరాంతరంబునర్

క॥ తమ్ములయట్టుల తనకును। శమ్మయిధర్మువునుధృతియుసత్యముఁగారు। ణ్యమ్మును నొప్పఁగ బేర్మిని। జమ్మగఁబసుధర్మ
జునకసాధ్యముగలదే ❋ వ॥ వారిబలపరాక్రమంబు లెల్లవారికి దృష్టపూర్వంబుల యట్టివారితోడవిగ్రహంబు సే
యుమర్త్యబద్ధులుగలరె నీపుణ్యంబున నమ్మహాత్ములుజననీసహితంబు లక్కయింట బ్రతికితిరి నీయందాపురోచనకృతం
బయిన మర్యశక్తిపంకంబు పాండవానుగ్రహజలంబులం జేసికడిగికొమ్ము మఱిదుర్యోధనకృతాపరాధంబుననఖిలమ
హీప్రజకు నపాయంబగునని తొల్లియునీకుఁజెప్పితి నట్లుగాకుండరక్షింపుమనినవిని ధృతరాష్ట్రుండు విదురునకిట్లని
యె ❋ క॥ నీవునుభీష్ముఁడుద్రోణుఁడు। భూవినుతవిశుద్ధధర్మబుద్ధులగుటఁ। మీవచనమునకనర్థము। గావింపఁగనం
తకార్యగతిమూఢుఁడనే ❋ వ॥ మీపంచినవిధంబున నప్పాండవులకర్ధరాజ్యంబిచ్చెదననిభీష్మవిదురద్రోణాదులయిన
బాంధవప్రధానులయు దుర్యోధనాదులయిన రాజపుత్రులయు సమతంబుననిశ్చయించియప్పుడ పాండవులందోడ్కొని
తేరవిదురుం బంచిననాతండును ధృతరాష్ట్రుశాసనంబున ద్రుపదపురంబునకుంజని పుత్రభ్రాతృపరివృతుండయినద్రు
పదునివాసుదేవసహితులయియున్నపాండవులంగాంచి ధృతరాష్ట్రుండుపుత్తెంచిన రత్నభూషణాదులు వేలవేలని
చ్చితానును వారిచేతఁబ్రతిపూజితుండయి కేశవపాండవసమతంబున విదురుండు ద్రుపదునకిట్లనియె ❋ మ॥ అభిజా
తుండవుధర్మశీలుఁడవునీయందైన సంబంధమిం। దభిరమ్యంబనురూపమిష్టమనిసౌహార్దంబునన్ జాహ్నవీ। ప్రభవుం
డున్ ధృతరాష్ట్రుఁడుంగృపుఁడుసుంభద్రోణుండున్ యశో। విభవాలంకృతసంతసంబుపడిరుర్వీవంద్యలిష్టంబునన్ ❋
ఉ॥ తల్లియుఁబుత్రులేవురునుదారమతుల్లమయొద్దవాసినం। కల్లడమందియందఱునుదగ్ధయుదుఃఖితచిత్తులైరి నీ। యు
ల్లురఁబాండుపుత్రులఁబ్రియంబునజూడఁగఁగోరుచున్నవా। రెల్లజనంబులుంగురుకులేశ్వరుఁడాదిగబంధువర్గమున్ ❋
క॥ గురుగుణయుతులగుకొడుకులఁ। గురుకులమువెలుంగనయినకోడలిఁగృష్ణం। బరమపతివ్రతఁగుంతిని। గరుణను
రాఁబనిచెరాజుగజపురమునకున్ ❋ వ॥ నీచేతననుజ్ఞాతులయికానివీరలురానేరరుకావునవీరింబుత్తెంచునదియనినవిదు
రునకుద్రుపదుండిట్లనియె ❋ చ॥ రవినిభతేజుఁడైనధృతరాష్ట్రుఁడువంపఁగనీవుకార్యగౌ। రవమునవచ్చినప్పుడతిరం
బుగవీరికినిష్టసిద్ధిదా। నవుటదియేమిసందియమెయంబుజనాభుఁడునీవుఁబాండవ। ప్రవరులకెల్లప్రొద్దనుశుభంబుద
లంతురకారెనెమ్మితోన్ ❋ క॥ నీవునుధర్మజుఁడునువసు। దేవతనూజుండుభీష్మధృతరాష్ట్రులుస। ద్భావమునన్నెద్ది సే
యం। గావగఁచితిరదిహితంబుగాకొండనునే ❋ వ॥ అనినవాసుదేవుండిట్లనియె ❋ క॥ ఎవ్వరునునేమిసేయుదు। రివ్విదురుఁ
డుపాండవులకుహితమొనరింప। న్నెవ్వగనొందుదలంపక। యివ్విరులకనుభీష్టమిదియమొదలుగాన్ ❋ వ॥ అనిననందఱ
కుధర్మనందనుండిట్లనియె ❋ క॥ కురుముఖ్యులుధృతరాష్ట్రవి। దురభీష్ములుగురులుమాకుద్రుపదప్రభుఁడున్। గురుఁడు

———❋ పాండవులుహస్తిపురంబునకువచ్చుట ❋———

మురాంతకుఁడుజగ। ద్గురుఁడిందఱమతముననునగున్ శుభయుక్తుల్ ❋ వ॥ అనియుధిష్ఠిరుండువారియనుమతంబునఁద
మ్ములుందానునుహస్తిపురంబునకుఁబోవనిశ్చయించిద్రుపదువీడ్కొనిప్రయాణోన్ముఖుండయ్యెనట్లువిదురుండుపాండ
వులఁబాంచాలినిగుంతీదేవిఁదోడ్కొనివాసుదేవధృష్టద్యుమ్నులపరిమితసేనాన్వితులయితోడరాఁగావచ్చునంతవార
లరాకవినిధృతరాష్ట్రుండు చిత్రసేనద్రోణకృపాచార్యులనెదురంబుత్తెంచినందఱుసైన్యసమేతులయిమహోత్సవం
బుతోఁబాండవులుగజపురప్రవేశంబు సేయునప్పుడువారలంజూచి ❋ సీ॥ పురజనులెల్లనుగరమనురక్తులైధర్మస్వరూ
పుఁడీధర్మతనయుఁ। డనుజులుదానుసుజనులెంచఁబాండుభూజనపతిజీవించియునలఁగావఁ। బ్రీతితోఁదానిప్పుడేతెంచె
మేలయ్యెనిమ్మహాత్ములకుదైవమ్మపురుష। కారంబుగలుగంగధారుణీరాజ్యంబువాయునేయాపదల్వాయుఁగాక - ఆ॥
దానహోమజపవిధానముల్మనకివి। గలవెయేనిధరణివలయరాజ్య। మింపయుండిధర్మనందనుఁడొనరించు। చుండుఁ
గావుతమయఖండితముగ ❋ వ॥ అనిపౌరజనులెల్లదీవించుచుండఁబౌరవకులనందనులయినపాండునందనులువచ్చిభీష్మ
ధృతరాష్ట్రవిదురవృద్ధులకుమ్రొక్కి సకలజనానురాగంబొనరించుచు దుర్యోధనాదులతోఁగలసియొప్పటియట్లరా
జ్యవినోదంబులతో నేనుసంవత్సరంబులుం[illegible] భీష్మవిదురద్రోణదుర్యోధనాదు

లసమతుంబునఁ బాండవులకిట్లనియె * ఆ॥ సర్వలోకకర్మసాక్షి యీకృష్ణుండు। సాక్షిగాఁగ మీకు సకలవృద్ధ। రాజు
నర్ధరాజ్యమిచ్చెఁ బాండు। రాజవిభవమెల్ల రమణఁ గొనుఁడు * వ॥ అని ధర్మరాజు నభిషిక్తుం జేసి * క॥ నెమ్మిఁ జని ఖాం
ప్రస్థమ్ము నివాసంబుఁ జేసి తద్దయు ననురాగమ్మెసఁగ నుండుఁ డందుఁ డి। రమ్మగు ననిపనిచెఁ బాండురాజాత్మజులన్ *
పాండవులును ధృతరాష్ట్రశాసనంబునను భీష్మాదుల యనుమతంబునను వాసుదేవసహితులయి ఖాండవప్రస్థమ్మునకరు

—* విశ్వకర్మ యింద్రప్రస్థపట్టణమును నిర్మించుట *—

నంత * క॥ హరి యింద్రుఁ దలఁచె నింద్రుఁడు। గరమనురక్తుఁడయి విశ్వకర్మను బనిచెన్। సురపురము ననయగు పుర
రుడుగ నిర్మింపుమూర్వి ననికడుఁ బ్రీతిన్ * సీ॥ ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా భూసురుల్ సూత్రవిన్యాస
రఁ జేసి శాంతికవిధులు సేయంగ సుప్రశస్తంబైన రమ్యదేశంబునందు। వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి పేర్మితో
శ్వకర్మ పురము। నిర్మించె నదియును నిరుపమలీలలఁ దనరి యింద్రప్రస్థమనఁగ నింద్ర- ఆ॥ పురముతోఁ గుబేరపురముతో
ణుని। పురవరంబుతోడ నురగరాజ। పురవిభూతితోడ నురువిలాసంబుల। సరియనంగ నొప్పె ధరణిమీఁద * ఉ॥ ఇమ్మగు విశ్వ
ర్మ రచియించిన కాంచనహర్మ్యతుంగశృం। గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వి తత్సమీ। పమ్మునఁ బాఱుచున్న
ఘనపఙ్క్తులయం దచిరద్యుతిప్రతా। నమ్ములఁ గ్రేడిసేయుచు ననారతముల్ విలసిల్లు నప్పురిన్ * చ॥ అలఘుతరంబు
తుహినహారి సుధారుచి నిందురోచిరా। కులశశికాంతవేదిపృథుకుంజగళజ్జలనిర్ఝరంబులన్। విలసితజాహ్నవీవిమల
విలోలలసత్పతాకలం। బొలుపగుఁ దప్పురీభవనముల్ హిమశైలముఁ బోలియున్నతిన్ * చ॥ వననిధిలోని రత్నములు వ
సుకిమూర్ధజరత్నసంఘము। ల్గొనఁగనవశ్యముల్ జనులకున్ సమకూరదు గాన నెప్పుడుం। గొనఁగఁ బరార్ధ్యవస్తుత
లఁ గోరినవానినయిత్తురర్థితం। గునఁ బచరింతు రంగళులఁ గోమటులప్పురి సిద్ధరత్నముల్ * సీ॥ వలరాజు సచివులవ
పునఁ బెడఁగగు కర్కశస్తనములఁ గరము వ్రేఁడి। చూడ్కులనతిరాగసురుచిరాధరముల వ... విలాసాలసమందగతుల।
క్రొలకంబులవలుదపిఱుందుల దర్పగద్గదభాషితములఁ జేసి। జనులచిత్తములకు సంతోషమొనరించు కామినీజనముల
మి సకల- తే॥ కామభోగములకు సదేకాంతగృహము। బోలి పొలిచియు ధర్మార్థములకు నిదియ। యాస్పదంబన వర్గత్రయా
న్సుబంధులగు జనులకెంతయును నొప్పు నప్పురంబు * క॥ శరనిధినినాదనిభమగు। పురఘోషము గీడువడి విపాలుపుగఁ గడు
ప్పూరవరమునను మహీసుర। వరవేదాధ్యయనరవము వారితమయ్యెన్ * చ॥ పరిఘజలంబులందమలపంకరుహోత్ప
లకైరవాదిసుం। దరకుసుమంబులున్ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం। తరకుసుమంబులున్ వెలయుఁ దప్పురవప్ర
ముషాదపీఠికా। శిరములకొప్పు నర్చనలు సేసినపువ్వులయవ్విధంబునన్ * చ॥ తమమునడంచుచున్ వెలుఁగు తత్పురగోపు
పుధశాతకుంభకుం। భములవిచిత్రసన్మణిగభస్తివితానముల న్విచిత్రవర్ణములగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁ జూ
చియిన్యవాహములని సంశయప్రణిహితాత్ముఁడగున్ హరిదశ్వుఁ డెప్పుడున్ * చ॥ సరలతమాలతాలహరిచందన
పకనారికేలకే। సరకదలీలవంగపనసక్రముకార్జునకేతకీలతా। గురుఘనసారసాలసహకారముఖాగ్య్రమహీజరాజు
దరనవనందనావళులఁ దప్పురబాహ్యము లొప్పుఁ జూడఁగన్ * మ॥ అనిలం బప్పురిఁ బౌరచిత్తములకత్యానంద మొం
గనర్థి నిమిస్నైటితరంగలం బెనఁగుచున్ దివ్యద్రుమాకీర్ణనం। దనసందోహము దూఱుచున్ వికచకేతక్యాదినానాలతా
తనవామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరంబిష్టమై * వ॥ ఇట్టి యింద్రప్రస్థపురంబునం దింద్రవిలాసంబులో
వ్యాసవాసుదేవానుమతుండయి ధర్మతనయుండు ధౌమ్యపురస్సరమహీసురప్రవరవేదఘోషంబులు సకలజనాశీర్వా
దనాదంబులు మృదుమధురమంగళసంగీతరవంబులు వివిధతూర్యధ్వనులును జెలంగఁ జతుర్వర్గంబును బోనియను
ర్గంబుతో శుభముహూర్తంబునం బ్రవేశించి సర్వప్రకృతిజనానురాగుండయి * చ॥ అనుజులు నల్వురుం దనకు నత్య
రాగమునన్ విధేయులై। తనరుచునుండ వేదవిదితంబగు యజ్ఞము వోలె సర్వసా। ధనశుభమూర్తియై భువనదక్షుఁడ
ర్మపరుండు ధర్మనం। దనుఁడు ధరాధిరాజ్యము ముదంబునఁ జేయుచునుండెఁ బ్రీతితోన్ * సీ॥ అనఘు వేదాధ్యయనా
క్తునారభ్యమాణమహాధ్వరు మహితచరితు। సర్వవర్ణాశ్రమసంరక్షణక్షము సత్యసంధాసునజాతశత్రు। భరతవంశో

ముఁ బ్రభుధర్మనందను రాజుఁ గాఁ బడసి సురాజ్ఞి యయ్యె। వసుధయధిష్ఠానవతియయ్యె మఱిలక్ష్మిబంధురంబయ్యె నుబరమ
ధర్మ- ఆ॥ మన్నరేంద్రనందనునాపూర్ణతరశరద్రైందవాతపంబునందుఁ బ్రీతి। సమముగా సమస్తజనులచిత్తంబులా। నం
దరసభరంబునొందఁ దాల్చె ✽ క॥ ధరణిఁ బ్రజధర్మసుతుసు। స్థిరనిర్మలధర్మచరితఁ జేసి రుజాత। స్కరపరరాజులబాధలఁ।
బొరయక సంతతసమృద్ధిఁ బొందె విభూతిన్ ✽ క॥ తనరిరి తద్దేశంబున। ననవరతము యజనయాజనాధ్యయనాధ్యా। ప
నదానములుఁ బ్రతిగ్రహ। మును ననుషట్కర్మములను భూసురముఖ్యుల్ ✽ క॥ పంబియజనాధ్యయనదా। నంబులవర్తి
ల్లె బ్రాహ్మణప్రియమయిధ। ర్మ్యంబయిత క్షత్రియవైశ్యకు। లంబవితథపుణ్యకర్మలాలసమగుచున్ ✽ క॥ పరమద్విజశు
శ్రూషాపరులయి శూద్రా। మలవనిఁ బరఁగిరి ధర్మ। స్థిరమతులయి ధర్మజుధ। ర్మరాజ్యమభివృద్ధిఁ బొందె మహిమాస్పద
మై ✽ వ॥ అంత ✽ క॥ నారదుఁడు వచ్చెఁ దద్వచ। నారంభములరగుడు మీరలనిక అపిమహా। దారుఁడు వారలవీడ్కొని। నారా
యణుఁడరిగెఁ దక్షిణమతనపురికిన్ ✽ వ॥ పాండవులును బరాక్రమప్రణయవశీకృతాఖిలరాజన్యులయి సుఖంబుండు
నంత నొక్కనాఁడు ✽ తరల॥ ప్రవిమలాగమతత్త్వవేదితపఃప్రభాసిజగత్త్రియా। శివకరుండుహితోపదేశము సేయఁ
గాఁగడు వేడుకన్। దివిజముఖ్యుఁడు ప్రీతితోఁ జనుదెంచె నారదుఁడంబుజో। ద్భవతనూజుఁడు భాను తేజుఁడు పాండవేయు
లపాలికిన్ ✽ మానినీవృత్తము॥ తమ్ములుదానును ధర్మతనూజుఁడు దక్షిణసంభృతసంభ్రముఁడై। యమ్మునినాథవరేణ్యున
కున్ వినయమ్మున మ్రొక్కి సమున్నతపీ। ఠమ్మన నుంచి యథావిధిపూజలొడంబడఁ జేసి మునీశ్వరునే। య్యమ్మున సేవిటవచ్చు
లుపాఁ జేసి కృతార్థులమైతిమి యందఱు మున్ ✽ వ॥ మాపుణ్యంబున భవద్దర్శనంబు సంభవించె నని పరమభక్తిం బాంచాలి మ్రొ
క్కించిన నందఱ నాశీర్వచనంబుల నభినందించి నారదుండు ద్రౌపదిని బోవం బనిచి యేవురకు నేకాంతంబున నిట్లనియె ✽ సీ॥
సర్వధర్మజ్ఞులరుర్వీశపూజ్యులరన్యోన్యనిత్యసౌహార్దయుతుల। రగణితగుణయుక్తిఁ బొగడంగఁ దగువారలిట్టిమీయేవుర
కేపుడు ద్రుపద। సుత యొక్కతియ ధర్మసతియును నయియున్న యది యీక్రమంబు లోకాగమంబు। లందు విరుద్ధమీ సుం
దరికారణంబున మీకు విప్రీతిపుట్టకుండ- ఆ॥ నుండవలయుఁ బ్రియసహోదరుల్గొల్లిసుం। దోపసుందులొక్కయువతికత
త్రయ్యన। విగ్రహించి యసురవీరులు దమలోనఁ। బోరిమృత్యునిలయమునకుఁ జనిరి ✽ క॥ అనిననదియెట్లులనియమ। తనయుఁడు
గడునగు వేడ్కతోఁ డదన్నడిగిన నా। తనికిఁ దదీయానుజులకు। నినసన్నిభుఁడమ్మునీంద్రుఁ డిట్లని చెప్పెన్ ✽ వ॥ తొల్లి దితిపు

——✽ సుందోపసుందోపాఖ్యానము ✽——

త్రుండయిన హిరణ్యకశిపునంశంబున నికుంభుఁడను వానికి సుందోపసుందులనన్ ద్దఱుకొడుకులు పుట్టి నియతాత్మలయి త
పోబలంబునం గాని సర్వంబును బడయరాదని యేకనిశ్చయులయి వింధ్యాచలంబునకరిగి నిగృహీతేంద్రియులయి నిదాఘకాలం
బెల్లఁ బంచాగ్నిమధ్యంబున వానకాలంబెల్ల జలాశయంబుల వసియించి మఱియు వాయుభక్షులకే పాదములూర్ధ్వబా
హులధోముఖులునునయి పెద్దగాలంబు తపంబు సేసిన ✽ సీ॥ వారిదారుణతపోవహ్నిదాహంబున వింధ్యాద్రిదరులనా
ర్చివించి యత్యుచ్చమయి ధూమమాకాశమెల్లను గప్పిన నమరులు గరము వెఱచి। రత్నంబులను వధూరత్నంబులను జే
సి తత్తపోవిఘ్నవిధాననిరతులయి ప్రబోధింపంగనలవిగాకున్నఁ దోయజగర్భుపాలికి నరిగి యసుర- ఆ॥ వరులతపముఁ జె
ఱుపవలయు నావుడుఁ గమలాసనుండు ద్రిభువనార్చితుండు। సురహితంబు పొంతె సుందోపసుందుల। కడకువచ్చె వరముగ
ణిసీఁగ ✽ వ॥ ఇట్లు పితామహుండు సుందోపసుందుల తపంబునకు మెచ్చి సన్నిహితుండయి మీకిష్టంబైన వరంబిచ్చె
వేదుండనిన వారలు వారిజాసనునకు ముకుళితకరకమలులయి దేవా మాయిష్టంబు దయసేయ మీకిష్టంబేని మాకుఁ
గామరూపత్వంబును గామగమనంబును సకలమాయావిత్వంబును నన్యులచేతనవధ్యత్వంబును నమరత్వంబుం బ్రసా
దింపుండనిన ✽ ఆ॥ కమలభవుఁడు వారికమరత్వమొక్కటి। దక్కఁ గోర్కెలెల్లనక్కజముగఁ। గరుణ నిచ్చె నిట్లు సరసిజగ
ర్భుచే। వరము వడసి యసురవరులు పెఱిగి ✽ క॥ అనుపమరాజ్యవిభూతిం। దనరి జగద్విజయకాంక్ష దైత్యులకుముదం।
బొనరఁగనకాలకౌముది। యనునుత్సవ మొప్పఁ జేసి రగణితబలులై ✽ క॥ సురగరుడోరగకిన్నర। పురములు వడిఁ జూఱ
గొనుచు భూలోకమునం। బఱఁగిన రాజర్షిమహీసురవరులకు బాధ సేయుచును గర్వమునన్ ✽ క॥ ద్విజవరవినిర్మితముల

ను। యజనస్వాధ్యాయకవ్యహవ్యతపోదానజపంబులఁబితృదేవత। లజస్రమును దృప్తులగుచుర నికడునలుకన్ * వ॥
ణ్యవంతుల నిత్యనైమిత్తికకర్మంబులకు విఘ్నంబు సేయుచు సింహవ్యాఘ్రగజరూపధరులయి వనంబున మునిష్ఠా
చ్చిమునులకుఁ బ్రాణభయంబు సేయుచున్న వారల క్రూరకర్మంబులకు వెఱచి వేల్పులు మునులును బురాణము
కించనిక్రుతాంజలులయి జగంబులకు సుందోపసుందులు సేయు నుపద్రవంబులు సెప్పిన విని విశ్వగురుండు విస్మితుఁ
వారలన్యులచేత వధ్యులుగాక పరస్పరయుద్ధంబునం బంచత్వంబుఁ బొందవలయునని విచారించి విశ్వకర్మ రావించి
లావణ్యవతి నొక్క స్త్రీ సృజియింపుమని పంచినఁ బ్రసాదంబని యప్పుడు * పృథ్వీవృత్తము॥ తిలాసమణికోటిసంఘ
వ్యదేహంబుతోఁ దిలోత్తమ యనంగ నొక్క యువతీలలామంబును। త్పలాక్షి నొనరించె సర్వగుణభాసిరూపక్రియా
లావిముఁడు విశ్వకర్మ దనకౌశలం బేర్పడన్ * వ॥ అదియును సురేంద్రప్రముఖసురబృందపరివృతుండయిన పరమేష్ఠికిం బ్ర
ణంబు సేసిన పనియేమి యని ముందట నున్న నరవిందసంభవుండు సుందరిం జూచి సుందోపసుందులను దైత్యులు దర్పితు
వింధ్యకందరంబుననుండి జగంబులకహితంబు సేయుచున్నవారు వారలిద్దఱు నీకార్యంబున నొండొరులతోడం బో
డవరుపురంబునకరుగునట్లుగాఁ జేయుము నిన వల్లెయని * సీ॥ అబ్జజు వీడ్కొని యది దేవసభకుఁ బ్రదక్షిణంబొనరించి తత్స
బౌత ద్రూపసౌందర్యదర్శనలోలుఁడై యజుఁడు నాలుగుదిక్కులం దనకుఁ। గావించుకొనియె ముఖంబులు మఱి
కన్నులఁ జూచినం గామతృప్తి। యనిసురేంద్రుండు సహస్రాక్షుఁ డయ్యె నయ్యమరులు గాఢమోహాంధులయిరి- ఆ॥
తయిట్లు సర్వమోహిని యయి మర్త్య। భువనమునకు మెఱుఁగువోలె నెప్పి। యరుగుదెంచె సుందరాంగి వింధ్యాచల
దేశమెల్ల వెలుఁగుచుండ * క॥ అమ్మదితఁ జూచియన్నయుఁ। దమ్ముఁడు నొక్కట మనోజతాడితులయిరా। గమ్మనన
న్య స్నేహమ్ములవెడ వాపినిలిచిరయ్యువతికడన్ * క॥ ఘనులయ్యిరువురు నేకా। సనభోజనయాననిలయశయన
యులం। దనరెడు వారేక స్త్రీ। వినిహితకాములయిరపుడు విధినియమమునన్ * క॥ ఇది నావల్లభ యిది నా హృ
మేశ్వరి యనుచుఁ గోరి యిరువురు మదనో। న్మదులయి పరిగ్రహించిరి। తదీయకమనీయసవ్యదక్షిణకరముల్ * వ॥
ట్లు పట్టుకొని * క॥ సుందరి మా యిద్దఱలో। నిం దెవ్వరి వలతు చెప్పుమీ వనవుడుఁ బూ। ర్ణేందుముఖి సూచి నీలో
దెవ్వఁడు వోడిచి యొడుచు నతని నవలతున్ * క॥ అనవుడు నిద్దఱుఁ దమలోఁ। బొనువడ కొండొరులతోడ భూనుతు
కన్। ఘనవజ్రకరులు దాఁకిరి। తనరఁగ నటఁ గొండగొండఁ దాఁకిన భంగిన్ * క॥ విపరీతగతి నిసుందుం। డుపసుందుఁడుఁ

——*సుందోపసుందులు తమలో యుద్ధంబు చేసి చచ్చుట.*——

కీపొడిచిరొండొరులు మహా। కుపితాత్ములయి తిలోత్తమ। నెపమున దృఢముష్టిఘాతనిర్ఘాతములన్ * క॥ అన్యో
ప్రియభాషణు। లన్యోన్యహితైషులసురలన్యులపోలెన్। మన్యుపరిప్రేరితులై। యన్యోన్యాహతినిజనిరయమ
మునరున్ * క॥ ఇంతులనిమిత్తమున ధృతి। మంతులు వొందుదురు భేదమతిగావున నీ। రింతయు నెఱిఁగి యొండులు। చి
పక సమయమింత సేయుఁడు బుద్ధిన్ * సీ॥ అనిన న్నారదమహాముని పల్కుఁ జేకొని తమలోన నొడఁబడి విమలబుద్ధి
రయందు ద్రోవది ప్రీతితో నొక్కొక్క యింటఁ దా నొక్కయేఁడు। క్రమమున నుండను గమలాక్షి యెవ్వరియింట
నుండు నయ్యెంటి వలనఁ। బెఱవారుచనకుండ నెఱుఁగక చని రేని వెలయంగఁ బండ్రెండు నెలలు తీర్థ - ఆ॥ సేవఁ జేయుచు
శిష్టవ్రతంబులు। ధీరవృత్తిసలుపు వారుగాఁగ। సమ్మునీంద్రు నొద్దసమయంబు సేసిరి। రాజసుతులు పాండురాజసు
వ॥ ఇట్లు హితోపదేశంబు సేసి నారదుండరిగినఁ బాండవులు తమ చేసిన సమయస్థితి సలుపుచు సుఖంబుండిరంతఁ గొం
కాలంబునకు నొక్క బ్రాహ్మణుండు మ్లేచ్ఛులచేత హోమధేనువుం గోల్పడియాక్రోశించిన విని విజయుండు విప్ర
డయి విప్రులకయిన బాధఁ దీర్పక యుపేక్షించుట పాపంబని యప్పుడవ్విప్రు రావించి యేమి కారణంబని యడిగిన నర్జున
కు నాతం డిట్లనియె * క॥ యమతనయధర్మరాజ్యము। తమ రాజ్యమయని మహామదంబున విప్రో। త్తములున్నచో
న్న మువడికోల్పడితి గోధనము మ్లేచ్ఛులచేన్ * సీ॥ వడలక మ్లేచ్ఛులధియించినా హోమధేనువుఁ గ్రమ్మఱఁ
యిమ్ము। జననుత దానివత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచున్నయది యదియుఁ। బలుకుల కెడలేదు బాణాసన

నిచను దెమ్ము నాతోడఁ జంటననిన ద్రౌపదీసహితుఁడై ధర్మరాజాయుధాగారంబునం దున్నఁ గాఁ ద్రుమ్మకొంబుఁ— ఆ॥ బుచ్చుకొనఁగఁ దనకుఁ బోలమి యెఱిఁగియు। విప్రునార్తరవము విసఁగనోప। కర్జునుండు నిజశరాసనగ్రహణార్థ । మాయుధాలయమునకరిగెనపుడు ✽ క॥ ధరణీసురవరులకుఁ గడు। సెరగై యుండు నెడనెడయుఁ జేయుదురే మహా। పురుషులని సదుఁడు విలుగొని। యరిగెను మ్రుచ్చుల పిఱుందన విప్రుపనిన్ ✽ వ॥ ఇట్లరిగి యతివీరులయిన చోరుల వధియించి బ్రాహ్మణునకు గోధనంబునిచ్చి క్రమ్మఱి వచ్చి ధర్మరాజునకు మ్రొక్కి లోకమర్యాదలు రక్షించుచున్న మానయందు మర్యాదాభంగమయిన నింతకంటె దుర్యశంబొండెద్ది గావున నాకు ద్వాదశమాసికవ్రతంబు సలుపవలయునని గెదననిన నర్జునునకు ధర్మరాజిట్లనియె ✽ ఆ॥ ప్రారకర్ములయ్యు గోబ్రాహ్మణులకగు। బాధలుడుపు జనులఁ బాపచయము। లెట్టియెడలఁ బొందవింద్రనందననీకు। సమయభంగభీతిఁ జనఁగనేల ✽ వ॥ అదియునుం గాక తస్కరవధోపేతులవలన నశ్వమేధ భ్రూణహత్యల ఫలంబగునని వినంబడుఁ దస్కరులవధియించి బ్రాహ్మణహితంబు సేసినవాఁడవు నీకు సమయలంఘన ప్రాయశ్చిత్తంబు సేయనేలయని సనర్జునుండిట్లనియె ✽ క॥ భూజనపరివాదంబు। వ్యాజంబునఁ బరిహరింపవలయును మనకున్। వ్యాజమున ధర్మలోపం। బాజిజయా పరి

—✽ అర్జునుఁడు తీర్థయాత్రకుం జనుట. ✽—

హరింతురయ్య మహాత్ముల్ ✽ వ॥ కావున నాకు వ్రతదానంబను గ్రహింపవలయునని యర్జునుండ గ్రజుపీడ్కొని సురుజనానుమతుండయి యఖిల వేదవేదాంగపారగులయిన బ్రాహ్మణులు ననేకశాస్త్రవిదులయిన విద్వాంసులును వివిధకథాకథనచతురులయిన పౌరాణికులును దనకు సహాయులుగా నరిగి సకలతీర్థసేవ సేయుచు నయ్యయి తీర్థంబులందు ✽ ఆ॥ ధరణిసురులగురులఁ బరమయోగులమహా। భాగులయిన యట్టి భాగవతుల । రాజవంశకరుఁడు పూజించుచును వారి। వలనఁ బుణ్యకథలు వెలయ వినుచు ✽ క॥ గంగాధరపింగజటా। సంగమమంగళవిశాలసలిలతరంగన్। గంగానది సేవించుచు। గంగాద్వారమున విగతకల్మషుఁడగుచున్ ✽ వ॥ అందు నిత్యంబును గంగాస్నానంబు సేసి తత్తీరంబున హోమంబు సేయుచు వాసనసుతుండు మహీసురసహితుండయి కొన్నిదివసంబులు వసియించి యొక్కనాఁడు ప్రభాతంబున విధిపూర్వకంబుగఁ గృతాభిషేకుండయి దేవర్షిపితృతర్పణంబులు సేసి ✽ సీ॥ వేల్పుంగసమకట్టి వెల్వడనున్న నయ్యింద్రనందను రుచిరేంద్రనీల। సుందరశ్యామాంగు సురరాజకరికరాకారమహాబాహుఁ గలితుఁ జూచి । నలినాక్షియందొక్క నాగకన్యక కామపరవశయై వానిఁ బట్టితిగిచి। కొనినాగపురమున కనుజనితన నిజహర్మ్యంబునందు నెయ్యమున ననునిచె— ఆ॥ నందు నగ్నిదొంటియట్టులయర్చితం। బయి వెలుంగుచున్న నర్జునుండు । హోమకార్యమొప్ప నొనరించి యప్పడ । యుయ్యంతిఁ జూచి నగుచు నిట్టులనియె ✽ క॥ తామరసనేత్ర నీపే। రేమి యెవ్వరితనూజవిట్లేల మహా। వ్యామోహితవయితనవుడుఁ। గోమలి సురశాజపుత్రునకిట్లనియెన్ ✽ వ॥ ఏనులూపియను నాగకన్యకనైరావతకులసంభవుండయిన కౌరవ్యుఁ డాతురనిన్నుంజూచి మనోజబాణబాధితనయితి నా మనోరథంబు సఫలంబు సేయుము ✽ క॥ నీగుణములు తొల్లియు నా। గీగీతములందు వినిత గిలియుపుషుమనో। రాగమునఁ జూడఁ గంటిని। భాగీరథియందు నిన్నుఁ బరహితచరితా ✽ వ॥ అనినదానికర్జుండిట్లనియె ✽ అక్క ర॥ ద్వాదశమాసికవ్రతము సలుపుచుఁ దరుణి మాయన్న। యాదేశమునఁ జేసి సర్వతీర్థములాడుచు బ్రహ్మ। వాదుల సంగతి బ్రహ్మచర్యసువ్రతుఁడనై యుండి। నీదు మనోరథమెట్లు సలుపంగ నేర్తు నేనిపుడు ✽ వ॥ అనిన నవనతాననయయి నాగకన్యక యర్జునుం జూచి ద్రుపదరాజపుత్రియందు మీ చేసిన సమయంబును భవత్తీర్థాగమనంబును నే నెఱుంగనిదానఁగాను సర్వతీర్థసేవనంబును సర్వవ్రతంబులు సలుపుటయును సర్వదానక్రియలును బ్రాణదానంబుతో సమానంబులుగావు నా మనోరథంబు విఫలంబయిన మనోజానలంబునం బ్రాణపరిత్యాగంబగుఁ గావున నన్ను రక్షింపుము దీననీకు వ్రతభంగంబు గాదనిన నర్జునుండు నాని మనోరథంబు సఫలంబు సేసి యారాత్రి నాగభువనంబున వసియించి నాగకన్యకయందిరావంతుండను కొడుకుం బడసి నాగలోకంబు వెలువడి యాదిత్యోదయంబున గంగాద్వారంబునకు వచ్చి తద్వృత్తాంతంబంతయు సహాయులయిన బ్రాహ్మణులకుం జెప్పి వారల కుహృదయానందంబు సేయుచు ✽ క॥ వితతయశుఁ డరిగి హిమవత్పర్వతపార్శ్వమునం బగా స్త్యవనము [illegible] ధృతినే గె హిరణ్యబిందుతీర్థంబునకున్ ✽

వ॥ అందు గోదాన భూదాన హిరణ్యదానంబులాదిగాఁ బెక్కుదానంబులు సేసి యజ్ఞార్థంబు భూసురోత్తములకు స
హస్రంబులిచ్చి ప్రాగ్దేశంబునకరిగి నైమిశారణ్యమందు జగన్నాథు నారాయణు దర్శించి యుత్పలినియుఁ గౌశికి
యు నవరందయు గయయు గంగాసాగరసంగమంబును జూచుచు * క॥ ఏలావనరమ్యములగు। వేలావనములను
విచలద్వీచీ।లాలితసముద్రవిద్రుమ।మాలాపులినస్థలములమసలుచులీలన్ * వ॥ కళింగవిషయంబు సొచ్చి నంత
బ్రాహ్మణులు గొందఱు కళింగద్వారంబునఁ గ్రమ్మఱి యుత్తరకురుదేశంబునకుం జనిరి కతిపయబ్రాహ్మణసహితుం
పార్థుండరిగి పూర్వసముద్రతీరంబునఁ బురుషోత్తమదేవునకు నమస్కరించి మహేంద్రపర్వతంబు సూచుచు * సీ॥
గంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు జగదాదిరైన। భీమేశ్వరంబును బెడఁగుచున్న శ్రీపర్వతంబును జూచి
లోన।ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వరవిధాన। పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశవిభవం
జూచుచు విభుఁడు దక్షి- తే॥ ణాంబురాశితీరంబునకరిగి దురిత।హారియైన కావేరి మహాసముద్ర।సంగమంబున భూసు
రులకభిమ।తార్థదానంబుఁ జేసి కృతార్థుఁడగుచు * వ॥ పదుమూఁడవ మాసంబున మణలూరుపురంబునకుం జని యం
రాజుఁ జిత్రవాహనుం గని వానిచేతఁ బూజితుండయి తత్పుత్త్రిఁ జిత్రాంగదయను దాని వివాహంబు గాన పేక్షించిన న
నభిప్రాయంబాప్తులవలన నెఱింగి చిత్రవాహనుండర్జునునకిట్లనియె * క॥ ధన్యుండనైతినీకీ।కన్యక నీఁగాంచియైన
తెలుఁగుజగ।న్మాన్యమెఱిఁగింపవలయున।నన్యమనస్కుండవయి దయన్వినుమనఘా * క॥ మాకులమునందుఁ దొల్లి ప్రభం
కరుఁడను రాజవరుఁ డపత్యము దనకున్। లేకున్న నుమేశ్వరునకుఁ। బ్రకటముగ భక్తితోఁ దపంబొనరించెన్ * వ॥ పరమే
శ్వరుండు వానికిం గరుణించి నీకు నొక్కపుత్త్రుండుద్భవిల్లు నీ కులంబు వారికెల్ల సంతానంబు నిట్లయగు నని వరంబిచ్చిన న
మొదలుగా మావంశంబు వారికి నొక్కపుత్త్రుండు జన్మించుచు వచ్చె నిప్పుడు నాకు నొక్క కన్యక పుట్టెను నేను దీనిం బుత్రి
కరణంబునం బెనిచితి * తే॥ ఇందుఁ బుట్టిన సుతుఁడు మాకిందువంశ।వంశవిస్తారకుండుగావలయు నిదియె।యీ లతాం

——*అర్జునుండు చిత్రాంగదను వివాహంబగుట*——

సుంకవిట్లీఁగనోపు। దేని పెండ్లియగుమయియ్యంతిఁ బ్రీతి * వ॥ అనిన నర్జునుండు చిత్రవాహను వచనంబునకొడంబడి
త్రాంగదవివాహంబయి * చ॥ అంగజరాజ్యలక్ష్మిపొడవై నదియొక్కయనంగ నొప్పు చి। త్రాంగదయందుఁ బార్థుఁడు మ
హాప్రణయప్రవణాంతరంగుఁడై। యంగజభోగసంగమున నా మణలూరుపురంబునన్ ద్రిలో।కాంగణరంగసంతత
హారియశోగుణుఁ డుండెలీలతోన్ * వ॥ ఇట్లుండి యొక్కనాఁడు తపోధనబ్రాహ్మణసహితుఁడయి తత్సమీపంబున స
ద్రంబు సూచుచు సౌభద్రంబను తీర్థంబుఁ గని యందు స్నానంబు సేయ సమకట్టిన నర్జును జూచి యందలి మునులిట్లని
తరల॥ ఇది సారంగనశక్యమెవ్వరికిందువంశవరేణ్య వి।న్మదియకాదివిమేనుదీర్ఘములీసముద్రతటంబునన్। విదిత
ర్దురితాపహంబులు వీని నెన్నఁడు నాడనో। డుదురుసన్మునులిందుఁ గ్రోల్మొసళుల్లు నుగ్రవడిం జొచ్చినన్ * వ॥ సౌ
ద్రపౌలోమకారండవప్రసన్నభారద్వాజములను నామంబులతో దక్షిణాపథంబునం బ్రసిద్ధంబులయి యిప్పంచతీ
బులుండును నాతేండ్లం గోలెను గ్రగ్రాహగృహీతంబులయి దుర్జనగృహీతంబులయిన రాజులవిభవంబులం బోలె సాధు
నవర్జితంబులయి యుండు ననిన విని విజయుండ శేషతీర్థసేవార్థినయి వచ్చిన నాకు తీర్థంబుల నాడక యునికి పౌరుష
బుగాదని యందు * క॥ సాహసికుండై నరుఁడవ।గాహము సేయుటయు జలము గ్రక్కదల మహా।గ్రాహము బీభత్సు
హా।ద్భాహుబలుం బట్టికొనియెఁ బఱతెంచి వడిన్ * ఆ॥ దానినశ్రమమునఁ దజ్జలాశయము వె।ల్వడఁగవైచె నరుఁడు బాహు
శక్తి।నదియును తక్షణంబ యభినవయౌవనో।ద్భాసమానదివ్యభామయయ్యె * ఉ॥ ఆలలితాంగిఁ జూచి నరుఁ డద్భుతమం
మృగాయతాక్షి యి।జ్జ్లైలజలేచరత్వము ననిజ్జలధిన్వసియించితిప్పుడి।జ్జ్లైలసురూపభామవయి తెంచుల దానవుని వునా
డున్।బాలిక పాండుపుత్త్రునకుఁ బార్థునకిట్లనియెన్ బ్రియంబునన్ * వ॥ ఏను నందయను నప్సరస నా సఖులు సౌరభే
యు సమీచియు వసయు లతయు నను వారలు నాయట్లయి తీర్థంబులందున్న వారలు వారల విముక్తలం జేసి రక్షింపు
దానికి నర్జునుండిట్లనియె * క॥ వనజాక్షి యేమి కారణ।మునను గ్రగ్రాహరూపములు దాల్చితిరీ।రని యడిగిన వేడుక నా

నికదియిట్లనుచుఁ జెప్పెఁ దద్విధ మెల్లన్ * వ॥ వినవయ్యా యే మేవురము నఖిలలోకపాలకపురంబులు సూచుచు భూలోకం
బునకు వచ్చి యొక్కవనంబునం దుగ్రతపంబు సేయుచున్నవానినత్యంతశాంతు నేకాంతచారి నగ్నికల్పు నొక్కబ్రా
హ్మణుం గని వానితపంబునకు విఘ్నంబు సేయ సమకట్టి * క॥ వేడుక నామానిముందటఁ। బాడితి మాడితిమి పెక్కు పరిహాసం
బు। లుగ్రాక్షిగఁ బల్కితిమెట్టులఁ। జూడఁడు మావలన నీరసుండనను డెన్ * క॥ ధృతిరహితులచిత్తములట్ల తివలయం జేల
తగులు నత్యంతధృఢ। వ్రతులమనంబులు వారల। మతులఁ దృణసైత్రిణములు సమంబులు గావే * వ॥ ఏము రాగకారణంబు
లయిన వికారంబులు గావించిన నవి తనకుం గోపకారణంబు లయిన నతికుపితుం డయి బ్రాహ్మణుండు మమ్మేవుర ను మహా
గ్రాహంబులు గా శపియించిన నమ్మునివరునకు ముకుళితహస్తల మయి యిట్లంటిమి * చ॥ అలుగుదురయ్య విప్రులు మ
హాపురుషుల్పరుషాపరాధము। ల్దలిగెడు వారు ధర్మములు దప్పక సల్పెడువారు సత్యము। ల్వలికెడువారు వారల క
సాయము డెందములందలంచుమా। స్ఖలకు విధాతృ చెయ్వు లనఘా దురితంబులు దుర్యశంబులున్ * వ॥ కావున మాయ
జ్ఞానంబు సహించి మాకు శాపమోక్షంబుఁ బ్రసాదింపు మనిన నవ్విప్రుండు గరుణించి యెవ్వండేని మీచేత గృహీతుం డయి
యీయున్నజలాశయంబుల మిమ్ము వెలువరించు నాతండ మీకు శాపమోక్షకరుండగు ననిన విని * సీ॥ అట్టిమహాబాహుఁ
డత్యంతబలుఁ డెవ్వఁ డగునొకొ యనుచు నేమరుగు డెంచు। వారము త్రైలోక్యవర్తినంబుజభవసదృశు నారదుఁ గనిన
ప్రణయముగ। మ్రొక్కి నమమ్మునమ్ముని సూచి యిట్లే లవగఁ బొందికం దిన వారలని యు। నడిగి యావృత్తాంతమంతయు మా
వినేత విని విప్రునలుకయు విధికృతంబుఁ—ఆ॥ గ్రమ్మఱింపలా వె కావున దక్షిణ। జలధితీరమునఁ బ్రశస్తపంచ। తీర్థములకు నేగి ధృ
నందు నూతేఁడు। లుండుఁ డట్లు మీర లుండు నంత * క॥ జనసుతుఁడు పాండుపుత్రుఁడు। ధనంజయుఁడ శేషతీర్థదర్శనకాం
క్షఁ। జను దెంచి మీకు దయన। మ్ముని చెప్పినయట్ల శాపమోక్షము సేయున్ * వ॥ అనిన నారదువచనంబుల భవదాగమనం
బు ప్రతీక్షించుచు నిప్పంచతీర్థంబులనుండి నేఁడు నీకారణంబునఁ గృతార్థల మయితి మనిన నర్జునుండును గరుణాయత్తచిత్తుం
డయి నందచెప్పిన నలువురకు శాపమోక్షంబు సేసిన నమ్మగకన్యకలతి హర్షంబున నమరేంద్రనందనుదీవించి దేవలోకంబు
కరిగిరది మొదలుగా నిప్పంచతీర్థంబులు నారీతీర్థంబులు నాఁబరఁగె నర్జునుండును గ్రమ్మఱి మణలూరుపురంబునకు వచ్చి
రాజ్యలీల సుఖంబుండి చిత్రాంగదయందు బభ్రువాహనుం డను పుత్రుం బడసి చిత్రవాహనునకు వంశకరుఁగా నిచ్చి వా
పీడ్కొని గోకర్ణంబుఁ జూచుచుఁ బశ్చిమసముద్రతీరంబునఁ బ్రభాసతీర్థంబుఁ గని యందుల కు ద్వారకానగరంబు కురంగ
నని నవిని * సీ॥ అందుల కేగి నే నిందీవరశ్యాము నరవిందనాభు నంబురుహ నేత్రు। సన్మిత్రుఁ జూచి నా జన్మంబు సఫలం
బు సేయుమనఘములు వాయు పొం కె। నదియును గాక మున్ గదుఁ డను వాని చేవింటఁ దిలోత్తమకంటె రూప। వతియ
గుణాన్వితయఁట నాకట్టిభద్రే భగమను సుభద్రఁ జూచు —ఆ॥ వేడుకయును గలదు విష్ణుభట్టారకు। వయనభీష్టసిద్ధి వరున
యుఁ। దద్దసంతసిల్లితద్ద్వారకాపురి। గరుగ నిశ్చయించె నర్జునుండు * వ॥ మఱియు నప్పురంబున నన్యులు దన్నెఱుంగకుండ
యావవులు యతులకు విధేయులని కృతకయతివేషధరుండై * క॥ పరమబ్రహ్మణ్యు జగ। ద్గురు గరుడధ్వజు ననంతగుణు
నేకాగ్ర। స్థిరమతి నైనిజహృదయాం। తరసుస్థితుఁ జేసి భక్తిఁ దలఁచుచునుండెన్ * క॥ నరునునికి నెఱిఁగి కృష్ణుఁడు। తి
ముగదయతోఁ బ్రభాసతీర్థమునకు నొ। క్కరుఁడచను దెంచె సర్వే। శ్వరుఁ డెప్పుడు భక్తులకుఁ బ్రసన్నుఁడు గాఁడే *

——*అర్జునుఁడు ద్వారకానగరంబునకుఁ జనుట.*——

వ॥ ఇట్లు తనకడకు వచ్చిన యాదిదేవుం డయిన దేవకీనందనునకు నమస్కరించి పురందరనందనుం డానందజలభరితనయ
నుండయి యిట్లనియె * ఉ॥ ద్వాదశమాసికవ్రతము ధర్మవిధిన్ జరుపంగ నేగి గం। గాదిమహానదీహిమవదాదిమహాగిరిదర్శ
నంబు మీ। పాదపయోజదర్శనము పన్నుగఁ జేయుటఁ జేసి పూర్వసం। పాదితసర్వపాపములు వాసె భృశంబుగ నాకున
స్తతా * వ॥ అనిన విని నగుచు నబ్జనాభుం డర్జునునతిస్నేహంబునం గౌఁగిలించుకొని యెల్లవారికుశలం బడిగి యతని తీర్థాభి
గమననిమిత్తంబును విని సుభద్రయందు బద్ధానురాగుండగుట నుపలక్షించి ద్వారకానగరంబునకుఁ దోడ్కొని యరిగి * ఉ॥
ప్రాజితశాతకుంభగృహపఙ్క్తులఁ బుష్పితవల్లి ... వజ్రవిచిత్రవేదికా। తాజఁగరం

బురమ్యంబగు రైవతకాచలకందరంబునన్। రాజకులైకసుందరుఁ బురందరనందను నుంచెఁ బ్రీతితోన్ * క॥ శ్రీపతి
నెయ్యంబున। నాపోవక పార్థునొద్ద నా రాత్రి ప్రియా। లాపములఁ దగిలియుండెను। దీపమణుల్వెలుఁగ భుజనదీప్త
దానున్ * వ॥ ఇట్లు పరమపురుషులయిన నరనారాయణులు తమపూర్వజన్మసహవాసంబు నట్లప్పుడు పరమానందం
బరస్పరప్రియమధురసంభాషణంబుల నొక్కటనుండి యారాత్రి గడపి రంతఁ బ్రభాతంబ వాసుదేవుండు వాస
సునందయుండఁ బంచి గాంచనరథాగ్రూఢుండయి పురంబునకుం జని పౌరజనప్రధానసమక్షంబున రైవతకమహో
త్సవంబు ఘోషింపం బంచిన * ఉ॥ పౌలుపుగఁ బూసికట్టి తొడిభూరివిభూతి ప్రకాశితంబుగాఁ। గలయఁగ దత్తవీణా
కాంస్యమృదంగకశంఖభేరికా। హాళపటహధ్వనుల్సెలఁగ నాటలుపాటలునొప్ప నెల్లవా। రలుచని చేసిరర్చనలు రై
కాద్రికి నుత్సవంబుతోన్ * చ॥ గురుకుచయుగ్మముల్గదలఁ గ్రొమ్ముడులందలిపుష్పముల్పయిం। దొరుగనిదాఘ
మువితతుల్సెదరన్ మదిరామదంబునం। బరవశలయ్యు నింపెసఁగఁ బాడుచుఁ దాళముగూడఁ దట్టుచుం। పరుణుల్
నాడిరి ముదంబునఁ గాంతులు దమ్ముఁ జూడఁగన్ * సీ॥ సారణసాత్యకాక్రూరవిదూరణసాంబసంకర్షణశంబరారి। భా
షేణోగ్రసేనసైనేయానిరుద్ధహార్దిక్యగదోద్ధవాది। యాదవులధికప్రమోదులై యొక్కటఁ దరుణులుఁ దారునుగ
ఋ।హయశిబికారూఢులయి తదుత్సవమునకరిగిరి మఱి జగద్గురుఁడు కృష్ణుఁ - ఆ॥ డింద్రలీలతోనుపేంద్రుండు రుక్మి
విమొదలుగాఁగ దేవులెల్ల। నొప్పితోడ రాఁగ నప్పర్వతమునకుఁ। జనిరొసకలజనులు తనకు నేరఁగ * వ॥ ఇట్లరిగి జనార్ద
నుఁడు ధనంజయుం దలంచి తత్సమీపగతుండయి యాతనికి నప్పర్వతరమణీయప్రదేశంబులం జూపుచు విహరించి యిర్ద్దఱు
నొక్క విమలమణివేదికయందభిమతసంభాషణంబుల నుండు నంత * చ॥ క్వణదనుకింకిణీకలితకాంచనకాంచికలాపము
రణన్మణికలనూపురంబులు సమధ్వని నొప్పఁగ భక్తిఁ బాదచా। రిణియయి కన్యకాజనపరీతసుభద్ర తదద్రిపూజనప్ర
తులు సేసె నింద్రసుతుఁ బార్థుని జేశ్వరుఁ గాఁదలంచుచున్ * ఉ॥ దానిసుభద్రఁ గా నెఱిఁగి తత్క్షణజాతమనోజసం
మ్మానసుఁడై నయవ్విజయుమానుగఁ జూచి మునీంద్రనీకుఁజ। న్నేనలి నాతులందు మదినిల్పఁగ నంచును మండహాసగౌర
ననుఁడై రథాంగధరుఁ డాతనికిట్లనియెన్ బ్రియంబునన్ * వ॥ నీవు సుభద్రయందు బద్ధస్నేహుండవగుట తొల్లియ
యుంగుమనోడకుండు మునీకోర్కి వసుదేవదేవకులకుం జెప్పి సఫలంబు సేయుమన నియర్జునునకు హృదయానందంబుగా
బలికి యప్పుడు వడిగల చారులరావించి ద్వారవతియం దర్జునుండున్న వాఁడని ధర్మరాజున కెఱింగించి రండనియింద్ర
పురంబునకుం బంచియున్నంతనచ్చటికి బలదేవాదియాదవులెల్ల భక్తులయి వచ్చి యతియకా వగచి యర్జునునకు నమస్క
రించి యాతని వలన సర్వతీర్థకీర్తనంబులు తత్సేవాఫలంబులును విని సంతసిల్లి వానిం దోడ్కొని చనిక న్యాంతఃపురంబున
నివాసంబు సేసి యివ్వర్షాకాలంబున నిండయుండి చాతుర్మాస్యంబు సేసి సుమ్మీం గృతార్థులం జేయుమని ప్రార్థించి

——అర్జునుండు యతిరూపంబున సుభద్రకడ నుండుట.——

నికి నన్నపానవిధులం బరిచరింప సుభద్రం బంచిన * క॥ అందు ధృతిమందరుండు పు। రందరనందనుఁడు దనకు రమణగుణ
సుందరి సుభద్ర నెయ్యం। బొందఁగఁ బరిచర్య సేయుచుండఁగ నుండెన్ * క॥ వీరుఁడు యతిరూపంబున। నారఁగ నం
యాతఁ డర్జునుఁడని స। త్యారుక్మిణులకుఁ జెప్పెము। రారాతిరహస్యమున ననంతప్రీతిన్ * చ॥ అలయక నా
న్నాఁటికిల తాంగియపూర్వములైన భోజనం। బులుగ డుభక్తిఁ బెట్టుచు నపూర్వములైన నవపుర్విలాసయు। క్తులు వెలు
చుచున్ ముదముతోఁ బెనిచెన్ మరునాఁడు నాఁటిక। గ్గలముగు చుండ నెయ్యమును గామవికారము సవ్యసాచికిన్ *
అలినీలకుంతలుండనియును హరినీలసమవర్ణుఁడనియు నాజానులంబి। తాయతస్థిరబాహుఁడనియును రక్తాంత
దళాకారనయనుఁడనియు। నుత్తుంగఘనవిశాలోరస్కుఁడనియును గవ్వడియని మఱికరము వేడ్క। విన్నచు నే
వినిమఱియదితనవినినట్లయతిఁ జూచి వీఁడు విజయుఁ - ఆ॥ డొక్కొ యనుచు సంశయోపేతచిత్తయై। యుండియుండి
కొక్క నాఁడు। భోజనావసానమున నున్నయమ్ముని। కిట్టులనియె ప్రీతినిందువదన * వ॥ మునీంద్రా మీయా
ర్థంబులు మీరెఱుంగని రాజులు సుమీరు సూడని పురంబులును లేవని విచ్చారింతు * సీ॥ అమరావతికి నెనయనఁగని

మతిఁబరఁగుసింద్రప్రస్థపురవరంబు । నూదితిరేపాండుసుతులుసుఖంబున్నవారెమాయత్తయంభోరుహాక్షి।కుంతీమ
హాదేవికుతలినియేమహావీరుఁడర్జునుఁడుజితారితీర్థ । గమనోత్సుకుండయ్యెఁగ్రమ్మటివచ్చెనేయెఱుఁగుదురేని నాకె
ఱుఁగఁజెప్పుఁ - ఆ ॥ డనిననేనచూవెయయ్యర్జునుండసీ । యొద్దనివ్విధమునసున్నవాఁడఁ । దరుణీనీకునాకుధరణీ
ధరుండును । జలజభవుఁడుఁజేసెసంగమంబు * వ ॥ బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిదివివాహంబుల
యందును గాంధర్వరాక్షసంబులుక్షత్రియులకును త్తమవివాహంబులుగావున నిదిగాంధర్వవివాహంబునకుసమ
యంబనిన సుభద్రలజ్జావనతవదనయయి * తే ॥ నన్నునీనర్థమెల్లనిందున్నవారు । వారయెఱిఁగిచేయుదురు వి
వాహమనుచు । వనజనేత్రయంతఃపురంబునకుఁజనియె । నరిగెఁదనలతాగృహమునకర్జునుండు * వ ॥ అయ్యి
రువుర యన్యోన్యప్రణయంబులు దనదివ్యజ్ఞానంబున దివ్యపురుషుండయిన పురుషోత్తముండెఱింగి యర్జునునకు
భోజనవిధులొనర్ప రుక్మిణీదేవింబనిచియొక్క-నాఁడు దేవకీవసుదేవులకు నర్జునస్థితియును సుభద్ర నెయ్యంబును
నెఱింగించినఁ దమతొల్లింటివిచారంబున కనురూపంబగుటకుసంతసిల్లి బలదేవాదులెఱుంగకుండ సుభద్రార్జును
లవివాహంబుసేయ నిశ్చయించి తమనిశ్చయం బిరువురకుంజెప్పి పశుపతి పూజామహోత్సవవ్యాజంబున నఖి
లయాదవభోజాంధకవృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుంజని * క ॥ అందమరబృందవంద్యున । కిందుకళాభర
ణునకును మేశ్వరునకునా । నందంబందఁగనందఱు । నందకధరుఁడుత్సవంబొనర్పఁగఁబంచెన్ * క ॥ తగఁగవివా
హంబెన్నం । డగునొకొయెన్నండుసంగమావాప్తియుమా । కగునొకొయనియెదఁగోరుచు । నొగినటనుండిరిసు
భద్రయునువిజయుండున్ * క ॥ హరిఁదలఁచెసుభద్రపురం । దరుఁదలఁచెధనంజయుండుదడయకవార । య్యి

——*అర్జునుఁడుసుభద్రనువివాహంబగుట*——

రువురపెండిలిఁజేయఁగ । వరదులుతద్ద్వారవతికివచ్చిరిప్రీతిన్ * వ ॥ ఇట్లువాసుదేవుండువసుదేవాక్రూరసాత్యకి
సాంబసహితుండయి యంతర్ద్వీపంబుననుండివచ్చిన యనంతరంబ యమరసిద్ధమునిగణ పరివృతుండై యమరేం
ద్రుండువచ్చెనంత బృహస్పతియిచ్చినశుభలగ్నంబున యమవరుణవాయుధనదాదిసురవరులు నత్రిభృగుభరద్వా
జనారదవసిష్ఠవామదేవప్రభృతులయినమహామునులును సదస్యులుగాఁ గశ్యపప్రజాపతిహోతగా నరుంధతియు
శచియురుక్మిణియు నప్సరోగణంబులతోడం బురంధ్రీకార్యంబులుసేయ సుభద్రార్జునులవివాహం బతిరమ్యంబయ్యె
నందు * తరువోజ॥ అనిమిషప్రభుఁడునిజాత్మజుననఘునర్జునుఁ బ్రీతితోనభిషిక్తుఁజేసి । మను జేశుఁగాంచనమణిమ
యతుంగమకుటవిభూషణను త్తకుఁజేసి । యనుపమకేయూరహారాదిభూషణాభిశోభితుఁజేసియప్పుఁడానంద। జని
తాంబుకణికార్ద్రచక్షుస్సహస్రజలరుహంబులుదాల్చెసమ్మదంబెసఁగ * మానినీవృత్తము॥ నరునకుదయనిట్లానంద
మొందించియింద్రుం।డరిగెదివికిదివ్యానంతరత్నాంశుజాల। స్ఫురితసురవిమానంబుల్నభోభాగమెల్లన్। నెరసివెలుఁగ
గుచుండన్నిర్జరశ్రేణితోడన్ * వ॥ఇట్లునారాయణుండునిజారంభంబుసఫలంబగుటకుసంతసిల్లిసంప్రాప్తమనోర
థుండయియప్పార్థుంగౌఁగిలించుకొని యక్షయబాణతూణీరబాణాసనసనాథంబయి పవనజవనహయంబులంబూనిన
కాంచనరథంబెక్కి-సుభద్రందోడ్కొ-నియింద్రప్రస్థపురంబునకరుగుమనిపంచియనంతరంబజనార్దనుండంతర్ద్వీపంబు
నకరిగిన * క॥హరిపంచినమార్గంబునఁ।గురువిభుఁడుసుభద్రఁదోడుకొనిచను నెడఁద।త్పురపరిరక్షకులతిభీ।కరులుపృథు
శ్రవసుఁడాదిగాఁగలవీరుల్ * ఉ ॥ వీరుఁడువీఁడుపాండవుఁడువృష్ణికులోత్తములైనసీరిదై। త్యారులెఱుంగకుండఁగ
మహారథుఁడై తరుణిన్సుభద్రనం। భోరుహనేత్రఁదోడ్కొ-నుచుఁబోయెడునీతనిఁబోవనిచ్చినన్।ధీరుఁడుమాధవుండు
బలదేవుఁడునల్గుదురంచునడ్డమై * క ॥ వీఁకఁబఱతెంచినల్గడఁ।దాఁకినఁగడునల్గి ఘోరతరశరహతినమ్మూఁకలువిరియఁ
గనర్జును । డాకరమననేసెనుగ్రుఁడయిరణభూమిన్ * చ॥ హరితనయుండుపార్థుఁడురయంబుననందఱనాహవక్రి
యా । విరహులఁజేసియప్పురమువీధులు వేదులురమ్యహర్మ్యగో । పురములుదగ్గిరీంద్రమణిభూములుభూరితటాక
సంకజా।కరములునవ్వనావళులుగా  * క ॥ అమరేంద్రసుతుఁడుదనకుంగమలాక్షిసు

భద్రరథముఁ గడపఁ గననిలో। నమితయదుసైన్యములన। భ్రసుమున నోడించి లబ్ధజయుఁడయి యరిగెన్ * వ॥ అ
భూపాలుండు ప్రబలజలధరధ్వానగంభీర భేరీధ్వనిచే నర్జునుపరాక్రమంబెఱింగించి నవిని యంతర్ద్వీపంబున నున్న
సేవాదియాదవులందఱు దక్షిణంబ పురంబునకు వచ్చి సభాసీనులయి * క॥ యాదవుల నాదరింపక। యాదవవిద్వో
కిరీటి యరిగెను గంభీ। రోదధికరములనీఁదం। గాదనక కడంగెనధికగర్వోద్ధతుఁడై * మత్తకోకిల॥ ఏల పార్థుపరాక్ర
మునసహింపనాతని నాహవ। వ్యాలునిప్పుడ పట్టితెత్తము వాతధూతదవానల। జ్వాలకున్వనరాశి వేలకసంఖ్యయ
సేనకుం। దేలిపోవక చక్కనయ్యెడు ధీరులెవ్వరు పోరులన్ * వ॥ అనివిజృంభించి విలయసమయసముద్ధూతవారాశి
భోలె ఘూర్ణిల్లుచున్న యాదవవీరుల వారించి వాసుదేవుం జూచి బలదేవుండిట్లనియె * క॥ నీవెఱుఁగకుండ గర్వమున
జయుఁడు దా సుభద్రఁ దోడ్కొనిబలిమిం। బోవఁగ నంతసమర్థుఁడె। నావుడుఁ గృష్ణుండు రామునకు నిట్లనియెన్ * సీ॥ భ
కులాగ్రణి పాండవసింహంబు సర్వధర్మజ్ఞుఁడీ సవ్యసాచి। దన మేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని చనియె నాతనికది
చెపుఁడ। యప్పార్థుపిఱుఁద మీఱరు గంగవాఁడంతయశ్రమసాధ్యుఁడెయాహవమున। నఖిలాస్త్రవిదుఁడు ద్రోణా
ర్యశిష్యుండు జితకాశియనవానిఁ జెప్పవినమె— ఆ॥ వలవదుడుగుఁడనిన వాసునుపలుకను। వేలగడవవయ్యె వృష్ణిభోజ

—*అర్జునుఁడు సుభద్రాసహితుండయి యింద్రప్రస్థపురంబునకుఁ జనుట.*—

చవాంబురాశియటధనంజయుఁడవి। జేయుఁడభిమతార్థసిద్ధిఁ బొందె * వ॥ ఇట్లింద్రప్రస్థపురంబునకభిముఖుండయియ
కదేశంబులం గడచి యంతమునందర ముంపందప్రేరితులయన దాశార్హవీరులతో నరణ్యంబులు గడచి పుణ్యతీర్థం
లం జూచుచు నానాజనపదంబుల విహరించుచు వచ్చి యింద్రప్రస్థపురసమీపంబునందు * ఆ॥ ఘనభుజుండు నరుఁడు దన్నక
ట్టుపట్టుల। విశ్రమించె భువనవిశ్రుతుండు। సుతిఁదలంచియాత్మహితము గునట్లుగా। నిష్టమనసుభద్ర కిట్టులనియె * వ॥
మివ్విధంబునఁ జనునప్పుడు నిన్నుఁ జూచి ద్రుపదరాజతనయ యప్రియంబులు పలుకునో యప్పరమపతివ్రత పలుకు నిక
వంబు గావున నేకతంబ గోపాలబాలికలతో నరిగి మందర నక్కోమలి యడుగులం బడుమని పంచిన సుభద్రయు నీ
రుపంచిన మార్గంబున నింద్రప్రస్థపురంబునకుం బోయి కుంతీదేవికి మ్రొక్కి ద్రౌపదికి మ్రొక్కిన * తే॥ పంకజా
నీపతిప్రతిపక్షవీర। విజయుఁడయ్యెడు నీవును వీరపుత్ర। జననివగుమని దీవించె సంతసంబు। తోడ వసుదేవపుత్రి
ద్రుపదపుత్రి * వ॥ ఇట్లు ద్రౌపది చేత దీవనలుగొని కుంతీదేవి యొద్ద సుభద్రయున్నంతట నర్జునుండును సం
దాశార్హసైన్య సమన్వితుండయి యనేక బ్రాహ్మణాశీర్వాదంబు లెసఁగ నింద్రప్రస్థపుర ప్రవేశంబు సేసి ధౌమ
నకు ధర్మరాజునకు భీమునకుఁ గుంతీదేవికి మ్రొక్కి తనకు మ్రొక్కిన కవలం గౌఁగిలించుకొని పరమానురాగంబు
నుండు నంత * క॥ చెలియలు మఱఁది యుఁ జనియు। మ్ములనింద్రప్రస్థనగరమున నభిమతబం। ధులయొద్ద సున్నవా
జలశయనుఁడు విని కరంబు సంతుష్టుండై * సీ॥ బలదేవసాత్యకిప్రద్యుమ్నవసుదేవు లాదిగాఁ బరగిన యా
ద్ర। గణ్యులుఁ దాను నగణ్యమహావస్తువాహనంబులుగొని వాసుదేవుఁ। డనుజకు నరణమీ నర్థితోఁ జనుదెంచె
రి రాక నెఱిఁగి ధర్మాత్మజుండు। గరము గారవమునఁ గవలను గృష్ణున కెదురుఁ బుత్తెంచిన నింద్రలీల - ఆ॥ నింద
విభుఁడు పేంద్రుఁడింద్రప్రస్థ। పురము సొచ్చె నతివిభూతి మెఱసి। యనుజవరులతోడ నంత బ్రత్యుద్గతుం। డయి
ధిష్ఠిరుండు హర్ష మెసఁగ * వ॥ వసుదేవాది యాదవవృద్ధుల కెల్ల మ్రొక్కి బలదేవసాత్యకిసారణప్రద్యుమ్న
నుచిత ప్రియపూర్వకంబుగ సత్కృతులం జేసి * ఉ॥ ఆనకదుందుభిప్రభృతి యాదవులుం గురుముఖ్యులున్
దం। గానకదుందుభుల్ సెలఁగ నత్యనురాగముతో నిరంతర। శ్రీమతులొప్పనుత్సవము సేసిరి సప్తదినంబులిష్ట
న్నానములన్ మహీసుర సమాజసమీహితపూజనంబులన్ * వ॥ అంత * క॥ నిరుపమపరార్ధ్య రుచిసుం। దర
ములు శోభితములగు వానిన్। పరదుఁడు సహస్రసంఖ్యా। భరణంబులఁ బార్థునకు సుభద్రకు నిచ్చెన్ * వ॥
యును * సీ॥ అవిరళక్షరితదానార్ద్రగండస్థలగజసహస్రంబును గనకరత్న। రచితమై తురగసారథిసహితంబైన
సహస్రంబును రమ్యభూష। ణాలంకృతస్త్రీసహస్రంబుఁ గాంచనశిబికాసహస్రంబుఁ జిత్రలలిత। గతినొప్ప

నూఱుగాడీలుసింధుజబాహ్లీకకాంభోజపారసీక - ఆ॥ జాతమైనతురగశతసహస్రములతోఁ। గోధనంబుధీరఘోరవీ
రసర్పయుక్తలైనదశలతోఁదాశార్హ్య। వరులనరణమిచ్చెవామనుండు * క॥ క్రమమునఁగుంతీదేవికి।యసునందనుభీముఁ
గవలనాద్రౌపదిను। స్తసురత్నాభరణామల। నమరఁగవేర్వేఱనెయ్యుఁడయిపూజించెన్ * వ॥ మఱియుబలదేవాది
యాదవులెల్లసుభద్రాస్వజనులంబూజించి పాండవులచేతంబ్రతిపూజితులయి ద్వారవతికిఁజనిరుపేంద్రుండునునింద్ర
నందనుతోడియిష్టవినోదంబుల నింద్రప్రస్థపురంబున నుండెనంత * ఉ॥ ధన్యులకాసుభద్రకుశతక్రతుపుత్రునకుద్భ
వించెన। మాన్యయశుండుపుత్రుఁడభిమన్యుఁడువైన్యనిభుండనన్యసా। మాన్యపరాక్రమప్రబలమాన్యుఁడుపుణ్యచరి
త్రుఁడన్యరా। జన్యభయంకరుండురణశౌర్యుఁడుపాండవవంశకర్తయై * ఉ॥ సుతజననోత్సవంబునవిశుద్ధయశుండు
యుధిష్ఠిరుండుసం। భృతహృదయప్రమోదుఁడయిపెంపుననిచ్చెసువర్ణభూషణ। ప్రతతులుగోధనాయుతముబ్రాహ్మ
ణముఖ్యులకున్నిరంతర। వ్రతులకువేదవేదులకువారిజసంభవునట్టివారికిన్ * వ॥ ఇట్లుదయించియభిమన్యుండుతల్లిదం
డ్రులకుసకలజనులకు నానందంబొందించుచు ధౌమ్యనిర్మితజాతకర్మచౌలోపనయనుండయి పెరిగి * మత్తకోకిల॥ ఆ
దిఁగోలెనుగృష్ణుచేదయనావృతుండయిధౌమ్యుతో। వేదముంగయుతంబుగాఁజదివెన్ధనంజయుతోఁ ధను। ర్వేదమిమ్ముగ
నభ్యసించెఁబ్రవీరవైరిపతాకినీ। భేదమార్గములెల్లనేర్చెనుపేతవిక్రమసంపదన్ * వ॥ అంతద్రుపదరాజనందనక్ర
మంబునఁ బాండురాజనందనులవలనఁ బ్రతివింధ్యశ్రుతసోమశ్రుతకీర్తిశతానీకశ్రుతసేనులననేవురుసుపుత్రులం బ
డసిన * క॥ సుతవంతులయివిశుద్ధ। శ్రుతనయవంతులయిపాండుసుతులతులగుణా। న్వితులుజగజ్జనసుతవి। శ్రుతులును
మహారాజ్యలీలసుఖమున్నంతన్ * చ॥ ఉరుతరదావపావకశిఖోత్కలితశ్వసనంబులన్గసితే। తరగతితీవ్రతిగ్మకరధా
మసహస్రములన్బహుప్రవా। హరహితనిమ్నగాతతులునై కడుదీర్ఘములైనిదాఘవా। సరములుసర్వజీవులకస
హ్యములయ్యెనుదారుణంబులై * వ॥ అట్టిఘర్మదివసంబులయందర్జునుండొక్కనాఁడుకృష్ణునకిట్లనియె * చ॥ జలరుహ
నాభరమ్యగిరిసానువనంబులవేఁటలాడుచున్। సలుపుదమీనిదాఘదివసంబులనీవునునేనునుమ్మిమ। న్నళినరజస్సుగంధి
యమునాప్రవహత్తుంగతరంగసంగదా। నిలశిశిరస్థలాంతరవినిర్మితనిర్మలహర్మ్యరేఖలన్ * వ॥ అనిపురందరనందనుండు
గోవిందుననుమతంబువడసిమిత్రామాత్యభృత్యసమేతులయి యిద్దఱునరిగి రుచిరప్రదేశంబులవిహరించుచునొక్క
నాఁడుఖాండవసమీపంబుననొక్క చందనలతాభవనచంద్రకాంతవేదికయందు మందశీతలసురభిమారుతంబనుభవిం
చుచునిష్టకథావినోదంబులనుండునంత * మాలినీవృత్తము॥ అసితపథుఁడువిప్రుండై మహాశ్రాంతలీలన్। మసృణకపిలకే
శశ్మశ్రులొప్పంగ దేజం। బెసఁగముసముతోనయ్యిద్దఱన్ డాయవచ్చెన్। వసునిభులగువారిన్ వాసవిన్ వాసుదేవున్ *
వ॥ వారలవ్విప్రునతిభక్తింబూజించినవారలకునవ్విప్రుండిట్లనియె * క॥ పనమితభోజనుండన। హీనాగ్నిబలుండనా
ననిష్టాన్నముస। న్మానముగఁబెట్టుఁడోపుమ। రేనినిదృప్తుండననుము నేనట్లయినన్ * వ॥ అనినసకెద్దిభోజనంబిష్టంబు దా
నినపెట్టెదమడుగుమనినవారికినవ్విప్రుండిట్లనియె * ఆ॥ అగ్నినేనునాకునాహారమయ్యెంద్రు। ఖాండవంబుదీనిఁగాల్పఁ
గడఁగి। మొగువఁబడితిముందరింద్రుఁపంచినమహా। దారుణాంబుధరశతంబుచేత * వ॥ తక్షకుండనుపన్నగేంద్రుండిం
ద్రునకిష్టసఖుండయి ఖాండవంబునందుండుటంజేసి దీనినమృతంబురక్షించునట్లతిప్రయత్నంబుననింద్రుండురక్షించి
నియుండునదినిమిత్తంబు సర్వసత్త్వంబులునిందుసుఖంబుండు మీరుమహాసత్త్వులరఖిలాస్త్రవిమలరనుకేంద్రుం
డుగావించునఖిలవిఘ్నంబులమీయస్త్రబలంబుననివారింపనోపుదురేని నేనునుదీనిననాహలంబుగనుపయోగించికృతా
ర్థుండనగుదు * క॥ అనియగ్నిదేవుఁడయ్యా। ర్జునదామోదరులశౌర్యశోభితులఁబ్రియంబునఁబ్రార్థించెనుబలసూ। న
నరక్షితఖాండవప్రదాహోత్సుకుఁడై * వ॥ అనినవినిజనమేజయుండువైశంపాయనునకిట్లనియె * ఆ॥ ఏమికారణ
ముననింద్రుఖాండవమగ్ని। దేవుఁడట్లుకాల్పఁదివిరెదీని। విప్రముఖ్యనాకువినఁగవేడుకయయ్యె। నెఱుఁగఁజెప్పుమయ్య

——* శ్వేతకియనురాజర్షివృత్తాంతము *——

యనియుననిన * వ॥ జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె ... శ్వేతకియనురాజర్షి ఘృతసంపూర్ణదక్షిణానేక

ధ్వరుండయి శతవార్షికసత్త్రయాగంబు సేయసమకట్టి ఋత్విజులం బ్రార్థించిన ఋత్విజులు నేము నిరంతర క్లేశ
నకోపమనవరతయజనశీలుండవు నీకు నీశ్వరుండు యాజకత్వంబు సేయనోపుంగాని యొరులోపరనిపలికిన నీవ
కైలాసంబునకుం జని లోకవంద్యు నిందుశేఖరును ద్దేశించి యుగ్రతపంబు సేసినం బరమేశ్వరుండు ప్రత్యక్షుండయి
కిట్లనియె * క॥ శ్వేతకి నీతపమునకేఁ। బ్రీతాత్ముఁడ నయితి నీకుఁ బ్రియమెయ్యదివి। ఖ్యాతముగ నిత్తు దానిన। యా
త వేఁడుమనిన నన్నరపతియుఁ * వ॥ దేవా నీప్రసాదంబున శతవార్షికసత్త్రయాగంబు సేసెద నాకు ఋత్విజుం
గావలయుననినం గరుణించి యాజకత్వంబు బ్రాహ్మణులకు విధికృతంబగుటం జేసి దానినొరులకుం జేయంగాము
నింక నీవు బ్రహ్మచర్యంబునం బండ్రెండేండ్లు నిరంతరఘృతధారం జేసి హుతాశనుఁ దృప్తుం జేయుము నిన వాఁడును
మేశ్వరుపంచిన విధంబున నగ్నితర్పణంబు సేసిన సంతుష్టుండయి యీశ్వరుండు వానిపాలికి వచ్చి యప్పుడమ
సురావించి * క॥ ఈతఁడనవరతయజన। ప్రీతుం డీతనికి మురితభీతునకు మనఁగ। ప్రీతిగ నా ర్త్విజ్యమ్ము మ। హా తేజోధిక
యుమునిదయఁ బంచెఁ * వ॥ శ్వేతకియుఁ దనకు దుర్వాసుండు ఋషిగణంబులతో ఋత్విజుండుగా నభిమతంబయిన
యాగంబున ఘృతధారాకారణంబున నగ్నిదేవుండు తనకగ్నిమాంద్యంబును దేజోహీనతయు దప్పియునైనం బిత
ముపాలికిం జని తనశరీరస్థితిఁ జెప్పినం బితామహుండు దానినపరిమితఘృతోపయోగంబుననయిన మహావ్యాధిఁ గ
తెఁగి యిట్లనియె * క॥ ఈవ్యాధి యొంటఁ దీఱదు। దివ్యౌషధయుక్తమైన దివిజవనంబుఁ। హవ్యాశన భక్షింపుము
వ్యాధిశమంబు దానఁ గనునీకనినఁ * క॥ చని ఖాండవంబుఁ గాల్పఁగ। మొనసి మహాహస్తియూథములఁ బోనిఘునా। ఘన
లచే బాధితుఁడయి। వనజజుకడకేగి హవ్యవాహనుఁ డనియెఁ * వ॥ ఏను మీరానతిచ్చిన విధంబున ఖాండవంబు పయోగిం
బోయిత ద్రక్షకులు గావించు విఘాతంబులు వారింప నేరక విఫలప్రయత్నుండనయితి నింకేది యుపాయం బెవ్విధంబ
ఖాండభక్షణం బెన్నండు దొరుకుననినుగ్ఖంచిన వానిం జూచి కమలసంభవుండు గరుణించి భావికాలకార్యంబప్పు
లంచికొంతకాలంబునకు నరనారాయణులను నాదిమునులు నరలోకంబున దేవహితార్థం బర్జునవాసుదేవులయి జన్మిం
యాఖాండవసమీపంబున విహరింతురు వారు భవత్ప్రార్థితులయి తమయస్త్రబలంబున నఖిలవిఘ్నంబుల నపనయిం
రాకులంబున నీకు ఖాండవనోపయోగంబు ప్రసాదింతురనిన నగ్నిదేవుండు గరంబు సంతసిల్లి కమలజు వచనంబు మహా
బంబుగాఁ బెద్దకాలంబుండి తద్వచనమార్గంబున నప్పుడు గృష్ణార్జునులం గని ఖాండవదహనార్థంబు ప్రార్థించిన నగ్నిక

—అగ్నిదేవుండు కృష్ణార్జునులకుఁ జక్రకార్ముకాదులొసంగుట.—

నకు నర్జునుండిట్లనియె * సీ॥ వారణహస్తానుకారంబులగు వారిధారలు గురియు మర్వారఘోర। తరవారివాహప్రక
లు వారింపసురగణంబులతోడ సురవరేణు। నైన నోర్వనుశక్తమైన మహాదివ్యశరసంచయము నాకపరిమితమ్ము।
పట్టి సాయకావలికి నాదగు భుజబలశీఘ్రసంధానములకుఁ దగిన - ఆ॥ ధనువు సర్వవహనఘనరథాశ్వములుకృ
కు నాయుధములు ననఘుయిపుడు। లేమిఁ జేసి చూ వెయీ మహాకార్యంబు। దొడఁగకున్నవార మెడయఁ జేసి *
అనిన నగ్నిదేవుండపుడు వరుణుం దలంచి వానిం దనకు సన్నిహితుం జేసికొని తొల్లి సోముండిచ్చిన బ్రహ్మనిర్మితక
కంబు నక్షయతూణీరంబులును గంధర్వహయంబులం బూనిరథంబునలిరఘుండయి నయర్జునునకిమ్ము మఱి చక్ర
సుగదయును వాసుదేవునకిమ్మనిపంచిన * మ॥ అమరాహీంద్రవియచ్చరాములక జేయం బప్రధృష్యంబభే।
ముప్రస్థిరమన్యసాధనభిదాదక్షంబునై సర్వలో। కమనోజ్ఞంబయి దివ్యమై వెలుఁగు నగ్గాండీవమక్ జాపర।
మునిచ్చెఁ వరుణుండు పార్థునకు నుద్యద్విక్రమోద్భాసికిఁ * వ॥ మఱియుఁ బ్రతిపక్షక్షయకరంబులయిన
క్షయబాణంబులు గలతూణీరంబులను వివిధాయుధభరితంబయి సింహలాంగూలకపిధ్వజవిరాజమానంబయి మహా
బుధరధ్వానబంధురంబయి మనోవాయువేగసితవాహవాహ్యమానంబయి రణితమణికింకిణీకలాపాలంకృతంబు
సకలదిగ్విజయాధిష్ఠానంబయి యొప్పుచున్న దివ్యరథంబు నర్జునునకిచ్చి సహస్రకరసహస్రకిరణమస్సహప్రభా
భాసురంబగుచు దైత్యదానవయక్షరాక్షసపిశాచోరగప్రశమనంబయి వెలుంగుచున్న సుదర్శనంబను చక్రం

గౌమోదకియను గదయును నారాయణునకిచ్చిన నట్లుసంప్రాప్తదివ్యచాపరథాయుధులయియున్న నరనారాయణులంజూచియగ్ని దేవుండిట్లనియె * క ॥ ఘనభుజయిది గాండీవం । బనఁబరఁగినధనువుదీనిశస్త్రాళిపలి పె । ల్చనఁదాఁకిభగ్నమగున ।త్యనుపమవజ్రాహతవిశిఖావలిపోలెన్ * క ॥ ఈరథమప్రతిహతమున ।మీఁరజవోపేతహయసమేతమఁటీనిన్ ।భూరిబలుఁడెక్కి సోముఁడు । ధీరుండయితొల్లియెల్లదిక్కులనోర్చెన్ * క ॥ ఈచక్రముమధుసూదన । నీచేతవిముక్తమగుచునీరిపులఁద్రియా । మాచరులఁజంపిక్రమ్మఱి । నీచేతికివచ్చుదేవనిర్మితశక్తిన్ * వ ॥ అనితత్ప్రకా

———*కృష్ణార్జునులగ్ని హోత్రునిచేఖాండవంబుదహింపఁజేయుట.*———

రంబుఁజెప్పినఁగృష్ణార్జునులుసంతసిల్లి సన్నద్ధులయిరథంబెక్కియగ్నిదేవుంజూచి సురాసురపరివృతుండయి సురపతివచ్చిననుజయింతుమింకశంకింపక ఖాండవదహనార్థంబుపక్రమింపుమనిననగ్నిహర్షించి తైజసంబయినరూపంబుధరియించి * చ ॥ పెడిలిసువర్ణపర్వతముపెక్కు తెఱంగులవ్రయ్యునట్టుల।ప్పుడువివిధప్రకారములభూరిశిఖావలిఖాండవంబున।ల్గడఁగడుఁబర్వఁగాఁబెరసికాల్పఁదొడంగెహుతాశనుండుచే। డ్వడఁగవనంబులోనిమృగపక్షిభుజంగమభూతసంఘముల్ * సీ ॥ చక్రధరుండయిజలరుహనాభుండుగాండీవధరుఁడయిపాండవుండు।నుండిరవ్వనమునఁనుభయపార్శ్వంబులఁదొల్లింటియట్లనుజెల్లురేఁగి । యనలంబునార్పఁగనప్పుడుపఱతెంచివనరక్షకులుపార్థునిశితాస్త్ర।ధారలనపగతదర్పులై యరిగిరియమసదనంబునకమితబలులుఅ ॥ శిఖియనుగ్రదీర్ఘజిహ్వలుసాఁచియు।ద్ధురసమీరణంబుతోడుసేసి।కొనియుగాంతకాలకుపితానలాకారుఁ। డయ్యెఖాండవముననద్భుతముగ * చ ॥ ఘనధూమధ్వజదహ్యమానవలీకరూప్పరతకోటులచం । దనకాలాగరుసల్లకీతరులయుద్యద్ధూమధూపాసువా।సననొప్పెన్ సురభీకృతంబులగుచున్ సంక్రీడమానాప్సృతా।శనవిద్యాధరసద్విమానవితతుల్సావిత్రవర్త్మంబునన్ * చ ॥ జ్వలనశిఖాలియున్ విజయుసద్విశిఖాలియుఁజుట్టుముట్టినం । దలరిభయాకులంబులగుతద్వనజీవులయార్తనాదమెం। దలియుచునొక్కపెట్టదివినుద్గతమయ్యెనమందమందరా । చలపరివర్తనప్రసభసంక్షుభితార్ణవఘోషఘోరమై * క ॥ ఎగయుచునెగసిపీటుందం।దగిలెడుమిడుఁగుఱులచేతదగ్ధచ్ఛదమై।గగనమునఁబఱవనేరక।ఖగనివహమువహ్నియందుఁగడువడిఁబడియెన్ * క ॥ తనతేజోజాలమువ।ర్వినదగ్ధములగుననేకవిధదేహులదే । హనికాయంబులబహువిధ । తనువులుగలవాఁడపోలెదహనుండొప్పెన్ * చ ॥ అమితకృశానుదగ్ధమగునయ్యమరేంద్రువనంబులోనియు।త్తమసలిలాశయావళులతప్తజలంబులయందపేతజీవములయి తేలుచుండెవరవారిచరంబులువారిపక్షులుం। గమలెనశేషకోకనదకైరవపత్త్రులుశైవలంబులున్ * క ॥ అలుగులపడిఖాండవమునఁ।గలయాశీవిషమహోరగములెల్లవిషా। గ్నులుగ్రక్కుచునత్యుగ్ర।నలబహుళజ్వాలలందునాశముఁబొందెన్ * వ ॥ అంతదేవతలెల్లవెఱచిదేవేంద్రుపాలికింబోయిఖాండవంబునకయినయకాండప్రళయంబుఁజెప్పినవినియదరిపడియింద్రుండుతత్క్షకరక్షణార్థంబుగా ననేకధారాధరనివహంబుతోఖాండవంబునకువచ్చిహుతాశనుమీఁదమహావారిధారలుగురియించిన * క ॥ ఆవారిధారలెల్లమ।హావహ్నిశిఖాహతంబులయిశుష్కములై।లావరినడుమనెయుడుగుచుఁ।బావకుపయినొక్కచినుకుఁబడదయ్యెవడిన్ * క ॥ ఉఱుముచుమెఱుచుచుఁబిడుగులు।వఱలఁగనల్లడలఁబడనవారితవృష్టుల్ ।గుఱుకొనికురియఁగఁబంచెను।మఱియునునయ్యనలుమీఁదమఘవుండలుకన్ * క ॥ పాండుసుతుఁడంతనానా।కాండంబులఁజేసియప్పుడుఘనముగఁజేసెన్ । ఖాండవమునకుగృహంబా।ఖండలధారలకుమారఁగాకుండంగన్ * తే ॥ దానివెల్వడనేరకతద్వనమున।జీవులెల్లనుబావకశిఖలఁజేసి।దగ్ధులగుచున్నఁదక్షకతనయుఁడశ్వ।సేనుఁడనువాఁడుపావకశిఖలకపుడు * ఆ ॥ వెఱచితల్లిఁదోఁకఁగఱపించుకొనిదివిఁ। బఱచువానిఁజూచిపార్థుఁడలిగి।వానితల్లిశిరముతోనతత్పుచ్ఛంబు। దునిసియగ్నిశిఖలఁదొరఁగనేసె * వ ॥ వెండియునశ్వసేనునేయసమకట్టినయప్పార్థునకుమోహినియనుమాయఁగావించియమరేంద్రుఁడశ్వసేనువిడిపించియంచులఁదక్షకుండుదగ్ధుండయ్యెఁగానగచికడునలిగి *

——*ఇంద్రుండుకృష్ణార్జునులతోఁబోరుట.*——

ఉ ॥ ఆనరుమీఁదఘోరనిశితాశనివైచెనఖండచండజం। ఝానిలజృమ్భితోల్బణమహాబలధారలతోనిరంతరా । నూనపయో

ధరప్రకరముద్ధతమైహరిదంతరంబులఁ। భానుపథంబునొక్కఁ మొగిఁ బర్వి భయంకరలీలనొప్పఁగన్ ॥ ఉ॥ అన్నవవా
హానిచయమ్ములం జూచి భయప్రపన్నుఁడై। యున్నహుతాశనున్ విజయుఁడోడకుమంచును మారుతాస్త్రమ। త్యు
చిత్తుఁడే సెనదియున్ విరియించెరయంబుతో సము। త్పన్నసమీరణాహతినపారపయోదకదంబకంబులన్ ॥ వ॥ అంత
బలవైరి కృష్ణుపైఁ బార్థుపైఁ గడునల్గి పనిచినఁ గలయంగఁ బన్ని రేఁగి। సురగరుడోరగాసురయక్షగంధర్వులార్పుచు
కియుగ్రాహవంబు। చేసిననమరులఁ జెచ్చెరఁ బార్థుండు భంజించె దనదివ్యబాణశక్తిఁ। జక్రధరుండును జక్రబలంబు
రుడోరగాసురఖచరవరులఁ- ఆ॥ దక్షిణంబవిగతదర్పులఁ జేసిన। నిద్ధఋకుసురాసురేశులిట్లు। భీతులగుటఁ జేసి ప్రీతు
స్మిత। హృదయుఁడయ్యెసురగణేశ్వరుండు ॥ వ॥ మఱియును వారలబలపరాక్రమంబు లెఱుంగ వేఁడి శక్రుండు శిలావర్ష
గురియించిన ॥ క॥ నిశితశరవర్షమునను। గ్రశిలావర్షమ్ము చిత్రగతి నస్త్రకలా। కుశలుఁడు నరుఁడశ్రేషమునఁ। బ్రశాంతి
డించెనమరపాలకు మ్రోలన్ ॥ క॥ కోడుకు జయవిక్రమమునకుఁ। గడుసంతసపడియుఁ దృప్తిగానక చలమే। ర్పడఁగ
శను నార్పఁగఁ। గడఁగి మహారౌద్రభంగిఁ గౌశికుఁడు వడిన్ ॥ చ॥ అరుదుగదివ్యరత్ననివహంబులతోడ వెలుంగుచున్న
సరశిఖరంబు నెత్తికొనితద్గహనార్చులడంగునట్లుగాఁ। డెరలఁగవైచినం దపనతేజుఁడు పాండుసుతుండు దానిజ
ము సేసె వజ్రమయశాతశిలీముఖవారిధారలన్ ॥ క॥ ధరణీధరు చక్రమునకుఁ। బురుహూతతనూజబాణములకనిలో
న్వరుమార్కొన నోపరు సుర। గరుడోరగసిద్ధసాధ్యగణములలోనన్ ॥ వ॥ అంత నొక్కయశరీరవాణి పాకశాసనున
రు ॥ క॥ పరమమునులయిన తొల్లిటి। నరనారాయణులు కృష్ణనామంబులను। ర్వరజనియించిరి వీర। య్యిరువుర పేర్మి
వింతయే దివిజేంద్రా ॥ చ॥ అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవకౌరవాన్వయం। బులు వెలుఁగించుచున్న నృప
జ్యులు వీరలు నీకు నోర్వఁగా। నలవియె వీరు తొల్లి యమరాసురయుద్ధము నాఁడు దైత్యుల। న్వెలయఁగ నోర్చియున్న
రులు గావుట మున్నెఱుంగవే ॥ వ॥ నీకు నిష్టసఖుండయిన తక్షకుండు నింతకుఁ గురుక్షేత్రంబునకరుగు ఖాండవప్రళయ
బునకుఁ దప్పె ఖాండవంబగ్నిచేత దగ్ధంబగునని బ్రహ్మవచనంబు గలుగుటం జేసి యిది హుతాశనునకశనంబయ్యె దీనికి
నేలయనిన దాని విని సురపతి సురగణంబుతో నరిగిన ॥ క॥ బలయుతులు మనుజసింహం। బులు కృష్ణులు సింహనాదములు
వియ। త్తలమును దిక్కులు బధిరం। బులుగాఁ జేసిరి త్రిలోకములు భయమందన్ ॥ వ॥ అట్టియవసరంబున నముచియను
జుననుజుండు మయుండను వాఁడు ఖాండవంబు వెలువడ నేరక తక్షకుగృహంబునఁ బరిభ్రమించుచున్న నగ్నియు నచ్యు
డును జంపవచ్చిన నతిభీతుండయి యర్జును మఱువు సొచ్చిన ॥ క॥ శరణాగతరక్షణత। త్పరుఁడు ధనంజయుఁడు మయుని
ముగాఁ జేనె। గరుణను శరణాగతులగు। పురుషుల రక్షించునంతపుణ్యము గలదే ॥ తే॥ మయుఁడు నశ్వసేనుండును
పాల। సుతులు నలుగురు శార్ఙ్గికులతులదావ। దాహభీతికి నాఱ్వురు దప్పిరన్య। జీవులెల్ల నందపగతజీవులయ్యె

———॥ మందపాలోపాఖ్యానము ॥———

వ॥ అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె ॥ క॥ మయభుజగమోక్షణము ని। ర్ణయముగ నెఱిఁగితిని నే
నాకర్ణింత్వం। బయిన దినలుగురు శార్ఙ్గకు। లయు మోక్షణమెట్లు నిర్మలజ్ఞాననిధీ ॥ వ॥ అనియడిగిన జనమేజయునకు వై
పాయనుండిట్లనియె ॥ క॥ జనపాల మందపాలుం। డను మునిముఖ్యుండు దొల్లి యత్యుగ్రతపం। బొనరించె బ్రహ్మచర్య
బున దివ్యసహస్రవర్షములనైష్ఠికుఁడై ॥ క॥ అమ్ముని యోగాభ్యాసవ। శమ్మున దేహంబు విడిచి చని పుణ్యులలో। కమ్ము
జొరఁగానక వడిఁ। ద్రిమ్మరి దేవతలఁ గాంచి ధృతి నిట్లనియెన్ ॥ వ॥ నాకుఁ బుణ్యలోకంబులు లేకుండ నే నేమి దుష్కృ
సేసితి ననిన నమ్మునీంద్రునకు దేవతలిట్లనిరి ॥ క॥ ఎంత తపంబొనరించియు। సంతానము లేనివారు సద్గతిఁ బొందం। గాం
నీతపమేటికి। సంతానము వడయుమరలి సన్ముని నాథా ॥ వ॥ అనిన విని మందపాలుండు మర్త్యలోకంబునకరిగి నాకుం
రంబెక్కుఁడం బుత్రపౌత్రుల నెవ్విధంబున నంబడయనగునోయని చింతించి పక్షులయందు వేగంబ యపత్యంబు వడయ
టం జూచి శార్ఙ్గికుఁడయి జరితయను లావుక పెంటియందు రమియించి జితారిమిత్ర, స్తంభమిత్ర ద్రోణులను వారిం బరమ

విదులనలువురఁగొడుకులంబడసి ఖాండవంబునం బెట్టితనపూర్వభార్యయయినలపితయుండానును విహరించుచునొక్క
నాఁడు ఖాండవదాహోద్యతుండయిన యగ్నిభట్టారకుం గని యగ్నిసూక్తంబులస్తుతియించె * క॥ నీవఖిలధర్మమూ
ర్తివి। నావీర్యప్రభువులయిననలువురుసుతులఁ। లావుకులఁగరుణఁగావుము। పావకభువనోపకారపర్యాప్తమతీ * వ॥ అ
నిమందపాలుండు ప్రార్థించినఁదత్ప్రార్థనం జేసి నలువురు శార్ఙ్గకులనునగ్నిదేవుండురక్షించువాఁడయ్యె నంతనిట *
క॥ తనయులనజాతపక్షుల। ననలశిఖాభీతచంచలాక్షుల నెటకుఁ। జననేరని బాలకులను । జననినిరీక్షించి శోకసంతాపిత
యై * క॥ వీరలఁదోడ్కొని పోవఁగ। నేరను బాలకులఁబెట్టినిర్దయబుద్ధిఁ। వీరలుతండ్రిక్రియంజన। నేరరు విధికృతముగడవ
నేరఁగలావే * చ॥ ఇది ప్రలయాగ్నివోలె దిశలెల్లనుగప్పఁగవిస్ఫులింగములు। ప్వదలక వాయుసారథివశంబునుగానిటవ
చ్చె నేమిసేయుదుము। సుతులారయీబిలమునొయ్యనఁబోయిచొరుండుదీనిఁగ। ప్పెదఘనపాంసుజాలముల భీమశిఖల్వడిఁ
గాకుండఁగ * చ॥ కొడుకుల బ్రహ్మవిత్తములఁగోరినయట్టులవీరి నల్వురం। బడసితి నిమ్మహాత్ములనపాయమువొంద
యుండఁ బెంచుచు। నడపుమటంచునన్ను మునినాథుఁడు మీజనకుండుపంచియి। ప్పుడయొటనేనియేగెహుతభుక్ప్రలయం
బుఁదలంపఁడకటా * వ॥ అనిదుఃఖితయైయున్నతల్లింజూచి యగ్రతనయుండగుజితారి యిట్లనియె * తే॥ బిలముఁజొచ్చి
మేనియందెలుక చంపు। నిందయుండితిమేనిఁదా నేర్చునగ్ని। యెలుక చేఁజచ్చుకంటెనీజ్వలనశిఖలఁ। గ్రాఁగి పుణ్యలోకం
బులఁగాంతుమేము * వ॥ మఱిమాంసపిండంబులవంటియున్న మాకు బిలప్రవేశంబున మూషకభయంబునియతంబిందు
న్నమాకునగ్నిభయంబు సంశయితంబెట్లనిన * క॥ జ్వలనుండు వాయువశమునఁ। దొలఁగునుజీవనము మాకు దొరుకును గ
సంశయయుతకార్యంబులు। కర్తవ్యములు నియతములు వర్జ్యమ్ముల్ * వ॥ కావున నీవు మెచ్చినచోటికిఁబోవనోపు
మావలని మోహంబువిడిచియరుగుమేము దహనక్లేశంబుఁబొందిననీవు జీవించి పుత్త్రులంబడయుదువు నీపుణ్యంబున మా
కగ్నిభయంబుదొలంగె నేని మాయొద్దకువచ్చియెప్పటియట్లరక్షింతువని కొడుకులు మ్రొక్కినంజూచి జరిత బాష్పప్లా
తనయనయియాసన్నతరుదహనము సహాత్సుకుండయివచ్చుహవ్యవాహనుం గని ప్రాణభయంబునగగనంబున
కెగసెనంత * క॥ నలుగురు నాలుగు వేద। మ్ములమంత్రంబులను బ్రహ్మముఖములునోలెఁ। వెలయంగసంస్తుతించుచు। నల
ములు మాకభయ మభయమనిరయ్యనలుఁ * వ॥ అగ్నిదేవుండప్పుడు మందపాలు ప్రార్థనం జేసియన్నలువురు శార్ఙ్గకుల
న్నవృక్షంబు భక్షింపక పరిహరించిన జరితదానింజూచి సంతసిల్లి కొడుకులయొద్దకువచ్చి సుఖంబుండెనంత నక్కడ మంద
పాలుండు పురందరువనంబు దహనుచేత దగ్ధంబగుట నెఱింగి యందున్నజరితను బుత్త్రులం దలంచి దుఃఖితుండయి లపితకి
ట్లనియె * క॥ తరుణులనజాతపక్షులఁ। జరణంబులు లేనివారి శార్ఙ్గేయులన। ల్వురనొక్కటఁదోడ్కొని యెట। కరుగంగానే
ర్చుజరితయాపదగడవన్ * క॥ మఱచునొకొ మఱవకుండియు। నెఱుఁగకయుండునొకొయనలుఁడెఱిఁగియు నెదనే। మ
మునొకొ పుత్త్రులఁగావం। గుఱుకొనినన్నుం గఁదగు నెమ్మ్రి రాత్మకులఁ * వ॥ అనినవినిలపితయిట్లనియె * క॥ నాయొద్ద నెప్రా
ర్థించిన। వాయుసఖుండపుడునీకు వరదుండయి శా। ర్ఙ్గేయులనం దఱఁగాచెద । ధీయుతయనిపలికెమఱచితే మునినాథా *
వ॥ దానికి నెయ్యుండవయి నాయొద్దదాని యోగక్షేమంబులు దలంచితది పులుఁగెటయేని యుంబఱచుంగాకేమియయ్యె
డువగవకుండుమనినమందపాలుండు మందస్మితవదనుండగుచు వసిష్ఠునట్టిపురుషుండరుంధతివంటిభార్యయయిననుని
మిత్తంబు స్త్రీయందు సంశయింపకుండరది స్త్రీలకు స్వభావంబని ఖాండవంబునకు వచ్చి పుత్త్రసహితయయి కుశలిని
యయియున్న జరితం జూచి సంతుష్టుండయినిజేచ్ఛనరిగెనగ్నియు నిట్లు నిర్విఘ్నంబుగా ఖాండవనౌషధంబుపయోగించి

———* ఇంద్రుండర్జునునకు నాగ్నేయవారుణవాయవ్యాదిదివ్యబాణంబులిచ్చుట. *———

విగతజ్వరుండయి కృష్ణార్జునులదీవించిచనియెనంత * క ॥ అతిమానుషమత్యద్భుత। మతిదుష్కరమయిన కేశవార్జునకృ
తిగో। పతిచూచి మెచ్చి సురపరి। వృతుఁడయిచనుదెంచెఁగృష్ణవిజయులకడకుఁ * క॥ అనఘులు నరనారాయణు। లననా
దియుగంబునఁ సురాసురనుతుల । య్యనఘమహామునులనఁ । వినయంబున మ్రొక్కి రమరవిభునకుఁ బ్రీతిన్ *

వ॥ ఇంద్రుండును గృష్ణార్జునుల నతిస్నేహంబునం గౌఁగిలించుకొని యర్జునునకు నాగ్నేయ వారుణ వాయవ్యాది దివ్యాస్త్రంబు లిచ్చి యీతనికి నీ వెప్పుడుఁ బ్రియసఖుండవయి యుండుమని ప్రార్థించి దివ్యవిమానారూఢుండయి దివంబునకరిగె వాసుదేవార్జునులు మయుం దోడ్కొని మగిడి యింద్రప్రస్థపురంబునకు వచ్చి ధర్మరాజునకు మ్రొక్కి ఖాండవదహనప్రకారంబు సెప్పి మయుం జూపి సుఖంబుండిరని॥ ........................................

---

క॥ జనమేజయజనపాలున । కనఘచరిత్రునకుఁ బ్రీతుఁడయి వైశంపా। యనుఁడాదిపర్వకథ లెల్లను నిమ్ముగఁ జెప్పెనని విలాసమహేంద్రా ✻ క॥ అభిమానసుమహార్ణవహారి। నిభవిభవవిభాసమానన్నృపవీర్యర వి।ప్రభ రాజమనోహర వై। రిభయంకరశౌర్యనృపవరేణ్యాశరణ్యా ✻ మత్తకోకిల॥ రాజభూషణనిత్యసత్యసరస్వతీవిలసన్ముఖాం।భోజరాజమనోజభూజనపూజ్యమానమహాయశో। రాజహంసపయోజినీవనరమ్యదిఙ్ముఖవిక్రమో। ద్వేజితాహితవిష్ణుసన్నిభ విష్ణువర్ధనభూపతీ॥ ........................✻

---

గద్య ✻ ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబయిన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబునందు విదురాగమనంబును గృష్ణసందర్శనంబును రాజ్యార్థలాభంబు నింద్రప్రస్థనివాసంబును సుందోపసుందోపాఖ్యానంబును నారదువచనంబున ద్రౌపదియందు సమయక్రియయు నర్జునుతీర్థాభిగమనంబు నులూపీసమాగమంబును జిత్రాంగదయందు బభ్రువాహనుజన్మంబును ద్వారకానగరంబున వాసుదేవానుమతుండయి యర్జునుండు సుభద్రవివాహంబగుటయు సుభద్రాహరణంబును గాండీవదివ్యరథాశ్వలాభంబును ఖాండవదహనంబును నగ్నిభయంబువలన మయభుజంగమోక్షణంబును మందపాలోపాఖ్యానంబు నింద్రుఁడర్జునునకు నాగ్నేయవారుణవాయవ్యాది దివ్యబాణంబు లిచ్చుటయు నన్నది సర్వంబును నష్టమాశ్వాసము॥ ..✻

(✻)

శ్రీమహాభారతమునందలి యాదిపర్వము

ముగిసెను.

---





# శ్రీరస్తు.

శ్రీ హ య గ్రీ వా య న మః.

# శ్రీ మ దాం ధ్ర భా ర త ము.

## స భా ప ర్వ ము - ప్ర థ మా శ్వా స ము.

శ్రీరమణీయతోరస్థ్సలవిహారాదిత్యాత్మజనిరంతరానందమతీ। కోదండపార్థనిఖిలధ। రాదేవస్తుత్యరాజరాజనరేంద్రా ✻ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లుధర్మతనయునొద్ద వాసుదేవసహితుండయియున్న యర్జునునకతిప్రీతిఁగృతాంజలియయిమయుండిట్లనియె ✻ క॥ ఘనముగఁబ్రాణమురక్షించి।వినయుపకారికిఁబ్రియంబుసేయుమనననే। ర్తునెయ్యైననునీకుఁబ్రియం। బనఘాచేయంగనిష్టమైనదినాకున్ ✻ వ॥ ఏనుదానవవిశ్వకర్మననేకవిధశిల్పకలాకుశలుండ మీకిష్టంబయినదాని నిర్మించెదంబనువుండనిన నర్జునుండచ్యుతు మొగంబుసూచి యితని నెద్దియేనియునొక్కయపూర్వంబయినదాని నిర్మింపనియోగింపుండనినఁ గృష్ణుండు పెద్దయుంబ్రొద్దువిచారించి మయునకిట్లనియె ✻ చ॥ కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకలక్షితిపాలసేవ్యను। స్థిరవిభవాభిరామునకుధీరునకుందగసర్వలోకసుం। దరమగుదానినొక్కసభధాత్రికపూర్వముగానొనర్చిచె। చ్చెరఁగొనిరమ్మునీదయినశిల్పకళాకుశలత్వమేర్పడన్ ✻ వ॥ అనినవాసుదేవునకు మయుండిట్లనియె ✻ ఉ॥ ఇమ్మనుజేంద్రుఁడింద్రదనుజేంద్రులకంటెమహావిలాససౌ। ఖ్యమ్ములఁబెద్దయుగ్ధరణిఁగావునసీతని పేర్మికిన్ దగన్। నెమ్మినొనర్చెదన్ సభమణిప్రభనొప్పఁగదేవతావిమా। నమ్ములునిట్టివేయనిజనమ్ములుదానినమెచ్చిచూడఁగన్ ✻ వ॥ తొల్లివృషపర్వుండను దానవేంద్రునకొక్కసభనిర్మింపసమకట్టి వివిధరత్నమయంబులయినయుపకరణంబులుఁదగఁగూర్చి బిందుసరంబనుకొలనసంగ్రహించినవాఁడ నయ్యుపకరణంబులదానివిచిత్రంబుగారచియించి తెచ్చిధర్మరాజునకిచ్చెద మఱియును భౌమాదిత్యుండనురాజఋషిచేతవిహితంబయి సకలశత్రుఘాతినియయినమొక్కగదను భీమసేనునకును దారుణంబయిన దివ్యఘోషంబుగలదేవదత్తంబనుశంఖంబర్జునునకిచ్చెదననిచెప్పి ధర్మరాజుచేతసత్కృతుండయి మయుండరిగె నిటనారాయణుండును పాండవులవీడ్కొని పితృదర్శనలాలసుండయి ద్వారవతీపురంబునకరిగె నటమయుండునుబూర్వోత్తరదిశాభిముఖుండయిచని కైలాసంబునుత్తరంబున మైనాకశైలంబునందుహిరణ్యశృంగంబున ✻ సీ॥ ఎందేనిసర్వభూతేశుండుసృజియించెసచరాచరంబైనజగము నెల్ల। గంగఁబ్రత్యక్షంబుఁగావించియెందేనిఁ గృతకృతుఁడయ్యెభగీరథుండు। నలినసంభవనరనారాయణస్థాణు వాసవప్రభృతిగీర్వాణముఖ్యు। లెందేనిఁగ్రతువులనేకయుగంబులఁజేసిరిరత్నవిచిత్రవితతి। చిత్రములుమహావిశేషహిరణ్మయ। యూపతతులనోలిమొప్పుచున్న। యట్టిబిందుసరమునందున్నవివిధర। త్నోపకరణచయములొనరఁగొనియె ✻ క॥ దేవబ్రహ్మణులకునా। నావిధపూజనలఁదర్పణముసేసిధరి। త్రీవనితకపూర్వశ్రీఁ। గావింపఁగడంగెమయుఁడుగడురమ్యముగాన్ ✻ క॥ విమలమణిమయములగుదూ। లములంగంబములగోడలను వేదులఁగు। ట్టిమములఁజుట్టినప్రాకా। రములనుగరమొప్పుచుండరచియించెసభన్ ✻ సీ॥ సురుచిరహరినీలకిరణజలంబులఁబద్మరాగారుణపద్మములను। రాజితరాజీవరాజహంసాళులనిర్మలసౌవర్ణకూర్మములను। గమనీయవైడూర్యకుముదంబులనువజ్రమీనమౌక్తికనవఫేనములను। మరకతశైవలోత్కరములవిలసిల్లఁగొలననిసన్మణిస్థలముసూచి। పలుగురాలకుడ్యములరుచుల్ గప్పిన। జలములున్నయెడలువెలయఁజూచి। యనుపమస్థలంబులనిజను లెఱుఁగక। యుండునట్లుగామయుండుసేసె ✻ వ॥ మఱియుసకలజనమనోహరంబులయిన నానావిధ[illegible]ఫలభరితంబులయిన తరువనంబులును వికచ[illegible]

కుముదాభిరామంబులయిన జలాశయంబులును విచిత్రోపవనవిటంక ప్రదేశంబులునుగలిగి దశకిష్కుసహస్ర ణాయతంబును సహస్రకరప్రభాప్రసరవిస్తారవిభూతియును వివిధరత్నవిభవాభిశోభితంబునయినయపూర్వస్థా నంబుఁ బదునాలుగు నెలలునిర్మించి దాని నెనిమిదివేలు రాక్షసకింకరుల మహాకాయుల మహాజవసత్త్వసంపన్ను తరితుచరులంబంచి మోపించికొనివచ్చి ధర్మరాజునకిచ్చి గదయును శంఖంబును భీమార్జునులకిచ్చి ధర్మరాజు త్కృతుండయినమయుండరిగిన * ఉ॥ వీరుఁడుధర్మజుండుపది నేవురువిప్రులకొప్పఁబాయసా । హారముఁభక్తిఁజ్జె యందఱకుం జెటి వేయు వేయివి । స్తారయశుండుధేనువులధర్మనిధిన్మణిముద్రికాద్యలం । కారదుకూలపుష్పఫలగం తంబుగనిచ్చెలీలతోఁ * వ॥ అనుజసహితుండయి దైవజ్ఞదత్తశుభముహూర్తంబున ధౌమ్యాదిభూసురాశీర్వా ణ్యాహనాదంబులెసంగసభాప్రవేశంబు సేసెనంత * ఉ॥ మంచిగభూరిభూసురసమాజము నెల్లనుభక్తితోఁడబూ చియభీష్టదానములు సేసిధనార్థులఁదన్పిదిక్కులఁ । నించెయశంబుబంధులకు నెయ్యురకుఁ హృదయప్రియంబు వించెవిభూతియేర్పడఁబవిత్రుఁడుధర్మసుతుండు నెమ్మితోఁ * వ॥ తదనంతరంబ * మ॥ మదమాతంగతురంగకాంచ న్మాణిక్యగాణిక్యసం । పదలోలింగొనివచ్చియిచ్చి ముదమొప్పంగాంచి సేవించిర । య్యుదయాస్తాచలసేతుశీత ధ్యోర్వీపతుల్సంతతా । భ్యుదయుఁ ధర్మజుఁదత్సభాస్థితుఁజగత్పూర్ణప్రతాపోదయుఁ॥ అంత * సీ॥ సుబలమార్కండే శునకమహాంజాయనమాండవ్యశాండిల్యమందపాల । బకదాల్భ్యరైభ్యకవాలుకిజతుకర్ణగౌతమకౌశికకణ్వకుత్స । గ్నిపర్ణాదసత్యగోపతి గోపవేషమైత్రేయపవిత్రపాణి । ఘటజానుకాత్రేయకఠకలాపసుమిత్ర హారితతిత్తిరియా ల్క్యు । వాయుభక్షభార్గవవ్యాసజైమిని । శుకసుమంతపైలసువ్రతాదు । లయినమునులు నేమునరిగితి మెంతయు । మయినధర్మరాజుసభకు * వ ॥ అమ్మహామునులనెల్లనతిభక్తింబూజించి ధర్మతనయుండువారలవలనలబ్ధాశీర్వా

—*నారదుఁడు పాండవులయొద్దకువచ్చుట.*—

డయితమ్ములుం దానును ధర్మకథలువినుచు సుఖంబున్నంత నొక్కనాఁడు * ఉ॥ నీరజమిత్రుఁడేలధరణీగతుఁడయ్యె నొక్కొయంచువి । స్మేరమనస్కులై జనులు మెచ్చినిజద్యుతిఁజూచుచుండఁగా । నారదుఁడేగుదెంచెగగనంబుననుండిసు త్రసుందిర । స్ఫారవిలాసహాసియగుపార్థగృహంబునకుం బ్రియంబునఁ * క॥ తనపిలుఁదధర్మసంబో । ధనవాం చ్ఛదేవతాఖచరమహా । మునివరులఁదపనమార్గంబునఁగ్రమ్మఁబంచి బ్రహ్మపుత్త్రుఁడు నెమ్మిఁ * వ॥ పర్వతపారిజా రైవతప్రముఖులైనమహామునులతో నట్లువచ్చిననారదమహామునికిం బ్రత్యుద్గతుండయి ధర్మరాజుదమ్ములుం దాను మరువారోయి నమస్కరించి తోడ్కొనితెచ్చి మహాసనంబుననునిచి యడుగులుగడిగి యర్ఘ్యపాద్యాదివిధులంబూ చినవారలఁగుశలంబడిగి నారదుండు రాజనీతివిషయంబుల నయ్యుధిష్ఠిరునకిట్లనియె * సీ॥ మీవంశమునననరదేవో లగైవసద్ధర్మమార్గంబుసలుపుదయ్య । ధర్మవిదుండవైదర్మార్థకామంబులొండొంటిబాధింపకుండనుచిత । లవిభక్తముల్గాఁజేసి సేవింతెధర్మంబునందచిత్తంబునిలిపి । యిమ్ములనపరరాత్రమ్ములం దెప్పుడుఁజింతింతెనిజబ జేయఁదగిన । రాజకృత్యములఁదిరంబుగానిఖిలని । యోగవృత్తులందుయోగ్యులయిన । వారిఁగరముగారవమ్ము బంచితె । నీవువారిదయిననేర్పెఱింగి * క ॥ అనఘులశాస్త్రవిధిజ్ఞుల । ననురక్తులఁబితృపితామహక్రమమునవ । శ్రీ ప్రులమంత్రులఁగా । నొనరించితెకార్యసంప్రయోగముపొంటెఁ * క॥ రాజునకువిజయమూలము । రాజితమం బునుస్థిరంబుగదానిఁ । రాజాన్వయరక్షింతెధ । రాజనులకుఁగర్ణగోచరముగాకుండఁ * క ॥ ధీరుఁడుధర్మార్థ రదుఁడుబహుశ్రుతుండుసమచిత్తుఁడువా । ణీరమణీశ్రితవదనస । రోరుహుఁడనఁదగు నెనీపురోహితుఁడధిపా * ననుతనీయజ్ఞములం । దనవరతనియుక్తుఁడయినయాజ్ఞికుఁడుప్రయో । గనిపుణుఁడైయేమఱకుం । డు నెనిజకృత్యముల డునుసమబుద్ధిఁ * క॥ నానావితరణవిజయమ । హానిపుణులవార్యవీర్యులనఁదగువారిఁ । సేనాధ్యక్షులఁజేసితె మ్మినవారిమాననీయులహితులఁ * చ ॥ కడుఁజనువాఁడునైపురుషకారియుదక్షుఁడునైనమంత్రి పెం । పడరఁగశా త్రులమహాధననంతులఁజేసివారితో । నొడబడిపక్షమేర్పడఁగనుండఁడుఁగాధనమెట్టివారికిం । గడుకొనిచేయక

నెఱగన్నుతగర్వముదుర్వి మోహమ్ముల్ * క॥ క్షితినాథశాస్త్రదృష్టి। ప్రతిభనుదివ్యాంతరిక్షభౌమోత్పాత। ప్రతికారులగుచుసన్మానితులయివర్తింతురయ్యనీదైవజ్ఞుల్ * క॥ అనిశముసేవింతురెని। న్ననఘాయష్టాంగమైనయాయుర్వేదం।బునదక్షులైనవైద్యులు।ఘనముగననురక్తులై జగద్ధితబుద్ధిన్ * క॥ సారమతిఁజేసిమానస । శారీరరుజావళులకుసతతంబుప్రతీ । కారముసేయుచునుండెదె। యారయవృద్ధోపసేవనౌషధసేవన్ * క॥ ఉపధాశుద్ధులఁబాప। వ్యపగతబుద్ధులవినీతివర్తులసమ్ములన్।సుపరీక్షునియోగించితె। నిపుణులనర్థార్జనాదినృపకార్యములన్ * ఉ ॥ ఉత్తమమధ్యమాధమనియోగ్యతబుద్ధి నెఱింగివారిన । య్యుత్తమమధ్యమాధమనియోగములన్నియమించితేనరేం। ద్రోత్తమభృత్యకోటికినన్నానముగాఁదగుజీవితంబులా।యత్తముసేసియిత్తెదయనయ్యయికాలముదప్పకుండఁగన్ * క ॥ తమతమకనిమెఘుతలిజీ । తముగానకనవయుభటులదౌర్గత్యవిషా । దములేలినవానికవ। శ్యముసెగ్గొనరించునతఁడుశత్రుండైనన్ * క॥ కులభృత్యులైనసత్పు । త్త్యులకునుసత్కారమర్థితోఁజేయుదెవా । రలునీప్రస్తవమునని।మ్ములఁగృతముదలంచిప్రాణములువిడుతురనిన్ * క ॥ అనఘానీప్రస్తవమున। ననినిల్చినవీరభటులయనుపోష్యులనెల్లను బ్రోతెభోజనాచ్ఛా।దనములవారలకునెమ్మికలుగకయుండన్ * క ॥ ధనలుబ్ధులమ్రుచ్చులఁగూ । ర్పనివారలఁబగఱవలనివారలధృతిసా। లనివారలమర్జనులం।బనుపవుగారాజకార్యభారముదీర్పన్ * క ॥ చోరభయవర్జితముగా । ధారుణివాలింతెయధికధనలోభమునం।జోరులరక్షింపరుగా । వారలచేధనముఁగొనిభవద్భృత్యవరుల్ * క ॥ ధరణీనాథభవద్భుజ । పరిపాలితమైనవసుధఁబరిపూర్ణములై। కరమొప్పుచున్నెచెఱువులు । ధరణికవగ్రహభయంబుదనుకకయుండన్ * క ॥ హీనులగుకర్షకులకును । భూనుతధాన్యంబుబీజములువణిజులకున్। మానుగశతైకవృద్ధిన।నూనముగాఋణములిత్తెయుత్తమబుద్ధిన్ * క॥ పంగులుమూకాంధులువిక । లాంగులునగుబాంధవులదయంబ్రోతెభయా।ర్తుంగడిఁదిశత్రునైనను।సంగరరంగమునఁగాతెశరణంబనినన్ * క ॥ కృతమెఱిఁగికర్తనుత్తమ । మతులసభలసంస్తుతించిమఱవకతగస । త్కృతిఁజేయుదుకృతమెఱిఁగెడు। పతియెఱగజ్జనులనెల్లఁబరిపాలించున్ * సీ॥ ఆయంబునందునాలవభాగమొండెమూఁడవభాగమొండెనందర్థమొండెఁ । గానిమిక్కిలిసేయఁగాదువ్యయంబనియవధరించితెబుద్ధినవనినాథ। యాయుధాగారధనాఢ్యశుతలయందువరవాజివారణావళులయందు । బండారములయందుఁబరమవిశ్వాసులభక్తులదక్షులఁబంచితయ్య।గురులవృద్ధశిల్పివరవణిగ్బాంధవ । జనులనాశ్రితులనుసాధుజనులఁ । గరుణఁబేదఱికముపొరయకుండఁగఁబ్రోతె। సకలజనులునిన్నుసంస్తుతింప * క ॥ వలయునమాత్యులుఁజుట్టం। బులుమూలబలంబురాజపుత్త్రులువిద్వాం।సులుబలసియుండనిచ్చలు।గొలువుండుదెలోకమెల్లఁగొనియాడంగన్ * క ॥ పరికించుచుబాహ్యాభ్యం । తరజనములవలనసంతతమునిజరక్షా।పరుఁడవయిపరమహీశులచరితమువీక్షింతెనిపుణచరనేత్రములన్ * క॥ వెలయఁగవిద్వజ్జనము । ఖ్యులతోడనశేషధర్మకుశలుఁడవయియి। మ్ములలోకవ్యవహార । మ్ములుదయఁబరికింతెనిత్యమునుసమబుద్ధిన్ * గీ॥ వార్తయందుజగమువర్తిల్లుచున్నది। యదియులేనినాఁడయఖిలజనులు । నంధకారమగ్నులగుదురుగావున । వార్తనిర్వహింపవలయుఁబతికి * గీ॥ దారసంగ్రహంబుధరణీశరతిపుత్ర । ఫలముశీలవృత్తఫలముశ్రుతము । దత్తభుక్తఫలముధనమువేదములగ్ని।హోత్రఫలములనియునొగినెఱుంగు * చ ॥ బహుధనధాన్యసంగ్రహముబాణశరాసనయోధవీరసం । గ్రహమునిరంతరాంతరుదకంబులుఘాసరసేంధనౌఘసం । గ్రహమునశేకయంత్రములుగల్గియసాధ్యములైద్విషద్భయా । వహములనంగనొప్పునెభవత్పరిరక్ష్యములైనదుర్గముల్ * చ॥ వదలకబుద్ధినాత్మరిపువర్గమునోర్చిజితేంద్రియుండవై। మొదలనదేశకాలబలముల్మఱిదైవబలంబుగల్గిభూ । విదితబలుండవైయహితవీరులనోర్వఁగనుత్సహింతెదు। ర్మదమలినాంధచిత్తులఁబ్రమత్తులనింద్రియనిర్జితాత్ములన్ * గీ ॥ కడిఁదిరిపులపైఁబోవంగఁగడఁగియున్న । నీకుముందరఁజనిరిపునృపులయందుఁబగిలిసామాద్యుపాయంబులొగినసంప్ర । యోగమునఁజేసివర్తిల్లుచున్నెచెపుమ * వ॥ మఱియునాస్తిక్యంబనృతంబు ప్రమాదంబాలస్యంబనర్థజ్ఞులతోడఁ జింతనంబుక్రోధంబు దీర్ఘసూత్రతయెఱుకగలవారినెఱుంగమి యర్థంబులయందనర్థకచింతనిశ్చితకార్యములుసేయమిమంత్రంబులరక్షింపమి శుభంబులఁబ్రయోగింపమి విషయంబు

లంచగులుటయనంబరఁగిన పదునాలుగురాజదోషంబులఁబరిహరింతెయనియడిగిన నారదునకుధర్మరాజిట్లనియె * నాయథాశక్తిఁజేసియన్యాయపథముఁ । బరిహరించిమహాత్ములచరితలందు । బుద్ధినిలిపిమీయుపదేశమునశుభం బుయినవానిననుష్ఠింతుఁబ్రియముతోడ * వ ॥ అనికృతాంజలియయిమునీంద్రాయాత్రిలోకంబులయందుమీచూడఁ వెందేనిట్టిసభచూచితిరెఱుంగనుదురేయని సభచూపినంజూచివిస్మితుండయి నారదుండు ధర్మరాజునకిట్లనియె * క ॥ నాథయిదియపూర్వమ । మానుషమువిచిత్రరత్నమయమిట్టిసభఁ । మానవలోకేశ్వరులం । దేనెన్నఁడుఁజూడఁ నెఱుఁగధరిత్రిఁ * క ॥ సురపతియమవరుణధనే । శ్వరకమలాసనులదివ్యసభలెల్లనరే । శ్వరచూచితినవిదీనికిఁ । సత్యంతవిభవసౌందర్యములఁ * వ ॥ అనినవినియవియెట్టివివానివినవలతునానతిండనిలోకపాలసభాశ్రవణకుతూహ

—*లోకపాలసభావర్ణనము.*—

యత్తచేతస్కుఁడయియడిగినధర్మరాజునకునారదుండిట్లనియె * క ॥ శతమఖసభశుభరత్నాం । చితకాంచనరచితవిచిత్రములోక । త్రితయాఖిలలక్ష్మీసం । శ్రితమలవియెదానిఁబొగడ శేషునకయినన్ * వ ॥ అదియనునూఱుయోజనంబుల వెడల్పునునూటయేఁబదియోజనంబులనిడుపును నయిదుయోజనంబులతనర్పునుంగలిగి వైహాయసంబయి గమనంబయి వ్యపేతశీతవాతాతపంబయి సకలకాలకుసుమఫలభరితపాదపవనాకీర్ణసరోవరవిరాజితంబయి తపఃప్రభావంబుననమరేంద్రుచేతనిర్మితంబయికరంబొప్పుచుండునట్టిసభయందు * చ ॥ అతులవిభూతితోమణిమయాభరణంబులొప్పఁగాశతక్రతుఁడుశచీసమేతుఁడయికాంచనచారువిమానమాలికా । గతదివిజోత్తముల్గొలువఁగాఁగొలువుండునెప్పుడుం । రాప్సరోంగనా । యతవిలసత్కటాక్షకుసుమార్చితసుందరవక్త్రచంద్రుఁడై * వ ॥ మఱియును * సీ ॥ వదలకమేలినప్రస్తవమునఁబోరిలోనీల్గినవీరభటులుఁ । దమకులధర్మముల్దప్పకనడచినగృహమేధులునుజగన్మహితకీర్తిఁ । బరఁగినస్థలుఁబరహితవ్రతులైన పురుషులురుగ్జరామరణశోక । భయబుభుక్షాదిపిపాసావ్యపేతులై కొలుతురుసురరాజునర్థ । ధర్మకామములుసదక్షిణక్రతువులు । శ్రీవిలాసములువిశేషయజ్ఞ । వాహమంత్రతతులువచ్చి సేవించును । మూర్తిమంతములయిముదముతోడ * వ ॥ మఱియుశుక్రబృహస్పతులునగ్నిష్టోములునశ్వినులువిశ్వదేవతలును ధాతయువిధాతయుహరిశ్చంద్రుండను రాజర్షియునింద్రుసభనుందురు * క ॥ ధర్మసభలోకధర్మా । ధర్మవివేకాస్పదంబులై జనములధర్మనుణితతులదాని । న్నిర్మించెనువిశ్వకర్మనిపుణతయొప్పన్ * వ ॥ అదిశతయోజనవిస్తారాయామరమణీయంబును గామియునుసూర్యనిభతేజంబును సర్వసుఖసంపత్ప్రదంబునునయి యెంతయుంజూడనొప్పుచుండునట్టిసభయందగస్త్య మతంగాదిసిద్ధమునులును బితృదేవతలునుగాలకింకరులును మూర్తిమంతంబులైనకాలచక్రక్రతుదక్షిణాదిదేవతలు గృతవీర్యజనమేజయజనకబ్రహ్మదత్తపృషదశ్వశంతను వైన్యభూరిద్యుమ్నేంద్రద్యుమ్నమన్మథమధుకంఠోపరిచరునుభవజ్జనకుండయినపాండుమహారాజునునాదిగాఁగలయనేకరాజపురుషులుందురు వీరిచేత సేవితుండయినయముండు సమస్తజీవులశుభాశుభకర్మంబులరయుచుండు * క ॥ వరుణసభసర్వలోకో । త్తరముజ్జ్వలమణిమయముసితప్రభనతిసుందరముండుండునువరుణుండు । వరుణానీసహితుఁడై ధ్రువంబగుమహిమన్ * వ ॥ అదియమరాజుసభయంతియవిస్తారాయామంబులునుగామగామిత్వంబునుంగలిగి విలసిల్లుజలస్తంభంబుచేసిజలంబులలోనుండి విశ్వకర్మదానిరమణీయంబుగారచియించె * సీ ॥ అందుసుఖాసీనుఁడైనయవ్వరుణేంద్రునంబుధుల్ నాల్గునునధికభక్తిఁ । గాళిందినర్మదగంగాపరివిదిశవిపాశగావేరికృష్ణ । వేణిసరస్వతిపెన్నయైరావతియనఁగఁబ్రసిద్ధంబులయిననదులు । సరసీతటాకనిర్ఝరకూపములుదిగ్గజములునధికధాత్రీధరములు । మహీయునమలమూర్తిమంతంబులయివచ్చి । మకరకూర్మశింశుమారమహాశరభసామజాదిజలచరస్థలచర । తతులతోడసంతతంబుఁగొలుచు * వ ॥ మఱియువాసుకైరావతతక్షకాదినాగరాజులును బ్రహ్లాదవిరోచనబలినరకనముచివిప్రజిత్తకాలకంఠకైటభఘటోదరదశగ్రీవవిశ్వరూపాక్షాదులయిన దైత్యదానవవరులునువరుణు సేవించుచుండుదురు * క ॥ ధనదుసభయింద్రసభతో । నెనయగుచుమహావిభూతినెంతయునొప్పగనదివ్యశక్తినాతం । డొనరఁగనిర్మించెదానినుత్తమమణులన్ * వ ॥ అదియునునూఱుయోజనంబులనిడుపును డెబ్బదియో

జనంబుల వేడల్పునుం గలిగి సితప్రభంబయి కనకమయతరులతాలంకృతంబయి తటిల్లతా విచిత్రంబగు శరదభ్రంబునను
కరించుచుండు * క॥ అందుఁ గుబేరుఁడు పరమా।నందంబున నుండు ధర్మనందన విలస।న్మందార పారిజాతక। నందనమందాని
లాభినందితుఁడగుచున్ * వ॥ అతని ననవరతంబును నరకిన్నరనాథులయిన గంధర్వులు వరాహకర్ణ గజకర్ణ కాలనేమి హేమ
నేత్ర విభీషణ పింగళక ప్రవాళకాదులయిన యక్షులును నలకూబరుండును నూర్వశీ తిలోత్తమా ఘృతాచీ మేనకా రంభా ప్ర
భృతులయిన యప్సరసలును సేవింతురే నెప్పుడు ననేక దేవఋషిగణంబులతో నరిగి చూచుచుండుదు * చ॥ వానికి నెయ్యుఁ
డై యమరవంద్యపదాంబుజుఁడంబికాబృహ।త్పీనపయోధరాగ్ర పరిపీడితవక్షుఁడు భూషణీకృతా। హీనుఁడ శేషలోకగు
రుఁడీశ్వరుఁ డెప్పుడు నందయుండు నా।నానిశితాయుధాయుతసనాథమహోద్ధతభూతకోటితోన్ * వ॥ పను దొల్లి మనుష్య
లోకంబునం గొండొక కాలంబుండ నాకడకు సూర్యుండు వచ్చి పితామహు సభ వర్ణించినఁ దద్దర్శనకుతూహలుండనయి యా
దిత్యుతో నరిగి యక్కమలగర్భు సభఁ జూచితి * చ॥ దళితవిరోధియిట్టిదని దానివిధంబెఱుఁగంగ బ్రహ్మకుం।గోలఁదియె తానవా
ఙ్మనసగోచరమచ్యుతరూపమీవియ।త్తలమనుకంబ మొక్కటియె తాల్పఁగ సుస్థిరమైనిజప్రభా। వలి వెలుఁగించుచుండు శశి
వారిజమిత్రులమండలంబులన్ * వ॥ అందనేక జీవరాసుల సృజియించుచు ననధిక తపస్వులతపఃఫలంబులు విధియించుచు విశ్వక
ర్తలయిన మనువులు త్రిమరీచి భృగు భరద్వాజ దక్ష వసిష్ఠ వామన వాలఖిల్య పులస్త్య పులహ క్రతు కశ్యప గౌతమాంగిరః ప్రచేతసు
లును జంద్రాదిత్యులును గ్రహనక్షత్రంబులు దేవగణంబులును వసు రుద్ర సిద్ధ సాధ్యులును బ్రజావంతులయిన పంచాశత్స
హస్రములును నూర్ధ్వరేతస్కులయిన యష్టాశీతిసహస్ర మునులును నశ్వినులును విశ్వదేవతలును విశ్వకర్మయుం బితృదేవ
తలును దన్నుం గొలిచియుండ ధర్మార్థకామమోక్షంబులును శబ్దస్పర్శరూపరసగంధంబులును దపశ్శమదమంబులును ధృతి
స్మృతి మేధా బుద్ధులును క్షమా కీర్తులును సంకల్ప వికల్ప ప్రణవంబులును క్షణ ముహూర్తాహోరాత్ర పక్ష మాస ఋతు
సంవత్సర యుగాత్మకంబయిన కాలచక్రంబును ఋగ్యజుస్సామాథర్వణ వేద వేదాంగంబులును బురాణేతిహాసంబులును
బహుప్రకారభాషలును సమస్తవిద్యలును మూర్తిమంతంబులయి కొలువ సరస్వతీసమేతుండయి పరమానందంబున నంబర
మేష్ఠి పద్మాసనంబున నుండు నని లోకపాలుర సభలను వర్ణించిన నారదునకు ధర్మరాజిట్లనియె * అక్కర॥ పరమధర్మాత్మకుఁ
డయిన పాండుభూపతిఁ దొట్టి సకల।ధరణీశులెల్ల యముసభనుండంగఁ డానేమి పుణ్య। చరితఁ బ్రవర్తిల్లెనయ్య దేవేంద్రుస
భ హరిశ్చంద్రుఁ।డురుతర మహిమతో దేవపూజ్యుఁడై యుండంగఁబడసె * వ॥ అనియడిగిన ధర్మరాజునకు హరిశ్చంద్రుమా
హాత్మ్యంబు నారదుండిట్లని చెప్పె * సీ॥ జయశీలుఁడయి హరిశ్చంద్రుండు దొల్లి సప్తద్వీపములఁ దనబాహుశక్తిఁ। జేసి జ
యించి నిశ్శేషితశత్రుఁడై ధారుణిలోఁ గల ధరణిపతులు।నిజశాసనంబున నిలువ నిత్యంబైన మహిమతో సకలసామ్రాజ్యమొ
ప్ప।రాజసూయంబు విరాజితంబుగఁ జేసి తనరి యథోచితదక్షిణలకు। నేనుమడుఁగులర్థమిచ్చి యాజకులఁ బూ। జించి భక్తి
తో విశిష్టవిప్ర।జనుల నభిమతార్థ సంప్రదానంబులఁ।దృప్తిఁ జేసె వంశదీపకుండు * క॥ ఉరుతరధనసంతర్పిత।ధరణీసురులత
నినతిముదంబున దీవిం।తురు రాజులందు లోకో।త్తర తేజోధర్మయుక్తిఁ దనరుమ యనుచున్ * వ॥ వాఁడును బ్రాహ్మణవచ
నంబున నెల్ల రాజులకు నధికుండయి రాజసూయమహాయజ్ఞంబు సేయుటం జేసి దేవేంద్రుసాలోక్యంబు వడసె నట్టి హరిశ్చం
ద్రు మహిమాతిశయంబు రాజసూయనిమిత్తంబున నయినది కానె టెంగి రాజలోకంబుతో వైవస్వతసభనుండు భవజ్జనకుం
డు పాండురాజు నాకిట్లనియె * క॥ జనపతులు రాజసూయం।బొనరించినవారు శత్రునొద్దను సురపూ। జనలందుచుండుదు
రుకో।రినకోర్కులు వడయుచును హరిశ్చంద్రుక్రియన్ * చ॥ గొనకొని మర్త్యలోకమునకుం జనినన్ మనినాథ యించు నా।
యునికియు రాజసూయమఖమున్నతిఁ జేసిన ధన్యులింద్రునం। దునికియు నాతనూభవుఁడనూనయశోధనుఁడైన ధర్మనందనున
కెఱుంగఁ జెప్పుము చితస్థితిఁ బంపుము దానిఁ జేయఁగన్ * చ॥ అనుపమశక్తిమంతులు మదాత్మజులేవురు దేవతావరం।బు
నజనియించి యున్న కృతపుణ్యులు వారలలోన నగ్రజుం।డలఘుఁడు రాజసూయము మహామతిఁ జేయఁగ నోపు శత్రుసూ।ద
నుఁడయి సార్వభౌముఁడయి తమ్ములబాహుబలంబు పెంపునన్ * వ॥ అశ్లేని నాకు నస్మత్పితృపితామహనివహంబుతోడ ది
విజాధిపలోకసుఖప్రాప్తియగు నని నన్ను బాండురాజు వచనంబులు నీకెఱుంగించు వేడుక నిటవచ్చితి * క॥ న్యాయమున రా

జసూయము। సేయుమునీపితృవరులను జెచ్చెరనధిక।శ్రీయుతసురగణపూజ్యులఁ। జేయుము శక్రు సభనుండఁ జేయుమ
రీ * వ॥ దిగ్విజయోపార్జితంబులయినధనంబుల బ్రాహ్మణసంతర్పణంబును ధర్మమార్గంబులం జాతుర్వర్ణ్యరక్షణం
బుం జేసి సామ్రాజ్యంబునం బ్రకాశింపుము మఱి రాజసూయంబు బహువిఘ్నంబు బ్రహ్మరాక్షసులు దానిరంధ్రం
బు చూచుచుండుదురు దియును నిర్విఘ్నంబుగ సమాప్తంబయ్యేనేని నిఖిలప్రజాప్రళయకారణంబయిన రణంబగునని చెప్పి
చుండ రిగి నఁ దమ్ములం జూచి ధర్మతనయుండు ధౌమ్యద్వైపాయనసుహృద్బాంధవమంత్రిసమక్షంబున నిట్లనియె * క॥

—*ధర్మరాజు నారదవచనప్రబోధితుండై రాజసూయయజ్ఞంబు సేయుటకు నాలోచించుట.*—

సంకల్పము సేయఁగ।సుతులకవశ్యంబు వలయు సుతజన్మఫలం।బతిముదమునఁ బితృవరులకు । హితమొనరింపంగఁగాదె
తయుభక్తిఁ * క॥ పరలోకనిలయులగు మీ।గురులకు దీనన హితంబగును లోకభయం।కర సంగరమును గాలాం। తరమున
గునని విరించితనయుఁడు సెప్పెఁ * క॥ పితృగణహితార్థముగస।త్క్రతువొనరింపంగ బుద్ధి గలదు ప్రజాసం।హృతితత్
తువున నగునని। మతి నాశంకయును గలదు మానుగ నాకున్ * వ॥ ఏమి సేయుదు నని డోలాయమానమానసుండయి యున్న ధ
ర్మరాజునకు ధౌమ్యప్రభృతులిట్లనిరి * ఉ॥ చేయుము రాజసూయమెడ సేయక దీనను జేసి దోషముల్ ।వాయును రేశ
ప్రజము పార్థివులెల్ల భవత్ప్రతాపని।ర్జేయులు సర్వసంపదలు సేకొనఁగాదె తెయయ్యె గౌరవా । మ్నాయలలావణ్యరా
యెమానవనాథులు మానుషంబునన్ * వ॥ అనిన వారివచనంబులకనుగుణంబుగా ననుజానుమంతుండయి ధర్మరాజు రాజ
సూయంబు సేయ సమకట్టి దీని నిర్విఘ్నంబున నిర్వహించునప్పుడు నాదినిధనుండాదిపురుషుండు పురుషోత్తముండు పుండ
రీకాక్షుండధోక్షజుండయ్యును జగద్ధితార్థంబు మర్త్యంబున జన్మించిన మహాత్ముండు వాసుదేవుండయోపుంగానిలేని
న్యులకశక్యంబని యప్పుడయాప్తచరులం బిలువం బనిచి * క॥ అనిలజవాశ్వంబులఁ బూ।న్చిన రథముల నెక్కి ధారుణీధరుఁ గ

—*కృష్ణుఁడింద్రప్రస్థపురంబునకు వచ్చుట.*—

ధుసూ।ధనుఁ దోడ్కొని చనుదెండని । పనిచిత దాగమనకాంక్షఁ బార్థివుఁ డుండెన్ * వ॥ అయ్యుధిష్ఠిరాదేశంబున దాశా
ర్హుండు తద్దర్శనోత్సుకుండయి ద్వారవతి వెడలి యతిత్వరితగతి నిరంతరప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకు వచ్చి * క॥
కుంతికి ధర్మనందనునకున్ వినయంబున మ్రొక్కి భీము డ।మంతునిఁ గౌఁగిలించి కొని మాద్యమ పాండవు మాద్రిపుత్రులన్
తతభక్తిన మ్రుంగ్రసాదమృదూకృతదృష్టిఁ జూచి తా। నెంతయుఁ బ్రీతి నెత్తికొని యెమ్మహిమోత్తిన పుణ్యుఁడున్నతిన్ * వ॥
తనంత...ంబధర్మతనయుండు * క॥ పరమాసనమున నునిచియ।పరిమితహర్షంబుతో సపర్యావిధులన్ ।గురుఁ బూజించు విధం
న।గురువృషభుండఖిలలోకగురుఁ బూజించెన్ * క॥ ఏమఱక జనులయోగ । క్షేమంబుల నడుపుచున్న కృష్ణుని యోగ
మంబులడిగి యపుడు మహా। హోముదమున ధర్మసుతుఁడు హరికిట్లనియెన్ * క॥ ధ్యేయుఁడవు సకలకార్య।స్థేయుండవు నప్ర
కువిధేయుఁడవు నయో।పాయజ్ఞుఁడవీ జగముల।నీయెఱుఁగనియది యెఱుఁగలవె నీరజనాభా * వ॥ అయిన నునాయద్ధిత్వ
నం జేసెన్ నీకెఱుంగించెద * సీ॥ పాండుమహీపతి పనిఁ జేసి నారదముని వచ్చి వీరెల్ల వినుచునుండ।రాజసూయంబు విరాజి
బుగఁ జేసి పితృపితామహులకు హితము సేయు। మని నన్నుఁ బనిచె నెయ్యమున నో నాకిట్టి బలము సామర్థ్యంబు గలుగు
గ।పని చెనో తత్క్రతు ప్రారంభమునకొడంబడితి వీరందఱుఁ గడఁగి దీని।నిత్యసత్యవచననిపుణనిర్మలబుద్ధి। నిర్ణయించిన
నీనియోగ।కాంక్షనున్న వాఁడఁ గమలాక్షయనిన ధ।ర్మాత్మజునకు నిట్టులనియెఁ జక్రి * క॥ కురువృషభ సర్వగుణముల।
చిర తేజుఁడవు గాజసూయాఖ్యమహా।ధ్వరమునకు నీవయర్హుఁడ। వరిసూదనశౌర్యులయిన యనుజులబలిమిన్ * వ॥ తొ
జామదగ్న్యుండయిన పరశురాముని చేత ధాత్రి యపగతక్షత్రంబయిన నంతనుండి హైహయవంశంబును నిక్ష్వాకువం
బును దక్కఁ దక్కిన వంశంబులెల్లం గృత్రిమంబులుగాని మకుటార్హంబులుగావీ రెండువంశంబులవలన నేకోత్తరశత
శంబులయ్యె మఱియు యయాతిభోజవంశంబులవలనం జతుర్దశవంశంబులయ్యె నిట్టి సకలక్షత్రియులనెల్లం జయించి జరాసంధ
డున్నవాఁడు వాని సామర్థ్యంబు చెప్పనశక్యంబు * క॥ అతిదర్పోద్ధతుఁడు మహా।ద్భుతభూరిబలుండు చేదిభూపతి సేనా
పయయి శిశుపాలుఁడు సం।తతమును నాతనికొలుచుఁ దద్దయు భక్తిన్ * క॥ ఆయతభుజవీర్యులు మా।యాయోధులు

డిచికులను వారలని। ర్జేయులు పరస్పర స్నేహాయత్తను చిత్తులతనియాప్తులధీశా* వ॥ ఆయిద్దఱును గౌశిక చిత్రసేనులను నామంబులతో మహాసేనాన్వితులయి వానికి వామదక్షిణభుజంబులుం బోలె సర్వసాధనసమర్థులయి వర్తిల్లుదురు మఱియు వరుణునంతియబలవంతుండు పశ్చిమదిఙ్మహీపతి భగదత్తుండను వాఁడు పాండురాజసఖుండగుట నీకుమనంబున భక్తుండయ్యును భయంబున జరాసంధునకు వాక్కర్మంబులం బనిసేయుచుండుఁ జేదిపతులలోఁ బురుషోత్తముండును నంగవంగపౌండ్రకిపతులలోఁ బౌండ్రక వాసుదేవుండును మదీయ నామచిహ్నంబులు చేకొని జరాసంధుం గొలుతురు ప్రాగ్దక్షిణదిక్కులరాజులు పురుజిత్తుండును గరూశకలభనకులసంకర్షణ సూపహితమనోదత్తచక్రసాల్వేయయవనులును వానిని సేవింతురు వీచ్యులయిన యష్టాదశ క్షత్రకులంబులవారును త్తరపాంచాలశూరసేనపుష్కరపుళిందకళింగకుంతిమత్స్యదేశంబులరాజులును దద్భయంబునఁ దమతమదేశంబులవిడిచి వానినకొలుచుచున్నవారు మఱియు* ఉ॥ ఘోరరణంబులోన నధికుర్ గృతబంధుజనాపకారునే। దారుణలీలఁ గంసు నతిదర్పితుఁ జంపుటఁ జేసి యస్మహా। క్రూరుఁడు గంసభార్యదనకూతురు గావున దానిసంతత। ప్రేరణ నాకుపద్రవము పెక్కువిధంబులఁ జేసె నీసునర్ * క॥ భూమీశహంసడిచికులు। నామగధాధీశ్వరుండు నమ్ముచ్చ్వరును। ద్దామభుజవీర్యసంపద। తో మూఁడు జగములనోపుదురు సాధింపర్ * వ॥ జరాసంధుండును నాయుధనిహతుల గా నిహంసడిచికులతోడ వచ్చి నుధురపయి విడిసి జన నేను నతివీరులయిన యదువృష్టిభోజాంధకవరులయష్టాదశసహస్ర(వ్రా)తంబులతో బన్మినుహాయుద్ధంబు సేయుచును పాయంబున హంసుండు సమరనిహతుండయ్యె నని డిచికునకుం జెప్పంబంచిననప్పలుకులునిక్కంబుగా వగచి* చ॥ అనవరతంబు నిష్టుఁడగు హంసుఁడు లేని జగంబులోని జీ। వనమది యేల నాకనుచు వారిధిమగ్నశరీరుఁడై క్షణం। బున డిచికుండు మృత్యుగతిఁ బొందె ఘనంబుగ దానినక్కడర్। విను మృతుఁడయ్యె హంసుఁడతివీరుఁడు దద్గతసౌహృదంబునర్ * వ॥ అట్లు కౌశిక చిత్రసేనులు పరలోకగతులయిన నసహాయుండయి జరాసంధుండు మగిడి మగధపురంబునకుం జనియె నేమును వానితోడి వైరంబు బలవంతంబైన నంతనమ్మధురనుండ నొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతకపర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించికొని భవదాశ్రయంబున సుఖంబున్నవారము* చ॥ ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోని రాజులర్। బెలుకురఁ బట్టి తెచ్చి చెఱఁ బెట్టి గిరివ్రజమన్పురంబులో। సొలయక నిత్యమొక్కక నిసూనరినోలు వధించి పాపముర్। బలిమియు నేర్పడంగడఁగి భైరవపూజలొనర్చుచున్నుఁడై* క॥ ధరణీశ వానిఁ జంపుడు। నురుతరసామ్రాజ్యవిభవమున్నతితోను। స్థిరమగు నీసుజీభా। సురముగ సమకూఁటు రాజసూయము సేయర్ * సీ॥ రక్షణంబున భగీరథుఁడు జయంబున నయ్యువనాశ్వునత్యుదగ్ర। బాహుబలంబయిన భరతుండు దపమునఁ గార్తవీర్యుండును గరముబుద్ధి। నమ్మరుత్తుండును నఖిలసామ్రాజ్యంబుఁ బడసిరి తొల్లి భూపాలయిప్పు। డిన్నిగుణంబులు నెన్నంగఁ గల నీకునదియేమి దుర్లభమద్దురాత్ముఁ - గీ॥ డెంతబలిముఁడయ్యు నెంతగర్వితుఁడయ్యుఁ। దనకలోరనుప్రితాపమునను। విగతవిభవుఁడగు వివేకవిహీనుల। కైనలక్ష్మిసుచిమగు నెయ్యెడ

—*భీమసేనార్జునులు ధర్మరాజునకుత్సాహంబు గల్గించుట.*—

వ॥ అనినవిని భీమసేనుండు ధర్మరాజునకిట్లనియె * క॥ ఆరంభరహితుఁ బొందునె। యారయ సంపదలు హీనుఁడయ్యును బురుషుం। డారంభశీలుఁడయిక్కృ। తారంభులనోర్చునెంత యధికులనయినర్ * క॥ కడునధికులతోడఁ దొడరినఁ। బొడిచిననొడిచినను బురుషుపురుషగుణంబే। ర్పడుగాక హీనునోడుచుట। కడిఁది యెపౌరుషము దానఁ గలుగు నె చెపుమా * క॥ ఈహరికరుణయు నర్జును। సాహాయ్యము గలుగ నీప్రసాదమునజక। ద్దోర్హుజ జరాసంధు మహా। సాహసు వధియింతు నేను సంగ్రామమునర్ * గీ॥ అనఘ యేము మువ్వురము మూఁడగ్నులట్లు। నీమహాయజ్ఞకార్యంబు నిర్వహింతు। మా జరాసంధపశువును నఖిలశాత్ర। వాహుతులఁ జేసి తృప్తులమగుచు బలిమి* వ॥ అనిన భీమసేనుక్రమవచనంబులకనుగుణంబుగా నర్జునుండిట్లనియె* ఉ॥ భూభుజులర్ జయింపు ము విభూతి నొనర్పుము రాజసూయమున్। నా భుజవీర్యవిక్రమగుణంబులకుర్ దగుచున్నయీధను। శ్లాఘము దివ్యబాణరథలాభము శోభితమైనయీాసభా। లాభము నొందుపాటసఫలత్వము [illegible] ద్యం। బులువిక్రమవంతునందు

భూవిదితములై। నిలుచునవిక్రమునకునవి। గలిగియు లేనిక్రియనప్రకాశంబులగుఁ * వ॥ మఱియు రాజసూయ
బుపరాక్రమంబున జరాసంధువధియించి నిఖిలక్షత్రియనిగ్రహణమోక్షణంబు సేయునంతకంటె మిక్కిలియశోం
బులొండెయ్యవియని నభీమార్జునులపలుకులకుసంతసిల్లి నారాయణుండిట్లనియె * క॥ వెలయవిధిదృష్టి నయము
యుఁ బరాక్రమము సేయవసు ధేశ్వరయ। గ్గలమగుబుద్ధియుఁ గడఁకయుఁ। గలపురుషునకిడియచూ వెకర్తవ్యమిల
కావున మేముమువ్వరముఁ గ్రమంబునఁ బరాక్రమించియు జరాసంధుఁడాసినదీప్రవాహంబులు వృక్షోన్మూలనం
యునట్లు వానినిర్మూలనంబు సేసెదమద్దురాత్ముండు భూతంబులయందంతరాత్మయుంబోలెఁ దనయంతరంబె
యేకాంతంబుండి సుఖంబనుభవించుటం జేసి వానియంతికంబునకరుగుటయశ్రమంబగు నారాయణునకుధర్మరా
యె * క॥ దనుజాహితనీయాహవ। మున నెదిరిమహోగ్రవహనమునఁ బడియును గా। లనిమిడుతవాలెనతఁకో। పనుఁడు
సంధుఁడెట్లుప్రభుకఁగ నేర్చెఁ * క॥ అట్టియతిదారుణత్వం। బట్టియ జేయభుజవిక్రమాధిక్యము వాఁ। డెట్టిక్రియఁ
నాతని। పుట్టినవిధ మెఱుఁగఁ జెప్పవే పాలుపుగనాకుఁ * వ॥ అనియడిగినధర్మరాజునకుం గృష్ణుండిట్లనియె * సీ॥ అతిస
డు బృహద్రథుఁడను వాఁడు మగధనాథుండసన్మార్గదూరుఁ। డక్షౌహిణీత్రితయంబుబలంబునఁ బరులనోడించిన బలిష్
డు। కాశిరాజను వాని గాదిలికూఁతులఁ గవలవారిని నతికాంతిమతుల। నపఁగంగ పెండ్లియైయనుపమప్రీతినయ్యిరువుర
దుభోగేచ్ఛసలిపి * గీ॥ యందపత్యంబువడయమునని తలంచి। విప్రముని దేవపూజల వివిధవిధులఁ। బుత్రకామేష్టులన
డు పుణ్యకర్మ। యుక్తులను జేసి పడయంగ నోపకలసి * వ॥ పుత్రుఁడు లేనివిభవంబులన్నియు నేలయనినిర్వేదించి పత్నీద్వ
మేతుండయి వనంబునకరిగి * ఉ॥ ఆవిపినాంతరంబున నిరంతరనిష్ఠననంతమోక్షకాం। క్షావిధినొక్కబాలసహకారపు
ముక్రిందనుజ్జ్వల। త్పావకతేజుఁడై తపము పాయక సేయుచునున్న ధన్యుఁ గా। క్షీవతుఁ గాంచె గౌతమునఁ గిల్బిషమా
జండకౌశికుఁ * క॥ ధరణీశ్వరుఁడమ్మునివరుఁ। బురాతనముని ప్రకాశుఁ బుణ్యాత్మునిరం। తరకృతభక్తిసపర్యా। పరివ
డగుచు భక్తివదలక కొలిచెఁ * వ॥ ఇట్లుపాస్యమానుండయి చండకౌశికుండు బృహద్రథుఁ గరుణించి నీకిష్టంబయినదా
చ్చెద వేఁడుమనిన ముకుళితకరకమలుండయి వాఁడిట్లనియె * ఉ॥ సంతతమైన సర్వసుఖసంపదగల్గియు దానికిందగఁ
తతి లేమిఁ జేసియది సర్వము హేయముగాఁ దలంచిని। శ్చింతుఁడనై ధృతిందపము సేయగవచ్చితిఁ బుత్రజన్మమా। న
నేను మీదయఁ గృతార్థతఁ బొందుదునన్మునీశ్వరా * వ॥ అనినం గరుణించి మునీశ్వరుండు పరమధ్యానముకుళితలోచ
డయియున్నంత * క॥ పవనవిధూతముశుకచం। చువిలూనము గాక యొక్కచూతఫలంబ। య్యావనిజమువలననమ్మునిని
పృథూత్సంగతలముపయి వడిఁ బడియెఁ * వ॥ దానిం బుచ్చికొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథునకిచ్చి
లోపయోగంబువలన నీకొక్కపుత్త్రుండుద్భవిల్లునని చెప్పిన నాతండును గృతార్థుండయి క్రమ్మఱ నిజపురంబునకువచ్చి
యిద్దఱు భార్యలకు సమంబుగా విభాగించి పెట్టినం దత్ఫలోపయోగంబున నయ్యిద్దఱు గర్భిణులయినఁ బదియవమాస
నొక్కనాటిరాత్రియందు వారలకు * క॥ ఒకొక్కకకన్నును జెవియును। నెక్కునుజనుబొడ్డు మూపుఁ జెలువగు చేయ
ప్రక్కయుఁ బిఱుఁదును గాలును। నక్కజమయి మనుజశకలములు పుడుదయించెఁ * క॥ అమ్మానిస్రవ్యయ్యాలుగని। యమ్మది
వెఱచి వీనినాత్మజుఁడని నె। య్యమ్మున నెట్టులు సూపుదు। మిమ్మనుజేశ్వరునకనుచు నెంతయులజ్జఁ * వ॥ వీని నెవ్వరును నె
గకుండ వెలుపలవై చిరండని తమదాదులం బంచిన వారలారెండు వ్రయ్యలుం గొనిపోయి రాజగృహద్వారతోరణసమీ
బునఁ జదుకంబునొద్దనొక్కచోట వైచిన నచ్చదుకంబుననుండెడు రాక్షసి జరయనునది వానిబలియ కావగ చిపఱతెం
గీ॥ ఎత్తికొని చనంగ నిమ్ముగు నట్లుగా। మెదలుచున్న వ్రయ్యలదిమి రెంటిఁ। గూడఁ బెట్టెనవియుఁ గూడియొండొంటితో
క్కనంటి రెండునొక్కటయ్యె * క॥ ఆరాక్షసి కెత్తికొనను। భారముగా వజ్రకఠినబంధురతనుఁడై। ధీరుఁడు బాలుండేడ్చె
హోరవమున దానిచేతు లాడక యుండఁ * వ॥ అబ్బాలకు రోదనధ్వని విని యంతఃపురంబుననున్న ముదుసలియవ్వ
అతెంచి మహోర్షంబుతో వాని నెత్తుకొని రట్టిసంభ్రమంబెటింగి బృహద్రథుండు వచ్చి తేజోధికుండయిన కొడుకుం జూ
తామ్రతలములు పుట్టించదనే ముఖపద్మంబునం బెట్టికొని దిక్కులు సెలంగ నేడ్చుచున్న కొడుకుం జూచి కృతార్థీకృతలోచన

య్యెనట్టియవసరంబున నారాక్షసి కామరూపిణి కావున మనుష్యస్త్రీరూపధారిణియయి మగధరాజున కిట్లనియె * సీ॥ ప
నుజరయను రాక్షసి నిప్పురంబు। చపుక మును బాయకుండుదు సంతతంబు। నీకు నిష్టంబు సేయంగ నెమ్మితోడ। గోరుచుండు
దు నదిసమకూఱె నేఁడు * వ॥ నీయిద్దఱు దేవులకు నుద్భవిల్లిన యిమ్మనుష్యశకలంబులు రెండును నీదాదులు తెచ్చియిచ్చుడు
కంబు నొద్ద వైచిపోయిన నేను వానిం గూడఁబట్టుడు వజ్రఘనఘటితశరీరుండయి కుమారుండు మేరుగిరిశృంగంబునుంబోలె
నాకెత్తికొనన శక్యంబయ్యె వీని నొప్పుకొనుము. నిన విని బృహద్రథుండు ముదితహృదయుండయి దానికిట్లనియె * ఉ॥ ఇచ్చకువ
చ్చుపుత్రజనల నెంతయు సంతసమందితొల్లి నా। కిచ్చె మునీశ్వరుండు దయనిత్తనయున్ మఱి యిప్డు నెమ్మితో। నిచ్చితి నీవు రాక్ష
సి వెయిక్కు-ల మెల్లను నిస్తరింపఁగా। వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయతచారులోచనా * వ॥ అని దానిసత్ప్రీతిం బూజించి
కొడుకు నెత్తుకొని దేవీద్వయంబునకు నిచ్చి జరయను రాక్షసిచేత సంధింపంబడియెఁగావున జరాసంధుండను పేరిడి పురంబు
ష్టశోభనంబు సేయించి యారాక్షసికేఁటేఁట మహోత్సవంబు సేయించుచుం గొడుకు నతిగారవంబున నం బెంచిన * క॥ ఈ
హితవిధానములలో। కాహితమస్సహనతేజుఁడయి వాఁడు మహా। త్సాహముతో వర్ధిల్లెఘృ। తాహుతులఁ బ్రవృద్ధి నొందు

——* జరాసంధుని యొద్దకుఁ జండకౌశికుండు వచ్చుట. *——

మనగ్నియుఁ బోలెన్ * వ॥ ఇట్లు జరాసంధుండు పెరుగుచున్నఁ గొండొకకాలంబునకుఁ జండకౌశికుండను మునివచ్చిన నతిము
దంబుతోఁ బుత్రమిత్రకళత్రభృత్యామాత్య సహితుండయి బృహద్రథుండెదురువోయి యమ్మునీంద్రునకు నమస్కరించి
తోడ్కొని తెచ్చి యుచితాసనంబునను నునిచి యడుగులుగడిగి యర్ఘ్య పాద్యాదివిధులం బూజించి రాజ్యంబుతోడం దనసర్వ
స్వంబును నివేదించి కొడుకుం జూపినం జూచి సంతసిల్లి మునివరుండిట్లనియె * క॥ జరయను రాక్షసి నీకుం। గరముపకారంబు
సేసె ఘనముగ దీనిన్। ధరణీశ యేనెఱింగితి। నిరుపమనిరతిశయయోగనిష్ఠితబుద్ధిన్ * వ॥ ఇక్కుమారుండు కుమారునంతియ
శక్తిసంతుండయి త్రిపురాంతకు నంతకహరుం బరమేశ్వరుం దనకు సన్నిహితుం జేసికొను నెంతబలవంతులయ్యును వైరివీ
రులు వీనిఁ దాఁకి యగ్నిఁ దాఁకిన శలభంబులుంబోలె నడంగుదురు గరుడుని గతి నన్యవిహగంబులను గమింపనోపని యట్లు మా
నవులు వీని వీర్యంబునను గమింపనోపరు తేజస్వులలోన నాదిత్యుండు వెలుంగు నట్లు వీఁడు మూర్ధాభిషిక్తులలోన మిగిలి వె
లుంగు నదీరయంబులు మహాపర్వతంబుల భేదింపనోపని యట్లు దివ్యాస్త్రంబులు వీని దేహంబు భేదింపనోపవు సముద్రంబు
మహానచులం జేకొను నట్లు వీఁడు పరమహీపతుల సంపదలు చేకొను నని జరాసంధు సామర్థ్యంబు చెప్పి చండకౌశికుండరిగి
న * క॥ తనయు నతిరూపయౌవను। ననుపము నభిషిక్తుఁ జేసి యవనీభరమా। తనిఁ బూన్చి సభార్యుండయి। యనఘ తపోవనము
నకు బృహద్రథుఁడరిగెన్ * వ॥ ఆజరాసంధుండును నస్త్రనిహతులుగా నిహంసడిచికులు దనకు సహాయులుగా నపరాజితం
బయిన పరాక్రమంబున నంబరచక్రపతుల భంజించుచు * చ॥ అయనయహీనుఁడైన పతియట్లు విఖండితపక్షతిద్వయుండయి
నఖగేంద్రునట్లు మతిహంసుఁడు నాడిచికుండు నంతక। తుయగతులైన నిప్పు గతగర్వమునన్ మగధేశ్వరుండు ని। శ్చయమతిను
న్నవాఁడు నిజసంతతియకాలవిశంకితాత్ముఁడై * ఉ॥ అమ్మగధేశు నుగ్రబలు నాయుధయుద్ధమునన్ జయింపఁగా। నిమ్మహి
నోపరెవ్వరును మేశ్వరుఁడట్టివరమ్ము వానికిన్। నెమ్మి నొసంగెఁ గావున వినీతుఁడు వాయుసుతుండు మల్లయు। ద్ధమ్మునఁ జంపు
నాతనిను దగ్రమహాభుజశక్తి యేర్పడన్ * క॥ బలిమి మెయిఁ బార్థ రథా। బలమును బవనసుతు బాహుబలమును నానిర్మలనీ
తిబలము నీకుం గలుగ నసాధ్యములుగలవె కౌరవనాధా * చ॥ తడయక యేగి నీతిబల దర్పములొప్పఁగ వానిడాసి కవ్వడియు
ను నేను భీముఁడు నవశ్యము బోరబృహద్రథాత్మజుం। గడిఁదిరిపున్వధింతుము జగన్నుత నన్నెదనమ్ము దేని యిల్లడయిడు భీము
నర్జును నలంఘ్యబలాఢ్యుల నావశంబునన్ * వ॥ అని నిశ్చయించి పలికిన నారాయణునకు వీరశ్రీవిభాసితముఖులయిన భీమా
ర్జునులం జూపి సంతుష్టాంతరంగుండయి ధర్మతనయుండిట్లనియె * చ॥ ప్రియహితవాక్య వైరికులభీకర కృష్ణ భవన్నియోగ
సం। శ్రయమునను న్నమాకధికశత్రుజయంబగు టేమి పెద్ద ని। శ్చయము గనింక మోక్షితులు సర్వమహీపతులిమ్మహాధ్వర।
శ్రీయయును సిద్ధిఁ బొందెఁ గృతకృత్యతఁ గీర్తి వెలుంగుచుండఁగన్ * క॥ ధరణీధర సర్వగుణా। కర కరుణానిరత సర్వకార్యై
కధురం। ధర నినుఁ బడసిన మాకును। హరివిక్రమ సదయ రానియవియును గలవే * వ॥ అని సంతసిల్లి మఱియు నాత్మగతంబున *

క॥నయనములునాకుఁబవనత।నయవిజయులుమనముకమలనాభుఁడువీరిం।బ్రియహితులఁబాసినిమిషం।బయినను
డనేర్తునవిచేష్టుఁడనై ✱ వ॥అయినను నాహృదయంబుకరంబుహృద్యంబగుచున్నయదికృష్ణార్జునులందలంచినవారికి
జయంబులగుననినన్నిమ్మహాపురుషులఁదనకుసహాయులఁగాఁబడసిన భీమసేనునకుశ్రీవిజయంబులగుట కేమిసందియ
నిశ్చయించిమీకుఁగార్యసిద్ధియయ్యెడుమయరుగుండనిపంచిన ✱ క॥సారరిపుఁజంపనరిగెడు।వీరులవార్ష్ణేయపాండ

—✱కృష్ణభీమపార్థులుజరాసంధుఁజంపఁబోవుట.✱—

లసింహా।కారులఁజూచిమనంబున।ధీరుఁడుముదమందెనయ్యుధిష్ఠిరుఁడంతన్ ✱ వ॥కృష్ణభీమపార్థులువీరశ్రీవిభాసి
ఖులయికృతస్నాతకులయిచనియనేకపర్వతంబులుగడచితత్ప్రభవంబులయిన కాలకూటశోణకంటకీయంబులను
లంఘించిసరయూనదియునుంబూర్వకోసలమిథిలాదేశంబులునుగంగయుంగడచిపూర్వాభిముఖులయినిరంతరప్ర
ణంబులనమ్మగధదేశంబుచొచ్చిగోరథంబనుపర్వతంబెక్కి ✱ ఉ॥ ఉరుతరహర్మ్యమాలికలనొప్పగిరివ్రజమున్పురం
గాం।చిరినవసౌరభప్రసవచిత్రవనావళిగల్గుదానినె।వ్వరికిమరాసదంబులగువజ్రమయోన్నతవప్రచారుగో।పురవ
దానినయ్యలకఁబోలెడుదానిమహార్ఘసంపదన్ ✱వ॥కనిదానిసమృద్ధికచ్చెరుపడియచ్యుతుండుభీమార్జునులకిట్లనియె॥సిన
గోరథమునుఋషభమువై।హారముఋషిగిరియుఁజైత్యకాదియుననఁగా।సూరెలఁగిరులేనుసునివి। భూరభటు
లెఁగాచిచుట్టునునుండున్ ✱ వ॥దానంజేసియిప్పురంబుగిరివ్రజంబునాఁబరఁగెనిందుఁదొల్లిగౌతముండౌశీనరియను
ద్రయందుమగక్షీవదాదులసృజియించెనట్టిగౌతమానుగ్రహంబుననీదుర్గబలంబునంజేసియిమ్మాగధులనెవ్వరుజయింప
పరసుచుఁదద్ద్వారంబునం బురంబుసొరనొల్లకచైత్యకగిరిశృంగంబునకరిగి యందున్నమూఁడుభేరులంజూచి తొల్లి
మాగధులుమానుసాదంబనుఋషభంబువధియించిదానిచర్మంబునవీనినిర్మించిరవియిప్పురంబువింత వారుసొచ్చునగరి
డమునిశక్తింజేసిమోఁగియుననిన ✱ ఉ॥దారుణవజ్రచారుభుజదండములన్ బలవద్విధానగం।భీరులుధీరు
మూఁడునువ్రచ్చిచైత్యక।స్ఫారనితంబదేశమునభగ్నముచేసిగిరివ్రజంబున।ద్వారమునందుఁజొచ్చిరతిదర్పితయా
కారవోత్తముల్ ✱క॥ఘోరాకారులుమాలా।కారగృహంబులకుగంధకరగృహములకుం।దారరిగిముువ్వురుబలా
రంబునఁగొనిరిపుష్పగంధములొప్పన్ ✱ వ॥అందుమాల్యాలంకృతవేషులుఁజందనాగరురజోభూషితవక్షులువిస్మ
మానమాగధనిరీక్ష్యమాణులునయి రాజమార్గంబుదఱియంజనియందనవరతంబును బ్రాహ్మణులకుసుప్రవేశం
చున్నజరాసంధుమందిరంబు గోవాసంబుహైమవతసింహకిశోరంబు లుసొచ్చునట్లుయాదవపాండవసింహంబులు

—(✱)జరాసంధుఁడుకృష్ణభీమసేనార్జునుల కెదురువచ్చుట.(✱)—

చ్చిన ✱గీ॥అర్ధరాత్రమయినన భ్యాగతద్విజ।స్నాతకులకు నెదురుసనికరంబు।భక్తిఁబూజలిచ్చుపరమప్రతుండప్పు।డెదు
వచ్చివారికిష్టమెసఁగ ✱క॥ధీయుతుఁడయిమధుపర్కము। సేయగసమకట్టిదానిఁజేకొననిమహా।పాయులగర్వం
భి।ప్రాయంబునెఱింగిమగధపతియిట్లనియెన్ ✱గీ॥స్నాతకులరేనిపూవులుఁజందనంబుఁ।జను నెబలిమినిగొనితాల్ప
త్యకాద్రి।తటముభేరులువ్రచ్చిదోర్దర్పమెసఁగఁ।జులుకనద్వారమునఁబ్రోలుసొరఁగనగు నె ✱ వ॥మఱియునాకావిం
మధుపర్కంబు పరిగ్రహింపనొల్లమి యిదియేమిమీరు వేషధారులకావలయుమీ వేషంబున బ్రాహ్మణత్వంబునమ
సత్త్వదీర్ఘబాహు పృథులవక్షోలక్షణంబుల క్షత్రియత్వంబును బ్రకాశించుచున్నయదియనిన నారాయణుండి
యె ✱క॥స్నాతకులుపుణ్యకర్మస। నాతనులనఁబరఁగుబ్రాహ్మణక్షత్రియవి।ఖ్యాతులయందునుక్షత్రియ।జాతిస్నా
లమేముజనవినుతినిధీ ✱ వ॥ద్వారంబునమిత్రనివాసంబునునద్వారంబుననమిత్రనివాసంబునుజొచ్చుటబాహు
సంపన్నులయినక్షత్రియులకుఁగర్తవ్యంబుగంధ మాల్యంబులయందులక్ష్మియుండుఁగావునబలాత్కారంబునగం
మాల్యంబులంగొంటిమినీయందుమాకునొండుగార్యంబుగలుగుటంజేసినీయిచ్చునర్ఘ్యంబుగొననొల్లమనినవారికి
రాసంధుండిట్లనియె ✱గీ॥మీరునాకు నేనుమీకు నెన్నండుము।న్నహితమాచరించినదియులేదు। మీకునేలనేనమిత్రు
నైతిని।రాగసుండసద్గుణాన్వితుండ ✱క॥సురమునివరులకువసుధా।మరులకుభక్తుండ నుత్తమక్షత్రకులా।చరితుండ

ననవనీ। ధరుఁడమ్మగధేశ్వరునకుఁ దానిట్లనియె * క॥ కులరక్షార్థ మఖిలనృప।కులోద్వహానియోగమున నకుంఠితశస్త్రప్రశ
యవిధాయుల మయియుఁ।మలకున్న వ్విప్రతిమిచ్చట భూషణబుద్ధిన్ * సీ॥ కడగియత్యుత్తమక్షత్రియచరితంబునం దువర్తిల్లు
మనంటిజనుల। కెవ్వరి కెన్నండు నెగ్గొనరింప నేనంటి నక్షత్రియులవని నోరులు।నీయట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి పశువ
ధించుచు బశుపతికి నుమేశు। వరదుఁ బూజించినవారును గలరె మున్నింతకు నగ్గలమెద్దియొగ్గు। కారణంబు లేక దారుణంబగు సా
ధు।హింస సేయ సుజను డెల్లవారి। కప్రియుండ కాక యప్రియలక్షణం।బొండుగలదె తలప నుత్తములకు * వ॥ నిర్దయుండవై ని
ర్దోషులైన సధర్ముల వధించు నంతకంటె మిక్కిలి పాతకంబొండెద్ది నీయట్టిపాపకర్ములను పేక్షించిన నఖిలధర్మరక్షణముల
కైన మమ్ము దత్పాపంబు వొందు నని పాపభయంబునం జేసి నిన్ను నిగ్రహింపవచ్చితిమి నాకంటె నధికుండైన క్షత్రియుండు లే
ండనని నీపు గర్వంబుల నోరుల నవమానించి పలుక వలదు * క॥ అవినీతులయి మహాత్ముల।నవమానము సేసి మును జయద్రథదంభో
ద్భవకార్తవీర్యులను వా।రవజితులయి రోరుల చే మహాబలులయ్యున్ * తరల॥ అతులవిక్రమసంపదన్ రణయజ్ఞదీక్షితులై రి
పుప్రతతి నోర్చిన వీరులు ప్రతపంబు చేసిన వారు స।ద్గతికిఁ బోదురు గాక యట్లపకారదారుణవృత్తిను। ద్ధతిని భైరవపూజ చే
సిన దాన సద్గతి గల్గునే * తరల॥ చెడకు నా వచనంబు సేయుము చెచ్చెరన్ ధరణీశులన్। విడిచి పుచ్చుము నేను కృష్ణుఁడ వీఁడు భీ
ముఁడు వాఁడు గ।వ్వడి భవత్కృతదారుణంబను వహ్నియార్పఁగ నున్నయ। క్కడిఁది వీరులు వీరలిద్దఱు గర్వితుల్ గురు సింహ
ముల్ * క॥ కడుఁ గ్రూరుఁడవయి నృపతుల। విడువని నాఁ డాజిఁ బాండవేయులు నీయు। క్కడఁచి భుజశక్తి యేర్పడ। విడిపింతు
రు కడిమి నఖిలవిమతమహీపుల్ * వ॥ అనిన విని జరాసంధుండు సటాసముత్పాటనకుపితకుంజరవైరియుంబోలెం గడు నలిగి ప
ల్లటుకుటిలభ్రుకుటిఘటితనిటలుండగుచుఁ బురుషోత్తమున కిట్లనియె * క॥ అమితపరాక్రమమున నా।క్రమించి పరనృపుల నోర్చి
గర్వించుట దో।షమె యిది సక్షత్రియధ।ర్మము నే నెప్పుడుఁ బరాక్రమవ్రతుఁడ నిలన్ * క॥ దేవార్థముగాఁ దెచ్చిన।యీ వసు
ధాధిపుల నేల యే విడుతుఁ బ్రతా।పావజితరిపుఁడఁ గావున।నీ వెఱుఁగవె తొల్లి ధారుణీధర నన్నున్ * సీ॥ సమకట్టి సైన్యంబు సై
న్యంబుతో నొండె దొడరి మీ ముప్పురతోడ నొండె। నిద్దఱతో నొండె నెక్కటి యొక్కనితో నొండె బోడిచెద దోర్బలమున। నే
యాయుధంబుల నెమ్మెయిఁ బోరంగ నిష్టమెయ్యది యుత్సహింపుడనిన। నొక్కనితో బల్వు రుద్ధతులయి పూని యుద్ధంబు సే
యుటయు చితమగునె।యధికబాహుబలుల మయిన మా మువ్వుర। యందు నొక్కరుని మహాబలాఢ్యుఁ।గోరికొనుము వాఁ
డు ఘోరంబుగా నిన్ను। మొనసి మల్లయుద్ధమునఁ జయించు * క॥ అనిన మురవైరిపలుకులు। విని బార్హద్రథుఁడు భూరి
వీరు మరున్నం।దను గోరికొనియె నీతం।డని నెనయగు నాకు ననుచు నతిదర్పితుఁడై * వ॥ ఇట్లు జరాసంధుండు భీమసేను
తో మల్లయుద్ధంబు సేయ సనుకట్టి తనతనయు సహదేవుని రాజ్యంబునకభిషిక్తుం జేసి పురోహితకృతస్వస్త్యయనుండ
యి * గీ॥ బలియుఁ డప్పుడు వెండ్రుకల్ పాచి ముడిచి। గండసగఁ దాల్చి వరవీరఘనతవృత్తి।నుద్ధతుఁడు మల్లయుద్ధసన్న
ద్ధుఁడగుచు।నలరె నెంతయు వేడుక నమితబలుఁడు * వ॥ భీమసేనుండు వానికి నక్కజంబుగా మల్లయుద్ధసన్నద్ధుఁడయి

—*భీమజరాసంధుల మల్లయుద్ధము*—

ప్రతిఘటించి నిలిచె నంత * మ॥ సమసత్త్వాతిశయుల్ వృకోదరజరాసంధుల్ సముద్యత్పరా। క్రమ మొప్పంగడునట్టి
యొండొరులఁ జుల్కం దాఁకి రన్యోన్యదు। ర్దమదోర్దండపటుప్రహారజనితధ్వానంబు బ్రహ్మాండభాం। డము నిండన్
లయకాలదండధరచండక్షోభ మోనాజనుల్ * క॥ కర్షితరిపు లన్యోన్యా।కర్షణసంకర్షణాపకర్షణముల సా।మర్షులయి
పెనఁగి రాహవ।హర్షంబునఁ బవనసుతబృహద్రథపుత్రుల్ * క॥ వ్యాయామకర్కశస్థిర।కాయులయుద్ధము భయాన
కంబయ్యె మహా।గ్రాయసపరిఘాయితకఠి।నాయతభుజదండదారుణాఘాతములన్ * చ॥ అతులబలుల్ పరస్పరజ
యార్థులు పార్థివపుంగవుల్ మరు।త్సుతమగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూ।ర్జితభుజశక్తు లేర్పడఁగ సిం
హగజేంద్రులయట్లు వజ్రప।ర్వతములయట్లు ఘోరతరవాసవవృత్రులయట్టు లిద్దఱున్ * వ॥ ఇట్లు కార్తికమాసంబునం
దొడఁగి భీమజరాసంధు లెడయుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాఁచియుం ద్రోచియు మ
హాయుద్ధంబు సేయుచుండ త్రయోదశినాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధకౌశలం బేర్పడం బెనంగు నెడ జతుర్దశి నాఁటి రాత్రియం

మజరాసంధునతిక్రాంతభావంబుపలక్షించియధోక్షజుండుభీమునకిట్లనియె* చ॥ విరహితసత్త్వుఁడయ్యెఁబ్రతికి
నిన శేషధారుణీశ్వరనికరాపకారునతిసాహసికుఁ వధియించినీభుజ। స్థిరతయలర్పనయ్యనిలదేవుబలంబునునీ
ఘా।సురముగమూకుఁజూపుమువిశుద్ధయశోనిధిమారుతాత్మజా* వ॥ అనిప్రబోధించిపలికిననిలతనయుండనిల
లంచితప్రసాదంబుననధికసత్త్వసమేతుఁడై* ఉ॥ ఆతనిఁబట్టిమెత్తనిహతాహితవీరుఁడువానిముష్టిన।న్వాతస
ధ్రములవారకశోణితధారలొల్కఁగా।వాతసుతుండువీచెశతవారములుద్ధతచండవాతసం।ఘాతవివర్తమాన
డసముండగుచుండమాగధుఁ* క॥ వెఱచఱవబట్టికొనివడి।జఱిచిజరాసంధునొడలిసంధులయెమ్ము।ల్విఱిచివధియిం
ర్పెను।వఱలగభీముండుభువనవలయంబద్రువఁ* చ॥ అవనితలంబువ్రస్సెనొహిమాచలశృంగముభగ్నమయ్యెనో
విదారణంబయినశబ్దముదానిదియేమియొక్కొ బై।రవమయివీచెనంచునుబురంబునవారుభయంబువొందిర।
గర్భముల్గలఁగెనుకఁడఁగెఁ మగధేశుసైన్యముల్ * వ॥ ఇట్లుభీమసేనుండుజరాసంధుఁజంపివానివధియించుటఁజ
తంబుగాఁదదీయనగరద్వారతోరణసమీపంబునందక్కళేబరంబువైచిసర్వజన భయంకరుండయి యుగాంత
క్రుండునుంబోలెనున్నంతనాదిత్యోదయంబయిన * సీ॥ గరుడధ్వజుండప్డుగరుణాసమేతుఁడై యమ్మాగధులకెల్ల
యమిచ్చి।యొగిజరాసంధుచేనిగృహీతులయియున్నపృథివీపతులవిడిపించెఁజెఱల। మోక్షితులైనసర్వక్షత్రియు
సంశుద్ధరత్నపుంజములఁజేసి। పూజితుండయితనతేజంబువెలుఁగంగసహదేవునజ్జరాసంధతనయు।నొడమండు
దున్నతరాజ్యంబు।నందునిలిపిహృదయహారివివిధ । రత్నరాజిసుందరంబైనమగధేశు।రథముఁదేరఁబంచెరయ
డ * వ ॥ అదితొల్లితారకాసురసంగ్రామంబుననింద్రారూఢంబయినదిదానినింద్రువలనవసువనురాజువడసెవా
లనబృహద్రథుండువడసెననితద్దివ్య రథప్రభావంబుచెప్పుచు భీమార్జునసమేతుండయి యారథంబెక్కిచక్రధరు
లరాజచక్రంబుతోనింద్రప్రస్థగమనోన్ముఖుండయి గరుడునిందలంచుడుఁదక్షణంబ * క ॥ అనలప్రభాభిశోభిత
తరతనుదీప్తులొప్పఁగావచ్చివడి।న్వినతాతనయుఁడువినయా।వనతోరుశిరస్కుఁడయ్యెవనజాక్షునకుఁ * వ ॥ ఇ
చ్చినవైనతేయుండద్దివ్యరథసారథ్యంబునందు నియోగించిమనోవాయువేగంబునం గృష్ణభీమవిజయులింద్రప్ర
రంబుప్రవేశించిరంత * మ॥ జనసంత్రాసకరుస్మదోద్ధతుజరాసంధుఁబలాఢ్యుఁ గారణం । బునభంజించెఁబ్రభం
త్మజుఁడుభూభృద్వీరులందన్నిరో।ధననిర్ముక్తులఁజేసెనింకఁజతురంతక్షోణికిఁ ధర్మనం । దనుసామ్రాజ్యముపూ
య్యెనని మోదంబందిరుర్వీజనుల్ * క॥ ఆయుధనిహతుఁడుగానియ । జేయుజరాసంధుభీమసేనుఁడువీర ।శ్రీయొ
నొర్చెఁగాక।త్యాయతభుజశక్తినొరులకలవియెయంచుఁ* క॥ పురజనులాశ్చర్యంబున।గరమనురాగమునఁబరమ
కమునఁజూ।చిరిభోరనవచ్చివృకో।దరదామోదరసురేంద్రతనయులఁబ్రీతిఁ* వ॥ కృష్ణభీమవిజయులిట్లువిజయవిభ
లయివచ్చిధర్మరాజునకుమ్రొక్కిజరాసంధుబంధనంబువలనందమచేతమోక్షితులయినమహీపతులంజూపిన *
వినయనతోత్తమాంగుల।నవనీశులనందఱనుయథార్హప్రియగా।రవమునఁబూజించికురు।ప్రవరుఁడుతద్దేశము
రువడిఁబంచెఁ * వ॥ నారాయణుండునుధర్మరాజువీడ్కొనితద్దివ్యరథారూఢుండయద్వారవతీపురంబునకుంజనియె
నిక్కడ* ఉ॥ భరతకులైకభూషణుఁడుభాసురతేజుఁడుధర్మనందనుం। డురుభుజవిక్రమంబునజయోన్నతిఁబొల్చ
లోకసా।లురయనిభీముఁబార్థునకులుఁ సహదేవునిఁబంచెఁదూర్పును।త్తరమునుబశ్చిమంబుమఱిదక్షిణముఁ వరు

—* భీమార్జుననకులసహదేవులుదిగ్విజయంబుచేయుట. *—

యింపఁగఁ * వ॥ ఇట్లుపంచిననలువురునపారచతురంగబలమేతులయినాలుగుసముద్రంబులపైనడుచునపూర్వసమ
బులుంబోలునాలుగుదిక్కులకరిగిరనినవినిజనమేజయుండువైశంపాయనునకిట్లనియె* క॥ నరవరులయ్యయిదిక్కు
రిగిమహీపతులచేతనరిగొనిధనముల్ । దెరలఁగ దెచ్చినమార్గము।పరువడినెఱిఁగింపునాకుఁబరమమునీంద్రా* వ॥ అ
డిగినజనమేజయునకువైశంపాయనుండిట్లనియె* సీ॥ అగ్నిదత్తంబైనయద్దివ్యరథమెక్కిగాండీవధరుఁడతిఘర్మసహ
ఘుగ్మాంశుఁడునుబోలెఁగౌబేరదిగ్విజయార్థముగ్రప్రతాపాగ్నివెలుఁగఁ।జనిపుళిందావనీశ్వరునోర్చిప్రతివింధ్య

భాక్షోభ మెసఁగెను । దుశ్శాసనుండు గర్ణసైంధవులును నధికహర్షవికసితాస్యంబులొప్పనొం డొరులఁ జూచి నవ్వు డిరపుడు * వ॥ ధృతరాష్ట్రుండును నిది యేమి సభాక్షోభంబయ్యె నెవ్వరెవ్వ రెట్టివస్తువులొడ్డి యోటువడిరని విదురు నడుగుచున్నయెడ దుర్యోధనుండు పాండవులందఱకు దాసులంగా నోడించినవాఁడై గర్వంబునం బెఱిఁగి * క॥ వరవుల్లఁగల్గి యిలు పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బనుచువగన్నా । సురరాజ్యవిభవ మొప్పవి । దురుఁ జెచ్చెరఁ బంచె దానిఁ దోడ్కొని తే * క॥ దానిసహింపక విదురుం । డానరపతికిట్టులనియె నజ్ఞానులునీ । తోనెన లేరొరులిట్లు మ । హానిష్ఠురవృత్తిఁ బనుపన న్నుర్ * క॥ మదమలినమనస్కుండయి । తుదిలేక వినయము సేయు మర్జునునకుసం । పద పెద్దయయ్యె నాతని । మొదలి పదయుఁ జెడు నమోఘము దీనర్ * క॥ అవనీతలసామ్రాజ్యో । త్సవమునకును యోగ్యమైన సతి ద్రౌపది పాం ధర్మపత్ని నీచే । నవమానముఁ బొందనింతయన పాత్రయయే * గీ॥ పలయాశీవిషంబుల నెఱిఁగియెఱిఁగి । మూర్ఖవైయ్య చెడు మొనసి యొరుల । ధనము నికృతిమైఁ గొనుటిది ధర్మమగునె । శకునిమతమునఁ బాపంబు సలనె చేయ * వ॥ జూదంబు గ్గపుట్టు దీననయ్యెడు ఫలంబు వేణుఫలంబునుంబోలె సహమూలవినాశంబగుననిన దుర్యోధనుండు విదురుం దూల్కొ ప్రాతిగామి యను వానిం బిలిచి యీ విదురుం డెప్పుడు ననిష్టంబు పలుకుఁ బాండవులకు వెఱచు నీవు వోయి ద్రౌపది

—*ప్రాతిగామి ద్రౌపదిని సభకుఁ దోడ్కొని వచ్చుట.*—

డ్కొని రమ్మని పంచిన * గీ॥ అవనినాథుచేత నాజ్ఞాపితుండయి । సూతనందనుండు ప్రాతిగామి । పాండవాగ్రమహిషి కిఁ జని భక్తి । వినతుఁడగుచు నిట్టులనియె సతికి * తరువోజ॥ ధనసంపదల నిజధరణిరాజ్యంబుఁ దనయులం దమ్ములఁ దన్ను న్నుఁ । దన రజూదంబాడి ధార్తరాష్ట్రులకు ధర్మతనూజుండు దానోటువడియె । వనజాక్షి కౌరవవరుని పంపున నుపడి డుకొని పోవ వచ్చితి నిపుడ । చను దెమ్ము కౌరవేశ్వరుకడకనిన జలజాయతాక్షి పాంచాలి యిట్లనియె * గీ॥ పయుగంబు నెట్టిదు మిక్కిలి తవుండు । భార్యనొడ్డి యోటువడిన భర్త । గలఁడె యిది వినంగఁ గడు నపూర్వంబయ్యె । నిట్లు సేయనోర్కొ దుకులుఁడు * గీ॥ మున్ను ననోటువడి మఱి తన్ను నోటు । పడియెనో తన్ను మున్నోటుపడి విభుండు । క్రన్న నన్నోటువడి నోయన్న నాకు । నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని * వ॥ ఎఱుంగ వేని యక్కితవు నడిగి వచ్చి నన్నుం దోడ్కొని పొమ్మ నఁ బ్రాతిగామి క్రమ్మఱవచ్చి పాంచాలి పలుకులు ధర్మనందనునకుం జెప్పిన దురోదరపరాజయదుఃఖితచేతస్కుం టం జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుండయ్యె నపుడు ప్రాతిగామికి దుర్యోధనుండిట్లనియె * క॥ సందిగ్ధమయిన ము । నిందఱు నెఱుఁగంగ నడిగి యింతయు నెఱుఁగ । న్సుందరి బాంచాలేంద్రసు । తం దోడ్కొని రమ్ము పొమ్ము తడయక నర్ * వ॥ వాఁడును ద్రౌపదిపాలికిం బోయి దేవీ నీయడిగిన యర్థము నిర్ణయించువారయి సభ్యులు నిన్ను రాఁ బంచిరి న దుర్యోధను దుర్వ్యవసాయంబునకు ధర్మరాజు సమ్మతంబునకు నలిగి యక్కోమలి ప్రాతిగామి పిలుండ నయేకవస్త్ర నధోముఖియు నవిరళగళితనయన జలబిందుసందోహనిష్యందమానపీనస్తనపరిధానాంతయు నగుచు సభకుం జను దె కురువృద్ధసమీపంబున నున్నంత ద్రౌపదిం జూడనోపక లజ్జితులయి దుఃఖాకులితమనస్కులయి తలలు వాంచియున్న పా పుల వైలక్ష్యంబు పలక్షించి సంతోషించి దుర్యోధనుండు దుశ్శాసనుం బిల్చి ప్రాతిగామి వృకోదరునకు వెఱచు నీవు ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన * గీ॥ నిర్దయాత్ముఁ బాపనిరతుడు దుశ్శాసనుఁ । బనుచు నెఱిఁగి కృష్ణ పంకజాక్షి । కడు భీ బునొంది గాంధారి యొద్దకు । నరిగెఁ గడువడం గియతి రయమున * చ॥ తడయక కౌరవాధముఁడు దాని పిఱుంద నె పోఁ కనె । కొడకరుగంగఁ బోలుఁ బలుకంజన దేమి యుసౌబలుండుని । న్నోడిచె దురోదరంబునఁ గురూత్తము నర్థమవై నుం । బుడమినిఁ దమ్ముఁ గోల్పడిరి సాత్త్విభవత్పతులైన పాండవుల్ * వ॥ అనుచు డాయవచ్చిన నేను రజస్వలను నేకవస్త్ర నయియున్న దానముట్టకుండుము పుఱిగురుబంధుజనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తునని ననీ వేకవస్త్రవై తేని వస్త్రవయి తేమి నిన్నెట్లును దోడ్కొని పోదునని బలాత్కారంబున * ఉ॥ ఆవనజాననం గురుకులాపశముండుగడంగి సూ । యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా । రావళిఁ జేసి పావనములైన శిరోజములన్ గ్రహించి పాపహృత్ ఁడీడ్చి తెచ్చె సభకందఱు విస్మయమందిచూడఁగన్ * వ॥ వాతావధూతంబైన పతాకయుం బోలె దుశ్శాసనా

ష్టయయిద్రౌపదివికీర్ణవేణియువివర్ణవదనయునయికర్ణదుర్యోధనశకునిసైంధవాదిదుష్టభూయిష్ఠంబైనసభకువచ్చికోప లజ్జాపరవశయయియిట్లనియె * చ॥అనుపమదైవయోగహతుఁడయ్యునవశ్యముధర్మసంపదఁ।దనరునకానిధర్మజుఁడు ధర్మపథంబదియేలతప్పెఁద్రో। క్కనుగురువృద్ధులారభృశకోపనుఁడీతఁడునన్ను నేలదు। ర్జనుఁడిటకీడ్చి తెచ్చెనవిచారప రుండయిదుర్మదంబునన్ * చ॥ఇదియుచితంబుగాదనకయిక్కురుముఖ్యుఁడుచూచుచుండదు।ర్మదుఁడయిపీఁడునన్నన వమానితఁజేసెడిసర్వధర్మసం।విమలననున్నయీభరతవీరులవంశము నేఁడధర్మసం।పదనతినింద్యమయ్యెననిభామినికృ ష్ణుఁడలంచెభీతమై * వ॥ఇట్లుజగత్త్రయజయభుజవీర్యసనాథులయిననాథులుగలిగియు ననాథయుంబోలెఁబాంచాల రాజపుత్త్రిభయార్తయయియార్తజనశరణ్యుండైనజగన్నాథుజనార్దనుందలంచుచుఁ గపటద్యూతమదోన్మత్తుండైన ధర్మపుత్త్రునిమిత్తంబుననుద్గతంబయినపాండవపరాజయంబను ననలంబుఁదనరూక్షకటాక్షనిరీక్షణంబులంబ్రవర్తిం చుచున్నదానిఁజూచిదుఃఖితుండైభీమసేనుండుధర్మరాజునకిట్లనియె * క॥ ధనకనకరత్నవరవా।హనధరణీరాజ్యము సుమహాయుధములుమ।మ్మునునోటువడుటయుచితమ।యినసన్నిభయిన్నిటికినధీశుఁడవగుటన్ * క॥ద్రుపదతనూజం బణముగఁ।గపటద్యూతముననొడ్డఁగాఁదగునెజనా। ధిపయీదుష్టద్యూతము। నెపమునఁబరిభూతయయ్యెనిష్కారుణుల చేన్ *వ॥శకునికైతవంబెఱింగియుంబాపద్యూతంబునందుఁబ్రవర్తించియధర్మప్రవృత్తుండవయితికావునభవద్బాహు దాహంబుసేయవలయుననిరోషావేశంబునంబలికినంబవనతనయునకునర్జునుండిట్లనియె * సీ॥ ధర్మతనూజుండుధర్మ వుదప్పినధరణీతలంబెల్లఁదల్లడిల్లుఁ।దగిలిసుహృద్ద్యూతధర్మయుద్ధంబులఁబరులచేఁబిలువంగఁబడివిభుండు। కడఁగకవిను ఖుండుగాఁజనదనిశుభక్షాత్త్రధర్మంబులోకంబులందు। నిలిపెఁదానిదిపతినేరమియేదైవవైపరీత్యంబైనవగవనగు నె* గీ॥గురులధర్మపరులఁగోపించిధీరుల।తిక్రమింతురేత్వదీయనిత్య।ధర్మగౌరవంబధార్మికులగుచున్న।పరులచేతఁజెఱుపఁ బడియెనిట్లు * వ॥అనుచుదుఃఖితులగుచున్నపాండవులనుదుశ్శాసనాపకృష్టయయిసభాంతగంబుననున్న ద్రౌపదింజూ చివికర్ణుండన్యాయశ్రవణవికర్ణులయియున్నసభ్యులకిట్లనియె * క॥సముచిత్తవృత్తులగుబు।ద్ధిమంతులకునిపుడుద్రౌపదీ ప్రశ్నవిచా।రముచేయవలయునవిచా।రమునఁబ్రవర్తిల్లుటదినరకహేతువగున్ *వ ॥ కురువృద్ధులైనభీష్మద్రోణకృపా చార్యులుంబలుకరైరియీయున్నసభాసదులెల్లఁగామక్రోధంబులుదక్కి విచారించి చెప్పుండనిన నందఱునూరకున్న నేనిందుధర్మనిర్ణయంబుఁజేసెదనెల్లవారువినుండని యిట్లనియె జూదంబును వేఁటయుఁ బానంబును బహుభక్షణాస క్తియునను నాలుగుదుర్వ్యసనంబులందగిలినపురుషుండుధర్మువుందప్పవర్తిల్లునట్టివానికృత్యంబులుచేకొనందగవు కిత వాహూతుండయి వ్యసనవర్తియయినపాండవాగ్రజుండుపాండవులకందఱకు సాధారణధనంబయిన పాంచాలిఁబ ణంబుఁజేసెంగావునద్రౌపదియధర్మవిజితయికోకమలినేకవస్త్రనిటఁదోడ్కొని తెచ్చుట యన్యాయంబనిన వికర్ణుపలు కులకోడంబడకకర్ణుండువానికిట్లనియె*గీ॥ఎల్లవారునెఱుఁగనెల్లనిధర్మువు।బేలనీకుఁజెప్ప నేలవలసెఁ।జెఱుతవానికింత గఱువతనంబిది।సన్నెవృద్ధజనములున్నచోట * వ ॥ నీవుద్రౌపదియధర్మవిజితయని పలికితి సభాసదులెల్ల నెఱుంగ ధర్మ జుండుతనసర్వస్వమ్ములునొడ్డియోటుబడినప్పుడిదిదానికివెలిగాదుగావునధర్మవిజితయయిట్లుగాని నాఁడీపాండవులెం దఱునువిజితగా నేలయొడంబడుదురునుఱియేకవస్త్రయయియున్నదీనిసభకుందోడ్కొనివచ్చుటయధర్మంబంటి భార్య కుదైవాధిష్ఠితుండయినభర్తయొక్కరుండయుదియనేకభర్తృకగావునబంధకియనంబడునిట్టిదానివిగతవస్త్రఁజేసి తె చ్చిన ధర్మవిరోధంబు లేదని కర్ణుండు వికర్ణువచనంబులకుం బ్రత్యాఖ్యానంబుచేసినవినిదుర్యోధనుండుదుశ్శాసనుం బిలి చియిప్పాండవులయుద్రౌపదియువస్త్రంబులపహరింపుమనినదాని నెఱింగి*క ॥ కితవవ్యవసాయపరా। జితులగుటం జె సిబలిమిచెడిపాండుసుతుల్ ।ధృతిఁదమపయిపుట్టములా।యతకీర్తులుమున్న పెట్టియాసభనున్నన్ *సీ॥ఇది సేయఁగాద

—(*)దుశ్శాసనుండుద్రౌపదికట్టినపుట్టంబొలుచుట.(*)—

నెసుదివిచారింపకసద్గర్హితుండుదుశ్శాసనుండు। నెట్టనద్రౌపదిగట్టినపుట్టంబుసభలోననొల్వ నాశంకలేక।యుడుగకయొ లువంగఁబడియుమున్నపనీతమైన యవ్వస్త్రంబు [illegible] మునఁ బాయక యొప్పుచునున్నన

య్యువిదఁజూచి* గీ॥ సభ్యులెల్లనుదితసమ్మదులయిరిదు। శ్శాసనుండునత్త్రచయముపర్వ। తోపమానమయినన్నా
గనోపక। యుడిగెలజ్జఁబొంది యుక్కుదక్కి * వ॥ అట్టియవసరంబున భీమసేనుండు ద్రుపదరాజపుత్రికి దు
సనుండు చేసిన యవమానంబుచూచి కోపరక్త నయనుండగుచు నంతకాకారంబున దంత సందష్టదారుణ ము
ఖుఁడయియెల్లవారును విన నిట్లనియె * ఉ॥ కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్మదో। ద్ధుర
ద్రౌపదినిట్లుచేసినఖలుఁ దుశ్శాసనుఁ డాలోకభీ। కరలీలన్వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘముని। ష్ఠురమూర్తి
సూచుచుండననినాస్వాదింతునుగ్రాకృతిన్ * వ॥ ఇట్లు సేయనైతినేనిపితృపితామహులగతికిఁదప్పినవాఁడ నగుదు
ననతనియతిమానుషంబయినమహావ్యవసాయంబునకద్భుతంబందిదిక్కులుచూడక ధిక్ఛబ్దముఖరిత ముఖులగుచు
త్రకుండయినధృతరాష్ట్రునిందించుచుద్రుపదరాజపుత్రివాక్యంబులు విచారింపక వృద్ధరాజులుపేక్షించిరనుచు
రంతనుద్ధతబాష్పనయనుండయివిదురుండెల్లవారినివిచారించియిట్లనియె* క॥ సుమతులుపాంచాలీప్ర। శ్నమున్న
నేర్పడనువిచారింపుఁడుపాపమువొందుధర్మసందేహముదీర్పనినాఁడుసభ్యులగుసజ్జనులర్ * మత్తకోకిల॥ ఈ
డుబాలుఁడయ్యును నేర్పరించియథావిధి। న్దేవమంత్రియుఁబోలెధర్మువుఁదెల్పెనీతనిబుద్ధి మీ। రేవగింపక చేకొను
యిట్టులెందునుధర్మసంద్భావమొక్కని కేర్పరింపఁగబ్రహ్మకైననుబోలునే* గీ॥ సభకువచ్చిధర్మసందేహమడిగిన
తెఁగిచెప్పకుండిరేనిసభ్యులనృతదోషఫలమునందర్ధమొందుదు। రనిరిధర్మవేమలయినమునులు* గీ ॥ ధర్మమెఱిఁగిఁగ
దానొండుగాలాభలోభపతుపాతలోలబుద్ధి। సభలనెవ్వఁడేనిసభ్యుఁడై పలుకువాఁ। డనృతదోషఫలముననుభ
చు* వ॥ ఈయర్థంబితిహాసంబునందువినంబడుఁదొల్లిప్రహ్లాదుకొడుకువిరోచనుండునునంగిరసుండను విప్రుకొడు
ధన్వుండునునొక్కకన్యంబరిగ్రహించునిమిత్తంబునఁ నెల్లసుగుణంబులమేము మేము పెద్దలమనియుద్దఁండువతవ్ర
ణంబులొడ్డు గానొడ్డివివాదంబు సేసిప్రహ్లాదుపాలికింజనిరందుసుధన్వుండుప్రహ్లాదునకిట్లనియె* గీ ॥ నీవుధర్మవి
దవుమాదివాద। మెఱిఁగితీర్పుగుణశ్రేష్ఠుఁడితఁడొయేను। చెప్పుమన్యథాబుద్ధివై చెప్పితేని। మఘవుకులిశంబుప్ర
మస్తకంబు * వ ॥ అనినంబ్రహ్లాదుండుభయంపడికశ్యపుకడకుంబోయివిరోచనసుధన్వులవి వాదపదనిర్ణయంబు
బ్రాణంబుపణంబుచేసియడిగినవిధంబునుం జెప్పినవినికశ్యపుండిట్లనియె* గీ॥ సాక్షియనుధర్మదర్శియసభలయం
దప్పఁజెప్పిరియేనినధర్మవృత్తి। వరుణపాశసహస్రంబువానిఁగట్టి। పాయునొక్కొక్కటేటేటనాయతముగ* వ॥
నధర్మాధర్మవిరోధంబయినదానిందీర్పనిసభ్యులుధర్మవిరుద్ధులగుదురు కామక్రోధంబులువిడువక యధర్మంబాడి
యధర్మంబునందొక్కపాదంబుసభ్యులనొక్క పాదంబుభూపతినర్థంబుకర్తనుంబొందుఁగావున ధర్మంబుతప్పక
వలయుననినంబ్రహ్లాదుండుధర్మువువిచారించితనకొడుకుకంటెగుణశ్రేష్ఠునిఁగాసుధన్వుంజెప్పినం బుత్రస్నేహం
పిడిచిధర్మువుదప్పక చెప్పితనిప్రహ్లాదుంబ్రశంసించివిరోచనునకుంబ్రాణంబొసంగిసుధన్వుండరిగెంగావునమీరు
పదరాజపుత్రియడిగినధర్మనిర్ణయంబుదప్పక చెప్పుండనివిదురుండుపలికినదుర్యోధనభయంబుననభ్యులెవ్వరుం
యిరిద్రౌపదియునట్లుసకలక్షత్రియసమక్షంబునదుశ్శాసనుచేతంబరిభవింపంబడిమహాదుఃఖితయయి* సీ॥ ఆవిధంబు
ట్టులాస్వయంవరమునందఖిలభూపతులచేనట్లుచూడఁబడిపాండవులధర్మపత్నినై గోవిందుచెలియలినయివీరిచేత
పరిభూతనగుచుసభామధ్యమునమహీపతులచేఁజూడంగఁబడితినింత। పడుదునెయిట్లునాపలుకులకెవ్వరుఁబ్రతివచ
నేలపలుకరయిరి- గీ॥ ధన్యులారయేనుదాసినేవీరికి। నెఱుఁగఁజెప్పుఁడనుపుఁడెల్లవారలనుచువనరుచున్న నాపగానుత
శాం। తనవుఁడిట్టులనియెఁదానిఁజూచి* వ॥ అవ్వా నీప్రశ్నంబునకునుత్తరంబయ్యుధిష్ఠిరుండు చెప్పవలయుఁగానిన
ధర్మసూక్ష్మతయెవ్వరికినెఱుంగగహనంబుదీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసనులనుభవింతురనిపలుకుచున్న
నక్కోమలింజూచినగుచు* గీ॥ తరుణియేవురకంటెనొక్కరుఁడుభర్త। యగుటలగ్గుబాదంబునందాలినొటు। పడనీన
గాఁదగుభర్తఁబడయమింక। ననుచురాధేయుఁడుల్లసమాడెనంత* ఉ॥ అమ్మదితన్విభీతహరిణాక్షిగలాపవిభాసికేశ
తమ్మననొప్పుదానిఁదనరమ్యపృథూరుతలంబు నెక్కఁగా। రమ్మనిసన్న చేసెధృతరాష్ట్రసుతాగ్రజుఁడప్డుదానిమా

నఁజూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁడల్కతోన్ * క॥ లయసమయదండధరని।ర్దయుఁడై ధరణీశులెల్లఁ దనపలుకులు
విస్మయసంభ్రమసంభృతులయి।భయమున వినుచుండ నాసభం దగఁ బలికెన్ * ఉ॥ దారుణరాజ్యసంపదమదంబునఁ గో
మలిఁ గృష్ణఁ జూచి రం।భోరు నిజోరుదేశమునఁ జేరఁగఁ బిల్చిన యిద్దురాత్మునూ।ర్వారమదీయబాహుపరివర్తితచండగదాభి
ఘాతభ।గ్నోరుతరోరుఁ జేయుదును యోధను నుగ్రరణాంతరంబునన్ * వ॥ అని సర్వజనభయానకక్రోధవివశుండయి
యాయుధంబులున్నవలనికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబు సూచుచున్న భీమసేను రౌద్రాకారంబు చూచి భీష్మవిదుర
ద్రోణాదులిది కోపంబునకవసరంబు గాదనియాతని బ్రశాంతచిత్తుం జేసిరంత * క॥ ధృతరాష్ట్రునగ్నిహోత్రా।య
తనంబున నఱచె వఱులు లగ్నులు శాంత।మ్యుతులయ్యెఁ గౌరవస్త్రీ।తతిహృదయములధికశోకతప్తములయ్యెన్ * క॥ క్రూ
రాత్మకులును మస్త।ప్రారంభులునయిన ధార్తరాష్ట్రులశయ్యా।గారములనెగసెనెంతయు।ఘోరంబుగఁగాకఘూక
ఘూత్కారంబుల్ * క॥ అట్టిమహోత్పాతంబులు।పుట్టినఁ గృపవిదురకలశభూశాంతనవు।లెట్టన ధృతరాష్ట్రునకుఁ।
బుట్టెనరిష్టమనిరిష్టమునఁ దమలోనన్ * వ॥ అంతనంతయు నెఱింగి గాంధారి విదురుండోడ్కొని ధృతరాష్ట్రుపాలికిం బో
యి పాండవుల పరాజయంబును ద్రౌపదిపరిభవప్రకారంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరాష్ట్రుండదిరిపడి దు
ర్యోధనుం బలిచి యిట్లనియె * చ॥ పరమపతివ్రత సుభఁదపస్విని బాండవధర్మపత్ని ధ।ర్మరతన యోనిజ న్బ్రకృతిమానవ
భామినిఁ గాఁదలంచి దె।ప్పరములు వల్కఁగాఁదగునె బాల్యము దక్కవు దుష్టవాసనం। బెరిగితి నీనిమిత్తమునఁ బెద్దయుదుః
ఖితులైరి పాండవుల్ * వ॥ నీవు వారలవలని క్రోధంబు విడువుమని కొడుకు వారించి సకలబాంధవహితంబు సేయందలంచి

—*ధృతరాష్ట్రుండు ద్రౌపదికోరిన వరంబులిచ్చుట*—

ద్రౌపది రావించి శాంతవచనంబుల నిట్లనియె * క॥ సుందరి నాకోడండ్రుల।యందభ్యర్హితవు నీవు యతిముదమున నీ।కుం దగ బ్రి
యంబు సేసెద।నిందుముఖీ వేఁడు మెద్దియిష్టము నీకున్ * అనిన మామకు ద్రౌపది యిట్లనియె * గీ॥ కరుణతోడ నాకు వరము ప్ర
సాదింప।బుద్ధియేని లోకపూజితుండు।మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు।వలన బాయవలయు వసుమతీశ * వ॥ అట్లై
నం గురుకుమారులు గురువృద్ధజనలాలితుండై పెరిగిన ప్రతివింధ్యుదాసపుత్రుండనకుండు మరిదియ నాయిష్టంబనిన నిచ్చితిం
కెరెండవవరంబు వేఁడుమనిన ద్రౌపది యిట్లనియె * క॥ నెమ్మి నిధర్మజునలువురు।తమ్ములు దమవస్త్రములయుఁ దమశస్త్రవ
రూ।థమ్ములతోడను సకలహి। తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్ * వ॥ అనిన ధృతరాష్ట్రుండు నీకోరిన వరంబయి
చ్చితి నింక మూఁడవవరంబు వేఁడుమనిన ద్రౌపది యిట్లనియె * గీ॥ వైశ్యసతికినొక్కవరము నుత్త్రియ।సతికి రెండు శూద్ర
కసతికి మూఁడు।విప్రసతికి నూఱు వేఁడంగఁ జను గాని।యింక వేఁడ నగునె యిభపురీశ * వ॥ అనిన ధృతరాష్ట్రుండు కోడలిగు
ణంబులకు ధర్మ్యవెఱుంగుటకు సంతసిల్లి యనుజసహితుండయిన యుధిష్ఠిరు రావించి నీ సర్వజనసంపదలు రాజ్యంబును నొ
ప్పఁగొని పోయి యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున సుఖంబుండుము నీకు లగ్గయ్యెడుమరుగుమని * గీ॥ నీవు నిత్యంబు వృద్ధో
పసేవఁ జేసి।యెఱుఁగుదెల్ల ధర్మంబుల నెఱుకలేక।గడఁగి నీకెగ్గుఁ జేసె నాకొడుకు దీని।మఱచునది నేను నిన్నొండు గఱప నే
ల * క॥ మనమున వైరము దలఁపమి।యును సద్గ్రాహ్యుఁడగుటయును గుణములు చే।కొని దోషంబులు విడుచుట।యును నుత్త
ముఁడయిన పురుషు నుత్తమగుణముల్ * వ॥ ఏనుబుద్ధి లేక జూదంబు పేక్షించితి నల్పబుద్ధి సత్త్వుండగు నన్నును మీతల్లి గాం
ధారి నిందలంచి దుర్యోధనాదుల దుర్గుణంబులం దలంపక సర్వశాస్త్రవిదుండయిన విదురుండు మంత్రిగా సర్వధర్మవిదుండ
వై సనీవు రతుకుండవు గాఁగురుకులంబునకు లగ్గగున నిధర్మరాజుఁ బాండురాజ్యంబునకు నియోగించిన * తరల॥ తరుణి ద్రౌ
పది యిట్లు పాండవధార్తరాష్ట్రులకై సభి। కరపరస్పరకోపవేగము గ్రన్నఁ బాచి విపత్తిసా।గరనిమగ్నులనుద్ధరించె బ్ర
కాశకీర్తుల వీరులం।బురుషసింహములన్ని జేశులఁ బొల్తి తద్దయు భక్తితోన్ * సీ॥ దానినంతయు భీమసేనుండు వినిరాజ్య
సంప్రాప్తి పాండవసత్తములకు। సతికారణంబుగా ధృతమయ్యెనను నింతకంటెను గష్టంబుగలదె యెందుఁ।బేర్మి నపత్యం
బు ధర్మంబు విద్యయనను నివి తేజంబున ట్లవఱులుఁ।బురుషుల కెందును నిరతంబు మిక్కిలి తేజంబు ధర్మంబు దీని విడిచి * గీ॥
యలుగఁగా డెపురుషుఁడని కోపఘూర్ణిత [illegible] రులను గ్రసంగరమునఁ జంపి [illegible] తల

రాజ్యమెల్లఁ గొందు ననియె* వ॥ ఇట్లు మృగమధ్యంబున నున్న సింహంబునుబోలె ననుజమధ్యంబున నున్నయా భీష్మ
సాంత్వవచనంబుల వారించి ధర్మరాజు ధృతరాష్ట్రుశాసనంబు నందమ్ములుం దానును ద్రౌపదీసహితంబు కాంచన
రథుండయి యింద్రప్రస్థపురంబునకుం జనియె నిట దుశ్శాసను చేత నంతవృత్తాంతంబును విని దుర్యోధనుండు కర్ణ
సైంధవులతో విచారించి ధృతరాష్ట్రు పాలికిం జని యిట్లనియె* క॥ అహితుల నెల్ల విధంబుల విహతులఁగా జేయు నన్న
సునిమరు న్మహితుఁడు తాఁ జెప్పెను మును బృహస్పతి సురేశ్వరునకుఁ బ్రియహితబుద్ధిన్* వ॥ కావున నింక పాండు
నెంతలగ్గ చేసియు హితులమయ్యెద మెయాశీవిషంబుల నలిగించి కంఠసమీపంబు నవిడుచునట్లు వారి విడిచి పుచ్చి కర
స్పితిమి* ఉ॥ భూవినుత ప్రతాపపరిభూతవిపక్షుఁడు సవ్యసాచి గాండీవము గొన్న భీముఁడు వడిన్గద గొన్నఁ గవల్
ణవ గ్మావరణాది భాసిత మహాభుజవిక్రములైనవారలన్ లావు రణంబులో మనకలంఘ్యబలాఢ్యులనింక నోర్వఁగా
వ॥ కావున వారల ననుద్యూతపరాజితులం జేసి భూమి వెలువరించుట కార్యంబనిన విని ధృతరాష్ట్రుండెట్టకేని యు
డిపు నద్ద్యూతార్థంబు ధర్మనందనుం దోడ్కొని తేరం బ్రాతిగామిం బంచినఁ బితృనియోగంబతిక్రమింపఁగాదని యు
కదలి* క॥ నృపవరుఁ డనుజులు దానును ద్రుపదతనూజయుఁ బ్రియంబుతో నరిగి రిహ స్తిపురంబునకున శేష స్వపక్షజన
దయములకు సంతోషము గాఁగన్* వ॥ అం దెప్పటియట్ల ధృతరాష్ట్రనిర్మితంబయిన సభామంటపంబున సుఖాసీనులై యు
తనభిమతాక్షంబులు గొని శకుని కితవుండు ధర్మరాజున కిట్లనియె* క॥ ధనసంపద్రాజ్యంబుల దినకరతేజుండ విమ్ము
రాష్ట్రుఁడు పెంపునఁ బూజించెం గావునఁ జనదింక నుదానినొడ్డి సరి క్రీడింపన్* వ॥ ఇది యపూర్వంబైన పణంబు దీని
యోటుపడినవారలజినవల్కలంబులు గట్టి కందమూలఫలాశనులై బ్రహ్మచర్యంబు నంబం డ్రెండేండ్లు వనవాసంబు చే
సి మూఁడవయేఁడు జనపదంబున నెరు లెఱుంగకుండ నజ్ఞాతవాసంబు సేసి యందెఱుంగంబడిరేని వెండియు బండ్రెం
డ్లు వనవాసంబు నొక్క యేఁడజ్ఞాతవాసంబు సేయువార మిట్లోపు దేని జూదంబాడు దమని నంబు నద్ద్యూతార్థంబు గా

## —*ధర్మరాజు శకునితో రెండవమారు జూదం బాడుట.*—

లుపంబడి మగుడ ననుసే నేయని* క॥ ధర్మసుతుఁ డొడ్డి శకునిక ధర్మస్థితి నోటుపడియె దైవము చెయిది న్నిర్మితమయి
భాశుభకర్మఫలంబెట్లు దేహిగడువఁగ నేర్చున్* వ॥ అట్టు పునర్ద్యూతపరాజితులయిన పాండవులు తమ రాజ్యోపభో
గంబులు విడిచి విప్రసుహృద్బాంధవజనోపాస్యమానులయి వనంబునకుం బోవ సమకట్టి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రో
ణాచార్యుల వీడ్కొనిన నజాతశత్రునకు విదురుం డిట్లనియె* క॥ వనవాసపరిక్లేశంబునకోపదు కుంతి దేవి భోజాత్మజ గా
నాగృహమున నుండెడు ననవరతము భక్తితో మదభ్యర్చితయై* సీ॥ ధర్మజ్ఞుఁడవు నీవు పేర్మిఁ బరాక్రమధనుఁడు భీమ
ఁడింద్రతనయుఁ డఖిల యుద్ధవిశారదుం డిద్ధతేజోనిధి నకులుఁ డర్థజ్ఞుఁడు ప్రకటబుద్ధి నెంతయు సంయమవంతుండు స
హదేవుఁ డధ్యాత్మవిద్యా నారాధ్యుఁ డెంత నన ఘుండు ధౌమ్యుండు వినుతార్థధర్మంబులందు విచక్షణుండు రాం గి ద్రు
పదరాజతనయ విపులగుణాలిన న్యోన్యహితులరగుట నన్యులుర్వి నాదరించి కాక భేదింపనోపెడు వారుగలరె మిమ్ము నీ
తుల* వ॥ మఱియు కృష్ణద్వైపాయనుచేత శిక్షితులరు నారాయణుచేత రక్షితులరు మీకుం బురోహితుండు ధౌమ్యుండ
వమానుషసంపన్నులరు పరాక్రమంబునం జేసి రాజులరు ధర్మచరితంబునం జేసి ఋషులరు మహత్త్వంబునం జేసి
రాములవారలరు మిమ్ము భూమియు గాడ్పును జంద్రాదిత్యులు నెప్పుడు రక్షించుచునుండెడు మెల్లకార్యంబులయందు
ప్రమత్తులర యివ త్తిల్లునది భవత్పునర్దర్శనమయ్యెడు మరునుండని కఅపిన గురువృద్ధానుమతంబు నందనచరణంబుల కె
మ్రొక్కి నంగొడుకులం జూచి* సీ॥ అధికలజ్జావనతాస్యులన పగతాభరణాంబరుల ధర్మపరుల నజిన వల్కలధారు
ముని వేషులఁ బాండుకుమారుల భానునిభులఁ జూచి దుఃఖితయయి సుతులార యట్టి దుర్వ్యసనోపహతులైన వారి నిమ్ము
జూడక మున్ద రసురలోకమున కేగి పాండుభూపతి పుణ్యభాగియయ్యె* గీ॥ భక్తిఁ బతితో నయరుగఁ దపంబుఁ జేసి నా
యే నేల పోపక మందభాగ్య నయితి నని విలాపించి లోలాక్షి కుంతి । యేడ్చె దుఃఖితులగుచుండ నెల్లవారు * మత్తో
పీరట్టులనాథులై మునివృత్తి నుండెడువారె హా ద్వారకాపురనాథ కేశవ దైత్యభేదిభవత్పదాం భోరుహాశ్రితులై

వీరలఁబూనికొంవకయుండఁగా। ధారుణీధరనీకుధర్మ్మ వేధసఁ నిర్మలమానసా ✱ తరల॥ అమితసత్త్వులుధర్మసుతాస్త్రుల హార్పతిప్రతిముల్ రిపు। ప్రవహుతాశనులాపగేయుఁడుఁ ద్రోణుఁడుఁ విదురుండుఁగా। తమఁడుసుంటఁగధర్మమార్గము దప్పఁబాడియెపాండవో। త్తములురాష్ట్రనిరాసమోయ్యలెధార్తరాష్ట్రులవంచనన్ ✱ క॥ అన్నసహదేవనీవును। నన్నలతోనరిగెదయ్యాయడవులకునునీ। వున్ననుసుతులందఱునిం। మన్నట్టులనాకుచిత్తమూఱడియుండున్ ✱ వ॥ అనుచుశోకాక్రాంతయయికుంతిదేవివినయవినమితోత్తమాంగయయినపాంచాలింజూచిబాష్పజలంబులురులనిట్లనియె ✱ క॥ ధవళాక్షినీకతంబునఁ। బ్రవిమలమైద్రుపదకులముఁబాండుకులంబున్। భువనమునవెలిఁగెనీవు। స్తవమాటనుజొచ్చుటనుశుభస్థితితోడన్ ✱ గీ॥ పురుషవృషభులయినపురుషులతోడన। యరిగిపరమభక్తిఁబరిచరింపఁ। బోవఁగనుటనీవుపుణ్యంబుచేసితి। వంచుఁబ్రీతిఁగౌఁగిలించుకొనియె ✱ వ॥ అనియిట్లుకోడలింగొడుకులనుదీవించికుంతీదేవివిదురుగృహంబుననుండెనంత ✱ గీ॥ పతులపిఱుఁదమందగతిముక్తకేశియై। పోవుదానిద్రుపదపుత్రిఁజూచి। వంతఁగౌరవేంద్రునంతిపురంబున। వారలెల్లఁదలలువాంచిరడలి ✱ గీ॥ ధర్మతనయుపిఱుఁదఁదమ్ములునలువురు। నరుగుచుండితత్సభాంతరమునఁ। జనులువినుచునుండసంభ్రతక్రోధులై। పలికిరధికపరుషభాషణముల ✱ క॥ సాహసమునసుద్బాహులగ। దాహతిదుర్యోధనాదియగుశతముఁజగ। ద్ద్రోహముఁజంపుదునత్యు। గ్రాహవమునహరిహాదులడ్డంబైనన్ ✱ గీ॥ దుష్టచిత్తుఁడయినకష్టుదుర్యోధను। శిరముదన్నువాఁడధరణిఁగూల్చి। హీనుఁడైనదుస్ససేనునివధియించి। వేఁడిరక్తమానువాఁడఁగడఁగి ✱ అనిభీమసేనుండుపలికిన ✱ మ॥ కనకోర్వీధరసానుసారరుచినుద్గాండీవనిర్ముక్తశ। స్త్రనిపీతారుణవారిశేషములభూతవ్రాతముల్ గ్రావనో। య్యనతోడఁజతుర్దశాబ్దమునమాఱైపోరుకర్ణాదిదు। ర్జనసంఘంబులఁజూపడంతుబలవత్సంగ్రామరంగంబునన్ ✱ అనియర్జునుండుపలికిన ✱ క॥ మాయాద్యూతంబుననని। ర్జేయులఁగామమ్మునిట్లుచేసినఖలున। న్యాయపరుశకునినస్మ। త్సాయకలితహస్తుఁజేసిచంపుదుమాజిన్ ✱ వ॥ అనిభీమార్జుననకులసహదేవులువిజృంభించికృతప్రతిజ్ఞులయిరట్లుపాండవులుపరిత్యక్తవిభవులయిగజపురంబువెలువడిన ✱ సీ॥ ధృతరాష్ట్రవిభునిమందిరమునననలుచుఁబలుచెగోమాయువుల్పట్టపగల। యప్రదక్షిణమునవ్యోమునుల్కాపాతముపమేఘమైయున్నయంబరమున। విద్యుత్సహస్రముల్వెలసెల్లమఱిరాహువర్వంబుగాకయభానుఁగప్పె। భూకంపమయ్యెనప్పుడుసభాంతరముననరులెల్లవినుచుండనారదుండు। పలికెనద్భుతముగబదునాలుగవయేఁడు। భారతాజియగునపారవీరు। లయినపాండవులుజయంబందుదురుభీమ। మఘవసుతులవిక్రమమునఁజేసి ✱ వ॥ ధృతరాష్ట్రుండునుదానినంతయువినికొడుకులదుర్నయంబులనింకనెట్టి యరిష్టంబుపుట్టెడునోయనివగచుచు విదురుంబిలిచిధౌమ్య

—✱ విదురుఁడుధృతరాష్ట్రునకుఁబాండవులడవికిబోయినరీతిచెప్పుట. ✱—

ద్రౌపదీసహితులయినపాండవులెట్లువోయిరనియడిగిననతనికివిదురుండిట్లనియె ✱ సీ॥ వదనసరోజంబువస్త్రాంతమునఁగప్పికొనియేగెధర్మనందనుఁడు మఱియు। భీమబాహులురెండుఁబెద్దలుగాఁజేసి ఘనసత్త్వుఁడమ్మరుత్తనయుఁడరిగె। నిసుముచల్లుచునమరేంద్రపుత్రుఁడువోయెభూరేణులిప్తశరీరుఁడగుచు। నకులుండుసనియెమానకలజ్జఁజేసియధోవక్త్రుఁడై సహదేవుఁడరిగె ✱ గీ॥ వికృతకేశభరమువెలుఁగంగద్రౌపది। చనియెరౌద్రయామ్యసామగాన। ముఖరితాస్యుఁడగుచుమ్రోలధౌమ్యుండేగె। నఖిలజనులువిస్మయంబునొంద ✱ వ॥ అనిననట్లేలవారలవ్విధంబుననరిగిరనియడిగినవిదురుండిట్లనియె ✱ క॥ నీకొడుకులచేనికృతిన। పాకృతరాజ్యుఁడయిధర్మపతినిజరూపా। లోకనజనదాహభయ। వ్యాకులుఁడైచనియెదృష్టివారించివడిన్ ✱ క॥ సమరమునబాహుబలద। ర్పముచూపనుగంటిననుచుబాహులతివిశాలములుగఁజేయుచునరిగెను। సమీరజుఁడరాతిభయదసంహననుండై ✱ క॥ వెఱచఱవనింతకంటెను। దఱుచుగబాణంబులేసితడయకపగఱం। జెఱుతుననియిసుముచల్లుచు। నుఱకధనంజయుఁడురణజయోన్నతుఁడరిగెన్ ✱ వ॥ మఱిదుఃఖానుభావంబునకునుచితంబైనతనసుందరరూపంబుచూచిజనులుదుఃఖింపకుండధూళిధూసరితశరీరుండైనకులుండరిగెదీనంబైనతనయాననంబుచూచినవారికినెల్ల నెగ్గగుననియవనతవదనుండయిసహదేవుండరిగె ✱ చ॥ తడసినయేకవస్త్రపరిధానముతోడవిముక్తకేశియై। తొడరుచుదుఃఖభావమునద్రోవదివోయెమహోగ్రవంబునం। బడిననిజేశమిత్రసుతబంధుజనంబు

లశోకవేదనం గడుకొని యిట్లు లేగుదురు కౌరవభామిను లంచుఁ దెల్పుచున్ * క॥ భారతరణహతులగునరు । సూర్య
లోకవిధులు సూచించి క్రియా । ధౌరుఁడు ధౌమ్యుఁడు ధర్మవి । చారుఁ డరిగె రౌద్రయామ్యసామోద్గతుఁడై * వ॥ అనన
ధృతరాష్ట్రుండు దుఃఖితుండయి * తరల॥ సమరశూరులు పాండవుల్ జితశత్రు లున్నతచిత్తులు । త్తములు వారలతో
రము ధర్మయుక్తి గరంబయు । క్తము ప్రజాక్షయకారణం బని తద్దయున్ భయమందుచు । న్వివమనుఁడై పడియుండె
వెచ్చ నూర్చుచు విన్ననై * వ॥ ఇట్లు వగచుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె * సీ॥ పాండుకుమారులఁ బరమ
ర్మికుల నువగవక రాష్ట్రంబువలనఁ బాపి । వసుపూర్ణమైన యీ వసుమతి చేకొంటి వసుధేశ నీకిఁ తవగవ నేల । కలశజవిదు
గంగాసుత ప్రభృతులు వారింప వారింపవశము గాక । కర్ణ సౌబలులయిక్క యపులు విని వారికపకారి యయ్యె నీయాత్మ
డు । వగవక ధికులయిన వారితో వైరంబు । సేసి కొంటి కరము చెట్టయనక । నీవు నీసుతుండు నేర్తురు గాకొరు । లేమి సేయన్
రిందుకులుఁడ * అనిన విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె * మత్తకోకిల॥ వగవ నేటికి నింకనైన ననువారలం బిలుపించియీ
జగతి నెప్పటియట్ల యేలుచు సంతసంబున నుండఁగా । జగదధీశ్వర పంపు వంచన చన్నె యన్యులసంపదల్ । మిగిలి చేకొ
ట్లు చేసిన మెత్తు రే సుదినుత్తముల్ * గీ॥ అనిన విదురు పలుకులు ధృతరాష్ట్రుండు । వినియు విననియట్లు విపినవాస । గత
పాండుసుతులఁ గ్రమ్మఱింపక యుపేక్షించెఁ బూర్వవిహితకిల్బిషమున * వ॥ మఱియు ద్రోణుండు పాండవులకు హి
డయ్యెను దొల్లి యాజోపయాజులవరంబున నగ్ని కుండంబున నుద్భవిల్లి నద్రుపదాత్మజుండు ధృష్టద్యుమ్నుండు పాం
సంబంధియు ప్రతివీరుండు గుట నాతనితోఁ దనకు సమరంబగు ననియె లింగి పాండవానుగమనంబు సేయక గజపురంబు
ధృతరాష్ట్రు కొద్దనయుండె నంత నింద్రప్రస్థపురంబున నిరువది మూఁడేఁడులు రాజ్యంబు చేసి పాండవులు పాపద్యూ
రాజితులయి * క॥ వీరులగు పాండుసుతులు మ । హారణ్యనివాసనిరతులయి ధరణీబృం । దారకసహస్రములతో । సారమ
ల్లనిరి నిత్యసత్యవ్రతులై * క॥ అని యిట్లు సభాపర్వం । బునకథ జనమేజయునకు మొగి వైశంపా । యను చెప్పె నవిధను
యు । మనునిభ శుభచరిత నిత్యమహిమాతిశయా॥ ........................................

---

ఉత్సాహ॥ రాజవంశ పార్థివేంద్ర రాజదేవనిత్యల । క్ష్మీజయాభిరామధర్మశీలమిత్ర విద్వదం । భోజవనప
ద్మారాజమిత్ర భూరికీర్తికౌముదీ । రాజితత్రిలోకనిఖిలరాజరాజపూజితా * క॥ కరుణావతారధరణీ ।
సురవరసురభూజరాజసుందరనయబం । ధురధర్మగుణైకధురం । ధర హేమగిరీంద్రధీరదానవినోదీ *
స్వాగతము॥ హారహీరధవళాంశునిర్మలో । దారకీర్తిరణదర్పసద్గుణా । వైరివీరనిరవద్యమన్మథా ।
కారధీరపరగండభైరవా ॥ ........................................*



గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు సభాపర్వంబున
నర్ఘ్యాభిహరణంబును - సభాస్ఖలితుండయిన దుర్యోధనుం జూచి ద్రౌపదీభీమసేనులు నగుటయు
రాజసూయవిభూతిసూచి సహింపక దుర్యోధనుండు జూదంబొనర్చుటయు - నందు
శకునికైతవంబునఁ బరాజయంబును - ద్యూత దుఃఖార్ణవమగ్నులైన పాం
డవులం బాంచాలి యుద్ధరించుటయుఁ - బునర్ద్యూత పరాజితులయి
పాండవులు వనవాసగతులగుటయు - నన్నది సర్వంబును
ద్వితీయాశ్వాసము ॥ .................... *



శ్రీమహాభారతము - సభాపర్వము
సంపూర్ణము.

## శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రభారతము.

## ఆరణ్యపర్వము - ప్రథమాశ్వాసము.



శ్రీకీర్తిశ్రీవల్లభ। లోకజనస్తుత్యసర్వలోకాశ్రయ। రత్నాకరపరివృతపకలధా। రాకాంతజితారి రాజరాజనరేంద్రా ॥ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పాండవులు కౌరవాధికుంబులు ధరియించి కృష్ణాసహితంబుగ నుత్తరాభిముఖులై యరిగిన నింద్రసేనాదులైన మూలభృత్యులు పదునాలుగు వేలరథంబులతోడ సుభద్రాభిమన్యులం బ్రతివింధ్యాదులం దోడ్కొని వారిపిఱుందన యరిగి రంత నప్పాండవులం జూచి పౌరులెల్ల బరమదుఃఖితులై ॥ క॥ చననె యధర్మద్యూతంబున నిట్టులు పాండురాజపుత్త్రులం బ్రభులకా। వనగతులం జేయు దుర్యో। ధనధృతరాష్ట్రులకు విగతధయహృదయులకున్ ॥ క॥ క్రూరగతదుర్యోధనునకు। కారము వారింప శైరి గాంగేయుండు న। బ్భారద్వాజుండుం గృపుండు ను। దారుండు విదురుండు నేమి దలంచిరొ బుద్ధిన్ ॥ సీ॥ కర్ణజయద్రథగాంధారులాప్తులై యుండంగ లోభి దుర్యోధనుండు। రాజుగా నీతని రాజ్యంబునం దెట్టులుండంగ నేర్తుమీయుర్వినింక। నేది ధర్మువు ప్రజ నెవ్వరు గాతురు పరమధార్మికులైన పాండుసుతులు। యరిగిన చోటికి యరుగుదము నివారి పిఱుందన చని పాపభీతమతులు - గీ॥ వీరలార మమ్ము విడిచి మీకరుగంగ। జనునె మాకు నొండు శరణమెద్ది। సాధులకును సాధుసహవాసమున బావ। సంప్రయోగమగుట సందియంబె ॥ క॥ తిలలును నీళ్లును వస్త్రం। బులు పుష్పసుగంధవాసమున సౌరభముం। బొలుపెసగం దాల్చుగావున। నలయక సత్సంగమునన యగు సద్గుణముల్ ॥ వ॥ సాధుసమ్మతంబులైన గుణంబుల నొప్పి జన్మవిద్యాకర్మంబులం బ్రశస్తులరై యార్యవృత్తులరైన మీ సహవాసమున నుండి ధర్మవిదులము గృతార్థులము నగుదుము దుష్కృతంబులయందనారంభులయ్యును జనులు దుర్జనదర్శనస్పర్శన సంభాషణసహవాసములం జేసి ధర్మహీనులగుదురు కావున నేము దుర్యోధను రాజ్యంబున నుండ నోపము మాయనుగమంబునకొడంబడవలయు నని కృతాంజలులైన నప్పౌరవులం జూచి ధర్మతనయుండిట్లనియె ॥ క॥ మాయందు లేని గుణములు। మీయనురాగమునం జేసి మీకుం గలిగెన్। మీయనుగతి మాకును భ్రాతృయము వనవాసదుఃఖభర మోపుదు రే ॥ గీ॥ వలవదుడుగుండు మీరని వారినెల్లం। గరుణం బాండవజ్యేష్ఠుండు గ్రమ్మఱించె। బౌరులట్లు నివర్తింపం బడిన నంద। యార్తవాదులై యరిగిరి హస్తిపురికి ॥ వ॥ ఇట్లు తమతోడ వనవాసంబు సేయ వచ్చువారల నిలిపి పాండవులు కృతప్రస్థానులై గంగాతీరంబునం బ్రమాణాఖ్యవటంబున విడిసి గంగాస్నానంబు నేసి నాఁటి పగలును రాత్రియు నందయుండి రంతం బ్రభాతంబున ॥ చ॥ వరువడి నగ్నిహోత్రములు బంధులు శిష్యులుం దోడరా మహీ। సురవరులెల్లం బాండునృపసూనుల యొద్దకుం బ్రీతి నేగుదెం। చిరిబహువేదఘోషములం జేసిరి సన్నమస్తకిల్బిషో। త్కరులను చున్నధన్యులు జగత్పరిపూజ్యులు బ్రహ్మసమ్మితుల్ ॥ వ॥ ఇట్లు తమతోడ వనవాసము సేయ నిశ్చయించిన విప్రుల నతిప్రీతిగౌరవంబున నర్చించి తదాశీర్వాదంబుల నానందితుండై ధర్మతనయుండు వారలకిట్లనియె ॥ క॥ అపగతసర్వస్వుల మై। సపత్నులనికారమునం బ్రచండాటవిలో। విపులఫలశాఖమూలము। లుపయోగించుచును నివ్వనుం డెదము మాతోన్ ॥ క॥ రానేల వద్విన వయం। గానేల నివాసములకుం గ్రస్తులచనుండు। గ్రానేకపశార్దూలభ। యానకవనవాసము ర్హమును నేమికన్ ॥ వ॥ అనిన విని బ్రాహ్మణులు పరమదుఃఖితులై మీరకా నిమాకు నొండుగతి లేదు మమ్ము నన్యశరణ్యుల విడుచుట ధర్మంబు గాదు ॥ గీ॥ ఆశ్రితులు నభక్షులను వారి నెవ్వాడు। నన్యులైన విడువ గట్టి విప్రు। వరులభక్తిపరుల వసుమతీశ్వర మీకు। ధార్మికులకు విడువందగునె చెప్పుడ ॥ వ॥ అస్మత్పోషణార్థంబు చింత సేయవలదు వన్యమూలఫలంబుల నేము తెచ్చు

కొనియుపయోగించుచు జపహోమాధ్యయనాదిపుణ్యక్రియలమీకుం బ్రియంబు సేయుదునధన్యులమయ్యెద
త్తియయిమీకపాయంబు సేసినధార్తరాష్ట్రులరాష్ట్రంబునందుండనోపమునిన వారలచేతఁ గోడంబడి * గీ॥ ఇష్ట
న్నములఁదొల్లియెల్లప్రొద్దు । తృప్తులగుచున్నవసుమతీదేవవరులఁ। గానలందుశాకాశనుల్ గాఁగనెట్లు। సూడనో

## శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు చెప్పుట.

నిధర్మసూనుఁడపుడు * వ॥ శోకమూర్ఛితుండై మహీతలంబునంబడిన యాతనినాశ్వాసించి శౌనకుండను బ్రహ్మర్షి
యాత్మవ్యవసాయార్థంబు జనకగీతంబులైనశ్లోకంబులయర్థంబులు యుధిష్ఠిరునకిట్లనియె * క॥ శోకభయస్థానంబు
నేకముగలిగినవివేకహీనుఁడు మదిలో। నాకులతఁ బొందునట్లువి। వేకముగలవాఁడు బుద్ధివికలుండగునే * క॥ శారీర
సమహా। దారుణదుఃఖములఁ జేసితఱిగిశరీరుల్। క్రూరతబాధలఁ బొందుదు। రారెంటినిఁ జెఱుచు యోగ్యులమలినబుద్ధుల్
వ॥ వ్యాధిశ్రమానిష్టసంయోగేష్టవియోగంబులను నాలుగింటంబుట్టిన శారీరదుఃఖంబులు క్రియాప్రయోగంబుల
శమిల్లు మఱి స్నేహంబులైన మానసదుఃఖంబులు జలంబులనగ్నియుపశమిల్లెడునట్లు విమలజ్ఞానంబునం జేసి యు
పశమంబునొందు * క॥ స్నేహార్ణవమగ్నుండయి। దేహిమహాదుఃఖములధృతింబొందుముదుః। ఖావహమఁడుశోకత
మోహియగుఁ స్నేహమూలములు రాగాదుల్ * వ॥ కావున బంధుమిత్రధనసంచయంబులవలని స్నేహంబువిడి
నది పద్మపత్రంబు నీరువోరయనియట్లుఱుకగలవారికి నెట్టియెడలను స్నేహంబుపొందదు స్నేహంబు రాగంబును రా
గంబునం గ్రోధంబును గ్రోధంబునఁ గామంబును గామంబునఁ దృష్ణయువర్తిల్లు * క॥ అదిసర్వదోషములకా। స్థా
నమనిదురితక్రియానుబంధంబులకుఁ। మొదలునిరంతరదుఃఖ। ప్రదమనియెఱిఁగినను దృష్ణబాతురుసుమతుల్ * వ॥
ఱియుఁ దృష్ణాతురుండర్థలోభంబునఁ గోటరస్థంబైన యనలంబునం జేసి దగ్ధంబగువృక్షంబునుం బోలె వినాశంబువొందు
నట్లునరాసక్తుండైనవాఁడు శుభంబులువడయనోపండు మృత్యువువలనం బ్రాణులకుభయంబుగలయట్లర్థవంతుల
రాజచోరస్వజనజలానలంబులవలనభయంబునిరంతరబు * గీ॥ జలముందుమత్స్యంబులుచదలఁ బక్షు। లామిష
ట్లుభక్షించునట్లుతివిరి। యెల్లవారును జేరియనేకవిధుల। ననుదినంబునుభక్షింతురర్థవంతు * క॥ అర్థమునర్థమూల
ర్థనమాయావిమోహనావహమునరుం। డర్థార్జనదుఃఖమునన। పార్థీకృతజన్ముఁడగుటపరమార్థమిలన్ * వ॥ అట్టియర్థం
బువలనదర్పకార్పణ్యభయాదికంబులుపుట్టుఁగావున నర్థోపార్జనచింత సేయవలదు రూపయౌవన ధనజీవిప్రియ
వాసంబులనిత్యంబులగుట నండుబుద్ధిమంతులు మోహింపరనిననమ్మునివరునకు ధర్మతనయుండిట్లనియె * సీ॥ ఆర్థో
భోగార్థమర్థలాభేచ్ఛనాకెన్నండు లేదుమహీసురాగ్ర। గణ్యులనత్యుగ్రకాననాంతరమున నెవ్విధంబునభరియిం
నోకొ। యనియిప్పువగచెదనవద్యగుణయుక్తినకుమాయట్టిగృహస్థతతికిఁ। బోష్యులనెల్లెడఁ బ్రోవకయుండను
లనతిథులవృథయపుచ్చఁ * గీ॥ జను నెనిజధనంబు సంవిభాగించియా। వలయు సాధురక్షవలయుఁ జేయ। నఖిలయా
మంబులందుగృహస్థాశ్ర। మంబకాదెయుత్తమంబువినఁగ * వ॥ మఱియార్తభీతులకభయంబునుదృష్టితునకుజలం
బుబుభుక్షితునకున్నంబును శ్రాంతునకు శయనాసనంబులువిచ్చుట సనాతనంబైన యుత్తమ గృహస్థధర్మంబు
భూమ్యుదకప్రియ వచనాదరంబులెల్ల వారికినవశ్యంబాత్మార్థంబుగా నన్నపాకంబును వృథాపశుఘాతంబును
హేతువులగ్యహోమాత్రంబులు ననడ్వాహంబులు నతిథిబాంధవవిద్వజ్జనగురుమిత్రభామినీనివహంబుల పూ
బులైయెగ్గుసేయునుగావున గృహస్థుండు సర్వసంతర్పకుండుగావలయుంగావునం బ్రతిదినంబునుం బలివైశ్వ
దార్థంబుసాయంప్రాతఃకాలంబులందు వైశ్వదేవంబుచేసియమృతాశియువిఘసాశియుఁగావలయుయజ్ఞశేషం
తంబునాఁబరఁగు నతిథిభుక్తశేషంబు విఘసంబునాఁబడు నట్టివృత్తివర్తిల్లువాఁడు తమగృహస్థుండనిన ధర్మరాజు
శౌనకుండిట్లనియె * క॥ హారివిషయాభిలాషము। కారణముగనెంతయెఱుకగలవారునదు। ర్వారవికారముఁబొందె
వారునిజేంద్రియములవియవశ్యములగుటన్ * వ॥ సంకల్పజంబైనకామంబునందగిలినమనస్సుచేతం బ్రేరితంబై
శ్రోత్రాదీంద్రియంబులుశబ్దాదివిషయంబులం బరిభ్రమించుటం జేసి విషయాభిలాషవిశిఖవిద్ధులై దేహులు తేజోవ
ములైనశలభంబులుంబోలె శోకానలంబునంబడి తమ్మెఱుంగక యవిద్యాకర్మతృష్ణలం జేసి సంసారచక్రంబునందు

వర్తిల్లుచుఁ దట్టి బ్రహ్మాదితృణపర్యంతభూతప్రవృత్తియందు రాగద్వేషవిముక్తులై యభిమానమత్సరంబులు విడిచి వేదచోదితంబైన సమ్యక్సంకల్పంబుం బ్రియనిగ్రహంబు వ్రతవిశేషంబు గురుసేవనంబు నాహారయోగంబధ్యయనాగమంబు కర్మసన్న్యాసంబు చిత్తనిరోధంబను నెనిమిదింటను గర్మానుష్ఠానంబు చేసిన మహాత్ములుత్తమతమ తపోమహత్త్వంబునం జేసి సంసారంబు జయింతురు నీవును శుశ్రూషాశ్రవణగ్రహణధారణోహాపోహార్థవిజ్ఞానసమన్వితుండవు నీచేతం బ్రారబ్ధంబులైన యవి సర్వంబులును సంపన్నంబులగు * క ॥ వసువులు రుద్రాదిత్యులు వసుధేశ తపంబు గౌరవంబున నైశ్వర్యసమృద్ధులైరి తపమునఁ। బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవుం * వ ॥ తపస్సిద్ధులైనవారు తమ తలంచిన దానిన వడయుదురుగావున నీవును వశమవంతుండవయి తపంబు చేసి యోగార్థసిద్ధి వడసి బ్రాహ్మణుల భరియింపు మీకు మనోరథంబు సఫలంబగుననిన శౌనకు వచనంబు చేకొని భ్రాతృమధ్యగతుండైన ధర్మతనయుండు ధౌమ్యునకు నమస్కరించి యిట్లనియె * గీ॥ వనమునకు వచ్చినవయఁగ వలవదుడుగుఁ। డనిన నుడుగక మీతోన యరుగుదెంతు। మనరి బ్రాహ్మణుల్ వీరి కాహారమే యుపాయమున నుగ్రవనమునఁ బడయవచ్చు * వ॥ వీరల విడువనోప నేమి సేయుదు ననిన విని ధౌమ్యుండు పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరాజున కిట్లనియె * గీ ॥ భూతరాశి తొల్లి పుట్టి బుభుక్షాభి। తప్తమయినఁ జూచి తద్భయంబు నపనయింపఁగడఁగి యదితిసుతాగ్రణి। కమలబాంధవుండు మగరుణతోడ * వ॥ ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్యభూతుండై యోషధులం బడసి రాత్రులయందుఁ జంద్రకిరణామృతంబునం జేసి వానిం దడుపుచు వర్ధించి యందన్నంబు పుట్టించి ప్రజాప్రాణధారణంబు సేయుటం జేసి యన్నంబాదిత్యమయంబనియెఱింగి తొల్లి భీమ వైన్య కార్తవీర్య నహుషాదులు యోగసమాధినిష్ఠులై సూర్యభజనంబున నన్నంబుఁ బడసి యాపదలవలనం బ్రజల సముద్ధరించిరిగావున * లయగ్రాహి ॥ వారిరుహమిత్రు నమరోరగముని ద్యుచరచారణగణప్రణుతచారుగుణు లోకాధారు నఖిలశ్రుతిశరీరు హరిశంకర సరోరుహభవప్రతిము దారుణతమిస్రా। దారణపురీఁ బరిపూరితదిగంతరుని భూరికరుణానిరతు సూర్యుఁ ద్రిజగద్ర। క్షారుణ సహస్రకరుఁ గోరి భజియింపుము మనోరథఫలంబులగు భూరమణ నీకున్ * వ ॥ అని ధౌమ్యుండు విశుద్ధాత్ముండైన ధర్మరాజునకు సూర్యుం డర్యముండు భగుండను నివి మొదలుగాఁ గల నామంబులష్టోత్తరశతంబు ననభీష్టసిద్ధిప్రదంబులైన వాని విస్పష్టార్థవర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించి దీనిం దొల్లి యింద్రువలన నారదుండు వడసె నారదువలన వసువను రాజు వడసె నాతనివలన నేను బడసితి నిది దేవనిర్మితంబు దీన నాదిత్యు నతిభక్తి

(*)ధర్మరాజు సూర్యు నారాధించి వరంబు గొనుట.(*)

నారాధింపుమనిన * సీ ॥ హితుఁడైన తన పురోహితు నుపదేశంబు పేర్మితోఁ జేకొని ధర్మరాజు। నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ బూజించి భాగీరథీజలంబు। లందుండి విషయంబులందిం ద్రియంబుల ననవరతావధానమున మడిపి। వాయుభోజనుఁడై ప్రాణాయామపరుడునై సూర్యాది నామముల్ సూర్యుఁ గుఱిచి * గీ॥ జపము సేయుచున్నఁ దపనుఁ డాతనికిఁ బ్రత్యక్షమయి త్రిలోకచక్షుఁ డమరవరుఁడు దురితహరుఁడు తరణి త్రయీమూర్తి। వనజమిత్రుఁ డిట్టులనియెఁ గరుణ * వ॥ నీ తపమునకు మెచ్చితి నీవరణ్యమున నుండఁగల పండ్రెండేండ్లును వన్యఫలమూలశాకంబులు మహానసంబున ద్రుపదరాజపుత్రిచేత సాధితంబులై యక్షయంబులైన చతుర్విధాహారంబులగునని వరంబిచ్చి వనజహితుం డంతర్హితుండైన * చ॥ అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు నెమ్మితోఁ। బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించెన। ద్రుపదాదిరాజసుత పాల్పుగ వండిన శాకమూలముల్। గడురుచి నిష్టభోజనసుఖంబును ద్విప్రియఁ జేయుచుండఁగన్ * వ॥ ఇట్లనేకసహస్రమహీసురవరుల ననుదినంబును నభిమతభోజనంబులం దనిపి విఘసామృతభోజనంబులం దృప్తులైన వతులభుక్తశేషంబు ద్రుపదపుత్రిక యుపయోగించుచుండం గొన్నిదినంబులందయుండి పాండవులు బ్రాహ్మణులచేతం గృతస్వస్త్యయనులై బ్రహ్మర్షిసంఘంబులతోఁ గామ్యకవనంబునకరిగి రంతనిట ధృతరాష్ట్రుండు విదురుం బిలుపించి నీవు భార్గవుకంటెఁ బుద్ధిమంతుడవు పాండవకౌరవులకు సముండవు విచారించి చెప్పుమింక నప్పాండవు లేమి చేయువారనిన విదురుండిట్లనియె * మత్తకోకిల ॥ దేవమూర్తులు పాండుపుత్రులు ధీరచిత్తులు వారిపెం। పేవెలుంగని వాఁడ వేధరణీశ వాయుసుతుండుగాఁ। డీని యుగ్రభుజనిక్రమప్రకటీకృతుల్ సిద్ధాస్త్రవిద్యావిశేషులు వైరివీరులఁ దక్కఁగాని త్తు రెపోరులన్ *

క॥ మొనసియధర్మద్యూతం । బునఁ బేకముపుట్టుఁ బాండుపుత్రులకును నీ। తనయులకనిమును జెప్పితి। విని నెల్లకొ...
నువింటివిడఁకు ✱ వ॥ ఇట్లైనను వారి రావించి తొల్లి నీ చేతనుబడిన రాజ్యంబునందుఁ బ్రతిష్ఠాపించి కీ...
ర్తంబును నిలుపుము. రాజ్యంబును త్రివర్గంబును ధర్మమూలంబులు గావున సంపదవర్తిల్లుచున ధర్మవర్తియైయుక్తజ్ఞ...
శ్వాసనశీలుండైన దుర్యోధనుండు శ్చేష్టితంబులకొడంబడవలవదు ౦ గీ॥ వీనిఁ బుట్టినపాపంపు వేళఁ జెప్పి । దుర్ని...
ముల్ పుట్టిననిగ్రహించి యేను జెప్పితిఁ దొల్లి మీని చేత। నెట్టిగౌరవులకు నెగ్గువుట్టుననియు ✱ వ॥ కులదూషకుఁడు...
కులంబు రక్షించుట ధర్మువు ధర్మరాజు నఖిలమహీరాజ్యరక్షకుం జేసి పుత్రప్రేమున(?) మాత్సర్యబుద్ధివర్గంబు...
క్షింపుము సభామధ్యంబునందు ద్రౌపదీభీమసేనులం బార్థిప దుశ్శాసనుం బంపుము ✱ చ॥ అశేశయతాపసో...
హాస్పతి తేజుఁడజాతశత్రుఁడూ । గ్రిసుఁడజితుండు నీసుతులు సేసినయొగ్గులవండఁగాక నిట్టి ధృతి నమునీపుఁ జేయుము
వకులోత్తముఁ యిట్లుయైన నీ। కృతమునఁ గౌరవాన్వయమునకిల్చకీర్తి ప్రకాశితంబగు ✱ వ॥ అనిపలికినవిదురుపలు
వినికడుఁనలిగి ధృతరాష్ట్రుండిట్లనియె ✱ క॥ నా దేహంబునఁబుట్టిన యాదిసుతుఁ విడువ నెట్టులగు నాత్మజులం। గాదు

విదురుఁడు ధృతరాష్ట్రు నివిడి పాండవుల యొద్దకుఁ బోవుట.

ఘాతించుద। యాదూరులుగల రెయిట్టులనీకగునే ✱ వ॥ నీవు నాకొడుకులయెడ్డ నీకెన్నండును సహింపవు నీ సహాయ
బునే నొల్లఁ బాండవుల కడకేఁ యును నొండుకడకేనియు నీ కిష్టంబైనచోటికి నరుగుమనిన నాతండంబ విదురుండును మొ...
రథారూఢుండై పాండవులు డకుం గామ్యకవనంబునకరిగెనంత నటవి రాకద పృథ్వీలం గనిధర్మరాజు భీమసేనునకిట్లనె
సీ॥ గాండీవమాదిగాఁగలయాయుధంబులనుక్కీవంబున నప్పుడొడికికొనుcX । మతిచిన వాఁడయ్యనుండాప్తుండ
త్రరాష్ట్రుండు గాంధార రాజతనయు । వచనమున్విదియత్పతి నెపంబున వారిఁగష్టుఁడై కొనసముకట్టినవల నా...
వఁగాపున్నమతిఁ జేసి విదురుఁబు తెంచెగావున్న నేతెందు నెఱుఁగ ✱ గీ॥ డింకజూదమాడ నేనోపనిదిపని। గాఁగను
నొకొక్కఁడగివిదు నఁ। డేను సేయువారమితవినిరోగంబు। మనకుఁ జేయకునికి మానుషంబె ౦ వ॥ అనితమలోని
చుచున్నసమయంబున విదురుండే తెంచిననతనికిఁ బ్రత్యుత్థితులై వినయప్రియసత్కారంబుల సంతుష్టుం జేసితదాగమ
నిమిత్తంబడిగిన వారికి విదురుండిట్లనియె ✱ క॥ మతివారికి మానుగదు। హితుఁడవు చెప్పుమయ్యయింక నెయ్యదిగాగ
తియనిధృతరాష్ట్రుండే । కతమిష్టంబైనకార్యగతి నన్నడిగెఁ ✱ వ॥ ఏను నుభయపక్షంబులవారికిలగుగహితంబై
అంగఁ జెప్పిననది సర్వజనరుచికరంబైన యాహారంబు రోగాతురునకు నరుచికరంబైనయట్లయతనికిరుచియింపనైయ
గీ॥ కార్యగతుల తెఱఁగు కలరూపు నెప్పిన। నధికమతులుదానినాదరింతు । రల్పభాగ్యబుద్ధులగువారలకునది । విరసాన్న
ణంబువిషమువోలె ౦ వ॥ జానన చేసి ధృతరాష్ట్రుండు నన్నొల్లక యెపలుకలికి నీవు విపరీత చేతస్కుండవిదుని యు
వదు పాండవులకడకుం బొమ్మనినవచ్చితి రూపలావణ్యవతియై వృద్ధశ్రోత్రియుని చేతం బరిణతయైన తరుణియుంబో
రాజ్యలక్ష్మి యద్దురాత్ము నందు విరక్తయ కాని ప్రీతిఁ బుట్టింపదు ✱ గీ॥ ధర్మరహితుతైనధార్తరాష్ట్రులకుభూ । రాజ్యల
క్ష్మిసుస్థిరంబుగాదు । ధర్మతనయ నిన్నుఁద ద్రాజ్యసంపదల్ । వలదితమఁగుఁదారవచ్చిపొందు ౦ వ॥ నావచనంబులు
డునదియనినధర్మరాజునట్లచేయుదుననిం యొడంబడియున్నంతధృతరాష్ట్రుండు పాండవులయొద్ద విదురుననికి నెమ్మ
ధృతిహీనుండై తనహృదయంబునదృష్టియుంబోని విదురంబాసి నిమిషంబేనియు నిర్వహింపనోపక సంజయునకిట్లనియెం
క॥ నెమ్మిగలవాని వాచి। తమ్మెయిఁగెడు వానిసకలధర్మప్రియువా। తమ్ము నివిదురుం దోడ్కొని । రమ్మరుగుము కామ్య
కమ్యాటవికిన్ ✱ వ॥ అనిపంచిననప్పుడ సంజయుండతి త్వరితంబునఁ గామ్యకవనంబునకరిగి ౦ ఉ॥ ధరణీదేవసహ
సంఘములతో ధౌమ్యుండు ధర్మసమా । భరణుల్ నల్వురుతమ్ములుకావిదురుఁడుం బాంచాలియుం బ్రీతిబం । ధురు
ల్పఁగనొప్పుచున్న బుధబంధుక ధర్మరాజుఁ బ్రభా । స్వరతేజుం బ్రభుఁగాంచి సంజయుఁడు సంజాతప్రమోదాత్ము
కవనవాసము సేయుచుఁ ద్రిభువనరాజ్యము చేయువట్టివడువునసంతో । షనిబద్ధబుద్ధియగుయమ । తనయునకును
మ్రొక్కి తానిట్లనియెఁ ✱ వ॥ మిమ్మమ ధర్మాధర్మవిదుండైన విదురునింగౌరవేంద్రుండెప్పుడును దలంచుచున్న
యానుమతంబునఁ దనయనుజుని దోడ్కొనితేరనన్నుఁబు తెంచెననిన విని ధర్మరాజు విదురున కిట్లనియె ✱ గీ॥ సర్వ...

నధృతరాష్ట్రుఁ శాసనంబు। సేయుచున్నచో మనకుపిశేషభ క్తి। చేయవలయుఁ గావున నెడ చేయక రుసు।మనినవిదురుం డుగజపురికి రి గెనంత ✱ వ॥ ధృతరాష్ట్రుండును వినయవినమితోత్తమాంగుండైన విదురు నతిస్నేహంబునం గౌఁగిలించుకొనిమూర్ధాఘ్రాణంబు సేసి నీవునిత్యక్షమానిరతుండవు నాబుద్ధిలేమికిక్షమియింపుమనిన విదురుండిట్లనియె ✱ గీ॥ నీవు నీసుతుండు నెట్టిఁ దప్పపలికినఁ। బక్ష్యమయిన పలుకుఁ బలుకవలయు। వీరులయినపాండవేయులతోనిగ్ర। హంబు సేయఁ దగిన యంబుగాదు ✱ వ॥ అనుచు నెప్పటియట్ల కార్యసహాయుండై ధృతరాష్ట్రునొద్దనున్న నయ్యెడ్డ ప్రసంగంబునకు శంకించి దుర్యోధనుండు కర్ణశకునిదుశ్శాసనులతో నిట్లనియె ✱ క॥ పాండవహితుఁడగు విదురుఁడు। వెండియుఁ జనుదెంచి కార్యవిధులందు సహా।యుండయ్యె నతనితోడ హి। తుండయి నుంతనము జేయఁ గడఁగెన్విభుఁ డక్కా ✱ వ॥ వీరలింక బాండవులనింతులకు తాఁకించువారలైన నగ్నివిషజలంబులు ప్రయోగించి వారలకపాయంబు సేయుదమనినవిని శకునిదుర్యోధనుం జూచి యిట్లేల బాలిశంబైన మతిఁ దలంచితివి విదురధృతరాష్ట్రులు విపరీతమతులై రావించినను నిత్యసత్యనిరతులైన పాండునందనులు తము చేసిన సమయంబు సలుపక యేల వచ్చువారనుదురనిన శకుని దుర్యోధనులకుఁ గర్ణుండిట్లనియె ✱ ఉ॥ ఇత్తఱిఁ బన్నిపోయినయినెత్తిరణంబొనరించి వారల। మ్మెత్తిన ఁ పిధాత్రి నిరమిత్రము సేయుదమట్టులైనఁ బ। ద్వ్రత్తులు నీకు దక్కుఁ గౌరవ పీరకడంగుము నీవు నావుడు। న్నత్తఱి కౌరవుం డతనిమాటకు సంతసమందిచెచ్చెరక్కా ✱ వ॥ సమరసన్నద్ధుండై సమస్తబలంబును సమకట్టి వెలువడినం దనదివ్యదృష్టినంత యెఱింగి కృష్ణద్వైపాయనుండు వచ్చి యిది ధర్మంబు గాదని దుర్యోధనునివారించి ధృతరాష్ట్రునకిట్లనియె ✱ క॥ పుడమియు రాజ్యముఁ గోల్పడి। యడవుల నేకతము యున్నయప్పాండవులకా। గడఁగి వధియింప గాఁ నీ। కొడుకరిగెను నిట్లు పలుఁ గూడు నె బుద్ధిక్కా ✱ క॥ ధృతిమంతులయి సత్యవ్రతరతులయి వను మూఁడు వత్సరంబులు ధర్మ। స్థితిసలిపి తారకడఁగెద। రతులపరాక్రములు పిదనాహవమునక్కా ✱ క॥ వనగతులనివారల పయిఁ। జనిభంగముఁ బొందిరాఁగ సముకట్టెషనీ। తనయుఁడు గావున నీవా। తని వారింపుము దియను చితంబని నెమ్మిక్కా ✱ క॥ పినుమే నీవు సురుశాం। తనవులు విదుగుం షనుండితగు నెయ్యధర్మం। బును పేక్షింపఁగ ననయం। బును బాండవవిగ్రహంబు పుట్టుట లగ్గే ✱ వ॥ అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుండై నాకును గాంధారికిని భీష్మ విదుర కృప ద్రోణులకు ననిష్టంబైన దుష్టద్యూతంబునం బ్రవర్తించె దుర్బుద్ధియైన దుర్యోధనుం బుత్రస్నేహంబున విడువనోప నేమి సే

✱ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్ర సురభి సంవాదంబు చెప్పుట.✱

యుదునని నధృతరాష్ట్రునకుఁ గృష్ణద్వైపాయనుండిట్లనియె ✱ గీ॥ ఎల్లనెయ్యములకుఁ దల్లిదండ్రులయందు। సుతులవలననెయ్యమతిశయంబు। ధనము లెంత గలిగిన సుతరహితులకెమ్మెయిన్మనః ప్రియమ్ము లేదు ✱ వ॥ తొల్లి సకలగోమాతయయిన సురభి సురరాజుకడకుం బోయి కారుణ్యంబుగా నేడ్చిన దానిం జూచి సురపతి విస్మితుండై యిట్లేల రోదనాకులితలోచన వయియున్నదానవెల్లవారికిలగ్గగదా యనిన నింద్రునకు సురభి యిట్లనియె ✱ క॥ నీవజ్రము రక్షింపఁగ। నావారికిఁ ద్రిభువనంబులఁ గలజీ।వావలి కెల్లను గుశలము। దేవేంద్ర జగత్త్రయ ప్రదీపమహాత్మా ✱ వ॥ దీని జిత్తగింపుము బలంబునుగలబలీవర్దంబులతో బలహీనంబులైన వానిం బూన్చిన నవి దుర్వహభారవహన మహాలాంగలాకర్షణంబులయందసమర్థంబులై ననడిచియు బొడిచియుఁ దిట్టియు దుర్బలంబులగు బలీవర్ధంబుల జనులు బాధింపం బోయిన నేను దానికి మగ్గలించెద ననిన సురభికి సురపతి యిట్లనియె ✱ క॥ నీకును పత్యశతంబుల। నేకంబులుగలవు వాని కే కాతృతి మగ్గ। ఖాకులత సంభవము। శోకింపకుమనిన సురభి సురపతికనియెక్కా ✱ వ॥ దేవాదీనానంబులయి దుర్బలంబులైన యపత్యంబుల మగ్గఖంబెట్లు చూడ నేర్తుననిన నింద్రుండు దానికిం గరుణించి వర్షంబువలనఁ దృణవర్ధనంబుగావించి దుర్బలబలీవర్ధంబులకు బలంబు గావించెనని యింద్రసురభిసంవాదంబు వేదంబులయందు వినంబడుఁ గావున నీకును బుత్రస్నేహంబు సామాన్యంబుగాదైనను దీనులైవనంబున నవయుచున్న యప్పాండవులకు దయాళుండవగుము ✱ గీ॥ నీవు పాండుండు విదురుండు నెపాకు నొక్కరూపైన యట్టుల యుచితయశులు। నీసుతులు నూఱుగురుఁ బాండునృపతి నూఱు। లేవురును నొక్కరూపు నెఱుఁగవలయు ✱ క॥ సుజనులసహవాసంబున। గుజనులు సద్ధర్మమతులగుట నిక్కము ధ। ర్మజునొద్దనుండి నీయాత్మజు ప్రశాంతుండు ధర్మమార్గుండును నగు  [illegible] బుసర్వహితంబు గావున నాత

నినుపాసించి దుర్యోధనుండతనియొద్దఁ గొండొకకాలంబుండునట్లుగాఁ బనుపుమ హైనను భయపక్షంబులకు లగ్గగు
ధృతరాష్ట్రుండు కృతాంజలియయి మునీంద్రా దుర్యోధనుండు నాపలుకులు వినఁడు గురుకులంబు రక్షింపఁ బుద్ధిగలదే
సమరశిక్షింపుండని మ్రొక్కిన * క॥ అనఘుఁడు మైత్రేయుండను। మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁ దా। నను
చేఁదిరంబుగ। నని చెప్పుచునప్పరాశరాత్మజుఁ డరిగెన్ ॥ అంత * ఉ॥ న్యాయనిధుండు గామ్యకవనంబున ధర్మజు
నుండి మైత్రేయుఁడు ధీయుతుండరుగుదెంచిన నవ్విడయమ్ము నీంద్రు మే। ధాయుతుఁ డాంబికేయుఁడు చితస్థితిఁ బూ
జేసె నాత్మని। శ్రేయసలాలసుండయి విశేషసపర్యలు చేసి భక్తితోన్ * వ॥ ఇట్లు తనచేతం బూజితుండై సుఖవిశ్రా
ంతుండైన మునివరునకు ధృతరాష్ట్రుండు ముకుళితహస్తుండై భట్టారకా యెందుండి వచ్చితిరనియడిగిన నతనికి మైత్రేయుం
డిట్లనియె * చ॥ అలఘుతపోభరంబున జటాజినముల్ధరియించి రూక్షువ। ల్కలములుగట్టి కూరలును గాయలుఁ బండ్లు
జనంబుగా। నలయక కామ్యకంబను మహావిపినంబుననున్న పాండవే। యులకడ నుండివచ్చితిఁ గురూత్తము నీసుతుని
జూడఁగన్ * వ॥ పనఖిలతీర్థదర్శనార్థంబు పరిభ్రమించుచుఁ గురుజాంగలంబునకరిగియందుఁ గురుకులోత్తములైన
దుపుత్రులం జూచితి * గీ॥ అనిన నవనతాస్యుఁడయి ధృతరాష్ట్రుఁడి। ట్లనియె నెట్లు సెప్పఁడయ్యాయంపుఁ। బాండవ
సత్యభాషణులకుఁ గుశలంబె వారలిట దలంతురొక్కొ * క॥ అమితభుజశక్తి సంతత। సముల పాండుసుతులిందు సా
త్రస్నే। హమునకు విచ్ఛేదముగా। సమయాతిక్రమము సేయ సమకట్టరుగా * వ॥ అనిన మైత్రేయుండిట్లనియె *
నుదెంచి మహామునివరు। లనవరతము వారలకుఁ బ్రియంబొనరఁగదీ। వనలీలఁ జేసి కుశలను। మనుజేశ్వరవారు ధర్మ
తియుతులసుటన్ * క॥ వారలు సమయము దప్పిన। వారిజరిపుహితులగతులవశ్యము దప్పన్। వారికి నకారణంబని।
మునీకొడుకు సేసెఁగడు నహితుండై * వ॥ అనిదుర్యోధనుం జూచి యయ్యా నీవు బుద్ధిగలవేని పాండవులతోడ విరోధం
దుసుమతులైన నీవును వారికిం గురుకులంబునకు లగ్గగువావలుకుఁ జేకొనుము * సీ॥ వజ్రసంహననుల వార్యపరాక్ర
ల్పాండుకుమారులాఖండలాభు। లందఱు నాగశతాయుత ప్రాణులు గ్రాహపకాంక్షులుత్సాహపరులు। వారలలో
వంతుండు బకహిడింబాసురులను వారి నాహవమునఁ। జంపె నాగాయుతసత్త్వ జరాసంధు నెక్కటి యొప్పినయకా
జుండు - గీ॥ ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁడను సు। రారి నిశ్చలభీకరాకారుఁ గిట్టి। పోర వధియించినట్టి సమీరజునకు భ

## * మైత్రేయుఁడు దుర్యోధనుని శపియించుట. *

బలునకు మాఱొక్కఁడును బారుగలరె * వ॥ వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధి సహాయులు జరామరణవంతులైన
లు వారిం జెనకి యెట్లు జీవింతురు నీవు వారితోడ సొందొడంబడియుండు మిది కార్యంబనిన మైత్రేయు పలుకులాదరిం
దాంగుష్ఠంబున నేల వ్రాయుచు బాహులెత్తి నగుచున్న దుర్యోధనుం జూచి మైత్రేయుండలిగి యీయపరాధం
హవంబగునందు భీముగదాఘాతంబున నీయూరుయుగ్మంబు భగ్నంబయ్యెడుమని శాపంబిచ్చిన వెఱచి ధృతరాష్ట్రు
మునీంద్రా యట్లుగాకుండం బ్రసాదింపుమనిన నమ్మునివరుండిట్లనియె * గీ॥ కడఁగి వీనికి సమబుద్ధి గలిగెనేని। శాప
ఫలంబట్లుగాక బుద్ధిహీనుఁడయి గర్వితుండయ్యెనేని శాప। హవ్యవాహ ఫలంబు వీఁడనుభవించు * వ॥ అని ప్రసన్ను
యున్న మైత్రేయునకు నాంబికేయుండిట్లనియె * క॥ కిమ్మీరుండను రక్కసుఁ। డమ్మారుతతనయు చేత నత్యుగ్రవ
తమ్మున నిహతుండయినవి। ధమ్మెట్లది సెప్పుమద్భుతంబిదియనినన్ * వ॥ నాపలుకులు నీకొడుకు వినండే నేలచె
దీనిం బాండవసహాయులైన విప్రులచేత విదురుండిమ్మూగా నెఱింగిన వాఁడతనివలన వినుమని చెప్పి మైత్రేయుం
నంగిమ్మీరవధ కథాశ్రవణకుతూహలుండై ధృతరాష్ట్రుండు విదురునడిగిన విదురుండిట్లనియె నిందుండి చని
వులు మూఁడహోరాత్రంబులు నిరంతరప్రయాణంబులు చేసి కామ్యకవనంబు సొచ్చువారొక్కనాఁటి
రాత్రంబున రాక్షసప్రచారవేళయందుఁ బరిభ్రమించుచు రాక్షసమాయ గావించుచున్నవాని నతినిశితదంష్ట్రా
ళంబైన తనవదనగహ్వరంబుఁ దెఱచి రుగ్ధమెఱవ బభ్రుకేశంబులు దూలబాలార్కరశ్మియుతంబైన బలాహ
నుంబోలె సకల ప్రాణిభయంబుగా గర్జిల్లుచున్నవాని నిజపాదఘట్టిత మహీతలప్రచలన వేగ వెల్లితవల్లీ పల్ల
హుమహీరుహభంగ సుఖంబులం బాదపంబుల శాపాదించుచున్నవాని నెద్దుర నొక్కరక్కసుం గనిరంతవాఁడను

త్రాణసంఘంబుముందరఁ గృష్ణాజినావృతులై వచ్చు పాండవులంగని మార్గనిరోధియైన మహాపర్వతంబునుం బోలెన
దృష్టపూర్వ ప్రమాణంబైన వానికాయంబుఁ జూచి నిమీలితనయనయై దుశ్శాసన కరాకృష్టవికీర్ణ వేణీభరంబు వె
నువెంట ప్రేలయం బాంచాలి పంచపర్వతంబుల నడిమినదియుం బోలెఁ బతులనడుమ భయవ్యాకులిత చిత్తయైననిం
ద్రియంబులు విషయతతిం బరిగ్రహించు నట్లు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించుచున్నంత *
క॥ రక్షోఘ్నమంత్రములనా । రాక్షసమాయం దవస్ఫురణఁ జెఱిచెఁ గ్రియా। దక్షుఁడు ధౌమ్యుఁడు పాండవు। లీక్షించుచు
నుండఁగా నహీన ప్రతిభన్ ॥ అంత * క॥ ప్రతిహతమాయానినత్వా । యతభుజయుగుఁ గోపఘూర్ణితారుణవిస్ఫా। రితనే
త్రు నసురఁ జూచి ధ। రతనులనందనుఁడు ధర్మరాజిట్లనియె * వ॥ నీవెవ్వరివాఁడ వెవ్వండ వివ్వనంబున నేలయున్నవాఁ
డనినవాఁ డిట్లనియె * క॥ ఏను బకాసురునను జుఁడఁ। గీనాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁడనం। గా నెగడుదు నీ కామ్యక। కా
ననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్ * క॥ పాయక యందుఁడు రాక్షస। మాయలసమరంబు సేసి మనుజుల విగతో। పాయు
లఁ జంపుచు భక్షింతు। సేయుదు ననరాతులకున జేయుఁడఁ బోరన్ * వ॥ నాకు వెఱచి యెల్లవారును నతిదూరంబున దీనిం బరి
హరింతురు మీ రెవ్వరిందులకేల వచ్చితిరి మిమ్ము నిండ అవధియించి యిపుడ భక్షించెద ననిన వానికి నయ్యుధిష్ఠిరుండిట్లనియె *
గీ॥ ఏను ధర్మసుతుండ నీతఁడు భీముఁడు । వాఁడు విజయుఁడల్ల వారు కవలు। పాండవుల ము సమయుపడి వనవాసంబు। సేయవ
చ్చితిమి విశేషయుక్తి ॰ సీ॥ అనవుడు రాక్షసుండట్టహాసంబుతో నెట్టెట్టు భీముఁడె యీతఁ డేమి। పుణ్యమో వీని నెవ్వఁడు కుసం
వఁగాంతు నోయని యున్న చోఁ దానయుగు దెంచె । నధిక మాయన్న బకాసురు నాయిష్టసఖు హిడింబాసురుఁ జంపియు
న్న। ఖలు విగిజీర్ణంబు గావింతు వాతాపి దొడయక మ్రింగినతపసియట్లు * గీ॥ లనినరక్కసునకు నలిగి నయగ్రజానలు

## కిమ్మీరుండను రాక్షసుఁడు భీముచేఁ జచ్చినకథ.

కయెఱిఁగి వీఁకుడగ్గు నుండు। మొనసి గాండివంబు మోపెట్టె నవశిత । ఖడ్గపాణులైరి కవలునంత * ఉ॥ ఘోరపరాక్రము
ప్రబలకోపపరుల్ పృథుసారభూరిభూ । మీరుహ పాణులుద్ధతులమిత్రవిఘాతులు వీరబృందబృం। దారకులార్చుచోం
డొరులఁ దాఁకిరి దారుణభంగిఁ బొంగి కి। మ్మీరసమీరసూనులు సమీరవిధూత పయోధులట్టిరై * తరల॥ పొరిన వారలచేతి
యున్నతభూరుహాయుధములుప్పర । స్పరకఠోరశిరస్స్థలంబులపై వడిం బడి మత్తకుం। జరశిరగ్గపతితంబులైన లసన్మృణాళ
ములట్లజ। గ్ఝరితమయ్యెఁ దదారవప్రతిశబ్దమొప్పనభంబునన్ * వ॥ ఇట్లొక్కముహూర్తంబు వృక్షయుద్ధంబు సేసియా
సన్నమహీరుహంబులు సమసిన నిద్గుశిలాయుద్ధంబు సేయు నెడం బవనజముష్టి పనిష్ఠురశిలాహత హృదయుఁ డయి భానుం
బట్టుకొను స్వర్భానుండునుం బోలెఁ గిమ్మీరుండు భీముం బట్టుకొనిన భీముండు వానిహీనబలుంగా నెఱింగి కృతాంతదండా
నుకారంబులయిన తన బాహుదండంబుల నమ్మనుజకంటకుకటికంఠప్రదేశంబులు వట్టుకొని నేలం బెట్టి దేహయష్టి విఱిచి
చంపెఁ జంపిన విధంబున వధియించి ॰ గీ॥ బకహిడింబులు హతులైనఁ బనివివనిపి । యటఁదిశోకింపఁగానకయమపురమున।
కరిగి తక్కట రాక్షసయనుచుఁ దెరువు । వాయఁ బావనితత్కళేబరము వైచె ॰ వ॥ ఇట్లు ధర్మరాజు వచనంబునం గిమ్మీరు
నక్రమంబున వధియించి తద్వనవాసులకు రాక్షస భయంబుడిపిన మహావీరు మారుతాత్మజు ధర్మార్జున నకులసహదేవు
లును ధౌమ్యాదిమహీసురులును బ్రశంసించిరని విదురుండు సెప్పిన విని ధార్తరాష్ట్రులకు హృదయచలనంబయ్యె నిట్లు
పాండవులు గామ్యకవనంబున నుండునంత ॰ సీ॥ వసుమతీరాజ్యంబు వలన నిరస్తులై మునివృత్తి నత్యుగ్ర వనములోన। న
వయుచుఁ బాండు భూనాథనందనులున్న వారని విని యతిక్రూరమతుల । ధృతరాష్ట్రసుతుల నిందించుచుం బాంచాల
యాదవవృష్ణిభోజాంధులెల్ల। నచ్యుత ప్రముఖులై యప్పాండవులకడకే తెంచి శోకవశీతులగుచు ॰ గీ॥ నన్ననధికధర్మ
యుక్తుఁడు పేంద్రుఁడు। నికృతిఁ జేసి పాపనియతబుద్ధి। పాండవులకు నట్టిపాయంబు సేసిన। ధార్తరాష్ట్రు నసురు దద్దయ
లిగి * క॥ అనిఁ గర్ణశకునిదుర్యో। ధనదుశ్శాసనవాఃప్రధారాపాతం । బునఁ దృప్తి నొందు వసుధాం। గన రాక్షస కాకగృ
ధ్రగణములతోడన్ * క॥ అవినీతుల వధ్యులఁ గా। రవ పాంసులఁ జంపి ధర్మరాజును సుగురు। ప్రవరు నకొనరింపుదమీ। య
వనీరాజ్యంబు నెల్లనవహితయుక్తిన్ * వ॥ అనియు గ్రాంత్య కాలకుపితకృతాంతాకృతి నున్న జనార్దనుం బ్రశాంతచిత్తుం
జేసియర్జునుండతని నిట్లని కీర్తించె ॰ గీ॥ పూజ్యుఁడవు పురాణపురుషుండవు [illegible] వ ప్ర [illegible] సుఁడవు చరాచరంబులయిన

భూతరాసులచ్యుతనీయందుఁబుట్టునిలుచులయముఁబొందుచుండు ✽ వ॥ నీవుతొల్లిగంధమాదనంబునంగందమూలఫలాశుండవై పదివేలేండ్లుదపంబుసేసి పుష్కరంబున నేకాదశసహస్రవర్షంబులు జలంబులాహారంబుగా నుండి ప్రభాసతీర్థంబున దివ్యసహస్రవర్షంబు లనేకపాదస్థితుండవయియుండి బదరీవనంబున బవనంబుభక్షించుచున్న బాహుండవయి యేకపాదంబుననేకసహస్రవర్షంబులు నిలిచిసరస్వతీచక్రంబున నజినోత్తరవాసుండవయి కృశశరీరంబుతోఁబండ్రెండు వర్షంబుల శేషవ్రతంబులునలిపిన తపోనిధానుండవు నఖిలలోకజైత్రుండవయి చైత్రథంబునను తమక్రతువుల నేకంబులు సేసియొక్కొక్కక్రతువునకు నూటయేసిలక్షలసువర్ణంబులు దక్షిణలిచ్చినయజ్ఞపురుషుండవు తపోయజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండవయి దైత్యదానవేంద్రులవధియించి యింద్రునకింద్రత్వంబిచ్చి భూతంబు సేసినలోకప్రభుండవదితికశ్యపులకుదయించి యింద్రానుజుండవయి త్రివిక్రమంబులం త్రిజగంబులనభివ్యాపించినవిశ్వరూపధరుండవు ✽ క॥ నరకశిశుపాలురాదిగ। ధరణీకంటకులనధికతరదర్పులఁబల్వురవధియింపఁగమహి తరించినమహోత్తముఁడవునుతస్థిరకీర్తి ✽ క॥ అనృతమునుసదముమాత్సర। మును గ్రోధముదుర్విచారమునుబొం నెనిన్నుసవమునుణములనీకొరు। లెనపోల్పఁగగలరెసురమునీంద్రప్రణుతా ✽ వ॥ అనికృతాంజలియయినధనంజయుం జూచిదనుజభంజనుండిట్లనియె ✽ గీ॥ నరుఁడునారాయణుండువాఁబరఁగువాడి। మునులమిద్దఱమునుము నీవనఘనరుఁడ నారాయణుండ నానాశక్తి। యనఘులమయిమర్త్యయోనిఁబుట్టితిమి పేర్మి ✽ తరువోజ॥ నిరతంబుగా నేను నీవును నస్మ యభేదంబు లేకున్కి నిక్కముమనకు। నిరుపురకునునీకునిష్టుండు నాకునిష్టుండు నాకును నిష్టుండు నాకుఁ। గరమునిష్టుండు కానమ్ము మనుచఘనభుజుల్ బ్బనోపకారైకవ్రతులు। హరియునర్జునుఁడుఁబ్రియముతోఁదగిలియన్యోన్యహితగ

## ద్రౌపదిశ్రీకృష్ణునితోఁదనపరిభవంబుచెప్పిదుఃఖించుట.

లాడుచున్నంత ✽ వ॥ అఖిలరాజలోకపరివృతుండయియున్న నారాయణునొకవచ్చి ద్రుపదరాజపుత్రి ముకుళితకరాంబుజయయినిన్నునాదిసర్గంబునఁ బ్రజాపతివని యసితుండయిన దేవలుండును సత్యంబువలనయజ్ఞంబులఁబుట్టుటంజేసినిత్యసత్యమయుండవయిన యజ్ఞపురుషుండవని కశ్యపుండును శిరంబునదివంబును బాహంబుల మేదినియును చరణంబులలోకంబులునభివ్యాపించుటంజేసిసర్వమయుండవని నారదుండును సత్యజ్ఞాననిధివనిసర్వమునిముఖ్యులుఁ జెప్పిరి ✽ అక్కర॥ అనిననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ। విహితచిత్తులై సర్వధర్మార్థవిదులయ్యొప్పుచుఁ దనరెడురాజవరులకుఋషియోగధరులకుసాధు। జనులకుగతినీవనిత్యకారుణ్యసర్వశరణ్య ✽ వ॥ నీయందనేకవృత్తిగోచరంబెద్దియులేదయిననునాపడినపరాభవంబెఱుఁగించెద ✽ సీ॥ పార్థివప్రభుఁడైనపాండుమహీపతికోడలియయ్యుధర్మకుశలులయిన। పాండుతనూజులభార్యనై పూజ్యుండవయినీసఖియునైయధికశక్తిఁ। బరఁగుధృష్టద్యుమ్ను భగినినైధృతరాష్ట్రుపట్టిచే సభఁదలపట్టియీడ్వఁ। బడిపాపకర్ముచేఁ బరిధానమొలువంగఁ బడిదారుణంబైన పరిభవంబు ✽ గీ॥ పడితినిట్టినన్నుఁబాండవులూచుచు। నుండిరొరులువోలెనుక్కుదక్కి। యావగాతనూజుఁడాదిగఁ గురువృద్ధబంధుజనులుసూచిపలుకరయిరి ✽ క॥ శరణనినవారిఁగరుణా। కరులయిరక్షించుపురుషకారాన్వితులేఁ యుఁడిన నాలిం। పరుభీమార్జునులబాహుబలమేమిటికి ✽ వ॥ భ్రాతృపుత్రబంధుజనంబులుగలిగియునానాథయిరట్టియెడంగర్ణుండునన్నుంజూచినగియె ✽ గీ॥ కర్ణునగవులోకగర్హితుండగుదుస్స। సేనుచెయిదికంటె శిఖిసమాననడరినామనంబునతిదారుణాకృతి। నేర్చుచున్నయదిమహీధరుండ ✽ వ॥ తొల్లివేదాధ్యయనంబు సేయుచు బాల్యమోదంబుననున్నకాలంబునఁ బ్రమాణకోటియందు సుప్తుండయిన భీమసేనునంటఁగట్టి గంగముంచుటయు నంద్రోవియంబుఁబెట్టియు విషసర్పంబులం గఱపించియుజననీసహితులయిన యేవురను వారణావతంబు లక్కయిల్లుసొచ్చి దహనంబుఁ బ్రయోగించియును ననేకంబులయిన యపకారంబులు సేసియు నిప్పుడు దుర్యోధనుండధర్మద్యూతరాజ్యంబునపహరించి రాజలోకసమక్షంబునందమ్ము నిరాకృతులంజేసినను బరాక్రమసరాఙ్ముఖులయిన పాండవులచే నావరిభవంబెట్లుడిగెదరని బాష్పధారానిభృతపయోధరయయి పాణిపల్లవంబున నయనసమ్మార్జనంబు సేయుచుఁ పాంచాలిఁజూచివాసుదేవుండిట్లనియె ✽ చ॥ తనరుచునున్ననీపరాభవకారణమైన పాపవిమిత్తముసర్వనురేంద్రునం। దనువమ

ణపాతహతినాధృతరాష్ట్రబలంబుమృత్యుసా । దనమునకేఁగుఁజుమ్మిదియ తథ్యము నా వచనంబుదప్పదీ । వననిధులేపు నింకినదివంబును రాత్రియుసంచలించినన్ * వ॥ అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యిట్లనియె * ఉ॥ ఈపురుషోత్తముండు మనకిందఱకుం గుశలంబు సేయుచుం । బావకలంకపంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసిదుగ్ధదో । గ్ధీపితశత్రులోకవితతిం బరిమారుతు మల్లమేలసం । తావముఁ బొందఁ జేయఁగ ద్రిధామజయోన్నతిగల్గియుండఁగన్ * వ॥ అనిన ధృష్టద్యుమ్నుండు సక్రోధుండయి యిట్లనియె * క॥ వినయవిహీనుల కుర్వో । ధనదుశ్శాసనులఁ బవనతనయుఁడు రాధా । తనయుని నరుఁడేఁ గుంభజు । ననిఁ జంపుదు మేలవగ వనంబుజనేత్రా * వ॥ అనియండఱు ద్రుపదరాజపుత్త్రి నాశ్వాసించి రంత నచ్యుతుండు ధర్మరాజునకిట్లనియె * గీ॥ ద్వారవతినుండి నేయాయథానవలన । ధారుణీశ యింతయువినితక్షణంబు । యెరుగుదెంచి యాపన్నుఁడవైన నిన్నుఁ । జూచి దుఃఖోపహతమనస్కుఁడనయితి * వ॥ అయ్యవసరంబున నేను మీయొద్దనుండమిం జేసి యిట్టిమర్వ్యసనంబు సంభవిల్లెం గామజంబులయిన స్త్రీద్యూతమృగయాపానంబులను నాలుగుదుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండఁ బ్రతిపాదింపవలయునందును విశేషంబుగా నధర్మమూలంబయిన ద్యూతంబుఁ బరిహరింపవలెను వాఁడు పాపంబగునని హేతుదృష్టాంతంబులు చూపి కృపద్రోణవిదురగాంగేయులం దోడుచేసికొని యాంబికేయు నొడంబఱిచి దుష్టద్యూతంబు సర్వప్రకారంబుల వారింతు * క॥ తలఁచి హితంబునఁ బథ్యముఁ । బలికినఁ జేకొననిధర్మబాహ్యుల నవివే । కుల

*కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానంబు చెప్పుట.*

నిగ్రహింతు మీకె । గ్గలుమత్సాన్నిధ్యమునగు నెయెయ్యెడలన్ * వ॥ ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బది నెలలు యుద్ధంబుచేసి వానివధియించుచుండి యక్కడ మసలితినది కారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధసన్నిధానుండనయితిననిన నదియెట్లని యుధిష్ఠిరుండడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుండిట్లని చెప్పె నీయజ్ఞంబున నగ్ర్యనిమిత్తంబున నసహిష్ణుండయిన శిశుపాలుండు నాచేత నిహతుండగుటవిని వానితమ్ముండు సాల్వుఁడను వాఁడు తద్వధప్రవర్తితక్రోధుఁడయి కామగమనంబయిన తనసౌంభకంబను నగరంబుతో సన్నద్ధుండయి వచ్చి ద్వారవతీపురంబు నవరోధించి * చ॥ ప్రతినరపాలకాలు శిశుపాలుఁ బలాధికుఁ జంపి దర్పసం । హితుఁడగుచున్న కృష్ణఖలుఁడెక్కడ నాతనిఁ బొని నేజయోన్నతి వెలయంగఁ జంపెద రణంబున నంచు నలంఘ్యవిక్రమో । గ్రిఘుఁడయి దానిచుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోన్ * క॥ మేలగుతత్పురిబాహ్యావని । శైలోద్యానములతాలసాలసరోహిం । తాలతమాలావలి నిర్మూలితముగఁ జేసెఁ దచ్చమూసామజముల్ * వ॥ మఱియు తృణజలధాన్యసమృద్ధంబయి శతఘ్నీప్రముఖానేకయంత్రంబుల నలంఘ్యపరిఘాప్రాకారంబులను నపారబలరక్షితఘనకవాటచతుర్గోపురంబులను బ్రహృష్టపుష్టవీరసుభటసంకులంబులను నపరిమితగజతురంగశతాంగంబులను బ్రదీప్తాలాతశాతశరచక్రతోమర పరశుపాశాంకుశకూటంబులను విహారదోర్యథవిశాలాట్టాలకంబులను బరులకసాధ్యంబయిన ద్వారవతి భేదింపనేరక దానివెలిం బ్రపాచైత్యదేవాయతనవల్మీకంబులు వర్జించి సముద్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు సేసి నిత్యంబు నుపద్రవంబు సేయుచున్న సౌంభకవిజృంభణము సహింపక సంరంభంబున సర్వాయుధసన్నద్ధులయి * క॥ ఉద్యద్బలులు గుమారులు । విద్యాధరసములు పురము వెలువడిరి రక్షై । కోద్యములు చారుదేష్ణుఁడుఁ । బ్రద్యుమ్నుఁడు సాంబుఁడును నివత్కజిఘాంసన్ * మణిభూషణము॥ రాముఁడు విక్రముఁడ జేయుఁడరాతినృపావలీ । సామజాహితుఁడు సాంబుఁడు సాళ్వచమూపతిన్ । క్షేమమూర్తియనువాని నకృత్రిమసాహసో । ద్దాముఁ దాఁకె శరధారల ధారుణిఁ గప్పుచున్ * క॥ జాంబవతీయుబృహద్విశిఖంబులకుం బెదర కెదిరి ఘనుఁడే సెరణా । గ్రంబున నాతనిపై నవి । లంబితుఁడై క్షేమమూర్తిలకుశరంబుల్ * వ॥ వానియేయు నేర్పు సహింపక సాంబుండు జాంబూనదపుంఖంబులయిన విశిఖంబులం దదీయరథాశ్వవర్గంబుల నేసిన నవిమర్మకుతవేదనలం దెరలి యతివేగంబున రణభూమి వెలువడ రథంబీడ్చుకొని సారథి వశ్యంబులుగాక వఱచె నట్లు సాల్వచమూపతి సమరవిముఖుండయిన * స్వాగతము॥ వేగవంతుఁడను వీరుఁడు సాంబున్ । వేగవంతుఁడయి వీకనెదిర్చెన్ । వేగబాణనదవీతతులన్ దిగ్భాగమెల్ల శరపంజరముల్గాన్ * గీ॥ సాంబుఁ బాయమునుచుఁ జారుదేష్ణుండల్లి । వేగవంతుదాఁకి వీఁకతోడ । వానిమస్తకంబు ద్రయ్యఁగ వడిఁగదం । బొడిచె రుధిరవారిపూర మొలుక * వ॥ ఇట్లు చారుదేష్ణునిష్ఠురగదాఘాతంబున వేగ

వంతుండు విగతజీవుండయి కులిశపాతభిన్నోన్నతగిరిశిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్లినం జూచి వివింధ్యుండను వా
న్యవిక్రముండయి * గీ॥ చారుదేష్ణుపైఁ గడువాఁడిశరము లేసె। నతఁడు గార్ముకహస్తుఁడై యాతనంబ। వాని పై
ట్రించి వహ్నిబాణ। మేసెను గ్రస్ఫులింగంబులెసఁగఁ జనల * క॥ అనలాస్త్రమిట్లు వఱుముఁ। గొనినవివింధ్యుండు
సుతలంబ వ్రద్ర। మునువానిఁ జూచి హాహా। స్వనములెసఁగ సాల్వసేన సంక్షోభించెన్ * వ॥ సాల్వుండు నిజసై
క్షోభంబుడిపి సర్వాయుధసనాథంబయిన రథంబెక్కి యాదవకుమారవాహినివయి నెత్తివచ్చుం బాడుచు
బలంబు నాయుధమయంబుగాఁ జేయుచున్న వానిం గలిగి * సీ॥ హంసవర్ణోత్తమహయములఁ బూన్చిన రథ మెక్కి
నరమ్యయష్టి। సంభృతమకరధ్వజంబొప్పబద్ధగోధాంగుళిత్రాణుఁడై యతులశౌత। సాయకావలిఁ జేసి సాల్వు
చు వానిమీఁదఁ బ్రద్యుమ్నుఁడమేయబాణ। వర్షంబు గురిసిన వాఁడును వానిపైఁ గడువాఁడిశరములఁ గడఁగి యేసె।
ధిక వీరులయిన యాయుద్ధఋషనస్త్ర। కోవిదులకుఁ బోరుఘోరమయ్యెఁ। దగ్ధభయము వొందఁ ద్వారకాపుర। సాం
లజనులు సంభ్రమింప * క॥ అనిమొనసాల్వుఁడు ప్రద్యు। మ్ననిశాతశరాలివిద్ధమర్ముఁడయి పెల్చన మూర్ఛ
డియోన్। దనరథముపయిన్ ధరిత్రి తల్లడపడఁగన్ * ఉ॥ అంతన మూర్ఛదేఱి కలుషానలదీప్తముఖుండు సౌంభ
కదండసాయకములైన శరంబుల రౌక్మిణేయు వి। క్రాంతిబలాఢ్యు నేయుడు నతండును మూర్ఛితుఁడయ్యె వానిసం। భ్రా
దదీయసారథియుఁ బాస్తరణాంతరుఁ జేసె జెచ్చెరన్ * వ॥ ఇట్లు మూర్ఛితుండయిన ప్రద్యుమ్నుం దోడ్కొని రణంబు
పారంబునం బోయి రథంబు నిలిపి దారుకసుతుండున్నంతఁ గొంతప్రొద్దునకు మూర్ఛదేఱి ప్రద్యుమ్నుండు సూతుని
యె * క॥ ఘోరాహవరంగమునకు। దూరముగా నన్ను నిటు దోడ్కొని తేరన్। దారుకనందన యుచితమె। వీరాగ్ర
సూచివేఱ చితి చెపుమా * వ॥ మఱియు సారథిఁ జూచి విహ్వలమానసుండయి యిట్లనియె * క॥ సమరవిముఖత్వ
ణ। విముఖులఁ జంపుట యుశరణు వేఁడినరక్షిం। పమియును యాదవవంశో। త్తములకుఁ గలనయినఁ గలవె దారుకతనయా డం
క॥ విక్రమమువిడిచి చనుగా। ప్రక్రాంతుఁడనయిన న్ను బలదేవుఁడును। జక్రధరసుతులు ననుజులు। నక్రూ రా
నేమియనిరగ రేసభన్ * వ॥ చెట్టచేసితింకనయినను సాంబచారుదేష్ణులున్న చోటికి సాల్వాభిముఖంబుగా రథ
అపుమనిన సారథి యిట్లనియె * క॥ రథికిమ్ముగాని యెడ సా। రథి కృతి మెయిఁగావవలయు రథియును దత్సా। రథిఁగా
యారథిసారథులు పరస్పరశరీరరక్షకులగుటన్ * గీ॥ సాల్వబాణపీతసంజ్ఞుఁడవయిన ని। న్నిటకుఁ దెచ్చితి నిసహా
లయి। వారథాశ్వములఘునస్యందనంబును। జూడుము చుసూతసూనుఁడపుడు * వ॥ సవ్యాపసవ్యవిక్రమసుండలా
నాక్షణంబ సాల్వునకు నప్రదక్షిణంబుగా రథంబు వఱపిన వాని సహింపక సాల్వుండు మూడమ్ముల సారథి నేసి
రాక్షసమాయ ననేకశరంబుల ప్రద్యుమ్నుపై నేసిన * క॥ అమ్మాయాశరములుభ। గ్నమ్ములుగాఁ జేసి తన్మ
నఁ దద్వి। క్షమ్మున నొక్కట బ్రహ్మా। స్త్రమ్మును బ్రద్యుమ్నుఁడేసె దారుణభంగిన్ * వ॥ అట్లు బ్రహ్మాస్త్రపీడితు
సాల్వుఁడు మూర్ఛవోయి రథంబుపయింబడిన వాని వెండియు నొక్క దివ్యబాణంబున నేయ సమకట్టిన నంతరిక్షం
హారవంబులెసఁగె నంత దేవగణప్రేరితులయిన నారదమారుతులు ప్రద్యుమ్నుపాలికి వచ్చి యిట్లనిరి * గీ॥ వీఁడు
వధ్యుండు గాఁడు మిన్న। కేయకుండుము వీని నారాయణుండు। మొనసి వధియించు ననివ లెక్క వనజగర్భుఁ। డనిన

---- * సాల్వుఁడు ప్రద్యుమ్నునిచే బాధితుండై మరలిపోవుట. * ----

మ్నుఁ డేయక యనఘుఁడుండె * వ॥ అంత సాల్వుండును నివృత్తుండయి ద్వారవతీనిరోధంబుడిగి తన సౌంభకం
క్రమ్మఱి చనియె నంత నీ యజ్ఞంబు నిర్వర్తితంబయిన నేనరిగి బలభగ్నపాద పవనంబులదాని విభగ్నద్వారదేశం
దాని నస్వాధ్యాయ స్వాహాకార మహీసురాగారంబైనదాని నపేతభూషణ యోషిజ్జనంబులదాని ద్వా
జూచి యాహుకాత్మజువలన నంత వృత్తాంతంబును విని సాల్వుఁ జంపి కాని యివ్వరంబు సొరననిశ్చయించి
ప్రమాదులయి రక్షించుకొని యుండుండని బలదేవాదులం బంచి యప్పుడ ప్రయాణభేరి సఱువం బంచి కృతస్వ
రచనులయిన పురోహితప్రముఖ బ్రాహ్మణవరులకు నమస్కరించి సైన్యసుగ్రీవ యుక్తంబైన రథం బెక్కి
పాంచజన్యరవముఁ బంచను ... । నాలసిజనుల దీవనలు

వ్యమై । గరుడకేతనంబు గ్రాలెఁ జదల ✽ వ ॥ అట్లసంఖ్యాతచతురంగసైన్యంబులతో సరిగిరివనసరోవర సరిద్దే
శంబులుగడచి మార్తికావతదేశంబున కరుగునంతకుమున్ద సాల్వుండు సౌంభకారూఢుండయి సముద్రకుక్షి దేశం
బునకుంబోయిన ✽ క ॥ ఏనును వానిపిఱుందన। మానక చనితచ్చమూసమాజముతోడన్। భూనాథ రణము చేసితి। నానాని
శితాస్త్రవర్షణవ్యాప్తముగన్ ✽ క ॥ వీరులగుసాల్వయోధుల। నారాచావళులు గప్పి నారథము వయిన్। సారథిమీఁదఁదు
రంగములఁ జారుధ్వజతతులఁ బయనసంఖ్యాతముగన్ ✽ వ ॥ తొరఁగినవానినెల్లనస్మదీయగోచరంబులుగాకుండ ననేకాయుత
శరంబులేసి సాల్వసైన్యంబుతో మహాయుద్ధంబు చేసిన ✽ మ ॥ అవనీనాథ తదాహవాంతరమునం దస్మత్కరాకృష్టశా
ర్ఙ్గవినిర్ముక్తనిశాతసాయకశతాగ్రచ్ఛిన్నమై దైత్యదా। నవదేహప్రకరంబు వాతకలుషార్ణవపూరసంఘూర్ణితా । ర్ణ
వకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్తశైలాకృతిన్ ✽ చ ॥ ఘనతరదైత్యదానవనికాయకళేబరసాతఘట్టనన్। దనరి
యుగాంత్యకాలచలితంబును బోలెఁ బయోధి మ్రోసెన। వ్వనధిరవంబు కంటెను నివారితమై చెలఁగెన్మదీయవా । హి
నిభటసింహనాదహయహేషితసింధురబృంహితధ్వనుల్ ✽ వ ॥ అట్టిమదీయసేనోత్సాహంబును నిజసేనాక్షీణత్వయుం
జూచి సహింపక సాల్వుఁడు వెండియు సౌంభకారూఢుండయి నాతో మాయాయుద్ధంబు సేయ సమకట్టి ✽ సీ ॥ పరశుపాశాం
కుశకరవాలశూలముద్గరములు నామీఁదఁ దెరలఁగురిసె । నస్త్రములెన్నియు నడరించి దానవుఁ బాయంగఁ జేసితి మాయఁ
జేసి। వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ బరుషశిలావృష్టిఁ గురిసె పరుస । నహరందమున్గప్రకాశములతోఁ దుర్గినసుదివసే
తోష్ణములుదియఁ జేసి। దితిసుతాధముండు శతసూర్యశతచంద్ర । శతసహస్రవిష్ణుతతులు వెలుఁగ । గగనతలము నేసెంబ
గలిది రేయి ది। యని యెఱుంగనయి తిసనములోన ✽ క ॥ మను జేంద్ర సర్వమాయా। పనోదనంబయిన యగ్నిబాణంబున న
సజ్జునినిర్మితమాయా। వినివర్తనుఁ జేసితి నినవిస్తగమతినై ✽ వ ॥ అట్టిసమయంబున ద్వారవతినుండి యాహుక ప్రేషితుం
డయి యొక్కరుండతిత్వరితగతింబఱతెంచి సాల్వుచేతనక్కడ వసుదేవుండు పట్టువడియెనీ వెవ్వనితోడం గయ్యంబు చే
సెదు క్రస్మ్మ! చనిపురంబురక్షించుకొను మనినవిని యదరిపడి మహాబలపరాక్రములయినబలదేవాలు రక్షించుకొని
యుండ వసుదేవుఁడేలపట్టువడు నిదిపోలదని సంశయించుచు విస్మయమనస్కుండనయితినట్లుండునంత ✽ సీ ॥ పుణ్యాక్షగ్నంబు
లుపోలిసిననుర్వ్యకు బ్రీతినే తెంచుయయాతివోలె । భూమణిదీప్తులువొలియఁగ వివృతకేశాంబకుండయి. సౌంభకంబువల
నఁ । బఱతెంచు వసుదేవుఁ బావనిశాచరబలపీక్ష్య మానుదవ్వులనకాంచి । యత్యంతమోహశోకాంధుండనయిననా హ
స్తంబువలనవిస్రస్తమయ్యె ✽ గీ ॥ శార్ఙ్గమప్రియావసన్నదేహుండనై । యడిగి రథముమీఁదఁ బడితినేను । దానిఁజూచి భ
యముడిగిలిన్మసైన్యంబు। తల్లడిల్లియులిసెఁ జెల్లురేఁగి ✽ వ ॥ అంతనెంతయుం బ్రబుద్ధునకుం దెలిసి సాల్వ సౌంభకంబున
వసుదేవుంగానక దానిమాయగా నెఱింగి పదంపడి మాయావియయిన సాల్వుంజూచి వానివయినలిగియేనేసిన నయ్యా
సురసౌంభకంబదృశ్యంబగుటయు ✽ క ॥ అసురులయాక్రోశధ్వను । లెసఁగెం బదిదిశలనంత నేనును దద్రా। త్ములఁగ
తాములఁ జేసితిఁ । బ్రసభంబున శబ్దభేదిబాణప్రతతిన్ ✽ వ ॥ అంతసాల్వుండును దనసౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జే
సి తానును మానవుండయి పర్వతవర్షంబు నాపయిం గురిసిన ✽ గీ ॥ పరుషనిషమభూరిపాషాణభీషణ । గిరులు వచ్చినన్ను
దెరలఁగప్ప। వజ్రబాణమేసి వానినన్నిఁటిని। బాచియున్న నన్నుఁ జూచియపుడు ✽ క ॥ దారుకుఁడిట్లనియెను మహా। వీరుని
పేక్షింపఁదగునె వీనిని మాయా। ప్రారంభునుపేక్షింపరు। పారగపరాక్రములుపోరఁ బ్రాకృతునయినన్ ✽ వ ॥ అనినవానివ
లుకులు విని యలిగి యనలజ్వాలాకరాళంబును బ్రతిహూలరాక్షసయక్షగంధర్వదైత్యదానవభస్మీకరణదారుణంబు
యినచక్రంబున భిన్నం త్రించ సౌంభకంబుపయి వైచిన నది యుగాంతకాలవరివేషభీషణంబయిన రవిమండలంబునుంబోలె
గగనంబునం బఱచి సౌంభకమధ్యంబునం బడిన ✽ చ ॥ తడయక ఘోరదగ్ధ ననుదర్శన పావకు చేదహింపఁగాఁ । బడివర
మేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభమై। యడరిధరిత్రిమీఁదఁ బడియెం జెడె సౌంభకమంత సాల్వుఁడున్ । బడియెను

## ✽ పాండవులు ద్వైతవనంబునకు వచ్చియుండుట. ✽

దీయచక్రపటుప్రహారయంబున రెండువ్రయ్యలై ✽ వ ॥ అనియిట్లు సాల్వుం దనచంపినవిధంబుచెప్పి చక్రధరుండు పాండ
వులపీడ్కొని సుభద్రాభిమన్యులం గాంచనరథంబెక్కించుకొని ద్వారవతికరిగె ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదులయిన

ద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదపురంబునకుం జనియె నిట్లు పాండవులును రథంబులెక్కి యాయుధంబులు ధరియించి
సేనాదిమూలభృత్యులిరువదుండ్రు ముందటరా ననేకసహస్ర బ్రాహ్మణవరులతో ద్వైతవనంబునకరిగి రంత ధర్మ
మ్ముల కిట్లనియె ॥ అక్కర ॥ ఇదిమహోగ్రాటవిసింహశరభఘోరగేంద్ర శార్దూల।మదగజాకీర్ణంబుదీనిలోన నేక
జీవలయా । నదియునుంగాక పరప్రయోగమాయలుగలవెఱిఁగి । మదినుండునదియన్నన న్నకిట్లను మఘవవందను
వ ॥ బ్రహ్మవిదులును బ్రాహ్మణులును వృద్ధులునయి యఖిలలోక ద్వారంబులన ప్రతిహతులయిన వారదద్వైపాయ
దిమునివరులునీచేతనుపాసితులయి నీకుశలంబకోరుచుండుదురు భవత్ప్రతాపం బెల్లవారికి రక్షణీయంబివ్వన
లకాలకుసుమఫలభరితవనస్పతి శాఖాశిఖారూఢమయూరకీరకోకిలాలాపమధురంబును బకబలాహకక్రౌంచకారండ
రసమధుకరసౌమ్యసరోవరనందనంబును ।విమలశీతలజలప్రవాహ నదీశోభితంబును మహర్షిగణసేవితంబును
దమనిలలితలతావితానాది రమణీయంబులయిన వృక్షమూలంబుల నేవురకు వేఱువేఱనివాసంబులు సేసి వియత్సా
యియిష్టదేవపితృకార్యంబులు సేయుచుండ నయ్యెడవచ్చిన మహామునులకు బ్రాహ్మణులకు మనఃప్రియంబుల
యాహారంబులువెట్టుచు ద్వైతవనంబుననుండునంత ॥ క ॥ పాండవులకడకుధర్మవి । దుండుతపోదహనదగ్ధదురితా
డుమార్కండేయుండనుమునినాథుండంతేవాసిగణముతోఁజనుదెంచెఁ ॥ వ ॥ ఇట్లువచ్చి వారలచేతనర్చితుండై
వనవాసక్లేశదుఃఖితులయిన పాండవులను ద్రౌపదిం జూచియమ్మునియిట్లనియె ॥ సీ॥ పితృనిదేశమ్మునఁ బృథివీశ్వరత్వం
డిడిసామజుండై పవిత్రచరిత। జానకిఁదోడ్కొనిచనివనంబుననున్న రఘుకులనందను రాముఁదొల్లి చూచితివిపుడుభూ
వంశపోషణుసాధుజనస్తుత్యసత్యధర్మ।నిత్యుధర్మజు రమణీయుఁగీర్తిప్రియుశమవంతుఁజూచితిసగరభరత ॥ గీ॥ నలయయా
తివైన్యనాభాగులాదిగ । వాదిరాజులెల్లనధికధర్మ । సత్యయుక్తిఁ జేసిసకలలోకంబులు।వడసిభాగధేయభాగులయి
వ॥ పాపసౌబలప్రయుక్తుండయిన ధార్తరాష్ట్రునట్లు ధర్మువుదప్పినవారెవ్వరులేరు మీరుధర్మనిత్యులరు సత్యప్రతి
గావున మీకిష్టసిద్ధియగునని మార్కండేయుండరిగిన నవరసంధ్యోపాసనాసీనుండయిన ధర్మరాజును సాయంహో
మార్థప్రజ్వలిత జ్వలనంబులయిన యనేక సహస్ర బ్రాహ్మణాగ్నిహోత్రంబులఁజూచి బకదాల్భ్యుండనుమహా
నియిట్లనియె ॥ ఉ॥ భూమిసురోత్తముల్ప్రకృతిపుణ్యవిధాయులువీరు ఋగ్యజుః । స్సామవరాయణుల్పరమసాధు
త్రులుమీకుసంతత । ప్రేమమునర్థశుభోన్నతులు పెంచుచునుండుటఁ జేసిసద్గుణో । ద్దామమగబ్యావాసమిదితద్దయు
ప్పెకుమాకుఁజూడఁగ ॥ వ ॥ బ్రాహ్మణానుగ్రహంబునఁ జేసితొల్లి వైరోచనాములనేక కాలంబులక్షయలక్ష్మీవిభూ
యుసముద్రనేమిభూచక్రంబు లభించిరియనిలసహాయుండయిన యగ్నిదేవుం డరణ్యంబుదహించినట్లు బ్రాహ్మణస
యుండయినమహీశుండుశత్రువర్గంబు నిశ్శేషంబు సేయువినీతుండయి విప్రులచేత ననుశాసితుండయిన రాజునకు శ్రీ
తుష్టయంబుసంపన్నంబగు బ్రాహ్మణరహితుండయి ధర్మహీనుండయిన రాజును బ్రజవలనను ప్రజానురాగంబు లే
నికిరాజ్యంబుసుస్థిరంబుగా నేరదుమీరు బ్రాహ్మణప్రియులరు ధర్మనిత్యులరెవ్వరికిను మీకభ్యుదయంబగునని సబహు
ల్భ్యునమ్మునులెల్లంబూజించిరంతఁ బాండవులుం దమయిష్టంబుననుండి దుఃఖోపశమనంబులయిన కథలు సెప్పు

## ద్రౌపదీధర్మరాజులసంవాదము.

న్నయవసరంబున ద్రౌపదిధర్మరాజునకిట్లనియె ॥ గీ॥ వృద్ధుకొడుకుపలుకువిని క్రూరుఁడయిపాప । బుద్ధిఁ జేసిమిమ్ము
తలంబు।వెలువరించి రాజ్యవిభవంబుగొనియావ్వ।డలుక చెడిసుఖితుఁడయ్యెనొక్కొ ॥ గీ॥ ఆసురాత్మహృదయమున
గనాయస। నిష్ఠురంబుధర్మనిధులమిమ్ము । నట్లుగొడుకులెగ్గులాడంగఁబోయిన।వలవదనఁడు కలహవాంఛఁ జేసి ॥ సీ
మలహర్మ్యంబులవిహరించువారలఁ బ్రియమహాస్థానశయనరతులఁ । జందనాగురులిప్తచారుసర్వాంగులనతి
థసేవితులమిమ్ము। వనమునగ్రుమ్మరువారిఁగాఁగుశబృసీశయనాభిరతులఁగానియతరూక్ష । భూరేణుధూసరితా
గ్రహులనుద్ధతవన్యమృగనిషేవితులఁగాఁగ - గీ॥ నిట్లుచూచిచూచియే నెట్లుచిత్తోప।శాంతిసేయుదానసకలభోగ। విప
విరతిఁ జేసివిధియనుధృతరాష్ట్రు।నట్లుమీకునహితుఁడయ్యెనొక్కొ ॥ క॥ భవదాజ్ఞానిగళంబునఁ।దవిలివరాక్రమ
డిచిధరణీశ్వరనీ।యవరజులిద్దఱ [illegible] లభంగిఁ ॥ గీ॥ వరనరేంద్రమకుట

గద్యుతి।నరుణమ సుభవత్పదాబ్జయుగము। పరుషధాతుశిలలవయినిప్పుడరుగుట।నరుణమయ్యెఁబర్వతాంతరముల * క॥
అనవరతసౌఖ్యసంపదఁ। బెనుపొందుమనుండుమీకుభీకరకాంతా। రనివాసాయాసంబుల।నసఘూఁబ్బొఁగినవయనల
మటవ్రేడమేఁ * వ॥ నిత్యంబునెంబదివేవురు బ్రాహ్మణులకుంబసిండితళిగెలవిష్టాన్నంబులు వెట్టినంగుడిచిత్రవృత్తులయి
నందద్భక్ష్యశేషంబుపయోగించుచున్నమీకు వన్యఫలాశనంబు లుపయోగించుచు వన్యాలయంబుఁ గ్రోధంబువిడిచి
యునికియుచితంబుగాదు * సీ॥ పదివేలగజములబలమునవిలసిల్లునవిలసుతుండుగాఁ అడవిలోనఁ।గ్రుస్మికాయలుగూరలు
దివిపేదవడినఁజూచియుదీర్ఘబాహుయుగళుఁ। డయ్యును బాహుసహస్రంబుగలిగినయర్జునుకంటెబలాఢ్యుండగుచు।న
రయువేగమున నేనమ్ములనొక్కయమ్మేసినవిధమున నేయనేర్చు * గీ॥నర్జునుండు వనమృగావలిగలిసియిట్లుండఁజూచియు
నసుఖోచితాత్ములయినకవలు దీనులయియుండఁజూచియు। నుపశమంబుఁదాల్చియుండఁదగునె * వ॥ క్షమయును దేజం
బునునయ్యైకాలంబులఁ బ్రయోగింపనిరాజున సంప్రజాపు రాగత్రాపంబులు లేవనునీయర్థంబికి యిహాసంబునవివం
బడుక్షమా తేజంబులలోన నెయ్యదివిశేషంబుదానినచేసెదంజెప్పుమని బలీంద్రుండు తొల్లి తనపితామహుండయిన
ప్రహ్లాదునడిగిననాతండుబలీంద్రునకిట్లనియె * గీ॥ క్షమయతాల్చియుండ జనదెల్లప్రొద్దుతే। జంబుతాల్చియుండఁజన
దుపతికి।సంతతక్షముండుసంతతతేజుండు।నగుటదోషమందురనఘమతులు * వ॥ అదియెట్లనినిత్యక్షమాన్వితుండయి
నవానికిభృత్యులువెఱవక యవమానంబుసేయుదు రర్థంబులయందధికృతులైనవారలు ధనంబులపహరించదర్పంబు
నూపుదురు మఱినిత్యతేజోధికుండైన వాఁడతిక్రూరదండంబున సర్వజనసంతాపంబు సేయుచు గృహాగతంబైన సర
ర్పంబునుంబోలె నెవ్వరికినుద్వేగకరుండగుంగావునం గాలోచితంబులుగా క్షమాతేజంబులు గల్పించునదియథాకా
లకల్పితక్షమాతేజుండైన వానికినుభయలోకసిద్ధియగునని బలీంద్రప్రహ్లాదసంవాదంబుచెప్పి వెండియుద్రౌపదియి
ట్లనియె * గీ॥ అరయనపకారమొకఁడైననదియునల్ప। మైనక్షమియించునదికాకయపలయకెపుడుఁ।జేనసియపరాధ
ములుపెక్కు-సేయుచున్న। పాపకౌరవ్యులకుసహింపంగనేల * క॥ ఇదితేజంబునకవసర।ముదితక్రోధుండవగుమయొ
క్కించుకదు।ర్మదులగుసుయోధనాదుల। నదయులవధియింతురుగ్రులయనీతమ్ముల్ ॥అనినధర్మరాజిట్లనియె * సీ॥ క్రో
ధంబుపాపంబుక్రోధంబునవచ్చేసియగుఁజువ్వేధర్మకామార్థహాని। కడుఁగ్రోధికగ్జంబుగానంత క్రుద్ధుండుగురునైన
నిందించుఁ గ్రుద్ధుండైన। వాఁడనర్థ్యులనైనవధియించుమఱియాత్మఘాతంబు సేయఁగగఁడగుఁ గ్రుద్ధుఁ। డస్మాదృ
శులకుధర్మానుబంధులకిట్టిక్రోధంబుదాల్చుటగుణమెచెపుమ * గీ॥మెఱుఁగకలమహాత్ముఁడెఱుకయనల్పములనాల్పుఁ గ్రో
ధమనుమహానలంబుఁ। గ్రోధవర్జితుండు గురుకోపితేజంబు। దాల్చుదేశకాలతత్త్వమెఱిఁగి * క॥ క్షమగలవానికిఁబృ
థ్వి। సమునకునిత్యంబువిజయసంసిద్ధియగుఁగా। క్షమియైనవానిభుజవి।క్రమముకడున్వేలయునసర్వకార్యక్షమమై * వ॥
తేజఃప్రభవంబులయినయమర్షదాక్షిణ్యశౌర్యశీఘ్రత్వంబులను నాలుగుగుణంబులుక్షమావంతునందవీర్యవంతంబుల
గుఁదొల్లికశ్యపగీతలైనగాథలయందీయర్థంబువినంబడువినుము వేదంబులు యజ్ఞంబులుశౌచంబులు సత్యంబులు విద్య
యుధర్మువు సచరాచరంబయిన జగమంతయు క్షమయందనిలిచినవి తపస్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు బ్రహ్మవిదుల
యుంబడయునుపుణ్యగతులుక్షమావంతులు పడయుదురదియునుంగాకకృష్ణద్వైపాయన భీష్మవిదురకృపద్రోణసంజ
యప్రభృతులు నాయొపకసంబకీర్తింతురుపశమహీనుఁడయినదుర్యోధను కారణంబునధార్తరాష్ట్రులకెల్లంబ్రళయం
బగుననిన ద్రౌపదివెండియునిట్లనియె * అక్కర॥ క్షమయందచిత్తంబునిల్పినిర్గతకల్మషబుద్ధిఁ। గ్రమమునధర్మువునందవ
ర్తిల్లుకరుణాత్మునిన్ను। నమరధర్మంబురక్షించుఁ బ్రీతితోనరిశత్రులందు। ననుబుద్ధిసల్పంగఁజను నెనీకునజాతశత్రుం
డ * గీ॥ ధర్మదూరులయినధార్తరాష్ట్రులయందు।ధర్మవేమిసేయధరణినాథ।నికృతిపరులయందునికృతిసేయనివా
రు। వారినికృతిఁచేసివంధ్యులౌదురు * క॥ ఆర్యులకువిహీనతయును। వార్యులకున్నతియుఁజేసియవినీతుఁడవై।కార్యముద
ప్పితినీకున। నార్యులుచటము లెయార్యులరులెపధాతా * వ॥ అనివిధాతృనిధర్మువునాక్షేపించుచున్నద్రౌపదిఁజూచి
ధర్మరాజిట్లనియెనాస్తికులట్లుధర్మసంశీలినివై దైవంబునుదూషణంబు సేసెదు శిష్టసేవితంబయినధర్మంబునతిక్రమించు
చున్నదుర్మతికిం బ్రాయశ్చిత్తంబులేదు ధర్మువుదప్పకనిత్యులయి జీవించుచున్న మైత్రేయమార్కండేయ వ్యాసవసి

ష్ఠనారదప్రభృతులఁ బరమయోగధరులఁ బ్రత్యక్షంబచూచెదము వీరెల్లనన్నుధర్మపరుండనిమన్నింతు రన్యులన్యా
బు సేసిరేఁ యే నేలధర్ము పుదప్పుదు * క ॥ ధీరమతియాశ్రిఁ జేసిభీచారింపఁగనిక్కువఁ బుసర్వజనస్వ । గ్గారోహణ
నం । బారఁగధర్మంబచూ వెయంబుజ నేత్రా * వ ॥ తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యదానయజ్ఞంబులనుపుణ్యకర్మ
క్షఫలంబు లేదను నేనివీని నెల్లదేవర్షిగంధర్వగణంబులేల సేవింతురు నీజన్మంబు ధృష్టద్యుమ్ను జన్మంబును
ఫలసద్భావంబునకు నిదర్శనంబులుగా వెనుతీ పుణ్యఫలంబులుగలయట్లపాపఫలంబులునుగలవు తొల్లిబ్రహ్మ
లకుఁ గర్మఫలసద్భావంబు సెప్పెనందున గశ్యపుండుధర్మప్రబుద్ధుండయ్యె విధాతృనియోగంబునం బుణ్యపాప
లు ప్రాప్తంబులగు విధాతృననుగ్రహంబున నిగాదె పుణ్యకర్మంబులం బ్రవర్తిల్లిను ద్రుత్యలమర్త్యత్వంబునుబొందు
నవిని ద్రౌపదియిట్లనియె * గీ ॥ కర్మఫలములందుఁ గర్మఫలాప్తికి । గారణంబువిధియఁ గాదనంగ । నంతయెఱుక లేని
ర్తనై విధి చేత । నలసి పలికితిం బ్రియంబుదక్క * గీ ॥ వేదశాస్త్రములును విధివిధానములును । నప్రమాణమనుచు
పలకఁ బుణ్యగతులు లేమిభూనాధయెఱుఁగవి । దానఁగానుధర్మతత్త్వయుక్తి * వ ॥ తొలినీతిమంతులయిన బ్రాహ్మ
లుమదీయ జనకునకుం జెప్పంగవింటి నెఱుకగల వారికిం గర్మంబు గర్తవ్యంబు గర్మరహితులయి స్థావరంబులయట్ల
లుజీవింప నేర రల్పఫలంబయినను గర్మంబు ప్రవర్తించుచున్న వారిం జూచెదము దైవమానుషంబులు గర్మఫలప్రా
నిమిత్తంబులు పురుషుండు మనంబున నర్థసిద్ధియగునని నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయునట్ట
నికి దైవంబు సహాయంబు యిక్కర్మసిద్ధి గావించు * అక్కర ॥ తిలలందుఁ దైలంబు గావ్యములయందుఁ దరముగానగ్ని । గల
పెట్టింగియు పాయపూర్వముగఁ గడఁగితత్సిద్ధి । యలయక యుత్సాహవంతుఁడు పడయునట్లను త్సాహి । యొలసి దైవ
డయిపడయంగనునోపు నెయ్యెందు * అక్కర ॥ కడునిమ్ము గాదున్న బీజములు చల్లి కర్షకుఁడున్న । దడయక వర్ష
రిసి కావించుఁ దత్ఫలసిద్ధి । నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపనినాఁ డేమి చేయుఁ । గడఁగి చేయంగలదాని జేయును గాక
డు * వ ॥ కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబులయిననుం బురుషోత్సాహసముపార్జితములయినన విను స్థిరంబులయి
తంబులయి వర్తిల్లును నీవు మానుండియు దైవపరుండయినవాఁడవు నీరిలోనయానపాత్రంబునుం బోలె నవసన్నుండ
గావునఁ గర్మఫలసిద్ధినిశ్చయించి యుత్సాహవంతుండవయి నీయనుజులవిక్రమబలంబునం బరులజయించి మనయందలి

## భీమసేనధర్మరాజులసంవాదము.

కృశత్వంబవనయింపుమనిన యాజ్ఞసేని వచనంబులకనుగుణంబుగా భీమసేనుండు ధర్మరాజునకిట్లనియె * మ ॥ పితృపైతామ
మహమైన రాజ్యము రిని ర్భేద్యంబుగా డీవిచే । నతిగుప్తంబు బలారికైనను నవార్యంబట్టిదానిన్ సుదు ॥ ర్మతి నవ్యా
సినీకుఁ జనునేమ త్రైశయ గ్రాటవిన్ । వ్రతములు ల్పుచు ధర్మ లేశ భరణవ్యాసక్తి నిట్లుండఁగన్ * క ॥ ఆమిషమునఁ
ముల చే । గోమాయువు గొన్నయట్లు గువలయరాజ్య । శ్రీ మన చేఁ గొని కౌరవుఁ । డేమితలఁచునొకొ కుబుద్ధినిష్ట
నున్ * క ॥ దుర్మతులను దుర్జనులను । ధర్మస్థితినోర్వఁ దగునె ధరణీశ్వర దుష్కర్మలగు ధార్తరాష్ట్రుల । పేర్మియడ
గడఁగు వృథుభుజశక్తిన్ * వ ॥ ధర్మకామార్థప్రభావంబులను సర్వార్థసాధనంబులైన యర్థంబులు విడిచి మిత్రులకప్రి
బును మిత్రులకు హర్షంబునుం గాము నివృత్తిఁ జేకొని ధర్మువునందు బుద్ధి నిలిపి దుర్బలునట్లుని ర్వేదించవందను నె * గీ ॥
బలము నెఱపి వరుల సంపదలు చే । కొనఁగలావు లేనిక్షత్రియుండు । నియతదుఃఖవృత్తి నిర్వేదపరుఁ డగుఁ । గాక నీకుఁ దగునె
వేంద్ర * చ ॥ నరనుత నీయనుజ్ఞఁ గొని నాఁడు విరోధుల నెల్లఁ బోరిలో । సరభసవృత్తిమైఁ గడఁగఁ జంపితి మేని మ
నవాం । తరములనుండ కుండ నతిదారుణదుర్మృగసంగమంబులం । బొరయక యుండఁ గాము నకుఁ బోలునమందమనఃప్రి
బుగన్ * క ॥ సమయాతిక్రమభీతిని । తమయుక్తులమైన నలఁ గౌరవులు వగా । క్రమహీనులఁ గావగత్తురు । సమరోత్సా
బు విడిచి జడమతి నున్నన్ * గీ ॥ తగిలి నిత్యంబు నేకాంతధర్మశీలుఁ । డగుటయుక్తమె పురుషునకట్టి వాని । వేలయధర్మ
బులు విడుచుఁ బ్రాణ । విగతు సుఖదుఃఖములు రెండు విడుచునట్లు * సీ ॥ ధర్మకామంబులు దలగంగన గ్గార్థియగువా
తితుఁ డైయర్థ పేవ । నర్థాగముఁ జేయ నతఁడు గ్రవనములో గోరక సేయునక్కుమతిఁ బోలు । నర్థధర్మములకు
కాఁగమార్థి యగునాతఁడల్పజలాశయమునఁ జలచరంబట్టుల జలములతోఁ జెడునట్లు కామంబు చేసి హాసఁ బొందు * గీ ॥

ధర్మములు మహాబ్ధి మేఘములట్టు। లుభయమును బరస్పరోదయమ్ము। లిట్లుగాఁ ద్రివర్గ మెఱిఁగి సేవ్యమున సే। వించువాఁ
డు సర్వవిత్తముండు * వ॥ భవదాచరితంబైన యీధర్మం బర్థకామంబులకుఁ గాదు నీకును నీబాంధవులకును బాధాకరం
బుగాన యజ్ఞసత్త్వాజలు గావింప నర్థహీనునకశక్యంబు జగంబులు ధర్మమయంబులు ధర్మువునకు మిక్కిలి యొండెద్ది
యు లేదైనను నర్థార్థంబుగాని ధర్మువు క్షత్రియులకు యుక్తంబు ౦ ఉ॥ శత్రులవాజి నోర్చుటయు సర్వభయంబులఁ బాం
దకుండఁగా। ధాత్రి పరిగ్రహించి యుచితస్థితిఁ గాంచుటయుం బ్రియంబుతోఁ। బాత్రులకర్థ మీఁగియును బ్రాహ్మణపూ
జయుఁ జువ్వె యుత్తమ। క్షత్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్ * వ॥ కేవలధర్మాచరణంబు
శత్రుజయంబునకు సాధనంబుగాదు నికృతిపరులందు నికృతి చేయవలయుఁ బూర్వభ్రాతలైన యసురుల నమరులు నికృతి
నకాదె నిర్జించిరి కావున నీవు సమయధర్మరక్షణంబుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము * క॥ జయశీలివైన నీకుం
బ్రియమున నరిం నంగను న్నపృథుయశులు సదా। శ్రయులగు దురుసృంజయకే। కయయదుపాంచాలురాదిగాఁ గలసుహృ
దుల్ గీ॥ మిత్రసంపన్నుఁడైన నమిత్రబలము। బలముతోడ భేదించు దోర్బలముఁ జలముఁ। గలిగి దేశబలంబును గాలబ
లము గలుగువానికసాధ్యంబు గలదె యెందు * గీ॥ బలముగలవానిఁ బలువురు బలవిహీను। లొక్కటై మూఁగి నిర్జింతు రుత్స
హించి। మధువుఁ గొన ననుస్సహించిన మనుజుఁ బట్టి। కుట్టి నిర్జించు మధుకరకులమునట్లు * వ॥ శూద్రాన్నంబునందలి దు
గ్ధంబులుంబోలె దుర్యోధను రాజ్యంబు దూషితంబగుటఁ బౌరజన బ్రాహ్మణవరులు నీకనురక్తులయి భవద్రాజ్యంబు నలసి
యుండుదురు దీని కేల యెడ సేసెదు సర్వాయుధసన్నద్ధంబైన రథంబెక్కి గజపురంబునకభిముఖుండవై విజయప్రయా
ణంబు సేయుము * మ॥ ప్రణుతక్షాత్రగుణంబు విక్రమము దర్పంబేర్పడఁగా విక్రమ। తృణదానంబొనరింపు మీతృణమవి
ఖ్యాతంబుగా సంగరాం। గణమధ్యంబునఁ జేయుమర్జునబృహద్గాండీవముక్తోగ్రమా। ర్గణధారావళిధార్తరాష్ట్ర
కదళీకాంతారవిచ్ఛేదసమర్థ * క॥ బహుఘోటసుభటహస్తిక। సహితులు బలవంతులని విచారింపకు నీ। యహితులు మ
ద్బాహుగదా। నిహతికి మారొడ్డనఁగఁ బోరనిలువంగలరే। ౦ క॥ అరివరుల గెల్చి సాగర। పరివృతభూచక్రమెల్లఁ బాలింపు
ప్రజా। పరిపాలనంబుకంటెను। ధరణీశవిశేషమొండు ధర్మువు గలదే * వ॥ రాజ్యపదస్థుండైన క్షత్రియుండు భూరిదక్షి
ణంబులైన యజ్ఞంబుల దేవబ్రాహ్మణులకుఁ దృప్తిఁ జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులిచ్చి దురితంబులం బాసి తమో
విముక్తుండైన చంద్రుండునుంబోలె వెలుంగునని న భీమసేనునకు ధర్మరాజిట్లనియె ౦ ఉ॥ నీవచనంబు ధర్మము విపీత
ము నీతియుతంబభీష్టసి। ద్ధ్యావహమత్యుదారమిది యైనను నీవుదలంపఁగా విచా। రావపరోక్తికిన్ విషయమైనది కార్యఫలం
బులెల్ల స। ద్భావమునన్ విచారసులభంబులయిం ద్రు విచారపారసుల్ ౦ క॥ వనమునఁ బండ్రెండేండ్లును। జనపదమున నె
ఱుఁగకుండ సరి నొక వర్షం। బును సలుపఁ బూని సత్యము। దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగవృద్ధసభన్ * చ॥ అలఘుగుణంబులంద
ధికుఁడైన మహాత్ముఁడు రాగకోపమా। యలఁబడి యక్షమావివశుఁడై యచిరాంశులతావిలాసచం। చలమగు లక్ష్మికాస
పడి సత్యము ధర్మము దప్పె సత్సభా। వలిఁ దగువారి యొద్దఁ దగువాఁడయి సజ్జనుఁడుండ నేర్చునే * వ॥ ఏనెట్లును సత్యసమ
యంబతిక్రమింపనోప శుభోదయకాలంబుఁ బ్రతీక్షించియుండుము రాజ్యంబును బుత్రులును ధనంబును యశంబును స
త్యంబునకు సమంబులుగావనిన భీమసేనుండిట్లనియె * గీ॥ అంతకుండు జనులకాసన్నుఁడైయుండ। నిమిషమాత్రమేని వి
శ్వసింపఁబడగ జీవనంబదద్దనుస్థిరముగాఁ। జేసి కార్యమెడయఁ జేయఁదగునె * వ॥ శరీరికి మరణంబు నియతంబు మర
ణంబునకు ముందర వైరంబు దీర్పనివాని జన్మంబు నిరర్థకంబు సకలరాజసమక్షంబునం బరులచేత నట్లు మానపడిన పరిభవం
బునకుఁ బ్రతీకారంబు సేయనంతకు రేయునుం బగలును నాహృదయంబు దప్పించుచున్నయది నాకంటె నర్జుననకులస
హదేవులుఁ గుంతీదేవియు నత్యంతసంతాపంబున నెంతయు నంతప్తులగుచున్నవారు * క॥ వీరలదుఃఖము దీర్పక। క్రూ
రనికారులగు రిపుల దునుమదము గను। గ్రారణ్యములో ధర్మువు। గారుణ్యముఁ దాల్చియునికి కార్యమె నీకున్ * వ॥ ఇది బ్రా
హ్మ్యధర్మంబుగాని క్షత్రియధర్మంబుగాదు మనుప్రణీతంబులైన రాజధర్మంబులు నీ యెఱుంగనియవి లేవు శత్రుసంహా
రనిరసనంబున నత్యంతహానియగు నట్లుంగాక * గీ॥ వనమునందుఁ బండ్రెండు సంవత్సరంబు। లుండ నేర్చితి మేమియు నొరు
లెఱుంగకుండ నజ్ఞాతచర్యయందొక్కదివస। మైన నుండంగ నేర మెట్లనిన వినుము * వ॥ ఆబాలవృద్ధప్రసిద్ధుండవైన పార్థి

వస్తువ్యంజకమై నదిన్నను సింహసంహననులైన నీతమ్ములను నెఱుంగనివారు లేరు మనగూఢభావంబు మేదుర్యో
ధనునకుం బోలెనఘుట మానంబిట్లనివ్వనవాన క్లేశంబెన్నంటికిని మనకుఁ బాయ నేరదు వినుమిప్పుడివ్వనమునఁ బన్నె
ండు మాసంబులు సలిపితిమి సంవత్సర ప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యెంతయుం గలయదియ దీనధర్మనిరో
ధము విజయారంభంబునకిదియవసరంబనిన భీమసేనుపలుకులు విని నిశ్శ్వాసన్యాకులితముఖుండై పెద్దయుం బ్రొద్దుదన
భీమసేనునకు ధర్మరాజిట్లనియె * క॥ క్రమమునఁ బాండిత్యవరా। క్రమగర్వములం దుఁగడు ప్రగల్భుండవు । ధ్యస
ప్పినయదిగా ।..ర్యమయమున సుధీరబుద్ధివై వినుమనఘా * వ॥ అల్పోపాయంబైన కార్యంబు సాహసారబ్ధంబైన
షంబు లేదిదిన మహాకార్యంబు సాహసక్రియాసాధ్యంబుగాదు సువిచారితంబై సిద్ధింబొందు విచారపూర్వారబ్ధ
బునకు దైవంబును ననుకూలంబగుం గావున నిమ్మాగా విచారింపవలయు * సీ॥ శూరులు ధృతరాష్ట్రసుతులు సు
నామలు మరాధర్షులెందులను మనకు । వాతతాయులు మఱియంగభూపభుఁడును భూరిశ్రవుఁడు మద్రభూమిప
వాదిగాఁగలవీరులవిజేయవిక్రములు లోలసితత్సుహృదులైయున్నవారు । మనచేత జితులైన మనుజేశులెల్ల సుజనిష్ఠ
ధనుచేత సత్కారింపఁ । బడి కడంగి వానిప్రస్తవంబున నాజి । వేచి ప్రాణముల సువిడువనున్న । వారు వారలెల్ల సుధ
ద్ధులు వినఁగన స్త్రశస్త్రవిద్యలందు * క॥ వినవయ్య కర్ణుగర్వం । బని వాతఁడ భేద్యకవచుఁడగుటయు విలునే । ర్పు
తనిబాహువిక్రము । మును దలఁచిన వాఁడు కన్న మొగుడదు నాకుఁ * వ॥ మఱియు భీష్మద్రోణకృపాచార్యులును
య్యానువారిమొద్దన యున్నవారు వారలపారదివ్యాస్త్రవిశారదులు వారల నోర్చికాని దుర్యోధను గెలిపంగ

✻కృష్ణద్వైపాయనుండు ధర్మరాజునొద్దకు వచ్చుట,✻

దని విచారించుచున్నంత * క॥ వారలపుణ్యోదయమున । వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెన్ । బారాశర్యు
ధర్మశ । రీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్ * వ॥ ఇట్లు వచ్చి పరమభక్తిపరులైన పాండవులచేతం బూజితుండై కృష్ణ
ద్వైపాయనుండు ధర్మరాజునకిట్లనియె * క॥ వీరులగు భీష్మకుంభజ । శారద్వతకర్ణులమితసత్త్వులు వారిన్ । బో
ధియించు టెంతయు । భారంబని యున్న నీదుభయ మెఱిఁగి మదిన్ * గీ॥ దానినపనయింపఁగా నేనువచ్చితి । నధికయో
మతిరహస్య । మిగాని శేనవిద్య సేవింపఁగాఁ బాధ్యుఁ । బనువు మితఁడు దీనఁ బడయు సిద్ధి * వ॥ అని ధర్మతనయు నేకాంతప్ర
దేశంబునకుం దోడ్కొనిచని సత్యవతీసుతుండు విధిదృష్టవిధానంబునం బ్రతిస్మృతియను విద్యనుపదేశించి దీనిశక్తి నర్జును
కతపోవీర్యవిభవుండై యింద్రయమవరుణకుబేరాదులైన దేవతలను నీశ్వరుని బ్రత్యక్షంబు సేసికొని వారలవలన ది
వ్యాస్త్రలాభంబు వడసి శత్రువుల జయించు మఱియివ్వనంబు భవత్ప్రగనివాసంబునం జేసి విరళఫలకుసుమపాదపంబై మృ
గకులోపరోధియై యొప్పకున్నయది యొక్కచోటన పెద్దకాలంబునికియెవ్వరికిం బ్రీతిజనకంబుగాదు కావున నెం
బునకరుగునది యని చెప్పి మునివరుండు పోయినం దద్వాక్యముదితులై ద్వైతవనంబు వాసి పాండవులు బ్రాహ్మణ
తోన కామ్యకవనంబునకరిగి సరస్వతీతీరంబునం దునివాసంబు సేసి కొండొక కాలంబుండి యొక్కనాఁడ జాతశత్రు
గ్జుండుం జూచి యిట్లనియె * క॥ పాథితశాత్రవులగు భీష్మాదులయందధిగతాశ్రయంబయ్యెఁ జతుర్థ । పాదంబగుచు
ను । ర్వేదము బ్రాహ్మణులయందు వేదముఁ బోలెన్ * వ॥ మహనీయంబై దివ్యమంత్రకలితంబై వారలకు సన్ని
బగుఁ గావున * క॥ వారలు దుర్యోధనుచే । నారాధితులిష్టసత్క్రియలు సల్పరణ । ప్రారంభమయిన నెదిరెదు । రా
రాక్రాంతులై యవశ్యము మనతోన్ * వ॥ దివ్యాస్త్రవిదులైన వీరుల నోర్చునట్టి యుపాయంబు కృష్ణద్వైపాయ
నుండు ప్రసాదించి చెప్పె నీవిద్య నీవు పరిగ్రహించి కవచకార్ముక ప్రాసఖడ్గధరుండవై యన్యులకు జేయుండవై యు
దీప్తవరిగితపోయోగబలంబున నింద్రుఁ బ్రత్యక్షంబు చేయుము తొల్లి వృత్రునకు వెఱచి వేల్పులు తమయాయు
లుబలంబు నునింద్రునందు సమర్పించి రవియెల్లనీకుఁ దత్ప్రసాదంబున నగు మఱియింద్రునుపదేశంబున నీశ్వరునారా
ధితదను గ్రహంబున నిష్టసిద్ధి వడయుమిది వేదవ్యాసునుపదేశంబని * క॥ ధృతివియమవ్రతునకు దీ । క్షితునకుఁ బార్థు
నకతకిల్బిషునకు ధర్మతనూజుఁడు ప్రీతిఁ బ్రతి । స్మృతి నుపదేశించెఁ దానమిత్రగీష్మ * వ॥ అర్జునుండును నయో
ధ్యాగ్రహణప్రభావంబున న... ...వ్యాస్త్రలాభార్థంబుగా నగ్రజుచేత ననుజ్ఞాతుండై

హోమాపతర్పితవీతిహోత్రుండును బ్రాహ్మణకృతస్వస్త్యయనుండును నై ధౌమ్యాదిమహీసురవరులను భ్రాతృవరులను వీడ్కొని తపంబునకరుగ సమకట్టిన. సీ॥ ఆతని గాండీవహస్తునక్షయబాణతూణీరయుగళును తుంగభుజునిఁ గనకవర్మావృతఘనతరతనుఁ జూచి పొంగియంతర్హితభూతములును। బ్రాహ్మణప్రవరులుఁ బార్థునిమనమునఁ దలఁచిన యర్థంబు దడయక సిద్ధి। సంసిద్ధియగుఁగాత సకలవిఘ్నములును శాంతిఁబొందెడు మని సంతసమునఁ - గీ॥ బలికి రంతఁ దరుణి పాంచాలి బీభత్సు। కడకునరుగుదెంచి కమలనేత్ర। యరిజయార్థమరుగు వాతనియుత్సాహ। మెఱిఁగి యిట్టులనియె నిందువదన. క॥ అవమానసహము గానీ। యవమక్షత్త్రియకులంబునందిం బుట్టువు గాకుండెడు మత్ప్రసూ। మవు బ్రాహ్మణకులమునందయ్యెడునా కుఱా ✻ చ॥ అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱా। గరుణ సముద్ధరింపుము జగన్నుతయన్యులు పూనఁగావియో। భరము వహింపఁబూని యపారసుశాసితుని మ్మదక్షుకలుఁడా। ధరణి యుసోముఁడున్నభము ధాత్రియు గాష్పను గాచుచుం డెడుఁ ✻ వ॥ అని దీవించి పాంచాలరాజపుత్త్రిదనస్నేహలాలసవిలోలాపాంగవిలోకనంబులం బార్థుఁ బరిగృహీతపాథేయుం జేయుచుఁ దద్వియోగతరళంబైన హృదయం బెట్టకేని యునొక్కింత చేసికొనియుండెఁ బార్థుండును బూర్వోత్తరదిశాభిముఖుండై యొక్కరుండ యరిగి యైంద్రయోగశక్తిం ఖిలలోకదుర్నిరీక్ష్యుండగుచు హిమశైలగంధమాదనంబులు గడచి ✻ ఉ॥ వీరుఁడు యోగవిద్యయను పిల్లున దోడుగనింద్రకీలము। భూరినగంబు పైఁ గడఁగి పోవఁగఁబోయినఁ బోవకుండుము। గారిపభేదనీవమహామధుగర్వవీచె వానికిఁ। ఘోరవనాంతరీక్షమునఁ బొల్చె నిరంతరపుష్పవృష్టియుఁ ॰ వ॥ దానికి విస్మయంబంది చనువాఁడు ముందటనొక్క వృక్షమూలంబునవున్న వృద్ధబ్రాహ్మణు బ్రహ్మతేజోధికు నవిరళయమనియమకృశశరీరుం గని నమస్కరించి తత్సమీపంబున విశ్రమించియున్న యప్పార్థుఁ జూచి బ్రాహ్మణుండిట్లనియె ✻ క॥ ఎందుండి వచ్చితయ్యా య। నిందిత తేజుఁడవు ధర్మనియతుఁడవు నీ కిందుండ నేల సిద్ధిం। బొందితి చేకొను మభీష్టపుణ్యఫలంబుల్ ✻ క॥ ఇది శాంత తపస్వులకా। స్పదమిందుఁ గృపాణకవచబాణాసనసం। పద దాల్చియుండ నేటికి। విదితక్షత్త్రియకులుఁడవే నీవనఘా ✻ వ॥ వీతహర్షక్రోధులైన బ్రాహ్మణులుండెడు పుణ్యనివాసంబున నాయుధంబులు ధరియించియుండవలవదు వీనివిడువుమని బోధించిన విఘ్నవచనంబులకుఁ జలింపక యున్న యాతని ధైర్యమునకు మెచ్చి సహస్రాక్షుండు నిజరూపంబుఁ జూపి యిట్లనియె ॰ గీ॥ ఇష్టమైన వరములిచ్చెదఁ బ్రీతితో। వేఁడుమనిన నమరవిభునకపుడు। గరముభక్తి మ్రొక్కి కరములు మొగిచి యి। ట్లనియెఁ బురుషవృషభుఁడతనితోడ ✻ వ॥ దేవా నాకిష్టంబైన వరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్రలాభంబు గావలయుననిన దానిన యిచ్చెదనది యేమి గహనంబు పుణ్యలోకంబులు దేవత్వంబును సర్వకామంబులు వేఁడుమనిన నర్జునుఁడిట్లనియె ॰ సీ॥ దివిజాధినాథ నాకవియెల్ల నేటికిఁ బరమాస్త్రలాభంబు కరమభీష్ట। మరులు చేసిన మహాపరిభవక్లేశంబు వాపంగ నోపక యేపు వెడలి। యరుదుఃఖితులసహోదరులనందఱఁ బెట్టి చనుదెంచితి నిన్నుఁ గనవిననన్నుఁ। దగువారు జగములోఁ దెగడరె వాపుడుసుతునకుఁ బ్రీతుఁడై శతమఖుండు। గరుణ నిట్టులనియెఁ బరమాస్త్రలాభంబు। నీకు నెట్ట మేని లోకవంద్య। గరళకంఠునీశుఁ బరముఁ బ్రసన్నుఁగాఁ। వేగఁ జేయుమధికయోగశక్తి ✻ వ॥ అట్లని లోకపాలసహితుండై యాశ్వరుండు నీయభిమతంబొనరించునని సహస్రలోచనుండు లోచనాగోచరుండైన నర్జునుండును దద్వచనంబున సమాహితచిత్తుండై హిమశైలశిఖరంబునకరిగి వివిధకుసుమఫలభరితంబులైన వృక్షంబులను విమలనిర్ఝరజలంబులను గమలకుముదకల్హారకలహంససంకులపంకజాకరంబులను రమ్యంబైన తపోవనంబునం బరమేశ్వరునుద్దేశించి తపంబు సేయందొడంగిన ✻ క॥ సురదుందుభినాదంబును। సురపాదపసంభవప్రసూనసుగంధో। త్కరవాహిపవనమును నై। స్తరమయ్యె ననతని హృదయసమ్మతకరమై ✻ వ॥ అంత మనోవాక్కాయకర్మనియతుండై పరమేశ్వరునందు చిత్తంబు నిలిపి నిరంతరత్రిరాత్రోపవాసంబులనొక్క మాసంబు సలిపి ద్విగుణితత్రిరాత్రోపవాసంబుల రెండవమాసంబు సలిపి పక్షోపవాసంబుల మూఁడవమాసంబు సలిపియూర్ధ్వబాహుండై యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి నిరంతరంబు వాయుభోజనంబు సేయుచు నాలవమాసంబు సలిపి యిట్లతిఘోరతపంబు సేయుచున్న యర్జునుఁ జూచి యందలి ఋషులు విస్మయంబంది యీశ్వరుపాలికిం జని యిట్లనిరి ✻ ఉ॥ ఘోరతపంబుండు పాండవుఁడపూర్వతపంబొనరించె [illegible] నామవనంబులంబుహా। కాముతై

వనాంతరముగ ప్పెజగత్త్రయనాథ త్తపోభారము సర్వజీవులక పారభయావహమద్భుతంబిలన్ ❈ వ॥ అతనియభీష్ట
బుఁ బ్రసాదించి తత్తపోభారంబు వారింపుమనిన వారలపలుకులు విని పరమేశ్వరుండు దరహసితవదనుండగుచు వానియభీష్ట
యంబే నెఱుంగుదు నిష్టవరప్రదానంబున వానికి మనఃప్రియంబుఁ జేసెద మీరు మీయాశ్రమంబులకరిగి సుఖంబుండుఁ

❈ ఈశ్వరుఁడు కిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట. ❈

యని పంపె ❈ సీ॥ కాంచనవర్ణాపఘనుఁడు మహోన్నత కార్ముకహస్తుఁడై కాలకంఠుఁ । డెలుఁగు గాజయ్యెను
ద్రతనూజయు వనచరీభావంబు దనరఁ దాల్చెఁ । గుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుఁ గొన్న తరటులు మఱి చెంచుస
లమరఁ । డడపింఛ్ఛ చేపట్టి తడయక యెలుగులై యార్చుచు భూతమ్ములాత్మ సతుల - గీ॥ నెఱుకు సతులఁ గావించి యయ్యె
ఱ రాజు ముందర నుజక్కియలనొక్క మొగిననిలిచి । రంత వేఁట నెపంబుననంధకారి కదలెఁ దద్వనమెల్ల గ్రక్కదలుచు
చ॥ అలుగుల మ్రందియందుల మృగావలియర్వ విహంగంబులుర్భయా । కులగతిఁ బొందిమూగలును గుంటులుఁ జీకులు
యట్టులై యాలియకయున్న చోఁ గడఁగియుండఁ గిరాతబలంబుతోఁ జని । కలనయనుండు మేశ్వరుఁడు గవ్వడి డాయఁ
చ్చెఁ జెచ్చెరన్ ❈ వ॥ అంతనీశ్వరబోధితుండయి మూకుండను దైత్యుండు సూకరరూపధరుండై భీకరాకారంబున
త్సుభేదింపసమకట్టి వయింబఱ తెంచిన ❈ క॥ అనఘుండు దానిదవ్వులఁ । గని ఘనుఁడయి పాండవుండు గాండీవగుణా
చేయుచు డాసిఁ బెల్చన నేయఁ గడంగి పిలిచె సంరంభమునన్ ❈ వ॥ అదియును నాతుణంబ యేసినయమ్మునం బోలె
గంబున నాసన్నంబైన దాని నేయకేయకుమని యెలుగు రాజు వారించిన వానివచనం బాదరింపక ❈ చ॥ పటుపిశి
త్రిదశపాల తనూజుఁడు పంది నేసె దా । నటఁ బరమేశ్వరుండును రయంబునఁ దానినయేసె నిట్టులొక్కటఁ బడియెఁ
గ్జునుల ఘోరశరంబులు పందిపైఁ గుఁభృ । త్తటము వఱ్ఱ వడింబడు నుదగ్రమహాశనులట్లు మ్రోయుచున్ ❈ క॥ హతమ
మునరుశరమును సరిని రువక్కియలు దాఁకి జవవాఁ ఱి శరసం । భరమునఁ దిరిగె వరాహము । శరవిధిమథనమునఁ దిరుగు
ముపోలెన్ ❈ వ॥ ఇట్లిద్దఱచేత శరవిద్ధుండై మూకదైత్యుండు సూకరరూపంబు విడిచి నిజరూపంబుతోడ నదృశ్యుండయ్యె
నంత నర్జునుండు విస్మితుండై ముందట నత్యున్నతచాపధరు మేరుశిఖరాకారు నపారకిరాతపదాతిసమేతు నభినవ
వన వనచరీవనచరసహస్రపరివృతు నొక్కపురుషుం గని నీవెవ్వండవు మనుష్యగోచరంబు గాని యివ్వనంబున బ్రి
నితాసంగతుండవై యేల తిర్మ్మరియెదు నాఁ ఱియే నేసిన మృగంబు నేసి మృగయాధర్మవిరోధంబేల చేసితి విన్నని
నిశితబాణజాలంబుల పాలు చేసెదననిన నగుచు వాతనికి నయ్యెఱుకరాజిట్లనియె ❈ గీ॥ ఏను నామృగంబు నేసితినది
యాస్త్రనిహతమయ్యెననుచు నకట । చను నె నీకు లేవిశౌర్యసంపదఁ జెప్పి । కొనననుచదము పలుకఁగుజనునట్లు ❈ క॥
కులనొప్పకు బీరము । గలదేనిరణంబు సేయఁ గడఁగుము నీదోర్బలమిప్పుడయ్యెడి పెడనని । తలఁగక యేయుచుఁ బినాకి
గిరీటిన్ ॥ అంత ❈ చ॥ ప్రతిబలగర్వభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్షము । న్నతగతిధీరుఁడై కురిసినం బరమం
హాంబువృష్టిఁ బ । ర్వతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి పోరన । త్తతనుఁడయ్యె వానినతిగర్వితు
డు సూచి యాత్మలోన్ ❈ చ॥ ఇతఁడు సురేంద్రుఁడోండెఁ బరమేశ్వరుఁడో యెండెధనేశుఁడో యెండెఁగా । కతులబలప్రభావ
డన్యుఁడు గాఁడొదుఁడై నమహాభుజా । వితతధనుర్విముక్తశరవేగము పోరసహించి యిట్టులు । తుతుఁడన మార్చి
కంపముఁ బొందక యుండ నేర్చునే ❈ వ॥ నాయేసినయపారదుర్వారనారాచంబులవి వేకియందుఁ బ్రయుక్తంబులై
భాషితంబులుం బోలె వీనియందు నిష్ఫలంబులగుచున్నయవి ❈ గీ॥ ఎఱుకనన్నును అకయేసిన శరములు । నెఱిఁ
నిశితదివ్య । ప శిఖతతులయట్లు వేదనరూపించె । నిదియపూర్వమితఁ డెవ్వఁడొక్కొ ❈ వ॥ ఇప్పర్వతంబుదైవనివాసం
పుననితండు గిరాతరూపప్రచ్ఛన్నుండైన యొక్క దివ్యపురుషుండుగావలయు ననియశనికల్పంబులైన దివ్యశరంబుల
ఱుపయి నేసి యర్జునుండక్షయంబులైన తనతూణీరమ్ములయమ్ములు గానక ఖాండవదహనంబు నాఁడగ్ని దేవుం
చ్చినయక్షయశరధులిప్పుడు యాగాంత్యకాలరిక్తంబులైన శరధులుం బోలె నున్నయవి యిదియేమి యద్భుతంబు
నలిగి గాండీవంబెత్తికొని యెఱుకపయింబఱచి ❈ క॥ అపహృతగాండీవుఁడునై । యపరిమితక్రోధహృదయుఁడు
డు పరంతపుఁ డెఱుకమస్తకంబునఁ । గృపాణపాతంబుఁ జేసెఁ గినిసి కడంకన్ ❈ క॥ అదియు వ్యర్థమైనఁ బార్థుఁడు ।

వృక్షములశాలలై చెనురణదుర్గమువనచరునవియెల్లను।దదంగముననడంగెనద్భుతంబుగనంతఁ ॥ వ॥దానంగోపించి॥ క॥ హరుఁబెనగివట్టుకొనిభీ। కరబలుఁడగుసుఁడుముష్టిఘాతంబునసం । గరమొనరించెనువనచర।వరులాతనిశౌర్యగౌరవం బులువొగడఁ ॥ క ॥ తనదివ్యగాత్రమునన। ర్జునుగాత్రముపీడఁజేసెశూలధరుండం।తనమూర్ఛవోయిపీడిత।తనుఁడై పార్థుండుధరణితలమునఁబడియెన్ ॥ అంత ॥ చ ॥ వరదుఁడుపార్థుశౌర్యవిభవంబులశాతనిధైర్యవృత్తికి । న్నరుదుగ మెచ్చిసన్నిహితుఁడయ్యెజటామకుటేందురేఖయున్ । గరమునశూలముఁ గళకాలగళంబుబృహద్గజాజినాం।బరముఁ దృతీయలోచనముఁబన్నగహారముకొప్పచుండఁగన్ ॥ వ ॥ ఇట్లువిరూపాక్షుండునిజరూపంబుతో నర్జునునకుసన్నిహితుండై క్షత్రియులలోపలెవ్వరు నీయట్టిశౌర్యధైర్యవంతులెందునులేరు నీతపఃస్థైర్యగుణంబులకుమెచ్చితి నీకోర్కిన ఫలంబుచేసెద దేవాసురమానుషంబైనజగంబంతయు నీవజయింతు నాస్వరూపంబుచూడుమని దివ్యదృష్టియిచ్చినఁజూచిపార్థుండు కృతార్థుండై పులకితాంతరంగుండగుచు సర్వాంగాలింగితోర్వీతలంబగు దండప్రణామంబులొనరించి॥ శ॥వరదసురాసురవందితుఁ । గరుణాకరుహరుఁబినాకకరుగిరిచర్మాం। బరుగిరిజేశ్వరుఁబన్నగ।ధరునిట్లనిప్రస్తుతించె

## ॥ అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము చేయుట. ॥

(దద్వయభక్తిన్ ॥ దండకము॥ శ్రీకంఠలోకేశలోకోద్భవస్థానసంహారకారీపురారీమురారిప్రియాచంద్రధారీమహేంద్రాదిబృందారకానందసందోహసంధాయిపుణ్యస్వరూపావిరూపాక్షదక్షాధ్వరధ్వంసకాదేవ నీదైనతత్త్వంబుభావించిబుద్ధింబ్రధానంబుగర్మంబు విజ్ఞానమధ్యాత్మయోగక్రియా కారణబంచు నానాప్రకారంబులన్ బుద్ధిమంతుల్విచారింపుచున్నిన్నుభావింతురీశానసర్వేశ్వరాశర్వ సర్వజ్ఞసర్వాత్మకానిర్వికల్పప్రభావా భవానీపతీనీవులోకత్రయీవర్తనంబున్ మహీవాయుఖాంతాగ్నిసోమార్క తోయంబులంజేసి కావించిసంసారచక్రక్రియాయంత్రవాహుండవై తాదిదేవామహాదేవ నిత్యంబునత్యంత యోగస్థితిన్నిర్మలజ్ఞాన దీపప్రభాజాల విధ్వస్తనిస్సారసంసారమాయాంధకారుల్జితక్రోధ రాగాది మారుల్భవత్పాదపంకేరుహధ్యానడిండీర ధారానుభూతిన్ సదాతృప్తులై రవ్యయాథవ్యాసేవ్యాభవాభర్గ భట్టారకాభార్గవాగస్త్యకుత్సాదినానామునిస్తోత్రదత్తావధానాలలాటేక్షణోగ్రాగ్నిభస్మీకృతానంగభస్మానులిప్తాంగగంగాధరానీప్రసాదంబునన్ సర్వగీర్వాణ గంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రాదులున్ శాశ్వతైశ్వర్యసంప్రాప్తులైరీశ్వరా విశ్వకర్తాసురాభ్యర్చితావాకు సభ్యర్థితంబుల్ప్రసాదింపుకారుణ్యమూర్తి త్రిలోకైకనాథానమస్తేనమస్తేనమః ॥ వ ॥ అనియిట్లుస్తుతియించి కిరీటికృతాంజలియైవెండియునిట్లనియె ॥ క॥ఎఱుకనిరోమెఱుఁగకమిమ్మున్।మఱునవమార్గాన్నతప్పమఱువుఁడునాకుం।గఱకంఠాక్షమియింపుము।నేఁటినెవ్వరికెఱుఁగనగునెనీచరితంబుల్ ॥ వ ॥ అనినయప్పార్థుంగరుణావిస్తారవిలోకనామృతమ్మునసంతర్పితుంజేసినసుచనీశ్వరుండతనిచేయివట్టుకొనిధనంజయానీ చేసినవ్యతిక్రమమ్ముక్షమియించితి నతిమానుషంబైన నీపరాక్రమమ్మునకు మెచ్చితిఁబూర్వజన్మమ్మున నీవునరుండను దేవర్షివి నారాయణ సఖుండవు నరనారాయణులనంగా మీరిద్దఱు బదరీవనంబునననేకాయుతవర్షమ్ములుతపమ్ముఁజేసిన తపోనిధానములరుమీకతమ్మునజగమ్ములు రక్షితమ్ములగుచున్నయవియిగ్గాండీవమ్మతొల్లియు నీయదియ దీనఁజేసిశక్రాభిషేకమ్మునాఁడసురులజయించి తదియివ్వడక్షయ శరధులతోడ మదీయమాయాగ్రస్తంబయ్యెనీగాండీవమ్మును నక్షయశరధులు నీకిచ్చితింగొనుమింక నీకిష్టంబైన వరమ్ము వేఁడుమిచ్చెదననిననర్జునుండిట్లనియె ॥ క॥త్ర్యంబకనాకునభీష్టవ। రంబుఁబ్రసాదించెదేనిరౌద్రముదివ్యా।స్త్రంబనఁబరఁగినపాశుప । తంబుఁబ్రసాదింపుమిందుధరదయతోడన్ ॥ వ॥ఇదియనుబ్రహ్మశిరంబనునస్త్రంబును యుగాంతకాలంబునందుఁబ్రయుక్తమ్మలై జగత్సంహారమ్ముసేయు వీనివలననభిమంత్రితమ్ములై యనేక శతసహస్రసంఖ్యలు శూలంబులుగదలునాశీవిషంబులయట్టి యమ్ములు నుద్భవిల్లుననివిందునీకారుణ్యమ్మునదీనింబడసి దైత్యదానవయక్షరాక్షసపిశాచోరగమ్ములజయింతుననివీరులైన భీష్మద్రోణాదివీరులనుసహజ కవచకుండలుండైన కర్ణునిజయింతుననిననీశ్వరుండునుంగరుణించి విశుద్ధాత్ముడైన పార్థునకు మంత్రధ్యాన జపహోమపూర్వకమ్ముగా సంధానమోక్షణసహితమ్ముగాఁ బాశుపతాస్త్రంబిచ్చి యిదియస్త్రమ్మునకు నసాధ్యంబెద్దియును లేదల్పులయందుఁ బ్రయుక్తంబైనజగ

త్సంహారమ్ము నేయు * క ॥ దీనివిధానంబెఱుఁగం। గానింద్రకుబేరవరుణకాలాదులకున్। దానతిగహనంబనివ
వులకు నెఱుఁగుటఘటమానముగాదే * వ ॥ ఈదివ్యబాణమ్మున నీవఖిలలోకమ్ములు జయింతువని క్రాంతేయు
రంబిచ్చిపురాంతకుండంతర్హితుండయ్యెనంత * చ ॥ అవిరళసూర్యమండలసహస్రసమప్రభమైధనంజయ
రమ్మునన్వెలుఁగు పాశుపతాస్త్రముఁజూచిదైత్యదా। నవసురయక్షరాక్షసగణమ్ము గరమ్ముభయమ్ముఁబొందెఁ
వనియుదిర్ధిరందిగిరెనబ్ధిశిలోచ్చయసంచయంబుతోన్ * క ॥ త్రిణయనగాత్రస్పర్శన। మునఁదనగాత్రము
సముత్థానుంబుసనతితేజోవీర్యంబుసనై నఁబృథాసుతుండుముదితుండగుచున్ * క ॥ మంటిహరుదేహమం
టిమహాధీశునసురకంటకుహరుము। కంటిఁగఁ ఉకంఠుఁజూడం। గంటిఁగృతార్థుండనైతిఁగడుపుణ్యమునన్ * క ॥
లధగ్నజునకుజన। సమ్మతునకురిపుజయంబుసకలమహీరా। జ్యమ్ముసముకూతెనేఁడు। నమ్మగసర్వప్రయో

ఇంద్రుఁడుదేవగణంబులతోనర్జునునకుఁబ్రత్యక్షుఁబగుట.

లచేరన్ * వ॥ అనిసంతుష్టహృదయుండై పార్థుండున్నంత * సీ ॥ హరుచేతసంప్రాప్తవరుఁడయ్యెనరుఁడని
యింద్రుండుధనేశధర్మ। వరుణాశ్వినులతోడసుగరణసహితుఁడై దివ్యవిమానముల్దివమునందు। వెలుఁగంగఁ
లవీరుపాలికివరదుండుగరుణతో వచ్చెనట్టి। యవసరమ్మునఘనరవఘోషమెసఁగంగఁమధురవాక్యములధర్మ
గీ॥ ప్రీతినిట్టులవిరోబీభత్సుసకుధర్మ। నిత్యపాండుపుత్ర నీకుమెచ్చి। వరములిచ్చువేడ్కవచ్చిరినెయ్యులై। యమర
ద్రోటియమరులెల్ల * వ॥ వీరలంజూడుమునిదివ్యదృష్టియిచ్చినీవునరుండనుపూర్వఋషివిబ్రహ్మనియోగంబునమను
డవైయుత్తమక్షత్రియకులంబునం దుగ్బవిల్లిమతిసూర్యాంశజుండైన కర్ణునిదేవదైత్యదానవ గంధర్వ యక్ష
సాంశజులైనరాజులనువధియింతునీకక్షయకీర్తియగునవిదండధరుండు ప్రతిదారణంబైన దండంబుప్రీతియుక్తంబుగ
న * క॥ ఘోరారిదారణములగు। వారుణపాశంబులిచ్చెవరుఁణుశుభాటికా। బేరాస్త్రమర్థినిచ్చెఁగు। బేరుఁడువిజయు
హితభేదకిఁబ్రీతిన్ * వ॥ ఇట్లుదివ్యపురుషుండైనపార్థుండులబ్ధదివ్యదృష్టియైయమర్త్యరూపధరులైనపిత్రదేవ
ముందటనిలిచినమహానీలవర్ణుండైనవైవస్వతునివైదూర్యవర్ణుండైయర్ణవనదీశైలసేవితుండై నవరుణేశ్వరుఁజా
దవర్ణుండైయక్షగణంబుతోనున్నకుబేరునిఁజూచివారివలనదివ్యాస్త్రంబులువడసి వాప్పుష్పఫలజలంబులనందఁ
లంజేసి వెండియు * గీ॥ అమరగణపమేతునైరావణారూఢు। వజ్రధరుఁద్రిలోకవంద్యునింద్రు। వృత్రశత్రు సమర
రొయడనాది। ముఁవిభుండునరుఁడుముదమునొందె * ఉ॥ ఇంమధరప్రసాదమునసిష్టవరంబులుగాంచిబాంధవా। నంద
యైననిజనందనుఖండితశత్రుసన్గుణా। నందితుఁజూచివేడ్కనయునంబులువేయునుగన్నతత్ఫలం। బందెఁబురందరుం
ద్భుతసమ్మదపూరితాత్ముఁడై * వ ॥ ఇట్లుదేవేంద్రుండుధనంజయంజూచిసంతసిల్లినీవుపరమేశ్వరువలనఁబరమ
సితిగానదేవకార్యంబు దీర్పనర్హుండవుగాన నారథంబుఁబు త్తెంచెదనమరావతికి రమ్ము నీకుదివ్యాస్త్రంబులం
డననిదేవేంద్రుండుదేవగణంబులతో నమరావతికినరిగిన నర్జునుండుసుదర్శథాతమనంబు ప్రతీక్షించుచుండునంత
నారిదమార్గంబువలన మహానీలవైజయంతీవిభవంబువెలయ। నాబద్ధవివిధరత్నావళిప్రభఁజేసిరమ్యమై
రంబువెలుఁగ। నురునేమిరవమునసుర్వరాధరదరీముఖములుప్రతిశబ్దముఖరితంబు। లగుచుండనానావిధాయుధ
దాల్చియశనివిద్యుత్సహస్రాభిశోభి * గీ ॥ తామ్రసదృశమైమహాజవాశ్వయుత। వాహ్యమానమైనవరరథ
మువునాజ్ఞఁజేసిమాతలియుక్తమై। కరమువేడ్కనరునికడకువచ్చె * వ ॥ మాతలియునర్జునుంజూచిసురాసుర
మకుటరత్నప్రభాభాసురపదుండైన మహేంద్రుండు మీయయ్యభవద్దర్శనం బపేక్షించి విన్ననమరావతికి
చెరాజసూయాశ్వమేధ శతంబులఁజేసినవారికైనను దుర్లభంబీరథంబుదీనినెక్కుమనిన నర్జునుండునుగంగా

(*) అర్జునుఁడమరావతికిఁబోవుట. (*)

విత్రీకృతగాత్రుండై దేవఋషిపితృతర్పణంబులఁజేసి మాతలిప్రయుక్తంబైనయాదివ్యరథంబెక్కి * చ ॥
స్వమాధినియతాత్ములకున్బహుపుణ్యలోకకాం। త్యులకువిశుద్ధమానసులకున్సతతంబునుసంశ్రయంబవై
నసంసత్త్రవిలాసవిహారమహా... ...సుందర మందరాచలా * వ ॥

చియందులపుణ్యతీర్థంబులు సేవించుచు గంగాంబుధౌతస్థలీరుహ వనస్పతిఫలంబులుపయోగించుచు సుఖంబుండితి నను శావతికింబోయివచ్చెదనని మందరనగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబునకరిగె * సీ॥ పరమధర్మస్థితిఁ బ్రజఁ బ్రీతిఁగాచిన రాజులకునుదగ్రరణమునందుఁ బతులత్రస్తపములఁ బ్రాణములు విడిచినవీరులకును యజ్ఞవిధులఁ జేసి సురలను వసుమతీసురులను దనిపిన ధర్మాత్ములకుమహాతాపసులకు । నిలయంబులై రమణీయంబులగు రత్నహర్మ్యవిమాన సంహతులదాని - గీ॥ సకలభువనంబులం గలసత్వరముల । కెల్లనుపమానమై దహనేందురవుల । దీప్తి లేకున్నఁ దనదైనదీప్తిఁ జేసి । విస్తరంబున నెప్పుడు వెలుఁగుదాని * వ॥ మఱియు ననాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధాచారులకు మాంసాహారులకు రణపరాఙ్ముఖులకుం జోరులకు నగమ్యంబైనదాని నమరావతీపురిఁ జొచ్చి తత్పూర్వగోపురసమీపంబున ననవరతవిగళితావిరళ మదజలకుల్యాభిరామంబై నిరంతరనిర్ఝరనీహార నగంబునుంబోలె నొప్పుచున్న యైరావతంబుఁ జూచుచు సురసిద్ధసాధ్యగంధర్వకిన్నర జేగీయమానుండగుచుఁ జనునప్పుడు * క॥ సకలర్తుకుసుమసౌరభ । సుకుమారోద్యానతరులసుడియుచుఁ బ్రణయో । త్సుకుఁడై పవనుఁడు పాండవు । నకు నభిముఖుఁడయ్యెఁ దన్మనఃప్రియమెసఁగన్ * క॥ నరుఁడైనయాదిముని యని । హరిసుతుఁడని హరిసహాయుఁడని హరిచేతన్ । వరములు వడసినవాఁడని । సురలెల్లమ వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్ * వ॥ అర్జునుండు నయ్యమరావతీవిభవంబుఁ జూచి హర్షించుచు నప్సరోగీయమానమంగళగీతసహితమానసుండగుచు సిద్ధమునిగణాశీర్వాదవాదంబులు సేకొనుచుఁ జని మాతలి నిర్దేశంబున రథావతీర్ణుండై * క॥ శతమఖునకు భువనావన । రతశీలునకఖిలదేవరాజర్షిసమ । న్వితునకు వజ్రాభీలో । న్నతపృథుభుజునకుఁ గృతప్రణాముం డయ్యెన్ ॥ చ॥ అనిమిషనాథుఁడుం బ్రచలితాంగదతుంగభుజాయుగంబునన్ । దనయునిఁ గౌఁగిలించుకొని ఘనగణజాత నితాంతసమ్మదం । బునఁ బులకాంకితాంగుఁడయి మున్న నిజాంకతలస్థుఁ జేసియ । త్యనఘు నిజాసనార్ధమున నాతని నున్నతగ రంబు నెమ్మితోన్ * క॥ లీలైరావతకుంభా । స్ఫాలనకర్కశములైన పాణులనమరుం । డ్వాలుండంటుచును జెను । గాలాంకృతుఁడైనపార్థునంగముఁ బ్రీతిన్ * వ॥ ఇట్లధికవిలాసంబుతో సురవిలాసినీకరకలితచారుచామీకరదండచామరసమీరాలోలకుంతలుండగుచు సురరాజుతో నేకాసనంబున నున్నయప్పార్థుం బాకశాసను శాసనంబున దేవగంధర్వసిద్ధవిద్యాధరులతిప్రీతినగ్గించిరంత * గీ॥ పాకశాసను వసుపునఁ బార్థుఁడొక్క । మణిమయంబైన మహనీయమందిరమున । నెలమిగంధర్వసంగీతహృద్యగోష్ఠి । నుండెఁ జెవులకునుత్సవంబొందుచుండ * వ॥ అంతసూర్యాస్తమయసమయంబునఁ జంద్రుండుదయించి సాంద్రచంద్రికావిలాసంబున దిగ్వనితనలంకరించుచుండ నిలింపపతిపంపున నూర్వశి యర్జునసంగమకాంక్షం జేసి చంద్రికాధవళదుకూలంబుగట్టి మృగమదకర్పూరకుంకుమోన్మిశ్రితసుగంధంబులఁది వివిధసురభికుసుమవిసరంబులుముడిచి మణిమయభూషణాలంకృతయై నిలువడవడసినక్రొమ్మెఱుంగుదీగయుంబోలె మణిమయమంజీరఝుళంఝుళనినాదంబును గంకణఝణంఝణత్కారంబును గటికలాపకింకిణీక్రేంకారంబును మదనాజ్ఞావాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుఁ జమందగమనంబునఁ బురందరనందను మందిరంబునకరుగుదెంచిన నప్పురుషసత్తముండు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబునుం జేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె * క॥ ననుఁ బుత్రస్నేహంబున । మనమునమన్నించి శుభసమగ్రుఁ జేయఁగా । జనుదెంచితీవు ముదమున । జననియు త్రియేఁ గృతార్థజన్ముఁడనైతిన్ * గీ॥ అనిననూర్వశి యిట్లనుఁ దనదునేత్ర । మధుపములతని సౌందర్యమధువుఁ గ్రోలు । చుండఁ దమకంబుమీఱ ననంగధర్మ । నిపుణుఁడగునర్జునునిఁ జూడ నెయ్యమొనర * చ॥ అనుపమశౌర్యనీకుసముదగ్రగుణంబులు నారదాదిసన్మునివరులెల్లఁ జెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయసంగమం । బనిశముఁ గోరుచుండఁగఁ బ్రియంబున వచ్చితి వేనుగోరఁగా । ననుజననిం ద్రియంచు నొకనాయముఁ గాదురు వక్రభాషలన్ * గీ॥ నీవు నేనాఁటితల్లిని నిజముఁ జెపుమ । యమరలోకంబు వేశ్యలమైనమాకు । నిట్టిలగవులు నడువ నహీనబాహు । వీర్య యిచ్చట వావియు దెదకఁ జనునె * వ॥ ఈలోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతురిచ్చటిది యనిందితంబైన యాచారంబు నీవు మద్రిదివంబునకువచ్చినయప్పుడ దివ్యపురుషుఁడవుగావున నాదు మనోరథంబు సఫలంబుగా మందారమంజరీ మంజులమకరందపాన మత్తమధుకరగాన మనోహరస్థలంబులను మేరుశైలకందరంబుల యందుపవనంబులుగల నందనాదివనంబులయందు నితాంతకాంతికలిత కనకారవిందసమధిక సౌరభసువాసితమ

హానందకందంబులై నమందాకినీతీరమణిమయవేదికలయందును జలద్రికాసుందరంబులై నసికతాతలంబులను నిర్జర విహారస్థానంబుల ననవరతసురతకేళీసౌఖ్యాంబుధి నోలలార్పుమనిన నిర్వికారధైర్యధుర్యుండై యర్జునుండి ట్లనియె * క॥ ఓ హో హో యిమ్మెయిధర్మ। ద్రోహోక్తులువలుకందగు నెదో సంబిదిగా। దేహరిహరిమనమునందగ। వ్యా

## * ఊర్వశియర్జునునపుంసకునిఁగా శపించుట. *

కనన్నుఁబలుకటుచితమెనీకున్ * వ ॥ జగంబులువుట్టింపను మనువను గర్తలైనదేవతలకు నెట్లునడచిన నెగ్గలేదు గర్మభూమినిజనియించి కర్మఠుండనైతి నాకునిచ్చటియాచారం బుచితంబుగాదు మదీయవంశకర్తయైన పురూరవు బత్నివైన కారణంబునను బురందరునకుఁ బరిచర్యయొనర్చుటను నాకుజననివనుట సందియంబులేదు తల్లీనన్ను బుత్రవాత్సల్యంబునం జూడుమనిన మదనబాణపీడితయై కోపారుణీతనయనంబుల నర్జునుఁజూచి యూర్వశి యిట్లనియె కామించివచ్చిననామ నోరథంబువిఫలంబుఁ జేసినవాఁడవు నీవుమర్త్యలోకంబున మానవర్జితుండవై మానినీమధ్యంబున పుంసకుండవై యుండుమని శాపంబిచ్చి నిజగృహంబునకుంజనియె నంతఁబ్రభాతసమయంబునఁ దద్వృత్తాంతంబంతయు వినిసురపతికొడుకునకిట్లనియె * క॥ నీయట్టిధైర్యవంతుని। నేయుగముల నైనఁగాన మెన్నండునధ । ర్మాయత్తమతివి లకు। నీయింద్రియజయముకీర్తనీయముతండ్రీ * గీ॥ అనఘయూర్వశియిచ్చినయట్టిశాప। మనుభవింపంగవలయునీ యందు। నింక మీపదుమూఁడవయేఁడుసత్య। సరణికజ్ఞాతవాసంబునలుపవలయు * వ॥ అక్కాలంబుననీవుమండపు నఁబ్రచ్ఛన్నుండవై రాజకన్యకలకునృత్యంబుగఱపుచుండి తదంత్యంబున శాపమోక్షంబువడయుమని యనుగ్రహి నీయాఖ్యానంబువిన్నపుణ్యపురుషులు సకలదురితవిముక్తులగుదురని చెప్ప వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె సీ ॥ వజ్రాస్త్రమాదిగావరదుఁడై వివిధ దివ్యాస్త్రములర్జునకమరనిచ్చి । తత్ప్రయోగంబులుఁదద్రహస్యంబు లన్నివర్తనములుఁదడయకపుడు । దయనుపదేశించి దారుణాహవములందవిజేయవీర్యుండవగుము పేర్మి । ననిమహో హిగ్రుడై చిత్ర సేనుఁడ న్గంధర్వపతితోడఁగారవమున - గీ ॥ వజ్రధరుఁడుగీతవాద్యనృత్యంబులు । గఱపంగ నొ ప్పార్థుఁగడఁగియిట్టు । లమరనాథునొద్దనర్జునుండుండనే । డేఁడులరిగెనిటమహీతలమున ॰ వ ॥ అంతనొక్కనాఁడు లోమశుండనుమహాముని యింద్రునొద్దకువచ్చి సురగణపూజితుండై సురేంద్రుతో నేకాసనంబుననున్న యర్జునుం జూచియాశ్చర్యంబంది యింద్రునికిట్లనియె * క ॥ కోరియనేకయుగంబుల । పారతపోయుక్తులైనవారికిఁబడయ దూరమునీసభమఃణినీ। కారుణ్యంబితకంబెటఁగడుదవ్వెందున్ ॰ వ॥ అట్టియిందులనీతోనొక్కట నేకాసనంబెక్కి నీ వమూర్తియంబోలెనున్న యిమ్మనుజుండెందులవాఁడెవ్వండనిననమ్మునీంద్రునకుదేవేంద్రుండిట్లనియె * క॥ నరుఁడను మహర్షియాతఁడు। నరలోకమునందుఁబుట్టెనాయంశమునన్ । గురుమతిఁగౌంతేయుఁడుభా। సుర తేజుఁడు పేర్చిని ఖుఁడునువ్వేమునీంద్రా * తరల॥ శివుఁడువీనికిఁబ్రీతుఁడై దయచేసెఁబాశుపతాస్త్రమీ । దివిజముఖ్యులతోడనే దివ్యబాములిచ్చిరిక్ । దివిరియాతఁడుమత్ప్రియంబుగదేవకార్యముదీర్పఁగా । సవినయస్థితినున్నవాఁడునిజప్ర బలోన్నతిన్ ॰ వ॥ మఱియువసుమతి నతిగర్వితులైనసగరసుతులం దనదృష్టిప్రదహనంబునంజేసిదహించినకపి నుమహామునినారాయణుఁడయ్యెనట్టి నరనారాయణులుజగదుపకారులు జగతీభారావతరణకారణులై దైత్య వధార్థంబుమర్త్యులై పుట్టినవారుగావున * క॥ దేవతలకునపకారము। గావించినయన్నివాతకవచులఁబాతా। ళ లదానవులమ। వారీరుఁడువీఁడభేద్యుఁడై వధియించున్ * వ॥ అనితత్ప్రభావంబుచెప్పియింద్రుండులోమశునకిట్ల మునీంద్రా నీవుమర్త్యలోకంబునకుంబోయిధర్మజుంగనియతనికిందత్సహోదరులకు నంతోషంబుగానాయొద్ద నర్జునుండున్న కుశలవార్తయెఱింగించి భీష్మద్రోణకర్ణాది వీరులనోర్వనట్టిదివ్యాస్త్రంబులువడసెనతండుమీయొద్దకు వేగంబునవచ్చు నగపడుండుండని చెప్పి నావచనంబున ధర్మజునకుల తీర్థసేవసేయఁబంపు మర్జునపేతదురి యఖలమహీరాజ్యంబు వడయు నతండు తీర్థాభిగమనంబుసేయునపుడు నీవాతనికిసహాయుండవు గమ్మనియింద్ర లోమశుఁబనిచెనిటధృతరాష్ట్రుండర్జును దివ్యాస్త్రలాభంబు కారాశర్యువలననెఱింగి పరమవ్యాకులహృదయ సంజయునకిటనియె * సీ॥ నురవ [illegible] నొక్కటఁగాల్చియున్న। వీరునకఖిల

## అర్జునుదివ్యాస్త్రలాభంబువినిధృతరాష్ట్రుండుదుఃఖించుట.

తవసుంధరఁగలరాజులనోర్చి పరాక్రమమున । నగ్రజు రాజసూయాధ్వరమునిచిన యధికసమర్థునకర్జునునకుఁ । బ్ర
బలసింహమునకుఁ బక్కెర వెట్టినయట్లు దేవతలు నెయ్యంబుతోడఁ * గీ॥ బరముఁ దొట్టి పాశుపతమాదిగా దివ్య । శరములిచ్చిర
ట్టిశౌర్యమేసఁగు । నట్టినరుఁడు రథాధుఁడై యుండఁ బాండవ । వరులఁ జెనకఁ ట్రివారుగలరె * క॥ వారికిధర్మువుదప్పని । వారి
కిదృఢవచనులైన వారికివిమలా । చారులకెద్దియుఁ బడయఁగ । దూరమెపాండవులఁ బోలుదురెవీరులొకుల్ * వ॥ వారలతో
విగ్రహించి దుర్యోధనుండుదనకుఁ దనబాంధవులకుసుహృజ్జనంబులకుహానిచేసికొనియె * గీ॥ పర్వతములువజ్రపాతహ
తిఁబడకఁ । దప్పకేనినింద్రతనయుదివ్య । నిశితబాణతతులనిశ్శేషమగుఁగాక । వరులపై న్యమెట్లుబ్రతుకఁబోర * వ॥ లయ
కాలోద్దీపితసహస్రకరుకిరణంబులం జరాచరంబులుత్తప్తంబులగునట్లుపార్థుబాణంబులంజేసి దుర్యోధనాదులు దుస్స
హతాపంబుఁ బొందుదురనిదుఃఖితుండై నధృతరాష్ట్రునకుసంజయుండిట్లనియె * క॥ ఈసునదుర్యోధనుఁడు । శ్వాసములా
పాండవులకుసభలోనెగ్గు । ల్సేసినవినివారలనను । శాసింపఁగవలదనంగఁజనదేమీకున్ * వ॥ నీయాసేతుంజేసిదుర్యో
ధనదుర్ద్యూతపరాజితులై రాజ్యంబువిడిచిపాండవులరిగికామ్యకవనంబున నున్నఁగృష్ణుండ నేకరాజసమన్వితుండై వా
రియొద్దకువచ్చి నీకొడుకులు సేసినవికారంబునకుం గృష్ణాపరిభవంబునకు దుఃఖితుండై కడునలిగిమీకునెగ్గుసేసినదు
ర్యోధనాదులదూషించి గజపురంబునధర్మరాజు రాజ్యాభిషిక్తుంజేయుదుననియు రాజసూయంబు సేయునాఁడింద్రప్ర
స్థంబుననైనవిభూతికంటె విశేషవిభూతిగావింతుననియు ద్రుపదసృంజయకేకయ ధృష్టద్యుమ్నబలదేవసాంబసాత్యకి
ప్రభృతులసమక్షంబునంబలికి సత్యసమయులైనపాండవులచేత సంరంభనివారితుండై పార్థుసారథ్యంబునకుఁ బ్రా
ర్థితుండయ్యెననివింటిమి * క॥ పదమూఁడేఁడులుపోవుడు । బదునాలవయేఁడుఘనులుపాండవులుజగ । ద్విదితముగనుత్స
హింతురు । వదలకరణమునకుఁ గేశవపురస్కృతులై * క॥ వరములువేల్పులచేదు । ష్కరతపమునఁబడయుదురెజగంబున
నొడులి । శ్వరుచేవరములువడసెం । గరుణధనంజయుఁడుదనదుకార్ముకశక్తిన్ * వ॥ అయ్యర్జునుదివ్యశరసంఘాతంబును
భీమసేనుగదాఘాతంబును నీయపేక్షానిర్ఘాతంబును గౌరవపరిక్షయంబునకుఁ గారణభూతంబులనిన సంజయునకుధృ
తరాష్ట్రుండిట్లనియె * క॥ వృద్ధుఁజాత్యంధుండని । బుద్ధివిహీనుఁడనినన్నుఁబుత్త్రుఁడుబలద । ర్పోద్ధతుఁడై మెచ్చఁడుసం । బద్ధం
బులెకానివినఁడుపలికినపలుకుల్ * వ॥ దుర్యోధనుదుర్బుద్ధినేమి చెప్పవలయుభీష్మద్రోణవిదురులనాదరింపకకర్ణశకు
నులనాప్తులంజేసికొని వారివచనంబులనెగడు నేనేమిసేయువాఁడనని ధృతరాష్ట్రుండు మిన్నకుండెనటఁబాండవులు
పార్థుమనలుటకు దుఃఖితులై * ఉ॥ పాండవసింహమర్జునుఁడుపాండుయశంబువెలుంగుచుండనా । ఖండలుఁదొట్టినిర్జ
రనికాయముచేతవరంబుగాంచియె । న్నండిటవచ్చునెక్కొసుజనస్తుతువాతసఁబ్రీతితోడనె । న్నండొకొకాంతుమంచును
మనంబునఁగోరుచునుండిరెంతయున్ * వ॥ అట్టియవసరంబునయుధిష్ఠిరునకుభీముండిట్లనియె * మధ్యాక్కర నీనిర్దేశ
మునననరిగిపార్థుండునిష్ఠతోఁదపము । మానుగాఁజేయుచున్నవాఁడేలమసలెనోరాఁడు । వానిధర్మస్థితుఁబాసియున్నయి
వర్షములుయుగస । మానంబులైనవిమనకునతనిసమాగమనకాంక్షన్ * వ॥ మఱిపాండవపాంచాలవీరులజీవనంబు
లాతనియందనిలిచినవితదీయభుజాబలంబునంబరులజయించి ధరణీరాజ్యంబుఁబరిగ్రహింతుమని యున్నవారముగావు
నంగాలయాపనంబుసేయక యజ్ఞునుందోడ్కొనితేరజనార్దను నియోగింపుము * మ॥ సమయాబ్దంబులకంటెముంద
మహోత్సాహంబునన్ బాహువిక్రమమొప్పన్విజయుండు నేనయినసంగ్రామంబులోనేకకా । లమునందాధృతరా
ష్ట్రజాధములనెల్లంజంపిభూచక్రరాజ్యముఁజేకొందుముగౌరవేంద్రమురజిత్సఖ్యాభియోగంబునన్ * వ॥ సత్యభంగభీ
తుండవుగావుననీవిందయుండి పదుమూఁడేండ్లుసలిపిపదంపడికరిపురంబునకువచ్చిరాజ్యాభిషిక్తుండవుముదుష్టద్యూ
తంబునమనరాజ్యంబపహరించిన సుయోధనుండుసుచిరప్రతిష్ఠితుండుగాకుండ యిప్పుడయద్దురాత్మునూషింతుమని
ద్రుపతివరులవిశ్రుతిచేసి నిర్జించినఁబాపంబులేదుసర్వప్రకారంబులను శత్రువులజయించిరాజ్యంబుఁజేకొనుట రాజులకు
విధిచోదితంబైన రాజధర్మంబుమునినభీమసేనుమహాసంరంభంబునకుసంతోషించిధర్మనందనుం డాతనిందనపైకిందిగిచి
మూర్ధఘ్రాణంబుఁజేసియిట్లనియె * గీ॥ అనలునకుగాడ్పుదోడైనయట్లులింద్రతనయునకునీవుదోడైనఁదడయరాజ్య

భాసిఁగరిపులఁ బ్రతుకంగఁ బోలదైన। నరయ నిది గోపమున కవసరము గాదు. క॥ పను మూఁడేఁడులు పోయినఁ। బదపడ్డ గ్రంథు నీవుఁ బరస్పవతులఁదు। గ్ర్మదుల వధియించి విజయా। స్పదబాహుబలరగుడుధర్మ పరిరక్షకుఁడవై * వ॥ ఏనెట్లును సత్యసంగంబునకొడంబడనోపననిధర్మతనయుం డుభీమునకుం గోపావశమనంబుఁ జేసెనని జనమేజయునకు వైశంపాయనుండు చెప్పె నవపుణ్యకథయతిరమ్యంబుగాను. క॥ బిరుదాంకభీమభీమే। శ్వర కృతకృత్యప్రసాదసౌజన్యగుణా। భరణవరభైరవ। వరన్యపమణిమకుటఘటితపదవిబుధనుతా * ఉత్సాహ॥ రాజవంశరత్నరాజరాజదేవనిత్యల। క్ష్మీజయప్రమధర మిత్రభూరివిద్వదంబుభోజవనపయోజమిత్ర భూరికీర్తి కౌముదీ। రాజితత్రిలోకనిఖిలరాజలోకపూజితా॥......

గద్య. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునం దుఁ బాండవవనప్రవేశంబును గిమ్మీరవధయును గృష్ణపాంచాలాభిగమనంబును సౌంభకాఖ్యానంబును నింద్రకీలాభిగమనంబును గిరాతంబును నర్జునతపశ్చరణంబును నీశ్వరుతోడ యుద్ధంబును బరమేశ్వరుచేతఁ బాశుపతాస్త్రంబు వడయుటయును లోకపాలసందర్శనంబును స్వర్గాగమనంబును నూర్వశీశాపంబును దేవతలవలన దివ్యాస్త్రలాభంబును నన్నది ప్రథమాశ్వాసము.............. ... ..............

శ్రీ హయగ్రీవాయ నమః.

## శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీరమ్యధర్మనిత్య। ప్రారంభవిభాసి రాజపరమేశ్వర ఘో। రారిమదకుంభికుంభవి। దారణదారుణకృపాణసింహ సహాస్త్రా. వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు శాంతవచనంబుల భీమసేనునకుం గోపాటోపనివర్ణనంబు సేయుచున్న ధర్మరాజునొద్దకు బృహదశ్వుండను మహాముని వచ్చి విధిదృష్టవిధానంబునం బూజితుండై విశ్రమించిన యమ్మునివరునకు ధర్మతనయుండు ధర్మపరులైన వరులచేతం దమపడిన వికారప్రకారం బంతయు నెఱింగించి యిట్లనియె * క॥ పుడమియు రాజ్యము బంధుల। విడిచి దవ్యాగావలులఁ గలసి విపినంబులలోఁ। గడుకొని మాయట్లిడుమలఁ। బడినవారలం గలరె యెందులు పరమమునీంద్రా * వ॥ అనిన నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డిట్లనియె * క॥ దేవసములైన యనుజులతోఁ బ్రియసుతులతో రథాలితో వచ్చియరణ్యావాసము సేసెదు ధర। ణీవల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్ * క॥ నరనుతుఁడు దొల్లి నలుఁడను। ధరణీశుఁడు జూదమాడి తన విభవము పు। ష్కరుచేత నోటువడియె। క్కరుఁడకరఁబి కుమఁబడ డె కానన సీమన్ *

(*) ధర్మరాజునకు బృహదశ్వుండు నలోపాఖ్యానంబు చెప్పుట. (*)

ననది యెట్లని ధర్మనందనుం డడిగిన బృహదశ్వుం డిట్లనియె నిషధేశ్వరుండైన వీరసేనునికొడుకు నలుండను వాఁడు నేగాహిణీపతి యనవరతాత్తప్రియుండ జేయుండైన తనతేజంబున నెల్లరాజుల జయించి బ్రహ్మణ్యుండై ప్రజాహా గాఁ బ్రజాపాలనంబు సేయుచున్నంత * సీ॥ అటవిదర్భావిభుండైన భీముండను వాఁడనపత్యుఁడై వ్రతములోలిఁ సలుపుచుఁడు దమనుఁ డన్ ముని బ్రత్నియుఁ దానును పాసించితద్వరము। దమయంతియను మాతుఁదమనాంతదమనుల సుతులఁ బడసెవి శ్రుతగుణాఢ్యుల। డందు గన్యారత్నమగు దమయంతి దానత్యంతకాంతిరూపాభిజాత్య * గీ॥ విమలగుణసమృద్ధిఁ గుడు సురసిద్ధ। సాధ్యకన్యలట్టి సతులు నూఱ్వు। రోలసి తన్నుఁ గొలుచుచుండంగ మహినొప్పు। చుండెనధికవిభవయగుచు డ * క॥ నలుగుణములు దమయంతికి। నలునకు దమయంతిగుణగణంబులు జనులి। మ్ములబొగడుట విరువురకును। మనోభవవికారవిభ్రమ మెదలన్ * వ॥ ఒక్క నాఁడు నలుండు దమయంతీగుణబద్ధచేతస్కుండై మదనానలంబు సహింపక ప్రమాదావనంబునను డునంతనంతరిక్షకాంతా హారావళియుం బోలె హంసావళియవనీతలంబునకవతరించిన సేనను తుఁడు వీరుం డు హంసల। వడ బెడం గుజూచి నగుచు వాని। నెగిరి యెగిరి యెంమ నెగయ్యకుండఁ గనొక। హంసఁబట్టె యొనతరయమున * గీ॥ దానివిడిచిపోవఁ గానోపక యడుచు। నంతరిక్షమున ననుహంసలెల్లఁ। బింకఁ గట్టికిరుగుచుం డె

ద్ధూత శారదాభ్రశకలచయముం బోలె. వ. అదియు మదనక్ష్మాజేశ్వరుం డుపాయంబు సేయునకాఁ దలంచి వెలఁది
తుషమృ వాక్యంబుల నిట్లనియె నయ్యా యేనీకుం బ్రియంబు సేసెద నీహృదయేశ్వరి యైన దమయంతి పాలికిం బోయి నీగు
ణంబులు దానికి వర్ణించి చెప్పి యొక్కన్యాయన్యుల నపేక్షింపక నీయందు బద్ధానురాగ యగునట్లుగాఁ జేసెద. క. అనిన వి
హంసవచనము దనహృదయంబునకు నమృతధారాపాతంబునుబోలెనైన నృపనం దనుఁ డనురక్తుండయి విడిచె దడ
యకదానికి. వ. హంసపిండుతో నదియును విదర్భపురమ్మునకుం జని యందు వనమ్మున సఖిజనపరివృతయై యున్న
దమయంతి పాలికి వచ్చి విహరించుచుండె నంత హంసలం జూచి పరమకౌతుకమ్మున. గీ. ఒండొరుల గడువంగన ల్వ్యావిద
లెల్లఁ బట్టనిచ్చె యొక్కొక్క కలహంసఁ బట్టుకొనిన. జెలువముగ నందు దమయంతి చేతఁ బట్టువడియె నలు చేతవిడువంగఁ బడిన
హంస. క. దమయంతికి నలునకుఁ గసుకారణదూతయైన కలహంసమనోజ్ఞమనుష్యవాక్యములన్ దమయంతికి హ
ర్షమెసఁగఁ దా నిట్లనియెన్. వ. నీహృదయేశ్వరుండైన నలునొద్దనుండి వచ్చితి. ఆ పారావారపర్యంత మహీతలం
బునం దునాచూడ నిరాజు లెవ్వరు లేరు సర్వగుణసౌందర్యంబుల నెవ్వరు నలుఁ బోలరు. గీ. నీవు నలునకుఁ బత్నితోఁ దేవి నైన
నఁగాక నీసముజ్జ్వలరూపకాంతివిభవ, నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్యభద్ర, లక్షణావలులవిఫలంబులగునె. వ. నీ
వు నారీరత్నంబ వాతండు పురుషరత్నంబు మీయిద్దఱ సమాగమం బన్యోన్యశోభాకరం బనిన విని సంతృప్తహృదయ
యై దమయంతి దానికిట్లనియె. మధ్యాక్కర. ఆరాజుగుణములు నాకు నెఱుంగించినట్లనున్న నారాజున కెఱుఁగించి కరు
ణ నాయందుఁ గావింపు మా రంగనను మనఃపథ దేశంబు నకరిగి హంస, వీరసేనజునకు దానిగుణరూపవిభవములు సెప్పె.
అంత. చ. నలదమయంతు లిద్దఱును నగ్గ్రభవానలబాధ్యమానులై సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనంబు
లన్ నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులన్ దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చ
లన్. వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణశ్రవణసంజాతప్రీతులై యుండునంత నంతర్గతరణసంతతమనోజాతసంతాప
విషణ్ణవదనయైన యాదమయంతిం జూచి భయసంభ్రమాక్రాంతహృదయలగుచు సఖిజనంబు లెల్లన కొక్కసలివృత్తాం
తంబంతయు భీమునకెఱుంగించి యిట్లనిరి. సీ. కలహంసపలికినపలుకులు గణియించు వడిదానిపోయినవలను చూచుఁ బలు
మఱు సఖులతో లలితాంగి మిన్నక యలయుచునుండుఁ దా ననుదినంబు, చారువిభూషణాహారవిహారశయ్యాసనభోగంబు
లందు విముఖి, యయి రేయుఁబగలు నిద్రయు నెప్పుడెఱుఁగక దమయంతి నలుఁడను ధరణినాథునందు బుద్ధి నిలిపి కందర్పబాధి
తయగుచున్నయది ధరాధినాథ, ధరణిపతుల నొరులను రుగుణాఢ్యుల విన నొల్ల దెంతవిభవయుక్తులైన. వ. అనిన విని
భీము సేయుఁ డేమి సేయుదు నెవ్విధంబున నమ్మహీపతికటకు రావింపనగునో యని వింతించుచు సంప్రాప్తయౌవనయైన
తనతనూజాదియవ్విష. క. ఆ వైదర్భుఁ డఖిలధరావలయములోనఁ గలుగు రాజన్యుల నానావిషయాధీశ్వరులను రా
వించె దన స్వయంవరవ్యాజమునన్. క. మనుజేశ్వరు లెల్లను భో రన దమయంతీస్వయంవరమునకు నొప్పన్ జను
దెంచిరి సైన్యస్యందనఘట్టన నవనితలము తల్లడపడఁగన్. వ. తత్స్వయంవరంబునఁ బర్వతనారదులను పురాణమునులు
భూలోకంబెల్లఁ గ్రుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నింద్రుండు వారిఁ బూజించి భూలోకంబునం గుశలవార్తయడ
గి యిది మొట్టు ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహతులైన రాజులక్షయలోకసుఖంబు లనుభవింపనర్థులై యిందు
ఱుంకిత కాలంబు వచ్చేరాని కారణం బేమి యనిన నారదుం డిట్లనియె. క. నరసిద్ధసాధ్యవిద్యా ధరసురకన్యకలకంటె దమ
యంతి యసుందరి దాని స్వయంవరమునకు దైవర్యిల్లుచున్నయది యిప్పుడు మహిన్. క. అందఱకు ధరణిఁగల నృపనందను
లెల్లను మదంబునం బోయెదు వేడ్కం దమలోఁ గయ్యమ్ములు ముందుగ లేకున్న వారు కడు నెయ్యమునన్. వ. అనిన వి
ని యింద్రుండును లోకపాలవరులును దత్లోకనకౌతుకంబునం గనకరత్నరమ్యవిమానారూఢులై భూలోకంబునకు
వచ్చి దమయంతీస్వయంవరంబునకుం బోయెడువాని నాదిత్యులలోన విష్ణుం డుసుంబోలె దేజోధికుండైన వానిననన్యసా
ధారణరూపవిభవంబుల రెండవ మన్మథుం డనుం బోని వానినలుం గని యంతరిక్షంబున విమానంబులు నిలిపి భూతలంబున
కువచ్చి వానికిట్లనిరి. సీ. నిత్యసత్యవ్రతసమధికశ నీవు మానసరంగపూతవై యభినుతంబు సేయుము నా పుసుఁ జెప్పెర



ట్టిదఁ జేసెనపు జి నాకుఁ జెప్పుఁడు మీర. లెవ్వా రేను మీకిష్టంబుగా దూతనై యేమి సేయుదునని నలుండు

ట్టులమె నేనింద్రుండవీరుదిక్పాలురువిదితయశులు * గీ ॥ ధరణి నెప్పుచున్నదమయంతిసుస్వయంవరము జూడ వచ్చియున్న। వారమీవుమమ్ము వారిజాక్షికి నెఱుంగింపు నామధేయకీర్తనముల * వ ॥ అట్లైననకో౯ పలిమాయం వలసినవారివరియించుననిన నింద్రునకుఁగృతాంజలియైనలుండిట్లనియె * గీ ॥ ఎఱిఁగియెఱిఁగినన్నునేకార్థ సబాధియయ్యుయిట్టిపనికిఁబనుప। ననిననుత్సుకుండవైయేలసేసెద । నంటిసేయకుండనగునెనీకు * గీ ॥ నిన్ను నిరతుఁగానెఱిఁగియు। కార్యమునకు వలనుగలుగు టెఱిఁగి । పనుపవలసె దూతభావము పేక్షించి। దేవహితము వలయు * వ॥ఆయుధీయసురక్షితంబై నరాజగృహంబెట్లుఁ జొరనగుననిశంకింపవలవదు దమయంతీనివేశంబుఁబ్రవే పునని స్వెవ్వరు వారింపనోపుదురనిన శక్రువచనంబులనశంకితుండై నలుండొక్కరుండ విదర్భాపురంబునకుఁ

## నలుఁడు దమయంతినొద్దకు దేవదూతయైపోవుట.

దమయంతీగృహంబుసొచ్చి * సీ॥ హంసచేఁదనవినినంతకంటెనురూపవిభవాతిశయముల వెలుఁగుదాని। సురకన్య ట్టిపురుచిరశతకన్యకాలిచేఁబరివృతయైనదాని। హృదయేశుఁడైనతన్నేప్పుడువినుచున్కి -యలయుకాశ్వాసితమై దమయంతిఁజూచి కందర్పశరావిద్ధుఁడయ్యెనలుండంతనతనిఁజూచి * గీ॥యితఁడపూర్వుఁడునుజుఁడెందుండివచ్చెనో చునదరిపడిలతాంగులెల్ల। నాసనములుడిగ్గియపుడు ప్రత్యుద్గత। లైరిమనములందుహర్షమెసఁగ * క ॥ దమయంతీ భువనిభు। నమరేంద్రప్రతిముదినకరాభసుధాభూ । సమువరుణసదృశుధనదో । పముసశ్వి సమానుఁపథపతిఁ లుఁ * క ॥ వారిరుహనేత్రమదన। ప్రేరితయైలజ్జయుడిగిభీతిల్లకబ్బం। దారకమూర్తికిరాజకు। మారునకిట్లనియె మందమృదూక్తి * వ ॥ నీవుమహానుభావుండవిందులకేమికారణంబున నేకతంబవచ్చితివత్యుగ్రశాసనుండైన జనకుచేతసురక్షితంబగుట నెవ్వరికిఁజొరనశక్యంబుదీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునఁజొచ్చితివామనో వావివర్ధనుండవైననీ తెఱంగెఱుంగింపుమనినదానికినలుండిట్లనియె * గీ ॥ ఏను దేవదూతనంత్రినలుండను। వా నదవరుణయములు।నీస్వయంవరంబునెమ్మితోఁజూడంగ। నరుగుదెంచినన్నునబలమున్న * క ॥ నీయొద్దకుఁబుత్తె మాయందొక్కరునిష్టమతివరియింపఁ । దోయజముఖి ప్రార్థింపుము। మాయందఱుప్రియమొనర్పు మానస్త్రీ వ ॥ అనిపంచినఁ దత్ప్రభావంబుననన్యులచేతనలక్షితుండనై వచ్చితినింద్రాదులకుఁ బ్రియంబు సేయుమనిననవ్వి నరయైదమయంతితొల్లి హంసచేతనలువిని వానియందు బద్ధానురాగయైనదయుచున్నయది । యపుడతని నెఱింగి శ్రవణదుఃఖాయమానమాన సయగుచు నిట్లనియె * తరువోజ ॥ ఏనేడనింద్రాదులేడవారలకు నెప్పుడుమ్రొ దునేసునీధనము । భూనాథనీగుణంబులుహంసచేతఁబొలుపుగావినిమనంబుననిలిపియున్న । దానభవన్మిత్రత ఖిలధారుణీనాథసార్థంబురావింపఁ । గానిప్పుడిట్లనైలోక ఖ్యాతకీర్తికరుణించిపతిబుద్ధిగావింపుమింపు * వ ॥ కొండంబడనిన్నుఁనురజ్జువిషాగ్నిజలంబులం బ్రాణపరిత్యాగంబుసేసికొందుననినదానింజూచినలుండిట్లనియె * లు॥ భూరిసత్త్వులుసర్వలోకవిభుల్విభూతిసమృద్ధులి । ద్ధోగుకీర్తులునిన్నుఁగోరుచున్నవారనరోత్తముల్ । పాదరజంబుఁబోలనివాని నన్నుమనుష్యునం। సారెఁగోరఁగఁజన్నెనీకుఁబ్రసన్నులై సురలుండఁగాఁ * క॥ దేవత యంబులు। గావించిమనుష్యులధమగతులగుదురిలం । గావునవారికినిష్టము । గావింపుమునన్నుఁబ్రీతిఁగావుమ వ ॥ అనినదమయంతి నయనాంతర్గళితబాష్పధారాకలిత కపోలయుగళయగుచుం బెద్దయుం బ్రొద్దు చింతించి ప్రాయంబునకు నిరపాయంబయినయుపాయంబుగంటినింద్రాదులునాస్వయంవరంబునకు వచ్చెదరేని వా నిన్నువరియించెద నట్లయిన నిర్దోషంబగుననిన నలుండులోకపాలుర పాలికింజని దమయంతికిం దనపలికినవిధ మ్మైనంతఁబుణ్యతిథినక్షత్రముహూర్తంబున దమయంతీస్వయంవరంబు ప్రవర్తిల్లిన * గీ ॥ నలునకానినలినద వరియింపదట్టిచూత్రమునుచునమరవరుల్లు । నలువురునగడంగినలరూపములవచ్చి। రాస్వయంవరమునకతిమందు సీ । దమయంతిసితపుష్పదామాభిశోభితహస్తయైచనుదెంచియంబుజాక్షి । యమ్మహోత్సవదర్శనాగతరాజ వంబునీక్షించి వెలయనంత । నలువురువేల్పులునలుఁదొట్టియప్పుడేకాకారులైయున్నవందునలుని। నేర్పఱింపఁగ ద్రాదులనునలునెఱుఁగనుపాయమింకెద్దియొకో। యనుచుసంశయాకులాత్మయైసురలార। నలునెఱుంగు విధము

జేయుఁ డాత్మరూపధరులఁ గుఁడని వారి దేవ। నంబు సేసెఁ దన మనంబులోన * వ॥ దేవతలుం దాని వరి దేవనంబునకుఁ గరుణించి యనిమిషలోచనంబులు నస్వేదగాత్రంబులు నొప్ప నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచి రంత లోకపాలురు భూలోకంబునం గల రాజలోకంబు నాలోకించుచుండఁ బుణ్యశ్లోకుండయిన నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయకంఠంబున సుగంధకుసుమదామకంబు వెట్టిన * క॥ దేవతల సాధువాదము। తో విప్రాశీరవంబుతో బహుతూర్యా।

## * నలుండు స్వయంవరలబ్ధయైన దమయంతిం బెండ్లియగుట. *

రావంబులు చెలఁగెను బా। రావాగరవంబుఁ బోలె ననివార్యంబై * వ॥ ఇట్లు పూర్వస్వయంవరలబ్ధయైన దమయంతి నత్యంతవిలాసంబుతో వివాహంబైన యనలునకు నింద్రుండు వానియజ్ఞంబులయందు నిజరూపంబుతో హవిర్భాగంబు గొనను నగ్నియు వరుణుండును వానివలనం జోట నయనలోదకంబు లుత్పాదింపను ధర్ముండు వానిచిత్తంబు ధర్మంబునంద వర్తిలను ధనదుండు ధనసంచయంబు లక్షయంబులగునట్లుగా వరంబు లిచ్చి దేవలోకంబునకరుగువారెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని యెందుండి యేమిట కెందులకుం బోయెదవని యడిగిన నయ్యింద్రునకుఁ గలి యిట్లనియె * గీ॥ అవనిలో దమయంతీస్వయంవరంబు। విస్తరిల్లుట వినికడు వేడ్కతోడ। నేను దమయంతిచే వరియింపఁబడుదు। ననఁ దదర్థమై యరిగెద వానవజేసి * వ॥ అవిననందఱును గనీవందుల కేలపోయెదము ముందఱ నివృత్తంబయ్యె నక్కోమలి యమరుల నెవ్వరి మెచ్చక నలుండనువానిని వరియించె నని నం గలి కరంబలిగి యన్నలునకు దమయంతికి రాజ్యపరిత్యాగంబును బరస్పరవియోగక్లేశంబునం జేసెదనని నిశ్చయించి వానిన ఘరంధతుం గానెఱింగి యక్షంబులు సొచ్చి యుండ ద్వాపరంబుం బనిచి నలుండు చేయుచున్న యశ్వమేధాదికానేక భూరిదక్షిణమహాక్రతువులయు జపహోమదానాది వివిధపుణ్యకర్మంబుల కారణంబునం జొరనవసరంబు గానక యంతరంబన్వేషించుచుఁ బెద్దగాలంబుండి యొక్కనాఁడతండు కృతమూత్రుండయి జలోపస్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయమఱచి సంధ్యోపాసనంబుఁ జేసిన నుపలబ్ధావసరం బయినం గలి నలునందుఁ బ్రవేశించి పుష్కరుండను వానిపాలికిం బోయి తన్నెఱుంగించి నీవు నలుతోఁ జూదంబాడి వాని రాజ్యంబు సర్వంబును నోడించి కొమ్మని చెప్పి తానును వానికి విప్రవేషంబున సహాయుండయి యక్షంబులుగొని పుష్కరుతో నొక్కటఁ జని నలుంగాంచి నీవు మారాజుతోఁ జూదంబాడుము వినక * క॥ ద్యూతార్థము తత్కృత వా। హూతుఁడనై జూదమాడఁ బంటుడు ధర్మా। పేతంబని యభిముఖుఁడై। యాతనితో నలుఁడు జూదమాడఁగడంగెన్ * క॥ కలధనము లెల్లనొడ్డుచు। నలయక జూదమున విజితుఁడగుచుండెనిజా। ప్తులు వారించిననుడుగక। నలుఁడు కలిప్రేరణంబునను హతమతియై * వ॥ ఇట్లనేకమాసంబులు దుర్వ్యసనాసక్తుండయిన యన్నలుండు వివిధవస్తువాహననివహంబులొడ్డి పుష్కరునకోటువడంబోయిన నెఱింగి పౌరబ్రాహ్మణప్రధానులు దమయంతీపురస్కృతులయి వచ్చి వారించి కలిసమావేశపరవశుండయిన యన్నలుచేతం బ్రతిహతులయి వలుకకుండిరంత దమయంతి చింతాక్రాంతచిత్తయై * గీ॥ ఎంతయోటు వడిన నంతియ జూదంబు। నందుఁ దగులుఁ జలము నతిశయిల్లు। నేమి సేయుదాననిది యెగ్గునకు మ్రాల। మనిలతాంగి దుఃఖితాత్మయగుచు * సీ॥ అక్షములు పుష్కరునందు వశ్యంబులై యునికి యు నలు విజయంబొందు విధము। లగుటయు నెఱిఁగి నిజాధీశ్వరునకు పజయము కాలక్షించి సంసిజాక్షి। భర్త యనుజ్ఞ ముకొబడసి వార్ష్ణేయుఁ డను సారథిఁ బిలిచి యాస్యందనమున। నింద్రసేనుండను నిక్కుమారకు నింద్రసేనయన్నాంతుఁ జెచ్చెరన తోడ - గీ॥ కొనివిదర్భకొరిగి గురుకొనియు బంధు। జనులయొద్దఁ బెట్టి సరగ నీవు। మరలిరమ్మటంచు మహితయై తాఁ బుచ్చె। మంత్రి బాంధవాభిమతముఁ బొంది * క॥ నలుఁడును ధరణీరాజ్యము। దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁగడుఁ। దలరి దమయంతిఁ దోడ్కొని। వెలువడియెనశేషరాజ్యవిభవచ్యుతుఁడై * గీ॥ పురము వెడలి మూఁడు హోరాత్రములు వసించి। యన్నలుపాలికెవ్వరును నోడిరరుగఁ జనవిభుండై నపుష్కరుశాసనమునఁ। గలికృతద్యూతవిద్వేషకారణమున * వ॥ ఇట్లు సర్వజనసత్కారాస్పదుండయ్యును నలుండు

## * నలుండు దమయంతీసహితుండై యడవికిఁ బోవుట. *

విధికృతంబున నెవ్వరివలనను సత్కారంబు గానక జలంబులాహారంబు గాఁ దత్పురసమీపంబున దమయంతీద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ జదుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబగుననియు నప్పటు లంబట్టి కొనం జుట్టుగట్టి కట్టిన పుట్టంబు వానిపైవైచిన నప్పక్షులు పుట్టంబుతో గగనంబున కెగసిన నతడు విగతవస్త్రుండై న నలునకిట్లని

యెం. గీ॥ నీధనంబును రాజ్యంబు నికృతిఁ గొన్న । యక్షములమేము నీవస్త్రమపహరింపఁ । బక్షిరూపులమైవచ్చి పక్షు
యపహరించితిమని చెప్పి యరిగెఁ జదల ✻ వ॥ నలుండును వానిం జూచి విస్మయంబంది యీయక్షంబుల దోషంబునం గా
వాకట్టిదయ్యె ననుచు దమయంతి కట్టినపుట్టంబు చెఱంగు కట్టికొని యెట్లిరువురు నేకవస్త్రులై యొండొరుల మొగంబులు
చిదుఃఖించుచు నలుండు దమయంతి కిట్లనియె . క॥ ఇది దక్షిణాపథంబున । కిది యవిదర్భాపురమునకిది కోసలకిం । దిది యు
నికిఁ దెరువులు । మది నిన్నిటిలోన నరుగమున కెద్దియగుఁ గా . క॥ అడవులలో వాతోఁ గడు । నిడుమలువడ నోవ వరుస
మాకు ఖేయి । న్నిపుడు నీబంధుజనంబుల । కడకనవుడుఁ దరుణి శోకగద్గదయగుచుఁ గా ✻ గీ॥ అతని కిట్లను రాయెన వనీశ నీవు ।
జని విదర్భ నిష్టలీల । మండుదమూవ్యాగాకులోగ్ర వనంబులఁ కరుగనేల యిక్కుమలంద నేల . వ॥ అనిన విని నలుండవ
నుండై నీ చెప్పినట్ల విదర్భేశ్వరు రాజ్యంబును మన రాజ్యంబ యేను దొల్లియధికైశ్వర్యయుతుండనై యంచులకుంబో
ధుజనులకు హృదయానందంబు సేసి యిప్పుడివ్విధంబున సర్వహీనుండనై యేనెట్లు పోవ నేర్తు ననిన దమయంతి
యె . గీ॥ అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు । సురుచిరంబుగ భార్యయ చూవె యెందు । నొనర భార్యాసమేతుండై య
వాని కెంత నాపదలయ్యు నెఱుకపడవు ✻ క॥ అలయు నెడ డయ్యు నెడ వాఁకలియుం ద్రుపయు నైన యెడలఁ గడుఁగా
ణీ । తలనాథపురుషునకును । మ్ములభార్యయ పాచుఁ జిత్తమునదుఃఖంబుల్ . వ॥ కావున నిది మదధీనజీవితయనియు
వ్రతయనియు ననుకంపనీయయనియు నన్ను విడువక నాయనుగమనంబునకు ననుమతుండవు గమ్మనినట్ల చేయుదు
ననసమానవై నని న్నేల విడుతు నోడకుండుమని నలుండు దమయంతి నాశ్వాసించుచు నొక్కటఁ జని విజనంబైన
సనొక్క సభం గని యందు విశ్రమించి పరుషధూళిధూసర స్థలంబున శయనించి మార్గశ్రమనిమీలితనయనుండై
ఖంబునఁ గన్ను మొగుడకున్న లేచి తనపాదంబుల యంతికంబున నతిక్లేశపరవశయై నిద్రబోయెను దమయంతి
సీ॥ ధరణిరాజ్యంబుతోఁ దన మెల్లఁ బరులచే నపహృతంబగుటయు నాత్మమిత్ర । బంధుజనంబులుఁ బ్రకృతిజనంబులు
టయు నను మహావిపినభూమిఁ । బత్నితోడ వరిభ్రమియించుటయు నప్పుడలఁ దిశోకించియు త్తరుణితోల్లి । మృదుశయ
మెఱఁతలు మెలవుతో నడుగుల్లో త్తగని ద్రయనుభవించుఁ - గీ॥ గోమలాంగి యిపుడు గుగుకొని పాంసుల । స్థలమునందు
గిలిన దియాఁ । బంకజాక్షి నాకు భార్యయై యింత దుఃఖంబుఁ బొందెదై వఘటనఁ జేసి . వ॥ ఏను దీని దుఃఖంబుఁ జూడనో
టకేని యొంటిపోయెద నిది నన్నుం గానక తనబంధుల యొద్దకుం బోయి దుఃఖపడకుండు ననవిచారించి పోవ సమకట్టి య
మలి మేలుకొనకుండ మెల్లన దాని వస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొక
యు దమయంతి యందు ఘనంబైన తన నెయ్యంబను తీగ త్రెంప నేరక క్రమ్మఱ నచ్చోటికి వచ్చి ✻ చ॥ కిలి దమయంతిఁ బా
కట్టు సతిఁ బతివాయ నోపఁడా । లలన సుదీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటఁ జేసియున్నలుఁ డవి మోహరజ్జుల
గిగతాగత కారియె నయ్యు । య్యాలయు నుబోలె నూఁగడక యెంతయు బ్రాద్దువిశ్చిత్తాత్ముఁడై . గీ॥ బాలనొక్కర్తు
పాలు సేసి । నిష్ఠురుండనై యేనెట్లు నేర్తుబోవ । ననకకలి చేత నాకృష్టుఁడై ననలుఁడు । విగతకరుణుఁడై దమయంతి
చనియె ✻ వ॥ అంత దమయంతి మేలుకని తనపతిం గానక తనవస్త్రార్ధవికర్తనంబునుం జూచి లేదినలుగడలుఁ బరికిం
భయశోకవ్యాకులితచిత్తయై ✻ సీ॥ హా మహారాజ మహామహీరక్షణదక్షదక్షిణబాహుదండదండి । తాగాలీన
జాగ్రణీ నన్నిట్లు పీతదయుండవై విడచిపోవఁ । దగునె నీ వెన్నఁడు ధర్మువు దప్పనివాఁడవు సూనృతవ్రతరతుండ ।
మనినన్ను నూఁబడఁ బలికినపలుకి పుము అవం గఁ బాడియయ్యె । పొదలలోన డాగి పొడసూపకిట్లేల । యున్నవాఁడవిట్టి
భావ । మేల నీకు నయ్యె నెటఁ బోదుని న్నెట్లు । గాంతు నింక నుగ్రకాననమున ✻ క॥ వగవగ సాంగోపాంగములు గు వా
దములయు నధ్యయనము పోల్పగ నొక్క సత్యముతో నెన । యగు నెవ్వియు నొండు పోలవఁట సత్యంబుల్ . వ॥ ప్రాణస
శాలవై వనిన్న వశ్యంబును విడునని పలికితి సత్యప్రతిపాలనంబు సేయుమని ప్రలాపించుచుం దనయేకాకిత్వంబు
బలభావంబునకుఁ బ్రతివదవ్యాసజాయమానకంటక మృగపన్నగభయంబునకు వగవక నిజనాథున సహాయత్వంబును
స్నేహఘ్నత్వ సాస్త్ర మాకులత్వంబునకు వగచుచు ✻ క॥ అలయుచుఁ బులుగులఁ యెలుఁగులఁ । బలుకుచును గ్రాతవ
శన్నతింబుల నీడల నిలుచుచు నెలుఁగులఁ బులులఁ జూచి భయము నొందనగరుగన్ ✻ క॥ ఏచిఁ పాపఁ బడల్పడ । ద్రో

మండ్లమేమనల్లఁ దోలఁగుచు దిక్కుల్ । చూచుచుఁ దొడరుచుఁ ద్రెళ్లుచు । లేచుచు లలి తాఁగి సంచలించుచు నరిగెన్ ॥ వ॥ ఇట్లు
రుగుచున్న దమయంతి నంతికన్య స్తచరణమైన దాని నాహారార్థియై యొక్క పన్నగంబు పట్టికొనిన నక్కోమలి మె
దల నేరక ॥ గీ॥ ఇంక నైన నన్ను నేల యాలింపవు । నాకు శరణమగుము నాథ యనుచు । నలుచుచున్న దానియాక్రం
దనధ్వని వినుచు నొక్క యెఱుకు వేగవచ్చి ॥ వ॥ తనవట్టిన సురియ నప్పెనుబాము వదనంబు వ్రయ్యం డఱిగిన రాహుము
ఖయైన చంద్రరేఖయుంబోలె నజగరముఖంబువలన వెలువడిన యాదమయంతి నాశ్వాసించి తత్సమీపసరోవరస్నా
తను వన్యస్వాదు ఫలాహారను గాఁ జేసి సేదదీర్చి నీ వెవ్వరిదాన వేకతంబ యివ్వనంబునకేల వచ్చితని యడిగి వ్యాసభా
షిణియైన యమ్మగువవలన నంతవృత్తాంతంబు నెఱిఁగి ॥ కవిరాజవిరాజితము ॥ రజనికరాననఁ బీనపయోధరరాజితరా
జసుతఁ గవిలసద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁబం । కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాత
శరాహతుఁడై । నిజహృదయం బెఱుఁగించె లతాంగికి నింద్యచరిత్రకువేకుకతోన్ ॥ గీ॥ అగ్నిశిఖయుబోలె నంటనుడా

*దమయంతి శాపంబున నంగిరాతుండు చచ్చుట*

యను జూడరాని యట్టిశుభచరిత్ర । నెఱుక లేనికఱుకు టెఱుక పేక్షించెఁ గాన । దనకతనను నాయువల్పమైన ॥ వ॥ దమయం
తియు వానిం జూచి యలిగి యేను బతివ్రతనైతినేని యిద్దురాత్ముండైన కిరాతుండు మృతుం డయ్యెడు మని శాపంబిచ్చిన వాఁ
డప్పుడ యగ్నిదగ్ధంబైన వృక్షంబునుంబోలె విగతజీవుండై పడియె నట్లు పరమపతివ్రతాప్రభావంబున ॥ క॥ బాలహృదయ
మునన్ నృవశాగ్రహాలు విజాధీశు నిలిపి దుష్టోరగశా । ర్దూలాభీలమృగావలి । కోలిసభయమందకరిగెను గ్రాటవిలోన్ ॥ వ
ఱియును ॥ సీ॥ సహకారము త్రియసహచరుఁబున్నాగపున్నాగతిలకుభూభువనతిలకుఁ । జందనబుధహారిచందనుఁబుష్పి
తాశోకసుహృజ్జనశోకదమను । వకుళకులైకదీపకుపిభీతకభయభీతారిహరునలుఁ బ్రీతితోడఁ । గానరేకానలోఁ గానలో
త్తముననుమ్రానుమ్రానికి నరుగు నరిగి - గీ॥ యడుగునడుగు లెండవడిఁ బుగపురఁబొక్క । గిరాంతరములనిలుచుఁబొ
లుచుఁ దరులగిరులయెడల సురుగుహాగృహములఁ । దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి ॥ వ॥ ఇట్లు దమయంతి నిజనాథునన్వే
షించుచు భీషణారణ్యంబునం దిరుగునది ముందట ॥ మత్తకోకిల ॥ వారిభక్షులు వర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ
హారభక్షులు వృక్షమూలనివాసనక్తులునై తపం । బారఁ జేయుమహామునీంద్రులయాశ్రమంబెడఁ గాంచెనఁ । భోరుమహో
పురాసమార్జిత పుణ్యకర్మఫలంబునన్ ॥ వ ॥ ఇట్లు మృగవ్యాళ తస్కర కిరాతపర్వత నిరంతరంబైన కాంతారంబు
నం బుణ్యనదీతీరంబున నొక్కమునిపల్లెయందు వసిష్ఠవామదేవవాలఖిల్యభృగునారదసదృశులైన మహామునులం గని న
మస్కరించియున్న నమ్మునులు దమయంతిం జూచి యచ్చెరువడి యవ్వా నీవెవ్వరిదాన విన్వన దేవతవె దేవభామినివె ది
వ్యంబైనయీతేజంబుతో నేల త్రిమ్మరియెదవనిన వారలకు దమయంతి యిట్లనియె ॥ క॥ వినుఁ డేఁ బుణ్యశ్లోకుఁ । డనఘుఁ డసదా
ఖిజ్జనిరతుఁ డనఁగధరిత్రికి । దనరిననలుభార్యను సజ్జనసుత దమయంతియన నెసంగినదానన్ ॥ వ॥ విధికృతంబున నన్నుం
బాసి హృదయేశ్వరుం డెటయేనియుం బోయిన నతని యన్వేషణాసక్తచిత్తనై విపినవరిభ్రమణంబు సేసెద నిత్తపోవనంబున కువ
చ్చిన లుండు భవత్పాదాభివందన కృతార్థంబై యొక్కడకుంబోయె నతనిపోయినవల నెఱుంగుడు రేని నానతింపు గొ
న్నిదినంబులలోనఁ దద్దర్శనంబు సంభవిల్లని నాఁడు దేహంబు విడుతునని యేడ్చుచున్న దానిం జూచి కరుణించి మును లిట్లనిరి ॥
॥ వనజాయతాక్షి కతిపయ । దినములఁ జూడంగఁగాంతు దివిరినలు నిభూ । జనసుతు నెప్పటియట్టులఁ । దనపురమున రాజ్య
లీలఁ దనరెడువానిన్ ॥ వ॥ మేము తపోదృష్టిఁ జూచితిమి దుఃఖింపకుము సని తాపసులు తమయగ్నిహోత్రంబులతోఁ ద
పారఫలపుష్పతరునదీరమ్యతపోవనంబులతోఁ దారందఱు నదృశ్యులైనం జూచి దమయంతి యదికలయో యిది యొక్కవంబో య
ని విస్మయంబందుచుఁ జని ముందట నొక్కచనువఁగని దానిం జూచునపుడందలి జనంబులు ॥ సీ॥ పాంసుజాలంబుపైఁ బ్రాఁ
నఁగరము రూక్షములగు మూర్ధాలకములదాని । నతిమలినంబైన యర్ధవస్త్రంబున నావృతంబగు దేహయష్టిదాని ।
శకలిత్రపనిద్రలనువానినెఱుఁగక యున్మాదినియుఁబోలె నున్న దాని । దమయంతిఁ జూచి కొందఱు పిశాచంబనిపలుకరి
కొండఱు భయముఁబొందిరి - గీ॥ కంతఁ గొంద ఱధిక హాసంబు సేసిరి । యడరి నేసిరో సెకనిరి గొంద । అవ్వ నీవు వేల్పవౌకరి
కొండఱు । మొగినకేలు మొగిచి మ్రొక్కిరి ... సార్థవాహుల జూచి ... హానంబునట్టిజ

నసంకులంబై నసార్థంబుగానంబడియె నెట్టిపుణ్యంబో యనుచు వారలకిట్లనియె * క॥ ఏమనలుభార్యపుణ్యవి। స్త్రీ
తిఁబాసినవసియేకాంతనై యీ। కానలఁబరి భ్రమించెదఁ। గాన రేమీరమరసదృశుఁగరుణాత్మునలున్ * వ॥ అనినద
త్తికాసార్థవాహాధ్యక్షుండు శుచియనువాఁడిట్లనియె * క॥ నలుఁగానమివ్వనంబునఁ। గలవెవ్వియుఁగాంతుమ క్రూర
సింహం। బులబుతంబులనిదివ। ర్త్యులకవిషయమాతపంబుదూఱదుదీవిన్ * వ॥ అనిననిచ్చనువ యెక్కడ బోయె
దుడిగిన నిది చేదిపతియైన సుబాహుపురంబునకుం బోయెడుననిచెప్పిన నట్లేవిమీతోడవచ్చెదనని పరమపతివ్ర
ర్త్యనలాలసయై మునులవలుకులు దలంచుచు సార్థవాహ సమూహంబుతోడ నరిగి * క॥ కడునెండయెక్క
నుడుగకనచ్చనువనడిచియు గ్రాటవిలో।విడిసెబహుశీతజలములఁ। బెడఁగగునొకచెఱువునొద్దఁబెద్దయుడప్పిన్
సీ॥ అర్థరాత్రమునప్పుడందులకేతెంచె గజయూథములుజలాకాంక్షఁజేసి। యంబుధివిమలజలంబులాస్వాదిం
చెంచుజలధరసమితియట్లు। చనుపలోని ద్రావసక్తులైయున్నవారున్నతద్విపములయుగ్రపాద। హతిఁజేసి
రికొందఱుదంతహతిఁజేసిభిన్నాంగులైరికొంద-గీ॥ అఱచి ప్రాణభీతిఁబఱచిమ...జంబు। లెక్కరందుఁగొందఱు
రి।చనుపయిట్టిపాటఁబెనుపటిమువినీతు। సిరియపోలెనడఁగివిరిసిచెడియె * వ॥ ఇట్టిసంక్షోభంబునమరణంబునకుఁ
దయంతియాత్మగతంబున * గీ॥ జీవితార్థులైనజీవులసుఖసుప్తులైనవారిఁజంపెఁ అవనవ।మరణకాంక్షనున్న
వకతను। మఱి చెవిధికరంబునందబుద్ధి * సీ॥ ఇచ్చనువనుజనియివ్వనక్లేశంబుదలఁగుడునవిబుద్ధిఁదలఁచియున్న। 
సార్థవహోరాశిహస్తియూథాగస్త్యుచేఁ బీతమయ్యెనదియుఁ। దొలుమేనఁజేసినదుష్కృతశక్తియో పగనంగ
యంవరమునాఁడు। సురవరులగ్నులై చూచుచునుండంగనలువరియించిననాఁటియెగ్గు - గీ॥ దలఁచియిట్లియ
రోవేల్పు।లమరకోపమునన్ యయ్యెనాకు। నీపరియోగదుఃఖమింకేమిచేయుదు। నపుచువగచుచుండెనంబుజాక్షి

——✽దమయంతి సుబాహుపురంబు ప్రవేశించుట.✽——

ఇట్లుదుఃఖించుచు దమయంతి ప్రభాతంబున హతశేషులైనవారలతో ననవరతప్రయాణంబులం జేదిపతిపురంబుసొచ్చి
సంకులంబైన రాజమార్గంబు దరియవచ్చుచున్నదాని దినకరప్రభావటలధూసరంబై దివాతనచంద్రరేఖయుంబోలె
ప్తివిహీనయైయశస్సియు రహ్యాకృతియైనదానిఁ బ్రాసాదతలగతయైనరాజమాత యాదమయంతిదవ్వులంగని దాదిన
ట్లనియె * గీ॥ జీర్ణమైకడుమాసినచీరగట్టి। ధూళిధూసరాలకములుదూలుచుండ। నబలయున్మత్తవేషిణియైనదద్వి।
టవచ్చుచున్నదిక్కంటెదా * వ॥ ఆక్రోశమలియిందువాకతిస్నేహంబైనయదిదానిందోడ్కొనిరమ్మనిననదియదమయ
దోడ్కొనిరాజమాతయొద్దకుంజనినరాజమాతయుదానిఁజూచి నీవెవ్వరిదానవిట్లేలదుర్దశావేశవివశవైయున్న
చెప్పుమనినదమయంతియిట్లనియె * మధ్యాక్కర॥ జితవైరిమత్పతిజూదమాడివిపత్తునిర్జితుఁడయిచనినఁ।బతితోడనేన
బోలె నేనునుబాయకయరిగి। యతిబుభుక్షాతురుండైనపతిచేతనవ్వాడైవాను। మఱిఁజేసివంచితనైతినెక్కడబోయెనొ
ద్రించి * వ॥ అంతనుండియునమ్మహానుభావునేకవస్త్రునతిమనోహరునన్వేషించుచుసైరంధ్రీవ్రతంబుఁజేకొనివిపి
నలంబునం గందికలడమూలఫలంబుల యాహారంబుగాఁబ్రొద్దువడినచోటునివాసంబుగా మృగంబులుసహాయం
వనంబునఁబరిభ్రమించితినని బాష్పజలంబులంబయోధరస్థలప రాగంబుపంకంబుసేయుచుఁ బలుకకున్నయాదమయం
తికిరాజమాతయిట్లనియె * క॥ నీవుండుమునాకడనిం। దీవరదళనేత్ర నీపతిఁబరోయఁగభూ। దేవోత్తములంబంచెద
ననిట్లనియెభీమనందననెమ్మిన్ * వ॥ ఏనుసైరంధ్రికైవడినుండి యుచ్ఛిష్టంబుముట్టను బదధావనంబుసేయను
పురుషులతోఁ బలుకనోపఁ బతినన్వేషించు పొంటెనరిగెడుబ్రాహ్మణులతోఁబలుకుదునట్లైన నీయొద్దనుండు
డువిధంబైననుండనేరననిన నీకిష్టంబైనవిధంబుననాయొద్దనయుండుమనిదానిసతిగౌరవంబునం జేకొనియుండఁ
తుసునందయనుదానిసమర్పించిన * క॥ అలయికపుణ్యవ్రతములు।నలువుచుసైరంధ్రియనఁగఁజైద్యేశుపురిన్
యుండెనెదఁబతిఁ।దలఁచుచుదుస్సహవియోగతాపార్తితయై * వ॥ అటనలుండుదమయంతింబాసిదారుణారణ్యం
నరుగువాఁడుముందట * చ॥ అవిరళవిస్ఫులింగనివహంబులనభ్రపథంబునంటుచున్। దవదహనంబుదగ్రతర
సేయుచున్నఁజూచిమా। నవపతిదానియంతరమునన్వనియెన్నలవార్తనమ్మనగా। రవమునవేగఁగావనిటర

శమహానినాదముగా * క ॥ విని శంకింపక చెచ్చెర । ననఘుండత్యుగ్రతరదవానలమధ్యం । బునకరిగి కని యెదీవా । నను
మండలితాంగునొక్క నాగకుమారుగా * వ ॥ అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలియై యేను గర్కోటకుండ
నువాఁడఁ గర్మవశంబున నొక్క బ్రహ్మఋషి నుల్లంఘించిన తత్పాపంబున నెక్కడం గదల నేరకున్నవాఁడ * క ॥ నాలు
గుదిశలను దావ । జ్వాలావలిగవిసెను డించా నోపమహీ । పాలక నన్నొక నరసీ । కూలముఁ జేరంగ నెత్తికొని పొమ్ము ద

నలుఁడు గర్కోటకుని చేత దష్టుండగుట.

యగా * వ ॥ నన్ను రక్షించిన నీకుఁ బ్రియంబు సేయనోపుదు ననిన వాని నెత్తికొని పోవం జులకనై యంగుష్ఠమాత్ర శరీ
రుండై యున్న నెత్తికొని నలుండతిత్వరితగతి నరిగి దావవర్జితంబైన యొక్క సరోవరసమీపంబున విడువం బోయిన నింక
నుబదియడుగులరుగుము నీకు శ్రేయఃప్రాప్తి జేసెద ననిన నడుగులెన్నికొనుచు నరిగి పదియవ దగునడుగున నప్పాము
చేత దష్టుండై తనరూపంబు విడిచి వికృతరూపంబుతో నున్న నన్నలునకుఁ గర్కోటకుండాత్మరూపంబుఁ జూపి యిట్లనియె న
య్యా నీవు నా చేత విషపీడితుండవై తిన విదుర్లక్షింపవలవదు నిన్నోరులెఱుఁగిన నెగ్గగుంగావున వికృతశరీరుం జేసితి నెంతకా
లంబు నీ శరీరంబున నా విషంబుండు నంత కాలంబును నీకు విషోరగ రాక్షసపిశాచశత్రునివహంబులవలని భయంబు లేదు
సర్వసంగ్రామజయంబును భార్యాసంగమంబును నెప్పటియట్ల రాజ్యవిభవంబును గలుగు నీ కెప్పుడేని నిజరూపంబు సేకొ
న నిష్టంబగు నప్పుడ నన్ను దలంపుమీ వస్త్రంబు నీయొద్దకు వచ్చు దాని ధరియించుడు నిజరూపప్రాప్తియగు ననివరం బి
చ్చి వెండియు నిట్లనియె * మధ్యాక్కర ॥ ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁడను మహీశుఁ డిక్ష్వాకుకులజుండు నీకు సేవ్యుఁడ
గు నతనిఁ గొలిచియుండుము । వలయిక నీవతనికి నశ్వహృదయమను విద్యయిచ్చి । వెలయ నతని చేత నక్షహృదయమను వి
ద్యఁ జేకొనుము * వ ॥ మఱియు బాహుకుండను నామంబుతో సూతవృత్తి నుండుమని హితోపదేశంబు సేసి కర్కోటకుండ
దృశ్యుండై నతద్వచనంబున నలుండయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణుం గని యేను బాహుకుండను వాఁడ నశ్వశి
క్షయందుఁ గుశలుండ నన్నసంస్కారంబులఁ బెక్కువిధంబుల రచియింప నేర్తు భవత్సేవార్థినై వచ్చితి ననిన ఋతుపర్ణుం
డిట్లనియె * క ॥ నా యొద్దనుండు దేనిమ । దీయ రథాశ్వములగమనధృతి శీఘ్రముగాఁ । జేయుము నావుడు నట్టుల । సేయం
గనెదు నని నలుఁడు వాని సేవించె మదిగా * వ ॥ ఇట్లు ఋతుపర్ణునొద్ద నశ్వవిద్యాధ్యక్షుండై దుష్టాశ్వంబుల వశగతంబులు
సేయుచు నశ్వవరంబుల నారోహణంబుల శిక్షించుచు రసవంతంబుగ నన్నసంస్కారంబులు సేయుచు ఋతుపర్ణుచేత ని
యుక్తులైన వార్ష్ణేయ జీవలులు దనకు సహాయులుగాఁ బ్రచ్ఛన్నుండై యుండి యొక్కవాఁడే కాంతంబున దమయంతిం డ
లంచి తనరాక యెంచి * సీ ॥ ఇభరాజగమన నీ వెందులకరిగితత్యురుకుచాభోగ యెందున్నదాన । వబల యెవ్వరి చేత నడ
వులలోఁ బట్టువడితి శశాననా పేతుఁ బలుచుచున్న । యుగ్రమృగంబుల యురదంబులో నున్నదాన వే నీ తల్లిదండ్రులొద్ద । ధృతిను
న్నదాన వే దేశాంతరంబుల నున్నదాన వెయంచు నుదితమదన * గీ ॥ హతివి మోహితాత్ముఁడై హృదయేశ్వరిఁ । దలఁచి
రాత్రులెల్లఁ దావమున నను । విద్రలేక వంది యిట్లు వారు లించుచు । నుండె నలుఁడు శోకముత్కటముగ * వ ॥ అతని ప్రలాపంబు
విని యొక్కవాఁడు జీవలుండాత్మగతంబున * క ॥ అఱవాఱుచుకుఱుచ చేతులు । నెఱవశరీరంబుఁ గలిగి యొరులకుఁ జూ
డం గొఱగాకుండియు మన్మథు । నొఱువులఁ బడియెడు నితండు యువతీ ప్రియుఁడై * వ ॥ వీని చేతఁ దలంపంబడియెడు వనిత
వీని కెంతె లెస్స గాదన్నె యనుచు బాహుకు నెద్దకు వచ్చి నీ తలంచుచున్న భార్య కు నీకు నేల వియోగంబయ్యె నవి యడిగిన
బాహుకుం డిట్లనియె * గీ ॥ నన్ను జూచిన గరేనలి నాక్షినా కేల । విప్రయోగమేల విన వెతొల్లియేల । యోయెఱుంగ నేను
మందప్రజ్ఞుఁ । డనుభవింటుండు దనల తాంగిఁ జూసి * వ ॥ దానిన న్వేషించి యెందును గానక ప్రలాపించినం దత్ప్రకారంబె
ననుకరించితి ననిచెప్పి యిట్లయోధ్యాపురంబున బాహుక నామంబుతో నలుండుండె నంత విటవిదర్భేశ్వరుండు నలు
రాజ్యభ్రంశంబు విని కూతురు నల్లుండు నెటఁ బోయిరో యెచ్చటనున్నవారో యని శోకించి * క ॥ వారలరోయఁగఁ బంచె
నుపారగులుండిష్టులైన బ్రాహ్మణుల సదాచారుల విద్వాంసులస । త్కారంబులఁ దనిపి వారిఁ గడు నెయ్యముతోగా * వ ॥ మ
ఱియు నలదమయంతులున్న చో టెఱింగి వచ్చినవారికి వేయుగద్యాణంబు లిత్తుననియు వారలం దోడ్కొని వచ్చిన వారికి గో
సహస్రంబులు నగ్రహారంబు లిత్తుననియుఁ బలికిన ... నగరమహాగ్రామపట్టణంబులుగల

**చేదిపురంబునసుదేవుఁడను బ్రాహ్మణుఁడుదమయంతి నెఱుఁగుట.**

దుఁడు। జగతీదేవోత్తములు । మ్మగరోసిరినిఖిలదేశములకరిగివడిగ్ * వ ॥ అందుసుదేవుండను బ్రాహ్మణుఁడ్య
తియైనసుబాహు పురంబునకుంజనిపుణ్యాహంబు సేయింపంబోవు, బ్రాహ్మణులతో రాజగృహంబుసొచ్చియందు
బునసునందాసహితయైయున్న దాని ధూమజాలనిబద్ధయైన యగ్నిప్రభయునుంబోలె నీలాభ్రసంవృతంబైనచం
ద్రరేఖయునుంబోలె బహుపంకనిమగ్నయైనమృణాళియునుంబోలె నేర్పడకున్నయందదీయ భ్రూయుగమధ్యగతంబైన
తిలకము నలక్షణంబిమ్ముగా నిరీక్షించి దానిదమయంతిగా నెఱింగి యాత్మగతంబున నిదిపతివిముక్తయైశుష్కప్రవాహ
యైనదియునుంబోలె శూన్యకమలయైన నళినియుంబోలె నొప్పకుండియుఁ దనపతివ్రతాత్వంబున నొప్పుచున్నది
గీ॥ అనవమోర్యంబు తేజోమయంబుసర్వ । గుణములకునలంకారంబుగురుతరంబు। భామలకుఁబతిభక్తియపరమమైన
భూషణంబిట్టివే పెఱభూషణములు * వ ॥ రోహిణికిఁజంద్రసమాగమంబునుంబోలె దీనికిభర్తృసమాగమంబెన్నఁడొకో
యీసునోతుల్యశీల వయోరూపాభిజాత్యులైన నలదమయంతు లొక్కటనుండంజూచి విదర్భేశ్వరుండెన్నండు కృతా
ర్థుండయ్యెడునోయంచు నల్లనల్లనదమయంతికిట్లనియె * గీ ॥ అవ్వనీతల్లిదండ్రులకాప్తజులకు । బంధుజనులకు
బుభామనీదుకుశలమెఱుఁగునంతనువగగూరివగచు। చున్నవారలునీవంతయుఁగుమింక * వ ॥ దేవీయేనుభవ
త్పితృసఖుండ సుదేవుండను బ్రాహ్మణుండవిదర్భేశ్వరుండు నీయున్నచోటెఱుంగంబెక్కండ్రు బ్రాహ్మణులంబు
త్తెంచిననందులకువచ్చి వాపుణ్యంబుననిన్నుఁగంటినన దమయంతి వానినెఱింగి తనతల్లిదండ్రులబాంధవులంబ్రత్యేకంబ
డిగియశ్రుజలంబులురులయేడ్చుచున్నంజూచి యేలొకోయిప్పుడు సైరంధ్రియేడ్చుచున్నయదియని సునందరాజ
మాతకుఁజెప్పిపుచ్చిన * క ॥ చనుదెంచెనంతఃపురమున । వనితానివహంబుతోడవారిజదళలో। చనరాజమాతనృపనం
దనదమయంతికడకుఁదదయువేడ్కన్ * వ ॥ ఇట్లువచ్చితమలోమాటలాడుచున్న బ్రాహ్మణునిదమయంతింజూచి రా
జమాత బ్రాహ్మణునకిట్లనియెనయ్యాయిదియెవ్వనికూఁతు రెవ్వనిభార్య యేమికారణంబునం దనభర్తను బాసి
బంధులసుంబాసిపుణ్యవ్రతంబులుసలుపుచున్నయది నీవెట్లెఱింగితికోమలినాకుఁజెపుమ యనియడిగిన సుదేవుండిట్లనియె
మధ్యాక్కర ॥ నలినాక్షియిదివిదర్భేశుతనయపుణ్యశ్లోకుఁడైన । నలుదేవిదమయంతిపమ్మువిధికారణంబునరాజ్య
విహీనుఁడైనిజనాథుఁడరిగినఁదోడనచనియెనను వార్త । వెలయంగవినివారిరోయఁబంచె భూవిభుఁడు బ్రాహ్మణుల
నటపనిందులకువచ్చిమీచేత సురక్షితయైయున్నయికోమలింజూచి దీని భ్రూమధ్యంబునం బద్మనిభంబై విభూత్యర్థం
బువిధాతృనిర్మితంబైన పుణ్యలక్ష్మంబు పాంసుపటలచ్ఛన్నంబై యున్నను పలక్షించి రాజపుత్రింగా నెఱింగితిననిన
విని యద్దోదకంబులంజేసి దాని భ్రూమధ్యంబుగడిగిన నదినిస్పష్టంబగుడు సునందయు నాశ్చర్యంబందిరత * సీ ॥ ఆనంద
పరీతాత్మయై రాజమాత యక్కోమలాక్షిఁ బ్రీతితోఁగౌఁగిలించి । కొనితల్లినీవువామాతురవేమునీ జనని యుఁజేదిద్రొం
జుతనయలమదియువిదర్భేశుసతియయ్యె నేవీరబాహునకింతినైతి । నదిననయ్యావ్వకునతివినయంబుతో నలుదేవి
సుతకునందనైత్తి * గీ॥ కొనికరంబు నెమ్మిఁగొన్నిదినంబులం । దుండియిట్టులనియెనొక్కనాఁడు। దేవియిదియునదియ్యత్త
ఁబుట్టిన। యిండ్లకడుసుఖంబయుండునందు * వ॥ అమునను దల్లిదండ్రుల నసజుల నాప్తజులం జూచెడువేడ్కయ్య
నంబుటినయది విదర్భకుంబోయెద నానతిమ్మనికృతాంజలియైన దమయంతి నతిస్నేహంబున సుబాహుజననిసుర

**దమయంతినలు నెడఁబాసివిదర్భాపురంబుచేరుట.**

క్షితబలంబుతోస్వర్ణరత్నమయయానంబుననునిచిపుచ్చిన * ఉ॥ భామవిదర్భకేగితనబంధుజనంబుల యొద్దనుండి
గోమలిదేహసౌఖ్యములకున్వెలియై మలినాగవస్త్రముక్ । భూమిరంజంబునంగమునఁ బొల్పుగుచుండఁకనుండె
స్వామిని జేరఁజూచుదివసంబులు గోరుచుసువ్రతంబుతోన్ * వ॥ ఇట్లుభర్తృవియోగాతురయైనదమయంతి ప్రా
ణంబుభరియింపనోపక యొక్కనాఁడేకాంతంబునఁ దనజననికిటనియె * క॥ శోకావనోదిపుణ్యశ్లోకునలునిరోయ
శుభచరితుఁడదా । లోకనవిహీనసైసుర । లోకకృతావాసనసుదులోకంబెఱుఁగక * వ॥ అనిననదియుసుదూ
ప్రాయంబుభీమున కెఱింగించిన నాతండునలుమార్గణంబునకు బుద్ధిమార్గులైన బ్రాహ్మణుల నియోగించిన

తనన్వేషింపనరుగు బ్రాహ్మణులకు దమయంతి యిట్లనియె * గీ॥ నైషధేశ్వరుండు నలుండు దివ్యవసనమర్థ । డగుటఁ జేసి తన్నునన్యులెఱుఁగ । కుండ మండుఁగా ననురుసభాంతరములఁ । దిరిగి తిరిగి యిట్టులనుఁడు మీరు * సీ॥ సత్యానిత్యుండవు పతి వింతి వర్జించి దాని వస్త్రార్ధంబు దఱిగి నీవు । పరిధానముగఁ జేసి పాడియే పోవంగ భార్యాభర్తయు నాఁగఁ బరఁగుధర్మ । మదిమిథ్యయయ్యెనీయందు నీకిటి నిర్దయబుద్ధి చేకొనఁదగు నెయట్టి । సాధ్వికిఁ గరుణాప్రసన్నుండవగుమని యెల్లచోఁ బలికి న న్వేఁడెని - గీ॥ పలుకకుండ నొండె ప్రతివచనం బిచ్చునతఁడు నలుఁడు గాన నతిముదమున । నెఱిఁగి నన్నాతని కెఱిఁగించి తోడ్కొని । రండు రానివాఁడు రండెఱింగి * వ॥ అని పంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన పలుకులెల్లన భలంబలికి యెందును గ్గానక వచ్చిరందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుండు దమయంతి కిట్లనియె నేనయోధ్యకరిగి నీ కఱపిన పలుకులెల్ల ఋతుపరుసభఁ బలికిన నొక్కపురుషుండు కుఱుచచేతులవాఁడు ఋతుపర్ణునొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబువాఁడు శీఘ్రయానకుశలుండు సూపక్రియానిపుణుండు విరూపాంగుండు బాహుకుండను నశ్వశిక్షకుండు విని నన్నునేకాంతంబునకుం బిలిచి వెలవెలనగుచు దీర నిశ్వాస పురస్సరంబుగా నిట్లనియె * గీ॥ పురుషునందు దోష పుంజంబు గలిగిన । నెఱిఁగియెద సహించు నేని భార్య । పురుషునందఁ భ్రష్టభోగంబు దేహాంత । రంబునందు ధర్మ గతియఁ బడయు * వ॥ అని యొండెద్దియుం బలుకక తన నివాసంబునకుం బోయెనని చెప్పిన విని పెద్దయుం బ్రొద్దుచింతించి నలుం డుగాని వాఁడు ప్రతివచనం బేల యిచ్చు నింకను వలసిగల వారలం బంచి యాతని నిమ్మాగా నెఱుంగవలయునని జననీజన కులయనుమతంబున సుదేవు రావించి వానికిట్లనియె * క॥ నన్నెఱిఁగి తెచ్చినట్టిజ । గన్నుతనలు నెఱిఁగి తెమ్ము కౌశలము నవి । ద్విన్నాథసర్వగుణసం । పన్నుండవు నీవయెందుఁ బరికింపంగన్ * క॥ అరుగుమయోధ్యకు దేశాం । తరవిప్రుండ వైరవిప్రతాపోన్నతునఁ । దరకోసలేశుభోగి । శ్వరుఁడనఁ దగు నరఘువమర సము ఋతుపర్ణున్ * వ॥ మఱియు విదర్భాధిపుం డగుభీముండు నలురోయంబంచి యెందునుం గానక యింక నుదమయంతీ ద్వితీయస్వయంవరంబు రచియింపం బోయిన నందు లకు భూవలయంబునంగల రాజులెల్లను బోయెదరని యతిత్వరితంబుగా ఋతుపర్ణునకుం జెప్పుమని పంచిన సుదేవుండ యోధ్యానగరంబునకుం బోయి ఋతుపర్ణుం గాంచి విదర్భాపురంబున దమయంతీస్వయంవరం బెల్లి యయ్యెడుననిచె ప్పిన విని ఋతుపర్ణుండు బాహుకుం జూచి నాకు దమయంతీ స్వయంవరంబుఁ జూడ నొక్కనాఁడ విదర్భకుం బోవల యు నీయశ్వనైపుణ్యంబుఁ బ్రకాశింపం జేయుమనిన నట్లచేయుదునని నలుండు తనమనంబున దుఃఖించి * గీ॥ అ డవి దన్నుఁ బాసి యరిగిన నలిగి కా । కున్నె యిట్లు చేయనవిడగడఁగె । నట్లయేనిఁ గూర్తురింతులు నూకని । విశ్వసించువారు వెడఁగు లెందు * గీ॥ సాధ్వి నాకుఁ గూర్చు సంతతి కలయది । చెలువయిట్టులేల చేయు నైన । నెఱుఁగవలయు దీని నీ ఋతుపర్ణు తోఁ బోదునని నలుండు బుద్ధిఁ దలఁచి * వ॥ తొల్లి వార్ష్ణేయుండు దెచ్చిన తనరథంబునం దుహయంబుల నాలక్ష్యమాణ శుభ లక్షణంబులు మనోవాయువేగంబులు నైనవానిం బూన్చి కొనివచ్చిన ఋతుపర్ణుండా రథంబెక్కునప్పుడు హయంబులు మ్రొగ్గినం జూచి యిప్పెదగుఱ్ఱంబులతిదూరంబెల్లు పోవనోపు నెండుగుఱ్ఱంబులఁ బూన్పుమనిన బాహుకుండిట్లనియె * క॥ అవనీశ యీ హయంబులు । పవనగతిం బఱచుఁ బ్రొద్దువడకుండఁగ నేఁ । డు విదర్భకు నవ్వుదువిని । కువలయపతి మెచ్చి బాహుకున కిట్లనియెన్ * వ॥ అట్లయిన నీ హయతత్త్వకౌశలంబెఱింగి నీకునభిమతంబొనరింతునని రథంబెక్కి బాహుక వార్ష్ణేయు సహితుండయి యరుగువాఁడు * అక్కర॥ ఎక్కరనుదవ్వులఁ జూడినపాడవులెల్లఁ దప్పించును । కదియఁగా నప్పొయెం తయును దవ్వయికనంబడుఁ బిఱుఁద । నదిది నేశ్వరురథ మోయనునొండఁ డొయి తేఁడంచు నపుడు । హృదయమున నాగడు విస్మ యంబందెనిక్ష్వాకుకులుఁడు * క॥ ఈతండు శాలిహోత్రుఁడొ । మాతలియో నలుఁడొ యొరులు మానవులుజవో । త్సేకమునిట్లు రథహయనీతియెఱుంగుదురె ధారుణీవలయమునన్ * వ॥ వయోవిద్యావైభవంబులనితండు నలుంబోలెడి విక్రుతరూపధరుండయిన కారణంబేమియొ మహాపురుషులు దైవనియుక్తులయి ప్రచ్ఛన్నవృత్తి నుండుదురు వారి నెఱుం గంబోలునె యనుచుఁ జనునప్పుడు ఋతుపర్ణుండు దనయుత్తరీయంబు జాఱి భూతలంబునఁ బడిన మరలి చూచి బాహుకా వార్ష్ణేయుం డప్పోయి యుత్తరీయంబుఁ దెచ్చునంతకు రథంబు నిలుపుమని నలుం బిలిచిన బాహుకుండు నగి నీ యుత్తరీయంబు వడినయెడ యిచ్చోటికి యోజనంబు దవ్వు వార్ష్ణేయుం డెట్లు దేనేర్చు నని రథంబు వేగ

మహత్త్వంబు సెప్పుచు ననేక దేశంబులు గడచిచన నొక్కయెడ నగణ్యవర్ణ్యఫలశాఖాలంకృతంబైన విభీతకవృక్షం
బు ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె ✽ గీ॥ ఎల్లవారు నెఱుఁగ రెల్లవానిని భిన్న । రూపవయు లెల్లవారు విద్యలందుఁ దొలఁ
ఉంగుదు నదృష్టిమాత్రన । సకలమైన వస్తుచయము సంఖ్య ✽ వ॥ ఇవ్విభీతకంబున ఫలవర్గసముదాయ సంఖ్య
దవినుమీ రెండుశాఖలంగల వర్ణఫలంబులు పదివేలునొక్కండు తక్కిన శాఖలంగలయవి రెండువేలుం
ననిన బాహుకుండు వీని వీని నెన్నికావి నిశ్చయింప నేరనని తనరథంబు నిలిపి యావృక్షంబు ఖండించి యా రెండు
శాఖల యాకులుఁ బండ్లులు నెన్నిన ఋతుపర్ణుండు చెప్పినయన్ని యైనన నచ్చెరువడి యివ్విద్య నాకు నుపదే
లయుననియడిగిన ఋతుపర్ణుండిట్లనియె ✽ క॥ ఇది యక్షహృదయమనఁగా । విదితంబగు విద్య దీనివిద్యుక్తముగా ।
నెఱుఁగు నరుఁడు సంఖ్యావి । దుఁడగుదు మహాకృతకళంకవిముక్తుఁడగుఁ ✽ చ॥ సకలగుణప్రసిద్ధుఁడగు సర్వహితు
జూవేయించు బా । హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశమిచ్చెన । త్యకుటిలబుద్ధి నక్షహృదయంబు
యంబుతోవిద । ర్భభుజను వేడ్కఁ జేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనఃప్రసన్నుఁడై ✽ వ॥ ఇట్లు నలుండు ఋతుప
త నక్షహృదయంబుఁ బడసి సంతుష్టుండై నీకు నశ్వహృదయం బిచ్చెదఁ బరిగ్రహింపుమనిన ఋతుపర్ణుం డట్ల
వంతకు నీయందయుండవిమ్మిది నావలసినప్పుడ చేకొనియెదననియె నంత నయ్యక్షహృదయసామర్థ్యంబున నప్పుడ

⟶ ✽ నలుఁడు కలిచేత విముక్తుండయి విదర్భకుఁ బోవుట. ✽ ⟵

నలుఁ దొల్లి యాశ్రయించిన । కలి కర్కోటకవిషంబు గ్రక్కుచు నోడలఁ । వెలువడి నలునకు విహితాంజలియై త న్నె
జెప్పి జంచలుఁడగుచుఁ ✽ గీ॥ వానిఁ జూచి నలుఁడు జానల్గి శాపమీ । నున్నఁ గలియొఱంగి విన్నఁ బొంది । యహి
శేతనవిశంబు దగ్ధుండ । నైతి నింక నాకు ననఘ సైఁపు ✽ వ॥ విన్నఁగీర్తించినజనులు నావలని భయంబుఁ బొందరు
గరుణింపుమనిన నలుండు కోపంబుడిగెఁ గలియు నవ్విభీతకవృక్షంబు నాశ్రయించె నది మొదలుగా నవ్విభీతకంబు
స్తంబయ్యె నట్లు నలుండు వికృతరూపమాత్రంబుఁ దక్కఁ దక్కిన దుష్కృతంబులవలన విముక్తుండై రథంబెక్కి
బున ఋతుపర్ణ వార్ష్ణేయ సహితుండై విదర్భకుం జనియె నంత సాయాహ్నంబున ✽ క॥ మానుగ ఋతుపర్ణుఁడు
నుజ్ఞాతుఁడయి చొచ్చె నా ప్రోలు రథ । ధ్వానంబు మ్రోయుచుండఁగ । నానాదిఙ్ముఖములను ఘనధ్వనివోలెఁ ✽
మయంతి యారథధ్వని విని యిది నలురథఘోషమని యనురాగమొంది । నలుని పథేశుఁ బుణ్యశ్లోకు లోకోపకారకు
డంగ గంటి ననుచు । ఘనభుజుఁ జూడంగఁ గానని వాఁడు తద్భుజపరీరంభణము నను సుఖముఁ । బడయని వాఁడు
బు విడుతు నే నవితలంచుచుఁ గమలాయతాక్షి - గీ॥ యారథాధినాథుఁడై వచ్చు ఋతుపర్ణుఁ । జూచి యవ్వడఁ
యగుచునుండె నంత నా ఋతుపర్ణుండు । భీముఁ గానవచ్చెఁ బ్రియముతోడ ✽ వ॥ భీముండును వానిం బూజించి
రమ్యహర్మ్యంబున విడియించిన ఋతుపర్ణుం డవ్వారంబున స్వయంవరంబను శబ్దంబు వినంగానక యాత్మగ
న ✽ క॥ ధరణిఁగల రాజులిండె । వ్వరు వచ్చినవారు లేరు వైదర్భి యొరుఁ । వరియింపనంత ధర్మే । తరచరిత
మునుండెద దద్దయు లజ్జ ✽ వ॥ బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించియుం
తదమయంతి బాహుక వార్ష్ణేయులతోడ వచ్చిన ఋతుపర్ణుం జూచి నిష్ఫలమనోరథయై యుండనోపక కేశినియను
నింబిలిచి ఋతుపర్ణ రథాధ్యాపతింగాఁ బాష్ణేయ సూతపుత్రుంగా నెఱింగితి బాహుకుండను వాఁడెవ్వఁడో
యందు నా హృదయంబు ముదితంబగుచున్నయది మనకుఁ బ్రతివచనం బిచ్చినవాఁడు వాఁడకావలయు వానికడకు
యియొఱింగిరమ్మని పంచిన నది వోయి బాహుకుం గని దమయంతి నీకుశలంబడుగఁ బుత్తెంచె నిందుల కేమి కారణంబు
తెలిసిన దానికి బాహుకుండిట్లనియె ✽ క॥ ప్రియమున దమయంతిపున । స్స్వయంవరము సేయఁగడఁగి సకలక్షత్ర
యవిరులరావించిన నయశాలి ఋతుపర్ణుఁ డొక్కవాఁట నె వేడ్కన్ ✽ క॥ విన వెశతయోజనంబులు చనుదెంచెనదో
మండిసరి నిందులకా తవి సారథినై యిట నే । నును వచ్చితి వానితోఁ మనోవేగమునన్ ✽ వ॥ మూఁడవవాఁడెవ్వఁడనియ
నన కేశినికి బాహుకుండిట్లనియె ✽ క॥ నలురథచోదకుఁడతఁడ । త్యలఘుఁడు వార్ష్ణేయనాముఁడనవుడు వాఁడు
భూపాలకుఁ బోయిన । ప్పుడు దియ్యనియెఱుఁగు నెంతవాఁడిట్లనియెఁ ✽ వార్ష్ణేయుండును నలుపుత్రుల

శ్వరునొద్దబెట్టి పోయిన లురాజ్యభ్రంశంబువిని ఋతుపర్ణుంగొలిచి యుండెనాతండునువలు నెఱుంగఁడు * క ॥ నలు
తోనాక్రూటనరిగిన । నలినాయతనేత్ర భీమనందనయొండెన్ । నలుఁడొండెఁగాకయెఱుఁగుఁడె । నలునొరులకు నెఱుఁగఁగ
గారణముగలదె మహిన్ ॥ వ॥ అనినవిని కేశినియిట్లనియె * సీ॥ అడవిలోన ప్రాణరహితురాలైదయలేక ప్రాణేశ్వరుఁడుదను
బాసిచనిన । వాటిన ప్రార్థంబునలినాక్షి యిప్పటు పరిధానముగఁ బాంసుపటలమలిన । మగుచున్నతనువుతోనయంబు
జడగొన్నయలకావలులతోడనవనితలము । శయనంబుగా ధరచ్చారిణి దమయంతియనఘవ్రతంబిట్లులాచరించు ॥ గీ॥ చున్న
దనివనవిరళలోద్గతబాష్పపూ । ర్ణంబులైనలోచనంబులెఱుక । పడక యుండవదనపద్మంబువాంచితా । నొండువలపుచూ
చుచుండెనలుఁడు * వ ॥ కేశినియును బాహుకువలుకులు వాకారంబునుదమయంతి కెఱుంగించిననదియాతనినలుంగాశం
కించియుంకను వానికడకేగుము వాఁడుఋతుపర్ణువంటలవాఁడట వచనసమయంబున వానిచరితంబిమ్ముగా నెఱిఁగి
రమ్మని పంచినయప్పుడచని కేశినిబాహుకునందు దైవమానుషనిమిత్తావృతక్రియలు సూచివచ్చి దమయంతికిట్లనియె *

కేశియను చెలికత్తియ దమయంతితో నలునిగుణంబులు చెప్పుట.

క ॥ ఆతనిచరితంబుఁ జెప్పఁగ । నతమానువమపగతత్రయాసమదృష్ట । శ్రుతపూర్వమువరమార్గం । బతనినిదైవమన
నలయానంబుజనేత్రా * సీ ॥ వినవమ్మతృణముష్టిగొని వాఁడువైచినవందగ్నియుదయించియందువంట । లగునంతను
నునింధనములపేక్షింపక యడుగకనుండుచునుండుమఱియుఁ । గడఁకతోనంజుల్లుగడుగంగసమకట్టి జలమపేక్షించు
డు సంభవిల్లుఁ । గుంభముల్నిండిదివ్యాంభఃప్రవాహముతుయమగుదుండునాతుణముచూడ * గీ॥ నతనికరతలద్వయావర్తి
తమ్ములై । కందియును మహాసుగంధకుసుమ । తతులుదొంటియట్ల తమకంపువిడువక । యుండునతనితేజమున్నతంబు ॥
వ॥ అనినవిని దమయంతి వెండియుఁ గేశినిఁ బిలిచి బాహుకువండిన వంజుల్లుదెప్పించియాస్వాదించి బాహుకునందునలు
లక్షణంబులుగలుగు టెఱింగియునాఁడ నొవకవానిపాలికిఁ గొడుకునుంగూఁతుమఁబంచిననక్కుమారులంజూచి * గీ॥ వ
శముగాక బాష్పవారి యొల్కుచునుండఁ । గొడుకుఁగూఁతు నెత్తికొనినలుండు । హర్షపులకితుండునై విజాంకతలంబు ।
నందు వారినునిచియాదరమున * వ॥ అక్కేశినిఁ జూచి యిక్కుమారులిద్దఱు వాకొడుకుమంగూఁతునుంబోలినవీరి నెత్తికొ
నిదుఃఖించితిననితన్నెగ్గు సకుండంబలికి దానికిట్లనియె * క ॥ నీవిటబలుమఱువచ్చుచుఁ । బోవుచునునికిగనిచిత్తములనొం
డుగ సం । భావింతురితరజనములు । కావున రావలవదింకఁ గార్యార్థినివై * వ॥ ఏము దేశాంతరంబులనుండి వచ్చినయతిథులము
నీవుమాతోడి దేమియనినఁ గమ చివచ్చి బాహుకుమార్గంబంతయు దమయంతికిం జెప్పిననది సంతసించి నిజజననికిట్లనియె *
చ॥ సందియమేల సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండు భూ । వందితుఁడైన నైషధుఁడ వశ్యముదానగు వామనంబునా । వం
దముఁ బొందుచున్నదిఘనంబుగ వాఁడిటవచ్చు వాఁడొయే । నందుల కేగుదాననొనయంబుగనావనివిశ్చయింపుమా * వ॥ అని
ననదియప్పు భీమునను మతంబున దమయంతినొద్దకు బాహుకు రావించిన * క॥ చనుదెంచియందుదీనా । నననవిరళవంకమ
లిననతగాత్రఁ దప । స్వినతికృశ దమయంతిం । గనియొనలుండుదితబాష్పకణకలితముఖిన్ * క॥ దమయంతినలునివిక్రుతాం ।
గముఁ జూచియునతనినమ్మఁగావగవక నె । య్యమునను లజ్జను భయసం । భ్రమమును వివశాత్మయగుచుఁ బతికిట్లనియెన్ *
వ ॥ విజనంబైన వనంబున నలసినిద్రపోయిన యబలనతిసాధ్విసువ్రతనగ్నిసన్నిధిం బాణిగ్రహ విధిలబ్ధయైనదానిం
బాసి నలునట్లు నిర్దయులై యరిగినవారలొరు లెవ్వరు లేరు * క ॥ సురవరులనునొల్లకనలు । వరియించిననన్నుఁ బుత్రవ
తి నేలొక్కో చెచ్చెరవిడిచె నాతనికిని పుష్కరుణున కేనేమియెగ్గుగావించితినో * వ ॥ నిన్నువిడువనొడకుండుమనినయప్పు
లుకు లేలమఱిచెనోయని శోకతప్తంబైన తనహృదయంబు దడుపుచున్నదియనుంబోలె బాష్పధారలఁగుచమండలం
బుదడుపుచునున్న దమయంతింజూచి శోకాకులుండై నలుండిట్లనియె * గీ ॥ కలిసమావిష్టమతినయికష్టవృత్తి । నట్టియి
డుమలఁబడితి నేనదిమదీయ । తపముబలమువదుష్కర్మతాపమెల్ల । నష్టమైపోయెనివ్వతునన్నువిడిచి * వ॥ ఏనిందులకు
నీతదర్థంబవచ్చితినదియట్లుండె నన్నునమరక్తనను ప్రతుఁదలంపక యన్యాపేక్షంబున స్వయంవరంబు రచియించు
టయిది కులస్త్రీధర్మంబుగాదు రాజులనెల్లనీస్వయంవరంబునకు రావించుటం జేసి కాదె ఋతుపర్ణుండు వచ్చెనని
నవెఱచిన్కృతాంజలియైదమయంతియిట్లనియె * [illegible] । వలికిరేల్లచోనాచేతఁబంపఁబడె

మ్యయందుఁ బర్ణాదుఁడను విప్రుఁ డయ్యయోధ్య! కేగి ప్రతివచనంబుల నెఱిఁగెనిప్పు * వ ॥ ఆపర్ణాదువలన నైష
ననైనిన్నిటు రావించు నుపాయంబు దలంచి యెల్లి దమయంతీద్వితీయస్వయంవరంబగునని ఋతుపర్ణునకు బ్రా
నుదేవుండను బ్రాహ్మణుంబుత్తెంచితి * క ॥ నరవరుఁడు నలుఁడు కాకె। వ్వరు శతయోజనము లొక్కవాసరమున
గునరులోరులనిదినిం। బరికింపఁగ వేఁడియిట్లు వంచితినధిపా * ఉ ॥ పీనతిపాపభావమున నెగ్గుదలంపక యుండునట్లుగా
నతవైరినీయడుగులంటఁగ నోపుదునట్లమైనన। నీ్నలినాప్తుఁడయ్యనలుఁడీమ్మ గలాంఛనుఁడీమరోత్తముల్। జా
జంగనీక్షణమచంచరేఖావపరీతచిత్తులై * వ ॥ అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుండైన వాయుభట్టా
రకుండెల్లవారు నవిన నాకాశంబుననుండి నలునకిట్లనియె * చ ॥ అమలచరిత్ర నిట్లు దమయంతి పతివ్రతఁ బల్కె దే
వో! త్తమ విను దీనియందు విదితంబగు శీలవిధిజ్ఞ సుధాంశుఁడున్। గమలహితుండు నేను దగఁ గాచితి మొక్కట మూఁడు
ముల్! కోమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీకనురక్త నాపుడున్ * క ॥ మరియె మరుద్వచనానంతరమున సురపుష్పవృష్టి
యక్రమ్మోసె! సురదుందుభినాదంబులు! గరము ప్రశస్తముగ వీచె గంధవహుండున్ * వ ॥ ఇట్లెల్లవారికి నాశ్చర్యం
గావాయుదేవుండు తన్నెఱింగించి దమయంతీపతివ్రతాగుణంబులును బలియందలి యకృత్రిమానురాగంబునం జె
నవిని నలుండు పరమప్రమోదపరిపూర్ణహృదయుండై తత్క్షణంబునఁ గర్కోటకుం దలంచి వానియిచ్చిన పుట్టంబు పైఁజె

## నలుండు నిజరూపంబుతో దమయంతిం గూడుట.

కొని నిజరూపంబు దాల్చిన * ఉ ॥ ఆయతబాహుఁ దప్తకనకాంచితవర్ణ మనోజరూపునిం। ద్రాయితసూర్యతేజుని
ప్రభు నన్నలుఁ జూచి పద్మప। త్రాయతనేత్ర యప్పు దమయంతి కరంబు ముదంబునొందెల। శ్రీసహితనయ్యెనెయ్య
మిత్రులకు హృదయప్రియంబుగన్ * వ ॥ ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహపరితాపంబుతోడన శరీరమాలి
న్యంబు వాసెఁ బరస్పరానురాగంబుతోన విభూషణవిశేషంబులు విలసిల్లె నంతనంతయు విని భీముండు జాతసస్యమైన
సుధ తోయసంప్రాప్తి నత్యాయతమైనట్లజ్ఞాతచర్యుండైన పతిం బడసి పరమసంతుష్టహృదయుండై చంద్రుతోఁగూడి
న రాత్రియుంబోలెఁ బతిం గూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి తనపురంబునం దష్టశోభనంబులు దేవగృహం
బులయందు విశేషపూజలు సేయించె నట్టిమహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి నీవు నిఖిలలోకపూ
జ్యుండవయ్యును నా యొద్ద బాహుకుండనంగాఁ బ్రచ్ఛన్నవృత్తి మున్ను నిన్నెఱుంగక నీచకర్మంబులందు నియోగించితి
ని క్షమియించునదియని నలుచేత సత్కృతుండై యశ్వహృదయం బుపదేశంబుగొని యయోధ్యకుఁ జనియె నట నలుం
డు విదర్భపురంబున నొక్కమాసంబు నివాసంబు సేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నందయునిచి యొక్కరథంబును బ
దియాఱేనుఁగులును నేఁబది గుఱ్ఱంబులు నాఱునూఱు కాల్బలంబులుఁ దనకుఁ దోడుగా నిషధపురంబున కరిగి పుష్కరు
నియిట్లనియె * క ॥ దమయంతి రోయి గాజా। దము నీతో నాడఁ గడఁగెద సుధరణీరా। జ్యము నీవు నాకరోయిడు। మనకుం
జూదంబు నీమనభిమతమేనిన్ * మత్తకోకిల ॥ వీరభోజ్యము సుమ్ము రాజ్యము వింటె నీవును నేను దు। ర్వారవృత్తి రథా
లేక్కయ వంధ్యవిక్రమ మేర్పడన్। భూరివీరరణం బొనర్తము పోర నోర్చినవాఁడయి। ధ్ధారుణీతలరాజ్యసంపద
లుబ్ధీరగుణోన్నతిన్ * వ ॥ ఈ రెంటిలోని కెయ్యది యిష్టంబు దానికిం గడంగుమనినం బుష్కరుండు రణంబునఁ బరాజి
తుసంగావున నలుం దొల్లియు జూదంబున నోడెదినట్లయుంకను నోడిచి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదు
సంతసిల్లియే నోటుపడితినేని నఖిలమహీరాజ్యంబు నీయదియని వోటుపడితేని దమయంతి నాయదియని పలికి యో
నలుతో జూదమాడి యోటుపడిన * క ॥ ఘనముగ జంబూద్వీపం। బునఁ గలవారెల్ల నెఱుఁగఁ బుష్కరుచేతం। గొని
బున ద్యూతంబున। ననఘుఁడు నలుఁ డఖిలరాజ్య మత్యున్నతితోన్ * వ ॥ ఇట్లు జూదంబునఁ బుష్కరు నోడించి సకలమ
హీరాజ్యంబును జేకొని నలుండు వానికిట్లనియె * క ॥ కలిసంప్రాప్తుఁడనై కడు। బలమఱి నీచేతఁ దొల్లి బలవద్ద్యూతం
బజితుఁడనైతిని దినీ। బలము విగర్వింపఁ జను నె బలవంతుఁడవై * వ ॥ నీవు నాపితృవ్యపుత్రుండ వెద్దియుం జేయనోపవ
న్ను నిపుష్కరు విడిచిపుచ్చి పుష్కలంబైన రాజ్యంబుతో నలుండున్నంత * క ॥ భీముప్రియాత్మజ యగు నా। కోమలి దమ
యంతి పుత్రకులు దాను నల। శ్రీ [illegible] వచ్చెఁ దనపతికడకున్ * వ ॥ అట్లు

హృదయేశ్వరియైన దమయంతిం గూడినలుండు విధివిహితానేక శతముఖుండై శతమఖు విలాసంబుతో సకలరత్నయుతంబైన రత్నగర్భాధి రాజ్యంబు సేసెంగావున నక్షజితుండనై తినని వగవకుండుము నీవును దైవమానుషసంపన్నుండవై శత్రువుల జయించి సకలమహీరాజ్యంబు వడయుదవని బృహదశ్వుండు ధర్మరాజునకు నతనిహృదయం బుపదేశించి * సీ॥ ఇన్నలోపాఖ్యానమెప్పుడు దత్తావధానులై వినువారు దవిలి భక్తిఁ । జదివెడువారును జగతీశ కలిదోష నిర్ముక్తులగుదు రఖిలపుణ్య । ఫలభాగులగుదురు బహుపుత్రపౌత్రయు తారోగ్యధనయుక్తులగుదు రెల్ల । విషములకును దుష్టవిషయంబులకు దూరులగుదురు ధర్మాత్ములగుదు రుర్విఁ । గడు బ్రసిద్ధమిది యాంగిరోక్తపటకువిదమ । యంతిఁబుణ్యమూర్తియైన నలుని । సుతచరిత్రుఁ డనదై ఋతుపర్ణుఁగీర్తింపఁ గలిభయంబులెల్లఁ దొలఁగునధిప * శ్లోకము ॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ । ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్ * వ ॥ అని బృహదశ్వుండరిగినం బాండవులు గాండీవిరాకఁ గోరుచుండ దదాలోకనప్రీతిమండునంత నంతరిక్షంబెల్లఁ దన తేజంబున వెలుంగుచుండ నారదుండు వచ్చిననుజసహితుండైన ధర్మరాజుచేతం బూజితుండై యిట్లనియె * గీ ॥ ధర్మపుత్ర నీయుదారచరిత్రమ । ధర్మమతికి దృష్టతము

## ధర్మరాజునెద్దకు నారదమహాముని వచ్చుట

డనైతి । నడుగుమిష్టమెద్దియనినఁ గృతాంజలియై మహీశుఁ డిట్లనియె భక్తి * వ ॥ మునీంద్రా నీవు పూర్ణుండవై నంద్రిజగంబులకుఁ దృప్తియగునిన్నుఁ జూచి కృతార్థుండనైతి నాకెప్పుడు నొక్క ధర్మసందేహంబులుగలదు దానివిర్ణయించియానతియ్యవలయు * చ ॥ ధరణి బ్రదక్షిణంబుగ ముదంబునఁ గృష్ణ్మ రితీర్థసేవనా । పరులగుచున్న ధన్యులకు పుణ్యస్థితి నెట్టి ఫలంబులైనఁ గాం । తురు బహుతీర్థకీర్తనముతో నెఱుఁగింపుము దీని నావుడున్ । నరనుతుఁ డైన పాస్థునకు నారదుఁ డిట్లని చెప్పెఁ బ్రీతితోన్ * క ॥ ధీరుఁడు భీష్ముఁడు గంగాద్వారమునం దొల్లి పితృహితమ్ముగ శుభక । ర్మారంభుఁడగుచునుండైను । దారుండక్షయ్యనసంతతవ్రతపరుఁడై * వ ॥ అతని పితృదేవతాభక్తికిం బరమధర్మచరితంబునకు మెచ్చి తద్ధర్మనాపేక్షంబుల స్త్యుండను ముని వచ్చిన నతనిభక్తుండై భీష్ముండు భవద్దానుండనని ముకుళితహస్తుండై యున్న వానికిం బులస్త్యుండిట్లనియె * క॥ పితృదేవభక్తిఁబుణ్యవ్రతచర్యను నీవయెల్లవారికి నతుల్యు । న్నతుఁడవుగావున నీచే గృతిఁగానఁగఁబడినవే కృపకు లేశా * వ ॥ నీయిష్టంబు సెప్పు నేన మోఘదర్శనుండ ననిన భీష్ముండు ముదితహృదయుండై మునీంద్రా నాయందు నీ మహాప్రసాదబుద్ధి కలదేనిం జెప్పవలయుని * క ॥ మమ జేంద్ర నన్ను నీవడి । గినయట్లపులస్త్యుఁ బుణ్యకీర్తనుగంగాతనయుండడిగిన నతనికిఁ నానఘచరిత్రుఁ నపునిట్టులని ముని చెప్పెన్ * సీ ॥ కడఁగి బుద్ధీంద్రియకర్మేంద్రియంబుల యందు సంతతచిత్తులైనవారు । ధృతి నహంకారప్రతిగ్రహాపేక్షులయందు నివృత్తాత్ములైనవారు । నల్పభోజనులు ననారంభకులును నై యత్యంతసంతోషులైనవారు । సత్యవ్రతులు శుభాచారుల క్రోధనులనఁగ ధర్మాన్వితులైన వారు । నఖిలతీర్థశతములాడిన ఫలములును । నఖిలయజ్ఞవిధుల నైన ఫలముఁ । బడయుదురు హీనభాగ్యదుర్గతులకుఁ । బరమతీర్థసేవపడయనగునె * క ॥ తిలగోసువర్ణదానం । బులునుపవాసములు దీర్ఘముల నేకములిమ్ములఁ జేయని వారు దరిద్రులు నిరతంబసుమరాత్మదోషము పేర్మిన్ * క ॥ క్రతుఫలములు వడయఁగమ । ర్గతులకు దొరకొనమి తీర్థగమనంబునఁ దత్క్రతుఫలములందుదురుడు । గ్గతులును విధిమునులమతము కౌరవవృషభా * వ ॥ తీర్థగమనఫలంబు యజ్ఞఫలంబులకు విశేషంబ దివినుము * చ ॥ వమితవిరోధి పుష్కరమనంగ జగద్విదితంబు పుణ్యతీ । ర్థము మునిసిద్ధసేవ్యము ముదంబున నందుఁ బయోజసంభవుం । డమరులతోడ సన్నిహితుఁడై వసియించు ద్రిపుష్కరంబులున్ । సమములు వాని నెవ్వఁడును సంస్మృతిఁ జేసెనఁ బాయుఁ బాపముల్ * క ॥ పది వేలకోట్లు తీర్థము । లుదితములై పుష్కరములనుండు మునీంద్ర । త్రిసంధ్యవరులందుఁ జేసిరి । మడిఁ గృతకృత్యులయితపము మఖములఁ బ్రీతిన్ * వ ॥ అందుఁ గృతస్నానులై దేవర్షిపితృతర్పణంబులు సేసిన వారు దశాశ్వమేధ ఫలంబులు వడయుదురు కార్తికమాసంబున నెక్కుదివసంబు పుష్కరసేవ సేయుటయును మాతేండ్ల గ్నిహోత్రంబు వేల్చుటయు సమంబు * క ॥ అమరవరులందుఁ బుష్కరోత్తముఁ డెట్లు విశేషమట్ల ధరణింగల తీర్థములం దును బుష్కరతీర్థము గరము విశేషమభిమతార్థప్రదమై * వ ! పుష్కరంబునఁ బది యేండ్లు వసియించిన వారికి సర్వక్రతుఫలంబును బ్రహ్మలోకప్రాప్తియును నగు నట యజలబూమార్గంబు చన ... బగస్త్యవటంబును తీర్థంబులా

డియశ్వమేధఫలంబువడయుదురు కణ్వాశ్రమంబునుధర్మారణ్యంబునుయయాతిపతనంబునంజూచిన సర్వపాపక్షయం
బగుమహాకాలంబును గోటితీర్థంబును భద్రవటంబునను రుద్రస్థానంబునను ద్రుంబూజసేసి గణపతిత్వంబువడయు
దురునర్మదాస్నానంబున దక్షిణసింధుస్నానంబునఁ జర్మణ్వతీతీర్థస్నానంబున నగ్నిష్టోమ ఫలంబులగు * క.॥ అన
ద్యవసిష్ఠాశ్రము। ముననొకదివసంబుశాకమూలాశనులై। జనులుండిపడయుదురుబహు। ధనసంపదగోసహస్రదాన
ఫలంబుల్ * వ॥ మఱిపింగళంబనుతీర్థంబుసేవించి శతకపిల గోదానఫలంబువడయుదు రెందేనియగ్నిదేవుండుప్ర
త్యక్షంబైయుండునట్టిప్రభాస తీర్థంబాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబువడయుదురు దూర్వాసుండు విష్ణునకువరంబి
చ్చుటంజేసివరదానంబనంబరఁగిన తీర్థంబాడియుసరస్వతీసాగర సంగమంబాడియుగోసహస్రదాన ఫలంబుఁబడయు
దురు * క ॥ద్వారవతీపురమునబ్బం। దారకమనుతీర్థమునబెడంగైదిదల। శ్రీరమ్యములైముద్రా। కారములై పంకజ
ములుగానంగఁబడుఁ * వ॥ అందుఁబరమేశ్వరుంబూజించిపాపవిముక్తులగుదురుసాగరసింధుసంగమస్నానులైనవారు
నాకలోకగతులగుదురు శంఖకర్ణంబున నీశ్వరుంబూజించి దశాశ్వమేధఫల ప్రాప్తులగుదురు వసుధ్వారంబునువసు
శరంబునను తీర్థంబులనాడి వసుసంపూర్ణులగుదురు సింధూత్తమస్నానంబున బహుసువర్ణ దానఫలంబగు బ్రహ్మతుం
గసేవంబునబ్రహ్మలోక ప్రాప్తియగు శక్రకుమారీ విలోకనంబునశక్రలోకగతియగుశ్రీకుంజరంబునం బితామహు
నకునమస్కరించి సౌవర్ణవిరాజితంబులైన మత్స్యంబులుగల విమలంబను తీర్థంబుననాడి వాసవ సాయుజ్యంబువడ
యుదురుమల హారంబనుతీర్థంబున నగ్నిదేవునకునర్ఘ్యంబిచ్చిననది యక్షయంబైపితృదేవతులకుఁ దృప్తిఁజేయుగో
సహస్రదానంబునకునశ్వమేధసహస్రంబులకువిశేషంబు * క ॥ దేవికయనుతీర్థంబున। దేవసమూహంబుతోడఁద్రిణ
యనుఁడుండుఁ । సేవితమైజనులకునది। కావించుననూనధర్మకామార్థంబుల్ * వ॥ అర్ధయోజనవిస్తృతంబై పంచ
యోజనాయామంబైన యద్దేవికానదియును గామాఖ్యంబును రుద్రతీర్థంబును యజనయాజన బ్రహ్మవాలుకంబులు
ను బ్రహ్మాదిదేవతల దీక్షసత్రస్థానంబయిన దీక్షసత్రస్థానంబును సేవించినవారికి నిష్టసిద్ధియగున చిరంబనుతీర్థంబు
ననదృశ్యంబై మేరువునకుంబోవునెడన గోద్భేదశిలోద్భేదసమయంబుల నెందేనిసరస్వతికానం బడియెనట్టిసరస్వతి
యందు నభిషిక్తులైనవారు నాకలోకంబు వడయుదురు రసరూపపుష్కరంబులంగలరసపానంబనుతీర్థంబునస్నానం
బునుగోసహస్రదానంబునుసమంబు * అక్కర ॥ ఏమయేమమును పూజింపుము మరుద్రునిందనివేడ్క। తోమునికో
టిదారున్ననీశుఁడందఱకునుప్రీతి। గామతిలోఁగోటిరుద్రరూపములుగావించెనదియు। భూమిఁబ్రసిద్ధమైరుద్రకో
టి వాఁబొలిచివెలిఁగె * వ॥ అందురుద్రుఁబూజసేసిరుద్రలోక ప్రాప్తులగుదురు * క॥ నరనుతనైమిశమునఁబుష్క
రములమూఁటనుజగత్ప్రకాశితమైయి। ద్ధరణిఁగురుక్షేత్రముదు। స్తరతరదురితౌఘములకుదవ్వగుచుండుఁ * గీ॥ అ
మరలోకనివాసులయంద్రువిబుధు। లాకురుక్షేత్రవాసులనదియువినఁగ। నుత్తమంబుదృషద్వతియుత్తరమునఁ। దపన
తేజసరస్వతిదక్షిణమున * వ॥ అక్కురుక్షేత్రశమంతపంచకంబులనడుమ రామహ్రదంబునడుమఁబితామహునుత్త
రవేదియనంబడునట్టి కురుక్షేత్రంబుమెట్టిన వారికిఁగురుక్షేత్రంబునవసియించెదమని తలంచినవారికి సర్వపాపక్ష
యంబగుదైవతంబనువిష్ణుస్థానంబున విష్ణువునర్చించిన నశ్వమేధఫలంబగుఁబారిప్లవంబను తీర్థమాడియగ్నిష్టోమఫలం
బుఁబడయుదురు పృథివీతీర్థంబాడిన గోసహస్రదాన ఫలంబగు సాలూకినియను తీర్థంబాడిన దశాశ్వమేధఫలంబగు
సర్పితీర్థంబాడియందుత్తరకుండను ద్వారపాలకునింజూచినవారికి నెందేనికృష్ణుండాదివరాహంబయ్యెనట్టి వరా
హతీర్థంబాడినవారికి నగ్నిష్టోమ ఫలంబగు నశ్వినీతీర్థంబాడిన రూపవంతులగుదురు జయంతియను సోమతీర్థస్నా
నంబులురాజసూయపౌండరీక సమంబులగ్నివటంబునఁ బంచవటంబున నీశ్వరుఁబూజించియిష్టవరంబులువడయుదురు
గురుక్షేత్రద్వారంబుఁబ్రదక్షిణంబుసేసినంబాపక్షయంబగు * క ॥ వీరుఁడయిక్షత్రియులందన। దారుణశరశుపునజా
మదగ్న్యుఁడురౌద్రా। కారుఁడువధియించితదీ। యారుణమున నేనమడుపులాపాదించెఁ * వ॥ అందుఁబితృతర్పణంబు
సేసినంబితృదేవతలాతనికిఁబ్రత్యక్షంబై నీకిష్టంబైన వరంబువేఁడుమనినఁ బరశురాముండు వారలకిట్లనియె * గీ॥ క్ష
త్రవధనైనపాపంబుగ్రాఁగవలయు [illegible] ఇయ్యుఁబుణ్యతీర్థంబులై యిద్ధరిత్రిఁ। బరఁ

నచుండంగ వలయుమీకరుణఁ జేసి * వ॥ అనిపితృదేవతలవరంబునం బుణ్యతీర్థంబులఁ జేసె నట్టిరామహ్రదంబుల నాడిన
వారికి నశ్వమేధఫలంబగుఁ గాయశౌచంబను తీర్థం బాడి కాయశుద్ధులగుదురెం దేని విష్ణుదేవుండు లోకంబుల నుద్ధరించె
నట్టిలోకోద్ధారణంబను తీర్థం బాడి కులంబుద్ధరింతురు శ్రీతీర్థం బాడి శ్రీమంతులగుదురు కపిలతీర్థం బాడి కపిలగోసహస్ర
దానఫలంబుఁ బడయుదురు సూర్యతీర్థం బాడి యందువసియించిన సూర్యలోకప్రాప్తులగుదురు గోభవంబను తీర్థం బా
డి గోసహస్రసమృద్ధులగుదురు శంఖినీతలద్వారంబున నరకాంతకుండను ద్వారపాలకుం బూజించినవారు సరస్వతీస్నా
తులైనవారలు నగ్నిష్టోమఫలంబుఁ బడయుదురు మాతృతీర్థదర్శనంబునం బ్రజావృద్ధి యగు బ్రహ్మావర్తంబును శర
వణంబునుఁ జూచిన సర్వవ్యాధివిముక్తులగుదురు లోమాపహంబను తీర్థంబునం దేకాదశ తీర్థంబులుగలవందుఁ బ్రాణా
యామంబు సేసిన విప్రులకు మానసహాయంబగు నైలుకులచేత నేయంబడి కృష్ణమృగంబు లెం దేని యొక్కతీర్థంబు సొచ్చి
మానుషత్వంబునడసె నట్టిమానుషతీర్థం బాడి సర్వవిషయవిముక్తులై దేవత్వంబు వడయుదురు దానితూర్పునొక్క
ఱువున సురగమయను మహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్కబ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ
గోటిబ్రాహ్మణులు గుడిచినఫలంబగుఁ బితృదేవతలు తృప్తియు నొందుదురు బ్రహ్మోదుంబరంబు మహర్షికుండంబు గే
దారంబునుఁ జూచి బ్రహ్మలోకంబు వడయుదురు కపిలాశ్వకేదారంబులఁ జూచి పాపవిముక్తులై యదృశ్యులగుదురు సుక
రంబను తీర్థం బాడి కృష్ణచతుర్దశినాఁ డీశ్వరుం బూజించి యెల్లకోరుకలం బడయుదురు మూఁడుకోట్లకూపహ్రదంబులుగ
లయింద్రస్యందనంబను తీర్థం బాడి పితృతర్పణంబులు సేసినవారికి వాజపేయఫలంబగు జామ్యంబను తీర్థంబునందుఁ జేసి
నదానజపంబు లక్షయంబులగు నారదతీర్థంబైన సభాజన్మంబునందుఁ బ్రాణత్యాగంబు సేసినవారు సర్వలోకంబులుం
బడయుదురు శుక్లైకాదశిం బుండరీకంబను తీర్థం బాడి పౌండరీకఫలంబు వడయుదు రందు వైతరణీస్నాతులై రుద్రునకు న
మస్కరించి సర్వపాపవిముక్తులగుదు రెం దేని దేవతలనేకసహస్రవర్షంబులు దపంబు సేసి రట్టి సవనంబను తీర్థం బాడి య
గ్నిష్టోమాతిరాత్రఫలంబులు వడయుదురు ద్వైపాయనుం డనేకతీర్థంబులు మిశ్రీకరించుటం జేసి మిశ్రీకరంబను తీర్థం
బాడినవారికి సర్వతీర్థస్నానఫలంబగు వ్యాసవరంబును మనోజవంబును మధువటంబునను తీర్థంబుల నాడిన గోసహస్ర
దానఫలంబు వడయుదురు గౌశికీశతధృతీసంగమంబున స్నాతులై సర్వపాపవిముక్తులగుదురు దర్భకూలంబున నశ్వత ప్రస్థా
నంబు సేసి పితరుల ఋణంబున నీఁగుదురు సూర్యతీర్థం బాడి సూర్యలోకప్రాప్తులగుదురు భృగుతుంగంబున గంగాస్నాతులై
మహాదేవు నర్చించిన మహాత్ము లశ్వమేధఫలంబు వడయుదురు వామనంబను తీర్థం బాడి వామను నర్చించినవారు విష్ణులో
కప్రాప్తులగుదురు పావనంబను తీర్థం బాడి కులంబు పవిత్రంబు సేయుదురు శ్రీకుంజరంబున సరస్వతీస్నాతులై యగ్నిష్టో
మఫలంబు వడయుదురు ఋషులెం దేనుండి తీర్థయాత్రాపరులై కురుక్షేత్రంబునకుం బోదు రట్టి నైమిశకుండం బాడి ఋ
షితృప్తి సేయుదురు బ్రహ్మతీర్థం బాడి వర్ణాంతరులు బ్రాహ్మణులగుదురు బ్రాహ్మణులు బ్రహ్మలోకప్రాప్తులగుదురు *
సీ॥ అనఘుఁడు శౌనకుఁ డను నొక్కబ్రహ్మర్షి తనచేయి వ్రయ్యంగ దర్భఁ గోసిన। సాంద్రమై శాకరసంబందు నిర్గతం
బగుడు నుహర్షించి యాడుచున్నఁ। జూచి సహింపక సురలును మునులును హరుపాలి కరిగి దేవాదిదేవ। మునివృత్తమేవి
ధంబున నివృత్తంబగునట్లుగాఁ జేయుమీ వనిన హరుఁడు * గీ॥ తపసి రూపమొప్ప దరియించి యమ్మునిఁ గడకు వచ్చి యేమి కారణ
మున। నాడెదేమి విస్మయం బిందుఁ జూచితి। చెప్పు మిత మేని చెప్పు మనిన * వ॥ నాకరంబున శాకరసంబు వెలువడిన విస్మి
తుండనయి హర్షించి యాడెద ననిన నది యేమి విస్మయంబు దీనిం జూడు మని హరుండు తన యంగుష్ఠంబు నంగుళీ తాడనం
బు చేసిన నందు హేమసన్నిభంబయిన భస్మంబు వెలువడినం జూచి లజ్జితుండయి నీవు పరమేశ్వరుండవని నమస్కరించి వే
దమంత్రంబుల స్తుతియించి దేవా నీ ప్రసాదంబున నాకుఁ దపోవర్ధనంబుగావలయు ననిన నమ్ముని వరునకు నీశ్వరుండు గరు
ణించి నీకుఁ దపోవర్ధనమగు నేను నీయాశ్రమంబున నుండుదు ననియె నట్టి సప్తసారస్వత తీర్థంబు లాడినవారికి సారస్వ
తసిద్ధి యగు బ్రహ్మాదిదేవతలచేన ధిష్ఠితంబులయిన యౌశనతీర్థంబును గపాలమోచనంబు విశ్వామిత్రంబు గార్తికేయం
బు ననియెడు తీర్థంబుల నాడి పాపవిముక్తులయి బ్రహ్మలోకంబుఁ బడయుదురు * క॥ వేదములందును వినఁ గబ్బ। పావకతీ

ర్థంబయుత్తమోత్తమ మును రేం। ద్రాదిసురనరులకును న్యా। సాదిమహాయోగినరులకాస్పదమగుటకా * వ॥ అంత

శరీరత్యాగంబుచేసినవారు పాపవిముక్తులగుదురు సురకన్యాసరస్వతీసంగమస్నాతులయినవారు బ్రహ్మహత్యాదిపాతకంబులవలనఁ బాయుదురు రత్రినిర్మితంబయిన యతికర్షణతీర్థం బాడిన శూద్రులు బ్రాహ్మణులగుదురు బ్రాహ్మణులుపరమసిద్ధులగుదురు శతంబునుసహస్రంబుననుతీర్థంబులందుఁజేసిన జపదానోపవాసంబులు శతసహస్రగుణంబులగు వేల్పులెల్లంగుమారు సేనాపతింగా నెంజేసినభిషేకించినట్టియాశ్రీనంబనుతీర్థంబునుదాఁతూర్పుననుండు సురతీర్థంబును స్వర్గద్వారంబను తీర్థంబునుం జూచినవారికి స్వర్గద్వారంబు వివృతంబగు రుద్రపత్నియను తీర్థంబున శంకరనారాయణులనర్చించి సర్వదుఃఖ విముక్తులగుదురు స్వస్తిపురంబుఁ బ్రదక్షిణంబుసేసి గోసహస్రదానఫలంబు బడయుదురు గంగమడువున నొక్కకూపంబున మూఁడుకోట్లతీర్థంబులు సన్నిహితంబులయియుండు నందుఁగృతస్నానులయినవారికి సర్వతీర్థస్నానఫలంబగు బదరీవనంబునందు వసిష్ఠాశ్రమంబునఁ ద్రిరాత్రంబులు బదరీఫలభక్షణంబుసేసి పాపవిముక్తులగుదు రేకరాత్రంబనుతీర్థంబున నేకరాత్రోపవాసంబుసేసి బ్రహ్మలోకంబు వడయుదురాదిత్యాశ్రమంబనువనంబున నాదిత్యుంబూజించి యాదిత్యలోకగతులగుదురు దధీచితీర్థంబునం గణ్వాశ్రమంబునందుఁ ద్రిరాత్రంబువసియించినవారికి స్వర్గఫలంబగు ✱ క॥ జలరుహసంభవుఁడాదిఁ । గలవేల్పులుమునులుసిద్ధగరుడోరగులు । న్నెలనెలసేవింతురుభూ । తలమునసన్నిహితమునఁగఁదగుతీర్థంబుకా ✱ వ॥ సోమసూర్యగ్రహణంబులదానవాడిన శతాశ్వమేధఫలంబు వడయుదురు ధర్ముండు తపంబుసేసిన ధర్మతీర్థంబాడి ధర్మశీలులగుదురు నరపావనంబును సౌగంధికంబు ననుతీర్థంబుల నాడినం జూచిన సర్వపాప విముక్తులగుదురు దేవశ్రవయను సరస్వతీహ్రదంబునందు వల్మీకంబున వెలువడుజలంబులాడి పితృతర్పణంబుసేసినవారశ్వమేధఫలంబుఁ బడయుదురు సుగంధియుశతకుంభియుఁబంచయజ్ఞయుఁ త్రిశూలఖాతయు ననుతీర్థంబులాడి దుర్గతులవలనం బాయుదురు తొల్లిపార్వతియొండేనిశాకాహారిణియై దివ్యసహస్రవర్షంబులు తపంబుసేసె నట్టిశాకంబరీ తీర్థంబాడి యొక్కదివసంబు శాకాహారులయినవారు పంద్రెండేండ్లుశాకాహారతపంబుసలిపినవారిఫలంబు వడయుదురు స్వర్ణాఖ్యంబనుతీర్థంబున రుద్రుంబూజించి రుద్రలోకగతులగుదురు ధూమవతియను తీర్థంబును రథవంతంబను తీర్థంబును ధారయను తీర్థంబునాడి శోకవిముక్తులగుదురు ✱ క॥ ధారుణిలోననుస్వర్గ । ద్వారంబయిఋషినిషేవితంబగుగంగా । ద్వారంబాడినధన్యులఁ । జేరునుశతకోటితీర్థసేవాఫలముల్ ✱ వ॥ మఱియు సప్తసాగరసంగమంబును ద్విసంగమంబును శక్రావర్తనంబును గగనజలంబును గంగాసరస్వతీ సంగమంబు నాదిగాఁగల పుణ్యతీర్థంబులనాడి పుణ్యలోకంబులు వడయుదురు భద్రకర్ణేశ్వరంబునరుద్రపూజయు నరుంధతీవటంబును సింధుప్రభవ యమునాప్రభవయు ననుపుణ్యతీర్థంబుల సేవించిన సర్వసిద్ధికరంబులు వేదికయను తీర్థంబును ఋషికుల్యంబను తీర్థంబును కృత్తికామాఘ తీర్థంబును విద్యాతీర్థంబును వేదశిఖయనుతీర్థంబునుంజూచి దురితంబులవలనం దొలంగుదురు బ్రహ్మతీర్థంబాడి పద్మవర్ణయానంబుల బ్రహ్మలోకగతు లగుదురు ✱ చ॥ సురుచిరకీర్తినైమిశముఁజూచినమాత్రనపాయుఁబాపము । చ్చెరువుగనందుమాసమువసించియనంతఫలంబులొందఁగాం। తురుబహుతీర్థసేవనముతోడసమానము నైమిశంబునం । దరుదుగనొక్కవాఁడువిధియైయుపవాసముసేయఁగాంచినన్ ✱ వ॥ మఱియును నందోద్భవతీర్థంబునిందీవరతీర్థంబు గంగాద్వారంబు దశావతితీర్థంబు ననియెడుతీర్థంబులనాడి వాజపేయఫలంబుఁ బడయుదురు బాహుదయనుతీర్థంబాడిన ననేకసత్రయాగఫలంబగు నెందేనిరాముండుస్వర్గస్థుండయ్యెనట్టి సరయూప్రదేశంబున గోప్రదానంబాడియు దేవతలకు ఋషులకు యజ్ఞభూమియయిన తీర్థంబులుగల గోమతివాడియు నశ్వమేధఫలంబువడయుదురు భద్రతీర్థంబునం గుమారునర్చించియు వారణాశియందురుద్రునర్చించియుఁ గపిలహ్రదంబాడియు రాజసూయఫలప్రాప్తులగుదురు మార్కండేయ తీర్థంబయిన గంగాగోమతీసంగమంబాడియు బ్రహ్మకల్పితంబయినయూపంబుఁ బ్రదక్షిణంబుసేసియు వాజపేయఫలంబువడయుదురు ✱

సీ॥ పలువురఁగొడుకులఁబడయంగఁగోరుదు రొక్కరుండయిననందొపిగయకు । నరుగునోయనియునశ్వమేధంబొవ్వఁజేయునోయనియును శ్వేతమైన । యాఁబోతువిడుచునోయనియునుగోరుదు రనవద్యులైనగృహస్థులట్టి । గయకేగి యుభయపక్షములువసించినఁగడుపుణ్యులుభయపక్షములవారి [illegible] తురంద యొగిఁబిండమిడినవా । రనఘుపిత్ర

యనుస్మృతార్థులగుదు । రండఘల్లునంబునం దాడువారికిఁ । బరమసిద్ధితోఁ శుభంబు పెఱుఁగు ✽ వ॥ మఱియుఁ గాశీతీర్థంబు
నందు జలపానంబు సేసి బ్రహ్మహత్యాదిదోషవిముక్తులగుదురు మణినాగంబను తీర్థంబాడిన వారికి నాశీవిషంబులు
నొందవు గౌతమవనంబునం దహల్యాహ్రదంబాడియు నుదపానంబను తీర్థంబాడియు నశ్వమేధఫలంబుఁ బడయుదు
రు రాజర్షియయిన జనకు తీర్థంబాడి విష్ణులోకప్రాప్తులగుదురు కంపనయు మహానదియు ననుతీర్థంబుల నాడినవారు
పౌండరీకఫలంబు నొందుదురు దేవపుష్కరంబున మహేశ్వరస్థానద్వారంబున మానుషపథంబున దీర్థంబాడిన నశ్వమే
ధఫలంబు వడయుదురు తొల్లి కూర్మరూపుండయిన యసురచేతం గోటితీర్థంబు లపహృతంబులయిన వానిం దెచ్చి విష్ణుం
డెందేని నిలిపె నట్టి మహేశ్వరపథంబన తీర్థంబాడియు విష్ణుస్థానంబయిన సాలగ్రామంబను తీర్థంబాడి విష్ణు నర్చిం
చి యనందు సన్నిహితచతుస్సముద్రంబయిన కూపంబున నాడియు విష్ణులోకగతులగుదురు భరతాశ్రమంబుఁ జంపకా
రణ్యంబున దేవసహితు నీశ్వరుం బూజించి మిత్రావరుణలోకంబు వడయుదురు కన్యాసంవేశంబను తీర్థంబునఁ గన్యా
దానంబు సేసి యక్షయఫలప్రాప్తులగుదురు దేవకూటంబను తీర్థంబాడి బ్రహ్మలోకంబుఁ బడయుదు రెందేని విశ్వామి
త్రుండు సిద్ధిం బొందె నట్టి కౌశికహ్రదంబాడియుఁ గుమారవీరాశ్రమంబున నొక్కమాసంబు వసియించియు నశ్వమేధ
ఫలంబు వడయుదు రగ్నిధారయుఁ బితామహుశరంబునం బుట్టిన కుమారధారయు నాడి త్రిరాత్రోపవాసంబు సే
సినవారు బ్రహ్మహత్యాదిదోషవిముక్తులగుదురు గౌరీశిఖరకుండంబాడిన నందినీకూపంబాడిన నశ్వమేధఫలంబుఁ గాశి
కాకౌశికీసంగమంబునందుఁ ద్రిరాత్రోపవాసంబు సేసినవారు సర్వపాపవిముక్తులగుదు రూర్వశీతీర్థంబాడిన సర్వ
పూజ్యులగుదురు గోకర్ణంబను తీర్థంబాడి జాతిస్మరత్వంబు వడయుదురు సర్వతీర్థస్నానఫలంబు వృషభద్వీపం
బునం గుమారుం బూజించి దేవవిమానగతులగుదురు నందయు నందాలకయు ఖచరతోయంబును గంగాసాగరసంగమం
బునను తీర్థంబుల నాడి శతాశ్వమేధఫలంబు వడయుదురు శోణానర్మదాప్రభవంబును బదరీతీర్థంబును నాడియా
యుష్మంతులగుదురు మహేంద్రంబున రామతీర్థంబును మతంగకేదారంబును వంశగుల్మంబునను తీర్థంబుల నాడి
యశ్వమేధఫలంబు వడయుదురు ✽ గీ॥ పరమమైనతీర్థంబు శ్రీపర్వతంబు । నందు దేవహ్రదంబాడి యాదిదేవు నీశున
ర్చించి వడయుదు రిష్టఫలము । నశ్వమేధఫలంబును నవనిజనులు ✽ వ॥ తొల్లి శతక్రతుండు నూఱుక్రతువులు సేయుటం జే
సి పవిత్రంబయిన కృష్ణవేణియందు దేవహ్రదంబాడిన సర్వపాపవినాశనం బగుఁ బాండ్యవర్షంబునం గావేరీతీర్థం
బును మంగళాద్రియు సముద్రతీరంబునఁ గన్యాతీర్థంబును నాడి యశ్వమేధఫలంబు వడయుదురు గాయత్రీస్థానంబునం
త్రిరాత్రంబు గాయత్రీజపంబుఁ జేసినవారికి జన్మదుఃఖంబులు లేవు పెన్నయును మహానది నాడినవా రయోగహంసవిమా
నయానగతులగుదురు గోదావరీస్నానంబు సేసిన దశాశ్వమేధఫలంబు వడయుదురు పయోష్ణియు దండకారణ్యంబును
శరభంగాశ్రమంబును జమదగ్నిసేవితంబయిన శూర్పారకంబును సప్తగోదావరీతీర్థంబును నాడిన పుణ్యులు పుణ్యలోక
ప్రాప్తులగుదురు ✽ సీ॥ అసురులభయమున నడఁగిన వేదంబు లోంకారరూపమై యుండ నాంగిరసుఁ డుద్ధరించి సారస్వతప్ర
ముఖులఁ జదివించె నెందేని శాశ్వతముగ । నమరనియుక్తుఁడై యాజ్ఞ్రించె నెందేని భృగుఁ డెల్లవారికిఁ జెప్పె నట్టి । రమణీయ
తుంగకారణ్యంబు సూచినమాత్రన దురితవర్గంబు లెల్లఁ ✽ గీ॥ వాయుఁ గాపింజకంబను పర్వతంబునందు దేవహ్రదంబాడి
యభిమతములు । వడయుదురు వాహికమానాగ తీర్థ । మాడి మేధాసమన్వితులగుదురందు ✽ వ॥ మఱి చిత్రకూ
టంబున మందాకిని సేవించి భద్రస్థానంబునం గుమారుం బూజించి జ్యేష్ఠమాసంబున రుద్రు నర్చించి రామనివాసంబున
శృంగిబేరపురంబున గంగాస్నాతులయి గంగాధరు నర్చించియు సర్వపాపవిముక్తులగుదురు ✽ క॥ యాగశతంబులకంటెఁ
బ్ర । యాగనివాసము విశేషమని సురులు మహా । యోగులు సిద్ధులు సాధ్యులు । నాగులు నందుండు దగుమనః ప్రియమెనఁ
గఁ ✽ వ॥ అది ప్రజాపతియజ్ఞవేది గావున గంగయందు మూఁడగ్నికుండంబు లెప్పుడుఁ గానంబడు మఱి వేదంబులు యజ్ఞం
బులు మూర్తిమంతంబులై యుండు పదికోట్లపదివేలు తీర్థంబులు సన్నిహితంబులై గంగాయమునాసంగమంబు సేవించియుం
డు నందుఁ గృతస్నానులైనవారు రాజసూయాశ్వమేధఫలంబుతో సత్యవాదులై చతుర్వేదాధ్యయనులై పుణ్యలోకం
బు వడయుదు రందు భోగవతియు వాసుకియునను తీర్థంబును హంసప్రపతనంబునను తీర్థంబుల నాడి దశాశ్వమేధఫలం బు

వడయుదురు * క ॥ విహితముగఁ దీర్థకీర్తనఁ । జదివినధన్యులకు వినినసజ్జనులకునా । భ్యుదయము సుసర్వతీర్థస । ముదయస్నానబహుయాగములఫలములగుఁగా * వ ॥ వ్రతములు లేనివారును నుపవాసపరాఙ్ముఖులైనవారుదు । ర్మతులు విహీనశౌచులుగ్రమంబునఁ దీర్థములాడ నోపవారా । తతగుణశాలి నీవఖిలధర్మనిధుండవు గావునన్ శుభ । స్థితిఁ జని తీర్థసేవనము సేయుమునీకునభీష్టసిద్ధిగన్ * వ ॥ అనిసకలతీర్థకథనంబు సెప్పినపులస్త్యవచనంబున భీష్ముండు దొల్లి యెల్లతీర్థంబులు సేవించి కృతార్థుండయ్యెఁ గావున నీవును దీర్థసేవ సేసి * క ॥ పూరుపురూరవులట్లుభ । గీరథరఘుపతులయట్లు కృతకృత్యుండవై ధారుణిరక్షింపుము వి । స్తారగుణాధారధీరధర్మతనూజా * వ ॥ రోమశుండను దేవర్షి దేవలోకంబుననుండి నీకడకు వచ్చెడు నప్పుడు వానితో ధౌమ్యానుమతుండవయి తీర్థసేవఁ జేయుమని చెప్పి నారదుం డరిగిన నజాతశత్రుండు ధౌమ్యుఁ జూచి యిట్లనియె * చ ॥ అలయక మాకుఁ బందఱకు హర్నిశముం బ్రియకారియైనయ । య్యలఘువరాక్రమోన్నతుమహాభుజు జిష్ణుని దివ్యసాయకం । బులువడయంగ నొక్కరునఁ బుచ్చితి దద్గతయు వేడ్క నెద్దియుం । దలఁపక యున్న తద్విరహితత్వము సుస్థితిఁ జేయు దేమియున్ * వ ॥ అంబుదాగమనంబు సేకుఱు చాతకంబులట్లు మనమందఱ మర్జునాగమనంబు ప్రతీక్షించుచున్నవారము వాఁడు నుందనఫ్రూనినకార్యంబు నిర్వహించి కానినివృత్తుండు గాఁడు వశ్యంబును దివ్యాస్త్రంబులు వడయు

## రోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట.

యాతనివచ్చునంతకుఁ దీర్థసేవ సేయుదము విను గరంబులగ్గు సట్లచేయుదమనిన * ఉ ॥ వాలుగు దిక్కులందును ననిర్వెదితంబగుచున్న పుణ్యతీ । ర్థాలి తెఱంగెఱుంగఁ గమహాత్ముఁడు ధౌమ్యుఁడు జాతవైరికం । దోలినచెప్పుచున్న తఱినొప్పఁగ రోమశుఁ డేగుదెంచె దే । జోలలితుండు నిర్మలయశుండగు ధర్మతనూజుపాలికిన్ * వ ॥ ఇట్లు వచ్చినమహామునిని భక్తినను జబ్రాహ్మణసహితుండై ధర్మజుండు పూజించి మునీంద్రా యెందుండి వచ్చితిరని యడిగిన నాతనికి రోమశుం డిట్లనియె * గీ ॥ ఎల్లలోకంబులును జూచి యింద్రలోక । లోకనార్థినై యేనింద్రలోకమునకుఁ । బోయి సురరాజుచేఁ బ్రీతిఁ బూజితుండ । నై మహీనాథ యందు నీ యనుజు నరఘు * ఉ ॥ ఈశుని నీశుఁ దొట్టి సురలెల్లను భీష్టవరంబు లిచ్చుటం । జేసి కృతార్థుఁడై నరుఁడు సింహము నూర్జితశౌర్యు నగ్జునుం । భాసురతేజు విశ్వపరిపాలకుఁడైన మహేంద్రుతోడ నే । కాసనమెక్కియున్న సహమాస్పదు నింద్రసమానుఁ జూచితిన్ * క ॥ బలవంతులైన భీష్మా । దులనర్జునుఁ డోర్చు నవజితుండై మఱి పోరులఁ గర్ణునవధాని । కళితసమానుండు గాఁడు గర్వాఢితోడన్ * వ ॥ అతఁ డియున్న విలాసంబు చూచి విస్మితుండ నయిన నాకు నింద్రుండు దత్ప్రభావంబు చెప్పి వీఁడు నృగసంభవంబయిన పాశుపతంబను దివ్యాస్త్రంబు పరమేశ్వరుచేతను యమవరుణకుబేరాదులచే దివ్యాయుధంబులఁ బడసెనితండు మనుష్యుఁడు గాఁడు దివ్యపురుషుం డన్యులకశక్యంబయిన దేవకార్యంబు దీర్చి మనలకు వచ్చునని మర్త్యలోకంబునకుం బోయి భ్రాతృసహితుండయిన ధర్మరాజునకుం జెప్పుమని వెండియు నిట్లనియె * క ॥ నిరతముగఁ దీర్థసేవా । పరులకు శాంతాత్ములకుఁ దపస్వులకును నీ । పరమెద్దియు లేదని చెప్పి రిధర్మజుఁ దీర్థసేవఁ జేయింపుమిలన్ * క ॥ అనివనిచిననను రేశ్వరు । పనిఁ దత్పార్శ్వమునఁ నుండి పన్నుగ నిట్లేఁ । జనుదెంచితి నీ కార్యము । ధనంజయునకభిమతంబు ధరణీనాథా * క ॥ అనవద్యతీర్థసేవన । మునుగపిలస్వర్ణదానములును వ్రతవంబును జేయనివారికిఁ బో । లునె పడయఁగ బేర్మి నుభయలోకసుఖంబుల్ * వ ॥ ఏను దొల్లి భూవలయంబునంగల తీర్థంబు లెల్లను మాఱుచూచితి నిప్పుడింద్రునియోగంబున నీతోడ వచ్చి యఖిలతీర్థసేవ సేసెదననిన ధర్మజుం డతనికిట్లనియె * ఉ ॥ నన్నుఁ దలంచి తీర్థగమనంబొనరింపఁగఁ బంచెనంట వి । ద్వన్నుత దేవవల్లభుఁడు దానఁ గృతార్థుఁడనైతి దానిపై । నిన్ను సహాయుఁగాఁ బడసి నెమ్మి నశేషవిశేషతీర్థముల్ । సన్నుతిఁ జూడఁగాంచి కడు భవ్యుఁడనై తి మునీంద్ర నీదయన్ * గీ ॥ విజయుని కలవార్త వేడ్కతో నీ చేత । వినిన యంతకంటె వినఁ దలంచి యెల్ల ధర్మసుతుఁడు * వ ॥ మునీంద్రా యేను దొల్లి నారదధౌమ్యవచనంబులం దీర్థగమనోన్ముఖుండనై యున్నవాఁడ నిప్పుడు భవన్నిమిత్తంబునఁ దీర్థసేవ సేసి కృతకృత్యుండ నగుదునని నిశ్చయించి భిక్షాభోజనులయిన బ్రాహ్మణులను యతులను రోమశువచనంబున నిర్వర్తించి ధౌమ్యపురస్కృతకతిపయబ్రాహ్మణులతో ననుజులుం దానును గృపాసహితులయి కామ్యకవనంబున మూఁడుదినంబులు వసియించి మార్గశీర్షమాసావసాన సమయంబునం దీర్థసేవార్థంబు కృతప్రస్థానుండయిన

యుధిష్ఠిరునకు బ్రాహ్మణులిట్లనిరి * ఉ॥ నీయనుజుల్ధనర్ధరులవింధ్యచరిత్రులుదీర్ఘతీక్ష్ణకా । ర్యేయక పాణులత్య
మలకీర్తులుగావఁగరోమశుండుదే। జోయుతుఁడెల్లతీర్థములుసూవఁగఁదీర్థములాడువేడ్కలు। శ్రేయతయాపువిన్నకుగమిం
పఁగఁగంటిమిపుణ్యసంపదన్ * వ॥ రాక్షసపిశాచాస్పదంబులగు కారణంబు ననడవులలోనేకతంబ యరిగితీర్థసేవసే
యమాయిట్టివారికి నశక్యంబుగావున మీతోడవచ్చెదమని బ్రాహ్మణులుధర్మరాజుచేత ననుజ్ఞాతులైరంత * క॥ పా
రాశర్యుఁడుపర్వత। నారదులుమబాండురాజనందములగుణో।దారులననఘులదీర్ఘ। ప్రారంభులఁగానవచ్చివరమప్రీ
తిన్ * క॥ వారలచేఁబూజితులై। భూరితపోధనులులోకపూజ్యులుధర్మ। ప్రారంభనిత్యమతులను। వారలకిట్లనిరిసత్య
వచనులుగరుణన్ * వ॥ శారీరనియమంబులుమానుషవ్రతంబులనఁబడుమనోబుద్ధి శౌచంబులుదేవవ్రతంబులనఁబడు
నట్టిసౌమ్యవ్రతవిశేషంబులునలుపుచు ఋజుమార్గులరై తీర్థంబులు సేవించునది తీర్థాభిగమనంబున మహాభిషనాభాగ
భరతభగీరథ ముచికుంద మాంధాతృసగరసార్వభౌమాష్టక రోమపాదులయట్లశత్రుజయంబును సర్వలోకసుఖంబు
లంబడయుదురనిచెప్పిమునివరులు మువ్వురరిగిరంత నజాతశత్రుండురోమశునకిట్లనియె * క॥ ధరణీవధార్మికులసుకా।
పురుషులకభివర్ధనంబుపుణ్యచరిత్రం। బరఁగెడుధార్మికులకుదు। ర్ధరమైనయవర్ధనంబుదగునెమునీంద్రా * వ॥మఱియు
నచేతనంబులయ్యును గిరిసరిత్సరోవంబులు పుణ్యతీర్థంబులై జగత్పావనంబులై జనులకు దురితాపహారంబులైనకార

——*రోమశుండుధర్మరాజునకుధర్మవిశేషంబులుచెప్పుట.*——

ణంబేమియనియడిగిననతనికిరోమశుండిట్లనియె * చ॥వసుధరధర్మవర్తులగువారలవర్తనమెన్నఁడున్నమం। జపమయివి
ల్ప నేరమభృశంబుగనాశముఁబొందునధర్మద। వ్యసనులధర్మవర్తనఁబ్రవర్ధితులయ్యును నేమచూడరా! తసులునదైత్య
దానవులుగ్రాఁగరెతొల్లిసహస్రసంఖ్యలన్ * క॥ దేవతలుధర్మవర్తులు। గావుననభివృద్ధిఁబొందిఘనముగనిత్య। శ్రీవి
భవాన్వితులయిధర। ణీవల్లభయున్నవారునిరుపమకీర్తిన్ * క॥ధర్మసుతధార్తరాష్ట్రుల। ధార్మికులైపెఱిఁగిరేవిత
డయకవిధిచే। నిర్మూలితులగుదురుదు। ష్కర్మంబుననసురులట్లుకడునస్థిరులై * వ॥ అదియెట్లనినధర్మవర్తులయందుద
ర్పంబుపుట్టు దర్పంబువలన మానంబుపుట్టు మానంబువలనఁగ్రోధంబుపుట్టుఁగ్రోధంబువలనంజేసిలజ్జయువృత్తంబు
నుంజెడునష్టలజ్జావృత్తులయినవారి నుపశమంబును లక్ష్మియువిడుచు * క॥ మీరమరసదృశులరుధ। ర్మారంభవిశిష్టమ
తులరగుటమనుచిర।శ్రీమ్యులరగుదురుఃజి। తారాతులరగుదురుద్ధతాహవభూమిన్ * వ ॥ధర్మవర్తనులయినదేవతులు
ఋషులునాశ్రయించుటంజేసి తీర్థంబులుపవిత్రంబులై సర్వకామప్రదంబులై వర్తిల్లుచుండుఁ దీర్థసేవనుక్రతువుల
నుదానంబులను బ్రాహ్మణులదీవనలను జనులుసర్వదుఃఖవిముక్తులయి శ్రేయఃప్రాప్తులగుదురనిచెప్పిన నమ్మునివరువ
లననెలఁడుధర్మస్థితులువించుఁ బాండవులరిగి నైమిశంబు నశ్వతీర్థంబును గంగాఘోషంబును వాగకన్యాతీర్థంబును గో
మతియును బాహుదయనుమహానదియును దేవయజనంబయినప్రయాగయు గంగాయమునాసంగమంబునువాడి యం
దు బ్రాహ్మణులకుగోహిరణ్యదానంబులుచేసి ప్రయాగంగొన్నిదినంబులుండి వేదవిదులయిన బ్రాహ్మణులవలన వే
దార్థంబులెఱుంగుచుఁజని యనేకపుణ్యనదీసముద్భవంబయిన గయపర్వతంబును శామశరంబును బ్రహ్మశరంబునువై
వస్వత తీర్థంబునుంజూచి గయయందు నక్షయవటంబున నార్షేయంబయిన విధానంబునం జాతుర్మాస్యక్రతువులు
.చేసి ఋషులవలనం బుణ్యకథలు వినుచున్నయవసరంబున శమంతుండను మహాముని ధర్మరాజునకిట్లనియె * సీ॥ అన
ఘుండుధూర్తరయప్రియపుత్రుండు గయుఁడనురాజర్షి క్రతువులిందు। బ్రహ్మశరంబునఁ బరఁగంగమునుచేసె నాత
నియజ్ఞంబునందుసకల। జనభుక్తశేషాన్నశైలంబులిరువదియేనమసంఖ్యఁదానెఱుఁగనయ్యెఁ। దక్షిణ్యతక్రతుబహు
దక్షిణానంఖ్యయునుమునికతానంఖ్య యును నెఱుంగఁ గీ॥ గాదుజనులకట్టిగయువామమునగయ। యనఁగఁబుణ్యతీరమ
య్యెనిదియుఁ। బితృహితార్థమిందుఁబిండప్రదానంబు। సేయఁగనినవిష్టసిద్ధిపెఱుగు * వ॥అనిచెప్పినశమంతువలనగ
యామాహాత్మ్యంబువిని యగస్త్యాశ్రమంబునకరిగిరంత ధర్మరాజురోమశునకిట్లనియె * మధ్యాక్కర॥ వాతాపియనఁ
వానినెట్లుచంపెనద్వంద్వుఁడగస్త్యుఁ। డాతతతేజోధికుండునావిందునమ్మువినాథుఁ। బీతిదవచ్చరితంబువినఁగనభీష్టమిం
దనిన।నాతనికిట్లనిచెప్పెరోమశుండామునిపెద్ది * క॥ నీతభయాలిల్వలుండను। వాతాపియనఁగఁబరఁగువరదైత్యులు

విఖ్యాతబలులు నసియింతురు । రాతిహరుల్మణిమతీపురంబున నొప్పఁగ ॥ వ॥ అందగ్రజుండైన యిల్వలుం డొక్క బ్రాహ్మణు నతిభక్తి నర్చించి వానికి నఖిలాభీష్టసిద్ధికరంబగు మంత్రంబు నుపదేశింపుమని ప్రార్థించి విఫలప్రార్థనుండయి యలిగి తన తమ్ముఁ గామరూపధరు వాతాపి నప్పుడు మేషరూపంబు చేసి వధియించి వానిమాంసం బిమ్ముగా వండించి దాని నావిప్రునకు భోజనంబు పెట్టించి ॥ గీ॥ విప్రుకడుపులోనున్న యవ్వీరుదనుజుఁ । బిలిచె రమ్మని వాతాపి ప్రియముతోడ । జీవితుండయి వాఁడు నెచ్చెరనె విప్రు । కడుపు వ్రచ్చుచు వెలువడి క్రాఁచె విప్రు ॥ వ॥ అదిమొదలుగా నిల్వలుండు దనకడకు వచ్చిన విప్రుల నిప్పాట నంతకపురంబున కతిథులం జేయుచున్నంత నట యగస్త్యుండు బ్రహ్మచర్యాశ్రమంబునం బెద్దకాలంబు తపంబు సేయుచుఁ దనవనంబునం బరిభ్రమించువాఁ డొక్కపల్లవంబున నధోముఖులయి వ్రేలుచున్న తనపితరులం జూచి యివ్విధంబున మీరున్న కారణం బేమి యని యడిగిన వారిట్లనిరి ॥ గీ॥ అయ్య యేము నీపితరుల మధికనిష్ఠ । బ్రహ్మచారివై నీవు తపంబు సేయ । చున్నవాఁడవు సంతతి నొల్లకది య । కారణంబుగ మాకూర్ధ్వగతియు లేదు ॥ వ॥ ఇంక నైనను నీవు వివాహంబై సంతానంబు వడసిన మాకుఁ బుణ్యగతి వడయనగు నని యన నట్ల చేయుదు నని యగస్త్యుండు దనతపశ్శక్తిం జేసి పుత్రకాముండయిన విదర్భరాజునకొక్క కూతుం బుట్టించిన నది లోపాముద్ర యను నామంబుతో జలంబులయందు నళినియునుం బోలె వినీతియందు లక్ష్మియుం బోలె మధ్యకృశత్వంబున విద్యుల్లతయుం బోలె నెదిగి యౌవనంబుఁ దాల్చి రూపవతియై మోహనంబులననురూపలయిన కన్యకాశతంబుతో నొప్పుచున్నంత ॥ క॥ తరుణి నగస్త్యభయంబున । వరియింపఁగ నోడి రాజవరులు మనోజాతురులగుచుండిరి తగి యొరు । వరు గోరుచునుండె పుత్రకు వైదర్భుండున్ ॥ వ॥ అంతనగస్త్యుండు విదర్భరాజుపాలికి వచ్చి నాకు లోపాముద్ర నిచ్చునది యనిన వైదర్భుండాత్మగతంబున ॥ ఉ॥ నారలు గట్టి కూరల శనంబుగ నుగ్రవనంబులోఁ దపో । ఘోరమునం గృశుండయిన బ్రాహ్మణుఁ డీలలితాంగిఁ బెండ్లియై । నారలుగట్టి కూరల శనంబుగను గ్రవనంబులోఁ దపో । ఘోరముఁ దాల్చియుండు మనిపంపక మిన్నకయుండ నేర్తునే ॥ గీ॥ ఎఱిఁగి యెఱిఁగి తపసి కెట్లు లీవఁగు భోగ్యయోగ్యయైనయిప్ప యంబుజనేత్ర । నీవి వాఁడు శాపమిచ్చుఁగాక మ్మునివేల సైచు నింక నెట్టులొకొ ॥ వ॥ అని వైదర్భుండు దాను సుఖిణ్నియు వగచుచున్న వారిపాలికి వచ్చి లోపాముద్ర యిట్లనియె ॥ క॥ ఇమ్మునివరునకు నన్నుఁ బ్రీ । యమ్మున నిచ్చునది మీకు నతిచింతాభారమ్మేల యనినను ఇరువురు । నమ్మాటకు సంతసిల్లి యధికప్రీతిన్ ॥ వ॥ విధ్యుక్తంబుగా నక్కోమలి

## అగస్త్యుండు లోపాముద్రను వివాహంబయ్యెడు కథ.

నగస్త్యునకు వివాహంబుఁ జేసిన నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించి దాని దివ్యాంబరాభరణంబుల వసయించి వల్కలాజినధారిణిం జేసి ధర్మచారిణిం దోడ్కొని చని గంగాద్వారంబున తపంబు సేయుచున్నంత నొక్కనాఁడు ॥ క॥ శుచియగు నాభిఁ జవలవిలోచనఁ బృథుజఘనచక్ర లోపాముద్రం । జూచి మునీంద్రుఁడు మన్మథ । గోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడంగ రక్షా ॥ వ॥ అదియు మునీంద్రునభిప్రాయం బెఱింగి లజ్జించి ముకుళితకరాంబుజయై యిట్లనియె ॥ క॥ పతి పత్నిఁ బ్రజార్థముగా । ధృతిఁ బడయుట యెందుఁ గలయది యయ్యెనను నన్నతిరుచిరాంబరభూషా । న్వితఁ జేసి మనఃప్రియంబున్ సొర్మింపుయర్థ ॥ క॥ మునినాథ నీవు నను లే । పనమాల్యవిభూషణప్రసన్నుఁడవై నా । కొనఁగింపుము పత్యాత్మా । దనమీబుతుపాసగములు దప్పకయుండఁగ ॥ వ॥ అనిన నాకుఁ దపోధనంబు కాని యొండుధనంబు లేదు నీకోరిన విధం బెట్లు సేయ నేర్తు నంబునం జేసి సర్వంబునుం బడయనగు నం దేని నెట్లు తపోవ్యయంబు సేయుదు నని యగస్త్యుండు వసుభిక్షార్థియై శ్రుతర్వుండను రాజుపాలికిం బోయి వాని చేతం బూజితుండయి యేమధనార్థినై వచ్చితి నీకు వ్యయోపోషణంబునకు విఘాతంబు గాకుండ మిగిలిన ధనంబు గలదేని నాకిమ్మని యడిగిన నతండాయవ్యయంబులు సమంబులగుటం జేసి మిక్కిలి లేమి యెఱింగిన వాఁడు సుదానుఁ డబ్రహ్మదశ్వుండను రాజుపాలికిం బోయిన నతండును నయ్యగువురం బరమభక్తిం బూజించి తదాగమనప్రయోజనం బడిగినఁ దమవచ్చిన కార్యం బెఱింగించి యాయుమలవా యవ్యయంబులు సమంబులగుట యెఱిఁగి ॥ క॥ తరువుఁ దోడ్కొని తాను । నరిగెం బ్రాదస్యుఁడను జనాధిపుకడకున్ । గరమర్థితోడ నందఱుఁ బురుకుత్సతనూజుఁడతఁడు పూజించి వడిన్ ॥ వ॥ వారల చెప్పినట్ల తన నిర్వాహకంబుఁ జెప్పి త్రాదస్యుండగస్త్యునకిట్లనియె ॥ క॥ ఇన్వలుఁడి మణిమతీపురంబునఁ । దమ్ముండును దానునతిముదంబున నుండు । న్నెమ్మి నిల్వలుఁడను వాఁ । డిమ్మహిఁ ధనవంతుఁ డతఁడ యొవ్వరికం

కొనె * వ || అతండు మనయభిమతంబు దీర్పనోపునని రాజర్షులు మువ్వురు మహర్షిం దోడ్కొని యిల్వలు పాలికిం జ
నిన నయ్యిల్వలుండును వారి నాతిథ్యవిధానంబుల నర్చించి వాతాపి నెప్పటియట్ల సంస్కరించి యగస్త్యునికి భోజనంబు సమ
ర్పించిన * గీ|| దాని నెఱిఁగి యిమ్మువ్వురు ధరణిపతులు। మునివరేణ్యునకవ్వుడు మ్రొక్కియునిరి। విప్రవరులకు భక్ష్యమై వీని త
మ్ముఁ దుదరములనుండి విప్రులనొగిన చంపు * చ|| వలవదు వీని యింటఁ గుడువన్ మనకుం ధనమిచ్చునే నయి। మ్మెలఁగొని పోద
మిప్పుడని మున్నెఱిఁగించిన నమ్మునీంద్రుఁడు। త్యలఘుఁడు వారిమాటకు భయంపడ కెంతయుఁ బ్రీతితోడన। గ్గలముగఁ జేసె
భోజనము కంఠము దాకన కుంఠవీర్యుఁడై * గీ|| ఇల్వలుండును మఱి నెప్పటి క్రియఁ బిల్వ। నెఱిఁగి దానినమ్ము నీశ్వరుండు। గడు
పుడడవి కొనుచుఁ గడువడిఁ ద్రేపిన। నసుగ జీర్ణుఁడయ్యె నతఁడు నంత * వ|| ఇల్వలుండును మునివరు శక్తికి భయంపడి వివర్ణుండ
య్యామునిప్రసన్నుండవై పోలేదన వంచనం బెర్పడకుండఁ గృతప్రణాముండయి తదాగమనప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం
డిట్లనియె * సీ|| ఈరాజవరులతో నేన ధనార్థినై వచ్చితి నీకు ద్రవ్యంబు గలుగు। నెఱిఁగి నావుడు నటులేని మీకభిమతమెంత
యంతియ ధనమిత్తు ననినఁ బదివేలు మొదవులు పదివేలు గద్దెల వసిఁడియు నిమ్మహీపతులకిమ్ము। యొక్కొక్కనికి మఱియు
క్కనికిచ్చిన దానికి రెట్టిగ ధనము నెక్క-గీ|| హేమమయరథంబు నిమ్ము నాకనిన ని। ల్వలుఁడు దశగుణంబు తలఁచి యిచ్చె। నయ్య
గస్త్యు చెప్పినంత ధనంబు ము। వ్వురకు మహీపతులకుఁ గరము నెమ్మి * వ|| మఱియు విరావజవరాజులను నశ్వంబులం బూన్చిన
సౌవర్ణరథంబును నిరువది వేల గద్దెల వసిఁడియు మునివరునకిచ్చి నందరథంబున * క|| మునివరన్నృపతులఁ దద్దో। ధనకాంచనత
తులఁ దత్పతాకినులను నొ। లిన తాల్చి యగస్త్యాశ్రమ। మునకుం దక్షణమ రథ్యములు వడిఁ బఱచెన్ * వ|| రాజర్షులు నగస్త్యువీ
డ్కొని చని రంత నగస్త్యుండు లోపాముద్రకభిమతంబొనరించి * మధ్యాక్కర|| పదుసురఁ బోలెడు సుతుల నూఱ్వురఁ బడయం
గవలతో। పదుగుర నూఱ్వురకెనయగు సుతులఁ బడయంగవలతొ। పదలక వేవురకు సుతులఁ బడయంగవలతో వేవురకు। గది
యంగనుత్తము నొక్కరుఁ బడయఁగ మలాక్షి వలతొ * వ|| అనిన ముదితహృదయయై లోపాముద్ర మునీంద్రునకిట్లనియె * క||
వేవురఁ బోలెడు వాని మ। హావీర్యు సుగుణాఢ్యు నెక్కయాత్మజుఁ బడయం। గావలతు నపేతగుణు। ల్వేవురు సుతులయ్యు నందువి
ఫలము గాదే * వ|| అనిన నీకోరినట్ల గుణవంతుండయిన కొడుకు నీకు జనించు నవి దానికి గర్భాధానంబు చేసి యగస్త్యుండు దపో
వనంబునకరిగె। నట లోపాముద్రయు నేడేండ్లు గర్భంబుఁ దాల్చెనంత నకొమలికి * క|| తనయుఁడు దృఢస్యుఁడనఁగా। నన
వద్యుఁడు వేదములు రహస్యంబులతో। నొనరఁగ జపంబు సేయుచు। నిజ తేజముఁ బుట్టె భువనమెల్ల వెలుంగన్ * వ || వాని
కిం దేజస్వియను ఋషిపుట్టి యపారంబయిన యిధ్మభారంబు వహించుట నిధ్మవాహుండనం బరఁగె నిట్లగస్త్యుండు పుత్ర
పౌత్రవంతుండయి తనపితరుల పుణ్యలోకగతులం జేసెనని వైశంపాయనకథితకథాక్రమంబతి రమ్యంబయి యుండ
ననిశౌనకాదులకు సూతుండు సెప్పె * క|| కలికాలభరతలక్ష్మీ। లలనాస్పదవీరగుణవిలాసవిరోధి। ప్రళయాంతకనిఖిలమ
హీవలయోద్వహబాహుబవిష్ణువర్ధనదేవా * పృథ్వీవృత్తము || సమస్తభువనాశ్రయా సత్యనిత్యోదయా। సమీహిత
క్రియా శుభవిశాలకీర్తిప్రియా। నమన్నృపకిరీటచుంబిచరణద్వయా సంతత। త్సమాభరణ రాజరాజవరగండభైరవా *

గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబయిన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున బృ
హదశ్వదర్శనంబును నలోపాఖ్యానంబును నారదాగమనంబును సకలతీర్థకీర్తనంబును రోమశుండర్జునకుశల
వార్తఁ జెప్పుటయు రోమశమహామునియుపదేశంబున ధర్మజు తీర్థాభిగమనంబును నగస్త్యుండు లోపాముద్రం
బరిగ్రహించుటయు వాతాపిభక్షణంబును నన్నది ద్వితీయాశ్వాసము||......................................*



శ్రీ హ య గ్రీ వా య న మః.

శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - తృతీయాశ్వాసము.



శ్రీమందిరబుధజనచిం। తామణికోదండపార్థధర్మవిచారో। ద్దామనలనృపభగీరథ। రామచరిత్రాభిరామరాజ
నరేంద్రా ॥ వ|| అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు ధర్మతనయుండగస్త్యమాహాత్మ్యంబు విని వెండి

యుం దచ్చరిత్రంబు రోమశు నడిగిన నమ్ముని యిట్లనియె * సీ.॥ కృతయుగంబునఁ గాలకేయగణంబుతో వృత్రాసురుండు
గర్వించి యమర । వతిఁ దొట్టి వేల్పుల బాధించుచున్నఁ దద్బాధ నమరులు బ్రహ్మకడకుఁ । జని వారలా వృత్రుఁ జంపు
పాయ మెయ్యది యొ మాకానతిమ్మనన జుండు । దివిరి సరస్వతీతీరంబునందు నిశ్చింతుఁడై తపమొప్పఁ జేయుచున్న । యా
ధీచికడకు నరిగి వేఁడుం డని । జాస్థులిచ్చు మీకు నమ్మహాత్ముఁ । డవి జయించు వజ్రమాదిగా నఖిలది । వ్యాయుధంబులై సురా
రివరుల * వ॥ అందు వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించు ననిన నమరులెల్లం గమలాసను శాసనంబున దధీచిపా
కిం జని కృతప్రణాములై యిట్లనిరి * క॥ భువనజనస్తుత జగదా । రవమెనఁగఁగ నమరపతి పురస్సరులగుని । ద్విజులకెల్ల
హితంబుగ । భవదస్థిచయంబు లిమ్ము పరమమునీంద్రా * వ॥ అనిన విని దధీచి సంతసిల్లి కృతార్థుండనైతి నని దేవహితార్థం
బుగా నిజప్రాణంబులు విడిచిన నమరులెల్ల నమ్మహామునియస్థులాయుధంబులుగాఁ బరిగ్రహించి రందు * గీ॥ త్వష్ట
యంత నూఱు ధారల తవ్యమై । యనల శణక రాళమైన వజ్ర । మొనరఁ జేసి దీన నొఱ్ఱుము దైత్యుల । ననుచు నిచ్చె దాన
మరపతికి ० వ॥ అవ్వజ్రంబు వనింద్రుండు వృత్రు వధియించె నంత * చ॥ అసుపనదివ్యశస్త్రధరులై నయపుర్త్యలకా
హవంబులో మొనయుక కాలకేయులు సముద్రముఁ జొచ్చి దివంబులెల్లన । వ్యసనధినడంగి యుండి బలవంతులు వెల్వడి రా
త్రులెల్లభూ । జనులకు బాధఁ జేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై ० వ॥ మఱియు విద్యాతపోయుక్తులై ధర్మచరిత్రు
లైన బ్రాహ్మణుల కారణంబున జగంబులపాయంబు నొందక సుఖంబున్నయవి గావున నట్టి వారి నరోసి వధియించి జగం
బులకపాయంబు సేయుదమని యసురలు వసిష్ఠాశ్రమంబున నూటతొంబదియేడ్వురను చ్యవనాశ్రమంబున నూఱ్ఱు
రను భరద్వాజాశ్రమంబున నిరువదుండ్రను గాఁ బలువురు బ్రాహ్మణుల బ్రహ్మనయుల భక్షించి యిప్పాట ననవర
తంబు నఖిలమునిగణాశ్రమంబుల నుపద్రవంబు చేయుచున్న * క॥ యాగాదిపుణ్యకర్మ । త్యాగము మర్త్యముననైనఁ

## దేవతలు వైకుంఠమునకుఁ బోయి విష్ణుని స్తుతియించుట.

దారధికభయమో । ద్వేగంబునఁ బురుహూతపు । రోగములై యగ్నియమవరుణధనదాముల్ ० క॥ చని వైకుంఠంబునఁ ద్రి
భువనపతి వైకుంఠు గరుడవాహను విష్ణున్ । దనుజవిభంజనుఁ గని యి । ట్లని రెంతయుభక్తితోఁ గృతాంజలులగుచున్ ० వ॥ దే
వా నీవు వరాహరూపధరుండవై మహీతలంబెత్తితి నరసింహరూపంబు దాల్చి యాదిదైత్యు హిరణ్యకశిపు వధించితివా
మనుండవై బలిం గట్టితి యజ్ఞమూర్తివై యజ్ఞవిఘ్నకరుండైన యజ్ఞఘ్నుండను దానవుం జంపితి వండజజరాయుజస్వేద
జోద్భిజంబులనం బరఁగిన చతుర్విధభూతంబుల రక్షించుచున్న జగద్రక్షకుండవు గావున నీకు విన్నపంబుఁ జేసెద మిప్పుడు
జగంబులకైన యుపద్రవంబు చిత్తగింపుము ० సీ॥ కాలకేయులు మహాకాయులు పగలెల్ల జలదుర్గబలమున జలధియందుం డి రే
తెల్లఁ జని నలిరేఁగి మునీశ్వరాశ్రమముల సద్ధర్మచారులైన । బ్రాహ్మణప్రవరులఁ బాయక వధియింతు రెట్టి పాపాత్ము
లు నెయ్యుగముల । బ్రాహ్మణహింస యాపాదింతు రేయది వీరలవలన నావినఁగఁబడియెఁ * గీ॥ పరమసాధులైన బ్రాహ్మ
ణులకు బాధ । యగుడు మహికి బాధయగు ధరిత్రి । కైన బాధఁ జేసి యఖిలలోకంబులు । గరము బాధనొందుఁ గమలనాభ ० వ॥
ట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబులైన పుణ్యకర్మంబులు వహియించుటం జేసి హవ్యకవ్యంబుల దేవతలు
బితరులుం దృప్తులైన నెల్లలోకంబులకు సుఖంబగుం గావున బ్రాహ్మణోపద్రవంబు పరిహరించి లోకంబుల రక్షింపుమనిన
దేవతలకు దేవదేవుం డిట్లనియె ० మత్తకోకిల ॥ కాలకల్పులఁ గాలకేయులఁ గాలకాయుల భూరిరి । త్నాలయస్థుల వీర్యవం
తుల నుద్భవంబు సమస్తర । త్నాలిదోఁ పఁగ వట్టి నవ్వినయాం బసు నవ్వ్యధియింపఁ గాఁ । బోలదొండువిధంబునం బరిపూర్ణ
వాద్ధిజలోన్నతిన్ ० క॥ వరుణజలంబులమిత్రా । వరుణతనూజుండు వీర్యవంతుండై చెచ్చెరఁ ద్రావనోపు నిందఱు నా
రుగురు ప్రార్థింపుఁడమ్మహాత్మ నగస్త్యున్ ० వ॥ అనిన నమరులెల్ల నగస్త్యపాలికిఁ జని యమ్ముని వరు స్తుతియించి యిట్లనిరి ०
క॥ అమరహితంబుగ జగదహి । తముదలఁగుము పేర్మితో బుధస్తుతగుణవిం । ధ్యము దొల్లి పెఱిగి జగదహి । తము సేసిన నీవ
శాపెతలఁగితి దానిన్ ० వ॥ అని దేవతలెల్ల నగస్త్యుఁ గీర్తించిరని నవిని ధర్మజుం డది యేమి కారణంబున వింధ్యంబు పెఱిగె దా
నిం బెలుఁగకుండ నగస్త్యుం డెవ్విధంబున వారించె ననియడిగిన నాతనికి రోమశుండిట్లనియె ० ఉ॥ నెమ్మి నినుండు మేరుధ
రణీధరనాథుఁ బ్రదక్షిణంబుగాఁ । ద్రిమ్మరుచున్నఁ జూచి పటుదీధితిఁ దిక్కింగరమల్గి వింధ్యశై । లమ్ము నిరోధి నేంద్రి యనల్పన

భువనమ్ముఁ బ్రదక్షిణంబు నిత్యమ్మును జేయు కేలమతిఁ దప్పితి మేరువుఁ గొల్వ నేటికిన్ ✽ వ॥ అని గర్వించి పలికిన నప్పర్వతంబు
నకు భానుండిట్లనియె ✽ క॥ అనవరతము విధియోగం । బున నే ద్రిమ్మరుదు నమరభూధరముఁ బ్రియమ్మున నాత్మేచ్ఛయొ
నర్పఁగఁ । జనదనవుడు నలిగి వింధ్యశైలంబంతన్ ✽ క॥ ఇనశశితారాతతులకుఁ । జనరాకుండంగఁ బెరిగి జలధరపథమె ।
ల్లను గప్పి యుండె వింధ్యం । బనుపమముత్తుంగమై సురాద్రి స్పర్ధన్ ✽ క॥ రవిశశిగతులుడుగుటఁ బది । దివమిది రాత్రియని వసు
మతీజనులకున । ద్విజమునివరులకెఱుఁగఁగ । నవగాఢంబయ్యె నంధమయ్యె జగంబుల్ ✽ వ॥ ఇట్లు పెరిగిన వింధ్యంబు
నొగ్గకు వచ్చి వేల్పులెల్ల దాని వర్ధనంబు వారింపనోపక యగస్త్యు పాలికిం జని వింధ్యంబు పెరుఁగుట యెఱుంగించి యి
ట్లనిరి ✽ క॥ భువనవ్యవహారము నకు । వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమునన । ద్దివసకర శీతకరగతు । లవిహితమగు
నట్లు చేయు మనఘ మునీంద్రా ✽ వ॥ అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుండు లోపాముద్రాసహితుండై వింధ్యంబు
సమీపంబునకు వచ్చి దానిచేతం బూజితుండై యిట్లనియె ✽ క॥ చనియెద నే దక్షిణదిశ । కొనరఁగఁ ద్రోవిమ్ము నాకును
ర్వీధర నీ వనవుడు నటులనచేయుదు । నని పెఱుఁగుట యుడిగి వింధ్యము తివినయమునన్ ✽ వ॥ భట్టారకా విజయం చేయుం
డని భూమిసమానమై యున్న యగస్త్యుండు దానికిట్లనియె ✽ క॥ వామగిడి వచ్చునంతకు । భూమీధర యీప్ర
కారమున నుండు మనా । తో మైత్రిఁ జేయుమనిలో । పాముద్రాధీశ్వరుండు వలికి ముదమునన్ ✽ వ॥ దానినొడంబఱిచి ద
క్షిణదిశకుం జని లోకంబులకు హితంబుగా నందయుండె వింధ్యంబు నగస్త్యుండు మగిడి వచ్చునంతకుఁ బెఱుఁగ నోడి యుండె
నని యగస్త్యు మాహాత్మ్యంబు ధర్మజునకుం జెప్పె వెండియు రోమశుండిట్లనియె ✽ గీ॥ అమరులెల్లఁ దన్నునట్లు కీర్తించుచు ను
న్నఁ జూచి మునిగణోత్తముండు । వారి నడిగె నేమి వచ్చితిరెఱుఁగింపుఁ । డని ప్రియాళుఁడై ప్రియంబు నొడ ✽ చ॥ అమ
రులు గాలకేయకృతమైన జగద్భయమెల్లఁ జెప్పియు । త్తమమునినాథ తత్ప్రతివిధానము చేసి జగంబుఁ గావఁ జి । త్త
మునఁ దలఁచి విభ్రమదభ్రతరంగమహార్ణవంబుఁ బా । నము దగఁ జేసి చేయుము ఘనంబుగ మాకు మనఃప్రమోదమున్ ✽
క॥ ఆత్తోయధి నీ చేతం । బీతంబగుఁ గాక గడంగి భీమాసురసం । ఘాతంబు లక్షణంబని । పాతింతుము దివ్యశస్త్రపటుపాత

✽ అగస్త్యుఁడు సముద్రోదకంబు పానంబు చేయుట. ✽

ములన్ ✽ వ॥ అనిన నగస్త్యుఁడట్ల చేయుదునని యమరవరుల కెల్ల సంతోషంబుగా నప్పుడు ✽ సీ॥ రంగదుత్తుంగతరంగహ
స్తంబులనాడెడు నదివో లెనతులవేగ । వాతావధూతమై యేతెంచు నదివోలె బర్వతకందరోపాంతతతులఁ । దోడరె
మునుపవోలె దృఢఫేనవితతులనగియెడు నదివోలె నాగనక్ర । మకరకులక్షుభ్యమానమై తద్బాధకోపవియదివోలె మత్త
భీమ ✽ గీ॥ వినదమునుచునున్న నీరధి యొద్దకు । నమరగణముతో మహామునీంద్ర । గరుడఖచరసిద్ధగంధర్వపన్నగయక్షగ
ణముతో జనరుగు దెంచె ✽ ఉ॥ అందఱుఁ జూచుచుండఁగ మహాబ్ధిజలౌఘముఁ ద్రావె విష్టపా । నందకరుండగస్త్యుఁ డఘనా
శనుఁ డట్లు పయోధి రిక్తమై । నం దిమినూర్మ కర్కట కనక్ర భుజంగ చయంబుతో భయం । బందుచుఁ గాలకేయులు బయల్ప
డి శోచిరి దానిలోపలన్ ✽ క॥ గీర్వాణప్రభుఁడాదిగ । గీర్వాణగణంబు గాలకేయులతోడన్ । గర్వించి రణము చేసిర । ఖ
ర్వపరాక్రములు గడిమిఁ గడునుద్ధతులై ✽ క॥ అనిమిషదివ్యాయుధహతి । ననిఁ గొందఱు వడిరి గొందఱధికవిభీతిం । జని పా
తాళముఁ జొచ్చిరి । దనుజులు దైత్యులును వీర్యదర్పచ్యుతులై ✽ వ॥ ఇట్లు కాలకేయులం దొట్టి యసురుల నెల్ల నిశ్శేషంబు జేసి
జగంబుల యుపద్రవంబుడిపి దేవతలగస్త్యునిం గీర్తించి యిట్లనిరి ✽ క॥ మునినాథ నీ యనుగ్రహ । మున నిగ్రహమూడి గె
నఖిలభువనంబులకి । వ్వనధిఁ బయఃపూర్ణముగా । నొనరింపు ముని నీక కాని యొరులకు వశమే ✽ వ॥ ఇదియ నేకసత్త్వాశ్ర
యంబుగావున రిక్తంబై యుండఁదగదని పనగస్త్యుండిట్లనియె ✽ సీ॥ మున్ను జీర్ణంబయ్యె మున్నీటి నీరు నాకడుపునం దేవిం
కఁ బడయ నేర । జలరాశి నిండఁగ జలములు నావుడు నమరులు మునులును నమలగర్వఁ । గానం గఁ జని దేవమీనాకరంబె
మి తెఱంగున నిండు మా కెఱుఁగఁ జెప్పుమ । యని విన్నపంబు చేసినఁ బెద్ద ప్రొద్దు చింతించి వారలకు విరించి యనియె ✽ గీ॥ వనధిఁ జె
ద్దకాలమున భగీరథుఁడను । వాఁ డమనిం [illegible] గాని వసుధనోరులు । పూని దీని నింపఁగా నోపరనవుడు । నమరవరులు మును
లునరిగిరనిన ✽ క॥ వనరాశి నేమి [illegible] । మున నెట్లు భగీరథుండు భూరిజలౌఘం । బున నించె దీనిఁ జెప్పుము । యని యడిగిన ధ
ర్మజునకు నమ్ముని చెప్పెన్ ✽ వ॥ తొల్లి యిక్ష్వాకువంశంబున సగరుండను రాజు హైహయుల నిర్జించి యఖిలమహీరాజ్యం

బు సేయుచు నపుత్రకుండై వైదర్భియు శైబ్యయు నను తనభార్యలతోడం గైలాసంబున కరిగి యందు ✽ క ॥ దక్షమఖక్ష
యకరు నిటలాక్షు జహుతభక్షుభక్షితానంగు వీరూ। పాక్షు మహోక్షధ్వజుఁ బ్ర । త్యక్షము గావించె నుగ్రతపమున నప్పా
ర్థి ✽ గీ॥ హరుఁడు వానికిఁ బ్రత్యక్షమయి వరంబు । వేఁడుమనవుఁడుఁ ద్రైలోక్యభూభుజుఁడు నాకు । దయనొనర్పుము సం
తానదానమనుచు । వేఁడెఁ బుత్రార్థియై కడువేడ్కతోడ ✽ వ ॥ ఈశ్వరుండు వానికిం గరుణించి వైదర్భియం దఱువది
వేవురు కొడుకులును శైబ్యయం దొక్క కొడుకుం గా వరం బిచ్చి యయ్యఱువది వేవురు నతిదర్పితులై యనేక కాలంబునఁ గాల
గోచరులగు మరణియును నొక్క కొడుకు వంశకర్తయగు ననియుఁ జెప్పి యదృశ్యుండైన ✽ క॥ కొడుకులఁ బలువురఁ బ
డసియుం బడయని యట్లుండి ధర్మపత్నులు దానుం । గడు సంతసపడ కేగెను । దడయక సగరుండు మగిడి తనపురమునకున్ ✽
వ ॥ అంతఁ గొంతకాలంబున కయ్యిద్దఱుఁ గర్భిణులైన నందు వైదర్భికి నొక్క యలాబూఫలంబును శైబ్యకు నసమంజ
సుండను కొడుకునుం బుట్టిన ◦ గీ॥ వరదుఁడైన యీశు వరమున నిది యొక్క । వదరు పుట్టె నెట్టి వరమొ యిదియును । దానిఁ బాఱ
వైవఁగా నున్న నాకాశవాణి యిట్టు లనియె వసుమతీశ ◦ గీ॥ సాహసం బిట్టు సేయంగఁ జనునె దీని । బీజములు ఘృతఘట
ములఁ బెట్టి రక్ష । చేయు మఱువది వేవు రూర్జితులు సుతులు । మీకు వరమునఁ బుట్టుదు రిందు నీకు ✽ వ॥ అనినం దద్వచనాను
రూపంబు చేసి రక్షించుచున్నఁ గొన్ని దినంబులకు ◦ క ॥ సుతషష్టిసహస్రకము । గతమై వర్ధిల్లి గగనగతిఁ జఱచి శతక్ర
తులోకముఁ దొట్టి మదోద్ధతిఁ జేసె సమస్తలోకతతికిని బాధల్ ◦ క॥ సగరసుతు లట్లు జగముల । కొగి బాధలు సేయుచున్న
నోడి మరుత్ప । న్నగవరు లరిగిరి నాలుగు । మొగములుగల వేల్పుకడకు మునిసంఘముతోన్ ✽ గీ॥ వారిజాసనుం డవార
లువచ్చిన విధ మెఱిఁగి మీరు వెఱవ నేల సగరసుతులు దగ్ధులగుదురు దర్పితులైన వారిపెక్కువ ధ్రువంబు ✽ వ॥ అని కమల
గర్భుం డానతిచ్చి ననరిగి యమరవరులాదిగా నఖిలలోకనివాసు లెల్ల నాసాగరుల పరిక్షయం బపేక్షించి యుండి రంత.
సీ॥ అశ్వమేధంబు సేయంగ దీక్షితుఁ డయ్యె సగరుఁడు వాని యశ్వంబు సగర । తనయులచే రక్షితంబై వసుంధర యెల్లఁ గ్రుమ్మ
రి తోయహీనమైన । జలధిలోపల నదృశ్యంబైనఁ గానక సగరున కెఱిఁగించి సగరసుతులు । జనకుశాసనమునఁ జని భూతల
మునందుఁ దడయక రోసి పాతాళతలము ◦ గీ॥ నందు రోయంగ డఁగి యఱువది వేవురు నొక్క మొగిన క్రొచ్చి రుదధిలోన జల
ధిపంకమగ్నసత్త్వముల్ నిశితకు । ద్దాలముఖవిదారితములు గాఁగ ◦ వ ॥ ఇట్లు గ్రొచ్చి క్రొచ్చి సగరసుతులు సముద్రపూ
ర్వోత్తరదేశంబునం గపిలుండను మహామునియాశ్రమసమీపమునందు దమ గుఱ్ఱంబుఁ గని సంతసిల్లి ✽ గీ ॥ అశ్వమేధ
మునకు నర్చితంబైన యట్టి । యశ్వరాజు నిట్టు లవహరించి । ముచ్చు గోరయీ సముద్రదేశంబున । నోటమింత లేక యున్న


సగరసుతులు కపిలమహామునికోపాగ్నిచే భస్మమగుట.

వాఁడు ◦ వ ॥ అని కపిలుం బరిభవించిన నమ్మునివరుం డలిగి యనలశిఖలు దూలు నతిఘోరదృష్టిం జూచిన నప్పుడు సగర
సుతులందఱు భస్మంబైన ✽ క ॥ వీరులగు సగరతనయుల । దారుణదాహంబుఁ జూచి తడయక చని యం । భోరుహగర్భ
సూనుఁడు । నారదుఁ డంతయును సగరునకు నెఱింగించెన్ ◦ క॥ దాని విని సగరుఁ డురుశో । కానలదందహ్యమానుఁ డయ్యు
ననయ్యా । శాను వచనంబుఁ దలఁచి ధ । రానాథుఁడు శోకభయపరావృతుఁ డగుచున్ ✽ వ॥ అసమంజసపుత్రు నంశు
మంతుం దనమనుమనిం జూచి యయ్యా నీయయ్య లఱువది వేవురు నెక్కటిఁ గపిలుకోపానలకబళితశరీరు లయిరి ని
వజ్జనకుం డతిక్రూరహృదయుండై పౌరబాలకుల నకారణంబ వధియించి మహానదిలో వైచుచున్న నెఱిఁగి పౌరజనా
క్రోశంబున నతిక్రోధపరవశుండనై వాని విడిచితి ✽ క ॥ కొడుకుల నవగవమునువా । కడఁగిన హయమేధమఖము
గడచనమికి నేఁ । గడు దుఃఖితుండ నయ్యెదఁ । దడయక నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్ ✽ వ ॥ అనినం నంశుమంతుం
డుణంబు చని సగరసుతఘాతద్వారంబున సముద్రంబు చొచ్చి యందు సూర్యసహస్రద్యుతియై వెలుగుచున్న కపిలమహా
మునికి నమస్కరించి నిజాగమనప్రయోజనం బెఱింగించినఁ గపిలుండును వానికిం గరుణించి యశ్వంబు నిచ్చి యిట్లనియె
క॥ ఘనభుజ నీ కారణమునఁ । జనఁగాంతురు పుణ్యగతికి సాగరులు ముదం । బున సగరునకును దొరకొను । నొనరఁగ సుతవంతు
లైన యుత్తముల గతుల్ ✽ వ ॥ మఱియు నీచేత నుపనీతంబైన యీ యశ్వంబున నశ్వమేధంబు చేసి సగరుండు కృతార్థుఁ
డగు నీ పౌత్రుండైన భగీరథు చేతఁ దేఁబడియెడు గంగాజలౌఘంబులం జేసి సంసిక్తులై సగరసుతులు స్వర్గగతు లగుదురు స

ముద్రంబు జలసంపూర్ణంబగు ననిన నంశుమంతుండు సంతుష్టుండై కపిలప్రసాదంబున నశ్వంబుఁ దెచ్చి సగరునకిచ్చి పి
తృవచనంబు నెఱింగించిన సగరుండు సపుత్రశోకంబుడిగి యశ్వమేధంబు చేసి సముద్రుం దనకుఁ గొడుకుగా భావించిన
నది మొదలు సముద్రంబు సాగరంబనం బరఁగె నిట్లు సగరుండు పెద్దకాలంబు రాజ్యంబు చేసి నిజరాజ్యభారం బంశుమంతు
నందు సమర్పించె ననిన * గీ॥ తనపితామహునట్లుల ధరణి యేలి। యంశుమంతుండు నిజపుత్రుఁ డగు దిలీపు। నందు రాజ్యంబు
సల్పి తా నఖిలలోక। పూజితుండు తపోవనంబునకుఁ జనియె * వ॥ దిలీపుండును తనపితామహులైన సాగరు లూర్ధ్వగతులు
గాకుండ గంగావతరణంబునందు యత్నంబు చేసి యశక్తుండై యున్న * చ॥ ప్రథితయశుండు సుతుం బడసె భారసహిష్ణు
మహారథున్ భగీ। రథుఁ డను చక్రవర్తిని నపరాజితతేజు నజాన్వవాయుదు। వ్యథవినివర్తనున్ సకలపార్థివజైత్రు సుసౌహా
ర్దతా సువృత్తు। న్మథనసురాపగానయనసమర్థుఁ దపోగుణయుక్తి నుత్తమున్ * వ॥ ఆభగీరథు నపారభూభారధురంధరుం జే
సి దిలీపుండు తపోవనంబునకరిగిన * గీ॥ కపిలుకోపాగ్నిఁ జేసి సాగరులు గ్రాఁగి। రనియు గంగఁగాన పన్నవారనియు నెఱిఁ
గి వారికి హితంబు సేయంగవలసి గంగఁ। దేఁగఁగడఁగె వీరుండు భగీరథుండు * వ॥ ఇట్లు గంగావతరణంబునందుఁ గృతనిశ్చయుం
డై యరిగి బహువిధాకారధాతువంతంబులై సమున్నతుంగశృంగంబులను జలభాగవినమ్ర ప్రబలజలాహకవ్యూహసంచార
శ్యామాయమానంబులైన తుహినస్థలంబులను సిద్ధవిద్యాధరగంధర్వగీర్వాణమిథునసంసేవ్యమానంబులైన నానారత్నాక
రంబులను శుకపికపారావతశారీమయూరసారంగసితపక్షరథాంగదాత్యూహవ్యూహశబ్దశబ్దాయమానంబులైన నతఘ
వనరేఖలను సింహశరభశార్దూలశుండాలగోలాంగూలకోలాహలంబులైన గుహాగహ్వరంబులం జేసి రమణీయ[illegible]
కంబైన హిమవత్పర్వతంబున * చ॥ సతతకృతోపవాసముల శాకఫలోదకమూలపారణ। వ్రతముల దేవపూజలన పారజ
నంబులఁ జేసి నిష్ఠతో। నతులతపంబు సేసె సురాపగ నుర్వికిఁ దెచ్చు వేడ్కతో। ధృతియుతుఁడై దిలీపకులదీపుఁ డు దివ్యసహ
స్రవర్షముల్ * వ॥ ఆభగీరథు తపంబునకు మెచ్చి గంగాదేవి ప్రత్యక్షంబై నీయిష్టంబు సెప్పుమనిన నతండు కృతాంజలియై యిట్లని
యె * సీ॥ సగరతేజుండైన కపిలుకోపంబున గతజీవులై పుణ్యగతులయందు। విహతులై మత్పితామహులన్నవారు నీదగు
పుణ్యజలముల నగరసుతులు। సిక్తులై స్వర్గానుభుక్తిఁ బ్రాపింతురు గావున దేవి యిద్దేవపథము। నందుండి వసుమతి నొందంగఁ
జను దేరవలయు నావుడు మహీవలయమునకు - గీ॥ నేను వచ్చునపుడు నా నిరంతరజలౌ। ఘంబుఁ దాల్ప నీలకంఠుఁడోపుఁ। గా
క యొరులు దాల్పఁగా నోపరయ్యు నా। నాథుకరుణఁ బడయ నన్నుఁ దాల్ప * వ॥ అనిన గంగాదేవి వచనంబునఁ గైలాసం
బునకరిగి భగీరథుండు భగవంతు నత్యంతము నీశ్వరుని సుతించి పెద్దకాలంబు తపంబుఁ జేసిన నీశ్వరుండు వానికి సన్నిహి
తుండై నీవు భూలోకంబునకు గంగావతరణంబు చేయుమేను గంగ ధరియించెద ననిన భగీరథుండు వెండియు గంగనారా
ధించిన నాతనికిం గరుణించి * వ॥ ఇల కురికె గంగ తరంగసంహతులతో నేతెంచె నాకాంతరం। బుల నాకాశముఁ గప్పి సంచల
మహాభూతప్రపంచంబునం। జెలువై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెన్ సంగతోత్తుంగపిం। గళజూటాగ్రమునందుఁ బ
ద్మదళసంకాశంబుగా లీలతోన్ * సీ॥ సురమునిసిద్ధఖేచరవరుల్ వచ్చి యచ్చెరువంది చూడంగ హరుశిరంబు। నందుండి భు
వనైకవందితసురనది ధరణీతలంబునకరుగుదెంచి। కలహంసగతియు నిర్మలఫేనహాసంబు వాకీర్ణమీనవిలోకనములు। నా
నాలపవనచాలితకల్లోలలసితమృదూక్తులు నెసఁగుచుండఁ - గీ॥ బ్రీతితో భగీరథుఁ డను దూతచే వి। నీతయై మహాము
నిపరిపీతరిక్త। మగు సరిత్పతిఁ గూడి యా సగరజులకుఁ। బ్రీతిఁ గావించె నించె నీరాతతముగ * క॥ సాగరులకు సద్గతి గా। సా
గరమున కట్లు సలిలసంపూర్ణముగా। భూగతయై భాగీరథి। భాగీరథికీర్తి భువనపఙ్క్తుల నిలిపెన్ * వ॥ అని యిట్లు గంగావ
తరణంబును భగీరథు మాహాత్మ్యంబును రోమశుండు సెప్పిన విని ధర్మజుం డనుజసహితుండై యరిగి నందయు నపనందయు నన
నమహానదులయందుఁ గృతస్నానుండై హేమకూటంబున నుత్పలంబులవలన వెలువడు పవనంబున నాహూతంబులై
వచ్చు మేఘంబులను జూచి విస్మయంబంది దాని విధం బడిగిన వానికి రోమశుం డిట్లనియె ఋషభకూటంబున ఋషభుండ
ను ముని యతికోపనుండై యెవ్వరు పలికిననపుడె యగ్గా నలాకారుండై యుత్పలంబులవలన వెలువడిన మేఘంబులం
బిలిచినవారల వారించునది దానం జేసి తపోదానధర్మశమదమరహితులైన జనులకు దురారోహణంబు దేవతలు దేవప
త్నులైన పుణ్యులు నమ్మునిం జూడ నమ్మిరి దేవఋషులు యజ్ఞంబుఁ జేసిన యజ్ఞభూములందుఁ గుశాకారంబులైన

మార్గాంతరంబులు యథాకాలంబులైన వ్రతంబులుం గానంబడు ననినాపుణ్యతీర్థంబున స్నానంబుఁ జేసి యరుగు చున్నధర్మరాజునకు రోమశుండిట్లనియె ✽ క॥ ఇది విశ్వామిత్రునియా । స్పదమిది కౌశికియనంగఁ బరఁగినయదియ । ల్లది

✽ రోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగునిచరిత్రము చెప్పుట. ✽

ఋశ్యశృంగుఁడనుముని । స్పదమనవుడు ధర్మతనయుఁడమ్మునికనియెన్ ✽ వ॥ ఋశ్యశృంగుం డను ముని జన్మంబు వానిచరితంబును విననలయు నెట్టియెట్లని యడిగిన రోమశుం డిట్లనియెం దొల్లి కశ్యపపుత్రుండగు విభాండకుండను మునివరు డఖండితబ్రహ్మచర్యంబు నందపంబుఁ జేయుచు నొక్కనాఁ డొక్కమడుగున నీరాడుచున్న సమయంబున ✽ క॥ సురుచి నురూపగుణము । దరియూర్వశియను లతాంగిఁ దద్దర్శనగో । చరయగుడునపుడు రేత । స్ఖలనంబయ్యెను మునికి నయ్యోగా శ్రుతిమునకున్ ✽ వ॥ అయ్యమోఘవీర్యంబుతోమిశ్రంబైన జలంబు లొక్కపెంటిమృగంబు ద్రావి గర్భంబుఁ దాల్చి నం బుఋశ్యశృంగుండను మునికుమారుండు జన్మించి తండ్రి నందనాశ్రమంబునుంగాని యొండుచోటెఱుంగక ఘోరత పంబుఁ జేయుచున్నంత ✽ గీ॥ బలియుఁడంగాధిపతి రోమపాదుఁడనఁగ । ధరణిఁ బరఁగిన వీరుండు తనపురోహి । తాపరాధ తమున బ్రాహ్మణులచేత । విడువఁబడినందున్మహిఁ గనావృష్టియయ్యె ✽ వ॥ దానికి వెఱచి యాతండు బ్రాహ్మణులఁ బరమభ క్తినుపాసించి యీయనావృష్టిదోషంబేమి కారణంబున నయ్యె దీనికిం దగిన ప్రతీకారం బెద్దియని యడిగిన వానికిం బ్ర సన్నులై బ్రాహ్మణులిట్లనిరి ✽ క॥ కడుదర్పితుఁడవై నీవు । న్విడిచితి బ్రాహ్మణులు వారు విడిచిన నమరుల్ । విడిచిరి దాన వర్షము । దడసెభవద్దేశమునకు ధరణీనాథా ✽ ఉ॥ శాంతుఁడు ఋశ్యశృంగుఁడను సన్మునియున్నయెడం ధరిత్రికిం । సంతతవర్షితంబగు శుభ్రశంబగునట్టి వరంబుఁ దొల్లివి । భ్రాంతకుఁ జేసెయంబడసె నమ్మునికావున ఋశ్యశృంగువే । దాంతను వేదిరాఁ బనుపుచుంగ మహీశ్వర నేర్పురూపునన్ ✽ వ॥ అనినవిని రోమపాదుండు దనచేసిన బ్రాహ్మణావమానంబున కుం దగిన ప్రాయశ్చిత్తంబుఁ జేసి బ్రాహ్మణవచనంబునఁ బుడబుద్ధిమంతులతో విచారించి విదగ్ధవేశ్యాంగనలం బిలువం బఱమీ నేర్పువిధంబుల ఋశ్యశృంగుం బ్రబోధించి యిటఁ దోడ్కొనిరండని పంచిన ✽ క॥ ఆవేశ్యాజనులధికర । సావహాశ్యముఖవిలసదనులేపనమా । ల్యావళులు గొనుచు నరిగిరి । నానాశ్రమమునకు నమరనారులలీలన్ ✽ వ॥ అటవిభాండకుండును యథాకాలంబగ్నిహోత్రంబు వేల్వం దనపుత్రు ఋశ్యశృంగు సమర్పించి వన్యఫలాహరణార్థంబు వన బునకరిగిన యవసరంబున నందొక్క జారవేశ్య దనకూఁతు నభినవయౌవనవిలాసవిభాసిని నమ్మునిపాలికిం బుచ్చిన వా

✽ ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునింగా భావించుట. ✽

నిం జూచి ఋశ్యశృంగుండు ససంభ్రమంబున ✽ అక్కర॥ ఎందుండి వచ్చితి ఋషికుమారయే నెన్నఁడిట్టి । సుందరాకృతిమునిపుత్త్రుఁ దొల్లి చూచియెఱుంగ । నిందుండుము నీకు కృష్ణమృగచర్మకృతమగు నాసనమ్ము । నందుండఁ గాఁ బనిచెదు ఋషీ నుబుద్ధిన త్రిన్వఁ బ్రీతిన్ ✽ వ॥ మఱియు నర్ఘ్యపాద్యాదివిధులను వన్యస్వాదుఫలదానంబులం దానికతిథిపూజ సేయు న్నన దియమ్మునివరునకిట్లనియె ✽ క॥ మాయాశ్రమమిందులకు । న్నాల్గయనిధిమూఁడుయోజనంబులు కలదే । బోయె వును విజయం । చేయుండందులకుఁ జెలిమి చేయుము నాతోన్ ✽ వ॥ అట్లైన నీచేత సత్కారంబుఁ గొనియెద నని ఋశ్యశృంగుండట్లు సేయుమనని దాని నాతిథ్యవిధానంబున సంపూజించి తనకది యిచ్చిన దివ్యగంధమాల్యంబులును సరసభక్ష్యపానంబులు విచిత్రవస్త్రంబులుం బరిగ్రహించి నది యును ✽ క॥ మునిముందట గందుకనర్తనమ్ముఁ గీతములయందుఁ దన కౌశల్లమున జూపి విరచితాలింగనయై ముని నతికి ముదముఁ గావించె మదిన్ ✽ వ॥ ఇట్లు ఋశ్యశృంగుం బ్రబోధించి వేశ్యాత్రి యరిగిన దాని పోయిన వలను చూచుచు ఋశ్యశృంగుఁ డగ్నిహోత్రంబు వేల్వక కాలాతిక్రమణంబుఁ జేసి మతి విపరీతబుద్ధియై యున్న నంత నడవినుండి వన్యఫలంబులు గొనివచ్చి విభాండకుండు కొడుకుం జూచి యిట్లేల దింతా పరవశుడవై యగ్నిహోత్రంబు వేల్వక కాలాతిక్రమణంబుఁ జేసితి వనినఁ దండ్రికి ఋశ్యశృంగుండిట్లనియె ✽ సీ॥ కాంచనవర్ణుడు కడురూపవంతుండు కన్నుల నిడదలతో ఘనములగుచు । ననయంబు వక్త్రువ లను రెండుపిండంబులురమున విలసిల్లుచుండనెంత । వెలుఁగు చుజపమాల వ్రేలంగనన్ను వనడుముసువడఁ కంగనడుచునపుడు । కలహంస హూజితకలనాదము గనాపాలికినిం దొక్కబ్రహ్మచారి । గీవచ్చి పోయె వానివదనంబునందు వెల్వడు సుగంధమధురభాషణములఁ బొల్పవిని

సమదపుంస్కోకిలాలాప। చారులగుచుహృదయసమ్మదమున ✽ క ॥ ఆఋషికొమరుఁడుగట్టిన। చీరలునవిమృదులములు విచిత్రములునవనో। హారములతనిబృహత్కచ। భారమునందొక్క కనకపట్టము వ్రేలున్ ✽ క ॥ పవనసమాహితమధుసం। భవవివిధప్రసవసౌరభముసొల్పుముసి। ప్రవరునితనువునయందు। ద్భవమైనయ్యాయసౌరభమువిప్పెల్లన్ ✽ వ ॥ మ ఱియునక్కొమరుండొక్కయెఱ్ఱనిఫలంబు దనదక్షిణపాణితలంబున నందండచఱచుచున్నవది నేలంబడి యెగయంబో యినవవ్వలనికి వ్రాలుచు వాతావధూతంబైనబాలవృత్తంబునుబోలెనొప్పుచున్నయమ్మునివుమారునందునాహృదయం బుదగ్గయుండగిలినది ✽ ఉ ॥ నన్నున గౌఁగిలించుకొనినావదనంబునకున్నిజాస్యమా। నన్నముఁజేసియొక్కయపూర్వముశ్శబ్దము చేసెమనోహరంబుగా। నెన్నఁడుమనట్టిశబ్దముమునీశ్వరమున్వినియెనెఱుంగన। య్యన్నువబ్రహ్మచారిముఖపంబు రుహంబునమంబుచూడఁగాన్ ✽ వ ॥ వాయిచ్చినవన్యస్వాదుఫలంబులాదరింపకయమ్మునికుమారుండమృతోపమానం బులైనఫలంబులునతిమధురంబులైన పానీయంబులునిచ్చిననుపయోగించితి ✽ క ॥ తనచేతిపుష్పములజ। ల్లిననంతటఁ జైదరియవియలిప్రకరనిషే। వశమొప్పనున్నయవియి। వ్వనకుసుమములట్టుగావువరగంధంబుల్ ✽ వ ॥ నాకునమ్మునిపుత్రునాశ్రమంబునందువానితోనొక్కటఁదపంబుఁజేయుచుండనిష్టంబనినకొడుకుపలుకులువినివిస్మితుండై తపస్వులతపం బులకువిఘ్నంబులుసేయనేకరూపులయి రాక్షసులువనంబునందిరుగుచుండుదురుగసవంతంబులయిన పానీయంబు లునతిసుగంధంబులయిన కుసుమంబులు మునులకు వర్జనీయంబులనికొడుకుం బ్రబోధించి యెప్పటియట్లవన్యఫలంబులు దేసరిగిన ✽ క ॥ చనుదెంచితరుణీమునిచం। దనుచిత్తంబునకువైకృతముఁజేసెవిలా। సినులసహాసననల్లా। పనసహవాస ములుబంధుసనుములుగావే ✽ వ ॥ ఇట్లుఋశ్యశృంగుండువిలాసినీవిమోహితుండయితండ్రికెఱుంగింపకతను చరిత్రంబ యునతనయాశ్రమంబువిడిచిమనుష్యయోగంబునందగిలియక్కోమలిపిలుందనచనియంగ దేశంబుఁజొచ్చియందురోమ పాదునాశ్రమదేశంబువరాజాశ్రమంబను వనంబుననుండునంత ✽ మత్తకోకిల ॥ అమ్మునీశువివాసశక్తిదదంగదేశ మునందుమే। ఘమ్ములెల్లకెలంకులంగడుఁగ్రమ్మిసర్వజగత్ప్రమో। దమ్ముగానివతద్బృహజ్జలధారలొప్పఁగవృష్టిఁ జే। సెమ్మహానదిదీర్ఘికాసరసీనదంబులునిండఁగాన్ ✽ వ ॥ ఇట్లు ఋశ్యశృంగు ననుగ్రహంబున నంగవిషయంబున ననగ్రహదోషంబునిరస్తంబైనసంతసిల్లి రోమపాదుండు తనకూఁతుశాంతయనుదాని నత్యంతకాంతిమతినమ్మునివరున కువివాహంబుఁజేసి ✽ క ॥ అనుభోగయోగ్యములుగా। ధనరాసులుభూషణములుదాసీనివహం।బునుగాంచనమయశ

## విభాండకుఁడుఋశ్యశృంగునివెదకుచువచ్చుట.

య్యా। సనవులుమునికిచ్చెహృదయసంతోషముగాన్ ✽ వ ॥ మఱియుగోసహస్రంబులనేకంబులిచ్చిగోకులసంకులం బుగాగోష్ఠంబులుదేశంబులనెల్లనిలిపి నిత్యసత్కారంబుల ఋశ్యశృంగునకుంబ్రియంబుఁజేయుచుండెనంతట విభాండ కుండుదనయాశ్రమంబునకుంజని కొడుకుంగానక యెల్లదేశంబులువెదయుచు నంగదేశంబునకువచ్చిగోగణసంకీర్ణంబై నయొక్కఘోషంబునందుగోపసత్కృతుండై యొక్కదివసంబువసియించి యిదియెవరిఘోషంబని గోపాలకులన డిగినవారల్లిట్లనిరి ✽ క ॥ యతినాథవినవెయిదినీ। సుతుఘోషంబిదియకాదుచూడననేకా।యతఘోషంబులుగలవు।న్న తసుతునకుఋశ్యశృంగునకునిద్ధరణిన్ ✽ వ॥ అనినవినివిభాండకుండు సంతసిల్లి ఋశ్యశృంగు తొట్టుపట్ల విశ్రమించు చురోమపాదుపురంబునకువచ్చి యందుశాంతా సహితుండైన ఋశ్యశృంగుంజూచి సంతుష్టహృదయుండై తనకొడు కుంగోడలిందోడ్కొనినిజాశ్రమంబునకరిగె నందువసిష్ఠునకరుంధతియు నగస్త్యునకులోపాముద్రయుమాద్గల్యునకు నాలాయనియైన యింద్రసేనయుంబోలెఁ దనకుఁబరమభక్తియుక్తయై శాంతపరిచర్య సేయుచుండ ఋశ్యశృంగుండు సుఖంబుండె ననిచెప్పిన వాకాశిక హ్రదంబునందు నందఱుఁగృతాభిషిక్తులై యేడునూఱుమహానదుల సంగమస్థానంబైన గంగా సాగరసంగమంబుఁ జూచుచు సముద్రతీరంబునకుంజని కళింగదేశంబున వైతరణియను మహానదిఁగనిరంత ధర్మరాజునకిట్లనియె ✽ క ॥ మునిదేవవరులుయజ్ఞము। లొనరించిరితొల్లిదీనియుత్తరతీరం।బుననిదిపుణ్యాస్ప దమై।తనరునుయజ్ఞావబృథశౌచస్నానముల్ ✽ వ ॥ మఱియునకలయజ్ఞంబులయందునుబ్రశస్తంబైనపశుభాగంబుఁబ రుద్రునకుఁ గల్పించి రీతీర్థంబాడినవారు దేవయానగతులగుదురనినం గృష్ణాసహితంబుగా ధ ర్మపతికి దేవతలును ఋషులుం గల్పించి రీతీర్థంబాడినవారు

ర్మతనయుండజనహితుండై వైతరణీస్నానంబుఁ జేసి రోమశు జూచి మునీంద్రా నాకు భవత్ప్రసాదంబున నఖిలలో
కంబులుం గనంబడియె వైఖానసుల వేదాధ్యయనశబ్దంబులు వినంబడియె ననిన విస్మితుండై రోమశుండు వైఖానసులని
సంబంధులకు ముప్పది వేల యోజనంబులు గలదు వారల యధ్యయనశబ్దంబులు వింటివి నీవు దివ్యపురుషుండ వంచు నిట్లని
యనవరతఫలాలంకృతంబైన యొక్క వనంబుఁ గనియందుఁ దొల్లి స్వాయంభువుండైన విశ్వకర్మ యజ్ఞంబు సేసి * క॥ క
శ్యపునకు యజ్ఞదక్షిణ దక్షిణభూభాగ మెల్లఁ దానిచ్చె నశే । షక్షితిధగవనములతో నక్షయమతిఁ గశ్యపునకు నాయుత్తమ
గాఁ * వ॥ దానికలిగి భూదేవి కశ్యపునకు నిచ్చెగవనిరసాతలంబునకుం బోయినఁ దత్ప్రసాదార్థియై కశ్యపుండు ప్రత్యక్షం
బుఁ జేసిన నంత ప్రసన్నయై భూమిదేవి నీరిలోనుండి వెలువడి వేదిరూపంబునం గశ్యపునకు నిజరూపంబుఁ జూపె నవ్వేదియిది
దీని నెక్కినవారు వీర్యవంతులగుదురు దీనం త్రంబున దీని నెక్కుమిది లేని వారికిం గానము ద్రంబు నొచ్చునని యగ్నిమి
త్రా వరుణయమనివియాది గాఁగల మంత్రంబు లుపదేశించిన * క॥ అనుజులుఁ దానును మునిశాసనమున వేదిసెక్క
సమధిక వీర్యంబున నొప్పె బ్రాహ్మణులదీవనలెనఁ గధర్మసుతుఁడు వాసవలీలన్ * క॥ ధరణీసురవరమునిగణపరివృతు
లై యరిగి కనిరి పాండవులు వియ । చ్చరనిర్జరసేవితసుం । దరకందరమగు మహేంద్రధరణీధరమున్ * వ॥ అందులున్న
మహాతపోధనులకు నమస్కరించి వారలకు మనఃప్రియంబుఁ జేసి ధర్మరాజిట్లనియె * గీ॥ పరమమునులార యిగ్గిరిఁ బరశురా
ము శుభచరిత్రు నిమీ రెప్పుఁ జూతురట్టి యమ్మహాభాగు మీ చూచు నవసరంబు । నందు మాకును జూడంగ నమరునొక్కొ * వ॥
అనిన నమ్మునిసంఘంబులోన రామానుచరుండైన కృతప్రవణుం డను ముని ధర్మరాజున కిట్లనియె * గీ॥ ధర్మతనయ మీరాక
ముందర నెఱుంగు । జామదగ్న్యుండు నిర్మలజ్ఞానదృష్టి । ననఘ యెల్లి చతుర్దశి నమ్మహాత్ముఁ జూతురిమ్మునులెల్ల నీవు జూడ
మిందు * వ॥ అనిన ధర్మతనయుండు మహేంద్రంబున నారాత్రి వసియించి యాకృతప్రవణు నిట్లని యడిగె * క॥ భువనజనస్తు
తుఁడగు భార్గవుచరితము వినఁగ నాకుఁ గడుకౌతుకగౌరవమైనది దానిమునిప్రవర యెఱుంగింపు కర్ణపథరమ్యము గాన్ * వ॥

## కృతప్రవణుఁడు ధర్మరాజునకుఁ బరశురాముని మహిమ చెప్పుట.

అనియడిగిన ధర్మరాజునకుఁ గృతప్రవణుం డిట్లని చెప్పెఁ గన్యాకుబ్జంబున గాధి యను రాజుకూఁతు సత్యవతి యనుదాని భృ
గుపుత్రుండగు ఋచికుండను మహాముని వివాహార్థియై గాధి నడిగిన నమ్మహీపతి యతనికు వాఁడిట్లనియె * సీ॥ ఒక్కకర్ణంబు నీ
లోత్పలశ్యామమై తను వెల్లఁ గలహంస ధవళమైన । యట్టిగుఱ్ఱములు వేయిక్కన్యకుం శుల్కమ యీనోపుదేని మునీంద్ర నీ
కును మరం గఁబెండిలియగు నిది మాకులధర్మంబు నావుడుఁ దన గఁబెండ్లి । యగు వేడ్క భార్గవుఁడప్పుడు వరుణుని ప్రోలికిఁ జని
వానిఁ బడసి తెచ్చె * గీ॥ నవనినాథ గంగయందుఁ గన్యాకుబ్జపురవరంబునందుఁ బుట్టినట్టి హయసహస్రములమైనాటఁ గో
లెను అశ్వతీర్థమనఁగ నయ్యేనదియు * వ॥ ఋచికుండు గాధికి నిచ్చాశుల్కంబులైన హయంబులనిచ్చి వానికూఁతు సత్యవతిం బా
ణిగ్రహవిధిం బరిగ్రహించి సుఖంబున్నఁ గన్యాకుబ్జంబునకు భృగుండు వచ్చి వారల చేతం బూజితుండై కొడుకును గో
డలిం జూచి సంతుష్టుండై యొక్కనాఁడు కోడలికిట్లనియె * క॥ లలితాంగి యేను నీగుణ । ములకతి హృష్టుండనైతి మదమున
రఁగ నీ హృష్టలనిచ్చెద వేఁడు మునీ । వలయు వరంబనిన సత్యవతి యిట్లనియెన్ * వ॥ దేవా నీప్రసాదంబున నాకొక్క కొడుకు
మహాజ్ఞుని కొక్క కొడుకు నుదయింప వలయునని మ్రొక్కినం గరుణించి భృగుండు నీకోరిన యట్లయగు ఋతుస్నాత
లయి నీవు మేడి మ్రానిం గౌఁగిలించికొనుము నీజనని యశ్వత్థంబుఁ గౌఁగిలింపం బంపుమనిన నయ్యిద్దఱుఁ దదాలింగనవిపర్యా
సంబు చేసిన నెఱింగి భృగుండు కోడలి కిట్లనియె * ఉ॥ పుత్రుఁడు నీకు బ్రహ్మకులపూజ్యుఁడు పుట్టియు వాఁడు దారుణ । క్ష
త్రచరిత్రుఁడై పరఁగు గర్వమునన్మహి నీ జనిత్రికిన్ । క్షత్రియుఁ డుద్భవిల్లియు నఘక్షయకారణుఁడన్మహాతపః । పౌత్రుఁ
డు నైధృతిం బడయు బ్రాహ్మణభావము భూరితేజమున్ * వ॥ అనిన సత్యవతి కృతాంజలియై క్షత్రియాచారంబు దనపు
త్రునకుం గాక పౌత్రునకగు నట్లుగాశ్వశురు వలన వరంబు వడసి కతిపయకాలంబునకు గర్భిణియై * క॥ ఆదిమునిచరి
తుఁ బడసె భృగుప్రసాదసమన్వితు సుపుత్రు జమదగ్నిఁ జతు । ర్వేదంబులయం దధను । ర్వేదమునం దును నతిప్రవీణు మహా
త్మున్ * వ॥ ఆజమదగ్ని ప్రసేనజిత్తుండను రాజుకూఁతు రేణుక యనుదాని వివాహంబయి దానియందు రుమణ్వత్సుషే
విశ్వావసు రాములను వారి నల్వురఁ గొడుకులం బడసి వనంబునను గ్రతపంబుఁ జేయుచు నొక్కనాఁడు వన్యఫలంబులు దేరం

గొడుకులు వోయిన రేణుక వారి పిలువంద నపోయి యొక్క సరోవరంబునందు సభార్యుండయి జలక్రీడ లాడుచున్నవాని నం గాధిపతియగు చిత్రసేనుండను రాజుం జూచి కామమోహితయై వ్యభిచరించిన దాని దుశ్చరితంబెఱింగి జమదగ్ని కోపా స్పదపరవశుండై * క॥ తనయుల మువ్వురఁ గ్రమమునఁ। బనిచె జమదగ్ని తనదు భార్యవధింపఁగ । జననీఘాతము పాతక। మని వారలు వలుకకుండ రత్యవహితులై * క॥ కడు నలిగి యమ్మునీంద్రుఁడు। గొడుకుల కును శాపమిచ్చె ఘోరాటవిలో । జడమతి మృగవత్తులయి। ట్లుడుగక యజ్ఞానవృత్తి నుండుం డనుచున్ * వ॥ మఱి నిశిత పరశుహస్తు రాముం జూచి దీని వధియిం పుమని పంచిన వాఁడు గురువచనంబునఁ దల్లిం దత్క్షణంబున వధియించిన * క॥ శమిత నిజక్రోధుండై । జమదగ్ని తనూజు సాహసమునకుఁ దన వాక్యములంఘింపమికిం బ్రసన్నమనస్కుండై తనూజున కనిట్లనియెన్ ॥ వ॥ నా వచనంబున నతి దుష్కరంబైన కార్యంబుఁ జేసితి నీకిష్టంబైన వాని నెల్లను వేఁడు మిచ్చెద ననిన రాముండు సంతుష్టహృదయుండై మదీయ జనని దోష విముక్తయై జీవించి యుండునట్లును సహోదరులు శాపవిముక్తులై యెప్పటి యట్ల యుండునట్లును। సమరంబున నాకప్రతిహత శక్తియు దీర్ఘాయువుఁ గాఁ బ్రసాదింపుండనినం దండ్రి వలనం దనయభిమతంబులు వడసియున్నం గొండొక కాలంబున * చ॥ అమిత బలుండు హైహయుఁడు సార్వభౌతి తేజుఁడ జేయబాహుఁడు। క్రముఁడు సహస్రబాహుఁడనఁ గా విదితుండగువాఁడు తద్వనాంతమున మృగవ్యఖిన్నుఁడయి తా జమదగ్ని మహామునీంద్రునా। శ్రమమునకేగుదెంచె బహుసైన్యముతోనధిక శ్రమార్తుఁడై ॥ వ॥ అందు మునివరు చేతఁ బూజితుండయ్యును వాఁడు దనరాజ్యమదంబున మెచ్చక యయ్యాశ్రమవాసులకవమానంబు సేసి యందు వృక్షంబు లెల్ల విఱిచి జమదగ్ని హోమధేనువును దానివత్సంబును బట్టికొనిపోయిన నవ్వనంబునకుం దనమిత్రులు సమిత్కుశఫలంబులుగొని వచ్చిన రామునకు జమదగ్ని యిట్లనియెం క॥ విను వయ్య కార్తవీర్యుఁడు। మన ధేనువుఁ బట్టికొని సమస్తుండయి పెల్చనఁ బోయె నేమి సేయుద। మనవుడు రాముండు విని మహాక్రోధమునన్ * క॥ గురువచనబోధితుండై। సరభసమున వాని పిఱుదఁ జని తద్బలమున్। శరవృష్టిముంచి చంపెన । వరిమితలయ కాలమేఘపటలము వోలెన్ * వ॥ మఱియును॥

## * పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట. *

చ॥ బలిమిన శేషలోకపరిభావిమహాద్భుతశౌర్యసంపదన్ । బొలుచు సహస్రబాహుకరములు ల్గలి శాతవిశాతబాణధా। రల నతివీరుఁడై తునిమి రాముఁడ రాతులకున్ భయంబుగాఁ। గలహములోన వానినతిగర్వితుఁ జంపె బరాక్రమంబునన్ ॥ వ॥ అంతం గార్తవీర్యుని పుత్త్రులు బద్ధవైరులై రామరహితంబయిన జమదగ్న్యాశ్రమంబునకు వచ్చి యందు * మ॥ మును లందిట్టుచుఁ బువ్వులుం దతి నిర్మాలించుచుం గ్రూరులై। యనవద్యున్ జమదగ్నిఁ బట్టి బలిమిన్ హా రామ హా రామ యం। చును నాక్రోశము సేయుచుండఁగ మునుల్ శోకింపఁ ధర్మాత్ము న। మ్మునిముఖ్యున్ వధియించి రాగ్రహమహామోహాంధులై హైహయుల్ ॥ చ॥ వఱలఁగ రాముఁ డంతననవద్యుఁడు వచ్చి మహాప్రలాపియై। యఱచుచునున్న తల్లి నిగృతాంతవశీకృతుఁడై న తండ్రి ను। గ్రుడఁగని తీవ్రశోకపరిఖేదహతుండయి తత్ప్రకారమున్ । దెలిఁగి మహార్తమేని యసహింపఁగనోప కక్రోధదీప్తుఁడై * చ॥ ఆనఘున నాతతాయిఁగరుణాత్ముఁ బ్రశాంతుని నాహతున్ మహా। మునివరుఁ జూచి యధము ల్వధియించిరి వీనఁ జేసి దుర్జనులగుచున్న క్షత్త్రియులఁ జంపుదునంచుఁ బ్రతిజ్ఞఁ జేసె భూ। వినుతుఁడు జామదగ్న్యుఁడతివీరుఁడు లోకభయంకరాకృతిన్ * వ ॥ అట్లు కృతప్రతిజ్ఞుండై క్షత్త్రియుల నెల్ల వధియించి దిగ్దంతిదంతార్గళాభ రణీభూతమహీచక్రంబు సాధించి విధివిహితవిధానాధ్వరుండై కశ్యపునకు దక్షిణగా భూవలయంబు నిచ్చి నిస్సంగుండై మహేంద్రపర్వతంబునందు పోనిత్యుండై యున్నవాఁడని పరశురామచరితంబు సెప్పిన విని ధర్మజుం డనుజ బ్రాహ్మణసహితుండై మునిగణోపదేశంబునం జతుర్దశినాఁడు పరశురాముం జూచి పరమభక్తిం బూజించి తత్ప్రతిపూజితుండై దక్షిణదిక్కునకుం జని భూవిదితంబై త్రిభువనపావనమై త్ర్యంబకప్రభవమైన జలౌఘావళిఁ బవిత్రమగు గోదావరిఁ బుణ్యనదిఁ గని రిదక్షిణగంగన్ * శా॥ గోదేవక్షితిదేవభక్తిపరుఁడై గోదావరీస్నాతుఁడై। గోదానంబులు హేమదానములుఁ బెక్కుల్ రత్నదానంబులున్। భూదేవోత్తమపూజ చేయుచు జగత్పూజ్యుండు ధర్మాత్మజుం। డాదిత్యాభుఁడ నేకతీర్థశతసేవాసక్తిఁ బుణ్యాత్ముఁడై * వ ॥ ద్రవిళదేశంబున నగస్త్యతీర్థంబాడి యందుఁ దొల్లి యర్జును చేసిన గోసహస్రనానావిధ దానంబులు విని దానం బ్రశంసించుచుం జని శూర్పారకారంబను తీర్థంబున [illegible] వేదిఁ గని సముద్రతీరంబునం జని

ప్రభాసతీర్థంబునం బది రెండు దినంబులు పంచాగ్నిమధ్యంబున నంబుభక్షితుండై ధర్మజుండు దపంబు సేసె
దాని నెఱింగి రామదామోదరులు వృష్ణివరులతోడం బ్రీతిన రుగుదెంచి । కనిరి సకలతీర్థగమనపరిక్లేశ । కృశులం బాం
సుతుల విశదయశుల * క ॥ చీరాజినధారులనవి । కారతపోయశులజ్వాదికడు దుర్లక్షితులై । వారిజదళాక్షి ద్రౌపది యి
ర్చిరుదారహితవ్యథ దూక్తిలనొప్పన్ * వ ॥ వారికి ధర్మతనయుండు దమవనవాసగమనాయాసంబును నర్జునుని
స్త్రలాభంబును నింద్రునొద్దనాతనియునికియుం జెప్పిన విని రాముండు కృష్ణాదులైన వృష్ణివరుల కిట్లనియె * సీ ॥
ముండై తనసుతులవల్కలు విని ధృతరాష్ట్రుం డీ పాండుసుతులం బాసి భీరులనపగతధారుణీ రాజ్యులం జేసి యస్త్రా
నాసగతులం । గావించె నిది ధర్మువే విచారవిహీనుండయ్యె భీష్మాదులు నెయ్యమునని వారింపంగావిన నేరండు ధృత
గతులకు దేవనిర్మితులకి హిత * గీ॥ మాచరించుచున్న నీచమరోర్యోధనాదులకు నర్థనంబున లఘులైన । పాండునందను
డితారులకవ । ర్ధనము నిట్లు చేయఁదగునె విధికి * క ॥ ధరణీతలంబు నిర్ధారా । త్తరాష్ట్రముగం జేసియ ఘుధర్మైకధుర
స్త్యాంశూజువసుంధరకధిపతిం జేయకుండఁదగునె మనకున్ * వ ॥ అని బలదేవునకు సాత్యకి యిట్లనియె * చ ॥ అనుపమశౌర్య
తులున వంతబలాఢ్యులు నీవు నీజనా । ర్దనుఁడును సాంబసారణులు దర్పకవీరుఁడు నుండఁ బాండునం । దనులు సుయోధ
నుల కృతంబున రాజ్యము గోలుపోయి యిట్లవనమున నుండఁగాఁదగునె వన్యఫలాశనులై విహీనులై * తరల॥ ఆహితర
దారణక్రియలందుం బ్రౌఢములై జగ । త్తుఱహారనుంతయు మ్మ్రోయుచుండఁగ ఘోరయాదవసైన్యసన్నహనదుం
నాదముల్గగనంబు దిక్కులు నిండఁడు । స్పహములయ్యెడు ధార్తరాష్ట్రలసైన్యవీరభటాలికిన్ * మ॥ ఘనమై నీ నృథుబా
లాంగలముఖాఘాతంబుతోడఁ జనా । ర్దన శార్ఙ్గచ్యుతసాయకావలియుఁ గందర్పేషుజాలంబుసీ । యనిరుద్ధోగ్ర
ముఖాలియు మదీయాస్త్రౌఘముం ధార్తరా । ష్ట్రనికాయోత్తమకాయఖండనపటిష్ఠంబయ్యెడుం బోరిలోన్ * వ ॥
కయ సృంజయ పాంచాల వృష్ణి భోజాంధక వీరులుం గృష్ణానుమతులయి యుద్ధంబున ధృతరాష్ట్ర పుత్రుల భీష్మ ద్రో
ణకర్ణాదులను వధియింతురు ధర్మరాజు తమ్ములుం దానును సమయాబ్దంబులు సలిపి రాజ్యాభిషిక్తుండగు నంతకు న
భునభిమన్యు నఖిలరాజ్యరక్షకుం జేసి యుండుదము నిన సాత్యకి పలుకులకనుకూలుండయి వాసుదేవుండు ధర్మరాజున
నియె * ఉ ॥ ఈతఁడు పల్కినట్లు ధరణీశ్వర నీరిపులన్ మహాబలో । పేతులం బోరం జంపుమరభేద్యులు వీరలు మీకు భూరి
త్రితలరాజ్యమెల్లనసుఁ దెల్లము నావుడు ధర్మనందనుం । డాతతకీర్తి యిట్లనియె నమ్మధువైరికి సీరపాణికిన్ * ఉ ॥ మీరు
మాకుఁగల్గఁగనమిత్రుల నోర్చుట యెంతపెద్ద । రోసమయానిత్యబుద్ధులనుమత్తమకీర్తుల నొప్పు ద్రోణభీష్మాదుల
ధానమునన మ్మోయంబల్కిన పల్కు దప్పంగాఁ గాదని ధర్మనందనుఁడు కృష్ణు బిచెకొనుడు వీరకోపముల్ * వ ॥ యా
లు పాండవులవీడ్కొని పోయిరి తం బాండవులు సోమశ్రవసమ్మితయైన పయోష్ణియందుం గృతస్నానులయి యున్న న ధ
ర్మరాజునకు రోమశుం డిట్లనియె * క ॥ మనుజేంద్ర యీ తీరంబున భృగుఁడను రాజు యజ్ఞములం జేసిన నం । ధనిమిషప
పుండై దనుజులం దెగటార్చె ఘోరతరశస్త్రములన్ * వ ॥ మఱియు నిందుఁ దొల్లియాశాపూరితయశుండై గయుం
రణ్మయంబులయిన చషాలస్థాలియూప ఘనస్రుక్స్రువంబులును దేవస్థాపితంబులయిన యూపంబుల నేనా
మేధంబులు సేసి యసంఖ్యాతులయిన ఋత్విజులను సదస్యులనుం బూజించి సువర్ణమయ గోదానంబులనేక
బ్రాహ్మణులకిచ్చి యక్షయంబులయిన యింద్రలోకసుఖంబులం బడసెం బయోష్ణియందుఁ గృతస్నానులయిన వారు
సాయుజ్యంబుం బడయుదురని చెప్పం జని నర్మదాస్నానంబుం జేసి వైదూర్యపర్వతంబుంగని రోమశుండు ధర్మరా
కిట్లనియెనిది త్రేతాద్వాపరసంధి నీ సరోవరతీరంబున సంయాతి యజ్ఞప్రదేశంబు మఱియు నిందు భృగుపుత్రుండ
చ్యవనుండు సంయాతియను రాజుకూఁతురు సుకన్యయను దాని వివాహంబయి వానియజ్ఞంబున నింద్రునాదరింపక
శ్వినుల సోమపీథులం జేసెననిన నదియెట్లనియడిగిన ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు సవిస్తరంబుగా రోమశుండిట్లని

రోమశుండు ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు చెప్పుట.

క॥ ఇక్కొలనిసమీపంబునం । జొక్కగు వేలేండ్లు దపము భృగుసుతుఁడు కరంబక్కజముగ నొనరించెను । దక్కక యమ
మునియతిదర్పాసనుండై * క ॥ అమ్ముని దేహము వల్మీకమ్మున గప్పంగఁబడి నిక్కటవల్లీగుల్మమ్ములు పై బ్రాకిన నెయ్యా

నేర్పడకయుండెనప్వనభూమిఁ గా * వ॥ అంతం బెన్గ గాలంబునకు సంయాతియను రాజు దనచతుస్సహస్ర దేవీనివహంబు తోడఁ గస్సరోవరంబున విహరింపనరిగిన నాతని కూఁతురు సుకన్యయనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న వల్మీకంబు నందు * క॥ పిమ్మల్లతాంగి భార్గవు । నుద్యన్నయనములు మెఱయుచున్న నువిలో । ఖద్యోతద్యుతులో యని । సద్యస్సంజాతబుద్ధి సంభృతయై ... * వ॥ అపుడప్పుట్ట ద్రవ్వించి నలిగి నిమీలితలోచనుండై చ్యవనుండు సంయాతిసైన్యంబులకెల్ల మూత్రపురీషనిరోధంబుఁ జేసిన నదివనసైన్యాపరాధంబున నయ్యెంగా వగచి వారెల్ల వారి నడిగి తత్కారణంబెఱుంగనేరక చింతాపరుండై యున్నఁ దండ్రికడకు వచ్చి సుకన్య యిట్లనియె * గీ॥ మిన్న మిణుఁగురులట్టులై మెఱసె రెండు । మెఱుఁగులొక పుట్టపై నున్న నెఱుఁగ కేను । బుట్ట త్రవ్వించియా రెంటిఁ బొడవఁగాన । కుడిగి వచ్చితి విస్మయపడి మనమున * వ॥ ఈయా సైన్యనిరోధంబున కిది నిమిత్తంబగునో యనిన సంయాతి యప్పుడా పుట్టయొద్దకు వచ్చి యందుఁ దపఃక్లేశత్వక్స్థిభూతశరీరుని నతివృద్ధు భార్గవుం గని నమస్కరించి యిట్లనియె * క॥ అమితంబగు నీ తపమును । హిమకరయెఱుఁగక యిట్లు చేసెనిది నీ సహింపుము దయను సైన్యవిరో । ధము వాపుము యెఱుకగల రెతరుణులు ధరణీశా * వ॥ అనిన భార్గవుండు కరుణించి యతిశయరూపయౌవనగర్వితయైన యాకన్యకం బరిగ్రహించితి కాని సహింపననిన సంయాతి దనకూఁతు నమ్మునివరునకిచ్చి నిజసైన్యనిరోధంబు వాపికొని చనిన * గీ॥ పతికిఁ బరమభక్తిం బరిచర్యసేయుచు । నొనరఁ గా సుకన్య యుండ నంత । నాలతాంగి కడకు నశ్వినులేతెంచి । తమ్ముఁ జెప్పె దాని కనిరి * వ॥ అవ్వా నీ వెవ్వనికూఁతు రెవ్వని భార్య యనియడిగిన నేను సంయాతికూఁతుర భార్గవుండయిన చ్యవనుని భార్య నని చెప్పిన విని వారలు నగి యక్కటా యిట్టి రూపవిభవంబులు వడసి కామభోగబాహ్యుండయిన వృద్ధభార్గవు వివరియించి నీజవ్వనంబెల్ల వృథ చేసితి వింకనైనను నీవ మారూపంబులకుండగినవరు నేము దెచ్చెదము వానివరియింపు మనిన నప్పలుకులు సహింపనోపక సుకన్య యశ్వినులకిట్లనియె * గీ॥ చ్యవనమునందు నాకు సంతత ప్రీతియై । యుండ నిట్లు పల్కుటుచితమగునె । యనిన జేశ్వరునకు నవ్వుచు వారలు । పలుకులెల్లఁ జెప్పెఁ బంకజాక్షి * వ॥ చ్యవనుండును దాని పాతివ్రత్యంబునకు సంతసిల్లి వారలపలుకులకొడంబడు మనిపంచిన నదిపతిచేత ననుజ్ఞాతయై చని నాపతి నవయౌవనవరుం గావింపుండనిన నశ్వినులప్పుడ కొలనుసొచ్చిరి భార్గవుండును వారితోడ సరఃప్రవేశంబు సేసె నిట్లు మువ్వురు నవయౌవనులయి సుకన్యకడకు వచ్చి నిలిచి మాయందు నీవలయువాని నివరియింపుమనిన నది తన పతి నెఱింగి భార్గవుని వరియించె నంత నశ్వినుల కతిప్రీతుండయి చ్యవనుండిట్లనియె * గీ॥ ప

—*చ్యవనుఁడశ్వినుల సోమపీథులఁ జేయుట.*—

నుమీకారణంబున నెలమిలబ్ధ । యౌవనుఁడనైతి నిప్పుడే నసఘ మిమ్ము । సోమపీథులఁ జేసెద సురవిభుండు । సూచుచుండఁగ సంయాతి సుక్రతువున * వ॥ అని చెప్పిన నశ్వినులు సంతసిల్లి యరిగిరిట సంయాతి భార్గవుజరాభార పరిత్యాగంబు నివిస్మితుండై యల్లునిం గూఁతుం జూడవచ్చిన నాతని సత్కృతుం జేసి భార్గవుండిట్లనియె * క॥ విదితముగ నిన్నుఁ జేయించెద క్రతువు ధరాధినాథ సేయుము నీక । భ్యుదయంబగు సంభారస । ముదయము సమకట్టుము సనమునివచనమునకా * క॥ అనఘుఁడు సంయాతి మఖం । బొనరించె విధిప్రయోగయుతముగ నందు । నశ్వినులకు సోమంబీఁ బోయిన భృగుపుత్రుననసు నలిగి యింద్రుండనియెన్ * క॥ వీరిద్దఱు సోమార్హులు । గారసురుల వెజ్జులిదియ కర్తవ్యముబ్రం । దారకులుగానివారికి । వారింపక సోమమిచ్చు వారుంగలరే * వ॥ అనిన నింద్రువచనంబాదరింపక చ్యవనుండశ్వినుల సోమపీథులం జేసిన దానిసహింపక యింద్రుండలిగి * క॥ జృంభించి వజ్రమెత్తిన । జంభాంతకు వజ్రయుత భుజస్తంభమ్ముగా । స్తంభించి యతనిఁ బటుసం । రంభంబునఁ జంపఁ గడఁగి రౌద్రాకృతితోన్ * క॥ చ్యవనుఁడు వేల్చిన నందు । ద్భవమైకృత్యసుఁడపారబలయుతుఁడు సహా । జవుఁడు మదుండను రాక్షసుఁ । డవనిచరద్యుచరభీకరాకారుండై * వ॥ ఇట్లుద్భవించి దశసహస్ర యోజనాయామంబులైన బాహుదండంబులును శతయోజనాయామంబులైన చతుర్దంష్ట్రంబులును దశయోజనాయామంబులైన దశనంబులును శశిరవిమండలసదృశంబులైన నయనంబులును దిగ్భూనభోభాగసంపూర్ణంబైన శరీరంబునుం గలిగి భూమియందొక్కహనువును దివంబున నొక్కహనువును గా వదనగహ్వరంబు దెఱచి జగజ్జనసంత్రాసనవ్యగ్రసంచలనంబైన దీర్ఘజిహ్వానఘోష్ఠపుటంబు నాకుచు నత్యుగ్రనాదంబున [illegible] సుంజూచి సురేంద్రుండు వెఱచి

భార్గవస్తంభితభుజుండు గావున వాని నేమియుం జేయ నేరక చ్యవను నొగ్గులువచ్చి కృతాంజలియై మునీంద్రా నీతపోవీర్య
మాహాత్మ్యంబు మిథ్యయగునే యశ్వినులు నేఁడు మొదలుగా సోమార్హులగుదురు నీవు నాకుఁ బ్రసన్నుండవై తమియింపుమనిన
క॥ మునినాథునలుక తోడన। యమిషపతి వజ్రయుతమహాభుజసంస్తంభనముఁ డిగె నంత భృగుసనందనుఁ డీశా-నియింద్రు
రి గెందఁ బురమునకుఁ * వ॥ మధురాక్షసుండు నాక్షణంబ చ్యవనుచుపదేశంబున మద్యస్త్రీమృగయాక్షుంబుల నాశ్రయిం
చె నశ్వినులు సోమపీథులై దివంబునకరిగిరిట్లు భార్గవుండైన చ్యవనుండు దనతపోమహత్త్వంబున నందుఁ బ్రకాశించిన
టం గోలె నది యర్చీకపర్వతంబు నాఁ బరఁగెనని రోమశుండు సెప్పిన నంత లపుణ్యసరోవరంబునం గృతస్నానులై
పులరిగిరంత శాంతనశౌనక నరనారాయణ విధాన్యతపోవనస్థానంబై దేవర్షినివాసంబైన సైంధవారణ్యంబున
జంద్రసరోవరంబునందు రోమశవియుక్తులై స్నానంబు జేసి యతిథులఁ బూజించి చని యమునానదిఁ గనిరంత వారలకు

## మాంధాతృచరిత్రము.

నాశుండిట్లనియె * క॥ ఇది యమునయను మహానది। త్రిదశనదీనిభము దీనితీరమున జగ। ద్విదితుఁడు మాంధాతృఁడు సు
దగ్రక్రతువులఁ జేసెఁ దొల్లి బహువత్సరముల్ * వ॥ అనిన మాంధాతృజన్మంబును వానిచరితంబును వినవలతుం జెప్పు
యడిగిన ధర్మరాజునకు రోమశుండిట్లనియె * ఉ॥ వీరు ననశ్వమేధములు వేయొనరించిన పుణ్యశీలుఁడి। క్ష్వాకుకులో
త్తముండు బలవంతుఁడనంతయశుండ వార్యవి। ద్యాకరుఁ డుత్తముండు యువనాశ్వుఁ డపత్యము లేమిఁ జేసి మః ఖ్యాతులౌదై
ధానవరులందు సమర్పితరాజ్యభారుఁడై * వ॥ భృగువాశ్రమంబునకుం జని పుత్రకాముండై పెద్దకాలంబమ్మునిసే
వించిన నయ్యువనాశ్వుం గరుణించి భృగుండు పుత్రకామేష్టిఁ జేసి యందు మంత్రపూతజలపూరితంబైన కనకకల
శంబు వడసి దానిరక్షించి యుండ ఋత్విజులంబంచిన * గీ॥ రాత్రిజాగరణభరశ్రాంతులై వారు। నిద్రఁ బొందియుండ
వట్టి। ధారుణీశ్వరుండు దన్మంత్రకలశోద। కంబులెల్లఁ ద్రావెఁ గడుపునిండ * వ॥ దాని నెఱింగి భృగుండు యువనాశ్వు
జూచి నీవుఁ బుత్రార్థంబుగా మదీయతపోవీర్యలబ్ధంబైన యిమ్మంత్రజలంబు నీభార్యకీ మున్నచో నీవధిక పిపాసావశు
డవయి యుపయోగించి యకృత్యంబుఁ జేసితి దైవకృతం బెవ్వరికిం దప్పింప నశక్యంబు దీనం జేసి నీకు నింద్రసదృశుండై
పుత్త్రుఁడుద్భవించు ననిన విని యువనాశ్వుండు దనపురంబునకుం జని యున్నంత నూఱేండ్లకు యువనాశ్వునుదరగో
బున వామభాగంబు భేదించుకొని బాలార్కతేజుండైన బాలకుండు వెలువడిన నక్కొడుకుం జూడ నింద్రుండు వచ్చి వా
దనంబున నిజప్రదేశిని పెట్టి యమృతమయంబగు దీనిం ద్రావుమనిన నయ్యింద్రువచనంబున నమరులెల్లన క్కు
రునకు మాంధాతృండను నామంబుఁ జేసిరట్లు నరేంద్రసంవర్ధితుండై * గీ॥ ధ్యానమాత్రన చేసి వేదములు సర్వశాస్త్ర
ములు ధనుర్వేదము సకలదివ్య। సాయకప్రయోగంబులుఁ జక్క వచ్చి। పొందె మాంధాతృఁ డ్రిభువనపూజ్యుఁడొప్ప *
జేయునమ్మాంధాతృండు మహేంద్రు చేత మహారాజ్యంబున కభిషిక్తుండై చక్రవర్తియయి శక్రు నర్ధాసనంబెక్కి
జగరంబన ధనువు మహదివ్యాస్త్రంబులు నభేద్యకవచంబును ధరియించి నిఖిలలోకజైత్రుండై సంపూర్ణదక్షిణక్రతు
లనేకంబు చేసి పద్మసంఖ్య గోదానంబుల బ్రాహ్మణులం దనిపి నిజశాసనంబునఁ బ్రజలనెల్లనిలిపె * మధ్యాక్కర॥ భూ
కనావృష్టియైనఁ గడునలిగి పురుహూతుతోడ। భీమసంగ్రామంబుఁ జేసెఁ దనదివ్యపృథుసాయకముల। సామజాశ్వ
యునట్లు మేఘసంచయముల నేసి। భూమికి వర్షముఁ గురియించె సస్యములు వృద్ధిఁ బొంద * వ॥ ఇది యమ్మాంధాతృ
జనస్థానంబు మఱియు కురుక్షేత్రంబునందు సరస్వతీతీరంబున సోమకుండను వాఁడు యజ్ఞంబుఁ జేసి పుత్రశతంబు

## సోమకుండను రాజర్షిచరిత్రము.

సెనని నదియెట్లని ధర్మజుం డడిగిన రోమశుండిట్లనియె * క॥ సోమకుఁడను రాజర్షి స। హోమఖమొనరించి జంతుఁడను
సత్సుతుఁగని భూమీశపడసెనాతని। భామలు నూఱ్వురును గొడుకుఁ బరమప్రీతిన్ * క॥ తమతమపుత్త్రుఁడు గాఁ జిత్త
లంబోఁకొని దయ ననుబృథగ్భావము లేక ముదంబునఁ బెంచిరి లోకముననజనులు చోద్యమందఁగ నాఁగడు వేడ్కన్ * వ॥ ఒక
నాఁడు బాలకుఁడు చీమ గుట్టిన నద్వేదన సహింపనోపక యేడ్చుచున్న వాని కడకుఁ దల్లులందఱు నేతెంచి యేడ్చిన
ధ్వని విని సంభ్రమించి సోమకుండ ... పురోహితసహితుండై యంతఃపురంబునకుం జని ఋత్విజుల కనిట్లనియె

క॥ కోరి యొకకొడుకుఁ గొడుకుఁగా నే నెట్లు నన్ను యుండ నేర్తు వానసతులు। శతము గలిగి యుండ సంతానమత్వ మై। యు నికి మీకుఁ జూడ ననుచితముగ నె * వ॥ అనిన వానికి ఋత్విజుం డిట్లనియె * గీ॥ ధరణి నాథ నీ భార్యాశతంబునందుఁ। బరఁగ నూర్వు రు పుత్రులఁ బడయ నీవు। నభిమతంబు జేవితగుఁ దగదనక నీవు। కడఁగి మా చేయఁ బంచిన క్రతువు సేయు * వ॥ ఈజంతు బశువు గా వధించి తత్పశుహవ్యంబుల హవ్యవహు నిందనిపిన దాన నీ నూర్వురు భార్యలకు నూర్వురు కొడుకులు పుట్టు మరందగ్ర జుండై న జంతుం డు సౌవర్ణలక్షణలక్షిత సవ్యవామపార్శ్వుండై యుదయించు నని చెప్పి. ఋత్విజుండు సోమకుని చేత నను జ్ఞాతుండై * క॥ తనయు విశసించి తద్వప। గొని వేల్చినఁ జూచి యార్తి గూరిన నాదం। బున నేడ్చి రక్కడు నడలుచుఁ। దను మధ్య లు నూర్వురు సుసుత స్నేహమున * క॥ ఇమ్మగఁ దద్ధూమ ఘ్రా। ణమ్మున గర్భములు దాల్చి నాతులు నవమా। సమ్ములు నిం డఁగఁ గని రిము। దమ్మున జంతు ప్రముఖసుత ప్రకరమ్ము * వ॥ అందు జంతు నకు వంద ఋతల్లులు నెప్పటియట్ల సమస్నేహ లై యుండం బుత్రులు నూర్వురుం బెరిగి సమర్థులై యున్నఁ గొండగాలంబునకు ఋత్విజుండు వరలోకగతుండై ఘోర నరకా నలంబున నెరియుచునుండె నంత సోమకుండును దేహత్యాగంబు చేసి యమరలోకంబునకరుగువాఁడు ముందట నరకానల దందహ్యమానుండయ్యెడు ఋత్విజుం జూచి యిట్లు లతి ప్రదుఃఖోపహతుండై తవని యడిగిన వాఁ డిట్లనియె * గీ॥ అవని నా థ నీవు నార్త్విజ్య మొనరించి। చూ వెయిట్టి నరక పావకమునఁ। బడిన వాఁడ నీవు బహుపుణ్యలోకముల్। గలవు నన్నుఁ గావ వలయుఁ గరుణ * వ॥ అనిన సోమకుండు ధర్మరాజు పాలికిం జని తచ్ఛాసనంబున నిబ్బుణ్యలోకంబులకుం బోవునుఁ డెయిట్లనియె * క॥ నా కారణమున ఋత్విజుఁ। డేకాంతమున నరకమునకు నేగెను వానిం। దోకొని పోయెద ననిశుభ। లోకంబునకరిగెఁ ద్రిదశ లోకస్థితుఁడై * వ॥ ఇట్లు యాజ్యపుత్రుండై న సోమకుండు దన తపో యజ్ఞఫలంబున ఋత్విజు నరక విముక్తుం జేసి పుణ్యలోకగ తుండయ్యె నింకఁ దొల్లి ప్రజాపతి సహస్ర వార్షికంబైన యిష్టి క్రియ యను సత్రయాగంబుఁ జేసె నాభాగాంబరీషులు నిందు యజ్ఞంబులం జేసి పరమసిద్ధికిం జని రి దిన హవుష్యజ్ఞదేశంబిది దశపద్మసంఖ్య ధనంబుల నాతండు సదస్యులం బూ జించె నిది సార్వభౌమ యజ్ఞస్థానం బిది యయాతి యజ్ఞాయతనంబు వాని సవనంబున కింద్రుండు వచ్చె నిది రామహ్రదం బిది నరనారాయణ స్థానంబిది దక్షిణావతరణంబను యమునాతీర్థంబిందు దేవతలును ఋషులును సారస్వత యాగం బు జేసిరి దేవర్షిసైన సంవర్తుచేత రక్షితుండు భరతుం డనేక యాగంబులు సేసి సర్వలోకంబులుఁ జూచె నీవు విం దుగ్ధ స్నానుండవై సర్వలోకంబులుం జూతువని నను జసహితుండై ధర్మతనయుండు తీర్థంబున స్నానంబుఁ జేసిరో మశుఁ డిట్లనియె * శా॥ దేవర్షి ద్విజరాజలోకములు నాదిత్యాశ్వి నీలోకముల్। దేవాధీశ్వరుఁ జూచితి మహితయున ద్దేవేంద్రు నొద్ద న సగాం। డీవోద్దాముఁ బహాభుజాగ్రులఁ గిరీటిం సవ్యసాచిం యశ। శ్శ్రీవిభ్రాజితుఁ బార్థుఁ జూచితి జగత్సేవ్యాము నీ ంద్రోత్తమా * వ॥ అనిన రోమశుండు వెండియు ధర్మరాజున కిట్లనియె * క॥ ఇది కక్షుముఖస్థానం। బిది యుసర స్వతి యనంగ నిలఁ బరఁగు మహా। నదియిందుఁ ద్రిదశతతితోఁ। ద్రిదశ జ్యేష్ఠుండు సేసెఁ దివిరిమఖంబుల్ * వ॥ ఇది పంచయోజన ప్రమాణంబైన ప్రజాపతి యజ్ఞవేదియందు దేహత్యాగంబుఁ జేసి మర్త్యులమర్త్యత్వంబుఁ బొందుదురిందుఁ దొల్లి సరస్వతి నిషధదేశంబను భూమి సొచ్చి యిచ్చట మనో భేదంబు నందుఁ గానంబడియె నిది సింధుతీర్థంబిందు లోపాముద్ర నగస్త్యుండు ప్రతిగ్రహించె * గీ॥ ఇదియుఁ విష్ణుపదంబు దానిది విపాశ। యిదియుఁ గాశ్మీరమండలంబిది వితస్త। యిదియు మానస

⸻⸻* శిబి యను రాజర్షి చరిత్రంబు రోమశుండు ధర్మజునకుఁ జెప్పుట. *⸻⸻

ద్వారమిందు వంశ। పరశురాముండు మునుహంసవధముఁ జేసె * వ॥ ఇక్కాలనంజైత్ర మాసంబునందు మహామునులచే తం బూజితుండై యుమాసహితుండై నయీశ్వరుండు వారికిం బ్రత్యక్షుండగుటయు నరుంధతీసహితుండై వసిష్ఠుండిందు లవసియించె నిది భృగుతుంగంబను పర్వతంబిందు నౌశీనరుండు శిబి యను వాఁడు దొల్లి యజ్ఞంబు సేయుచున్నం నింద్రా గ్నులు వాని మహాగుణంబు లెఱుంగ వేఁడి యింద్రుండు శ్యేనంబైన నగ్ని కపోతంబై శ్యేన భయంబునఁ గపోతంబు వఱ తెంచి శిబి మ్రోలువు సొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు శిబికిట్లనియె * గీ॥ నిన్ను సత్యనిత్యధర్మలఁ గా విందు। నన ఘనీకుఁ భాషియయ్యె యిప్పు। డతఁ బుభుక్షితుండనై యున్న నాకు వా। హారవిఘ్న మిట్టులాచరింప * వ॥ సర్వభూతంబులు నాహా రంబున నజీవించు దిన ర్థిల్లు నది నామథత్వ ... వేదనం జేసి ప్రాణంబు వియోగంబను నగ్నైన వాపుత్తుబ

భార్యయు జీవింప నేరరొక్క కపోతంబురక్షించి పెక్కుజీవంబులకు హింససేయుట ధర్మవిరోధంబు ✽ క॥ ధర్మజ్ఞు
నపురుషులు । ధర్మువునకు బాధసేయుధర్మువు నెందుఁ । ధర్మముగా మదిఁదలఁపరు। ధర్మువు సర్వంబునకు హితంబుగ
యుఁ ✽ వ॥ ఇక్కపోతంబునాకు వేదవిహితంబైన యాహారంబు శ్యేనాః కపోతాన్ ఖాదయన్తియను వేదవచనంబు
లముగావున నిదినాకునాహారంబుగావలయు నిమ్మనినదానికిశిబియిటనియె ✽ గీ॥ ప్రాణభయమునవచ్చియిప్పక్షినన్ను
నాశ్రయించె నాశ్రితుఁడెట్టియధముఁడయిన । విడువఁడనినను నేనెట్లువిడుతుదీని నాశ్రితత్యాగమిదిధర్మువగునె
ను ✽ వ॥ నీవుపక్షివయ్యుఁను ధర్మమెఱింగినట్లుపలికితి శరణాగతపరిత్యాగంబునకంటె పెక్కులియధర్మంబొడెద్దనీయ
కలిదీననకాని యొంటనువశమింపదే నీయత్నంబాహారార్థంబయ్యేనేని యిప్పుడివ్వనంబున మృగమహిషవరాహ
మాంసంబులు దీనికంటెమిక్కిలిగాఁబెట్టెద నిక్కపోతంబువలని యాగ్రహంబువిడుముదీని నేనెట్లును విడువనన్న
నంబిట్లనియె ✽ గీ॥ నాకువిహితభక్షణంబిదియిప్పక్షి। బూనికావనీకుబుద్ధియేని। నవనినాథదీనియంతమాంసంబును
చినాఁకుబెట్టుతొలఁగకిపుడు ✽ చ॥ అనిననను గ్రహించితిమహావిహగోత్తమయంచుసంతసం । బునశిబి నత్తణంబయ
త్రికనాత్మశరీరకర్తనం । బనఘుఁడు సేసి చేసితనయంగమునంగల మాంసమెల్లఁబె । ట్టినను గపోతభాగమకడింది గడె
చునుండెన త్తులకా ✽ క॥ దానికినచ్చెరువడిధర। ణీనాథుఁడు దనువునందు నెత్తురుదొరుఁగం। దానతులయెక్కెనంత
నగుణోన్నతికిమెచ్చివాసవదహనుల్ ✽ వ॥ శ్యేనకపోతరూపంబులువిడిచి తమనిజరూపంబుఁజూపి నీధైర్యశౌర్యా
దిగుణంబుల నన్యసాధారణంబులుగావున నీకీర్తినిత్యంబై శబ్దబ్రహ్మంబుగల యంతకాలంబును వర్తిల్లుచునుండునని
శిబికివరంబిచ్చియింద్రాగ్నులు చనిరిది యమ్మహాపురుషు పుణ్యస్థానంబు మఱియు ననవరతఫలవృక్షంబులుగలయిది య
ద్దాలకియైన శ్వేతకేతు తపోవనంబిందు సరస్వతి మనుష్యస్త్రీరూపధారిణియై శ్వేతకేతునిసేవించె మాతులభాగినే
యులైనయష్టావక్రశ్వేతకేతులిందు గ్రతపంబుఁజేసిరనినం దష్టావక్రు మహాత్మ్యంబువినవలతునని యడిగిన యుధిష్ఠిరు

✽ రోమశుఁడు ధర్మజునకు నష్టావక్రుచరితంబు చెప్పుట. ✽

నకు రోమశుండిట్లనిచెప్పెఁ దొల్లియేకపాదుండను మునివరుండు తనవిద్యావిభవంబున సుజాతయనుదాని వివాహం
బైవనంబున ఘోరతపంబుచేయుచు ననవరతంబును శిష్యులవేదంబులు చదివించుచున్నఁ బెద్దగాలంబునకు సుజాత
గర్భిణియైనఁదద్గర్భంబునఁనున్న యర్భకుం డొక్కనాఁడు తండ్రికిట్లనియె ✽ క॥ ఏకంబడకయహోరాత్రులు। వడిఁ
నిచదివింపనిట్లువలయునెశిష్యుల్ పెక్కుమనిద్రలేమి నెంతయు। జడమతులై చదువుచెప్పఁ జదువుచునుండన్ ✽ వ॥ అనియు
లంభించిపలికిననగి యేకపాదుండు నీవధ్యయనంబునకు వక్రంబుగాఁబలికితివి గావున నెనిమిదివంకలుగల శరీరంబు
తోజన్మింపుమనికొడుకునకు శాపంబిచ్చిన ✽ గీ॥ అగ్నికల్పుఁడైమహాత్ముఁడు కడుపునఁ । బెరుగుచుండెనంత సరసిజాక్షి
ప్రసవకాలమైనఁ బతికొక్కనాఁడిట్టు। లనియెఁబ్రసవభారమునకునలరి ✽ క॥ ధరణీగడుఁ బేదవారము। బురిటికిఘృతతైల
ధాన్యములఁ జెచ్చెరముం। దరసంగ్రహింపుమవిమన। కరుకుగనతిదుర్లభంబు లర్థము లేమిఁ ✽ వ॥ ఏమిసేయుదునిప్పు
బునకీప్రసవక్లేశంబెట్టువాయుదునని యనేకపాదుండు ధనార్థియయి జనకరాజుపాలికిం జని వానియజ్ఞంబునందు వ
ణపుత్రుండైనవందితో వివాదంబు సేసి యోడిపడి లజ్జామగ్నుండై యున్నయిట సుజాతప్రసూతియై యష్టావక్రు
నొందెనక్కాలంబున నుద్దాలకుభార్య శ్వేతకేతుం గనియె నిట్లు మాతులభాగినేయులిద్దఱు సవయస్కులై పెరిగి పండ్రెండే
డ్లొక్కటను ద్దాలకునొద్దఁ జదివిరయ్యధ్యయనశీలురై యుండు ✽ గీ॥ తండ్రియనుచునుద్దాలకుఁ దనకుఁగరము ! ప్రీతితో శ్వే
తకేతుని భ్రాతయనుచు। ననఘచరితుఁడష్టావక్రుఁడనుదినంబు। నొండెఱుంగక సుఖలీలనుండునంత ✽ క॥ ఒక్కనాఁ
డుద్దాలకునురువెక్కియున్నయష్టావక్రుఁ జూచి శ్వేతకేతుండు సహింపక నీవేల మాయయ్యకురు వెక్కియుండెదీవు
మీయయ్యకురువుననుండుమని చేయిపట్టియీడ్చిన నేడ్చుచుం దల్లికడకుం జని యష్టావక్రుండిట్లనియె ✽ క॥ మాయయ్య
వ్యారెక్కడఁ బోయెంజెప్పుమని తెల్లముగ నడిగిన సుశ్రీయుతుఁడు తండ్రికడకుం బోయెందనమామ నెయ్యమునఁ దో
డుకా ✽ వ॥ ఇట్లష్టావక్రుండు దానును శ్వేతకేతుండును జనకరాజుయజ్ఞంబునకుం జనియందు ద్వారికనివారితులై మూ
ఢబధిరవంబుస్త్రీబ్రాహ్మణులకు వేళంబగుచున్న రాజద్వారంబున నమ్ముము విద్వాంసులు బ్రాహ్మణుల నేలనాగింపె

రనినదౌవారికుండిట్లనియె * క ॥ అలఘులనువృద్ధవిద్వాం।సులకుమహాయాజ్ఞికులకు(జొరనగ్హంబై ।విలసిల్లుయజ్ఞసభ సా
రవలదుచనుండీ పఃబుతవారలరనినక * క ॥ అలయికయేండ్లుగఘంబె। కుక్కలుజీవించుట నెరగలుగుటయుండగువృ।మ
లలతుణమేజ్ఞానము।గలఁడేనిక బాలుఁడై నఁగడువృద్ధుమహిక * వ ॥ కృతాధ్యయనశీలుండై యాచారపరుండై నవాఁ
డుబాలుఁడయ్యునుసర్వజనసంభావనీయుండును సర్వజనసంస్తవనీయుఁడగుబాలురని పమ్మునవమానింప వలవదేము
జనకరాజసదనంబున దర్పితులైనవేదవాదులతో వాదంబుసేయసమకట్టివచ్చిన వారమనినదౌవారికుండు వారినవ్వ
డుజనకరాజానుమతుండై లబ్ధప్రవేశులం జేసెనంత * సీ॥ జనకభూపాలునిసంప్రశ్నముల కెల్లనేర్పడనుత్తరంబిచ్చివా
ని సభయందుభూసురసంఘమధ్యంబునవరుణపుత్రుండైనవందితోడ । వాదంబుసేసిగర్వంబుననాతనినోడిచితద్విజ
వులై యొదిగియున్న।ధరణీసురులఁదనతండ్రితోనిగ్రహముక్తులఁ జేసెనమ్మునికుమారుఁ * గీ॥దధిక తేజుఁడష్టావక్రుఁడఖి
లలోక।పూజితుండై నజనకు చేఁబూజలందె।యేకపాదుఁడుదోషాకరుఁడైయేగుదెంచె।బుధనుతుండుగజాశ్రమంబునకునొప్ప
వ॥ అనిచెప్పచునరిగియిదిసమంజసయనుపుణ్యనదియిందుభరతుండురాజ్యాభిషిక్తుండయ్యెఁదొల్లియింద్రుండుదీనిజలో
పస్పర్శనంబున లక్ష్మీప్రాప్తుండయ్యెనిదిమైనాకకుక్షియిందదితిపుత్రార్థినియైతపంబుసేసెనిదిభృగుషిదైవతంబైనక
నకశిలానగంబిందుసనత్కుమారుండుసిద్ధింబొందెనిదిపూష్ణింసంగంబిందుఁగృతస్నానులై నంగృతాఘులసదురురైభ్యాశ్ర
మంబిది భరద్వాజాశ్రమంబిందుభరద్వాజసుతుండయవక్రీతుండు దపోవిద్యాగర్వంబుననపగతజీవుండయ్యెననినది

రోమశుఁడుధర్మజునకుయవక్రీతుచరిత్రంబుచెప్పుట.

విట్లనిధర్మతనయుండడిగినరోమశుండిట్లనియె * క ॥ అలఘులురైభ్యభరద్వా।జులుదమలోసుహృదులై విశుద్ధతపోని।
శ్చలితమతులివ్వనంబున।నోలసితపంబొప్పఁజేయుచుండిరినెమ్మిక * వ॥అందురైభ్యుండుగృతాధ్యయనశూరులైనయ
ర్థావసుపరావసులనుతనయుల్దనపుత్రులతో విద్వత్పూజితుండై యున్నవానింజూచిసహింపనోపక భరద్వాజసుతుం
డుదపోబలంబుననఖిల వేదశాస్త్రాగమంబులుపడయుదునని సమిద్ధంబైనయగ్నియందుధాయ్యసంధించుచు నుగ్రతపం
బుసేయుచున్నవానిసహింపనోపక నింద్రుండు వానియొద్దకువచ్చినీవేమియుద్దేశించియుగ్రతపంబుఁ జేసెదవనిన
యవక్రీతుండిట్లనియె * గీ ॥ చదువకయును నాకుసర్వ వేదంబులు।సర్వశాస్త్రములునుసంభవిల్ల। వలయుననితలం
చివదలకనిష్ఠతో।నుగ్రతపముఁజేయుచున్నవాఁడ * వ॥అనినవానికింద్రుండిట్లనియె * క ॥గురుముఖమునఁబడయకదు।ష్క
రతపమునఁజేసిపడయఁగాఁబడువిద్యల్ ।పరమార్థమైనదమునను।త్సరమునుగావిఁచునెట్టిసాధులకైనక * వ ॥ ఇదివి
ద్యోపార్జనంబునకుపాయంబుగాదనివారింది నాసవుఁడరిగినను యవక్రీతుండెప్పటియట్లతపంబుఁ జేయుచున్న
నదీయతపస్తప్యమానుండై వృద్ధశ్రవుండువృద్ధవిప్రరూపంబుధరియించియశక్తుండై శోషింఁచినశరీరంబుతోడసికతాము
ష్టివరంపరనపారగంభీరగంగాప్రవాహంబునందు సేతుబంధంబుచేయుచున్నవిప్రుఁజూచియవక్రీతుఁడిట్లనియెఁ క॥శ
తవర్షవృద్ధుఁడవుసీ। వతికృశుఁడవశక్యమైనయర్థమునందా । తతశక్రజేసికడుదు । రత్తివైతింకెన్నఁడిదినమాప్తింబొం
దక * వ॥ అనినవినియింద్రుండువానింజూచియేనునీయట్లయఘటమానంబైనయర్థంబునందుయత్నంబుఁ జేసెదననినిజ
రూపంబుఁజూపి యిట్లునిరర్థకప్రయాసంబేలచేసెదుశుగుమనిన నేనెట్లునుమగ నాయభిమతంబు సఫలంబు సేయవ
లయునని యవక్రీతుండుశతముఖువలనం దనయభిమతంబువడసితత్కారంబుఁ దండ్రికిం జెప్పినవిని భరద్వాజుండు
డుకుగర్వంబుసహింపక వేదగీతలైనగాథలయర్థంబువానికినిట్లనిచెప్పె * సీ ॥ బాలాధియనుమునిప్రవరుండుపుత్ర
శోకావిష్టుఁడై ఘోరమగుతపంబుఁ । జేసివేల్పులదయఁజిరజీవిగాఁబుత్రుఁ బడసెమేధావినాఁబరఁగువాని। వాఁడునా
యుష్యగర్వమునమునీంద్రుల నెవ్వరి మెచ్చకయేగిరెుక్క । ధవళాక్షుండనుతపో ధనునొద్దగర్వించి పలికిననలిగితప
స్వివాని * గీ॥నంతకాంతికమునకరుగంగఁజేసెగ।ర్వంబుచెట్టయెట్టివారికైనఁ। గ్రాఁచుఁ[illegible]గర్వంబుగర్వంబు।నుడిగి
యున్నవాఁడయుత్తముండు * వ॥ కావుననీవుగర్వంబువిడిచియుకోపనుండవై పరమశాంతులైనరైభ్యకొడుకులతోడనిర్మ
త్సరుండవయియుండుమనిన నట్లుసేయుదునాకు రైభ్యుండుభవత్సమానుండయని యవక్రీతుండుతనవిద్యావిభవంబు
మునిసభలవిస్తరించుచు నొక్కనాఁడు రైభ్యాశ్రమంబునకుంజనియందు * ఉ ॥ కోమలకీరపుష్పరణకోకిలనాదమనో

హారంబున । గ్గామవసంతపుష్పభరితక్షితిజప్రకరంబునైనయా । రామమునందుఁజూచెమునిరాజకుమారుఁడు నైభ్య
కోడలిఁ। దామరసాక్షిఁగ్రన్ననయనుదానిఁబరావసుభార్యఁబ్రీతితోఁ ॥ గీ॥ దానిఁజూచిమదనతప్తుఁడై తనయభి। ప్రా
యముఁగఁజెప్పెఁబంకజాక్షి। కదియుశాపభీతినప్పటికోడఁబడి। నట్లుపలికిపెలుచనరుగుదెంచి ॥ క॥ తమమామనకుఁదద్వృ
త్తాంతమునంతయుఁదెలియఁజెప్పెతరుణివిలోలా । క్షముల౦దుబాష్పసలిలో।ద్గమముగఁదలవంచియుండెఁగడుఁగోప
నత ॥ వ॥ రైభ్యుండునయ్యవక్రీతునకలిగినిజకోపానలశిఖాయమానైకజటావలంబనకరుండై హుతాశనునందు వేల్చి
యయ్యగ్నికుండంబునందు ॥ క॥ లలితాంగఁబడసెఁదనకో। డలిరూపముకంటెఁగడుబెడంగురూపో।జ్జ్వలకాంతిగలుగు
నిఁ। బోలఁతుకనొక్క రుఁదనతపోవీర్యమునన్ ॥ వ॥ మఱియు నొక్కజటయవలంబించివేల్చిననందువికృతదంష్ట్రాకరా
ళ నమూఖంబుతోఁ శూలహస్తుండైన యొక్కరాక్షసుండుపుట్టెనయ్యిద్దఱుముకులీకృతహస్తులై మాకుంబనియేమని
యడిగిననవినీతుండైనయవక్రీతువధియింపుండనివంచిన ॥ క॥ ఆతరుణిమున్ను సనిసదానాతురుఁడై విగతచేష్టుఁడై
న్నయవక్రీతుకరకమండలువుం । బ్రీతిఁబ్రబోధించికొనియెబెడఁగుగనంతన్ ॥ క ॥ అపహృతకమండలుండై। య
త్రుండగుటఁజేసియధికతపోవీర్యవరిక్షయమగుడునువా। తపస్విసుతురాక్షసుండుదడయకతాఁకెన్ ॥ వ ॥ వా
అదియవక్రీతుండుకోలంకులకుమహానదులకుఁజొచ్చిననవిశుష్కంబులై నేదనజనకునగ్నిహోత్రంబుఁజొచ్చెన
గీ॥మునికుమారునెగిచికొనివచ్చి నిశితశూ।లాయుధమునఁబొడిచియాతురమున। రక్కసుండుచంపియక్కాంతయును
ము।నరిగెరైభ్యకడకునతఁడంబ ॥ వ॥ రైభ్యుండునువానికిభార్యఁగాగ్యత్తినిచ్చెనంతనిటభరద్వాజుండువనంబున
డవచ్చితొల్లితనకెప్పుడుంబ్రత్యుత్థానంబుఁ జేయునగ్నులప్పుడడంగియున్నవచ్చెరువడిగృహపాలకుండైనశూద్రు
ననంతవృత్తాంతంబెఱింగివిహతుండైనపుత్రుంజూచిదుఃఖితుండై ॥ గీ ॥ రైభ్యుఁడధికకోపరతుఁడంటినమ్మని। య
శ్రమంబుదెసకునరుగవలవ।దంటినీనఁగనొల్లనైతివావలుకులు।గర్వితునకుబుద్ధిగాననగునె ॥ వ ॥ అనిప్రలాపించుచు
రద్వాజుండు వానిదహించిపుత్రశోకదహనంబు నహింపనోపక తద్దహనంబున దేహత్యాగంబుఁ జేసెనంతబృహ
ద్యుమ్నుండనురాజుసత్త్రయాగంబుఁజేయుచుండి రైభ్యపుత్రులనర్వావసుపరావసులందనకు ఋత్విజులంగా వరిం
చిననయ్యిరువురుదండ్రిచే ననుజ్ఞాతులై వానియజ్ఞంబునడపుచున్న నొక్కనాఁడు పరావసుండు నిజాశ్రమంబునకు
చ్చువాఁడు వేగుఁబోకచీఁకటి నేకతంబతనకు నెదురుగావచ్చు రైభ్యునెఱుంగకమృగంబుగావగచినిజప్రాణభయంబున
వధియించి పదంపడియెఱింగి పరమదుఃఖితుండై ప్రేతకార్యంబులుదీర్చిబృహద్యుమ్నుసత్త్రంబున కువచ్చి తనచేసి
తృఘాతంబగ్రజునకుంజెప్పియిట్లనియె ॥ గీ ॥ నీవుదీనినొక్కరుఁడవునిర్వహింప। నోపవేనొక్కరుండనయ్యామఖ
డుపనోపుదుఁగావునవాతదర్థ।మాచరింపుముబ్రహ్మహత్యావ్రతంబు ॥ వ ॥ అనిననర్వావసుండట్లుసేయుదునని బ్రహ్మ
హత్యావ్రతంబులు సలుపుచుండెఁబరావసుండును నొక్కరుండసత్త్రయాగంబు జరుపుచుండెనంత నర్వావసుండు బ్ర
హ్మహత్యా ప్రాయశ్చిత్తంబులఁజేసియాసత్త్రయాగంబునకువచ్చినవానింజూచి పరావసుండు బృహద్యుమ్నున
నియె ॥ క ॥ ఇమ్మునినీయజ్ఞాయత । నమ్మఁబ్రవేశింపఁదగఁడునరనాయకయు।గ్రమ్ముగసలిపెఁబుభకా।ర్యమ్ములకు
నీబ్రహ్మహత్యావ్రతముల్ ॥ వ ॥ అనవుడుబృహద్యుమ్న ప్రేరితులయినజనులచేతనుత్సార్యమాణుండయి యర్వా
వసుండనియెఁబరావసుండు గానియేనుబ్రహ్మహత్యాపాతకుండఁగానువానికివ్రతంబుసలిపితత్పాతకవిముక్తుండన

దేవతలర్వావసునకు మెచ్చికోరినవరంబులెల్లనిచ్చుట.

నవిచెప్పిననర్వావసుయథార్థకథనంబునకు మెచ్చియగ్నిపురోగములైనదేవతలువానికిట్లనిరి ॥ గీ ॥ తమ్ము చేసినదురిత
ములఁగఁబూని । ధర్మబుద్ధిమైవ్రతములు పేర్మిసలిపి । తనఘనీకునభీష్టంబులైనవరము । లడుగుమిచ్చెదమీ మెచ్చుగలు
నగునె ॥ వ ॥ అనినఁదనతండ్రియుభరద్వాజుండు నవక్రీతుండు నెప్పటియట్లజీవించియుండనునిజజనకుండు పరావసు
చేతనిహతుండగుటవిస్మరింపవలయునని ప్రార్థించి దేవతలవరంబున నర్వావసుండు రైభ్యభరద్వాజావక్రీతుల సం
వితులంజేసినన దేవతలకునవక్రీతుండిట్లనియె ॥ గీ॥ ఏను వేదశాస్త్రమ్ముల నెఱిఁగి వ్రతము। లెల్లసలిపియా రైభ్య చేసి
సితుఁడనైతినాకంటెరైభ్యునకధికత । యెనతెఱఁగేమియనినవిట్లనిరిసురలు ॥ క॥గురుసుశ్రూష యొనర్చుచుఁబ

క్లేశమునఁ జేసి వడసిన విద్యల్ । స్వ్యాగియించుఁ గాక గురుముఖ । విరహితముగఁ బడసిన విద్యా వెలయునె యెందుఁ ॥ ॥ వ ॥ నీవు
గురుముఖంబునం బడయక యొండు విధంబునం బడయుటం జేసి నీయధ్యయన వ్రతంబులు నిర్వీర్యంబులయ్యె గురుసంతోష
కరుండైన రైభ్యుండు బ్రహ్మజ్ఞానం బవలంబించెం గావున నాతం డిట్టి శక్తి వడసెనని దేవతలు దివంబునకరిగిరిదియు వక్రీతు
సవాసంబంధము వసియించినవారు దురితవిముక్తులగుదురిది కాలశైలంబిది సప్తశతవిధంబైన గంగ యిది మనుష్యులకగో
చరంబిందు నానాప్రహరణపాణులై యష్టాశీతిసహస్రగంధర్వులు కిన్నరకింపురుషసువర్వులును రేంద్రుఁ గొలిచిపోయె
దరిందులకాలు నూఱు యోజనంబులుగలదు కైలాసపర్వతంబందుఁ గుబేరుండుండు ననిరోమశుండు సెప్పినం బాండవు
లుకృతసమాధిశీలురై వారి నెల్లఁ జూచిరంత నంతకసుతుండు భీమునకిట్లనియె ॥ సీ॥ దుర్గమంబైనయీదుర్గమార్గంబున నన
ఘులంగ నేగమున్న తరథముల । నింద్రసేనాదుల నీధౌమ్యవిప్రుల విప్రవరతనూజను దోడికొనుచు । సహదేవుఁడును నీవుచ
య్యనఁ బ్రస్తుఁ డేను సకులుండు నేగిరొమ । ఆదేశమునఁ జేసి యఖిలతీర్థంబులు వాడి వచ్చెద మహాయశుగుదెంచు ॥
నంత కెంతయును బ్రయత్నంబుతోఁ గృష్ణఁ గాచియుండుఁ డనినఘనుఁడు భీముఁ డిట్లనియె యోట్టి రాత్రు సాక్షిణ్ణవనముల నిన్ను
బాయఁ దగునె నిను మీవమేని ॥ చ ॥ అనఘచరిత్ర నగ్నుమహాభుజు నొక్కఁడ నిం బాసి నంతఁ బొం । దిన మొడవిట్టిచోట సహ
దేవుఁడు నేను సుకృష్ణయుఁ గాజగ । జ్జనముత నిన్నుఁ బాసిన నశక్యతరంబగు తీవ్రతాపవే । దనయగు మీకు మాకు నిటం బెవర
స్పరభేద మెన్నఁడుఁ ॥ క॥ కడుఁ డస్సిన డవనోపని । యెడనీ కమలాయతాక్షి నీకవలను నేఁ । దడయక యెత్తుకొనిడికొని
డక్కఁ గొనివత్తు నిమ్ము గహనాంతములన్ ॥ వ॥ ఈకథఁ బులతోఁ బోవనిమ్ము గాదేని వీని నింద్రసేనాదుల నెందేనిం బెట్టి
పోదము నిన రోమశుఁ డిట్లనియె ॥ క॥ అతులతపోవీర్యబలో । న్నతపోదము గంధమాదనంబున కుసమా । హితుసంపుఁ గాంతు
మగ్జ్నును । నతి నీసమదారు సురగణార్చితుఁ బార్థున్ ॥ వ ॥ అనినసంయమి సంతసిల్లి యనుగు వారు ముందఱనే కవహాయ
రథసవాథంబై యపారకిరాత జనసంకులంబైన చానిఁ బుళిందాధిపతియైన సుబాహుపురంబుఁ గని యందువారి చేతం
బూజితులై తమరథసూత హయానహంబుల నింద్రసేనాదిభృత్యులను సుబాహునొద్దం బెట్టి పాదచారులై పాం
చాలిని బ్రాహ్మణులను రక్షించికొని గంధమాదనంబున కభిముఖులై యరిగి రంత ధర్మతనయుండు భీమునకిట్లనియె ॥ సీ॥
అలిగివర్ణా యుధునైన నను బోరిలో నోర్వంగనోపు నత్యుగ్రవీరు । జవమునఁ బవనుఁ దేజంబున నాదిత్యుఁ బోలిన పావనం
భోజనేత్రు । నాయతబాహుఁ గృతాస్త్రు బృహన్నకథు సర్వధనుర్ధరాచార్యు విజయు । నిత్యతుషాన్వితు నీతమ్ము నగ్జ
ను శుభగుణసుందరుఁ జూచునంత ॥ గీ॥ నధిక తాపతప్తమైనది నాచిత్త । మొదవరనతిని తోడనొక్కటనుని కి । యెన్నఁడొక్కొ మన
సునిండ నకు నాతఁ । డేలమనలెనెక్కొ యిన్నియేండ్లు ॥ మ॥ అనుచుం బార్థవిలోకనంబున దిలోనర్థించుచుం ధర్మజుం ।
కనుజుల్దాననువేడ్కతో నరిగి తారప్పాండవుల్లంధమా । దనశైలేంద్రముగాంచి దున్నతబృహద్ధాతుస్థలీ సంహాతిక్ । ఘ
నసంధ్యాగమశంకసన్ము నులకుం గావించుదానిన్ మదిన్ ॥ క ॥ నానావర్ణశిలావిహ । గానేకమృగాభిరామమై భూనారీ ।
నానాభరణవిభూషిత । పీనోన్నతకుచముఁ బోలె వెలిఁగె మహాద్రిన్ ॥ క॥ లలితాచ్ఛస్ఫటికశిలా । తలముల పైఁ బాఱు విమ

## పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట.

లతర నిర్ఝరిణీ । జలపూరములను వాతో । ల్లలదంబురుహాళి నుజ్జ్వలంబగు దానిన్ ॥ ఉ॥ వారలు గంధమాదనము వార్యబ
లాఢ్యులు పొచ్చ్చ చోమహా । మారుతముప్పుడి వీచెను హిమద్యుతిమార్గము దిఙ్ముఖంబులం । భోరుహవత్రమిత్రు నెడభూరి
పరాగముగప్పఁ గాధరి । త్రీరుహశాఖలున్ విఱిగి తెళ్ళఁగ గుల్మలతాలి సాల్పడన్ ॥ చ॥ కడువడిగాడ్పు చేసియుఁ గగాఁ బడి
త్రెళ్లును హీకుహాళిచ । ప్పడువిని యుండలుం బెదరి భూమివయున్గగనంబు డగ్గఱం । బడియె నొకశైలశృంగములు భగ్నము
లయ్యె నొయంచు ధూళినె । క్కడఁ జనలేకయొండొరులఁ గానక యుండిరి సంచలాత్ములై ॥ వ ॥ ఇట్లు మహారేణుపటలం
బంధకారంబునుంబోలె నీరంధ్రంబై కప్పినఁ దరుగుల్మలతావితానంబులు కరతలంబులం బాయక ద్రోయుచు విశాలదృ
ఢతరగుహామూలంబులాశ్రయించి యగ్నిహోత్రంబులతో ధౌమ్యధర్మజ సహదేవు లొక్కచోట నుద్యద్గదాకార్ముకుం
డై నభీమసేనుండును ద్రౌపదియు నొక్కచోటను రోమశుండును నకులుండును బ్రాహ్మణులు నొక్కచోటనుగా నండఱు
వేఱువేఱ నుండి రంత ॥ చ॥ మరి సెఁ బ్రచండవృష్టి సుమహాఘనములెంకెల కుల కభయం । కరముఁ లుగాఁ గరాళకరకా

తతులొప్పం దటిల్లతాళివి। స్ఫురితముగాం బ్రపూర్ణజలపూర మాలస్గిరికుంజభూరిది । గ్ఘరతటినీవిశాల తటపా
యంబు విమూలితంబుగఁ * వ ॥ అట్లుగాడ్పుతోడివాన పెద్దయుం బ్రొద్దు కురిసి యుడిగిన నందఱునొక్కచోట
చ్చియెవ్వటియట్లయరుగునెడ నతిః విషమశిలాసంకట పథంబుననడువనేరక ద్రౌపదితోడరి మూర్ఛితయైనం బవన
యుండకోమలినెత్తికొని యజినాస్తరణంబుపయింబెట్టి కదలీదళంబులవీచుచున్నంగవలుదానితామ్రపల్లవపాదము
బులాయుధాభ్యాసవశంబునం గిణీభూతంబులయిన తమకరంబులమెత్తనయొత్తుచుండి రట్టియవసరంబునం ద్రౌ
జూచిదుఃఖితుండయిధర్మతనయుండిట్లనియె * అక్కర॥ అరుణసరోరుహమృదులంబులైనయిత్తన్వి । చరణంబులుగ్
గరాలపయిం జనుటం జేసి। పరుసంబులైయెట్లునైనయవిపద్మాయతాక్షి। వరంగనాకారణమునదుఃఖభారముదాల్చె
సముచితంబుగమృదుశయనతలంబున శయనించునిత్తన్వి సదమలాంగి। పరుసంపుఱాలపైం బడితీవ్రవేదనం బొందిన
మహాపురుషులైన । పాండవులకుం బ్రియభార్యయైన నాపుత్రి సుఖముండుననిమదిసోమకుండు। పాయక సంతోషపడియు
డుంగాకున్నెయనివిలాపించునయ్యమతనూజు * గీ॥ నుతితవచనరచనమూరార్చి రప్పుడు। ధౌమ్యుండాదొట్టిసకలధరణిసురు
మూర్ఛవేతెఱంతఁ జదిరి ద్రౌపదిశీత। మందపవనసేవ్యమానయగుచు * వ ॥ దానినాశ్వాసించిధర్మరాజుభీమునకి
యె * క ॥ ఈరాజపుత్రిం దోడ్కొని। దారుణపాషాణవృక్షంబునం జనంగా। నేరమిదినడువనోపదు। భూరిభుజాయుధు
నిలువు త్రుండంతెకఁ * క ॥ అగ్రజుననుమతమునన । త్యుగ్రనిశాచరసమేతుసుమార్గణుపీ। రాగ్రణిఘటోత్కచు
న। యగ్రసుతుండలం చెదీరుహైడింబువేసఁ * క ॥ అతండును రాక్షసపైన్య। న్వితుండై తత్క్షణమ వచ్చి నిగ్రహవరసం
తులకుం బ్రణమిల్లెందన। పితృవరులకు బ్రాహ్మణులకుం బెద్దయుభక్తిఁ * వ॥ ఇట్లు మ్రొక్కి వనియేమియానతిం
తహస్తుండయితనముందరనున్నకొడుకుం గౌంగిలించుకొనిభీముండువానికిట్లనియె * గీ॥ అబలయిదిభవన్మాతనిత్యాధ్వ
మన। ఖిన్నయైనది గజరాజఖేలగమన। దీనినీవెత్తికొనిచనుదెమ్ము మాస। మీపమునననుతునియమించెపుడు * వ ॥ వా
డునుబిత్రు వచనచోదితుండై యిమ్మార్గంబతిపరుష శిలావిషమంబు। పాదచారులకగమ్యంబుగావున మిమ్మందఱనెత్తి
నియశ్రమంబుననరిగెదనని ధౌమ్యపాండవద్రౌపదులం దానెత్తికొని బ్రాహ్మణులనెత్తికొనం దనరాక్షసబలంబు
బంచెరోమశుండు సిద్ధగతినరిగె నిట్లందఱుగగనమార్గంబునంజని గంగాతీరంబుననరనారాయణాశ్రమంబైన బదరీ
వనంబుఁగనియందఱు రాక్షసస్కంధావతీర్ణులైయందు * క ॥ లలితమధుస్రవఫలములు। విలసితమృదుపత్రతతులువృక్ష
స్కంధంబులు నవిచలితచ్ఛాయలు । గలబదరీతరులం జూచికడువిస్మితులై * వ ॥ సురసిద్ధమునిసేవితంబయిన భాగీర
యందుం గృతస్నానులయినియమవ్రతంబులు సలుపుచు సమాధియోగంబున మైనాకశైలంబును హిరణ్యశిఖరంబును
బిందుసరంబునుంజూచి బదరీవనంబునం బాఱుదివసంబులునివాసంబుం జేసియుండునంతనొక్కనాఁడు * చ॥ అలఘుగం
ధమాదనమహాధరణీధరసానురత్నవే । దులం బవమాననూనుఁడును ద్రౌపదియున్విహరించుచున్నచో । ఫలితసహస్ర
పత్రకమలంబుసమీరవిధూతమెనుహీ। తలమువయిన్వడింబడియె దద్దయుం బొల్పుగవారిముందరన్ * వ ॥ ఆసౌగంధిక
మలంబుం జూచి దానియపూర్వరమణీయత్వంబునకునన్యకుసుమసాధారణంబయినసౌరభ్యంబునకు నోటువడి ద్రుప
రాజపుత్రి ముదితచిత్తయైయిక్కటాయిదియొక్కపువ్వయయ్యునపూర్వంబై మనోనయనానందకరంబైనదియిట్టికుసు
మంబులుకొన్నింబెక్కులుగావలవదెయవిపురంగటంగల వేనితెచ్చియిచ్చి నాకుమనఃప్రియంబుం జేయుమనియిప్పుడయప్పు

## * భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట. *

ధర్మరాజుకడకుంగొనిపోయెదనిటభీముండు దానియభిమతంబుం జేయంగడంగి రుక్మపృష్ఠంబైనధను స్స్తంబును నాశీవి
పమానమ్ములైనబాణంబులుధరియించియక్కమలంబులుదెచ్చినగాడ్పునకభిముఖుండై గాడ్పువట్టిగంధమాదననితంబ
బంధురకందరదర్శనస్పర్శనంబులను నళికులకోకిలాలాపశ్రవణంబులను సర్వర్తుకుసుమసురుచిరగంధాఘ్రాణంబున
తిమధురఫలాస్వాదనంబులును బద్ధప్రమోదహృదయుండగుచుం దనకెదిరివచ్చుమృగంబులం దాఁకి గజంబునెత్తిగజంబు
పైవైచుచు సింహంబునెత్తి సింహంబుపైవైచుచు నల్పమృగంబులం గరతలప్రహారంబులం బ్రహరించుచు * సీ॥ గమనవేగం
బున ద్రుమలతాజాలసంచలనంబుం జేయుచు శైలగుహాల। నడఁగియుద్భృశ్యత్తెకడు వేఁడ్కతోఁదన్నుఁ జూచుఖేచరసిద్ధ

భుజంగ గరుడగంధర్వకిన్నరకామినీజనచేతమానుగానభివీక్ష్యమాణుఁడగుచు । మ్రాఁకులువిఱుచుచువీకతోఁదీగలఁబె
ఱుకుచుఁబదహతిఁబృథువగేంద్ర ॥ గీ॥ నందమున్నతంబులగు నెడలెక్కుచు మదగజంబువోలెమధ్యముండు పవనవైనతేయ
పటుజవయుక్తుఁడై । యరిగెగంధమాదనాంతరమున ॥ వ ॥ ఇట్లరుగువాఁడు నిజసింహనాదశ్రవణపరిత్రస్తంబులైన
గనివఱచు పక్షులయాగ్రపతంబులఁజూచి ముందట నాసన్నంబునం గొలనుకలదని నిశ్చయించి యతిత్వరితగతిఁజని
చనిపవనవేగవంచలితటనుహానవనతమాలతాల హింతాలవిశాల కదలీదళవీజ్యమాన శీతలజలపరిపూర్ణంబైన యొక్క
సరోవరంబుఁగనియందుఁ గృతావగాహుండైన వనలినదళమృణాళవలయాలంకృతుండగుచు దానివెలువడియనేక
యోజనవిస్తారాయామరమణీయంబైనకదళీషండంబుఁజొచ్చియందు శంఖధ్వానంబుఁజేసిన ॥ క ॥ ఆశంఖరవంబుమ
హేంద్రాశనినిర్ఘోషభీమమైదిక్కులునా । కాశంబునిండెనంతగు । హాశయనుండైనహనుమయనుకపి పెలుచన్ ॥ క॥
దానివినిబెదరిలేచిమ హానాదంబిదిమశగ్ల ప్రియంబయ్యెఁ బుడీ యానుజుశంఖధ్వానము దానగుననియెఱిఁగిహృష్టతనురు
హుఁడగుచున్ ॥ వ॥ భీమునకుమార్గనిరోధంబుగామహావృక్షంబులురులంద్రోచియేకాయనపథంబునకడ్డంబుగాశయనిం
చిలాంగూలలీలాచాలనంబుఁజేసిన ॥ క॥ గోలాంగూలోత్తములాంగూలస్ఫోటనరవంబు ఘోరంబైవాచాలతఁజేసెనశేష
మ్ము గాలిభయంబందిగిరిగుహలకుంభాజన్ ॥ వ ॥ అయ్యపూర్వధ్వనివినిభీముండువిస్మితుండయిచనికదళీషండమధ్యం
బుననొక్కవిశాలశిలాతలంబునశయనించినవాని ॥ సీ॥ హ్రస్వపీనగ్రీవునచలితాయతహనునతిచపలస్వభావాభిరాము
దనుమధ్యకటిచ క్రుదహనకణాకారతామ్రోష్ఠునతికృశదశవకరజు । బృథులవిద్యుత్పుంజపింగాక్షును తుంగదృఢవ
క్షునక్షీణదీర్ఘ బాహు నూర్ధ్వలాంగూలమత్యున్నతధ్వజలీలఁగ్రాలుచుపుండ నేకాంతయోగ ॥ గీ॥ నిద్రనున్నధర్మనిర
తుహనుమంతుఁజూచి పాండురాజసుతుఁడు వాని నిద్రఁజెఱుపఁగడఁగి నిజసత్త్వమేర్పడ సింహనాదమొప్పఁజేసెడాసి
॥ వ ॥ హనుమంతుండును మెల్లమెల్లన మేల్కనిజృంభసంభృతజలాగ్రసంచలవిలోచముండగుచునాదరంబుననాతనిం జూ
చియిట్లనియె ॥ గీ ॥ అతిజరారోగభయమునవలసియున్న వానినీతోడఁబుట్టినవానినన్ను నొదిగిసుఖనిద్రమైనట్టులున్న
వాని నేలబోధించితయ్యానీవెఱిఁగియెఱిఁగి ॥ వ ॥ తిర్యగ్జాతులుధర్మమెఱుంగవుగాక సర్వభూతదయాస్వరూపంబైన
ధర్మ వెఱింగెడువారు మనుష్యులుగారే యిట్టిమనుష్యజన్మంబువడసి వృద్ధోపసేవసేయువుగా కేమిధర్మువెఱుంగకని
ర్దయుండవై మాబోటి పెద్దమృగంబులకు భయంబుగఁ గర్జిలితి నీవెవ్వండవు మనుష్యులకగోచరంబగు నివ్వనంబునకేల
వచ్చితి సిద్ధగతిలేనివారి కిటఁబోవనశక్యం బమృతకల్పంబులైనయీఫలమూలంబులుపయోగించి క్రమ్మఱుము నీయందు
బద్ధస్నేహుండఁగాన బుద్ధిఁజెప్పితి నాపలుకులుచేకొనుమనిన భీముండిట్లనియె ॥ గీ ॥ క్షత్రియప్రవరుండవిఖ్యాతబలుఁ
డఁబాండుతనయుండఁ గొంతిగర్భంబునందు । వాయువరమునఁబుట్టినవాఁడనన్ను । భీముఁడందురు భూజనులుకపిప్రభు
॥ వ ॥ పనిక్కడఁగార్యార్థినై పోయెదనాకుం దెరువీనినాఁడు దొల్లిశతయోజనవిస్తారంబయిన సముద్రంబులంఘించిపోయి
నహనుమంతునట్లనిన్నునీపర్వతంబు లంఘించిపోవుదుననిన హనుమంతుఁడేమికారణంబున సముద్రలంఘనంబుఁజేసె
నీవెఱుంగు దేనిం జెప్పుమనిన వానికిభీముండిట్లనియె ॥ క ॥ ఆలఘుండిక్ష్వాకుమహా కులవీరుఁడు రాఘవుండు గురువచనం
బున నలువవనవాసియై తనలలనం గోల్పడియెనతఁడులంకేశ్వరుచేన్ ॥ క॥ సీతాన్వేషణపరులై నీతిఁగపిప్రవరులరిగి
రతంబుగసంపాతియనుపడిచేతము హీతనయావార్తలెల్ల నెఱిఁగికడంకన్ ॥ క॥ వారలు వారిధిగడువఁగ । నేరక తా
మున్నయెడననిలసత్త్వమున । న్వారిధిలంఘించెమహా । వీరుఁడు హనుమంతుఁడనఁగ విందుఁగపీంద్రా ॥ వ॥ పనుమహను
మంతునంతియబలపరాక్రమంబులుగలవాఁడనా పౌరుషంబుఁజూపుదునేయనిన నవ్వక్షహాసముఖుండగుచు నన్నాయె
ననుదరసినవాఁడ లేవనోపం బోయెదవేని నాతోఁకంబాయం ద్రోచిపొమ్మనిన మెచ్చకతనవామకరంబున నెత్తంబో
యిశక్యంబుగాక ॥ ఉ ॥ ఏపునరెండుచేతులను నిమ్మగఁబట్టియమర్చియెత్తఁగా । నోపక మ్రొగ్గతిల్లఁబడి యాస్రగత
ఘర్మజలార్ద్రదేహుఁడై కాపురుషుండుఁబోలెనిజగర్వముపక్కయిసంగియుండెఁజిం । తావరుఁడైవృకోదరుఁడు
దద్భయులజ్జనధోముఖంబుతోన్ ॥ వ ॥ ఇట్లుకపివరు లాంగూలంబుఁగదల్పనోపక భీముండుగృతప్రణాముండై నిన్నె
ఱుంగక నాపలికినదురుక్తులుసహింపవలయు నీవు ...నొ గంధర్వుండవో నాకెఱుంగింపుమని

నహనుమంతుండు భీముంజూచి నగుచు నేను గేసరిక్షేత్రంబున వాయుభట్టారకునకుం బుట్టినవాఁడ నని చెప్పి నీవు
జుండవు దొల్లి రఘుకులేశ్వరుండైన రామదేవుండు రావణుండను రాక్షసుచేత నపహృతభార్యుండై సుగ్రీవాది
రులన సంఖ్యాతబలంబులుగలుగువారిం దనకు సహాయులం జేసికొని సేతుబంధనంబున సముద్రంబు లంఘించి సమరంబున
రావణుం జంపి యందు నా ఖేలనంబున మెచ్చి * మధ్యాక్కర॥ నరసురస్తుత్యమై యెంతగాలంబు నాకీర్తి నిలుచు। నిర
గానంతగాలంబు నీవు నిత్యుండ వగుచుఁ। బరఁగు మని వరము దయచేసి ప్రభుఁడుర్వి యెల్ల। సరివదు నొకండు వేఁడు లే
యెదివికి * వ॥ అనిన విని భీముండు వానినప్పుడు హనుమంతుంగా నెఱింగి సంతసిల్లి నమస్కరించి భవద్దర్శనంబున
గుండనయితి నని యిట్లనియె * గీ॥ బలిముఖుండ దయయుఁ గలదేని తొల్లి యర్ణవము గడచినవనాఁటి నీమ। రూపు జూ
తుఁ జూపుము నావుడు। వానికిట్టులనియె వానరుండు * క॥ అక్కాలంబున రూపం। బిక్కాలమునందుఁ జూప నెట్లగుఁ గాలం
కనువిధంబున నుండక। పెక్కువిధంబుల నవచ్చు భిన్నావస్థల్ * వ॥ దానన చేసి కృతత్రేతాద్వాపరకలియుగంబుల
క్య వేఱు వేఱై యందుల చరాచరభూతప్రకారంబులు భిన్నభావంబులై వర్తిల్లు నని నయ్యీయుగంబుల యాచా
నంబులు నాకేర్పడం జెప్పుమనిన భీమునకు హనుమంతుం డిట్లనియె * గీ॥ కృతమకాసిక ర్తవ్యంబు కృతయుగంబునందు

## భీమునకు హనుమంతుండు చతుర్యుగాచారవర్తనంబులను దెలుపుట.

చుఁ జతుష్పాదమగుచు ధర్మ। మనఘ వర్తిల్లు నచ్యుతుండయ్యుగమునఁ। శుక్లవర్ణుఁడై ప్రజలఁ గాచుచు వెలుంగు * వ॥ అది
తనధర్మసనాథం బందుల బ్రహ్మక్షత్రియవైశ్యులేక వేదక్రియాయోగకర్మసంయోగంబునఁ బుణ్యలోకంబులు వడ
దుర్గంబు నసూయాభిచారదర్పకార్పణ్యపైశున్యవిగ్రహక్రోధమత్సరభయసంతాపవ్యాధి ప్రజాక్షయంబులు
నుఱియఁ ద్రేతాయుగంబునందుఁ ద్రిపాదంబై ధర్మంబు వర్తిల్లునందు జనులు నిత్యసత్యప్రవర్తనులై యజ్ఞతపోదా
క్రియల వర్తింతురందు రక్తవర్ణుండై విష్ణుభట్టారకుండు ప్రజారక్షణంబుఁ జేయు * గీ॥ ద్వాపరంబున రెండుపాదము
జేసి నడచు ధర్మువు వేదములు నాల్గు దెఱఁగు। లై ప్రవర్తిల్లు వేదశాస్త్రగ్రంథోది। తంబులై ధర్మకామములరణిఁబరఁ
గీ॥ సత్యపరిహీనులగుదురు జనులు గాన। కర్మలై చేయుదురు బహుక్రతువులోలి। నందుఁ ద్రైలోక్యవందితుఁడ
తుండు। కృష్ణవర్ణుఁడై జగముగ రక్షించు మఱియు * క॥ కలియుగమునందు ధర్మము। బలహీనత వర్తిల్లు నేకపాదంబున
ఘుఁడు కృష్ణుఁడు జగతీ। వలయము రక్షించుఁ బీతవర్ణుండగుచున్ * వ॥ అందుల జనులధర్మపరులై తమోగుణయు
కామక్రోధాది దోషంబులందమ్మలుఁగక యధర్మకర్ములగుదురందుఁ జేసిన తపోదానధర్మంబులు బహుఫలంబులు
యుగప్రవర్తనప్రమాణంబులఁ జెప్పి నీకిష్టావాప్తియగు నరుగుమనిన భీముండిట్లనియె * క॥ నీనాఁటి తనువుఁ జూదియ

## హనుమంతుఁడు భీమునకుఁ దన పూర్వరూపంబుఁ జూపుట.

యవశ్యంబు పోవఁగావునఁ గపినాథా నాకుఁ జూపుమనవుడు। వానికిఁ దనరూపుఁ జూపె వానరుఁడంతన్ * చ॥ అతుల
ద్వితీయకనకాద్రియొకో యిది నానిజాంగము। చ్చ తముగఁ బెంచి పుచ్ఛము నభఁ జేసి దిగంతములందు చున్న యా। నన్న
వాధుఁ జూచి కురునందనుఁ డప్పుడు మీలితాక్షుఁడై। మతిన తివిస్మితుండగుచు మారుతి కిట్లనియెన్ భయంబుతోన్ * క॥
భీషణమిది యత్య। ద్భుత మోహో చాలు భూనభోమధ్యవ్యా। పిత మయ్యె భవద్దేహా। యతత్వము పసంహరింపు
పుఁడు గపీయుఁడు * క॥ తనయెప్పటి రూపముఁ జే। కొని దీనికి నిను మొకుంగగుం బ్రతిబలము। గనినప్పుడు నారూపం। బున
గునని హనుమకనిలజుఁడనియెన్ * ఉ॥ ఉన్నతిఁ బూని నీవు బలియుండగు రావణున శ్రమంబునం। బన్న
పుపటు బాహుబలాఢ్యుఁ డవిట్టియున్నతు। న్నిన్ను సహాయుఁగాఁ బడసి నిర్మలకీర్తియుతుండు రాఘవుం। డన్నరభో
న్వయము నాజి వధించుట కేమి చోద్యమో * వ॥ అనిన భీమునకతిప్రీతుండయి హనుమంతుం డిట్లనియె నయ్యా నీవు సౌగ
కసరోవరంబునకుం బోయెద వేని యందు సాహసంబుఁ జేయవలవదది యక్షరాక్షసరక్షితంబై దేవతోపయోగ్య
యుండు దేవతలు బలి పూజానమస్కారంబులం జేసి భక్తిసాధ్యులుగాని సాహసక్రియాసాధ్యులుగారు నీవు
క్షితుఁడవై పరమధర్మంబు లెఱుంగునది యొందేని హీనబుద్ధులు విమోహితులగుదురట్టి ధర్మాధర్మవిచారంబు లెఱుం
ప్పుడు శాస్త్రంబు లెఱిఁగిన విద్వాంసుల ... వలయు నాచారంబున ధర్మంబు పుట్టు

వలన వేద ప్రశస్తమయగు వేదంబులం జేసియజ్ఞంబులు ప్రవర్తిల్లునట్టియజ్ఞంబులవలన దేవతలుద్భవులగుదురు ✽ గీ॥ కార్యసి
ద్ధిఁబొంది కాలంబు దేశంబు। నెఱిఁగి బుద్ధిమంతు లెల్ల ప్రౌఢు। సాహసంబువిడిచిసామాద్యుపాయప్ర। యుక్తిఁ జేయుదురు యు
థోచితముగ ✽ వ ॥ మఱియు సర్వకార్యంబులు మంత్రమూలంబుగావున విద్వాంసులై ప్రబుద్ధులైనవారలతో మం
త్రంబుఁ జేయానది బాలకులతో నధిక శ్రీదర్పితులయిహీనబలులయినలఘుజనులతో మంత్రంబు సేయవలదు ✽ గీ॥ జను
లనిగ్రహానుగ్రహశక్తుఁడైన। రాజుశాసనమునఁ జేసిరమణతోడ। నోలిఁదమతమమర్యాదలొక్కనాఁడు। దప్పనోడుదు
రిట్లు హితలమనందు ✽ వ ॥ నీవునిగ్రహానుగ్రహసమర్థుండవుగావున నీకెల్ల వారునువశ్యులగుదురు నిన్నుఁ జూచుటం జే
సినానయనంబులు సఫలంబులయ్యె నీకెద్దియిష్టంబు దానిం జేసెద ✽ మత్తకోకిల ॥ మీకు నెగ్గొనరించియున్న యుమిత్రు
లఁ సబలంబుగాఁ। జీకురాజునమాజులంగురుసింహనీకుఁ బ్రియంబుగా। నేకమాత్రనపోరిలో వధియించి నాగపురంబు
నా। నాకులోగ్రశిలావలీగహనంబు సేయుదునావుడున్ ✽ మత్తకోకిల ॥ ఇంతయుంగపినాథ నీకిదియేమి పెద్దమహాహ
వా। భ్యంతరంబునసద్గతప్రతివక్షవీరుల నేసుని।గ్గింతు మెవ్వరుమాకుమీదయఁ జేసిమార్కొనునట్టియు। త్యంతవీరులు
లేరుభూవిదితప్రతాపబలోద్ధతిన్ ✽ వ ॥ అనినవినిభీమసేనునకు హనుమంతుండిట్లనియె నన్నురణరంగంబునందలంచు
నదిలీయంపు సౌహృదంబున నాహవంబులోనతిరథుండయ్యెన యర్జునురథధ్వజంబునందుండి మీబలపరాక్రమంబులం
జూతునని భీముంగౌఁగిలించుకొని వానికిసౌగంధిక సరోవరమార్గంబుఁ జూపి హనుమంతుండంతర్హితుండై నదఁదజాలింగ
నంబున విగతశ్రముండును విపులజవశక్తియుక్తుండునునై భీమసేనుండు ✽ సీ ॥ వారిధారలనని వారితనిర్గళదానధారల
నటిద్ధాముములను। దళనధామంబులనశని ఘోషంబుల ఘోరబృంహితబృహద్ఘోషములను। నివిఘునబృందంబులిపగజయూ
థంబులన్ విచారింపంగనక్కజంబు। లైలలితోత్తుంగ శైలకుంజంబులఁ ద్రిమ్ము రుజలధరద్విరదతతుల ✽ గీ॥విస్మయంబుతో జవీ
క్షించుచుంజని। రజతగిరిసమీపరమ్యభూమి నక్కుబేరువనమునందు సౌగంధిక। కమలవనముఁగనియె ఘనభుజుండు ✽ క॥అర
దుల హేమాంబుజముక। రందరసామోదమ్మృదుతరశ్వసనంబా। నందంబుఁ జేసెఁదనప్రియు। నందమునకు భీమసేనునకు సభి
ముఖుఁడై ॥ అంత ✽ క॥వీరుండై సౌగంధిక। వారిజములుగొనఁగనిట్లువచ్చినవానిన్। భూరివరాక్రముభీముని। దారగడాహ
స్తుఁ జూచి తారుద్ధతులై ✽ వ॥దానిరక్షించియున్నపది వేలు రాక్షసులాక్షణంబపిచి త్రాయుధపరికరులై వచ్చి తెంచివీఁడొక్క
వీరపురుషుండాయుధంబులు ధరియించియజినంబులుగట్టినవాఁడధిక తేజస్వితపస్వివేషధరుండై యిందులకు వచ్చినవాఁడ
వియచ్చెరువందుచు భీమసేనుండాయవచ్చియిట్లనిరి ✽ తరల॥ఇది కుబేరవనంబు దీనికి నెవ్వరుంజనుదేరనో। డుదురు నీవిట
కేలవచ్చితి దుంబ్రహ్లాదముఁ జేసితిం। దురిత తేజుఁడు గ్రీడలాడుచునుండునింతులుదానుసం। మదముతోడఁ గుబేరుఁడీసు
విమత్సరోజవనంబునన్ ✽ వ॥దీనితీరంబున దేవర్షిగణంబులు దేవతార్చనలఁ జేయుదురిందులజలంబుల వ్యాతోపమానం
బులు మఱివైడూర్యనాళంబులై యపూర్వసౌరభవంతంబులైన కనకకమలంబులుగలుగుటం జేసి యక్షరాక్షసాక్షౌ
హిణీరక్షితంబగుదీనిమహిమయెఱుంగక యింతదూరంబువచ్చినవీరుం డెవ్వండును లేఁడు నీవెవ్వండవేమికారణంబునవ
చ్చితనినవారికి భీముండిట్లనియె ✽ మత్తకోకిల॥ఏను బాండుసుతుండ భీముఁడ నిగ్ధతేజుఁడ ధర్మరా। జానుజుఁన్మడ ద్రౌపదీ
హృదయప్రియంబొనరింపఁగాఁ। బూనియిక్కమలాకరంబునఁ బుష్పముల్గొనవచ్చితిన్। వీనిఁగొందునవశ్యముక్షసురవీ
రులడ్డమువచ్చినన్ ✽ వ ॥అనినయయ్యా నీవుదివ్యపురుషుండవీసౌగంధికకమలంబులుగొనియెదేని కుబేరునకెఱింగించి త
దాదేశంబునఁ గొనుము నీవుధర్మజానుజుండవుగావున నీకుధర్మపథంబు దప్పంజనదనిన రాక్షసులఁగటాక్షదృష్టింజూచి భీ
ముండిట్లనియె ✽ క॥గిరివిఘ్నరములఁ బుట్టిన। సరసిజవనమిదియుసర్వసామాన్యముగా। కరుదుగనొక్కనియదియే। వరఁ
గగుబేరుండు దీనిఁ బడసెనె మొదలన్ ✽ గీ॥ఉత్తమక్షత్రియుండేల యొరులనడిగి। వేఁడువాఁడగుఁదనభుజవిక్రమమున।

## ✽భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు చేయుట.✽

నన్యధనములు పార్థించియర్థిజనుల। కిచ్చుఁగీర్తి యక్కాలవెలయించుఁగాక ✽ వ ॥ నాకు మిమ్ము నుమీకుబేరుం బ్రార్థించికా
యిక్కొలనిపువ్వులుగొనంగాదొక్కోయని భీముండు రాక్షసుల నాదరింపక సౌగంధిక వనంబు సొచ్చి కనకకమలంబులు
గొనియుత్తునువీర్యవంతంబులైన తత్సలిలంబులువయోగించి యనంతబలసంపన్నుండై యున్నవాతనింజూచి రాక్షసు

లలిగియుధ్యతాయుధహస్తులై తాఁకిన భీముండును భీకరాకారుండై * చ॥ తనగదచేత రాక్షసుల దారుణశస్త్రచయం
బున శ్రమంబున నతివీరుఁడై నిలిపి ఘోరనిశాచరులం బడల్పఁడఁగ్ । ఘనభుజదండచండహతిఁ గ్రాఁచిననుగ్గుగఁ గూల్చి
జేసి వకెలుఁగింపఁ బాఱిరి సరోషవృకోదరభీమకర్మముల్ * వ॥ కుబేరుండును బాంచాలీప్రియకరుండైన పవనతనయు
పరాక్రమారంభంబు విని మెచ్చి వానిను పేక్షించె నట్లు భీమసేనుండు రాక్షససేన నోడించి సౌగంధిక కమలంబులు గ్రో
త త్రీరకుసుమలతాపాదపవనంబున విహరించుచున్నంత * క॥ వడిఁ బడియెఁ బిడుగులు ఉఱుగక । వడఁకెను మహీధరము పాం
వర్షము కురిసెన్ । కడు నెల్లలయ్యె దిశలే । ర్పడకుండె నిమ్ముండు తిమిరపటలావృతుఁడై * వ॥ ఇట్టి మహోత్పాతంబు
పలక్షించి విస్మితుండై ధర్మతనయుం డిట్టి భీమాహవ సిశువంబులైనానంబడియె । నేను ఆకుండవలయు ననివాలు గుదిక్కులు
జూచి భీమసేనుం గానక తనసమీపంబున నున్న పాంచాలి కిట్లనియె * క॥ ప్రియసాహసుండు భీముండు । భయవిరహి
డెందు వోయెబహు రాక్షససం । శ్రయమగ్గిరిగంధర్వా । న్వయసేవ్యంబే కచరుఁడు వాఁడేయ్యెడలన్ * గీ॥ భూరిభ
జుండు నెపోయెనో నీవెట । కేని బుచ్చితో నిజెప్పుమ తని । ననియఃజాతశత్రుఁ డడిగినఁ బలికెఁ బాంచాలి యిట్టులనియె సం
మమున * అక్కర॥ ధరణీశ నీకు నిచ్చిన పసిఁడి తామరపువ్వు । గురువాయువశమున వచ్చినదానిఁ గొని యిట్టి పువ్వు
దు గానఁగు సరంగటంగల వేని యీవియఁ దెమ్మనిన । నరిగెనీశాను దిక్కు నీయన జన్ముఁ డతివేగమునను * వ॥ అవిన నట్లని
దఱము వానిపోయిన వలనఁ బోవుదమని యెప్పటియట్ల రాక్షస బలసమన్వితుండై గగనగతి నరిగి సౌగంధికతీరంబున
అతులబలాఢ్యు నుద్ధతగదాయతబాహుఁ బటు ప్రతాప వర్తితయశుఁ బాండునందనుఁ దదీయ మహాప్రగదావిపాతదు
రితపృథు రాక్షసశరీరభయంకరుఁ జూచి విస్మయ । స్మేరముఖులైరి బ్రాహ్మణసమేతులు ధర్మసుతామలచ్ఛ
వ॥ భీమసేనుండును ధౌమ్యధర్మజలోమశులకు మ్రొక్కి కవలం గౌఁగిలించుకొని వైదూర్యనాళంబులై నకనకకమ
బులు ద్రౌపదికిచ్చి యున్నంత నాతనిం జూచి ధర్మరాజిట్లనియె * గీ॥ చను నెనీకునిట్టి సాహసక్రియఁ జేయ । నెల్లవారి
కెటెనెఱుక గలవు । గురుభుజుండ వాటుఁ గూర్తై చేయకు । మయ్యయిట్టి చెయ్వు లనఘ యింక * వ॥ అని కొ అపేయిట్లుండ కుం
బేరోద్యానవనంబున విహరించుచున్నంతఁ దగ్రతకులై నయతులు వచ్చి * క॥ దేవర్షిమైన రోమశు । దేవేంద్రసభా
నయ్యధిష్ఠిరున పనీ । దేవోత్తములం గనివిన । యావనతులు భక్తి నిట్టులని రండఱున్ * వ॥ మీరిందున్న సలవలదిది
రాక్షస ప్రచార ఘోరంబనిన నందుండనొల్లక పాండవులు దత్సమీపంబున నివాసంబుఁ జేసికొని రాక్షసబలంబుతో ఘ
టోత్కచుఁ బోవంబనిచి యుండు నంత జటాసురుండను రాక్షసుండు బ్రాహ్మణరూపధరుండై యేను వేదవిదుండ ధనుర్వే
దుండై నపరశురామశిష్యుండ ననుచుం బాండవుల సేవించుచున్నంత నొక్కనాఁడు * గీ॥ న్యగవిరోధి బలుఁడున్న గ
వినోదార్థమడవికి నిలతనయుండరిగినట్టి యవసరమున నజ్జటాసురుఁడాసురా । కారగవికృతరూపకంబుతోడ * క॥
దెంచి ధ్రౌపదిని యమ । తనయుని నకులుం దదాయుధంబులతోఁ బెల్చన నెత్తికొని మహాజవ । మునఁబఱచె మహీసురో
ముల భయమందఁగ * వ॥ అంత సహదేవుండు భీముని బిలుచుచు వనంబునకరిగె నట ధర్మతనయుండు ధర్మవర్తి
యసురకిట్లనియె * క॥ దేవాసురాదులిందుప । జీవింతురు మనుజుల కవిశేషసుఖంబు । లాలించుచునమ్మనుజులఁ గాచు
గలవారమేము గౌరవయుక్తిన్ * వ॥ ఇట్టి మహాకపకారంబు సేయుట నీకు లగ్గుగాదు నీవు ధర్మమెఱుంగవు విశ్వసించిన
శికిందన కుఁగుడువం బెట్టినవారికి నెగ్గు చేయుటకడుం బాపంబు గావున * అక్కర॥ మాయాపిమాయహ యుధమా
కిచ్చి మాతోరణమ్ము । సేయుమివ్విధంబునఁ బోవఁ దగదంచుఁ జెప్పియయ్యసుర । నాయతబాహుఁడు గరము భరము
దిమెనప్పు । మాయావి యగు వానిగమన వేగంబు మందమై యుండ * వ॥ ఇట్లు ధర్మజుండు బిడపీడన వేదనాభరంబున
గుండై యరుగు జటాసురుని కడ్డంబు వచ్చి సహదేవుండిట్లనియె * క॥ నన్నెఱుఁగవె పాండవుఁడఁ బ్ర । సన్నయశో

(*) భీముఁడు జటాసురునితో యుద్ధంబు చేయుట. (*)

బలుఁడ సహదేవుఁడన । త్యున్నతియేర్పడ నాజిని । నిన్నోర్చెదఁ జక్కనెదిరి నలువుము పోరన్ * వ॥ అనుచున్న యు
రంబున ననిలతనయుండనిల వేగంబున నరుగుదెంచి జటాసురు చేత నిగృహీతులై గగనగతిం జను ధర్మజ నకుల ద్రౌపదులం
మహీగతుండై న సహదేవుం జూచి యయ్యమరకిట్లనియె * గీ॥ అతిథివై వచ్చి నీవు మాయందు గుడిచి । యసురవై

యంగనగు నెయ్యిట్టి। లెందుఁ గుడిచినచోటికి నెగ్గు సేయ । రెట్టిదుర్జనులైన నీ నెలుక విడిచి * వ॥ నీవు బుద్ధిగలవేని వీరి విడిచి నీ ప్రాణంబులు రక్షించుకొనుమట్లు గానివాఁడు బకహిడింబకిమ్మీరులం జంపినట్ల శ్రమంబునం జంపుదు ననిన విని జటాసురుండు వారల విడిచి భీమసేనున కభిముఖుండై * క॥ రయమున నీ చేత నిహతు। లయిన సురారాతులకు రణాంతరమున నీ। దయినరుధిరమున నుదక । క్రియఁ జేసెద బకహిడింబకిమ్మీరులకున్ * క॥ అనుచుఁ గడు నలిగి మారుత। తనయు మహాబాహు ననురదాఁకె సురున్నం। దనున కెడచొచ్చి మాద్రీ। తనయులు దక్షణమ వానిఁ దాఁకిరి వీఁకన్ * సీ॥ వారల విద్దఱ వారించి భీముండు దాఁకె జటాసురు వీఁకతోడ । భీమాసురులకు సంగ్రామంబు గడు ఘోరమయ్యె నిర్ఘాతంబులయ్యె వారి । యూరుఘట్టనముల ధారుణీరుహములు పడ ఘట్టనముల గ్రక్కదలె ధరణి । భూరుహపాణులై పోరి యాసన్న భూరుహములు వ్రెలిసిన బృహదగ్ర। శిలలఁ జేసి కొంత సేపు పోరాడి రొం। డొరులు పెనఁగి పట్టి పరుషభంగి । నుగ్రులైన వాలిసుగ్రీవులట్టుల। యుద్ధ మొప్పఁ జేసిరి దద్బలులు * క॥ భీమాసురవీరుల ముష్టాముష్టి రణోద్ధితచ్ఛటాశబ్దంబు। ద్ధామంబై తద్విపినమహా। మృగపతులకు నతిభయావహమయ్యెన్ * గీ॥ అంత భీమసేనుఁ డంతకాకారుఁడై। వాని బలవిహీనుఁ గా నెఱింగి। తడయకవుఁడు వాని మెడ శృంగంబిడికిటఁ । బొడిచె నసురయపుడు పడియెఁ బుడమి * వ॥ ఇట్లు నిర్ఘాతవిపాతనీలగిరిశృంగంబునుం బోలె నేలం బడిన జటాసురకళేబరంబెత్తి యొక్క విశాలపరుషపాషాణంబుపై జర్ఝరితంబుగా వైచి వానిం గాలగోచరుంగాఁ జేసిన వాయుపుత్రు పరాక్రమంబు ధౌమ్యరోమశాదిమహీసురవరులు వర్ణించిరని వైశంపాయనకథితంబైన కథ రమ్యంబగు * క॥ భూపకులతిలక నృపవి। ద్యాపారగ యతులసత్యధనధాన్యదయా। లావచతురాస్యకర్త। వ్యాపారవిభాసిశిష్టవర్గనృపతీ * తోటకవృత్తము॥ ధరణీశ నిరంతరదానయశః । పరిపూర్ణదిగంతరభాసువిభా । కరుణాకర నిర్మలకాంతియుతా । శరణాగతరక్షకసత్యనిధీ॥..............................*

గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునందారణ్యపర్వంబున దధీచికథనంబును నగస్త్యమాహాత్మ్యంబును భగీరథుప్రయత్నంబును గంగావతరణంబును ఋశ్యశృంగుచరిత్రంబును బరశురాముచరిత్రంబును గార్తవీర్యవధయును రామకృష్ణాదుల యాగమనంబును సౌకన్యాఖ్యానంబును జ్యవనుండు సంయాతియజ్ఞంబున నశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు మాంధాతృజన్మంబును సోమకుండు యజ్ఞంబుఁ జేసి పుత్రశతంబు వడయుటయు జంతూపాఖ్యానంబును శ్యేనకపోతంబులై యింద్రాగ్నులు శిబిమాంసంబు గొనుటయు నష్టావక్రమాహాత్మ్యంబును రైభ్యావక్రీతుల సంవాదంబును భీముండు సౌగంధికహరణార్థం బరుగుటయు హనుమద్దర్శనంబును రామాయణకథయును భీముండు గంధమాదనంబునందుండు కొలనికిం బోయి యక్షరాక్షసుల వధియించుటయు గంధమాధనంబునందు ఉండుటయు జటాసురవధయు నన్నది తృతీయాశ్వాసము॥..............................*



శ్రీహయగ్రీవాయ నమః.

## శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - చతుర్థాశ్వాసము.



శ్రీ రాజరాజకులని। స్తారసుధాహారహీరసన్నిభకీర్తీ । శ్రీరమణధనుర్విద్యా । పారగ కోదండపార్థపార్థివతిలకా * వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పాండవులు నరనారాయణాశ్రమంబునఁ గొన్ని దినంబులుండి యొక్కనాఁడు ధర్మతనయుండు దమ్ములకిట్లనియె * అక్కర॥ ఏ నేఁడులయ్యె మనయర్జునుఁ డేగి యింతయు నేతెంచఁడు। బూనిదివ్యాస్త్రముల్ వడసి యమ్మహాభుజుభూరిసత్త్వ। నానతరిపువర్గుఁ జూడఁ గాంతుమిందంచు బ్రాహ్మణుల। తో నేగె నుత్తరమునకుఁ దమ్ములతో ధర్మసుతుఁడు * వ॥ ఇట్లు గంధమాదనపుణ్యతీర్థావలోకనపరులై పాండవులరిగి పదియేనగు దివసంబున వృషపర్వుండను రాజర్షి యాశ్రమంబుఁ గని యందతిప్రీతిన్ నాతనిచేతఁ బూజితులై యేడు దివసంబులు వసియించి బ్రా

బునే సేకనార్జింపుము. క॥ ధరణీపతులకు నెవ్వాఁడు । కరము ప్రియము సేయు నయ్యకౌరవవంశో । త్తమ విప్ర సంతుష్టిఁ బొనరించినఁ జేకుఱు నశేషపుణ్యఫలంబుల్. సీ॥ సకలభూతములందు సదయాత్ముఁడవు గమ్ము పాలింపు ప్రజల ప్రజలఁ బోలె । విదితవృద్ధాచారవేది వై ధర్మంబు సలుపుము దురితవర్జనము సేయు । మెఱుఁగుమీఁ బాపము ... చుకతోడ నగరసంప్రణికారశాలి వగుము । గర్వంబు విడువుము గరము ప్రియంబును నిజమును గాఁ జోనియ తినడుపు. గీ॥ కాలకర్మ నెఱిఁగి యస్ఖలితబోధయుక్తుఁడవు గమ్ము భరతవంశోద్భవుఁడవు । నీవు గావున సత్యవ్రతనిష్ఠులుఁడవు । ప్రాజ్ఞుఁడవు నీ కేల చెప్పంగ నేల. వ॥ అనిన విని యుధిష్ఠిరుండు నీ యానతిచ్చిన వాక్యంబులన్నియు నవహితుండనై వింటి వింటమున్ నా యెఱింగిన తెఱంగున లోభమాత్సర్యాది దుర్గుణంబులు పరిహరించు టయుంకను భవముక్తంబయిన ధర్మానుష్ఠానంబు నడుపు చెదనని యతనికిం బ్రణమిల్లి మఱియును బ్రాహ్మణప్రభావంబు వినువాఁడనై యతనిం బ్రార్థించినం దద్వృత్తాంతంబు

## మార్కండేయులు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు చెప్పుట.

యితిహాసం బతనికి నమ్మహాముని యిట్లని చెప్పె. చ॥ ఘనుఁడు పరీక్షితుండు ప్రకాశితుఁడైన మహీవిభుండు ... నుకభుఁడు భానువంశుఁడు వినూతనకీర్తి యయోధ్య యేలువాఁ । డనుపముఁ డొక్కనాఁడు మృగయారతుఁడై చరియించెఁ గాననం । బున నొకరుండ యుమ్మలనపూర్వజవోగ్రహయాధిరూఢుఁడై. వ॥ ఇవ్విధంబునం జెక్కు మృగంబు వధియించుచుఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడ. గీ॥ మదగజాభిరామమృదులయానంబొప్పు । వల్లి బోడలు చనుల తొంటకులు గరము లీలఁ గమ్మవిరులు గోయుచున్న । పువ్వుఁబోఁడి నొక్కపొలఁతిఁ గనియె. క॥ కనియంతఁ గడిసి యా కామినిఁ జూపుం జూడ్కి తగులుమీఱెఁ దనకొంబునను మిమ్ముల లోచనుఁడై । జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్. వ॥ అదియును నతిసుందరం బయిన తదీయవిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుండు కాంతఁ జెట్లని యె. ఉ॥ ఎవ్వరిదాన వింబుజదళేక్షణ యేకతమిట్టులేల నీ । విన్వనభూమియందుఁ జరియించెదు నా వుడు దాని కిందుబింబాప్రవదన । దివ్యవనభూమియందుఁ జరియించెద నవ్వు సంగోడుకన్య నే నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజచంద్రమా. వ॥ అనిన దాని ప్రగల్భవచనంబులకు నధిక విలోలుండై భూపాలుండు దనయభిప్రాయం బెఱింగించిన నమ్ముగువయు నన్నుఁ దుజలవిహారంబునకుఁ జొనుపకుండు నదియట్లయిన నిన్ను వరియించెద ననిన వాఁడు సదయహృదయంబున కొడంబడి యాని దోడ్కొని పురంబునకుఁ జనుదెంచి యిష్టసుఖతత్పరుండయి యుండె నంత నొక్కనాఁడు శరత్సమయంబునందు. క॥ అతులితపుష్పపల్లవఫలాన్వితభూరుహభూరివల్లరీ । వితతులఁ జారుకైరవనవీనసరోరుహషండమండలా । యతసరసీమనోహరములైన పురోపవనంబుల సము । న్నతవిభవుండు వాసభవనంబులొనర్పఁగఁ బంచియుమ్మలన్. క॥ దేవీసహితంబుగ నుర్వీవరుఁ డవ్వనమునందు విహరించెను నానా । తావసరవాసరంబుల । భావితపద్మవనపవనపరిచితుఁ డగుచున్. వ॥ అంత నొక్కనాఁడు నితాంతఘర్మజలకణకలితశరీరుండై ప్రియాసమేతుండై వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతిమనోహరంబయిన కమలాకరంబుఁ గని దాని తీరంబున నయ్యిగ్మలిమని దిక్కృతావగాహుండై. క॥ మేలైయున్న లమువిహారాలవయవ చెమటయుడుగఁ జయ్యన దేహ । ఘోళన మొనరింపుమనిన । నాలేమ దరస్మితాననాంబుజయగుచున్. గీ॥ మడుగు సొచ్చి మునిఁగి మాయమై పోయిన । నద్భుతాత్ముఁ డగుచు నవనివిభుఁడు । మడుగు కలయ వెదకి మానినిఁ గాన । కలము లెల్ల వెడలఁ జల్లెఁ గడఁగి. వ॥ ఇట్లు చల్లిన నందు మండూకంబు లనేకంబులున్న జూచి యిది మత్ప్రియాంగన మ్రింగిన విగాకేమియని కలుషించి యనుచరులఁ బిలిచి నాకుఁ బ్రియంబు సేయవలసినవారలైతిరేని యొక్కొప్పల నెల్లం బొడగింప నదియని పంచినసలు నిక్కలకుంజని తదీయకింకరవర్గంబు. చ॥ కొలఁకుల వాగుల న్నదుల గ్రోవుల బావుల నిగర్బుల గలయంగ రోసి రోసి వడిఁ గప్పలఁ గుప్పలుగా వధించు చో నలుగడ మ్రొంచు భేకనివహంబు సముంగొని భేకనాయకు లఘుతపస్వి రూపమున నానృపుపాలికి వచ్చి యిట్లనున్. ఉ॥ అక్కట లోకమెల్ల నిగనాఁ బడి కప్పలఁ జ వధించెదీ నీ కేకట... పుగల్గు బృథివీశ్వర కోపము డింపు కప్పలం । జక్కని చూడ్కిఁ జూడుమికఁ జాలు నధర్మము నావు మన్విభుం । డెక్కడి... నా మదికి నెగ్గొనరించెఁ గడంగి భేకముల్. క॥ నాయిష్టవనిత మ్రింగిన । మాయపుఁబుర్వుల నిఁకేమడియింతు మునీ । ... నూరకుముని నీ వనుటయు । నాయనయత్యంతదుఃఖితాత్ముండగుచున్. వ॥ ఏను మండూకనాయకుండ నా యనున వా

నమ్మి సువవాకూఁతురు సుశోభయనునది దానిచేత ననేకులు బేలువడిరి నీ వెంత వాఁడవనిన నప్పరిక్షితుం డట్లేని నాకున న్నె
లఁతఁ దెచ్చియిప్పింపవలయునని ప్రార్థించిన నతండు నవ్వుచు నవ్వామనయనం దనతలఁపున గావించి యారాజునకు నిచ్చి
దానిం జూచి కోపించి నీవు కడుం జెట్టవు ప్రసిద్ధులగు రాజులం బెక్కండ్రం జిక్కులం బెట్టితివి కావున నీకుం బుట్టెడు పుత్త్రులు కప
టవరులయ్యెదు మని కూఁతునకుం శాపం బిచ్చి యుండుఁ గాక రాజు నిజేచ్ఛం జని యెఁ బరిక్షితుండును సంప్రాప్తమనోరథుండయి సు
శోభయుం దాను గ్రమంబున శలుండును దలుండును వలుండును నను మువ్వురు కొడుకులం బడసి యందగ్రజుండగు నశలు రా
జ్యాభిషిక్తుం జేసి తపోవనంబున కరిగెనంత * క ॥ శలుఁ డొక్కనాఁడు కనకో । జ్జ్వలమగు రథ మెక్కి వేఁటసని పెక్క
మృగంబులఁ జంపఁగ నొక్కమృగం । బలఘుతరశరాగ్రవిద్ధంబై వెసఁ బఱచెన్ * గీ ॥ ఇట్లు పఱచుటయును నెంత యారయ
మున నమ్మృగంబు వెనుకన రిగియరిగి । యెయిదలేక ధరణీశుండు సారథిఁ । బదరి తేఁకు వేగఁ బఱపు మనియె * సీ ॥ అ
నవుఁడు సూతుఁ డిట్లను దేవ మున మెంత తఱమిన మృగము తద్దయు జవంబు । గలదు రథ్యంబులు గడుఁ గొంకు గూడఁ గఁ జాలవు ప
లపజాలియేల । మన తేరిహయులు వామ్యములైన నమ్మృగము గవదు లేదన్న నలపి గాదు । నావిని వామ్యములన్నాఁ గనె
వ్వనిహయంబులు సెప్పుమనియె నబ్భూవిభుండు - గీ ॥ వామదేవ మహాముని వరుని హరులు । వామ్యములు నాఁగ జనునని
వాఁడు సెప్పె నతఁ డయ్యాశ్రమ మెచ్చట నచటి కిపుడ తేరు వోవనిమ్మనియె ధాత్రీవిభుండు * వ ॥ వాఁడును రథంబు నతిత్వరితం
బుగా వామదేవు నాశ్రమంబునకుం బఱపినం జని యాతండా తపోనిధిం గని నమస్కరించి మునీంద్రా నాచేత నేటువడి
యొక్క మృగంబు రయంబునం బఱచె నామృగంబు నేఁడ వధియింపవలయు భవదీయహయంబుల నీవలయు ననిన నతండు
నీవు కృతకార్యుండవై హయంబులం దడయక యొప్పింపవలయు ననిన వల్లెయని హయంబులం గొని రథయుక్తంబులు గావిం
చి తదీయజవంబునకు మెచ్చుచు ముహూర్తమాత్రంబునకు నమ్మృగంబుఁ గూడముట్టి దానిని సంహరించి మగిడి నిజపురంబు
నకు వచ్చి * మత్తకోకిల ॥ రాజయోగ్యములైన యీహయరత్నములు వసత్త్వవి । భ్రాజితంబులు వానికేటికిఁ బాఱువా
నికినంచు నా । రాజు రాజసబుద్ధి నంతిపురంబునం దిడఁ బంచె న । వ్వాజిరత్నము వేడ్క నూనినవాఁడు దోసమెఱుంగునే *
వ ॥ అట వామదేవుండు దనయశ్వంబుల శలుం డుగొనిపోయి మగుడ నొప్పింపక తడయుటకు నాత్మగతంబున * గీ ॥ రాజపు
త్త్రుండు బలియుండు రాజసమునఁ । గొంటి కాతఁడు వేడుకఁ గొనుచు నరిగె । నశ్వములఁ గ్రమ్మఱఁ గని త్తునను విచార । మెవ్వి
ధంబు నతనికి నేలకలుగు * వ ॥ అని శంకించి నిజశిష్యుండైన యాత్రేయుం డను వానిం జూచి శలుండు మన వామ్యంబులం
గొనిపోయి యొక్క మాసం బరుగుదెంచె వాఁడు మదవయంతఁ దెచ్చుటకలుగ నేరడు నీ వరిగి మన తురంగంబులం గొని రమ్మ
నిపంచిన నతం డవ్విధ కదలి యయోధ్యకుం బోయి * క ॥ మనుజపతిఁ గాంచి యాతఁడు । మునిపతి పుత్తెర నధిపము
ఖ్యయిచటికేఁ । జను దెంచితి మాహయముల । నెనసిన నెయ్యంబుతోడ నిమ్మనియెఁ దగన్ * క ॥ అనవుడు శలుఁ డి
ట్లనియెం । జను నినుఁ బుత్తెర నతఁడు సాలుదు నీవుం । గొనిపోవఁ దురంగంబులఁ । జను మీదుర్భాషణములు నైపవు మా
ర్గన్ * వ ॥ అనిన నమ్మునికుమారుండయోధ్యాపురంబు వెడలి క్రమ్మఱి చని యవ్వామదేవునకు నవ్విధం బెఱింగించిన వా
మదేవుండు క్రోధపరీతచేతస్కుండై శలుని పాలి కరిగి యిట్లనియె * క ॥ ఇమ్ముని శేశ్వగమాతురఁ । గమ్ములనీ కార్యమయ్యెఁ గా
దే ఢులో । భమ్మున ననునొండ్లసొమ్ములు । రమ్మన్నను వచ్చునే యొరవుసతమగునే * క ॥ పరధనహరణము దురితము । పరికిం

శలుఁ డను రాజు వామదేవముని నిదిరస్కరించుట.

పుము వరుణు చేతిపాశంబులస । ఫ్పురము గట్టువడకుని । గ్భరవరక్షికృశానుశిఖలఁ బడకుము మీఁదన్ * చ ॥ అనుటయు నా
తఁ డిట్లనియె నాఁ డివి విప్రుల కేలయశ్వముల్ । ఘనతరసత్త్వమూర్తులనఁ గాఁడగు నెద్దుల రెంటి నిచ్చెదన్ । వినుమటు గాక బ
ల్లిదపు వేసడముల్వ్వల తేని యిత్తుఁ గై । కొనుము కడంగి వామ్యములఁ గోరక పొమ్మిడి యాన లేటికిన్ * క ॥ అవిన విని యేటి
మాటలు । వినువారలు నవ్వ నకట విప్రుల ధనముల్ । గొని వేఱ యొంటి నిచ్చెద । ననుటిదియే నాఁటిచందనం ని మునివలికెన్ * వ ॥
మఱియు నమ్ముని పరుషంబులు వలుకుటయును * క ॥ శలుఁ డలిగి యిత్తపస్వి నిబలు త్రాఘులనంట్లఁ గట్టి పటుశూలములన్ । బొ
లియింపుఁ డనుచు భీకర । బలులని యోగించెఁ దనదు పార్శ్వజనములన్ * వ ॥ అంతయుఁ జూచి వామదేవుండు ఘనరోషభీ
షణ ప్రహసమర్ని రీక్షణ దూక్షముఖుఁడగుటయు నాతనిం బఘోరాకారులగు రాక్షసు లనేకులు పుట్టి శాతశూలంబుల

నాభూపాలుం బొడిచి కాలగోచరుం జేసిరి మునీంద్రుం డనిశేచ్ఛం జనియెఁ దదనంతరంబ శలానుజుండు దలుండ నవా
నిజరాజ్యపట్టబద్ధుండై సుఖంబుండఁ గొంతగాలంబునకు వామదేవుం డుసను దెంచి మహాత్మా నీవు ధర్మపురుషుండవు
రంబు దప్ప నోడు దేని నాహయంబుల నిమ్మనుటయు దలుం డలిగి నిజసమీపంబున నున్న సారథిం జూచి యిట్లనియె
డు గ్రొవ్వి తేఁకువ సెడియె నీపాలుండు వీఁక మైని వ్వఁడు వీని ఁ జెయుమ్ము । వ్రయ్యంగఁ జేసెదఁ జయ్యన విషదిగ్ధసాయకమున
శాసనముఁ దెమ్ము । నావుడు నమ్మహీదేవుండు నగుచు నిట్లనియె నన్నేయఁ దెమ్మనిన విశిఖ । మంతఃపురంబున సంతసంబు
నున్న యనుభవత్సుతుఁ డమ్మఁగాక యిపుడ - గీ ॥ యనఁగఁ దదనంతరంబ ఘోరాస్త్రనిహతుఁ । డై నయబ్బాలుఁ గన
చు నాహారవంబు । లెసఁగ నంతిపురంబు వారెల్ల నేడ్చి । రది ధ్రువంబుగఁ గనియును నవ్విభుండు ॥ వ ॥ కోపాటో
మవిగ్రహుండగుచుఁ దనదురాగ్రహంబు విడువక తనసమీపవర్తులఁ జూచి ॥ మ ॥ వినుఁ డీసర్వజనంబులుం గడఁగి
విప్రుఁ గాదు రాలాపుడు । ర్జను నిందు నే దనస్మదీయకనహాచాపోగ్రనిర్ముక్తబా । ణనిపాతచ్ఛిన్నుఁ గాఁగ రక్తజలశో
ణిసంసిక్తుఁ గాఁ । గనుఁ డీయూందురితాత్మునంచు నతిశీఘ్రప్రాప్తకోదండుఁ డై ॥ క ॥ శరము రివోయిట
రయుగ్రము బాణకార్ముకంబులతోఁ జె । చ్చెర సంస్తంభము నొందిన। నరనాథుఁడు విస్మయావనతమానసుఁ డై ॥ క
ల్లవడి చలము కోపము । పొల్లువడి చనంగఁ గొంత ప్రాద్ధు మొగమునఁ । వెల్లఁదనము గదురనిలిచి । యెల్లజనులు విన
మఱియు నిట్లని పలికెన్ ॥ ఉ ॥ [ఆడితిఁ బెక్కుమాటల వియన్నియు వమ్మయిపోయె నస్త్రసం । తాడనశక్తి గిడ్డపడి
ధ్యముఁ బ్రాహ్మణశక్తి యెక్కుడే । నోడుదు వామదేవునకు నోజనసంఘములార సజ్జనా। మ్రేడితకీర్తి నిమ్మునినమ్ర
నపూనను నాశ్రయించెదన్ ॥ వ ॥ అనియివ్విధంబున నతండేటు దప్పిన జోహారు వెట్టుటయుఁ దదీయబంధుమిత్రజనం
బుభయసంభ్రమంబులతో నమ్మునినాథు శరణుచొచ్చి యనువయింపిన బ్రసన్నుండై యమ్మహాత్ముండు దత్కరయు
స్తంభనంబు మాననను గ్రహించి తదీయనందనుఁ బ్రాణంబులొసంగె నంత నమ్మహీకాంతుండు నిజభార్యాసహితుం
డానతనికిం బ్రణమిల్లి హయంబులఁ దెచ్చి యిప్పించినం గైకొని వామదేవుం డరిగె నిట్టిది బ్రాహ్మణప్రభావంబని చెప్పె
నని ॥ క ॥ మునిపతికి మ్రొక్కి కుంతీ । తనయుఁడు మీకంటె వృద్ధతముఁడగు పురుషుండు ఘాకలఁ డె జగమ్మున నని య

## మార్కండేయుఁడు ధర్మజునకు నింద్రద్యుమ్న మహారాజు చరిత్రము చెప్పుట.

డిగిన నాతఁ డిట్టులని యెఱిఁగించెన్ ॥ క ॥ ఘనుఁ డింద్రద్యుమ్నుం డను। జనపతి గలఁ డాతఁ డింద్రసదనమున ముదంబు
నుండఁగ బహుకాలం । బున కాతనికీర్తి లోకమున నమాయుటయున్ ॥ గీ ॥ అసురులిచ్చోట నుండ లేవరుగ ననుచు । ని
ర్వీంద్రో వినన తఁడు నాయున్న కడకు। నర్థి జను దెంచి యిట్లను ననఘ నన్ను | నిద్ధపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగుదయ్య
సీ ॥ అనుడు నేనిట్లంటి నయ్య ని న్నెఱుఁగంగఁ జాలనయ్యెద హిమశైలశృంగ । వాసియైయుండుఁ బ్రావారకుండని యెడ సే
ఘూకము కడు పెద్దయడియు । నాకంటె ని న్నిర్ణయముగ నెఱుఁగుఁ బొమ్మనుటయు నన్నరమ్మనియె నతఁడు । ఘన
యన ఘుటికా ప్రయోగంబున దేహదాహంబు వర్ధిల్లఁగానఁ - గీ ॥ గదలి గాఁ జాల నేనంటిఁ గడఁగి యన్న | రేంద్రు
శ్వమైననుఁ బ్రీతి నెత్తికొనుచు । నాయులూకముపాలికి నరిగి నన్ను | నడిగినట్టుల దానిఁ దానడుగుటయును ॥ వ ॥ అ
య్యునుఁ గొండొకసేపు దలపోసి చూచి యేను నిక్కువంబుగా ని న్నెఱుంగనేర నింద్రద్యుమ్నుం బను కొలని యందు నాళీక
ఘుండను బకవల్లభుండు వసియించు నవ్విహంగంబు నాకుం బెద్ద ని న్నెఱుంగుఁ బొమ్మని నన్ను మనుజపతి నాతోడ నయ్యా
కంబు మోచికొని నాళీకజంఘు నొద్దకుం జని తన పేరు సెప్పి న న్నెఱుంగుదే యనిన నదియును నేను న్నెఱుంగఁజాల నాకంటె
జిరకాలజీవియైన యుగంధరుండను కచ్ఛపంబు కలదది యును నిక్కొలన నుండు నజ్జలచరము ని న్నెఱుంగఁ జాలు నడిగి చూ
ముగాక యనియత్కపఠంబుఁ బేర్కొని యిది యొక్కసందేహంబు నిర్ణయించుటకై యార్యజనంబులు నిన్ను గురించి వ
నవారు నీవు సను దేరవలయునని వేఁడుటయును ॥ గీ ॥ కొలను వెలువడి చనుదెంచెఁ గూర్మవిభుఁడు। వారలడిగి రింద్రద్యుమ్న
ధారుణీశు। నెఱుఁగుదే యని యది యనొక్కింత సేపు। తలఁచుకొని కన్నుఁ గవ నశ్రుతతులు దొరుఁగ ॥ వ ॥ అతం డెఱుంగు
ల్పఁడ వారలం గనుంగొని యిట్లనియె ॥ ఉ ॥ అక్కట నే నెఱుంగ నెమహాగుణభూషణు నమ్మహాత్ము న। న్నెక్కుడు బెక్కు
బులు న నేకభయంబులఁ బొందకుండఁగా । నక్కటికంబుతోడఁ దగ నాతఁడు గైకొని కాచెఁ గాదె పెం । పెక్కన యన్న

శ్వరుని నెన్నఁటికిన్ మఱవఁగ వచ్చునే * గీ॥ అమ్మహాత్ముఁ డొడుబహువిధయజ్ఞదక్షి । ణార్థముగ విప్రవరులకు నర్థినిచ్చు। గో
గణంబుల గొరిజల గ్రొచ్చియయ్యె [illegible]రోవరము జగన్నుతముగ * వ॥ అనిన యనంతరంబ దేవదూతలు విమానం
బు గైకొని చనుదెంచి యి[illegible]ద్యుమ్నుం [illegible] మహాత్మా నీకీర్తి జగంబునందు శాశ్వతంబై నిలిచె నీవు త్రిదివదివాసంబున
కిరంబయ్యె నరుగు [illegible] విమానంబెక్కుమని పలికియును * క॥ తనకీర్తి యెంతకాలము। వినఁబడు నీజగమునందు వెలయుఁ
గనందాఁక నుఖ్యలోకసౌఖ్యంబున నెంతయు నుల్లసిల్లుచుండుఁ బురుషుం డనఘా * వ॥ అనుటయు నమ్మహీకాంతుండు దివిజకిం
కరులం జూచి యమ్మునుల తాపసు నివృద్ధవిహంగంబును గార్యార్థంబుగాఁ దెచ్చితి వీరిని నిజస్థానంబుల నునిచి వచ్చెదనిం
చుక నిలువుఁడని వారి చేత ననుజ్ఞాతుం డై నన్ను ననులూకంబును నెప్పటి నెలవులఁ బెట్టి తాను దేవయానంబున దివంబునకరి

* మార్కండేయుఁడు ధర్మజునకుఁ గువలాశ్వచరిత్రము చెప్పుట. *

గెనని చెప్పినఁ బ్రీతుండై పృథానందనుండు * క॥ నీకంటె వృద్ధతములగు । లోకరయేలఁగిం చితిది మహాద్భుతముగను । శ్లో
కుఁడు మునివరునకుఁ బునఃకృతికిఁ గృతప్రణాముండై యిట్లనియె * వ॥ మునీంద్రా ఇక్ష్వాకువంశోద్భవుండైన కువ
లాశ్వునకు ధుంధుమారుండను పేరెట్లు గలిగెం జెప్పవే యని యడిగిన నతం డిట్లనియె * ఉ॥ శంకరసన్నిభుండు జనశంకరుఁ డుత్క
గరుణాకరుండనాఁ దంకుఁ డుదంకుఁ డన్మహితవిశ్రుతసిద్ధియోగి మరుభూమియందుని । శ్శంకమతిన్వసించి యనిశంబును నవ్యయు నచ్యు
తున్మనః। పంకజవేదిపై నిడి తపంబొనరించె ననేకవర్షముల్ * గీ॥ అతని భక్తికిఁ బ్రియమునొందియాదిదేవుఁ । డంబుజాక్షుఁ డ
ధోక్షజుఁ డచ్యుతుండు। కరుణఁ బ్రత్యక్షమగుటయుఁ గనియతండు। ప్రణతి యొనరించి యిట్లని ప్రస్తుతించె * మత్తకోకిల॥
దేవదేవ శ్రుతిప్రమాణవిధే యమహాధవ జంగమ । స్థావరాత్మకమైన లోకము సర్వమున్భవదీయమా। యావిధేయము విశ్వ
రూపుఁడవవ్యయుండవు నీవ సద్భావసుస్థితి నన్నెఱింగినఁ బాయుఁ బాపములచ్యుతా * చ॥ అనిమిషసిద్ధసంయమివిహంగభు
జంగమముఖ్యులెల్లనిన్ననిశము గొల్చి నీవలనఁ గృతార్థతఁ బొందుదురెందు నీవునె। మ్మనమున సంతసిల్లుదు సమస్తజగంబులు
శాంతిఁ బొందు నీ। కనుకంపమాలు లేదు శివకీర్తి యీభువనత్రయంబునన్ * మత్తకోకిల॥ విక్రమస్ఫురణ యలీల నొలిన విష్టపత్రి
తయంబు వెల్లఁ గ్రమించితి పోరులం దసురాళి నీవుల బ్రస్ఫుర। చ్చక్రవిక్రమకేళిఁ ద్రుంచితి సర్వయజ్ఞఫలావహా । ప్రక్రి
యాత్ముఁడ వీవు నిశ్చలభావభవ్యజనార్దనా । వ॥ అనుమతి యఱ్ఱెక్కు భంగులం బ్రస్తుతించినం గరుణించి పాంచజన్యధరుం
డు వరంబడుగుమనుటయు నుదంకుండు దేవా భవదీయదివ్యరూపంబుఁ బ్రత్యక్షంబుగాఁ గంటి నింతకంటె వరం బెయ్యది కల
దైనను నా మనంబు నిత్యంబును సత్యధర్మశమంబులయందుఁ దిరంబై నీయందు స్థిరభక్తిఁ బుగావలయు నిదియ నాకు వరంబ
నుటయు నద్దేవుండు నీకోరినయట్ల యిచ్చితి మత్ప్రసాదంబున నీ కుంబరమజ్ఞానయోగంబును సిద్ధించుం ద్రిలోకహితంబైన కా
ర్యంబొక్కటి నీచేత సాధితంబయ్యెడు నదియెయ్యది యనిన వినుము ధుంధుం డను దానవుండు జగంబుల కుపద్రవంబు సేయంగ
లవాఁడు దద్వధార్థంబు నీవు బృహదశ్వసూనుండైన కువలాశ్వు నుద్యుక్తుం జేసె దన్నరేంద్రుండు మత్ప్రసాదల
బ్ధంబైన యోగబలంబునం జేసి యాయసురం బరిమార్పఁ సమర్థుండగు నవ్విశేషంబునకు నీవలన నఖిలలోకంబులు నంతసి
ల్లెడు ననిపలికి విష్ణుదేవుం డంతర్హితుం డయ్యె నుదంకుండును బూర్వప్రకారంబునఁ దపంబు సేయుచుండె మఱియును * సీ॥
అనఘుఁ డిక్ష్వాకుఁ డఖిలభూచక్రంబు నేలి నాకమునకు నేగుటయును । నతనినందనుఁడు శశాదుండు రాజయ్యె వాఁడు
కకుత్స్థుఁ డవ్వానికిఁ గనియె। నతఁడు వేనుఁ డను నాత్మజుఁ బడసె నాపృథివీపతికిఁ బుట్టె బృథుఁ డనంగ । బృథుఁడు విశ్వగుఁ డ
ను పేరిపుత్రకుఁ గాంచె నతనికి జనియించె నార్ద్రుఁ డనఁగ * గీ॥ నార్ద్రునకుఁ బుట్టె యువనాశ్వుఁడను తనూజుఁ। డతనికినిఁ బు
ట్టె శాబస్తియను భవుండు। తత్సుతుఁడు బృహదశ్వుఁ డాధరణిపతికి। నుగ్రతేజుండు కువలాశ్వుఁ డుదితుఁ డయ్యె॥ వ॥ అక్కు
వలాశ్వునకు నధికవిద్యావిశారదులు నధికసత్త్వసంపన్నులు నైన పుత్రు లేకవింశతిసహస్రంబులు పుట్టి రంత బృహదశ్వుం
డు నిజపుత్త్రకుం గువలాశ్వుఁ బ్రాప్తసంతానుఁ నత్యంత ధర్మాత్ము నఖిల మహీరాజ్య భారధౌరేయుంగా నభిషేకిం
చి తపోవనంబునకుఁ బోవ సమకట్టి యయోధ్యానగరంబు వెలువడు నవసరంబున నవ్వార్తవిని యుదంకుండు చనుదెంచి బృ
హదశ్వునకిట్లనియె * ఉ॥ నీవు ప్రజాభిరక్షణము నెమ్మి నొనర్పక యరణ్యభూమికిం। బోవఁగ నేల రాజులకు భూప్రజఁ గాచు
టకంటె ధర్మముల్ । భూవరకల్గునే యడవియ బోయి వసించినఁ గాని కాదెర । యావిధిఁగాదె సద్గురులు గాంచిరి తొల్లిటి రాజసం

దనల్ ॥ క ॥ నీరక్షణంబుకతమున, ధారుణిమము బోటిసాధుతపసులునిత్య। ప్రారంభధర్మకర్ములు । దారులగుట
యానీదుధర్మపుగాదే ॥ వ ॥ వీను మొక్కయద్భుతంబు సెప్పెద మధుకైటభనందనుండు ప్రఖ్యాతులైన యసురులతనయుం
డుండుండను వాడు మహాబలపరాక్రమసంపన్నుండు నిజతపోబలంబునం బితామహుని మెప్పించి వరంబువడసి దేవదానవ
గంధర్వాదులకు నజేయుండై చరియించుచుండు నయ్యసుర యిప్పుడు మదీయాశ్రమసమీపంబున బహుయోజనవిస్తీర్ణం
బగుసముద్రవాలుకాపులినతలంబునందు మహావివరంబు గావించుకొని సుఖంబున నిద్రించుచున్నవాఁడు వాలుకాచ్ఛా
దితశరీరుండై యున్నవాని నిశ్వాసపవనంబు భువనంబున ధూమసహిత జ్వాలాభీలంబై సంవత్సరంబునకొకమా
ఱెలువడి భూనభోంతరంబెల్లను నిరంతరపింగ తారజఃపటలంబు మూటుకొనం జేయుఁ దదీయవేగంబునం దత్సమీపభూమి
లకానవంబు లేడుదినంబులదాఁకఁ గంపించుచుండు నిట్టి దారుణత్వంబున మాకు మాయాశ్రమంబు నుండుట సంకటం
బగావున నద్దురాత్ము నధిగమించి మాకును లోకంబులకును బ్రియంబు సేసి కృతకృత్యుండవై మఱియుఁ దపోవనంబున కరుగు
ము ॥ గీ ॥ ఎవ్వఁడమ్మహాసురువధియించువనికిఁ। బూనునతనికి వాత్మీయభూరిశక్తి । యిచ్చిజయము తుననియానతిచ్చె నట్టి
యాదరమున నాతోడఁజక్రాయుధుండు ॥ వ ॥ కావున ॥ చ ॥ అతులితవిష్ణుశక్తిసముపాహితమూర్తివిగమ్ము లెమ్మనా
తతభుజశక్తినిట్టియవధానమొనర్పఁగ నీవ కాఁ యీ। క్షితినొకరుండు లేఁడధికకీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ననూ । రిత్న
యింతవట్టుదగఁ జేయుము గావుము లోకమంతయుత్ ॥ వ ॥ అనినఁ గృతాంజలియై యాదండునకు బృహదశ్వుండిట్లనియె ॥
విమలమతినస్త్రసన్యాసముఁ జేసితిఁ దపమొనర్పసమాకట్టితినిం। కమునీంద్ర తపోవనగమనముదవ్వదు నాకు నిమ్ము
న్న పమఠ్ ॥ చ ॥ అనఘుఁడు మత్సుతుండు కువలాశ్వుఁడు వీఁడె మహాబలుండును । జనహితకారి ధైర్యనిధి సంభృతకీర్తి
ప్రియార్థమై। జనసుతయమ్మహాసురునిఁ జంపుటకోపునవార్యశౌర్యవ । ద్ఘనులగుచున్నవు త్రులుసుదామనభేద్యభుజ
విభూతితోడ్ ॥ వ ॥ నాకుననుజ్ఞయిచ్చి వలయునని యకార్యంబునకుఁ బుత్రుసమర్పించియమ్మునిచేతననుజ్ఞాతుండై త
పనంబునకరిగెననివిని ధర్మనందనుండు మార్కండేయుతో ధుంధుండు మధుకైటభులపుత్రుండని చెప్పితిరమ్మధుకైట

—— ॥ మార్కండేయుఁడు ధర్మజునకు మధుకైటభులచరిత్రము చెప్పుట. ॥ ——

భులెక్కాలంబువారేమి క్రమంబున నెవ్వరిచేత నేమైరని యడిగిన నతండు ధర్మనందనునకిట్లనియె ॥ సీ ॥ అధిపతొల్లి జగత్త్ర
యంబు నేకార్ణవమైయుండగా నప్పుహరి యొకండ। భాసురభోగీంద్రపర్యంకమున భవ్యయోగనిద్రాసుఖయుక్తినలర।
తిదీర్ఘమగుకాలమరిగెఁబదంపడి దైత్యులిద్దఱు మహోద్దాత్తభుజులు। మధుకైటభులు నాఁగ మథితశాత్రవులేసు దెంచియ
వ్వరమాత్ము దివ్యనాభి ॥ గీ ॥ కమలమున వెలుంగు కమలాననునిఁ గని। దర్పదోషమతి నిదలరఁ బ్రేయ। నతఁడు భీతి నొందియా క్రో
శమొనరించె। నాదిపురుషనన్ను నరయుమనుచు ॥ ఉ ॥ ఆ తెఱంగాత్మఁ గాంచి కమలాక్షుఁడు మేల్కని ఘోరవిక్రమో । ద్ధ
తులదైత్యసింహులన పేతభయాత్ములఁ జూచి మీరలి। ట్లీతని నీగతిం బఱుపనేల భవద్బలశౌర్యయుక్తికిన్ । బ్రీతుఁడనైతి నె
చ్చెఁగ నభీష్టవరంబులు వేఁడుఁ డిచ్చెదన్ ॥ గీ ॥ అనినఁ గలకలనవ్వి యయ్యసురవరులు। నీవుమాకేమియిచ్చెదు నీకు మేము। వ
రమ్ములిచ్చెదమడుగుము వలచితేని। యనిన వారలకిట్లను నవ్విభుండు ॥ క ॥ సత్యవ్రతులార వరం । బత్యంత ప్రీతి మిమ్ము నడిగె
దలోకప్రీత్యర్థముగా వాచే। మృత్యువును బొందుఁడిపుడు మీరలిరువురున్ ॥ వ ॥ అనిన వారలొండొరుల మొగంబులు
సూచుచు నా చక్రధరునకిట్లనిరి ॥ చ ॥ నగినగియేమి యుర్వినుజవాద్దన యొన్నఁడు బొంకువలుకము । త్యగణితధైర్యవి
షబలైక సహస్రులమెల్లభంగిఁగా। లగతితోలంగఁ ద్రోవఁగఁ డలంబగు నేయసుఁగాక నీకు మె। చ్చగనిదె ప్రాణమిచ్చెద
ము స్రుక్కుదు చావునకాత్మ నేమియున్ ॥ గీ ॥ చంపెదేనిమమ్ము జలములు లేనిదే। శము నజంపవలయుఁ గమలనాభ। యి
మింతవట్టునీచేతఁ బడుటకు। దగువ మనిననగుచు నగధరుండు ॥ వ ॥ త్రైలోక్యంబును జలమయంబగుటయాలోకించి యి
మేశుఁడు దనయూరువులు। పరవుగనొనరించి వాని పైఁ దచ్చిరముల్ । వగుపతరశితసుదర్శన। ఖరధారానిహతిఁ జేసి గ్రక్కు
నఁదునిమెన్ ॥ గీ ॥ వరఁగ మన్మధుకైటభాసురులసుతుఁడు । సువ్వెధరణీశ దుంధుఁడన్ శూరవరుఁడు । వాఁడు వరగర్వమ
జేసివాఁడిమిగిలి। సురపతిఁ దొట్టి వేల్పులబరిభవించు ॥ వ ॥ అని చెప్పియమ్మునీంద్రుండిట్లనియె నట్లు బృహదశ్వు చేతననుజ్ఞా
జ్ఞాతుండై కువలాశ్వుండు శుభదినంబున నాదంకపురస్సరంబుగా కృతప్రస్థానుండై ॥ తరల ॥ దనుజనిర్మథనైకతత్ప

తావిజృంభణ మొప్పస । ద్వివిత తేజుఁడు ఘోరసంగరవిభ్రమోత్సవలీలమై । ఘనభుజాబలభూరిదుర్వహగర్వసంగ్ర
హులైననం । [illegible]లనేకసహస్రసంఖ్యులు దమ్ముఁ గొల్వఁగ నుదగ్రుఁడై ॥ మ ॥ చతురంగధ్వజినీపదప్రహతిక్ష్మాసర్వసం
హావక్రమా । తత్క్షణంబుగ నేఁగె నప్పుడు దగన్ దైత్యారియా రాజునం । డతులంబైన జాంశశక్తిసొనిపెఁ బాహర్షించి
రింద్రాదిదేవతలున్ [illegible]లు న్నృపతికై శ్వర్యోన్నతిం జేయుచున్ ॥ గీ ॥ మొరసె దివ్యతూర్యములు నందనప్ర
సూనసురభికుసుమవృష్టి గురిసెఁ గలయ । నప్రతీతభంగి యనుమందపవనవిచేష్టితంబు కరమభీష్టమయ్యె ॥ క ॥ గగనమున నా
రవిమానము లగణితములు గ్రందుకొనియె ననుకూలములై । మృగవక్షితతులు శోభన । ములు తేప్పడఁ జెప్పె నజ్జనాధిపు
యాత్రన్ ॥ వ ॥ ఇట్లు సనిమవలాశ్వుఁడు సముద్రతీరంబున విడిసి నిజపుత్రులనాసహస్రసంఖ్యులను వారినవారిత
జనసత్త్వులం దద్వాలుకాపులిన ఖననంబు సేయ నియోగించిన ॥ మ ॥ నరనాథోత్తమనందనులఁ గ్రవాహాభీలకు
ద్దాలము గ్గరకాష్ఠాదులనయ్యుదగ్రసితతౌఘంబంతయుం గాసవ్రవా । సరములై యకపాయఁ ద్రొబ్బిన ఖుమా సంసు
ప్తుఁడై యున్నయా । సురవైరిం గనిరుగ్రనిశ్వసనసంస్పృష్టాగ్నికీలావృతున్ ॥ చ ॥ అడరి నిశాతపట్టిసగదాసిపరశ్వ
ధభూరి హస్తులై । తడయక వారలందఱును దానవుదేహము వీఁకవ్రేసియున్ । బొడిచియు నొంప నెంతయును బ్రొ
ద్దునకయ్యసురాధముండు బి । ట్టొడలు గదల్చి నిగ్గి వివృతోగ్రముఖుండయి యావులించినన్ ॥ మ ॥ భోరున విస్ఫులింగ
ములు పుట్టఁగఁ దన్ముఖనేత్రనాసికా । ద్వారములందు వెల్వడియె దారుణవహ్నిశిఖాకలాపముల్ । వారక యందు నస్స
గ్గిరనివాక్యలు రాజకుమారులందఱున్ । ఘోరతసాగరుల్ గపిలు కోపమున న్నశియించుచాడ్పునన్ ॥ వ ॥ ఇట్లు పృథా
శ్వ పిలాశ్వభద్రాశ్వులు దక్క గాఁదక్కిన కొడుకులందఱు సమసినఁ గనుకొం గువలాశ్వుండు మహాయోగావసానస
మయసప్తాశ్వుండునుం బోలె నుజ్జ్వలుండై కదియుటయు నద్దానవుండు క్రోధసంరంభంబున సముత్థితుండై యొక్క
మూలఁ బెత్తుకొని కదిసె నప్పుడమ్మహీవిభుండు తదీయదేహజనితంబై మండుచున్నయగ్ని నాత్మీయయోగవిద్యాప
ష్టోప్రభావంబున జలప్రవాహంబునఁ బ్రశాంతంబుగావించి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన ॥ క ॥ ఆదివ్యాస్త్రజ్వ
లనము । భూదిగ్గగనములు నిండి పొదివి మహోగ్రం । బై దానవుఘనదేహము । బూదిగ నొనరించె జిత్రముగ నొక
మాత్రన్ ॥ అంత ॥ క ॥ సురశత్రుఁడైన ధుంధుని । బరిమార్చితి నీవు జగముఁ బాలించితి భూ । వర ధుంధుమారుఁ డనఁ
గాం బరఁగుదు మీవనిరి సురలు పార్థివముఖ్యా ॥ వ ॥ ఇట్లు ప్రసన్నులై యింద్రాదిదేవతలు నుదంకప్రముఖసన్మునులు నమ్మ
హీవరు నభినందించి నీకేయ్యది యిష్టంబు సెప్పుమనిన నతండు బ్రాహ్మణభక్తియు ననవరతదానశీలతయు విష్ణునితోడిస
ఖ్యంబును దక్షుని వలన నమృతులైన తనసుతులు గలుగను వరంబులు గోరిన నట్లయొసంగి వారలందఱు నిజనివాసంబుల
కుం జనిరంతఁ గువలాశ్వుండును విజయోల్లాసభాసితుండై యాదంతుని నాశ్రమంబున కనిచి తనపురంబున కరిగి వా
రాంగనానృత్యగానవిశేషంబులాలోకించుచు రాజధానిం బ్రవేశించి సముజ్జ్వలసామ్రాజ్యవిభవంబుల ననుభవించుచుం
డె నని మార్కండేయుండు ధర్మరాజునకుం గువలాశ్వుండు ధుంధుమారుండైన విధంబు సెప్పెనని వైశంపాయనుం
డు జనమేజయునకుం దెలింగించెన్ అంగున ॥ క ॥ పరమయుగచరితధర్మ । స్థిరకర్మాచరణచతురధీగుణలీలా । పరికర
పరిచితనయవి । స్తరవితరణవివరణైకదానవినోదీ ॥ మాలిని ॥ కరివరఫణిహర్మ్యక్ష్మాధరాధీశతుల్యా । ధ్ధరణగుణధు
రీణోద్దండబాహార్గళాగ్ర । స్ఫురితనిఖిలగోత్రాభోగభాగైకభోగా । తరుణగుచిరమూర్తీ ధర్మతంత్రానువర్తీ ॥

గద్య ॥ ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున
యక్షయుద్ధంబును గుబేరదర్శనంబును నర్జునాగమనంబును బాండవులకు నకింద్రుండు సనుదెంచుటయు
నర్జునుండు నివాతకవచకాలకేయపౌలోమవధప్రకారం బెఱుంగించుటయు నాజగరంబును బాండవు
లు కామ్యకవనంబునకు వచ్చుటయుఁ గృష్ణమార్కండేయాగమనంబును బ్రాహ్మణప్రభావకథనంబు
ను సరస్వతీగీతలును వైవస్వతుచరితంబును గల్పాంతప్రకారంబును యుగధర్మకీర్తనంబును వామ్యాశ్వ
హరణంబును నింద్రద్యుమ్నోపాఖ్యానంబును ధుంధుమారచరితంబును నన్నది చతుర్థాశ్వాసము ॥

శ్రీహయగ్రీవాయ నమః.



## శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - పంచమాశ్వాసము.

శ్రీయువతీప్రియనృపనా । రాయణబిరుదాంక భీమరమణీయగుణా। శ్రీయుతనిర్మలధర్మా। రాయణ రవితేజ రాజ
జనరేంద్రా * వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు బహుభంగుల మార్కండేయుండు వివరింపఁ
న్యకథావిశేషంబులు విని సంతుష్టహృదయుండై కౌంతేయాగ్రజుం డమ్మునీంద్రున కిట్లనియె * సీ॥ సమధిక
దుర్జయములైన యింద్రియంబులఁ గుదియించి తెచ్చి । మనసు పొందున నిడి మనసు నహంకారంబు వజ్జఁ బాపి నిస్స్పృ
యాప్తి । నెరయంగ నఖిలంబుగ భర్తృశుశ్రూషయందుఁ సమాహితలైన వనిత। యఖిలలోకోత్కృష్టయని యొప్పు
హింతు నరయఁ బతివ్రతలైన వారి * గీ॥ చరిత మత్యంతధర్మమాహాత్మ్యంబు కరము। దుష్కరంబును గాదె నిర్ధూతమరిత
గావున విన వేడ్కయయ్యెఁ జెప్ప। వయ్య పుణ్యసతీప్రభావంబు నాకు * వ॥ మఱియుం దల్లిదండ్రు లిరువురయందుఁ బు
త్రనిమిత్తంబైన యాయాసం బెవ్వరికెక్కుడు వారలయెడం బుత్రుండెట్టివాఁడు గావలయు హీనయోనిజాతుండై
పురుషుండేని తెఱంగున నడవడిం బరమధార్మికుల లోకంబులు వడయు నివి వివరింపనీవ యర్హుండవనిన నమ్మహాముని
మ్మహీపతి కిట్లనియె * సీ॥ జతనంబున మిగుల మాసములు దొమ్మిది యుదరంబునఁ గరము భరంబుతోడ। భరియించి పదపడి ప్రా
ణసంశయదశ నొంది పుత్రునిఁ గాంచు నొనరఁ దల్లి । తపములు యజ్ఞముల్ దానములు వ్రతములు దేవతాసజ్జనసేవనములు స
లించుఁ బుత్రునిఁ గామించి జనకుఁ డిట్టి గురువుర పాటు మసరి యొతలంప * గీ॥ దనయుఁ గని తల్లిదండ్రులు దనకు నతఁడు
డగుటకు ధర్మార్థసక్తుఁ డగుట। కాసపడుదు రువిన మట్టి యాససిద్ధిఁ। బొందఁ జేయు నాతఁడు సూవె నందనుండు * క॥ జన
యుజనకులు నెవ్వని । యనువర్తనమునఁ బ్రియంబు నందుదు రేవఁద। త్తనయుఁడు ధర్మము గీర్తియు నూనము గనుకుఁ

### మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబు చెప్పుట.

జాలు నతఁ డయగతులకు * వ॥ మఱియు నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్తయైన పతివ్రతకు నఖిలయజ్ఞదానతపస్స
బులు సులభంబులగు నొక్క యితిహాసంబు సెప్పెద నందు నీయడిగిన యర్థంబులన్నియుం దేటపడు నాకర్ణింపుము కౌశికుం
డను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయనతత్పరుండై యొక్క శిష్టగ్రామంబున నుండు నతం డొక్కనాఁడు
మసమీపంబునం దొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండఁ దదీయశాఖాగతంబైన కొక్కె
యతనిపై రెట్ట వైచిన నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నదియప్పుడ నిశ్చేతనంబై నేలం బడినం గనుంగొని యతండు *
అక్కటనా హృదయము గడు। నిక్కటికము లేనిదయ్యె నిమిత్తమునం । కొంకక యిట్లు చేసితి నా । కెక్కడి శాంతి
పికలహృదయుండగుచున్ * వ॥ పెక్కుభంగుల వగచి మధ్యాహ్నం బగుటయుఁ గృతస్నానవిధానుండై గ్రామంబు
రిగి యంతశుచులైన విప్రగృహంబులకరిగి భిక్షాచరణంబు సేయుచు నొక్కపుణ్యగృహంబు వాకిటఁ నిల్చి భిక్షాం దే
హి యనుటయు నాయింటి సతియును నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయు నెడ * ఉ॥ ఆయెలనా
భర్తగడు నాఁకటఁ దూలుచు వచ్చె వచ్చినన్ । దోయజనేత్ర సంభ్రమముతోఁ దగు పీఠముఁ బెట్టి పాద్యమున్। బాయక స
నక్రియయా భక్తి నొనర్చి ప్రియోక్తులొప్పఁగా। నాయనఁ దృప్తిఁ జేసె రుచిరాన్నరసంబుల నింతి చెచ్చెరన్ * చ॥ కుసు
షమ్మటం గుసుమకోమలితస్తృతిసంస్తరంబుగా । నెడిక పుశయ్య సేసి ప్రియుఁ డాయ్యనయందు శయింపఁ దమ్మలం ।
రణంబులొత్తి మది రేఁతుణ యంతఁటిలోఁ దలంచెము । న్నడరఁగ భిక్షకై నిలిచినట్టి మహీసురముఖ్యు నాత్మలోన్ * వ॥
దలంచి భిక్ష గొని చనుదెంచిన నమ్ముగువఁ జూచి కౌశికుండు రోషరంజితలోచనుండగుచు నిట్లనియె * క॥ అడిగిన
డ చెచ్చెరఁ గడపినఁ బోనవ్వ యేను గడు దుర్మతివై। వడఁ తినను నిలిపి భిక్షం। బిడక కడు నవజ్ఞ సేసితే లమదమునన్ * చ॥
నఁ బతివ్రతాతిలకమాతని కిట్లను నయ్య మత్ప్రియుం। డనుపమితక్షుధాకలితుఁడై చనుదెంచిన భక్తి నమ్మహాత్ము
సేయుచు నిమ్ముదిలోనఁ దలంపఁ జాలనై। తీరదియుఁ దప్పు గాఁ గొనక ధీరత యొప్పఁ సహింపఁగాఁ దగున్ * వ॥ అని

దేవుఁడప్పతివ్రతకిట్లనియెం ఉ॥ నీవుగడింతయెక్కు వెఱసీఘులుభూసురులింతతక్కువే!। కోమలివేలయిట్లుగడుఁ గ్రొ వ్వనఁగాన వులోకవంద్యులకా।భూమిసురేంద్రులకా దివిజపుంగవుఁడా దిగభక్తిఁగొల్వఁగాఁ। నేమిటికొక్కవారుగడు నెన్లిద మైరిటునీకుఁ జెప్పటకా॥ క॥ అవమానితులగుధరణీ। దివిజులుకోపాగ్నిశిఖలఁదీపించిమహా। ద్రివనద్వీపంబులతో। నవనియునఁ బొడవడంతురప్రతికారుల్ ॥ వ॥ నీవింతనొల్లవై తివిగాకేమియనిననయ్యంగనయిట్లనియె ॥ సీ ॥ దేవతాసములు భూదేవతావరులయ్యుయెనుదన్మాహాత్మ్య మెఱుఁగనయ్య। యొకవిప్రుఁడలిగి పయోనిధిజలముల పేయముల్గాఁగఁజేసెం డెల్లు। దండకవిషయంబుదగ్ధంబు సేయఁడేయలుక మై నొక్కమహాద్విజుండు। వాతాపియను దైత్యవరు మ్రింగి యఱిగించుకొనఁడె భూదేవుఁడొక్కరుఁడు గినిసి ॥ గీ॥ ధరణిమఱియును బెక్కుచందంబులందు। బ్రహ్మాదులైన బ్రాహ్మణ ప్రభువిమహిమ।విని మెఱుఁగిమెఱుఁగిసత్యవ్రతచరిత।కొలఁగొని వెత్తి నేలతగోకొనఁగ ॥ వ॥ నాతెఱంగు చెప్పెదనాకర్ణింపుము ॥ గీ॥ పతియ చూవెనా పాలిటిపరమదైవ। మేను వాఙ్మనఃక్రియలఁ దద్ధితమయొపుదు। కోరిదొనరింతు విదినాతఁగొనకొనంగ। ధర్మములుగాఁగనుండుధుఁదలఁ చిచూడ ॥ వ ॥ నీవు క్రోధనుండవగుట యెఱుంగుదు నీకోపంబున నొక్క కొక్కెరనిహతంబయ్యెంగా దెయదిఘదీ యపాతివ్రత్యమహిమం జేసికాంచితిఁగావునఁ గ్రోధంబుఁగొఱయాదుట లగ్గగాదనిమఱియునిట్లనియె ॥ గీ ॥ క్రోధమోహనామకులైన ఘోరశత్రు। లిరువురెరియించుచుండుదురెపుడు నరుని। నంతరంగములోపల నడఁపకున్నఁ। గలదెయూరక బ్రాహ్మణగౌరవంబు ॥ సీ॥ ఎవ్వఁడుసత్యంబు నెవ్వఁడు బల్కుహింసాదిదూరుఁడు గురుజనహితార్థి। యింద్రియంబులనోర్చి యెల్లవారలఁదన యట్ల కాఁజూచు ధర్మాభిరతుఁడు। కామంబుదగులఁడు గర్మములాలుప సముచితనంప్రమోజత నొనర్చు। నట్టిపుణ్యాత్మునినఘు బ్రాహ్మణుఁడని యనిశంబుగీర్తింతు రమరవర్యు ॥ గీ॥ లార్జవంబు శమము నధ్యయనంబును। బరమధనమును వ్వె బ్రాహ్మణునకు। ధర్మగతికిని నియతగు సాధనంబులు। వేదవిహితముఖ్యవిధులు నియ ॥ వ ॥ ధర్మంబు బహుమార్గదృష్టంబై సూక్ష్మంబైయుండు నీవు కేవలస్వాధ్యాయపరుండవు గావున ధర్మసూక్ష్మతయెఱుంగవు కావునం దజయక మిథిలానగరంబున కరుగుమందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నైనవాఁడు ధర్మవ్యాధుఁడనుకిరాతుండు నీకునఖిలధర్మంబులెఱుంగింపఁ సంశయచ్ఛేదంబు సేయు నాయెడం బ్రసన్నుండవగునది వనితలకుం బరిజ్ఞానంబులేదు గావున నా నెట్టియపరాధంబు సేసినను సహింపవలయుఁగదా యనినఁ గౌశికుండిట్లనియె ॥ క ॥ వినుము దూఱఁగ దగునీకత। మునినాచిత్తము ప్రశాంతిఁబొరసెఁ బురంధ్రీ। జనవినుత పోయివచ్చెద। ననుపమశోభనసమృద్ధులయ్యెడు నీకున్ ॥ వ ॥ అనియాతఁ

## కౌశికుఁడను బ్రాహ్మణుఁడు ధర్మవ్యాధుని యొద్దకుఁ బోవుట.

డంబయమ్మహాద్విజుండు ధర్మవ్యాధదర్శనలాలసుండై కదలి పతివ్రతయెఱుకకు విస్మయంబందుచుఁ దన్నుంగృతావరాధుంగాఁదలంచుచు ననేకనగరగ్రామంబు లతిక్రమించిచని యనుపమానశోభాసనాథంబైన మిథిలానగరంబు సొచ్చి రాజమార్గంబు దరసియచ్చటిజనుల ధర్మవ్యాధుండున్నయెడ యడిగి వారెఱుంగింపనయ్యెడకేగి ముండట నల్పమృగమాంసఖండంబులంగడి బచరించి యమ్ముచున్నవాని ననవరతవిక్రయాగత జనసమావృతుంగని యత్రజుగుప్సితంబైన సూనాపణంబు సొరనొల్లక తొలంగి యొక్కయెడనుండె నంత ॥ గీ ॥ వాఁడునతనిరాకఁ పోడిగజబుద్ధి। నెఱిఁగియతని యున్నయెడకునచ్చి।పరమభక్తి మ్రొక్కి ధరణీసురేశ్వరుఁ। గుశలమడిగి ప్రియముగొనలునిగుడ ॥ చ ॥ అనఘుని తంబినీతిలక మైనపతివ్రత నాతెఱంగు నెపిప్పఁజము దెంతీవునను బ్రీతిఁగనుంగొనఁ నీమనోరథం। బునిమదిలోనెఱుంగుదుఁ బ్రమోదముఁబొందితిరమ్ము మద్గృహంబునకనివల్కితోడుకొని పోయెనతండు మహాసుకోత్తముకా ॥ వ ॥ కౌశికుండును ధర్మవ్యాధునెఱుక కచ్చెరువంది పతివ్రతయెఱుకయుం దలంచి యిది రెండవయాశ్చర్యంబు గంటినని తలంచుచుఁ దదీయగృహంబునకరిగి వానిచేతఁ బూజితుండై యిష్టకథాప్రసంగంబునను డియతనికిట్లనియె ॥ గీ ॥ నీవుగడు ధర్మవిదుఁడవు జీవనంబునకరిగి వానిచేతఁ ... హింస జీవనంబుగ నడచుట శిష్టపథమె। యకటయీ ఘోరకర్మంబు నకుమదీయ। బుద్ధి తద్దయు దుఃఖంబుఁ బొందెనపుడు ॥ వ॥ అనుటయు లుబ్ధకుండిట్లనియె బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయబ్రహ్మచర్యంబులును రాజులకు దండనీతియు వైశ్యులకుఁ గృషిపశుపాల్య వాణిజ్యంబులును శూద్రులకు బ్రాహ్మణశుశ్రూషయు నెట్లు పరమధర్మంబై చెల్లునట్ల మాకును మ

గమాంసోపజీవనంబు పరమధర్మంబువిశేషించి యిది వంశక్రమాగతంబైన యాచారంబు వినుమదియునుంగాక
దేశంబునకు రాజైన జనకుండు నిజధర్మతత్పరుండై సకలవర్ణరక్షణంబు వదలకుండు నాత్మవర్ణాచార ధర్మంబులు
డుచువారిం దనపుత్రులనైనను దండితులం జేయుంగావున నేనును నిజధర్మపరిత్యాగంబు సేయ నోపకున్నవాడ నీదృశ
నుండనయ్యెను. గీ॥ జీవహింస నెన్నండును జేయననఘ! యొరులు చంపి తెచ్చిన మాంసమొనరవిలిచి। తగినవెలకమ్మి
దుకుదుం దద్ధనమున! నమలమాంసంబు శాంతియ నాధనంబు॥ చ॥ వినయము విస్తరిల్లగురువృద్ధజనాతిథివిప్రదేవతా
నలొనరింతు సత్యమున శౌచము నేమ అనీవిమన్ననం! దనపుకభృత్యబంధుతతిం దాల్మి వహింతు ననూయం జేయనెం
నమదిం దృప్తసౌఖ్యంబరదోషకథావిముఖుండ నెప్పుడున్॥ క॥ సతతోపవాసనియమ! వ్రతములం జరియింతు నేతపస్వి
ప్రియుండన్! ఋతుకాలరతుండనిండా! స్తుతులందుమనంబు నాకు దుల్యతనుండున్॥ వ॥ అట్లగుటం జేసి హీనయోని
తుండనయ్యును నిర్మలుండనైతిం బ్రసంగవశంబున నింత చెప్పవలసెనీవు ధర్మప్రబోధార్థంబు నా యున్న యెడకు
దెంచితి కావున నీకు ధర్మవిశేషంబు లెఱుంగించెద నవధానపరుండవై యాకర్ణింపుము॥ క॥ తనకులధర్మము విడువక
టవరమధర్మనుం శ్రమాన్యులు చిత్తంబున గృవగలుగుట ముఖ్యపు! పని సైరణవలయు నఖిలభావములందున్॥ గీ॥
పువలయు సకలవిషయవాంఛలయందు! విడుపుం బోలు గుణము వెదకి యొందు! గాన గైరిబుధులు కలరె పరిత్యాగ! శీలున
నసాధ్యసిద్ధియందు॥ సీ॥ సత్యహితాలాపచతురతయర్హంబు సంతతసుజనపూజనము వలయు। విను క్రోధసంరంభ
ద్వేషములం జేసి మతిగలంగినను ధర్మంబు నవ్వ! కుండంగ నడచుట త్యుత్తమసరణి యప్రియములయందు ప్రియములం
దైన్యహర్షంబులం దగులక యున్నట్టి! కళ్యాణవర్తన కాంతులెస్స॥ గీ॥ యెగ్గు సేసిన వారికి హితము సేత! యార్యజనములు
తురన్యదోష! కారిదన పాపమునం దాన కాలిపోవు! వేఱ వారికి గీడు గావింపనేల॥ క॥ ధార్మికులు సలుపు నుత్తమ। కర్మ
జెడనాడు నాస్తికజనములు సుమా! దుర్మతుల తెఱంగు గనుంగొని! ధర్మము నెడం బ్రీతి వదలం దగదు బుధునకున్॥ క॥ మదినను
పునం బాపము దన! కొదవుట యున్న బిదపవగచి యొకసగమును నే! నిది సేయనింక ననియెడు। మది బెఱసగము మనరుం
మలపునఘంబున్॥ గీ॥ పాపముల కెల్లనెక్కుడు పాతకములు। సువ్వెక్రోధలోభంబులు సువ్రతాత్మ। వాని రెంటిజయిం
చినవాడు గాని। యెందుం బరమధార్మికుండని యెవ్వబడండు॥ వ॥ విశిష్టచరితంబులు గానిమార్గంబులు గొన్ని తృణసం
వృతంబులైన కూపంబులుంబోలెం గపటధర్మసంవృతంబులై యుండు వానిదప్పులను బరిత్యజించి శిష్టాచారంబు నడుపు
ధర్మలక్షణంబునం గౌశికుండు శిష్టాచారంబు లెయ్యవి యెఱింగింపుమ నుటయు ధర్మవ్యాధుండిట్లనియె॥ సీ॥ దానంబు సత్య
దపము యజ్ఞము నార్జవముగాను లోభాదివర్జనంబు। గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష
ధ్యయననిరతి! డాంబికత్వము లేమి దైన్యంబుం బొరయమి యనసూయ యనహంక్రియాభియుక్తి। తలంపంగ నాద్యమై
నరుధర్మము నెప్పుగొని యాటనాస్తిక గోష్ఠింజనమి॥ గీ॥ శీలసంరక్షతీర్థసంసేవ శౌచ! మఖిలభూతంబులందు దయాస్ఫ
గుట! మితహితోక్తులు సంశ్రితమిత్రసుప్తి! యిన్నియును శిష్టచరితంబులిద్ధచరిత॥ వ॥ వీని శిష్టచరిత గైకొని। యనవాయి
నడువనడువ నంతఃకరణంబునం బొదలునట్టి సమ్మద! మనఘా మర్త్యభము సూవె యున్యవధములన్॥ వ॥ కావున శిష్టాచార
ంం జేసి గురుశుశ్రూషనలిపిక్కతాధ్యయనుండవై పరమజ్ఞానపరిపక్వంబైన చిత్తంబుతోడం గామక్రోధమహామకరనక్ర
ణ్యంబు విషయజలపరిపూర్ణయును నైన మోహమహానదిన్ స్ఖలితధైర్యంబను తెప్పం జేసి యుత్రమంబున నిస్తరించి కృతార్థ
సునుని మఱియునిట్లనియె॥ క॥ క్రమమున శిష్టాచార క్రమ మెఱుంగంగ ధర్మమున మఱుగడు వాటంబై! విపులంబగు చిత్తము
మునునహింసయు నుదనకుం డావలములగున్॥ గీ॥ వినుమహింసధర్మవితతి కెల్లను మేటి! యదియు సత్యయుక్తమైన వెలయు
ననఘ శిష్టచరితల దుసత్యమకడు! నధికమని శ్రుతులనరసి బుధులు॥ గీ॥ వేదవిహితంబులును శాస్త్రవిహితములును।
ష్టచరితంబులును నన జెప్ప నెప్పు! ధర్మములు మూడు విధములం దనరు చుండుం! గడంగి యన్నియు సద్గతి కారణములు॥
నయింబు కాశమవంతుడై వినుతశిష్టాచారమార్గంబులన్। జనుపుణ్యాత్ముండు దుర్గతుల్లడ విప్రజ్ఞాహర్మ్యసందూఢుండై
కనుచుండున్ బటు మోహపంకజలమగ్నంబైన లోకంబు వీ। కనధోభాగమునందుడిందికడు దుఃఖంబొందంగా నెల్లవే
ళన్॥ వ॥ అనిపలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె నయ్యా నీవుడోలుత నావర్తనంబు గనుంగొని యిది హింసాత్మ

బసుఁ బుణ్యాపావనం। కరము నమానుషత్వముగుఁ గల్గ షముల్ పశుకీటభావముఁ । బొరయఁగఁ జేయుఁ బ్రకృతిఁ బుట్టుచుఁ
చ్చుచు మోహవార్ధిలోఁ దిరుగుచు నుండుఁ గాని యొక తీరము సేరఁడు జీవుఁ డెన్నఁడుఁ ॥ చ ॥ ఇది సకలంబు గాంచి బుద్ధు
డెవ్వఁడుఁ బాపము పొంతఁ బోకని । ర్మగనిరహంక్రియాత్ముఁడు నమత్సరదూరుఁడునై చరించుఁ బెం। పొదవఁగ ధర్మ
మున నొయ్యన ధర్మముతీ పెంపెంగిలా। వదలఁడు దత్క్రియావిధము వారక యెక్కుడొనర్చు ధర్మముల్ ॥ చ ॥ చిరము
ర్మములు నుపజిత్తము దేఁ బ్రసన్నచిత్తుఁడై । వసువడి నింద్రియార్థముల భంగులు రిత్తలుగా నెఱింగి చె। చ్చెరన విష
తవట్టు నిరసించి తపోదమసత్యశీతలం। బిణతినొంది పొందఁ బిదపం బరమార్థపదప్రభావముఁ ॥ వ ॥ అనిన న
జుండాలుడు కౌశికున కిట్లనియె ॥ గీ॥ ఇంద్రియంబులనఁగ నెయ్యవి యవి గ్రహింపకున్నఁ బాపమెట్లు దొడరు। వానిఁ గ్రహిం
చువానికిన సుఫలం। బెట్టిదనిన నాతఁ డిట్లులనియె ॥ క॥ వినుమీ విషయజ్ఞానమునకు। ననయంబును మనసు మూలమీ దికామక్రో
ధనిరూఢమగుచుఁ బురుషుని। ననిశము నెలయించు నింద్రియార్థంబులకుఁ ॥ సీ॥ ఇంద్రియార్థములకు నెలసిన పురుషునకు
ఁధరాగఁ బునఁగఁ గరఁగుచుండు । రాగంబు వలనఁ దిరంబగు లోభంబు లోభిమై యోగుణకులోను గాఁడు । మఱిస ముద్ధతవృత్తి
ఉగుఁ బాపక్రియఁ దగువారు చెప్పెడిత గవుబినఁడు। కుజముల దెసఁ బ్రీతి గోరుఁ దుల్యంబులు గాపండు వాఙ్మనఃకర్మ భంగ్యు
లిహమునందుఁ బుణ్యహీనుఁడై చెడిపోవు । బరమునందు దుఃఖభరము నొందుఁ। గాన నింద్రియార్థగతిఁ బోకసాధుస
ఙ్గ్జేసి సుగతిఁ జనుట యొప్పు ॥ వ ॥ ఇంద్రియంబులన నెయ్యవి యనియు నింద్రియజయసిద్ధియు నీవు నన్నడిగితివి తత్ప్ర
కారంబు బ్రహ్మవిద్యావిషయంబు మా బోటివారికి నవాచ్యంబై యుండు నైనను నీవు బ్రాహ్మణప్రవరుండవు గావున
బ్రాహ్మణప్రియఁ బవశ్యకర్తవ్యంబు పరమబ్రహ్మవిదులయిన బ్రాహ్మణవరులకు నమస్కరించి బ్రహ్మవిద్యావచ
చంబెఱుఁగించెద నవధానపరుండవై యాకర్ణింపుము ॥ గీ ॥ అంబరము వాయువగ్నితోయమ్ము ధరణి । భూతపంచకం
బిక్రమంబున మహాత్మ। శబ్దసంస్పర్శరూపరసములు గంధ । సంయుతంబుగ భూతపంచకగుణములు ॥ క ॥ ఒనరఁగ వాక
మాదిగ। నను క్రమముతో డనిమ్మహాభూతములే । నును బుట్టు నెకటికొకటికి। ననయముఁ బ్రతిలోమగతిలయంబును బొం
దుఁ ॥ వ ॥ శ్రోత్రంబును ద్వక్కును జక్షువును జిహ్వయు ఘ్రాణంబును ననియేను నింద్రియంబులు శబ్దస్పర్శరూప
రసగంధంబులింద్రియవిషయంబులై యుండు నింద్రియపంచకంబునకు షష్ఠంబై మనంబును సప్తమాష్టంబులయి బుద్ధియు
నహంకారంబును వర్తిల్లు సత్త్వంబును రజస్సును దమస్సును గుణంబులై యుండు నీ చెప్పంబడిన మహాభూతపంచకప్రప
చంబంతయును వ్యక్తంబను తత్త్వంబునందావిర్భావతిరోభావంబులం బొందుచుండు ॥ క ॥ అవ్యక్త తత్త్వమరయఁగ నవ్య
క్తంబయ్యు లక్ష్యమగునట్లగుటఁ। సువ్యక్తేంద్రియభూతా। దివ్యవహారార్థలింగదృష్టాకృతియై ॥ వ॥ అని చెప్పి మఱియు ని
ట్లనియె ॥ గీ॥ అనఘ శబ్దాదివిషయంబులందుఁ దగిలి । యిచ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు। బుధుఁడు తత్స్వరూప
ము దనబుద్ధి నెఱిఁగి। యేమఱక వానిఁ దగఁ గుదియింపవలయు ॥ ఉ॥ ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు తెల్లము గాఁ దనుఁ గాంచు
తవి। స్తారరూఢమైన పరతత్త్వము గాఁ దనయందభూతవి । స్తారము నెల్లఁ గాంచు సతతస్ఫుటదర్శనుఁడై సమగ్రసౌఖ్య
ముఁ బొంది నిర్మలతపంబులయందుఁ జెలింపఁ డెవ్వుడుఁ ॥ క॥ తపమునఁ గసకలవిషయావ్యపేతమగు సట్టి బుద్ధివైభవమున
తపమున సుస్థిరుఁడగు యోగ। పరునకుఁ గలవె యొండు కర్తవ్యంబుల్ ॥ క ॥ స్వర్గనరకంబు లింద్రియ । వర్గసమాచర
మునన వచ్చు నవిన వే। స్వర్గమగుఁ దన్నివారణ । దుర్గతి యగుఁ దన్నిరోధ దుర్బలత మెయిఁ ॥ చ ॥ అరదము దేహ మిం
ద్రియములశ్వములాత్ముఁడు సూతుఁ డిమ్మహా । తురగచయంబు ధైర్యమను తోరపుపగ్గములన్ దృఢంబుగా। నరువడి నొ
క్కయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం। దెరువున నేగు నప్పరమధీరుఁడు సూవె యుదారుఁ డెయ్యెడన్ ॥ గీ ॥ ఇంద్రి
యంబులు దివిరిన యెడకుఁ బాఱు । చుండు మనసెవ్వడద్వేగము డుపకున్న । నెడలి చెడిపోవు బుద్ధియు దీర్ణపవన । హతి
యోధిలోఁ గలమవియునట్లు ॥ క ॥ ఏనింద్రియములు మనసును। బూనితనవశంబులైనఁ బురుషుండు సదా। ధ్యానసమా
ముగ్రుఁడు। వానిం గీర్తింతురపరవరులున్మునులుఁ ॥ వ ॥ అనిన విప్రుండు సత్త్వరజస్తమోగుణంబుల తెఱంగెఱింగిం
మనిన నాతఁడిట్లనియె ॥ క ॥ అతినిందితమతమోగుణ। మతిమోహమయంబు సత్త్వమనయంబుఁ బ్రకాశత నెప్పుడు సుఖ
గుణము। శ్రోతఁ బరఁగు రజోగుణంబును సన్నుతచరితా ॥ మ ॥ అనుఖాకారదతనిద్ర దైన్యముఁ మోహంబతమత్వంబు

మనభావంబులు రాగలోభజడతామానంబులూహింపరా । జనవృత్తంబులు ధైర్యశాంతికరుణా సంతోషవిద్యాదులిం । పెనఁగన్ సాత్త్వికచేష్టితంబులు నిజం బిట్లాత్మఁ గన్నిన్నియున్ * చ ॥ అనఘుఁడు సాత్త్వికుండను మహాత్ముఁడు బోధవిరూఢిఁ దన్పమునఁ గానుఁగొని లోకవృత్తములు గావని రోసి సమస్తసంగభంగనిరతుఁడై తొరంగు మమకారవికారమహంక్రియా వ్యతికర । బనువడి సంయమప్రకటభావననుత్తమశాంతిఁ గైకొనున్ * వ ॥ సత్త్వగుణనిబద్ధుండగు నేని శూద్రుండైన సుజన్మాంతరంబున వైశ్యత్వంబు నొంది క్రమంబున రాజభూసురభావంబులు భజించి భవవిముక్తుండగునని చెప్పిన నమ్మహీదేవుం డమ్మహానుభావు నభినందించి * గీ ॥ దేహమున ధాతుసంశ్రయదీప్తుఁడగుచు । వహ్ని యెట్లుండు శారీరవాయువులను । నెలవులెయ్యవి నాకును నిశ్చయముగఁ । జెప్పుమనుటయు నట్లని చెప్పె నతఁడు * సీ ॥ మూర్ధదేశమునను వర్ధితంబై పర్వు నాత్మాగ్ని వాభితదాశ్రయంబు । శిరమునఁ బావకాంతరమునఁ జరియించుఁ బ్రాణుండు భూతాత్మభావుఁ డతఁడు ॥ వరుసఁ బ్రాణాపానులిరువురు నయ్యగ్ని వెలిఁగింతు రనపేతవృత్తులగుచుఁ । గుదపస్థితలములాస్పదములుగా వహ్ని పరిగతుండగుచు నపానుఁ డుండు * గీ ॥ కడఁగి విణ్మూత్రనిర్గమకారి యతఁడు । కర్మబలయత్నకారియై కంఠతలము । నందుఁ దానుండి వర్తించు నఖిలదేహ । సంధులందును వ్యానుండు సంచరించు * క ॥ విను ప్రాణాపానుల నవ్యానలుఁడుఁ బ్రాపుగ సమానుఁ డన్నరసపిపా । సనుఁ డగుచు నొప్పు దేశం । బున నుండును సకలధాతుపోషకవృత్తిన్ * క ॥ ఇది పరమయోగిదర్శన । విదితం బిప్పాటఁ బవనవిసుదైనమునుల్ । వదలక యభ్యాసవిధిన్ । ముదమున ధరియింతు రాత్మమూర్ధతలమునన్ * వ ॥ ప్రాణాపానసమాహితుండై సకలదేహంబులందును జరియించుచున్న పావకుండు జీవాత్ముండుగా నెఱుంగుమతఁడు జలంబుల నున్న కమలపత్త్రంబునుం బోలె దేహంబునందుండియును లేపస్వరూపదీపితుండై వెలుంగుచుండు నిట్టిజీవాత్ముండు గదా పరమాత్ముండు * క ॥ చేతనరహితక్షేత్రముఁ । జేతనముం బొందఁ జేయు జీవాత్మదశా । న్వితుఁడు పరమాత్ముఁడని । ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్రకల్పనుఁ డనఘా * క ॥ భూతములయందు వెలిఁగెడు । భూతాత్ముని నెఱుఁగుదురు ప్రబుద్ధులు నిత్యజ్యోతిర్మయు నవ్యయు న । ద్వైతంబగు బుద్ధిసూక్ష్మధర్మమువలనన్ * వ ॥ అని మఱియుఁ గౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యాప్రభావంబు తెఱంగు సంప్రయోగరహస్యంబు దెలియ నిట్లనియె * సీ ॥ తెలివి నొందిన బుద్ధిగల మహాత్ముఁడు శుభాశుభకర్మములయందుఁ జొరక యుండుఁ । గ్రమమున సౌఖ్యదుఃఖములాదిగాన శేషద్వంద్వములయందు సమతనుండు । వినుమట్టి పుణ్యునకొనరింపవలయు కార్యం బెఱింగించెద ననుదినంబు । నియతాశియును జితేంద్రియుఁడునై పూర్వరాత్రమ్మునన పరరాత్రమ్మునందు * గీ ॥ యోగధారణనిరతుఁడై యుండవలయు । వపుషు బోధదీపంబున నాత్మ నాత్మ । యందుఁ గనుచు నివాతదీపానుకారియై వెలుంగుచు న నమృతత్వ మొందు * క ॥ కామంబును గ్రోధంబును । నేమఱక జయింపవలయు నెల్ల విధములన్ । ధీమహిత యిదియ సతత । క్షేమంకరమైన పథము కృతబుద్ధులకున్ * క ॥ నిత్యము గర్మియుఁ గర్మఫ । లత్యాగియు నగుట లెస్స లౌల్యవియోగం । బత్యుత్తమయోగము ద । త్ప్రత్యయులక్యుండు సూవె బ్రాహ్మణుఁడు మహిన్ * చ ॥ అరయఁగ జీవితంబు గడు నధ్రువమింత యెఱింగి యాత్మ నె । వ్వరి దెసఁ గీడు రోయక ధ్రువంబగు మైత్రి భజించి సత్కృపా । నిరతుఁడు నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడున్ । బరమశమాస్పదుండునగు బ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్ * వ ॥ నీవడిగిన యఖిలధర్మంబులు సంక్షేపరూపంబున నెఱుంగించితి నింక నెయ్యది వినవలతనినఁ గౌశికుండు మహాత్మా వినవలయునవి యెల్లను విశదంబుగా వింటి ప్రబుద్ధుండనైతి నీవు సర్వజ్ఞుండవగుట దెల్లంబయ్యె ననిన ధర్మవ్యాధుం డతని కిట్లనియె * క ॥ ఏనిమ్మెయి నుత్తమవి । జ్ఞానోన్నతి వడయుటకు నిజంబగు మూలం । బైనదిగల దొక ధర్మము । భూమిసుత యది నీ పద్య

* ధర్మవ్యాధుఁడు గౌశికునిఁ దనతల్లిదండ్రుల యొద్దకుఁ దోడ్కొనిపోవుట. *

స్థముగ నెఱిఁగింతున్ * వ ॥ అని యభ్యంతరగృహంబునకు రమ్మని యతనిం దోడ్కొనిచని మనోహరంబై వివిధసౌరభసంవాసితంబైన హర్మ్యంబునందు మహితాసనాసీనులైన వారిం దనజననీజనకుల నభిమతాహారపరితోషితుల ననర్ఘభూషణాలంకృతమూర్తుల నతనికిం జూపి తాను నుదత్పాదప్రణామంబు సేసి వారలఁ గుశలంబడిగిన నయ్యిరువురు పుత్రునకిట్లనిరి * సీ ॥ అన్న కుమార నీయట్టి సత్పుత్త్రుండు గలుగ మాకేమి కొఱఁగడమ చెపుము । నీ చేయు ధర్మంబు నీకుఁ దోడయ్యెఁ బరమాయుకర్షసంపదలుగనుము । నీ చరిత్రంబున నిఖిలవంశము పవిత్రతమయ్యె మానుషదేహమేల । ధరియించితో కాని తత్త్వమారయఁ బ

రదేవతవీవునందియమువలదు॥గీ॥వాఙ్మనఃకాయములఁబిత్రువత్సలత్వ। మొక్కరూపుగనలుపుచునున్నయట్టి। సద్గుణా
రని న్నెన్నిజామదగ్ని। నెకనినెన్నంగఁదగుఁగాక యొరులుగలరె॥వ॥ అనివలికిరవ్వకుధర వ్యాధుండువారికిం
జూపి యీమహాత్ముండు మనలఁబరమానందంబునఁజూడ వేడ్క మనయున్నచోటికివచ్చెననిన నావృద్ధులతనికి న
బులై ననత్కారంబులుగావించినం గైకొనియతండువారిఁగుశలంబడిగె నంత నమ్మునివరునకుధర్మవ్యాధుండు ప్రియ
తోనిట్లనియె॥సీ॥జననుతవీరు నాజననియుజనకుండు నూవవీరలకుశు శ్రూషఁజేసి। యిట్టిపరిజ్ఞాన మేను బ్రాపించితి
రులఁబూజింతురగ్గినెల్ల। వారుననొందు దైవంబులనొల్లక్కీవృద్ధులు వాపాలి వేల్పులనుచుఁ। గమనీయఫలపుష్పగంధభూ
ణవస్త్రములుమనోహరభక్ష్యజభోజ్యములును॥గీ॥వీరికెపుడునీవేడింతు వేడ్కఁబుత్ర। దారసహితుండనైనియతమ
సేవ। యాచరింతునువేదముల్యజ్ఞములును। వ్రతములునువీరనాకనువ్రతముదృఢము॥గీ॥జననిజనకుఁడుసద్గురుఁడనలుడా
త్మఁడనఁగనియ్యేవురును నేగృహస్థుచేత। సుగతివాంఛఁబ్రసాదితులకుదురట్టి। వాఁడుసూవెధర్మాత్ముండువసుధమీఁ
వ॥అనిచెప్పియిట్లనియెఁబతివ్రతవనుపునంజేసినీవుధర్మజ్ఞానార్థంబు నాయున్నయెడకుంజను దెంచిన నప్పతివ్రతవలన
నన్గ్రహంబుననీకు నెల్లవియు నెఱింగించితిఁగానినీదెస నాచిత్తంబు ప్రియపడియుండ మనీ చేసినకార్యంబొకకొంటి కలదని
య్యాదియనిన॥ఉ॥ఎంతయువృద్ధులైతమకునీవొకరుండవ తెప్పగాఁగన। త్యంతముదంబునం బ్రతుకుతల్లినిదండ్రిని
చని। శ్చింతుఁడవై సదాధ్యయనశీలత వారియనుజ్ఞలేక యే। కాంతమయిమ్మెలకా వెడలితకొంటనీవుకరంబు గూర్తురా
నీసువగచివగచినిర్భిన్నహృదయులై। విగతచక్షులైరివిన వెవార। లరిగియింకనైన ననుమ్మదుసల్లఁగా। దగ్రశోకవహ్నివా
వయ్యెం॥క॥నీయధ్యయనమ్మునసుకృ। తాయాసమునిష్ఫలంబులై చనుగురుసే। వాయుక్తిలేకతక్కనఁ। జేయుము నావచ
మేలుచేకురునీకున్॥వ॥అనినఁగౌశికుండిట్లనియె॥క॥ఇదియట్టిదనీ చెప్పెవ। సదమలహిత వాక్యభంగి సకలమువింటిన్। వ
కయిమ్మెయిఁజరియిం। చెదగురుజనములకుఁ బ్రీతిఁజేసెదనఘా॥క॥నాదైనభాగ్యవశమునఁ। గాదేనీతోడిచెలిమిగలిగె
బరమాహ్లాదమనస్కుఁడనైతిని। భోదయములకెల్లనింక యుక్తుఁడనైతిన్॥క॥పావగతంబగుమర్గతి। మోవుగనకయుం
నుఁబ్రబోధాధికలీలావరిణతుగావించితి। నాపాలిటివేల్పవీవునరనుతచరితా॥చ॥అనుపమమెట్టివారలకునందదుస్తర
థంబుధాత్రిలో। వినువదివేవుగందొకఁడువి శ్రుతధర్మపరాయణుండుగ। ల్గునొకలుగండొసందియముగోరిసనాతన
మూఁదిదియె। వ్వనికినీకుఁబోలెబుధవత్సలయిట్లుచరింపవచ్చునే॥చ॥నినునెకశూద్రుగాఁదలఁపనేరగుణాకరనీచరిత్ర

ధర్మవ్యాధుఁడు గౌశికునకుఁ దనపూర్వజన్మవృత్తాంతంబు చెప్పుట.

త్రనములయందునీకు విదితంబులుగానిపిగ్గలవెమ్మెయిన్॥వ॥ అనిన వానికిధర్మవ్యాధుండిట్లనియె॥క॥ జననుతనీవెఱ్ఱ
యడిగినఁదెలుపుటనాకవశ్యకృత్యముగాదే। వినుచెప్పెదఁబూర్వభవంబున నేనొక బ్రాహ్మణుండఁబుణ్యచరితుఁడన్॥
వ॥ వేదవేదాంగపారగుండనైయుండుచు నాకుం బ్రియసఖుండైన యొక్కరాజపుత్త్రుండుగలఁడతనిసంగతిం జేసి ధ
ర్వేదంబునభ్యసించి యొక్కనాఁడమ్మహీపతి వేఁటపోయిన నేనునునతనితోడనచని వనంబునం బెక్కుమృగంబుల నేయు
చుండనందొక్క బాణంబు తృణలతాంతరితదేహుండైన మునివరునొక్కరుండాఁకినతండు హాయనుచుంబడియెనంత
నేనన్న॥గీ॥డాయఁబోయితీవ్రసాయకవిద్ధుఁడై। పొరలుచున్నవిప్రవరునిఁజూచి। తలఁకియునునయంపుఁబలుకులువలి
గినిసియిట్టులనియెమునివరుండు॥గీ॥ బ్రాహ్మణుండవయ్యుఁబావవ్రతుండవై। యుగ్రకర్మమునకుఁజొచ్చితీవు। కావున
ముగమృగవ్యాధజన్ముండ। వగుముమీఁదనఁనియెననిన నేను॥చ॥ఎఱుఁగకతప్పుఁజేసితిసహింపఁగదే కడుదుర్భవంబున
వకుమయ్యవావుఁడుగ్రవర్త మునినాథుఁడుదివ్యబోధంబుగా। నెఱుకకులంబునందుజనియించియుధర్మువులెల్లనిమ్ముగా
ఱిఁగెమతల్లిదండ్రులకు నెంతయుఁబ్రీతియొనర్చుభక్తితోన్॥వ॥ గురుశుశ్రూషంజేసినీకుఁబరమశోభనంబగు జాతిస్మ
రణంబునుంగలుగునవరజన్మంబునం బరమబ్రాహ్మణుండవయ్యెదవనియనుగ్రహించిన నవ్విప్రుని దేహంబునందు నాటి
బాణంబుమెల్లనపెఱికియతనిం దదీయాశ్రమంబునకుం జేర్చితినాచేసినపుణ్యంబుననమ్మహాత్ముండునపాయంబుఁబొం
డయ్యెవాకునట్టిజన్మంబు నొందవలసెనని చెప్పినం గౌశికుండిట్లనియె॥గీ॥ జన్మమిట్టిదిచరితంబుచందమిట్టి। దెన్నఁడునుగ
చోద్యమే నెందుఁజూడ। నింకజన్మాంతరముదాఁక నేలనిపుడ। పుణ్యచరితుఁడనీవుని ప్రుడవెకావె॥గీ॥పావవర్తనుండు బ్ర

సొచ్చి యందొక్క రమణీయప్రదేశంబున శిబిరంబుగావించి యమ్మనుజేంద్రుండు ॥ సీ ॥ నానాసహస్రసంఖ్యానంబులై
సంతతానందవిగతభయత్వలీల । నక్కాననమున వేదికాసనజాతినసంకులంబుగఁ గుండశంఖచక్ర । హారనీహారడిండీర
పటీరముక్తాహారహీరసంకాశములును। గాదంబకాలేయకాదంబినీనీలజాలతమాలికాసన్నిభములు ॥ గీ ॥ ప్రౌఢబంధూక
పల్లవభాసితములు। వికచకాంచనచంపకవిస్ఫుటములు । నైనవర్ణంబులొప్ప నేత్రాభిరామ । భంగినలరారు గోకదం
బములఁ గనియె ॥ వ ॥ కనితదీయసమృద్ధికి సంతసిల్లుచు గోపాలజనంబులు సవినయంబుగాఁ దనుఁ గాంచిన నాదరించి వా
రుదనకు గోవులపేళ్లును లక్షణంబులు నేర్పడ నెఱింగించుచుండ వేలువేలు వత్సంబులు మహోక్షంబులు ధేనువులుద
గ్ధంబులు మొదలయిన గోవిశేషంబుల నాలోకించి యయ్యై విధంబులఁ బసికిం దగిన రక్షణంబుగావింప నర్హజనం
బులనవిశేషంబుగా నియోగించి మఱియును ॥ క ॥ గోపాలసమన్వితుఁడై। యాపాలమునఁ దిరిగి గోరసాస్వాదనలీ । లావ
రివృత్తిఁ దలిర్చెను । భూపాలుఁడు నెమ్మితోడ భ్రాతలుఁ దానున్ ॥ వ ॥ తదనంతరంబ గాయకనర్తకాదులు వందిమాగధజ
నంబులుం గనిన నాదరించి వారికి నభిమతధనంబులొసంగి మృగయావినోదంబున కుండఁ దొడంగి ॥ చ ॥ హరిణవ్రాతము
లఁగలంచుచు నుగ్రానేకపశ్రేణిఁ జె । చ్చెర బంధించుచు నుగ్రసింహముల వహచ్ఛేదైకసక్రోధబం। ధురతం బేర్చుచుఁ
బ్రస్ఫురన్మహిషశార్దూలోద్ధతక్రోడనిర్భరపాతంబులొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కాననలోన్ ॥ వ ॥ మఱియు
ననవరత సురభి సరసీరుహప్రకర పరికీర్ణంబులగు జలాశయంబు లాలోకించుచు నతి మనోహర ప్రసూన సఫలభ
రితపాదపవనాభ్యంతరంబుల విహరించుచున్న నయ్యారామమధుకర కీరకోకిలాలాప కోలాహలంబులాకరించుచుఁ గ్రమం
బున నంబరిజనసమన్వితుండై ధార్తరాష్ట్రుండు ద్వైతవనసరోవరంబు సేరంజనియె నంతనట ధర్మనందనుండు తత్సమీపంబు
నను నిజనసహాయుండై వన్యంబులగు ఫలమూలవిశేషంబులు సాధనంబులుగా నమకట్టి సద్యస్కాందంబను యజ్ఞంబు సేయు
చుండె నప్పుడు దుర్యోధనుండు నిజభృత్యజనుల నక్కొలని దరిం గ్రీడాగృహంబులు నిర్మింప నియోగించిన ॥ క ॥ వారును సంభ్ర
మమున న వ్వారిరుహాకరము సొంతవదలక క్రీడా । గారములు గట్టఁ దొడఁగుడు। వారించుచుఁ బాఱుతెంచి పడి గంధర్వు
ల్ ॥ వ ॥ ఇది చిత్రసేనుండను గంధర్వపతికిం గ్రీడార్థకంబు కలితంబైనది కావున మీకిక్కొలను సేరక తొలంగిపోవునది యనిన
వారును మగుడం జని దుర్యోధనునకుం జెప్పుటయు నతండు రణదుర్మదులైన సైనికులం గొండఱం బంచిన నరిగి వారలు గంధర్వుల
కిట్లనిరి ॥ మ ॥ బలియుండా ధృతరాష్ట్రసూనుఁడు మహాబాహుండు దుర్యోధనుం । డలఘుం డీకమలాకరంబునకుఁ గ్రీడా
ర్థంబు కౌతూహలం । బెలయంగాఁ బ్రియకామినీసహితుఁడై యేతెంచుచున్నాఁడు మీ। ర్వలదిం దుండఁ దొలంగిపొండన వ
ర్గ వారుద్ధతక్రోధులై ॥ వ ॥ ఒండొరుల మొగంబు చూచి పెలుచ నవ్వి యిట్లనిరి ॥ క ॥ ఎదిరిం దమ్ము నెఱుంగఁడు। మద
మునఁ బ్రాణంబు వనమమానము గోల్పో। మదిఁ దలఁచి వాఁడు మీనృపుఁ । డిదియేటికిఁ జెనటి చెయ్వులిన్నియు నిచటన్ ॥ వ ॥
బుద్ధిమంతులరై యూరక చనుట లెస్సయనినం గ్రమ్మఱి చని వారు కురుపతికిం దద్వచనంబుల తెఱంగంతయుం జెప్పుటయును
నతండు రోషావేశవివశుండై తమ్ముల దొరలం జూచి మీరిందఱు మీమీ సైన్యంబులతోడం గూడి కడంగి దుర్వినీతులైన గంధ
ర్వుల గర్వంబుమాన్పి సరోవరం బాక్రమించునది వారికి సహాయుండై సురగణ సమేతంబుగ నింద్రుండు సనుదెంచె నేని
యునవలీల జయించునది యని నియోగించి ॥ క ॥ అతులచతురంగసేనా। న్వితులై ధృతరాష్ట్రసుతులు నిరతిశయరయో।
ద్ధతసింహనాదబధిరీ । కృతదిఙ్ముఖులగుచుఁ జనిరి కినుకయెలర్పన్ ॥ వ ॥ ఇట్లు చనుదెంచు కురువీరుల కడ్డంబువచ్చి కొందఱు
గంధర్వులు ప్రియపూర్వకంబుగా నిట యేలవచ్చెదరు మీకు మాతోడి విద్వేషం బేటికి నిలువుండనినం బెలుచ నార్చి సే
నాగ్రచరులు వారిమీఁదం బ్రచురశస్త్రాస్త్రపాతంబు సేయం దొడంగినం దొలంగి చని యాగంధర్వులాక్షణంబ చిత్రసే
నునకు నంతయు నెఱింగించి నప్రబలరోషరంజితాననుండై యతండు ॥ క ॥ చనుఁ డురయంబున నాదు । గ్జనులం గౌర
వులఁ బానివిసమయింపుఁడు మీ । రనిబహుసహస్రసంఖ్యలఁ। బనిచెను గంధర్వవరులఁ బ్రకటితబలులన్ ॥ వ ॥ ఇట్లు పనిచిన ॥
ఉ ॥ ఆయతకుంతకార్ముకగదాసిపరశ్వధశూలపట్టిసా । ద్యాయుధఘోరహస్తులు కులాచలతుంగతనుప్రచండతే। జోయు
తులావియచ్చరులు శూరతమైఁ బఱతెంచి బల్విడిన్ । గోయని తాఁకి రుగ్రరణకోవిదులై కురురాజుసైన్యమున్ ॥ వ ॥ ఇవ్విధం
బున గంధర్వులు బెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం దొడంగినం గలంగి దుశ్శాసనాది కౌరవులును సైన్యంబుగాఁ దెరలి దుర్యో

ధను చేరువకుం జూచెం గర్ణుండొక్కరుండును స్థిరుండై నిలిచి గంధర్వులనిలువరించి భల్లార్ధచంద్ర ప్రముఖ
బాణపాతంబులం దదీయ దేహంబులు ఖండించుచు నిశితమార్త్రంబునం జిత్రసేనసైనికశతంబుల రూపుమాపుట
యుంబైసై గంధర్వులు శతసహస్రసంఖ్యులై తెంచినం బృథివియెల్లను గంధర్వమయంబైనట్లుండె నప్పుడు * చ ॥
యుదమ్ములుం బ్రబలసైన్యము తోడ తేర నాహవో । త్సుకమతియైన యోధయుతుం సూతగనాథవుం
బ్రకటభుజోగ్రతం గడంగి బల్విడిం ద్రిప్పుకోటి దాకినన్ । సకల జగద్భయంకరలసత్సమరోత్సవమయ్యె
డాకసేవుచకును ప్రహరా । గ్రండతరానేక ఘోరతరవిశిఖవ్రా । ఖండితశరీరులై ధృతి । ఖండితముగం బల్లటిలిరి గంధర్వులు

—— * చిత్రసేనుండను గంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము చేయుట * ——

నీ * క ॥ గంధర్వులు దెరలుటవిని । గంధర్వవిభుండు క్రోధకలుషితమతియై । గంధగజము చందమున । దాంధగతిం
సైంగౌరవానీకము పై * వ ॥ ఇట్లు గవిసి చిత్రసేనుండు * శా ॥ మాయాసంగరకోవిదుండు వివిధ నానాస్త్రజాలంబులన్
వాయువ్యాప్తియడంగ నర్కకిరణవ్రాతంబు సుగ్రంబుగాం । జేయం జొచ్చినం ద్రెళ్లి దేరులు సుస్మాగ్నంబు
ళ్ తాకయంబయ్యె హాయాలి కూలిరి భటుల్ కౌరవ్యసైన్యంబు । పొదలి యొక్కనికొక్కనికివి । బమసురువదుసు
గవిసి పోరవ సేనం బొదిపినమయింపం దొడంగి రివదలక గంధర్వులనిన వార్యోద్ధతులైం వ ॥ అవ్విధమ్మున
కు నోర్వక బెదరి కురురాజసైన్యంబు ధర్మనందనుం డున్నకందువకుం బాఱం దొడంగె నవ్వాడు రాధేయుండ జేయుం
శైలంబునుం బోలె దరలక నిలిచి గంధర్వులు గురియు శరవర్గంబున మునుంగుచుం దన యోపినంత పెనంగుచుండె
బలసహాయుండై దుర్యోధనుండు కర్ణసహాయంబు వదలక నిలిచెనంత ననంతసత్త్వులైన గంధర్వులనేకులు చుట్టు
చ ॥ కొందఱు సూతునశ్వములం గొందఱుకొందఱు చాపదండమున్ । గొందఱు చక్రయుగ్మకముం గొందఱు విస్ఫురితాతప
ము । గొందఱు హాబరంబు వదికొందఱు కేతువుకొందఱుత్తమున్ । దండడిం దుస్మవై చివిరథత్వ మొనర్చిరి సూతసూతి
వ ॥ ఇట్లు విరథుండై కర్ణుండు వికర్ణురథం బెక్కి రణభూమికిం దొలంగి చనియె దుర్యోధనుండు విముఖుండుగాక
లంబు మాఱొక్కని పెనంగం దొడంగినం గినిసి చిత్రసేనుండు వానిం దలపడి తదీయస్యందనంబు రాధేయురథంబునట్లు
బుగావించి విరథుండగు నమ్మహీభుజంగు శాకర్ణనంబున నేలంబడ వైచి పెడకేలు గట్టి సింహనాదంబు సేసినం
నగంధర్వులుం గనికనిం జేర్చి యతనివనితాజనంబులను దత్సోదరులగు దుశ్శాసనదుస్సహవివింశతి చిత్రసేనవిందాను
దులను దత్తనూభవులను దదీయామంత్రులను బట్టిబంధించి చిత్రసేనుఁ గొప్పించిరంతం బెఱకౌరవులును
మాత్యులుం జెదరి యాక్రోశించుచుం జని ధర్మపుత్రు శరణు చొచ్చి యిట్లనిరి * మ ॥ ఘనబాహాబలదుర్నివార
గంధర్వవీరులు సుయోధనుం దత్కాంతలం దత్సహోదరుల బంధప్రాప్తులం జేసికై కొని పోవుచున్నవారదె
భంబుగావించినీ । యనుజవ్రాతము గావవే కరుణ రిందారంగ రాజోత్తమా * వ ॥ అనికృతాంజలులై పలుకుచున్న
రిం జూచి భీమసేనుండు ప్రహసితాననుండగుచు ధర్మపుత్రున కిట్లనియె * గీ ॥ మనకుం జులకన య్యేమన చేయువమలు
ర్వవరులు గూడి తగనొనర్చి రింతలెస్సయగు నెయ్యే భారము సులేక । ఘూరకుండ మనలనొండె జయము * గీ ॥
రైయెపాపములకు నెల్ల దిట్టరైయె లోకముల చేతం దిట్టువడిన । కట్టడికి నిట్టికష్టంబుగా నొనర్చి తగవిధాత్రుండు చతురుడై
నేడు ॥ మ ॥ విపరీతస్థితినొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యముః ఖపరాధీవతం దూలి రంచు మనలన్ గర్వోద్ధతస్వాం
డై యువలాపింపంగవచ్చి దుర్నయవరుండా ధార్తరాష్ట్రుండుదో । మవరీతాత్ముండు దర్పలంబున చెఱ సత్యంబు
తుండె * వ ॥ వానిదెసకృప సేయవలదనిన ననుజునకుం నగ్రజుండిట్లనియె * క ॥ అకటయిది పరుషవాక్యము ।
యమె శరణుం జొచ్చిలఘుభావముతో వీకలగతి నున్న కౌరవనికరమునకుం గరుణ సేయనీకుం దగదే * వ ॥ ఏకాన్వ
లైనవారికి వరథమిత్తంబైన భేదం బొక్కొక్కమాటు వర్తిల్లునంతన చేసి సహజస్నేహంబు దప్ప నేరదు జ్ఞాతిజనం
తమలో నెట్టివారైన నొవ్వంగాని యన్యులవలనం బరిభవంబు దొడరినప్పుడు వారొండొరులం జేకొన
ద్యంబు దుర్యోధనుండు దుర్వినీతుండై ననుసభార్యుండై వరులచేతం బట్టువడియె దీనిని పేక్షించిన మనకుం గులహాని
దియునుం గాక శరణాగతరక్షణంబు రాజమాత్రంబు వానికెల్ల ధర్మంబు నీయట్టి బాహుబలసంపన్నునకు

త్రవ్యంబని వేఱచెప్ప నేల లెమ్ము నీవును నీతమ్ములు రథంబులెక్కి సర్వాయుధ సన్నద్ధులై చని సుయోధను చెఱదలంగుం డనఁ బవననందనుండు ధర్మనందనున కిట్లనియె. సీ॥ అనుమాన మొకింతయును లేక యలిగి జలంబులఁ ద్రోచె విషంబు వెట్టె। గృహదాహ మొనరించె విహితదురోదరకపటుఁడై రాజ్యంబు నపహరించె। జను లెల్లఁ జూడఁగ వనజాక్షిఁ బాంచాలిఁ దలవట్టి యీడ్చెం జెవలువ లొలువఁ బనిచెఁ బుట్టిన గో లెమ్మన మనకు గటసుయోధనుఁ డెగ్గు సేయని దివసము గలదె - గీ॥ వానిచేఁతలొకటి యేని యెఱుఁగవవు। నీవు మనుజనాథ కేవలంపు। గరుణనూని యుండుదు రయ నెప్పు డునిట్టు। లైన మనసు గార్యహాని గాదె * వ॥ అని పూర్వవైరస్మరణకలుషితుండై పలికిన నతనికి నజాతశత్రుండు సాంత్వనపూర్వకంబుగా నిట్లనియె * గీ॥ కావరయ్యె యనినఁ గరము దుర్బలుఁడైనఁ। జెనసి యోపినంత చేయు నవిన। నూఱకుండు నయ్య యుత్తమపురుషుండు। దీనజనులయున్న తెఱఁగు చూచి * క॥ శరణంబని వచ్చిన భీ। కరశత్రుని నైనఁ బ్రీతిఁ గావఁగవలయున్। గరుణావరుల తెఱంగిది। యిపుగ సరిగావు దీని కేధర్మంబుల్ * వ॥ ధృతరాష్ట్రసూనుండు భవదీయబలశౌర్యంబుల పేర్మి యెఱుంగుం గావునఁ దన్ను నవశ్యంబు విడిపింతురని యపేక్షాబద్ధాశుండై యుండు నిదిమనకుం బుణ్యంబును గీర్తియుం జేకొను సమయంబు నిన్నింతని ర్బంధింపవలవదే నయ్యును సుమనిప్పుడు యజ్ఞదీక్షితుండనై యున్నవాఁడఁ గావున నాకుం జనరాదు మీరు వేగచని గంధర్వులఁ బ్రియపూర్వకంబుగా ననునయించి సుయోధనాదుల విడిపించునది సామవచనంబులఁ దీఱకున్నఁ బరాక్రమంబునఁ బ్రతి వీరుల నోర్చి కార్యంబు దీర్చునది నా చేయు జన్నంబు సఫలంబు సేయుండనిన భీముండెట్టకేని యియ్యకొని యొనర్జునుం డును ధర్మరాజువమపు గైకొని కురురాజు చెఱవిడలఁగఁ బ్రతిజ్ఞ సేసె నకులసహదేవులును త్సాహసమేతులయి రన్నలువురు నాముక్తకవచులు నాబద్ధతూణీరులు నాకలితకార్ముకులు నారూఢరథులునై యగ్రజువీడ్కొని యతిత్వరితంబున నడిచి నం గౌరవసైన్యంబంతయు సింహనాదంబులు సెలంగంజని యొ ప్పట్లరిగి వారలు గంధమాదనంబునకై చనుచున్న యుర్వీయచ్చ

——భీమార్జుననకులసహదేవులు గంధర్వులతో యుద్ధంబు చేయుట.——

రానీకంబుం గూడ ముట్టిన * క॥ కనిగంధర్వు లుగ్రమతి। ఘనులం బాండవుల నగ్నికల్పులఁ దేజో। ధనులనమరేంద్రసప్త శులు। ననఘుల మాఱ్కొనిరి ప్రకటితాటోపమునన్ * ఉ॥ అగ్రజు వాక్యముల్దలఁచి యర్జునుఁ డవ్వెడ వారితోడనత్యు గ్రతఁ దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను మీకుమాయెడన్। విగ్రహమేల నెయ్యమున వీడుఁడు గౌరవరాజుఁ బార్థివ। ప్రా గ్రసరుండు ధర్మసుతుపన్పిదిమీకునలంఘ్యమిత్తఱిన్ * వ॥ అనిన నతనికి గంధర్వులిట్లనిరి * గీ॥ ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె యాధర్మతనయు। నాజ్ఞ నేమేల యొనరింతుమనిమి షేంద్రుఁ। డొక్కరుఁడ మము శాసింపనోపుఁ డన్య। లెందు నెవ్వ రైన ముభయమే మిమ్మాడు * వ॥ అనినవిన్వచ్చుండవ్వియచ్చరులను పలకించి మును మున్న తెగువకుఁ జొరనేల యని ప్రియంబు సుధర్మంబును ంగాఁ బలికితి నెట్లును మీరు సామసాధ్యులు గాకునికి తోఁచుచున్న యది కావున నుగ్రంబయిన విగ్రహంబునఁ దు ర్యోధను విడిపింతునని వారలమీఁదఁ శితవిశిఖంబులు ప్రయోగించె నాగంధర్వులు నతనిపై బాణవర్షము గురిసిరిట్లా నలువురకును గంధర్వశతసహస్రంబులతో నతిఘోరసమరంబయ్యె నప్పుడు * తరల॥ కదిసి యర్జును లేసు భగ్నముగా నొనర్పఁదలంచి పెల్లొదవి ఖేచరకోటి గ్రమ్మట యాంబురందరనందనుం। డదయుఁడై పదిలక్షులం బ్రళయాగ్నికల్పుల దివ్యులన్ గదనభూరులనిర్దహించెఁ బ్రకాండదివ్యశరార్చులన్ * మహాస్రగ్ధర॥ ఘనకోదండోగ్రవార్ధిక్వణనముఖలభూ న్యారాభోగభాగం। బున నాపూర్ణంబుగా నబ్బునఁ గవలు మరుత్పుత్రుఁడుఁ గాదీవ్రవారా। చవితాంతాపాతలీలా వరభసగతులై శత్రువీరవ్రజంబున్। దునుమఁగా దచ్ఛోణితంబుల్దొఱఁగిమహిపులై త్రొక్కెనయ్యుద్ధభూమిన్ * వ॥ ఇ ట్లుక్కాంతేయుల చేతం బీడితులయి గంధర్వులు దుర్యోధనాదుల చెఱ లేమఱక కొనుచు గగనంబునకు నెగసి త్రోచిపోవనుం కించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతిశిఖ బాణజాలంబులం జేసి దిఙ్నభోమార్గంబులు నీరంధ్రంబులు గాఁ గప్పిన నగ్గ గనచరులు వలలోనఁ జిక్కినపులుగులుం బోలెఁ బోవనేరక శరపంజరంబునం జిక్కియును సుక్కుచెడక యన్నలువురమీఁద వి విధాయుధంబులు ప్రయోగించిన * మ॥ అవి యెల్లం దునుమాడి క్రీడి ఘనరోషాభీలుఁడై శాతభల్లవితానంబు ఘరించనంద లుడొల్ల గాయముల్మిటనుం। డివరింగుంభిఁ గూలఁగా దురవపింగాలు వల్గాలఱఁగా। దివిగంధర్వులక్రందడం గెజగము ద్వేగంబునం బొందఁగన్ * వ॥ మఱియు నర్జునప్రయుక్తంబయిన యాగ్నేయాస్త్రంబు దావాగ్ని నీరసనిసె

నంబున సహింపక తెఱంగున గంధర్వనివహంబు నీలు సేయఁ దొడంగినం గని చిత్రసేనుండు భీమసేనానుజు మీఁదం బటుగదా
దండంబు వైచిన నది నడుమన తునియలుగా నేయుటయు గంధర్వరాజు మాయాబలంబున నంతర్హితుండై. క॥ నలువురు
పార్థుల నత్యు । జ్జ్వలశరవర్షము లముంచి జలధరముక్రియం । బెలుచ నగర్జిల్లుదును । తలఁకుడై తన విక్రమంబు వెడఁగ
యుఁ జూపెన్. గీ॥ దానిని లక నింద్రసూనుండు గాండీవి । శబ్దభేదములైన సాయకములఁ । జిత్రసేను సర్వగాత్రంబు భేదిం
చి । యొక్క మాత్రలోన నడిపెఁ గడఁక. వ॥ ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభంబు విడిచి యర్జునుం జేరం
జని సొడ నూపి నిలిచిన నవ్వీరుండును నాత్మసఖుండయిన ఖచరపతి తెఱంగు సూచి సంహృతాస్త్రుండయ్యె. వృకోదరాదు
లును గవిరామంబు నొందిరి. వారలందఱు తమతమ రథంబుల మీఁదనుండి యొండొరులఁ గుశలంబు లడిగి రవ్విధంబున నర్జునుండు చి
త్రసేనున కిట్లనియె. క॥ వీరోత్తమ నీ కిమ్మెయి । వైరము దగునయ్య కౌరవప్రకరముతోఁ । గౌరవపతి విశువు మత । ద్దారా
జనుత సమన్వితంబుగ నెమ్మిన్. వ॥ అనిన నతం డర్జునున కిట్లనియె. సీ॥ ఈ దురాత్ములు మిమ్ము నివ్వనంబున నితాంతా
నపీడితులైన వారిఁ బరమధర్మాత్ముల భార్యాసమేతుల నపహసింపఁ దలంచి యరుగుదెంచె । నింతయు నెఱిఁగి సురేంద్రు
డు కలుషించి యనుజవధూసహాయాన్వితముగఁ । బాపవర్తను వీనిఁ బట్టి తెమ్మని నన్నుఁ బనిచిన వచ్చితిఁ బార్థ వినవె. గీ॥ శక్ర
పాలికిని దెకొని చనుచున్న । వాఁడ నీ పంక నొండనవలదు వినుము । మత్సఖుండవు గావున మత్సరంబు । నలుకయు మ
నీ దెస ననఘ నాస. గీ॥ అనిన నర్జునుఁ డతని కిట్లనియె నీసు । యోధనుఁడు మాకు వినుము సహోదరుండు । గాన నీ
చుట కర్జ మిదియు । ధర్మజున కెంతయును బ్రమోదంబు చేత. చ॥ అమరవరేణ్యు పన్పయిన నావల నెయ్యది మై సనీ
గ్ర సహితుఁడై సధర్మజు సమక్షమునం దెఱిఁగించి యాతఁడే । క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుము నీవు ప్రియ

## చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధను విడిచి పెట్టి పోవుట.

గ్రము చను దెమ్ము నావుడు నుదాసకొడంబడి చిత్రసేనుఁడున్. వ॥ వారలుం దాను సుధర్మజుకడకుం జనిన నజాతశత్రు
డు చిత్రసేనున నతిప్రియంబున బూజించి మహాత్మా యీ సుయోధనుండు సానుజామాత్యుండయి మీ చేత వధియింప
దగునికి మేలయ్యె మీ కారణంబున మా వంశంబునకు నొండొక్క హానిసొందదయ్యె. వీఁ డెట్టి యపరాధంబు సేసినను ని
తయు సహించి మాకుంగా వీని విడువవలయునని ప్రార్థించిన నతం డట్ల కాక యని దుర్యోధనాదుల నందఱ విడిచి పాం
పుత్రుల నామంత్రణంబు సేసి దివంబున కరిగి తత్ప్రకారంబు సకలంబును నింద్రునకు విన్నవించిన నింద్రుండును సు
నిహతులయిన గంధర్వుల నమృతవృష్టిం జేసి బ్రదికించె నిట యుధిష్ఠిరుండును ధార్తరాష్ట్రున కుబంధమోక్షణంబు
పించి వాని కిట్లనియె. ఉ॥ ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకుమయ్య దుర్జనుం । డున్న వసాహసక్రియలయందు
గి నశించుఁ గావునఁ గా । గ్రస్తనఁ దమ్ములం దోరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్ । సన్నుతదీక్ష కొండొక విషాదము
దకు నీ మనంబునన్. వ॥ అని బుద్ధి సెప్పి వీడ్కొలిపిన నతండును దీనాననుఁ డగుచుఁ జనియె ననుజసహితుండయి యుధిష్ఠిర
జు ధార్మికత్వంబు ధౌమ్యాదిభూసురులును దదాశ్రమవాసులయిన మహామునులును బహువిధంబులఁ బ్రస్తుతించిరని వై
శంపాయన వర్ణితంబయిన కథావిశేషంబు సవిస్తరంబుగా నొప్పు. క॥ రాజకులతిలక భువనవి । రాజిత సితకీర్తి విజయ
వసి । ర్వ్యాజపరాక్రమ సకలధ । రాజన సంపూజ్య నర్మరతుణ డటౌ. స్రగ్విణి॥ సర్వలోకాశ్రయా సౌఖ్య
దయా । నిర్వికారాకృతీ నిత్యసత్యోన్నతీ । గర్వితోద్యద్భుజాకల్పకల్పోల్లస । త్సర్వసర్వంసహాచక్రచక్రా

గద్య. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున నారణ్యపర్వంబునందు బతి ప్ర
తాచరితంబును ధర్మవ్యాధుండు కౌశికునకుం బరమధర్మంబెఱింగించుటయు నగ్నివంశానుకీర్తనంబు
ను గుమారోత్పత్తియు సత్యాద్రౌపదీసంవాదంబును బాండవులు ద్వైతవనంబునకుం జ
నుటయు ధృతరాష్ట్రవాక్యంబులును దుర్యోధనాదుల దుర్మంత్రంబున ఘోషయా
త్రయుఁ గౌరవగంధర్వయుద్ధంబును దుర్యోధనాదులు గంధర్వుల చేతం బట్టువడు
టయు నర్జునుండు వారల విడిపించుటయు నన్నది పంచమాశ్వాసము...... ......*

## శ్రీహయగ్రీవాయ నమః.

## శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - షష్ఠాశ్వాసము.

క॥ శ్రీలలితమూర్తినుమహాచ్చాళుక్యవరేణ్యపుణ్యచారిత్రవిచి । త్రాలంకారోజ్జ్వలకలిత। తాలాపకలాపసంతత శ్రీగమతీ॥ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లతిమానుషంబయిన యర్జునపరాక్రమంబును నత్యంతదైన్యాస్పదంబగు దుర్యోధనుపరాభవంబును నాకర్ణించి విస్మయజుగుప్సాకలితమానసుండై జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె ॥ చ ॥ అనిశము పాండుపుత్త్రులకు నప్రియకార్యము సేయునట్టిదు । ర్జనుఁడు సుయోధనుండటుల శత్రులచే నవమానితుండు దే । ర్చినకృప నెవ్వచున్న కురుసింహులచేత విమోక్షితుండు నై । మనమున లజ్జలేక మునిముండ నయెమ్మెయి నేగె వీటికిఁ ॥ మత్తకోకిల ॥ మేనఁ బ్రాణము దాల్చి భంగము మ్రింగి యెప్పటియట్లనే । మానవేంద్రపురంబునం దద్దయు మాని సేననియాత్మలోఁ । బూనుటాతని కెట్లు గల్గెఁగఁ బోలు నారయ నద్భుతం । బైన తచ్చరితంబుఁ జెప్పుమ యుంతయు నేర్పాటితో ॥ వ॥ అనియడిగిన నమ్మహాముని యిట్లను నట్లు కౌంతేయులచేత లబ్ధమోక్షితుండై దుర్యోధనుండు లజ్జాకలితహృదయుండగుచు చెదరిన సేనలఁ గూర్చుకొని కొంతదవ్వరిగి యొక్క సమతలంబునఁ బటమందిరపరిచనంబు నిర్వర్తింపించి యభ్యంతరమందిరమ్మున నొక్కరుండును దల్పంబు పయింబడి చింతాపరత్వంబు నొంది రాహుకబళనకలుషితుండయిన రోహిణీపతియునుం బోలె విషాదవివర్ణుండై యున్నఁ గర్ణుండు వచ్చి యన్నరేంద్రున కిట్లనియె ॥ చ ॥ మనుజవరేణ్య చూడ నతిమానుషమమ్మెయిఁ గయ్యమెందుఁ గ । ల్గునె వటు విక్రమోన్నతులఁ గ్రోధనిబద్ధులఁ గామరూపులన్ । జెనయఁగ వచ్చునే ఖచరసింహుల నేరికి నట్టివారి నే । పునఁ దునుమాడి గెల్చితి విభూతి దలిర్పఁగ నీవు దమ్ములున్ ॥ ఉ ॥ అప్పుడు నీవు సూడఁగ ననంతములై ఖచరేంద్రసైన్యముల్ । గప్పిన నేక సాయకనికాయములన్ వడి నన్ను నేను నుర్వ్ । గుప్పలుగూర నేసి రిపుకోటి వధించితి నంతలోన నన్నెవ్వరికిం జెప్పె సైన్యతతి యొక్కడ నై రణభూమి నొచ్చితిన్ ॥ వ ॥ ఆలోనన విరథుండనై వికర్ణురథంబెక్కి నదిసమీరప్రదేశంబునకుఁ దొలంగ నీడ్చె దేవా నీవు బలవిక్రమాతిశయంబులం బ్రతిపక్షుల నోర్చి యాత్తుతుండవై యుండుట గనుంగొని కృతార్థుండనైతి నిట్టి పరాక్రమంబు సేసిన వారి జగంబున నెవ్వరుగలరిది యద్భుతంబనినం గౌరవేశ్వరుండాత్మగతంబున నీతండు మత్ప్రకారంబెఱుంగక యిట్లు పలికెం గాకేమి యని లజ్జి

### దుర్యోధనుండు కర్ణుతోఁ దనపరాభవంబు చెప్పుట.

తుండగుచు రాధేయున కిట్లనియె ॥ సీ॥ అనఘ తమ్ములు నేను నంబరచర కోటిఁ దలపడి పోరంగ బలయుగంబు । చచ్చియు నొచ్చియుఁ జలమునఁ బెనఁగ నాసమయంబునం దుపక్రమము మెలర్ప । గంధర్వపతితోడఁ గలిగెఁ గయ్యము నాసనాతని శరముల చేత నాజి నేమ నొచ్చితి వేయునేల భార్యానుజసుతమిత్రజనసమన్వితముగాఁగ ॥ గీ॥ నమ్ముఁ జెలఁగి గొని గంధర్వనాయకుండు నెగసెని వము సకప్పుడు బెగడి చెదరి వఱచి మనవారలెల్లను పాండుసుతుల శరణు చొచ్చిరి దైన్యసంభరితులగుచు ॥ ఉ ॥ వారల యార్తిఁ జూచి జనవంద్యుఁడు ధర్మసుతుండు దమ్ములన్ । భూరిబలాఢ్యులం బరమపుణ్యుల నన్విడిపింపఁ బంచెన । వీరులు నుగ్రానంగ విని వేగమ ఖేచరకోటితోడ్తలని । పార్థభీమమోక్షలం దెలిపిరంతటఁ దీరదకార్యమెమ్మెయిన్ ॥ గీ॥ అంతఁ దెగువఁ జేసి యంతకాకారులై । భీమపార్థయములు భీమబలులు । ఖచరవరులమీఁదఁ బ్రచురబాణౌఘము । లుగురిసి రాహవమున ఘోరభంగి ॥ వ॥ తదీయబాణపాతంబుల నొచ్చి గంధర్వులు మమ్ముం గొనుచు గగనంబునం బఱచిన నర్జునుండు వారికిం బోవగాకుండ నతినిబిడబాణజాలంబుల నంబరమార్గంబు నిరోధించినం జిత్రసేనుండు దనప్రియసఖుండైన శతమఖసుతుం జేరనరిగి కుశలం బడిగిన నర్జునుండును బ్రీతుండై వాని ననూనయించి యీదుర్యోధనుండు మాతోడం బుట్టువు గావున నితని విడువవలయు ననిన గంధర్వనాయకుండు ॥ క ॥ మనదుర్మంత్రంబంతయు । ఘనుఁడ పార్థునకుఁ జెప్పి ఘనభుజయుగుఁ డింద్రుని పనుపగుటన వశ్యంబును నీతని విడువనని యె భూరిబలుండై ॥ క ॥ కడు లజ్జయు దైన్యంబును । నడరి ముసుఁగువడఁగ నాపవాత్మగతమునన్ । బుడమి వివరంబులేదే నడఁగెదననిట్టి దయ్యె నప్పుడు గర్ణా ॥ వ ॥ అంతఁ గౌంతేయులు గంధర్వులం దోడ్కొని ధర్మరాజుపాలికిం జనిన మనదుర్మంత్రంబు సెబంధ గూచయుండైనననన్నయ్యజాతశత్రుమండటని

వేదించిననతండువిడిచిపుత్తెంచెనిదిమదీయవృత్తాంతంబు ॰ క ॥ ఒవ్వనివారలయెదురను । నివ్విధమున భంగపడితి నే
కజనుల్నన్వఁగ నేటికిఁబ్రదుకఁగ। నవ్వసుమతియేల ప్రాణ మెట్లుభరింతుఁగా ॰ ఉ ॥ అక్కటయపూర్వహారణమునందుచి
చ్చరకోట్లతోడఁ బేరుకుఁనఁ బోరియేనుమృతిఁబొందఁగ నేరనయిట్టులైననీ । తక్కనపాటు లేక ప్రమదంబున దేవ

## దుర్యోధనుఁడు ప్రాయోపవేశంబుఁ జేయఁబూనుట.

బునొందుదుఁగా। మిక్కిలినైనకీర్తియును మేదినియందు వెలుంగునిత్యమై ॰ వ ॥ కావుననిట్టిదురవస్థపాలైననేను ప్రాయో
పవేశంబునఁ బ్రాణపరిత్యాగంబుఁ జేసెదమీరిఁడులు దుశ్శాసనుంబురస్కరించి కొనిపురంబునకరుగు నదిమిత్రులక్ష్మ
మోదంబునుశత్రులకుని ర్వేదనంబునుం జేయుచుమనుట్టియేనును బోడిమిచెడిపగతులచేతశిరస్తాడనంబు సేయింబడి
వడకబంధు జనంబులలోని కేమనియరుగుదుఁగురువృద్ధులైన భీష్మబాహ్లికులను నాచార్యులైన కృప ద్రోణులయ
మక్షమంబున నెట్లునిలుతుఁబరిజనులుఁబౌరులుఁ బురోహితులు నన్నుంగనిన నేమనిసంభాషింతు రిదియాత్మద్రోహం
నైనయపాయంబునాకవశ్యభోక్తవ్యంబు ✻ క ॥ వినుదుశ్శాసనయాత్మకుఁడగు।జనుఁడుజ్జ్వలమైనసిరియుసద్విద్యయు
గ్గిననందు మెలఁగనేరక।చెనఁటితెఱంగునమఁజొచ్చిచెడిపోవుఁదుదిఁగా ✻ క ॥ అకటకటయిట్టికష్టము।నకువచ్చితినయ్య
నునన్నటెవైరి।ప్రకరములుపట్టిననుగృపనొకరుఁడువిడిపించెదైవమోపదెయెట్లుఁగా ✻ క॥ మానముచెడినునుబ్ర
మేనంబ్రాణంబులెట్టు మేకొనితాల్తుం।గాననిదినిశ్చయముగాఁ।బూనితినాతెగువమాన్పఁబోలదొకనికిఁగా ✻ వ ॥ అన
లికసమీపగతుండైన దుశ్శాసనునాలోకించి యమ్మహీపాలుండిట్లనియె ✻ సీ ॥ అన్నదుశ్శాసననిన్నురాజ్యమునకు
ట్టంబుగట్టెదఁబతివిగమ్ము । శకునికర్ణులుదీర్పఁబ్రకటవసుంధరావలయమంతయు మహోజ్జ్వలత నేలు । భ్రాతృస
మునపుఁబ్రీతిసేయుముబంధుజనులఁబోషింపుమీ సద్ద్విజులపు । నుత్తమంబుగఁదగువృత్తులు చెల్లింపుగురుజనంబుల
గొలువుమెపుడు ✻ గీ॥ ఇంద్రుఁడమరగణంబుల నేలునట్లు। ధరణిపతుల నేలుము బాహుదర్ప మొప్పఁ।బగఱసక్కడఁచి
ముపరమిత్రు।లైనశూరులఁగొనియాడుమర్థ్మభంగి ✻ వ ॥ అనిననమ్మాటలుదనహృదయంబునకునిశితశూలంబులైన
సందుఃఖితుండవనోపకయగ్రజుపాదంబులపయింపడి దేవాయిట్లానతీఁదగదు నాకుం బ్రసన్నుండవుగమ్మనినిజనేత్రజలం
లందదీయ చరణయుగళం బభిషేకించుచు నిట్లనియె ✻ చ॥ అవనివిశీర్ణమైనను హిమాద్రిచలించుట గల్గినన్ మహా
ర్ణవమదియింకినన్ దివసనాథుఁడుఁజంద్రుఁడుఁదేజమేదినన్ । కువలయనాథనీకునొకకుత్సితభావముగల్గ నేర్చునే ।
వసుపయోగ్యమైననృపభావమునాకువహింపశక్యమే ✻ క ॥ హితులైన వారిఁ బ్రోచుచు । సతతంబునురివులనెల్లఁ
ఁచుచుఁనిఖిలక్షితితలమునీవయేలుము । శతసంవత్సరములధికజయశీలుఁడవై ॰ వ ॥ అనుచునయ్యవరాజుమఖిలో
విహ్వలుండై యెలుంగెత్తియేడ్చిన నయ్యన్నయుం గన్నీరొలుకనూరకుండెనప్పుడు గర్ణుండువారలంజూచి యిట్లని
లిషులుంబోలె నేడ్చెదరు ధైర్యంబుధరియించి శోకవ్యసనంబులువిడువుండు శోకశీలునింజూచి పగతులుసంతసిల్లుదురు
శోకశీలునిఁజైపైశోకంబులు పెంపొందుననిదుర్యోధనుం బేర్కొనిమఱియునిట్లనియె ✻ క॥ ఒకయల్పమనుజుక్రియ
లోత్తమనీకునిట్లుమహనీయసుఖ।ప్రకృతియగునిజశరీరం।బకటావిడువంగనగునెయవిహితబుద్ధిఁగా ✻ గీ ॥ శోకమన్నది
వగునన్నుఁజూచియిప్పు । డధిపనీతమ్ములును నేనునధికదుఃఖ। వహ్నిపాల్పడనయ్యాపావలనఁగరుణఁ।గలిగి తేర్ప వె
ఉఁగౌరవేంద్ర ॰ వ ॥ పాండవులచేతవిముక్తుండనైతిననివగచెదంతియకానినీకుం గార్యగతియందువివేకంబుచాలి
నిననెందును నేరాజురాజ్యంబున నిశ్చింతులైజనులు దమతమజీవనంబులవర్తింతురట్టి జనులారాజునకుబంట్లుగా
నవారమ్మహీపతికిఁ దీఱమిగల్గినచోట్ల నెల్లందమపౌరుషంబులు నెరపవలయుఁ గొంతేయులు నీదేశంబునముండినీయా
వలనంగృతారంభులైయున్న వారగుటంజేసి వారునీకింకరులు నీవునైన యక్కఁజదీర్చుట వారికర్తవ్యంబు
తవగవ నేలయదియునుంగాక పాండవులుజూదంబునాఁడనీకుదాసులైరి తదీయంబులైనమణికనకాదివస్తువులునుని
దధీనంబులైయున్నయవి వారు నిన్నుంగొలిచియుండుట లేమండె నేనియునింతటి కెలసంబుదీర్పనైననువలచేయుది
తయునూహించి వగలంబొగలక లెమ్ము పురంబునకు నడువుము నామాటవినకనిర్బంధపరుండవైతివేని యా నిన్నేమ
చ్చునిండఁబఁమునీపోయినగతిన [illegible] నగుబాటుఁబొందంగలవాఁడవని కర్ణుండు నెప్పి

నదుర్యోధనుండు వెండియుఁ బ్రాయోపవేశంబునందు నిశ్చయంబు వదలకున్నం గనుంగొని శకుని యిట్లనియె * క॥ క
ర్ణుండాడిన మాటలు । నిర్ణయమునకింత యొప్పనే యిప్పలుకుల్ । కర్ణంబులఁ జొనుపుము దుర్గ। భార్గవపారంబుఁ బొందు
మవనీనాథా * తరల॥ కడఁగి బుద్ధిబలంబు దద్దయుఁ గంటకంబుగఁ జేసి యేఁ బడసిరాజ్యము సర్వమున్ దగఁ బుచ్చి యిచ్చినని
మ్ములక్ । సుడువనేరక దీనినిచ్చటఁ గూలఁ దన్నిశరీరముల్ । విడుతుఁ గాక నిశ్చయించితి వెఱ్ఱివైతి నరేశ్వరా * గీ॥ నీకు వృద్ధ
సేవ లేకుంట యిప్పుడు నాకుఁ దెల్లముయ్యెఁ బ్రాకటముగఁ । గోపమును మనోసంతాపంబు నొందుచో ధీరుఁడపుడయు సువనే
రవలదె * గీ॥ పిఱికితనము నేమెఱుంగమి యుగలవతనము । మేత్తబాటును గార్యంబు నెత్తెఱుంగు । నేరమియు విషయంబులఁ గూ
రుటయును । గలుసువతికి నొందదు సిరితోలఁగి పోవు * వ॥ కావునఁ గార్యజ్ఞుండవగుము కార్యజ్ఞానం బెట్టిదనిన * ఉ॥ కౌరవనాథనీ
కుపకారము సేసిరి పాండవేయుల । వీరులయందు నెయ్యమును వేడ్కయు నెప్పన భీష్టవస్తుసత్కారము సేఁత యుక్త
మసుఁ గాక ప్రియంబడనర్హమైనచో । దారుణశోకవహ్నిపరితాపముఁ బొందుట నీకు ధర్మమే * చ॥ కృతము దలంచి చిత్తమునఁ గి
ల్బిషమంతయు నుజ్జగించి సన్మతుల బృథాతనూజుల నమానుష తేజులఁ బిల్వఁ బంచి త । త్పితృధనమైన రాజ్యమున భీష్టము
గాఁ దగనిమ్ము నీకు నీ। క్షితివలయంబు నంబరముకీర్తియుఁ బుణ్యముఁ గల్గు భూవరా * క॥ వారలు నీతోఁ బుట్టువు । లీరాజ్యము మీ
సువారు నేకంబై పెం। పారఁగ నేలుఁడు దీనం। గౌరవకులనాథ సౌఖ్యగౌరవ మొందుల్ * వ॥ అని శకుని చెప్పుచుండ గాంధా
రీనందనుండు నిజచరణసమీపంబునం బడియున్న దుశ్శాసనుం గ్రుచ్చి యెత్తి మూర్ధాఘ్రాణంబు సేసి కర్ణసౌబలులం
జూచి మీ కేలనన్నుఁ గారించెద రుధర్మైశ్వర్యధనభోగంబులందు నాకభిలాషంబు లేదు ప్రాయోపవేశంబునం గృతని
శ్చయుండనైతి మీ రింక నొండు విఘ్నంబులు సేయక యూరక మీ వలయు నెడకుఁ బొండనిన వారలు దేవా నీవిధం బట్టిద
య్యేనేని మేమెందుఁ జేరెదము నీతోడి వారము కాక యనిరంతంగమహితుండు పశ్చిమాచల సమీపగతుండగుటయు
నా భూనాథుండు సురలోకగమన కుతూహలియై శుచిస్నానంబు సేసి వల్కలంబులు ధరించి సంధ్యాసమయ సము
చితంబులగు కరణీయంబులు నిర్వర్తించి వివిక్తదేశంబునందు దర్భాస్తరణంబున నాసీనుండై * క॥ క్రమమున బాహ్యేం
ద్రియకర్మములెల్లను వదలవిడిచి మహితసమాధిక్రమమునం దెనివాత । స్థిమితంబై వెలుఁగుచున్న దీపమువోలె

ప్రాయోపవిష్టుండైన దుర్యోధనునిఁ గృత్తిపాతాళంబునకుఁ గొనిపోవుట.

లెక్ * సీ॥ ఆసమయంబున నమరేంద్రవిజితులై యిహిలోకమున నున్న యసురవరులు । ధృతరాష్ట్రనందను తెనువడుదెం
ఱింగి యాత్మీయపక్షయత్నస్థితికి వగచి । యాతనిఁ బిలుపింపనవ్వుడు కృత్యుమలైన భూసురసమూహంబు చేత । వేలిమి వెట్టిం
చ వేగంబ యొకకృత్తి వెలువడి భీషణాకృతమూర్తి - గీ॥ యేమి పనులు గలిగె నెఱిఁగింపుఁడనిన వారిచటికిపు డుక్రావేంద్రు
ననఘు నజ్వలాంగు నాసుయోధనుఁ దెమ్ము ప్రాయోపవేశవృత్తినున్నవాని * వ॥ అనిపనిచినం గృత్తియు నాక్షణం
బ చని ప్రాయోపవిష్టుండైన దుర్యోధనుం గ్రుచ్చియెత్తికొని రసాతలంబునకుం దెచ్చి దైత్యులకొప్పించినం బ్రీతులై వారు
వానిం గౌఁగిలించికొని కుశలంబడిగి యిట్లనిరయ్యా నీవు మా కుండవు శూరజనరక్షితుండవిట్టి నీవీ సాహసంబేల చేసెదవాత్మ
ఘాతనందు లోకంబున నిందయు హీనతయు దుర్గతియుం బ్రాపించు లోకవిరుద్ధంబులై మూలఘాతంబులైన కార్యంబుల
యందు నీయట్టి బుద్ధిమంతులు ప్రవర్తిల్లుదు రేయట్లు గావున నీవఖిల ధర్మార్థయశోభోగనాశంబైన యాదుర్విచారం
బు విడువుము ధైర్యంబును బ్రతాపంబును బాటింపుము శత్రుజనభంజనంబు సేయుము నీవు మనుష్యమాత్రుండవు గావు నీ
పూర్వజన్మప్రకారంబు సెప్పెద మాకర్ణింపుము * ఉ॥ ఏము తపంబు సేసి పరమేశ్వరు నీశ్వరుఁ బార్వతీమనగ్ల। కాముకుఁ గాను
వైరిని వికారుఁ బురాంతకుఁ బ్రీతుఁ జేసినక్ । గామితదాయియైన సితికంఠుఁడు నిన్ను సృజించెఁ దానయు। ద్దామదయావిధే
యుఁడు ముదంబున మాకు నధీశ్వరుండు గాక్ * ఉ॥ నీదగు పూర్వదేహము వినిర్మలవజ్రశిలావిశేషసం। పాదితమస్త్రశస్త్ర
పరిపాతనభేద్యము గాదు నిత్యనిగ్గ । ఖేసము పువ్వుకోమలము ఖేచర భూచర కామినీమనో । హ్లాదకమట్లు గాన భవుఁడర్థి
నెనరైన సమానమేతుఁడై * ఉ॥ నీవు ధరిత్రిఁ బుట్టుట యనీకసహాయత సేయఁ గోరి వా । నావిధదైత్యదానవగణంబులు
రాజకులంబునందున । ద్భావననుద్భవించెఁ బటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్ । ద్రావితవైరులుర్విభగదత్తపుర
స్సరులైన వీరులై । * వ॥ భీష్మద్రోణకృపాదులు గొందఱు దేవాంశసంభవులైనను దదీయభావంబులు రాక్షసావేశం

బునొందెడుదానం జేసి విగ్రయులై మూఢులుంబోలె నన్యోన్యపరుషంబులుపలుకుచు నలుకమిగులఁబుత్రపౌత్రమిత్ర
భ్రాతృశిష్యగురుబాలవృద్ధజనభేదంబులు విచారింపక సమరంబు సేసి దివ్యంబులుమానుషంబులు నైన వివిధాస్త్ర
స్త్రంబులఁబాండవక్షయంబుగావింపంగలవారు పాండవులుబంధుస్నేహంబువిడిచి తెగువకుఁజొచ్చిపీ చేతనిహతులై
దురునీమనంబున బీభత్సువలనిభయంబుగొంతకలదు దానినెఱింగియేమునుందగు నుపాయంబుదలంచితిమదియెట్లనిన
కృష్ణుచేతంజచ్చిన నరకాసురునంశంబు కర్ణునావేశింపంగల యదితత్కారణంబునం గృష్ణార్జునులతోడబద్ధవైరుండై
యవ్వీరుండు నిజదివ్యాస్త్రంబులం గృష్ణులనిద్దఱ నిగ్రహించు నివ్విధంబెఱింగి యింద్రుండు పాండవరక్షణార్థంబై
కర్ణుకవచకుండలంబులు కపటరూపంబున నపహరింపంగలఁడాడుమఱియును * క ॥ క్షితిసంశప్తకులనఁగా । శతలక్ష
సహస్రసంఖ్యజనియించిరిదా।ర్పితులై దనుజులుదర్పుల। తతిచేసమరమునవిం గ్రసనయుఁడు చికుర్కా * తరల ॥ నిహతక
టకమైనయీధరణీతలంబఖిలంబునీ। మహితశాసనగోచరంబగుమాన వేంద్ర ప్రసన్నతా।మహిమనొందుమునీవు దేవ
పుమాపునిందఅసంగరూ।ద్వహవిషాదముఁబొందఁబాడియెదైత్యపక్షభయంబుగాక * మ॥ చనుమింకొండుదలంపు
నుమనియాశ్వాసించివానిఁబునర్గ । పునరాలింగనమాచరించియెలమింబూజించిదైత్యోత్తముల్ ।జననాథోత్తమువీక్ష
ల్విరితదాజ్ఞం జేసియాకృత్తియుఁ ।మునుదాఁదెచ్చినచోటఁజెట్టెనధిపుఁ మోదంబుసంధిల్లఁగాఁ * ఉ॥ అంతసుయోధ
నుండుహృదయంబునవిస్మయమందియంతవృ । త్తాంతమునుస్వప్నవృత్తముకి యందలపోసినిజంబకాఁగన। త్యంతముఁబ్ర
యించుచుఁబృథాసుతులఁ సమరంబులోననిర్జింతునకాకయంచువికసిల్లెనురాశయభగ్నబుద్ధియై * క ॥ వినుజనమేజయ
పౌరవ।జనవిభుఁడట్టిరాత్రిచరితమయినయ। దనుజులసంభాషణమె। వ్వనికిసినెఱుగింపకుండువాఁడయ్యెసుదిన । వ
అంతఁబ్రభాతంబగుటయు రాధేయుండునుయోధనుపాలికింజనిరహస్యంబున హేతు దృష్టాంత వాక్యంబులనతనికిట్లని
యె॥ఉ॥చచ్చినపిమ్మటఁ గడిఁదిశత్రులనోర్వఁగవచ్చునేశుభం।బిచ్చునెచావులెందునునరేశ్వరయాఅడిఁజత్తువేఁటరా
మెచ్చగునయ్యెయెవ్వరికిమేనికిజీవముగల్గుచోటఁజెం।వచ్చుగసిద్ధిఁబొందువిజయార్థసుఖంబులుసత్యకోటికిఁ । ఉ॥కా
వునశోకదైన్యములకాలముగాదిదిలెమ్ము విక్రమ। శ్రీ విలసిల్లనంచుఁగురుసింహునిసింహసమానుఁ జేరిశ।య్యావివశాంగు
నంగపతియాదటతోనిరుగేలఁ గ్రుచ్చిసం।భావన నెత్తుచుం బ్రణయభాషలవెండియువానికిట్లనుఁ * క॥మదినగ్గనుఁజూ
భవసం।బొదవినయవినీపవానిను గ్రరణమునకాఁ। బదునాలవయేఁడుజయిం । చెదనాయుధమంటివ్రతినఁ జేసితినధిపా

—— దుర్యోధనుఁడు ప్రాయోపవేశముమానికరిపురంబునకుఁబోవుట. ——

చ ॥ అనవుడుఁ దస్ప్రతిజ్ఞయునురారులవాక్యములుండలంచియు । జనపతిగాఢనిశ్చయవశంవదుఁడై శయనంబుడిగ్గి
యనఁబయనంబుచేయుఁడనియప్పుడ మాత్యులఁబంచియిర్మలఁ । దినముఖకార్యముల్సలిపిదీపితుఁడై వెడలెంబ్రియా
బులతోఁ * వ ॥ అయ్యవసరంబున । చ॥ రయవిచలత్తురంగమతరంగములఁ మదనాగనక్రసం।చయములఁజంచలచ్ఛ
టులసైనికమత్స్యములఁ మహోన్నతం । బయికురురాజచంద్రునుదయంబునఁదద్గయుఁబొంగెఁబ్రస్ఫుర। ద్ధ్వజ
దమనోహరప్రకటభంగులఁదర్పలవార్ధియుద్ధతిఁ । ఉ॥ చామరపుండరీకవిలసత్సితచారుపతాకలఁగురు। గ్రామణియా
త్రయెంతయునుగాంతివహించెనభంబుశారదో। ద్దామసమరాళమండలసితస్ఫుటపద్మవనీపరిస్ఫుర। త్తామరసాకరంబుని
ధంబునభూవరనేత్రపర్వమై * వ॥ఇట్లుదుర్యోధనుండుకర్ణసౌబలసమేతుండై దుశ్శాసనాద్యనుజగణంబునుండకిఁనయ
మాత్యులుంగొలువఁజెలువుమిగులంజనికరిపురంబుఁబ్రవేశించి సముచితవ్యాపారంబులనుండునంతనొక్కనాఁడుమంత్రి
జనపరివేష్టితుండై యున్నయారాజునకుభీష్ముండిట్లనియె॥ మ॥హితులై పెద్దలుబుద్ధిచెప్పఁగఁగ్రియాహీనుండవై త్రో
చిపో। యితిదుష్టాత్ములఁగూడిదానికిఫలంబెట్లయ్యెనోచూచితే । గతవిద్వేషుఁడుధర్మనందనుఁడుగల్గంబట్టియిప్పాటదుర్గ
కిందక్రొత్తిగాకచిక్కితగదాగంధర్వు చేనాజిలోఁ * ఉ॥నీవునుదమ్ములున్సుతులు నెయ్యులువైరులచేగృహీతులై ।పోవఁగఁ
బాఱిపోయెఁగడుఁబొల్లుతనంబునసూతపుత్రుఁడీ। కావరుఁగప్పచిత్తునధికంబుగనమ్ముదునీవువీనిబా।హావిభవంబుకయ్యమ
ననక్కడఁజూచితెకన్నులారఁగాఁ । ఉ ॥ ఆయతబాహులు గ్రబలులార్యులుపార్థులువారిభూరిశౌ।ర్యాయుధనైపుణ
శ్రీయులయందుఁబదాఱవపాలుపోలఁడీ। వాయువురజ్జులాఁడధివవారలచందమువీనిచందము।నీ్నియెడనిక్కమైతెలిసెనేభ

చరేంద్రులపోరిలోపల౯ * క॥ కులమునుసిరియును జెలువకు । యలఘుస్థితినింకనైనన పాండవులకు౯ । గలసిమనవయ్యా నాద
గు । పలుకులువినవత్యహితము పథ్యముసుమ్మీ * వ॥ అనినభీష్మువచనంబులయెడ ననాదరంబు సేసి దుర్యోధనుండు కర్ణసౌబ
లులం జూచి నవ్వుచు వారలుం దమ్ములుం దోడనచన నక్కడ వాసిచనియె భీష్ముండును లజ్జితుండై నిజగృహంబున కరిగెనంత౯
గౌరవేశ్వరుండు గ్రమ్మఱ యెప్పటిచోటికి జనుదెంచి మంత్రులతోడ మంతనంబుండి మనకెయ్యది కర్తవ్యం బెట్టు సేసిన నాజే
జోలాభంబులగుననియడిగిన గర్ణుండు దేవా నీకింక నేవిచారమ్ములు నేలనిష్కంటకంబగు నీపృథివి సకలంబును బాలించుచు
ను హేంద్రవిభవంబుతోడ నఖిలసుఖంబులనుభవింతు గాక యనినం బ్రీతుండై యతండు వానికిట్లనియె * క॥ నీయట్టి వీరవ
రుడున్నవాఁ యుండ బెవడ యరావియదియుం గలదే । ధీయుత నాకెయ్యదియును । బాయక వినుమింక నొక్కవని తెల్లము
గా౯ ॰ గీ॥ ధర్మజుఁడు రాజసూయంబు బేర్మిఁ జేసె । నంతనుండియు నమ్మహితాధ్వరంబు । నం దభిప్రాయమైయుండు నెం
దు వాకు । నమ్మఖంబు సేయింప వేయాన ఘనన్న * వ॥ అనినం గర్ణుండు గౌరవపతి కిట్లనియె * క॥ అగు గాక యేమియిప్పుడు ।
జగతిం గలనృపతులెల్ల జనవరనీకి । మ్ముగ వశవర్తులుగావున । నగను ద్యోగింపుమిపుడు దక్రతువిధికి౯ * ఉ॥ రాజులఁబి
ల్వఁబంపుము ధరాసురసంఘము నామతింపుమీ । రోజను దాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁబంపు వి । భ్రాజితభక్ష్యభో
జ్యవిధిభవ్యపదార్థములా నయింపుమ । వ్యాజవిభూతి మైనమరవల్లభు చాడ్పునఁ జేయు జన్నముల్ ॰ వ॥ అనినసంతసి
ల్లి కురుపతి యప్పుడు పురోహితులం బిలిపించి రాజసూయంబు సంపూర్ణదక్షిణలతోఁ జేయవలయుఁ గత్ప్రయోగవిశేషం
బులకు మీరు చాలియుండున దియనినం బురోహితుండు దగినవిద్వజ్జనంబులతో విచారించి దుర్యోధనున కిట్లనియె * చ॥ జన
వరనీకుఁ బాండవులు శత్రులు గావున నీవు వారినో । ర్చినమతి కాకమున్న యిటు సేయఁగ శక్యమె రాజసూయముల్ । వి
నుము దగంగ నిప్పటికి వేఱొకయజ్ఞము సేయుమిమ్ములన్ । బనుపుము దక్షయావివిధభంగులకున్ దగు వారివేగమై ॰
గీ॥ రాజసూయంబునట్టిద రాజవర్య । వైష్ణవంబను యాగంబు వాసుదేవుఁ । డిమ్మఖము సేసె దొల్లి యభీష్టమిదియ । చేయు
నిర్విఘ్నముగ నది చెల్లు నీకు ॰ క॥ అనిననది వోలు ననియె । జనవాథుఁడు సూతతనయసౌబలులుప్రియం । బుననను మతింప
నభిమతి । వినుతాధ్వరసంప్రయోగవిహితోద్యముఁడై * క॥ తనయుద్యోగము జననీ । జనకులను ద్రోణవిదురశాంతనవ

దుర్యోధనుఁడు వైష్ణవంబను యజ్ఞంబుఁ జేయుట.

కృపాదినిఖిలమాన్యజనమ్ముల । కునుదగ నెఱుఁగించి భరతకుంజరుఁ డెలమి౯ * వ॥ వారిచేత ననుజ్ఞాతుండై నగరసమీ
పంబున నొక్క పుణ్యస్థలంబునం దఖిలయజ్ఞగృహంబులు నతిరమణీయంబులుగాఁ జేయించి యజ్ఞోపకరణంబులును సమస్త
వస్తువిశేషంబులును సమకట్ట నియోగించి శుభదినంబునం బరమబ్రాహ్మణసహాయుండై దీక్షాశోభనంబు వహించెనంత *
గీ॥ అఖిలదేశవాసులైన రాజులను బ । విత్రచరితులైన విప్రవరుల । నర్థిఁ బిలువ దూతల రిగి కౌరవేశ్వరుని యాజ్ఞఁ జేసి
సన్నద్ధముగ * వ॥ అందొక్కదూతం బిలిచి దుశ్శాసనుండు నీవు ద్వైతవనంబునకుం జని పాండవులను దదాశ్రమవాసు
లైన భూసురులను గౌరవేశ్వరు నధ్వరంబునకుఁ బిలువ మనిపనిచిన వాఁడును జని ధర్మజుం గని యిట్లనియె * ఉ॥ వీరుఁడు కౌ
రవుండు నిజవిక్రమలబ్ధసమున్నతార్థసం । భారములన్ మహాధ్వరమపారబలుండొనరించుచుండి పెం । పారఁగ నిమ్ము నిన్నుఁ
దమ్ములమహాద్విజులం బిలువంగఁ బంచె ధా । త్రీరమణేశ నెమ్మిఁ జనుదెమ్ము తదధ్వరముం గనుంగొనన్ * వ॥ అనిన ధర్మత
నయుండు మందస్మితాననుండై వానికిట్లనియె ॰ చ॥ అనఘుఁడు ధార్తరాష్ట్రుఁడు మహాధ్వరకర్మధురీణుఁడయ్యె
నా । విని ప్రియమందె జిత్తము పవిత్రితమయ్యెఁ గులంబు నింతయై । ననుదగ నేము పూనిన ఘనంబగు పూనికి దీర్ప కెవ్వి
ధంబున నట రానెడం బడము భూవరుతో నిది చెప్పుమేర్పడ౯ * వ॥ అనియె నప్పుడు భీమసేనుండు దూతం జూచి పదుమూఁడ
గునేటికడపటఁ బాండవాగ్రజుండు దీక్షితంబగు శస్త్రాస్త్రదహనంబునందు ధార్తరాష్ట్రపశుశతంబు వేల్చి నరసత్రం
బు సేయుటకునై వచ్చుం గాని యందాకఁ జనుదెంచుట కలుగదని యా దుర్యోధనునెదురన యొడకచెప్పుమనిన వాఁడు
ను మగిడిచని ధర్మనందను ప్రియవచనంబు వృకోదరు నిష్ఠురోక్తులు ధార్తరాష్ట్రుల కెఱుంగించె దదనంతరంబ * క॥
చనుదెంచిరి శౌరవశా । సనమున ధరణిం గలసకలజనపతులును స । న్మునులును సమస్తజనులును । ఘనభుజుజన్నంబుఁ జూడ౯
గరిపురమునకున్ * వ॥ వారికెల్లను దగిన సత్కారంబు సేయను బాత్రదానంబులు గావింపను ధృతరాష్ట్రుండును విదురుంబ

నిచెనివ్విధంబునఁ బ్రసిద్ధదక్షిణాన్వితంబై ప్రభూతాన్నపానసంతర్పితసకలజనంబైయభిమతాంబరాభరణపరితోషిత
భూసురప్రకరంబై యథాకాలవిహితసకలకలాపంబై యథాశాస్త్రీయంబై వైష్ణవయాగంబు నిర్విఘ్నంబుగం బరిసమా
ప్తంబగుటయు ✱ క ॥ అవబృథశోభితుఁడై కౌరవముఖ్యుఁడు భూరికనకరత్నతతులభూదివిజులఁ బూజించి నృపులఁ
సఖులసత్కరించి వీడ్కొలిపెఁదగన్ ✱ వ ॥ అట్టిమొఱఁ ధ్వరోత్సవాగతులైన జనుల నేకులు ధృతరాష్ట్రనందను సమ్ము
బున నిట్లనిరి ✱ క॥ జనపతులెవ్వరు నివ్విధ । మునని ర్విఘ్నముగనఖిలభూజనసమ్మో । దనముగఁ జేసిరె సత్క్రతు
వత్నుణ్యమహిమయాశ్చర్యమిలన్ ✱ శా॥ సారోదారగపీభూతిమై మనుమహాశ్వం ద్రుడొనర్చెం గృపాపారీణుఁడు
రాజసూయమది చెప్పన్వింటిమయ్యజ్ఞము౦ । గౌరవోత్తముఁడైనధర్మసుతుఁడుంగావింపఁ గాఁ గంటి మేము రాజేంద్ర
రిగావునీమఖముతోనత్యున్నతిన్ భూవరా ✱ క॥ ఈజన్న మొనర్చియశా । దేజగదారాధ్యకీర్తిదీపితులైయ । వ్యాజ
లోకసుఖములు బ్రాజిల్లిరి రఘుయయాతిభరతాదినృపుల్ ✱ గీ ॥ అనినుతింపంగమఱియునునందుఁ గొందఱయ్యు
రాజసూయంబుదుదుఱు । పాలుపోలదీసుఖమువైభవసమృద్ధి । ననితలందరినిజహృదయంబులందు ✱ వ ॥ అనంతర
రంతరానందమంధమందాయమానమానసుండగుచు మానవేశ్వరుండును దమ్ములు దొరలు బంధుజనంబులుంబరివేష్టి
రజనదత్తాశీర్వాదజయజయ శబ్దశబ్దాయమానదిగ్విభాగుండగుచుఁ బుణ్యాంగనాకరకలిత లలితాక్షతల్ వైచుచు
వందిమాగధసంకీర్తనంబులు గైకొనుచుఁ బురప్రవేశంబుసేసి రాజమందిరగతుండై ధృతరాష్ట్రునకు గాంధారికిఁ గృపద్రో
ణభీష్ములకుం బ్రణమిల్లి యుల్లంబు వికసిల్లఁగనకాసనాసీనుండయ్యెనప్పుడు కర్ణుండతని కిట్లనియె ✱ ఉ ॥ భాగ్యముగా
రవనృపాలభవన్మఖమిష్టసత్క్రియా । యోగ్యతనిర్వికల్పముగనొంటెసమాప్తిన శేషధాత్రియా । భోగ్య
నీకురణభూమిఁ బృథాసుతులన్ జయించిన । వ్యగ్యముశాలివై భువనమాన్యయొనర్పుము రాజసూయమున్ ✱ క॥
మ్మెయినగునోయని । మదిలోవగవంగవలదుమహఘునతనూజా । గదనమున నేజయింపక । పదనఖధావనమొనర్చ
ముఖ్యా ✱ గీ॥ అనినఁ గర్ణుఁ గౌఁగిటఁ జేర్చి యన్నరేంద్రనందనుఁడు నీసహాయత నాకుఁగలుగఁ । బాండవులనోర్చ
నిమహాత్మ । యనిసమాదరసహితుఁడై హర్షమొందె ✱ వ ॥ అటధర్మతనయుండు సూతతనయుప్రతిజ్ఞవిని
ర్యవిభవంబును నభేద్యకవచప్రభావంబును దలంచి విషణ్ణహృదయుండై రేయెల్లనుగన్నుమూయక వగచుచుండె
ర్యోధనుండునుగర్ణసౌబలప్రవర్తితకార్యభక్తుండై భీష్మద్రోణకృపాదులకునను దినంబును బ్రియసత్కారంబులు
చుధనంబు దత్తభుక్తఫలంగావగది నిరంతరత్యాగభోగంబుల ననురాగంబు నొందుచుండెననిన వైశంపాయనుం
నమేజయుండిట్లనియె ✱ క॥ దుర్యోధను చెఱఁదలఁగియ । వార్యపరాక్రములు పాండవప్రభులు మహైశ్వర్యచరితులు

——✱ ద్వైతవనంబునందలి మృగసమూహము ధర్మజుస్వప్నమందు వచ్చి తమ దుఃఖంబు చెప్పుట. ✱——

మున । నార్యులు మఱియెట్టివారలైరి మునీంద్రా ✱ వ॥ అనియడిగిన నమ్మహామునియమ్మహీపతికిట్లనియెం సీ॥ ద్వైతవనంబు
ధర్మజుఁడొకనాఁడు నిద్రింపఁగాఁ దద్వనేచరంబు । లగునట్టిమృగజాతులన్నియుఁగలలో నవచ్చికన్నులనశ్రువారిదొ
గఁ । దమ్మెఱింగిందియాతనితోడ నిట్లను ధర్మాత్మ మీకు నిత్యంబుగడఁగి । చంపంగఁ జంపంగసమసియల్పావశిష్టములయ్యె
నివ్వడస్మత్కులంబు - గీ॥ లేమ బీజమాత్రము దక్కియిట్లు వనరు । చున్న వారము మీకింక నెందుకడకు । నరిగి
కరుణార్ద్రబుద్ధి । నవిననట్లకాకనివానికభయమిద్ది ✱ క॥ జనపతిమేలక నియంతము । ననుజుల కెఱుఁగించియిట్టులను
ము పై । నెనిమిది నెలలుండితిమి । వ్వనముఁ దగునింక నొండువనమునకేగన్ ✱ వ॥ ఇప్పుడు కామ్యకవనంబు బహుమృగా
ర్ణంబై సరసఫలభరితభూరుహప్రకరంబై విమలకమలాకరాభిరామంబై యున్నయదియని వింటిమి కావునం గ్రమ్మ
దులకుంజని తృణబిందునాశ్రమంబున వసియించుటలెస్సయనినం దమ్ములుదేవానీవెట్లు నిశ్చయించి తదియ
బనిపలికి రీతదనంతరంబ ✱ క॥ అనుజన్ములుఁ బాంచాలియు । ననుచరవర్గంబు బ్రాహ్మణావలియుఁ దోడ్చను దేరఁగ
దమనఘునతేజుఁడుసనియోఁ గామ్యకవనంబునకున్ ✱ వ॥ ఇట్లరిగియందుఁ గృతనివాసులై యవ్వీరులు శాకమూలఫల
బులం జేసి దేహయాత్రలునడుపుచు నొండొరులయలజడి చూచి యత్యంతదుఃఖపరవశులగుచు జూదంబు నాఁడు
నపాటుదలం చికలంగుచుఁ గ్రోధశోకంబులు దమలోనన డంచికొనుచు వర్తిల్లంబడు నొక్కనాఁడు నయోధుఁ చనినఁ గాలంబు

గాంచినవారై వెడవెడవికసిల్లినచిత్తంబులతో ముదితవృత్తంబులనుండునంత * శా ॥ ప్రీతుండై చనుదెంచె నాశ్రితజ
నాభీష్టక్రియాశీలుఁడు । గ్గీతామ్నాయుఁడు నిర్విధూతదురితక్లేశుండు యోగామృతా । స్వీతస్వాంతుఁడు సంతతస
మావిర్భూతకారుణ్యధారాతోయస్నపనైకశీలుఁడు పారాశర్యుఁ డచ్చోటికిన్ * క ॥ మునిపతి దవ్వులఁ గని జనప
తితమ్ములు సదానుసంప్రీతి నెదురేఁగి యర్ఘ్యాదివిశేషార్చనలం బరితుష్టుఁ జేసె సంభృతభక్తిన్ * వ ॥ కృష్ణద్వైపా
యనుండును ననవరతవనవాసాయాసకృశదేహుల నధికదుఃఖాయమానమానసులం దనమనుమలం జూచి వగచి ధర్మపు
త్రున కిట్లనియె * ఉ ॥ కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు నెక్కాలము నేరికిన్ ధ్రువము గాదు సుఖం
బును దుఃఖముఁ గావున మహీపాలబుధుండు దద్వివిధభంగు లెఱింగి ప్రమోదఖేదసం । శీలుఁడు గాఁడు రెంటఁ బ్రసిద్ధపథంబున
నప్రమత్తుఁడై * క ॥ మును నీవును నావదలకు । ఘనముగ నొక్కింత యొప్పి మహనీయముగా । నొనరించుము తపములఁ దపంబున
నదాన సకలసౌఖ్యము లుసిద్ధించుఁగా * క ॥ తపము నహింసయు సత్యము । సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గము ను దపోలక్షణములు । క్రమమున నివ్వియను నుత్తమగతి కారణముల్ * గీ ॥ ఇందుఁ జేసినపుణ్యంబు లందుఁ గుడుచు । మీఁ
దిజన్మంబునకు నది మేలు సేయు । గాన దనశక్తిఁ గూడ దానధర్మ । చిరపరోపకారంబులు సేయవలయు * వ ॥ అనినం బాం
డవాగ్రజుండు దానతపంబులలో దుష్కరం బెయ్యది యెద్దాన నధికఫలంబగునని యడిగిన వేదవ్యాసుండిట్లనియె * సీ ॥ దా
నమూర్జితఫలదంబర్థసాధ్యమై పరఁగుటఁ గరము దుష్కరము నదియ । నరులకు నధిప ప్రాణంబులకంటెను రూపింప నర్థంబుదీ
పుఁ గనవె । యర్థంబులై నయాయుధములమొనలపై నుఱుకుటయుఁ బోధిఁ జొచ్చుటయు । కృషిపశుపాల్యసంక్లేశంబు నొందు
టయుఁ దవులఁ గొండల నిమ్మవ వసట ॥ గీ ॥ ననసి పావసియను దినముఁ బ్రేష్యులై । యూనికి దలఁప నర్థమునకు చూవె । యట్టి
దుఃఖలబ్ధమైనట్టి యర్థంబు । విడుచు టెవ్విధమునఁ గడిది గాదె * శా ॥ అన్యాయార్జితమైన విత్తమునఁ జేయం బూను దానం
బు మూ । ర్ఖన్యాయం బది దానఁ జేసి ఫలపాకం బేమియుం గాలేదు యు । క్తన్యాయార్జిత మించుకంతయును గాలంబు దే
శంబు స । న్మాన్యంబై తగఁ బాత్రయోగమున సౌఖ్యంబై ఫలించుం దుదిన్ ॥ వ ॥ తొల్లి ముద్గలుండను మహాద్విజుండు సన్మా
ర్గోపార్జితంబయిన వ్రీహిద్రోణంబు సత్పాత్రంబున వినియోగించి కాదె పరమసిద్ధిం బొందె ననిన విని ధర్మనందనుం
డు మునీంద్రా ముద్గలుండు వ్రీహిద్రోణం బెట్లుఁగి నుపార్జించె నెట్టిపాత్రంబునఁ బ్రతిపాదించె వినవలతుం జెప్పవే యను

వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణికాఖ్యానంబు చెప్పుట,

ననవతం డిట్లనియె * క ॥ అతిథిప్రియుఁడు విశిష్ట । వ్రతుఁడు విమత్సరుఁడు సత్యవచనుండు విజి । తవిషయేంద్రియుఁడు
సము । న్నతపుణ్యుఁడు ముద్గలుఁడు ఘనస్థిరబుద్ధిన్ ॥ వ ॥ పుత్రదారసహితంబుగాఁ గురుక్షేత్రంబున వసియించి యుంఛ
వృత్తిపరాయణుండై పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్క గింజ యుకా చూమెచు పక్షమున మూర్చిపర్వది
నంబునఁ బాకంబు సేయించి దేవపితృపూజనంబు లొనరించి యతిథులకు నన్నంబు వెట్టి మిగిలిన యన్నంబు దానును
పుత్రకళత్రంబులును దేహయాత్ర నడుపుచు నివ్విధంబున బక్షోపవాసవ్రతంబున వర్తిల్లుచున్నయెడ నొక్క పర్వ
దినంబునందు * మ ॥ మలినత్యంతజుగుప్సితంబయిన యున్మత్తస్వరూపంబుతో । గతవస్త్రుండును ముక్తకేశుఁడు బ
హుగ్రామ్యోక్తిశీలుండునై । హితపుణ్యుండు మునీశ్వరుండతిథియై యేతెంచె దుర్వాసుఁడున్ । మతి యమ్ముద్గలు పాలి
కిం బటుబుభుక్షాయుక్తుఁ డందూలుచున్ * క ॥ అతనిం గని యించుకంతయు । మతి నవమానంబు లేక మానుగఁ బ్రత్యు । త్థా
నై యర్ఘ్యము పాద్యము । నతిభక్తి నొనర్చి మునికులాగ్రణి నెమ్మిన్ * క ॥ అన్నంబు వెట్టె నతఁడును । దన్నంబంతయును
గుడిచి యాత్మఁ దనిపి శేషాన్నంబు మేను నిండఁగ । నెన్నతుఁడలఁదికొని మగిడిచనియె జెచ్చెరన్ * క ॥ మునిపతి పర్వము ప
ర్వంబును మఱియును నరుగుదెంచు ముద్గలుఁడును దా । ననశనుఁడై యుండియు న । మ్మునివరునకు నొసఁగు నన్నముం బ్రి
యమెసఁగన్ * వ ॥ ఇవ్విధంబున నాలుపర్వంబులు గుడిచి దుర్వాసుండు వాని చిత్తంబున నొక్కింతయుం గానక య
ద్భుతప్రమోదమగ్నమానసుండై వానికిట్లనియె * క ॥ నీయట్టి దానశీలుని । నీయఖిలమునందుఁ గాన నెన్నండును స । త్త్వా
యత్తమతి విసాధువి । ధేయుండవు పరమపుణ్యతేజుఁడవనఘా ॥ చ ॥ మనమున నేవగింపక యవమానము సేయక యించుకం
తయుఁ గా । గినియక సోలమెండక యకృత్రిమభక్తి నెనర్చితీవు స । జ్జనసుత యన్నదానము ప్రసాదము సత్యము ధైర్యమున్

దమం। బుననపరిగ్రహత్వమును బొల్పుగ నీధనమయ్యె నియ్యెడన్ * చ॥ శ్రవములు ప్రేముడించు ననిశంబుననాఘనా
ల్మి పెంపుధ। ర్మువుశమంబు ద్రెక్కొను సముద్ధతి నాఁకలి వీని రెంటనన్। దవులవు జీవితస్థితివిధాయకమన్నము నీవుజ్ఞి
తేఁచ్ఛవిడిచితివ్వాడేముని ప్రశంస మొనర్తు నినుం దపోనిధీ * క॥ మనమును నింద్రియములవిర్తనమును సరిగానొసర్చి
ర్మంబు తపం। బని చెప్పెదరట్టి తపం। బనఘా నీయందకలిగెఁ భిమతభంగిన్ * ఉ॥ ప్రీతుఁడనైతి నీవలనఁ జేర్చినపుణ్య
దంబులెల్లనీ। చేతివయ్యె నీకగు ప్రసిద్ధగపోవిభవంబు నగ్గర। వ్రాతములిప్డు సూపెద దివంబున నీపును మేనితోడ
ఖ్యాతిగ దేవయానమున గ్రమ్మన నేగుము సంయమీశ్వరా * వ॥ అనిపలికి మర్యాసుందరిగెఁ దడనంతరంబ హంసన
యాక్తంబును గింకిణీమాలికామనోహరంబును గామగమనంబును నైన విమానంబు గొనుచు దేవదూత ముద్గలుకడకుంజన
దెంచి యిట్లనియె. క॥ అనఘభవత్సుకృతంబున। ననిమిషలోకాభిగమనమార్గంబయ్యెన్। జనుదెమ్ము విమానము
య్యానెక్కు ముచిత్తమునఁ బ్రహర్షంబెసఁగన్ * వ॥ అనిన దేవదూతం జూచి ముద్గలుండు మహాత్మా దివిజలోకం బెట్టి
దినవలతునందుల గుణదోషంబు లెఱుంగింపవలయు సత్పురుషులతోడి మైత్రి సాప్తపదీనంబని చెప్పుదురు గావున మైత్రి

ముద్గలునకు దేవదూత పుణ్యలోకంబు తెఱంగు చెప్పుట.

రస్కరించి దీనిన్నడిగెద నినన తఁడమ్మునీంద్రునకిట్లనియె. క॥ ఈలోకమునకు మీఁదై। చాలఁగ వెలుఁగొందుచుండు స్వ
ర్లోకమునా। నాలంకారయుతముది। వ్యాలోకము దేవయానమది మునినాథా * చ॥ అమలతపోనివాసులు మహా
శీలురు సత్యసంధులు। ర్తములు జితేంద్రియుల్పములు దానవహ ప్రణశూరులం మహా। ర్షమునవసింతు రప్సరలుసా
లు దేవమునుల్మగుద్వసు। ప్రముఖులు వేలు వేలతగు పట్టుల నుండు ముదంబునిమ్ములన్ * వ॥ మఱియు ముప్పది మూఁడు
వేలయోజనంబుల విస్తృతంబయిన మేరుశిఖరంబునందు నందనప్రముఖంబులయిన దేవోద్యానంబులు పుణ్యపురు
షక్రీడాస్థలంబులయి విలసిల్లు నయ్యెడల నాఁకలియు నీరువట్టును శీతోష్ణభయంబులును జరారోగవికృతులుఁ బుట్ట
వ్యెడఁ జూచిన నతిమనోహరంబై సకలేంద్రియతర్పణంబై యుండునట్టి పుణ్యలోకంబునకు నర్హులయిన పుణ్యపురు
షులు విధినియోగవిహితంబులయిన మానుషశరీరంబులు విడిచి తేజోమయంబులగు దివ్యదేహంబులు ధరియించి వివిధా
రాభరణభూషితులును నసమానకుసుమమాలికా మనోహరులునైనకనకవిమానంబులందు దేవదూతలచే సంగొనిపోఁ
బడియాందు శోకశ్రమాయాసవిరహితులయి వివిధసుఖంబుల ననుభవించుచుండుదురు. గీ॥ అనఘ యింద్రలోకముమీఁ
టెమీఁదని। శ్లోకమగుచు బ్రహ్మలోకమమరు। నది యనన్యదీప్తసదనమై తనదైన। వెలుఁగునను జగంబు వెలుఁగఁ జేయు
మనువులు ధాతలున్మనులు మానుగనుండు దురందు లోభమునం। గినుకయుఁ దావ మూరుంబగయుఁ గిల్బిషమున్ ఘనదు
కృతం। బును జరయుం బవిభవనమాల్దెసునప్పుడు నాశమొందద। వ్విమతపదంబు దానియెడ వేడుక సేయుదురింద్రముఖ్య
లున్ * వ॥ స్వర్గంబునం గలగుణంబు లెఱుంగించితిఁ దదీయదోషంబులు సెప్పెదవినుము * గీ॥ ఇందుఁ జేసినపుణ్యంబు
డుఁగుడుచుఁ గాని సుర్తు ల్యనకందుండికడఁగి పుణ్య। మాచరింపంగ లేదు పుణ్యావసాన। మగుడనవనిక త్రోతురు మనుజు
ను * క॥ కడుమరిగినసౌఖ్యంబులు। విడుచుటది ర్తంబు దుఃఖవివశముగ మహిం। బడుఁ జూవెపుణ్యలోకం। బెడలిన మనుజు
డు తేజమేదియుఁ బట్టుఁడై * క॥ తనతక్కువయును కీయున। న్యూనయున్నతిశీలతయుఁ గనుంగొని చిత్తం। బున నెఱియ యు
కిగలుగును। జనమతసురలోకవాసజనులకు నెల్లన్ * వ॥ బ్రహ్మలోకంబునందక్కడక్కడ పుణ్యలోకంబుల నెల్లనిరవుల
రయ్యై చెల్లుమఱియుఁ బుణ్యలోకపరిభ్రష్టుండు మర్త్యలోకంబున సుఖశీలుండై పుట్టు నీలోకంబు గర్మభూమియు నాలోకంబు
ఫలభూమియును నియెఱుంగుము నీవలని యాదరంబునం జేసి యింతయుం జెప్పితి నీవింకఁ దడయ నేల చనుదెమ్మనిన ముద్గలుం
కొండొక విచారించి దేవదూతఁ జూచి యిట్లనియె * గీ॥ ఇట్టి దేని సుఖములెల్లను బదివేలు। వచ్చె నాకు నమరవర్గమునకు। యా
నిమ్ము దాని నొయన్నపిచ్ఛే యామిష్టమైన కడకు నివుడ నీవు * క॥ ఎయ్యెడకుఁ జనినఁ బురుషుం। డియ్యెడ దు మగుడఁ గుండ
శోకాలము నేనయ్యుత్తమపదవికిఁ జన నెయ్యానువున నైన నుత్సహించెద బుద్ధిన్ * వ॥ అని దేవదూతపీడ్కొలిపి ముద్గలుం
శిలోంఛవృత్తివిడిచి పరమశాంతిం గైకొని నిర్వికల్పంబయిన జ్ఞానయోగంబునం జేసి తుల్యనిందాస్తుతియును సమలోష్టకా
చనుం డునై పరమసిద్ధిం బొందెఁ బాండవోత్తమా నీవును రాజ్యరహితుండవై తిననివగవక తపంబు సేయుము తపంబున

భంబులు చేపట్టుఁబడు మూఁడవయేఁటికడపటఁ బితృపైతామహంబయిన రాజ్యంబు నిన్నుం బ్రాపించు ననియిట్లు సాత్యవతే యుండు గాంతేయులనాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె నంత * మ॥ వితతానేకమృగాకులంబును సదాపుష్పితనానాతరుప్రతతీపుష్పసుగంధబంధురసుఖావాసంబు ద్రిష్టాగ్నిసం । శ్రితపుణ్యాశ్రమమండలంబునగు చుం బెంపొందున శాఖాసలోఁ గృతపుణ్యులు విహరించిరే పురుషుసుంతీపుత్రులిచ్ఛాగతిన్ * వ॥ ఒక్కనాఁడమ్మహారథులు తృణబిందు వాశ్రమంబున ధౌమ్యసహితంబుగాఁ బాంచాలి నిడి యేవురు నొక్కట మృగయావినోదార్థంబున నలుదిక్కులం జనిన యవసరంబున *

## సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట.

ఉ॥ వీరుఁడు సైంధవుండు జనవిశ్రుతశౌర్యుఁడు సాల్వకన్యకం । బారఁగఁ బెండ్లియాడుటకునై నిజవైభవముల్లసిల్లవి । స్ఫారచతుర్విధోరుబలసంగతుఁడై చనుచుండి యాశ్రమ । ద్వారమునందుఁ గాంచె ద్రుపదక్షితిపాలతనూజ నచ్చటన్ * ఉ॥ నీలపయోదమండలి వినిశ్చలలీల వెలుంగఁ జేయుచున్ । గ్రాలెడునట్టి క్రొమ్మెఱుఁగుకైవడిఁ దవ్వనభూమి నంతయున్ । లాలితదేహకాంతిపటలంబునఁ జేసి వెలుంగఁ జేయు న । బ్బాలవినీలకుంతలవిభాసితఁ జూచి సవిస్మయాత్ముఁడై * గీ॥ మగువఁ దగిలిన చూడ్కులసుగుడఁ దిగువ । నేర్వ చాలక యపుడు కందర్పదర్ప । గోచరాత్ముఁడై విజసఖుఁ గోటికాస్యుఁ । డనునృపాత్మజుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి * ఉ॥ ఇన్నలినాక్షి యెవ్వతయొ యివ్విపినంబున నేకతంబ యి । ట్లున్న నిమిత్తమేమి యొకొ సూరోత్తమకన్నెయొ యక్షకాంతయో । పన్నగభామయో సుజభామిని గామిని జంబయిట్టిచె । ల్వున్నదియే మహీతలమునం గలు లెవ్వరికైన మనారయన్ * ఉ॥ లీలనొలర్పఁ గానబల లేఁజిగురాకునుబోలె నొప్పకెం । గేలుఁ గదంబశాఖతుదఁ గీల్కొనఁ జేసి వసంతవిభ్రమోన్మీలితబాలవల్లిక్రియ మేలుగఁ జూడ్కులకిచ్చి పావక । జ్వాలయుఁబోలెఁ జిత్తమున జొబ్బిలియుంపఁ దొడంగెఁ గంటివే * ఉ॥ ఈకమలాస్య నాకుహృదయేశ్వరి యైనఁ ద్రిలోకరాజ్యమున్ । జేకొని యేలినట్లు వికసిల్లనె దర్పకవీరుబంటు గాఁ । గైకొననేవయస్య వెసఁ గాంత నొడంబడఁ బల్కి దీనికి । న్నాకును బొందొనర్చి కరుణం జరితార్థునిఁ జేయవే నన్నున్ * వ॥ అనిపలికినఁ గోటికాస్యుండు గ్రక్కునం బాంచాలికడకుం జని ప్రణయశుభగంబుగా నమ్మగువ కిట్లనియె * సీ॥ మృగనేత్ర దారుణమృగసమాకులమైన యివ్వనాంతరమున నందేకతంబ । యిట్లున్న యిక్కికి నెయ్యది మూలమివ్వనదేవతవో సురేశ్వరుని తోడఁ బలిగి ధరిత్రికి నరుగుదెంచిన శచీదేవివో హరియురస్స్థితిఁ దొలంగి । కేలిఁ గ్రుమ్మరు పద్మగేహవో భవజ్జనకత్వమున సముజ్జ్వలితుఁడైన గీ॥ పుణ్యుఁ డేవంశమున వాఁడొ పొలఁతి నీకు । జీవితేశ్వరుఁ డనుసుఖజీవితాత్ముఁ । డెవ్వఁ డబల నీనామ మేయింపుమికులు । శబ్దమెయ్యది వాపుజంబు చెపుము * క॥ కరిరాజగమన నాతెఱఁగ । గరయఁ దలంచితేని వినవె యధికబలుఁడనే । సురథుఁడను రాజపుత్రుఁడ । నరిదమనుఁడఁ గోటికాస్యుఁ డనఁ జనువాఁడన్ * గీ॥ అల్ల కాంచనరథము పైనమరువాఁడు । ఘనుఁడు క్షేమంకరుండు త్రిగర్తభుఁడు । మఱియు నినుఁ జూచుచున్నాఁడు మగువ వాఁడె । దీప్తభుజుఁడు కళింగధాత్రీవరుండు * గీ॥ ఒవరఁ బద్మాకరము పొంతనుండి నిన్ను । మెచ్చి కనుఁగొనుచున్న యున్మీలతాక్షుఁ । డుత్పలాక్షి యిక్ష్వాకుకులోద్భవుండు । సుబలభూపతి పుత్రుండు శుభగుఁడతఁడు * వ॥ అరుణాశ్వయుక్తంబులైన రథంబులయందు రత్నమయ భూషణులై సమిద్ధవహ్నులుం బోలె వెలుంగుచున్న సౌవీరకుమారులు పన్నిద్దఱు తమ్ముం జేరికొలువ ననేకసహస్ర కరితురగరథపదాతిపరివృతుండై మహాగజంబుపై శోభిల్లుచున్న యవ్వీరుండు సింధుసౌవీరనాథుండైన జయద్రథుండమ్మనుజేశ్వరుండిప్పుడు నీ తెఱంగెఱుంగఁ దివిరి నన్ను నిటఁ బుత్తెంచెననినఁ బాండవపత్ని మృదుసంభ్రమంబున గదంబశాఖ విడిచి యుత్తరీయంబు సంగతంబుగా వించుకొని కోటికాస్యున కిట్లనియె * గీ॥ అన్నయిచ్చట నే నొంటి నున్నదాన । నీవిచటికేసు దెంచుటనీతియగునె । సుతవతి ని ధర్మవతి నన్ను నిరతకాంత । గాఁ దలంచి పెక్కులు పల్కఁగాదు నీకు * వ॥ నీవు శిబివంశోద్భవుండైన సురథుపుత్రుండవగుటెఱుంగుదు నస్మత్ప్రకారంబు సెప్పెద వినుమేను బాంచాలపతినైన ద్రుపదు కూఁతుర గృష్ణయను దానం బాండునందనులగు యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులకు ధర్మపత్నినవ్వీరులివ్వాడు నన్ను నివ్వనంబున నునిచి * గీ॥ ధర్మజుఁడు తూర్పు భీముండు దక్షిణంబు । నర్జునుఁడు పడమర కవలర్థి నుత్త । రంబుగా వేటపోయిరి రాజముఖ్యు । లనఘులింతకు వత్తురు వినుతబలులు * వ॥ మీరమ్మహాత్ముల కమాననీయులరుగావున నార్యజనమిత్రులగు నక్కురుకులపవిత్రులు సేయు సత్కారంబులు గైకొనఁ బోవుదురుగాని యొక్కింతదడవి యాశ్రమసమీపంబున నిలువుండని పలికె

యుల్లన నవ్వనవర్ణిని భయంబునం బర్ణగృహంబు సొచ్చినం గోటికాస్యుండును గ్రమ్మఱ నంజని జయద్రథుతోడ నవ్వా ల్గంటి పాంచాలకన్యక యనియును బాండవపత్ని యనియునుం జెప్పిన నద్దురాత్ముండు మదనకంపితహృదయుఁడగుచు నమ్మగువ నపహరింపం దలఁచి కతిపయజనసమేతంబుగా సింహాగారంబు సొచ్చు మృగంబునుం బోలెఁ బాండవనివాసంబుఁ బ్రవేశించి పాంచాలిం గని దానికిట్లనియె॥ క॥ వామాక్షి నీకుఁ గుశలమె। నీమగలైన యవ్వారియందు నిత్యప్రేమం। బై మెలఁగుదువె పసులు। నీమగలేవురు కుశలమున నెమ్మదియే మఱిక॥ వ॥ అనిన వానికి సమ్మానపూర్వకముగ నిట్లనియెం॥ చ॥ స్థిరమతులైన పార్థులకుఁ జెము నీకున నామయం బెట్టు। వరతనువిందవై తపసువర్యులయింటికి నట్లు గావునన్। బరువడి నాసనక్రియయుఁ బాద్యము నర్ఘ్యము సైకొనుమాదరంబుతో। సరసపురంగమాంసములసల్పుము భోజనకృత్యము తతిక॥ గీ॥ వేఁటఁ బోయినారు సభుల వత్తురు। రువ వచ్చి నీకు వలయునట్టి ప్రియములాచరింపఁ బ్రీతుండవై నాఁడె। యిష్టజనులు నీవు నేఁగుమనఘ॥ చ॥ అనవుడు సైంధవుడసివనంబుజలోచన నీవు మాకుఁ జే। యునతిథిపూజలన్నియును నొక్కటనైనఁ గొఱంత లేక యిచ్చినయవి లిచ్చి కూటఁగారియై పొందెడందమి। కననుఁగృతార్థుఁ జేయుము తగన్ రథమెక్కుము లెమ్ము నెమ్మితోన్॥ మ॥ ధరణీనాథుము గోలుపోయి ఘనకాంతారస్థలీ వాసులై। సరి వారెల్లను నవ్వఁగుత్సితదశాసంప్రాప్తిమైనున్నము। వ్యర్ధులం బాండుగొల్చి వంగలదె సౌఖ్యం బెంతయుం బేలవై। తరవిందానన శ్రీవిహీనులఁ గరంబర్థింతురే కామినుల్॥ గీ॥ విగురుఁబోఁడి లసింధుసౌవీరభూవలయరాజ్యగౌరవంబుతోడ। నన్ను నేలికొనుము మనగ ప్రియభోగ్యకై। యొకాగ్యవగుముపిలువుమొఱడలఁపు॥ వ॥ అనినఁ బాంచాలి ప్రకంపితచిత్తయగుచుఁ గొండొకదొలంగి వానిదెసనవమానదృష్టిం జూచుచు దనపతులకైవడి కోరుచుం బ్రతివాక్యంబులఁ గొంతకాలక్షేపంబు సేయుటకై వానికిట్లనియె॥ గీ॥ తలఁపబాండవ ధార్తరాష్ట్రకుఁ జెలియలైన యాదుస్సలకుఁ బతివనఘ నీవు। నాకుఁదోఁబుట్టువవుగా వేసికుజనునే। పాడిదప్పిన మాటలు పలుక నేల॥ క॥ నయమును ధర్మము గలయన్వయమున జనియించినాఁడ వక్కట ధర్మ। క్రియ యెఱుఁగంగా వలదె యపు। భయలోకవిరుద్ధమైన పథమేమిటికిన్॥ వ॥ అనిన నాదురాత్ముండు దరహాసితాననుండగుచు నిట్లనియెం॥ క॥ వనజాక్షి రాజధర్మము। విన వేయెన్నిడును మనుజప్రభులకుఁ బ్రమదాజనులయెడ వాపివెదకం। జనదు వలసినట్ల వేడ్కఁ గలుపఁగఁ జెల్లున్॥ క॥ వినుమాదియుగాక జగమున। వనితారత్నంబులెల్ల వారికిభోగం। బు నెడల సాధారణములో। కనిధనమువిగురుఁ బ్రవిగల దెకరికి భగమనావ॥ అనిన నయ్యంగన క్రోధకలుషితాంతరంగయై యిప్పాపాత్ముండు ప్రియవచనంబులం బోవఁడు వెట్టినంబులం గాని

ద్రౌపది సైంధవుతోఁ గ్రోధోక్తులు పలుకుట.

క్కఁబడఁడని తలఁచి యిట్లనియెం॥ చ॥ ప్రకటితశౌర్యసారులనభంగపరాక్రమదుర్జితాహిత। ప్రకరులఁ బాండుసూనులఁ బాండుయశస్కులనాత్మ లోఁ దలం। పక నమధిక్కరించెదు నృపాలకులాధమ నీదు గర్వదు। ర్విక సనమింతఁ బోవునటు చేగఁదగఁదక్కముదు ప్రలాపములెన్ని॥ ఉ॥ హిమవత్ప్రాంతవనాంతకేళిరతిమై నేపారి కోపారుణ। క్రమనేత్రాంచలకేత్రభూతమదరేకంబైన గంధద్విపేం। ద్రము డాయంజని సెల్లుచూపుట సుమీ ధర్మాత్మజన్మ త్యుగ్రవి। క్రముఁ గౌంతేయునిస్తునీవు దొడరంగాఁ జూచుటూహింపఁగన్॥ ఉ॥ శాతనఖాగ్రఖండితలసన్మదకుంజరకుంభముక్తము। క్తాతతశైలకందరసహోంతరసుప్తమృగేంద్రకేసర। వ్రాతము వేడ్కనాచికొనవారక చేరుటగాదె క్రోధని। ర్ఘాతము ... భీముఁడెకందలపోయుటనీకు నెమ్మె యిటన్॥ మ॥ చలజిహ్వోగ్రవిలీఢవిస్ఫురితదంష్ట్రాభీషణంబైన బె। బ్బులిఁ గోలం గొని ప్రేసిచిందోలఁగం బోవచ్చునే వచ్చునే। కలసత్ఫూత్కారశరాగ్నిదుస్సహమునైన గాండీవి నల్గించి యో। వ్వలనన్మానధనాఢ్యులైతిప్పోవన్ వచ్చునే యేరికిన్॥ ఉ॥ ఘోరనవిస్ఫులింగములు పొడమఁగను గ్రవిషంబు గ్రక్కుచున్। క్రూరవిచేష్టనాలుగొనుచున్న మహోరగరాజయుగ్మమున్। జేరి పదాహతింగిని యఁ జేయఁదలంచుటగాదె యుంగుదు। ర్వారులు మాద్రిపుత్రులకు వజ్జ యొనర్పఁదలంచుటేర్పడన్॥ ఉ॥ ఆలములోన వీర నమరాసురకోటికి నైనమగ్గయి। ల్వాలిన మాదభులు వారికి నెగ్గొనరింపఁ బోయి పాతాళము సొచ్చి డాగిన నుదప్పదు మృత్యువు నీకు నక్కటా। కాలము నిండె నీవశము గాధాన్యుఁ జేయుతోఁ బంగాన్॥ తేలును గర్కటియును దెగు। కాలమునకుఁ జూలు దాల్చుగతిఁ బార్థులయిల్లాలనయిన దెసమున్నిలుఁడవై తవివినాశదిహ్నముగా దే॥ వ॥ అనిన జయద్రథుండు నవ్వుచు నవ్వేలందికిట్లనియె॥ ఉ॥ వాలి జనే

పాండుసుతవర్గము నేఁడిటమాకు నింతయే । భీరులఁబోలె నేల వెఱపించెదు మాటల మమ్ము మింటిపై । వీరకులప్రసూతుల
మవీరుల మేమి తరక్షితీశసా । ధారణబుద్ధి సేయకుము దారచరిత్రుల మైన మా దెసన్ ॥ వ॥ వలవని మాటలు చెప్పినఁ దీఱ
దు వేగంబ యల్లకనకరథంబొండె నల్లమహాగజంబునొండె నెక్కుము. బీరంపు మాటలాడక ప్రియవచనంబుల నస్మత్ప్ర
సాదభాజనంబవగుమనిన విని యాజ్ఞసేని వానికిట్లనియె ॥ గీ॥ వీరపత్నినయ్యు వీరసహోదరి ననయ్యు నీకుఁ జూడ ననదవో
లెనున్నదాన నెట్టులున్నను నాకున్ । దెలుప నేల పలుకు లియ్యమేల ॥ చ॥ అతులితవృష్ణికేకయబలావలితోఁ బటుశంఖ
ఘోషభీ । షితభువనత్రయుండగు మధుఘ్ను తురంగరథాధిరూఢుఁడై । జితదనుజాన్వయుండు యదుసింహుఁడు వెన్నడి
మట్టినన్ బరి । భుతబలుఁ జేయ నాను దెసగల్గుటెఱుంగుదుగాక యత్తఱిన్ ॥ సీ॥ గాండీవరేఖయాఖండలచాపంబు కరణి
గాఁ దగ్గుణక్వణము ఘోర । గర్జగా నవిరళగంభీరవీరరసాపూర్ణమై సంతతావలిప్త । శత్రుప్రతాపోష్ణసముదయంబు శమి
తంబుగా మిత్రబర్హికేకారవంబు లెసఁగఁగం దోఁతెంచి యింద్రనందనమహాజలధరంబాయుతసాయకౌఘ ॥ గీ॥ వృష్టి ముంచు
టయును వెగడొంది చేష్టింప । నలవిగాక ఒల్చియప్పుడైన । నీమ్మదోషవృత్తికై మనంబున వగ । చెదవు గాక యిప్పుడు చెప్ప
నేల ॥ ఉ॥ ఘోరగదావిదారణవిఘూర్ణితశాత్రవకుంభికుంభముల్ । చీరుచు మారుతిప్రతతిచేఁ గణభూమి నలంకరించు కే
ళీరసలోలుఁడై సమదలీలఁ బకాంతకుఁడేపుచేరఁగన్ । న్నారఁగఁ జూచి కాక యిటులంతకు నీమది త్రుళ్లడంగునే ॥ క॥ నను బెఱ
వనితలచందం । బునఁ బవమానింప నీకుఁ బోలదు మత్తా । వనపాలిత్యమహిమ । నశము నేకిమనెంమనండమునన్నున్ ॥
వ॥ అనిపలికి ద్రౌపది యుద్ధురాత్ముండు దన్నుఁబట్ట సమకట్టుట యెఱింగి తమపురోహితుఁ ధౌమ్యునిం బేర్కొనియాక్రోశిం

## సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తుకొనిపోవుట.

చిననతండతిరయంబునం జను దెంచు నా సమయంబున ॥ ఉ॥ పాపవినిశ్చయుండు సతి పయ్యెద కొంగు కడంగి పట్టినన్ । గో
పము తోనదల్చి కొంకి కోమలియున్ వైసవాని త్రోయుడున్ । బ్రోవటివాఁడు ఛత్రముగ భూమితలంబునఁ ద్రెళ్లె మారుతా । త్తే
పవిభగ్నమూలమయి చెచ్చెరఁ ద్రెళ్లు మహీరుహంబనన్ ॥ వ॥ ఇట్లు నేలంబడి తడయక లేచి జయద్రథుండు మగువఁ దిగిచి బిర
థంబుపై నిడికొని సపరివారుండై యరుగఁ దొడంగె నప్పుడప్పాంచాలి పురోహితునకు మ్రొక్కి యనవద్యాత్ముండు సైంధవుం
బేర్కొని యిట్లనియె ॥ చ॥ తగునే రాజకులప్రసూతులకు నత్యంతంబు నేలాదృశం । బగు దుష్కర్మము నాదువల్కు వినుమీ
యుష్మాకపుణ్యాత్ములు న్నేవిజుపాండునందనులు నీమానంబు ప్రాణంబు నే । పగిదిం గొందురు గాని పోకడు వరీషా
నంబుగన్ ద్రెక్కొనున్ ॥ వ॥ అనియాక్రోశించుచు నమ్మహీసురవరుండు వానిపిఱుంద చనియె నిటఁ బాండవులు నవ్వనంబు
నననేకమృగంబుల వధించి యందఱు నొక్కయెడం గూడికొని యాశ్రమాభిముఖులై వచ్చునెడఁ దమ్ములం జూచి ధర్మజుండిట్ల
నియె ॥ సీ॥ ఇనుఁడున్న దెసనుండి యెలుఁగింపఁ దొడఁగె బలువులుమృగంబులు నతిఘోరగతుల నేగి దెసన్ ప్వమున నపతా
వలి దెసనతిభీషణారావంబు చెవులకు । సహ్యచేనవమానపాటునగయ్యెంబుఁగలుగునీశకునత్ర కారమునయః । గడకొని
చెయి వెట్టికలఁచినట్లయ్యెడుఁజిత్తంబు తనువుని శ్చేష్టమయ్యె ॥ గీ॥ నరుకుదెంపు వేగ నాశ్రమంబునఁ గృష్ణ దునిది వచ్చి వార
మొంటి నకట । తలఁప గూరమతులు ధార్తరాష్ట్రులగడు । నెగ్గు చేయఁ జూతు రెడరు వేచి ॥ గీ॥ కమలహీనమైన కమలా
కరము వోలె । రాజహీనమగు పురంబు వోలెఁ జూడఁగా మ్యకంబ శూన్యమై యున్నట్లు తోఁచె నేమికీడు దొడరునొకో ॥ వ॥
అనియయ్యేవురు రథంబులు సత్వరంబుగాఁ దోలుకొని యాశ్రమంబునకు వచ్చునెడఁ బాంచాలి పరిచారిక ధాత్రిక
యనునది యతికరుణంబుగా నేడ్చుచున్నం గని ధర్మతనయుసారథియైన యింద్రసేనుండు రథంబుడిగ్గనుఱికి చనియది
యేల నేలంబడి పొరలుచు నేడ్చుచున్నదానవు నీకపకారంబు సేసిన వారెవ్వరనిన నది వానిం జూచి సైంధవుచేతం బాం
చాలి చెఱపోయెనని పలుకుచుఁ బెల్లేడ్చిన నింద్రసేనుండిట్లనియె ॥ సీ॥ పాండుపుత్రుల బహిర్గప్రాణంబు నుత్తమశీలసమగ్రఁ
బాంచాలతనయఁ । గొనిపోవునంతటి గుండెగల్గెనె వీ మోహాంధమానసుఁడైన సైంధవునకు । నేసుఁ గాకేమి మహీతలగ
తుఁడై నగగనంబునకు వేగ నెగసిచనినఁ । బోనిచ్చెద కెపోఁ బొరివచ్చెదరుగాక మస్సహతేజులా మరితచరితు ॥ గీ॥ వీర వరుల
ఘోరవివిధాస్త్రకౌశలంఁ । బెఱుఁగఁడయ్యెఁ గాక యేమివాఁడు । వగవకుండుము బలవానినుగ్ధతిఁ దున్మి మగువఁ దెత్తు రిపుడ
మనుజవిభులు ॥ వ॥ అనిన నయ్యంగన యుపాంగతరంగితంబులగు బాష్పజలంబు లుల్లసంగరపల్లవప్రమార్జనంబుల నపనయిం

చుచునతనింగనుంగొనియిట్లనియె. గీ॥ ఇంద్రకల్పులైనయేవురుపతులు యాత్మవోలెనుఅకనంబుజాక్షి నవహరించ
పుడయుద్దురాత్మనకును జేటుమూఁడెవేఁజెప్పనేల. ఉ॥ ఇంతపమున్నవాఁడుచెలియెంగడుసవ్వాగంబోవకుండన
తెరయంబునంబటురథావలియొప్పఁగనేఁడునస్త్రలై । సంతనకట్టుఁడస్త్రములుశస్త్రములుర్దొడుసుండువర్మముల్
సంతతదివ్యబాణములశాప్రపుఁడున్మఁడుదెండనెచ్చెరిక. సీ॥బూదిలోఁబెట్టినపూర్ణాహుతియుఁబోలెఁగుక్కతో
లోఁగూర్చినట్టిరాజితకపిలగోసధారయునుబోలెమపనంబులోఁబడ్డనహితపువ్వు । మాలికయునుబోలెనదిరాత్రిక
గర్కతమునదూషితకాకమున్న । చనరయ్యవేగంబచనునెసన్మంత్రవిశ్రుతపురోడాశంబుశునకమునకుఁ - గీ॥ జనునెక్క
లనుగంధకాసారకేళికలుమశశఃఖాదిమైనస్పగాలమునకుఁ । జనునెతన్వంగిసౌందర్యచతురభావభంగియామవ్వడెపితు

## పాండవులేవురుసైంధవుపై యుద్ధమునకుఁబోవుట.

పాలువడఁగ॥ వ॥ అనిపలుకుచున్నధాత్రీశపలుకులువినిదానినాశ్వాసించియకౌరుపిరులేవురునాతుణంబసన్నద్ధులైగ్ర
ధావేశంబునంజేసినహాహారగంబులుంబోలెరోఁజుచుజయద్రథువెన్నడిదాడినెట్టి కూడముట్టినతైన్యంబుపిలుం
క్రోశవచనవిహ్వలుండైపోవుచున్నధౌమ్యుంగనినమస్కరించిమీరింకవితఖేదులరైయుయ్యపరండనియామిషంబున
గవియుడేగలుంబోలెసైంధవసేనపయింగవిసిసింహనాదంబులుసేసిరప్పుడు పాండుపుత్రులయడియాలంబులుసూ
సైంధవుండుద్రౌపదికిట్లనియె * క॥ఈవచ్చురథంబులవారెవ్వరునీవుగలెయింబుజేతుణవివరింపు భావింతయెవ్వఁడెవ్వ
డేవిధమునవారిసెప్పుమయెఱుఁగఁగవలయుర్ * వ॥అనినపాంచాలియనాదరక్రోధఘూర్ణితయగుచునతనికిట్లనియె
గీ॥ఇకవిరినెఱిఁగితేఁయునెఱుఁగక । యుండితేఁజేయనోంపుగలదె । దుర్గమమునఁగరముదుశ్చరిత్రమునకు జో
నీవుచేటుదెచ్చికొంటి * వ ॥ అయిననునన్నడిగితివిగావునంజెప్పెదవింతియకానినీవలననాకు భయమించుకయుఁగు
గడుసోదరసహితుండైనధర్మనందనుంగంటినింకఁగుశలంబయనిపలికియిట్లనియె. మ॥ తనునన్నత్తాంగుఁడుశుద్ధశాం
ముద్యద్వర్ణుఁడుతుంగనాస । ద్వనజాతాయతచారులోచనుఁడుదివ్యస్ఫూర్తితేజోఘనుఁ । డనఘుండల్లరథంబుపైవెలుగు
పుణ్యాత్ముండుధర్మాత్మజుం । డరిరోధప్రతిభాప్రభావనిధియుత్యాశ్చర్యశౌర్యుండురా. చ ॥ కురుకులశేఖరుండు
ఘోరరణంబులనెట్టిశత్రులుర్ । శరణముసొచ్చిరేనివిసలక్కరుణామతిఁగాచునీవుచె । చ్చెరఁజెడిపోకనాపనుపు
నీతిమెలర్పనమ్మహో । పురుషునినాశ్రయింపుముకిభుండునునీదగుతప్పులోఁగొనర్. చ ॥ ఘనతరసత్వచారుతురగ
లఁబూనినయల్లవిస్ఫుర । త్కనకరథంబుపైనుదితకాయుఁడుసాలమహీరుహంబుచా । త్వనఁదనరారుచున్వెలయు భ్రూ
కుటియుర్దశనోష్ఠపీడనంబుచునయియున్నవాఁడనిలపుత్రుఁడుభీముఁడుభీమఁడాజులర్ * ఉ ॥ ఈతఁ
యనెందునమానవకృత్యమాప్రతీ । ఘాతమునేకమప్పుతముగర్వితులైధరణీశ్వరుల్నిజ । బీతనినాజిలోఁజెనయనె
రుసోఁకదుస్సహాభుజుంఁడాతతరోషుఁడైనఁబ్రతియానలునట్టిఁకయాఁజుఁడేయుటర్ * ఉ॥ ధర్మజుమార్గమున్
ప్రియశిష్యుఁడునైనవాఁడునుఁ తక్కుగుర్ముఁడువాఁడెచూడుమప్రగాఢకిక్కిణిజితేంద్రియుండుదుర్గమ్మఁగన్న
నికారభయంకరవిక్రమక్రియా । నిర్మథితారిఫల్గునుఁడునిర్మలతేజుఁడజేయుఁడేరికిర్ * క॥అవశగతిఁగామరోషాదివి
కారములొందిననువదినిధర్మపథ । ప్రతిహతిగానీడితఁడాదివిజేంద్రతనూజుఁడన్వితీయుఁడుపేర్మిర్ * చ॥ అయనన
సంగ్రహుండువినయవ్యవసాయభయార్తలోకసం । శ్రయుఁడుకృతాస్త్రుఁడాహవవిశారదశౌర్యుఁడుశిష్టబా
ప్రియుఁడసమానసుందరగభీరశుభాకృతియల్లపుణ్యుఁడా । రయనకులుండుపాండుసుతరత్నముభాసురకీర్తియిప్పుడి
ఉ ॥ వీఁడుచిత్రయోధిగృఢవేదికృతాస్త్రుఁడుభూరిబుద్ధివి । స్ఫారుఁడువాగ్విశారదుఁడుపార్థులకూరిమితమ్ముఁ
జ్జ్వలా । కారుఁడుధర్మదక్షుఁడవికారుఁడుప్రౌఢపతంగతేజుఁడు । ద్ధీరుఁడుపాండవుండుసహదేవుఁడుదేవసభాస
నర్ * గీ॥కొడుకులందెల్లఁగడుఁగూర్చుఁగొంతియితనికిన్మహాత్మునకుమహిఁచలియించునేని । యగ్నిచల్లనయ్యెనేన్
దాను । ధర్మశీలుఁడైసత్యంబుదప్పఁడెపుడు * వ ॥ వీరేవురునత్యంతదుర్వారులువిరిబారింబడినవారాశినడుమ
మకరాహతంబైనవియ నోడయుంబోలెనీసైన్యంబువికలంబగు నీవుచుప్రాణంబొండెమానంబొండెగోల్పో
మైమైఁబోనేర్చెదవేయనికొనపప్పుడుగొంతెయులుసైంధవసేనఁదలపడిదిజ్ముఖంబులనెల్లంజేకట్లుగవియునట్లుగా

పటలంబులు పఱిగింపం దొడంగిన * క॥ తోలఁగకుఁడు పొమ్ముఁడేయఁడు। నిలువుఁడు వడిఁ బొమ్ముఁడను మునిజయోధజనం। బులఁ బురికొల్పుచు సైంధవుఁ। డలఘుపరాక్రముఁడు నిలిచె నాహవభూమిన్ * వ॥ ఇట్లు త్రిగర్తసింధుసైన్యంబుతో ననేకనరపతి పరివృతుండై నిలిచిన జయద్రథుం జూచి భీమసేనుండు క్రోధారుణలోచనుండై రథంబు డిగ్గి హేమబంధబంధురంబును నయోమయంబును నగు గదాదండంబు ద్రిప్పుచు వానిపయిం గవిసిన నడ్డపడి కోటికాస్యుండు నిజసైన్యసంఘంబుతో నమ్మహావీరుం బొదువు టయు నతండు * క॥ మదగజముల రథయోధులఁ। బదాతుల నుదురగముల ను బలుపిడిఁ గలయం। జదుపుచు దుర్వారగతిన్। విదితబలుఁ డుఘంగదా ప్రవీణత మెఱసెన్ * వ॥ ఇట్లు విహరించి యహితసైన్యంబు నిహతంబు సేయుచుఁ జెలంగి సింహనాదంబు సేసి యతండు సారథిసముపనీతంబైన రథంబు సాదరంబుగా నెక్కి గృహీతశరాసనుండై విక్రమించె నప్పుడు యుధిష్ఠిరుండును * క॥ అలిగి యుధిష్ఠిరుఁడును న। గ్గలికం బ్రతివీరులఁ దలఁగఁగా నస్త్రవిద్యా। విలసనము మిసుల సౌవీ। రులనాలుగురను ధీబలుల రూపడఁగించెన్ * క॥ నకులుఁడు నిశాతసాయక। నికరంబుల సమరధారుణీతల మెల్లం। బ్రకటమ ఖీరవరమ। స్తకదంతురముగ నొనర్చె దారుణభంగిన్ * క॥ నారాచపాతముల మ। ర్వారుఁడు సహదేవుఁ డాహవముఖంబునను। శ్వారోహకులం గూల్చుచు। వీరవిహారంబు సలిపె వేడ్కయెలర్పన్ * వ॥ మఱియు నతిభయంకరాకారంబున * గీ॥ సింధురాజసైన్యసింధుపూరమునందు। మహితఫల్గునాఖ్యమంథనగము। దిరిగి కలఁపఁ దొడఁగెఁ బరనృపాలకమహాజలచర ప్రజంబు సంచలింప * సీ॥ వారణకోటితదారోహకులతోన వివశమై యొఱలుచు నవనిఁ ద్రెళ్లెఁ। సూతహయధ్వజపాతపూర్వకముగ రథములు తునుమయ్యె రథులతోన। వెసరాహుతులతోన వసమటిహయములు గెడసి యొయ్యోడల నుబుసమిగ ప్పెదండడి దెఱలుచు సందడి పెల్లు గాఁగాలుబలంబులు గూలెఁ గలయ - గీ॥ మనుజులమధికమయ్యె సమరతలంబున। ఘోరరుధిరవారిపూర మెసఁగె। జితవిరోధిబలుఁడు శతమఖసూనుండు। చావనైపుణంబు సూపునపుడు * గీ॥ సవ్యకరమునందు నప సవ్యకరము। నందుఁ బర్యాయసంగతమగుచుఁ జూడఁ। గొఱవిద్రిప్పినయొప్పున మెఱసెఁ బార్థు। గాండివము వాలు దూఁపు లగని యనంగ * వ॥ అట్టిమెడఁ ద్రిగర్తపతియైన సుధన్వుం డుగ్రబాహాస్తుండై రథంబు డిగ్గి చనిధర్మతనయురక్యంబులఁ గూల వేసి నతండు నిశితసాయకంబున వానియురంబు వ్రచ్చి విగతజీవుం గావించి సత్వరంబుగాఁ జని సహదేవు రథంబెక్కె మఱియును ద్రిగర్తలలోన మహాముఖతొమునకు దుల ను వారు నకులుం బొదివి ఘనశరాసారంబు గురిసి జలధరంబులుం బోలె గర్జిల్లిన నమ్మాద్రీసూనుండు వారి నిద్దఱఁ బెక్కమ్ములనొప్పించె నంతఁ దదీయాగ్రజుండగు సురథుండు * చ॥ కరినికరంబుతోఁ గడఁగి గర్వితుఁడై తన వారణేంద్రము। క్కరుకుల వీరు మీఁద వెసఁ గొల్పినఁ దద్రథఘోటకంబులన్। బరువడిఁ జంపె నగ్గజముపాండవసింహుఁడు ఖడ్గహస్తుఁడై। ధరణికి దాటుచో నదిమ దంబున వేడియు పైఁ గడంగినన్ * చ॥ తోలఁగక యమ్మహాబలుఁడు దోర్బలమొప్పఁ గృపాణపాతభం। గులఁ గరినాథు కేల్నడుదకొమ్ములతో బెరయంగఁ ద్రుంపఁ బె। ట్టిలపవిచేత మైనొఱగు నేసఁగు పైనతిమాత్రభీతి వి। హ్వలుఁడగుశత్రు నుద్ధతగృతాంతపథేయునిఁ జేసె వేల్మిడిన్ * క॥ వైరులు దలకఁగ నిమ్మై। దారుణపౌరుషవిశేషదక్షుండగున। వీరుఁడు రయమున నరిగిన। మీఁదఁ దనయునరద మెక్కి మెఱసెం బోరన్ * చ॥ ఘనుఁడు వృకోదరుండుఁ దనుఁ గట్టలుకం దలపడ్డ కోటికా। స్యుని తురగంబులం దునిమి సూతుని కంఠము ద్రుంచివైచి తీ। వ్రనిశితమైన ప్రాసమున వాని యురంబుఁ బగిల్చి చంపెనం। గనుకనిఁ బాఱె భీతి యొసఁగంగఁ దదీయచమూసమూహముల్ * వ॥

## ——— * అర్జునుఁడు సౌవీరకుమారులఁ బన్నిద్దఱఁ జంపుట. * ———

అంతనంగారకుండును గుంజరుండును సృంజయుండును సుప్తకుండును శత్రుంజయుండును సుప్రబుద్ధుండును శుభంకరుండును భ్రమంకరుండును శూరుండును రథియును గుహకుండును బలాఢ్యుండును నను సౌవీరకుమారులు పన్నిరువురు నిత్త్వాకుశిబిసైంధవత్రిగర్తసైన్యంబులం గూడి క్రీడిమార్గంబు బహుదారుణబాణజాలంబులం గప్పిన * మ॥ అతుల క్రోధవిఘూర్ణమానహృదయుండై చండగాండీవని। ర్గతభల్లౌఘములం దదస్త్రవితతుల్ ఖండించి సౌవీరసం। తతి పన్నిద్దఱివీరులం దునిమి దోర్దర్పంబు దీపింగ సం। స్థితుఁడై యాతఁడు వచ్చి రోషప్రకరనిచ్ఛేదంబు సేసెన్ వెసన్ * క॥ ఆకులముగ శైబ్యులన్। త్త్వాకులసైంధవులసుం ద్రిగర్తలనుం బో। నీక పొదివిరణమున న। స్తోకపరాక్రముఁడు నిమిషమాత్రాడెవడిన్ * వ॥ అప్పుడు రణభూమియంతయు శవమయంబయ్యె నంబరంబంతయుఁ గబంధమయంబయ్యెఁ జాపకేయూరవీరాంకవిభూషితంబులై

నబాహుచరణచ్ఛేదంబులును గార్ముకతూణీర కాండఖండంబులు నతుకూబర రథాంగ కేతనాతపత్ర శకలంబులు
బుండరీకన్యజనచామర భంగంబులుం గరవాలపరిఘశక్తిగదా ముసలపట్టిస ప్రాసశకలంబులు నెక్కడఁజూచినఁ గా
లై యుండెఁ గీలాలపూరంబును మాంసపంకంబును గేశశైవాలంబును నైన యపూర్వనదీప్రవాహంబునందు జ
భూతభేతాళాదిక్రవ్యాదగణంబు లవగాహనంబు సేయుచుఁ బ్రకటకోలాహల వ్యాకులంబగుచుండె నవ్విధంబున
క॥ గాండీవపవనప్రేరిత। చండాంబక ఘోరశిఖలశతము ఖతనయో। గ్దండదహనుఁ డొకమాత్రన। ఖండితసైన్య
కాననమేర్చెన్ * వ॥ అట్టిక్రందున జయద్రథుండు ద్రౌపదినిదిగవిడిచి రథంబుదోలుకొని పఱచెనంత ధర్మజుం
డు ధౌమ్యసమన్వితయై యున్న పాంచాలిం గనిజరథంబుపై నిడికొనియె సైంధవుండు పలాయనుండగుట యెఱిఁగి యర్జును
డుశత్రుసేనాహననసంరంభంబున నున్న భీమసేనున కిట్లనియె. గీ॥ వీతలజ్జుఁడై పఱచె సౌవీరవిభుఁడు। బానుసుబ్రజ్ఞ
యాఱడిఁ దుదిమైవ। నద్దురాత్ము నివెనుకొని యసువులిప్పు। గొనఁగవలయు లేలెమ్ము సద్వినుతశౌర్య * వ॥ అనినవతఁడు
య్యంబు సాలించి ధర్మతనయుం జూచి. క॥ జననాథ ద్రుపదసుతఁ దో। డ్కొని ధౌమ్యులు నీవు కవలు నుగుకొని మఁగుడం
డాశ్రమంబునకు నే। మును సైంధవుఁ గూడ వెనుకముట్టెదము వేసన్ * క॥ అతలంబునఁ గ్రుంగినఁ। బ్బాళము గదిసమునఁ
గసిపోయినఁ బగతుఁ। మృతుఁ జేయక మగుడము విని। హతులుగఁ జేయుదు ముదిదివిజులక్షంబైనన్. గీ॥ అనిన ధర్మజుఁ డిట్లను
దురాత్ముఁ బొలియఁ జేయుట దగదు దుస్సలఁ దలంచి। వానినొకతప్పునకు సైవవలదె యాంబి। కేయమహిషికి నురుకు
యఁ జనునె * వ॥ అనినఁ బాంచాలిభీమార్జునులతోడ నప్పాపాత్ముని దెసం గృపఁ జేయవలవదవశ్యంబును వానివధి
నాకుం బ్రియంబుగా వించు నది యిట్టి ద్రోహిమెల్లభంగుల వధ్యుఁడని యొందదనంతరంబ ధర్మనందనుండు ధౌమ్యద్రౌ
పలసహదేవసహితుండై మగిడి యాశ్రమంబునకుం జనియె. భీమవిజయులు రథంబులు రయంబునం దోలుకొని చని క్రో
శమాత్రాంతరంబున సైంధవుం గని రవ్వడు కిరీటి దూరాపాతవిశిఖంబుల జయద్రథుకథ్యంబులం బడ నేసిన * క॥ తల్లడ
యరదము డిగి। విల్లును నమ్ములు విడిచి వెల్లనగుచుమే। నెల్లఁ జెమర్పఁగ నూర్పులు। పెల్లుగనమ్మను జవళువు పెటు చంబజకో
గీ॥ వానిఁ జూచినగుచు వారలోరోరి యింం। కెందుఁ బోవవచ్చు బందగలుపు। మిట్టికడిమితమ్మి యేవ్ర ల్లడంబులు। సేయఁ దో
గితనుచఁ డాయుటయును. వ॥ మఱలి చూచివాఁ డొక్కగుల్మమధ్యంబు దూఱుటయుం గని భీమసేనుండు రోషసందష్ట
రుండగుచు రథంబు డిగ్గనుఱికె * క॥ ఒడిసిత లవట్టి నేలం। బడఁదిగిచి నవాఁడు పెనఁగఁబడుటయుఁ జిక్కన్। మెడ ద్రొక్కి
ఘముష్టిం। బొడిచె మొగంబపిసిక్తపూరము దొరుఁగన్ * క॥ ఒడలెల్లఁ బిండికూడుగఁ। బొడిచియుగయు నెత్తి త్రిప్పి
స్థలిపయి యుఁ। బడవై చియు కము మొగమున। నడిచె నవడముడితల ప్రహారకుశలుఁడై. వ॥ ఇట్లు బెట్టు పఱచిన బ
డువివశుండగుటయుం జూచి యర్జునుండో మహా యింతచాలు నింక నొచ్చినం బ్రాణవిముక్తుండగుంగావున నజాతశత్రు
చనంబులు దలంచి వీనిఁ గరుణింపుము నిన నతం డుకన్వ్యడి దెసగనుంగొని ధర్మనందనుం డెప్పుడుఁ గరుణాయుకాని కార్యంబుచే

* భీముఁడు సైంధవుం బట్టికొని పరిభవించుట. *

పాటుపిచారింపఁ జొరండు నీవును నతని భంగిన బేలవై తిద్దురాత్ము నెట్లు సైవవచ్చునని పలికె ననంతరంబ. గీ॥ వాఁడయ్యె
కత్తివాతియమ్మునఁ గొని। పగతు శిరము చెక్కు లెగయఁ గొఱిగె। నరుల కెల్లఁ జూడనవ్వగునట్లుగాఁ। గలయ నైదు
నొనర్చె * వ॥ ఇట్లు రాజవేషంబు వికల్పితంబు సేసి యమ్మహాభుజుండు వానికిట్లను నోరి బ్రదుకవలతేని నేఁడుమొద
గా నెల్లసభలందును బాండవదాసుఁడని పలుకునది యునిన వాఁడును దబాఘాతభయంబున నట్లచేయుదుననియె నట్టి
య్యెకువుకునతవింజెడ కేలుఁగట్టి రథంబుపై నిడికొని నిజాశ్రమంబునకుం జని ధర్మపుత్రునకుని వేదించి వీఁడె పాండవదాసుఁ
డనిన నతండుల్లోఁ వధ్యుండు గాఁడు వీని విడువుండని యెం బాంచాలియు జయద్రథుఁ జూచి నవ్వుచు నిప్పాపాత్ముండు
యదాసుండయ్యెఁ గావున విడిచిపోవిడువుండని విడిపించిన నాసైంధవుండు ధర్మజునకు దత్సభాగతులైన మునులకు మ్రొ
క్కినఁ నజాతశత్రుం డిట్లనియె. గీ॥ ఎట్టికష్టుఁడై ననిట్టిపాపము సేయ। నెత్తికొను నె ధరణి నీవు దక్క। నరుసు మిం
యంచు మునిన్నువిం। ద్రియపిలోలురల్పధృతివిహీను * వ॥ ఇంక నైన ననునిట్టికొఱగాములు సేయక బుద్ధిమంతుఁడవై యు
డుమ నిననతండు లజ్జావనతవదనుండగుచుఁ జప్పుటు వాసి గంగాద్వారంబునకరిగి యందు * శా॥ ఆదిత్యార్పితపాదన

జగదేకాధీశునిశాసనలో। కాదింగామపి భేదించఁబర్వతసుతాప్లోద్రైకసంపాదినిగ్గ।ఘేమండ్రె శివునాత్మలోవిలిపియక్షీణప్రతా పాఢతరా।బాడాంగుష్ఠమునందునిల్చితపమొప్పం జేసెసత్కీర్తిరా * ఉ॥ వానికిసమ్మహేశ్వరుఁడువక్సులుఁడై హరసూపి యొప్పితం।బైనదివేఁడుమన్ననతఁడానతుఁడై వరమేశవిక్రమా। హీరులఁబాండునందనుల నేవురసైన్యయుతంబుగాన నిం।బూని జయించునట్టివరముంగృపసేయుము నాకునావుడున్ * క॥ ఇదివోలదుపాండవులను।గదనమున జయింపవలపిగా దిం ద్రాది। త్రిదశులకువినవె సైనను।వదలకనీకోర్కిదీర్పవలయునయొల్లున్ * చ॥ విజయుఁడొకండు దక్కఁ దతపీపులఁబాణ్డు లనున్న నల్వురి। న్నిజమొకనాఁటికయ్యమున నీవు జయింపుము ఫల్గునుండు స।వ్యజగద జేయుఁ డవిక్రముఁడు వానినెవ్వర్గో ననాకు నైనఁబో।రజితునిఁ జేయుటెంత యుభరంబగునిక్కము పల్కితింజుమీ * వ॥ అస్మత్ప్రసాదవిశేషంబున నం జేసివానికిట్టి ప్రభావంబుగలిగెనదియునుంగాక * క॥ నిఖిలాస్త్రశస్త్రవిద్యా।సఖుఁడపరాజితయశోవిశాలుఁడు విష్ణుం। డఖిలేశ్వరుఁడతనికిఁ బ్రియ।సఖుఁడటె యవ్వీరుగెల్వ శక్యమె నీకున్ * వ॥ అని పలికియీశ్వరుఁడంతర్హితుండయ్యె సింధుపతియు నిజదేశంబునకుం జనియెనని జనమేజయునకు వైశంపాయనుఁడిట్లనియె * గీ॥ ధర్మపత్నీసమేతులై తద్వనమ్ము।నందు సారదుఃఖాతురులగుచు నున్న।రాజముఖ్యులు సత్యైకరతులు పాండు।సుతులు మఱియేమి సేసిరి సూతవర్య * వ॥ అనిననతండిట్లనియె నట్లు ద్రౌపదీమోక్షణంబొనరించినపిదపం గామ్యకవననివాసుండై భూసురనివహంబుతోనున్న ధర్మజు పాలికి మార్కండేయుండరుదెంచిన నుజనహితంబుగాఁ బ్రత్యుద్గముండై యమ్మునివరుఁ బ్రభూతసపర్యలసంతుష్టహృదయుంగావించి యవ్విభుండు పాంచాలియైన జయద్రథుచేసినదుర్వ్యవసాయంబును వానింబరిభవించుటకునై తమువడిన యాయాసంబును నమ్మహామునికి నెఱుంగించి మహనీయకార్యధైర్యధర్మారంభసముగ్రులనైన మాకిట్టిదుఃఖంబున నఖిలసామ్రాజ్యభోగవియోగంబై దుస్తరంబగు వనవాసంబు సంప్రాప్తంబయ్యెఁ గావున విధికృతంబులెవ్వంగులనలంఘ్యంబులని తలంచెదనని పలికి మఱియు నిట్లనియె * గీ॥ ద్రుపదనందనక్రియఁ గడుదుఃఖపడిన।నృపవధూటియు నాయట్లనియతశోక।వనధి నిర్మగ్నుఁడైన భూవరసుతుండు।గలఁడె విన జూడ ననఘ యెక్కాలమునను * వ॥ అనినఁ దనికిఁ దపోనిధి యిట్లనియె * క॥ కనుదుఃఖము నొందితివని।యుడుగక వగవంగ నేల యుర్వీశ్వర నీ।వడుపెట్టిది రఘురాముఁడు।గడఁగి యిడుమ పడఁడె తొల్లి కాఁడవులలోన్ * ఉ॥ ఆవిభుకాంతగాఁ దెజనకాత్మజ రావణుచే గృహీతయై। పోవదేవానరప్రకరముల్వెసఁ దోడుగ నేగి యాధరి। త్రీవిభుఁ డబ్ధిగట్టఁడె వ

* ధర్మరాజునకు మార్కండేయుఁడు రామాయణకథఁ జెప్పనారంభించుట. *

ధింపఁడె దివ్యశరంబులఁ గాఁడఁ।గ్రీవుఁ డగ్రజన్మ ఆంజనియకిల్బిషరాజ్యవిభూతినొందఁడే * వ॥ అనిన విని ధర్మజుం డమ్మునీంద్రా రాముండే వంశంబువాఁడు రావణుండెవ్వనితనయుండే నిమిత్తంబున సీతాపహరణంబు సేసె రామరావణులకు సంగరంబెట్లు ప్రవర్తిల్లెం జెప్ప వేయని రామాయణకథాశ్రవణకుతూహలియై యడిగిన నమ్మహీపతికి నమ్మహాముని యిట్లనియె * క॥ వినుమీ యిక్ష్వాకుకులంబున।జనియించె నజుండునాఁ బ్రశస్తచరితుఁడా।తనికొడుకు దశరథుఁడు మున।మునసాతఁడు పెండ్లియయ్యెమువ్వురు సతులన్ * వ॥ అందుఁ గౌసల్యకు రాముఁడును కైకేయికి భరతుండును సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులును జనియించిరందు రాముఁడు విదేహరాజనందనయైన సీత ప్రియాంగనయయ్యెనిఁక రావణుజన్మంబు సెప్పెద వినుము * క॥ అఖిలలోకకర్తయగు విరించికిఁ బుల।స్త్యుండు నాఁగ మానసుండు తనుజుఁ। డుద్భవించె నతని కుదయించె వైశ్రవ।ణాభిధానుఁడైన యాత్మజుండు * వ॥ ఆవైశ్రవణుండు దనతండ్రియగు పులస్త్యుని విడిచి తాతయగు చతుర్ముఖునకుం దనంబు సేసి నలకూబరుండను కొడుకును లోకపాలకత్వంబును ధనేశ్వరత్వంబును లంకయను పురంబును శంకరుతోడిసఖ్యంబును వరంబులుగాఁ బడసి మహావిభూతితో వర్తించుచున్నం గని యలిగి పులస్త్యుండు నిజశరీరంబు నందర్ధంబున విశ్రవసుండను వానిసృజియించి యావైశ్రవణునకహితంబు సేయుమని పనిచిన నెఱింగి కిన్నరేశ్వరుండు విశ్రవసు పాలికిం జని దెంచి మహాత్మా నేను నీకుం బుత్రుండనయ్యెద నాకుం గరుణింపుమని యతని బ్రసన్నునిం జేసి నృత్యగీతవిద్యావిశారదలైన రాక్షసస్త్రీలం బుష్పోత్కటయుఁ బాకయు మాలినియు నను మువ్వురనవ్విప్రవరునకుఁ బరిచారికలుగా నిచ్చిన * క॥ పుకుడు ననయ్యావతులు నొం।డొరులం గడు వంగ విలసదుపచారసమా।చరణ ప్రవీణబంగులఁ।బరితోషితుఁ జేసి రా తపస్వివరేణ్యున్ * వ॥ ఇట్లు ప్రీతుండై యతండు వారలకుఁ బుత్రదానంబు సేసిన నందుఁ బుష్పోత్కటకు రావణకుంభకర్ణులును

మాలినికి విభీషణుండును రాకకు ఖరుండును శూర్పణఖయను కన్యకయుం బ్రభవించిరి కుమారులకు నలువురకు జన్మ
దినజాతకర్మాది సంస్కారంబులొనరించి సగౌరవంబుగాఁ బెంచి యుపనీతులం జేసెనందు * ఉ ॥ ఆతఁడు తేజుఁడున్నత
భుజాస్త్రుఁడు లోకభయంకరుండు వి । ఖ్యాతపరాక్రముండు దశకంఠుఁడు సంతతరోషమానసుం । డాతనియట్ల దుర్గ
యాత్ముఁడు క్రూరుఁడు కుంభకర్ణుఁడున్ । భీతివిదూరుఁడాప్యుఁడు విభీషణుఁ డుత్తమచిత్తుఁడారయన్ ॥ క ॥ ఖరుఁడు ఖరతేజ
ఁడు నీ । సురవరిభవకారి మాంసశోణితభుజుఁడు । దురదృష్టు శూర్పణఖయు । దురితచరితధర్మకర్మదూషితయెప్పుడున్
వ ॥ ఆరాక్షసకుమారులు తండ్రి వలన నఖిలవేదవేదాంగధనుర్వేదపారగులై గంధమాదనగిరియందు సుఖంబుండు
కనాఁడతనికి మ్రొక్కవచ్చువాని నధికవిభవసమన్వితుఁడై శ్రవణుం జూచి తత్ప్రభావంబు దాఁబొందఁబూని జాతక
త్సుకులై తారును బితామహునుద్దేశించి తపంబు సేయం దొడంగిరి తత్ప్రకారంబు వినుము * గీ ॥ సుండు వేసవిఁబం
గ్నిమధ్యమునను । నాగమంబున బయలవర్ష్యంతతుహిన । సమయమునఁ నీరియందును నిశ్చలతఁ నిలిచి । దశముఖుఁడు ప
భక్షుఁడై తపమొనర్చె * మ ॥ నియతాహారుఁడు నిగ్రహేంద్రియుఁడునై నిష్కంపవృత్తిన్ మహీ । శయనుండై ప్రశ
మ్యగించెను కేచ్ఛంగుంభకర్ణుండు ధై । ర్యయుతుండై ఘనుఁడవ్విభీషణుఁడు పర్ణాహారయుక్తిన్ జపా । ధ్యయనా
దపంబు సేసెను దినత్యంతంబు సంశుద్ధుఁడై * వ ॥ ఖరుండును శూర్పణఖయు వారికిందగిన పరిచర్యలు సేయుచుండి
తసహస్రవర్షంబులు నిండినం బక్కవదనుండు దన మస్తకంబొక్కటి ఖండించి మండెడు నగ్నియందు వేల్చుచుండి
వేయేండ్లకొక్కటిగా నిలను దొమ్మిదియుం దఱిగి వేల్చి ధైర్యంబుడుగక పదియగు తలయును ద్రుంపసమకట్టిన బ్ర
పితామహుండు ప్రత్యక్షుండై వారించి వానిశిరంబులెప్పటియట్ల కలుగనొసఁగి యమరత్వంబు దక్కనొండు నీకభిమతంబు

బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరంబులిచ్చుట.

దియడుగుమనుటయు నన్నిశాచరుండు * శా ॥ దేవాయేమ సమస్తదేవపితృదైతేయాహిగంధర్వర । క్షోవిద్యాధర
కుజాతులకు నక్షోభ్యుండఁగాఁ బ్రీతితో । నీ పిశ్వంబునఁ గామరూపగతి నాత్మేచ్ఛావిహారుండఁగా । నీవే నాపువాంఛి
రములఁ డిచ్చెం గృపాలోలుఁడై । వ ॥ మనుష్యజాతి యొక్కండు దక్క నీ చెప్పినయంతవలనను నీకు మరణంబు లేదు
లికిపరమేష్ఠి కుంభకర్ణుం జూచి వరంబడుగుమనిన వాఁడును దైవోపహతుండై తనకు నాత్యంతికంబైన నిద్ర యడిగె న
నని విభీషణునకభిముఖుండై ననతండు కృతాంజలియై జలజాసను బ్రస్తుతించి * క ॥ వరమాపనయ్యె నపుడు సుమతి
బులు మాననంబు దొడకమియును భా । సురమగు బ్రహ్మాస్త్రంబును । గరుణింపవె యనిన నిచ్చె కమలజుఁడనియెన్ * క
రతము రాక్షసభావమున । బొరసియు నీకిట్లు ధర్మబుద్ధి వగుటయు । చ్చెరువిది కావున నీకుం । దిరముగ నమరత్వమిచ్చితి
పవత్స * వ ॥ అని పలికి పితామహుండంతర్హితుండయ్యెదదనంతరంబ * మ ॥ వరగర్వోన్నతుఁడై దశాననుఁడు దుర్వా
దర్పణాడిమై । నరిగెం గిన్నరనాథు పైనతఁడు గాత్యంబాత్మ నూహించి సం । గరసన్నద్ధుఁడు గాక కింపురుషయక్ష
ణితోఁ గూడఁగా । నరిగె లంకఁ బరిత్యజించి రభసోద్యత్పుష్పకారూఢుఁడై * వ ॥ ఇట్లతండు గంధమాదనంబునకుం జను
దెన్నడిదగిలి దానవుండు వానివిమానంబుతోన విమానంబు నపహరించిన నలిగియు యక్షేశ్వరుండు గురుండవగు నన్ను నవమా
నించితివి కావున నివ్విమానంబు నీపగతుపాలయ్యెడు మని శపించె నంత * క ॥ రాక్షసలక్ష్మీ మహిమను రక్షకుఁడు సుగఁ బ్రజ్ఞా ము
ఖు మరాసదుమాయా । సక్షుం ఖిషిక్తుఁ జేసిరి । రాక్షసభేతాళవరులు రాగంబెసఁగన్ * వ ॥ వాఁడును బలదర్పమోహి
తుఁడై కడంగి యింద్రాది దేవతలనోడించి తత్పురంబులాక్రమించి యీరేడుజగంబుల ద్రావణంబు సేయుటం జేసి రావణు
డను పేరం బ్రఖ్యాతివహించి సకలభూతభయంకరుండయ్యె నట్టియెడ దేవర్షులును రాజర్షులునుం గూడి చని తత్ప్రకా
రమగ్ని దేవునకుం జెప్పిన నతండు వారిం దోడ్కొని వారిజాసను పాలికిం జని యిట్లనియె * ఉ ॥ భూరిభుజుండు విశ్రవసు
పుత్త్రుఁడు పఙ్క్తిముఖుండు దర్పమున । ర్వారుఁడు రాక్షసేంద్రుఁడు భవద్వరగర్వము చేత వద్ధ్యుఁడై । ఘోరముగా
లోకములకుం గడుపీడ యొనర్పఁ జొచ్చె నా । త్రారిపురోగమత్రిదశులందఱుఁ గింకరులైరి వానికిన్ * ఉ ॥ దానవుచేతఁ
పడి దైన్యము నొందుట కోర్వలేక నీ । దైనపదాంబుజంబుల భయంబరిచేతి విమింకె సమ్మునె । స్థైనఁ గృపాగ్ర మా
డవై తగఁ జేకొనుమయ్య మా కుడి । కై కనను గాకయున్నఁ గమలాసన నీవక దయ్యెమో మ్యోడన్ * వ ॥ అనినఁ బరమేష్ఠి వా

ట్లనికార్యంబునకు నేనుమున్న తగినయుపాయంబు నిశ్చయించి నారాయణుం బ్రార్థించితి నద్దేవుండు మనుష్యభావంబున నవతరించి యారాత్రిచరు వధియించువాఁడయ్యె నింద్రాదిసురులును దమతమయంశంబులం జేసి ఋక్షవానరజాతులయందు జనియింపంగలవారు మీకు భయంబు వలదని యగ్నిప్రముఖులైన యమ్మహాత్ములు సమ్ముఖంబున దుందుభి యను గంధర్వకామినిం బిలిచి నీవు కుబ్జారూపంబున మంథర యను పేర భూలోకంబున నుద్భవించి నీ నేర్పువిధంబున దేవకార్యంబులు నిర్వహింపుమని పనిచి వారి వీడ్కొలిపెం బదంపడి దివిజులయంశావతారంబులం జేసి ॰ మ॥ గురుశైలోన్నతగాత్రులుద్దగభుజోగ్రుల్ వజ్రపాషాణకర్కశులర్కప్రతిమానతేజులు గుణాకల్పుల్ మహాకల్పభీకరకాలాంతకకల్పులాజిని పుణుల్ ఘోరోన్నతుల్ ఋక్షవానరవీరుల్ జనియించి రెల్లయెడలన్ నాగాయుతప్రాణులై ॰ క॥ అనవిని యుధిష్ఠిరుఁడ! మ్మునివరుతో ననఘుధర్మమూర్తి యయిన రాముని నేల యరణ్యంబున కనిచెను దశరథుఁడు చెపుమ యక్కథ యెల్లన్ ॰ వ॥ అని యడుగుటయు మార్కండేయుండిట్లనియె దశరథుండు నిజసుకృతపాకంబునం జేసి రామప్రముఖులైన కొడుకుల నలువురం గని త్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తంబైనయట్లు సంతసిల్లె నక్కుమారులు క్రమంబున నుపనీతులు నఖిలవేదవేదాంగవినీతులు యథాక్రమపరిణీతులునై విలసిల్లిరంత ॰ సీ॥ అభినవపద్మపలాశాక్షు నతిక్షీణవిస్తృతవక్షు నాజానుదీర్ఘబాహు మధురస్మితాననుమదగజగమను వారూఢయౌవను నభిరూపతేజు శ్రీరమణీయు బ్రసిద్ధయశోరమ్యు నఖిలవిద్యాగమనిపుణచిత్తు నింద్రసమానజితేంద్రియు సర్వజ్ఞు బౌరబాంధవజనప్రార్థనీయు ॰ గీ॥ దుష్టనిగ్రహైకధుర్యు శిష్టసంరక్షణాభిలోలు రామభద్రు గుణపవిత్రుఁ బెద్దకొడుకుఁ గనుంగొని రాజవరుఁడు గరము రాగ మెసఁగ ॰ వ॥ యౌవరాజ్యపదంబునకు నతని నభిషేకంబాచరింపంగోరి యాప్తమంత్రిసమ్మతంబునం బురోహితనిరూపితంబైన శుభదినంబునం గార్యంబునకు సమకట్టు నెడ భరతుదాది మంథర యనునది యమ్మందగతిం గైకేయి పాలికిం జని యిట్లనియె ॰ ఉ॥ అక్కట నీ దెసం బతికి నాఁడి కూరిమి యయ్యె మాయపుం జొక్కులు నీవు నిక్క మగఁ జూచి మనంబున మోసపోయి తాటక్కరి కోసలాత్మజ మహీంబ్రియుఁడై యదె తత్తనూజునిం బెక్కఁగ యౌవరాజ్యమున నిప్పుడు పట్టము గట్టఁ బూనెడున్ ॰ గీ॥ పుడమి యేలినదికి నేడయ్యెఁ గనిన వింక నేమి చెప్పఁగలదు వామనయన కడఁగి నిన్నుఁ గొడుకుఁ బెడవాపఁ బ్రోవ యా సవతికొడుకు యేలును వని యెల్ల ॰ క॥ అనిన నదరిపడి కేకయతనూజ కడు సంభ్రమమున దత్క్షణమున రే నృపుని పాలికిఁ జని యేకతమున నిట్లనుఁ బ్రణయపూర్వముగ వాత్సల్యతోన్ ॰ క॥ ధరణీశ తొల్లి నాకుం గరుణించిన వర మొకండు గలదది మదిలోఁ బరికించి యిప్పుడొసఁగుము చిరముగ సత్యవ్రతంబు సెల్లింపు తగన్ ॰ వ॥ అనిన నతండయ్యతివం గనుంగొని యవధ్యుల వధియించుటయును వధ్యులఁ గాచుటయును బ్రాహ్మణధనంబులు దక్క నన్యుల ధనం బపహరించుటయును నభీష్టధనంబు లిచ్చుటయును మొదలుగా నతిదుష్కరంబులైన వానినైనను భవత్ప్రియార్థంబు సేసెద నెయ్యది చెప్పుమనిన భరతమాత యిట్లనియె ॰ గీ॥ యౌవరాజ్యపదంబునయందు భరతు నధిపు నభిషేకమొనరింపు మడవిలోన నొలసి పదునాల్గువర్షంబులుండ నాఁటి రాముని కిది యవరమ్ము నాకు ॰ క॥ అనవుఁడు వీనులఁ గోలిం గొని చూచిన యట్టులైనఁ గువలయపతి పెల్చనఁ బిమ్మటి దినక్రియఁ జేతనరహితుండగుచు ధరణీతలమునఁ బడియెన్ ॰ వ॥ అంతయు నెఱింగి రాఘవుండు నిజజనకుండు సత్యప్రతిజ్ఞుండు గావుత యని యాత్మగుణంబ సీతాసమేతుండై వనంబునకు వెడలె నతని వెంబడిన లక్ష్మణుండును జని

## దశరథుఁడు రామవిశ్లేషముచే సురలోకగతుండగుట.

నొదవె నంతరంబ ॰ క॥ రాముఁడు చనుట విని మహాస్థామంబగు శోకవహ్ని దరికొనఁగ నహా రామ సుగుణధామ యని యా భూమీశుఁడు తనువియోగము బ్రాపించెన్ ॰ వ॥ ఇట్లు దశరథుండు సురలోకగతుండగుటయుఁ గైకేయి తనకొడుకు రావించి భూవల్లభుండు దేవభావంబు నొందె రాముండు వనంబున కరిగె నింక నద్వంద్వుండవు నీవ కావున నఖిలమహీరాజ్యరక్షణంబు సేయు మనిన నక్కుమారుండు క్రోధశోకదందహ్యమానమానసుండగుచుఁ దల్లి కిట్లనియె ॰ సీ॥ మరితబులెన్నఁడు దొరయక వెలుఁగొందు కమలాప్తకులమునఁ గసటు కలిపి పరమధర్మాత్ము నంబురుహూతసన్నిభుఁ బతి మ్రింగి కొని క్రూరచంబాల వైతి యాయతబాహుఁ దేజోయుతు క్షమాయన్నఁ బట్టు ధైర్యు నడవులపాలు చేసి జీవితహంత వై తోవంగరాని దుష్కీర్తి నా యౌవలఁ గీలుకొల్పి ॰ గీ॥ శ్రీ కీనఁ డెపి సకలలోకంబులందును దిట్టు కుడిచి కోరి కాదె దిన్నఁ గొంటి పాపజా

తురాలయి యీపాతకంబేమి। సేయదింక నేమి సేయువాఁడ ॥ వ॥ అని దుఃఖించి భరతుండు దండ్రికిని దత క్రియలు సేసి యనంతరంబ సమస్తమంత్రి సామంత భూసుర పౌరజానపద సహితుండై కదలి మువ్వురు తల్లులను వసిష్ఠ వామదేవుల రస్కరించుకొని తానును శత్రుఘ్నుండును రామానునయార్థంబు చిత్రకూట శైలంబునకరిగి యందు ॥ మ॥ కనియెం మలనీల మేఘ సుభగాకారుఁ జటావల్కలాజినధారు సితభూతిభూషితుని రాజీవాక్షుఁ గల్యాణకీర్తను గాఢ లప్రదీపకు సీతాలక్ష్మణోపేతు సన్మునిలోకార్చితు సత్కృపాభరణు రాముం రాజచూడామణిన్ ॥ వ॥ కనియ తనాక్రందనపరుండగుచుం జని తదీయచరణంబులపయిం బడి పితృమరణప్రకారంబెఱింగించి దేవా సకలసామ్రాజ్య ణుండవై మమ్మేలు మనుచు శాసింపవేయని యర్ఘ్యజనసహితంబుగా నతనిం బ్రార్థించిన ॥ క॥ గురువాక్యరక్షణైకా చిత్తుండై నయయ్యుదారచరితుండై। వ్వరుసున నెడఁబడఁ డయ్యెను। సరసమహీరాజ్యసహితశాసనమునకున్ ॥ వ॥ రతుండును రాముచేతఁ బ్రత్యాఖ్యాతుండై తదీయపాదుకలు గొని వానినర్చించుచు నందిగ్రామంబునందు వసియించి రా జ్యానుసంధానంబు సేయుచుండె నిట రాఘవుండయోధ్యాసమీపంబగుటం జేసి క్రమ్మఱ భరతాగమనంబు శంకించి చిత్రకూటంబు వాసి శరభంగు పాలికిం జని యతనిచేత సత్కృతుండై దండకారణ్యంబు సొచ్చి యందు గోదావరీతీ ననవజనధూనసహితంబుగాఁ గృతనివాసుండై యున్నంత దశగ్రీవు చెలియలు శూర్పణఖ చనుదెంచి వారికి నపకారం

## రామలక్ష్మణులు శూర్పణఖను విరూపిం జేయుట.

సేయ మొనసినఁ గినిసి యారాజపుత్త్రులు తత్కర్ణనాసికావైకృతంబొనరించినఁ బడంపడి ॥ ఉ॥ శూర్పణఖానిమిత్తము శూరుల నేకులుఁ గక్కసుల్ మహోగ్రా। త్సర్పితరోషులై బహుల సైన్యయుతంబుగ నెత్తివచ్చు వారికా। దర్పితవైరిభంజ నుదారుఁడు రాఘవుఁ డస్త్రవిద్య నే। ర్పేర్పడఁ గేళివోలె సమయించె రణాంగణభూమి నందఱన్ ॥ వ॥ ఇట్లు ఖరదూషణ ములం దొట్టి పదునాలుగువేల రాక్షసులం జంపి దండకారణ్యంబు విగతకంటకంబు గావించె నంత శూర్పణఖయు రయం న రావణు పాలికిం జని తచ్చరణంబులపయిం బడి యేడ్చినఁ జెలియలికైన వైకృతంబేర్పడఁ జూచి యున్న నిశాచరుండిట్లని సీ॥ ఎఱిఁగి యెఱింగి నేఁ డెవ్వఁడు నిశితవిస్ఫారశూలాగ్రంబు పయికి నుఱికె। దలయంపియందగ్ని దరికొల్పి యెవ్వఁడు నే డు నెమ్మి నిశయనింపఁ జూచె। నుగ్రవిషానలంబుని యుచున్న మహాహిం ద్రొక్కె నెవ్వఁడు గాలఁ దన్నె। హుంకారకే రముపై మొదవుబెబ్బులిమీసలు అంటె నెవ్వాఁడు నేఁడు మఱచి యెవ్వఁడొ ॥ గీ॥ నిన్ను నెవ్వఁడకట నేఁ డిట్లు గతుభంగ। పఱిచెఁ జెప్పు మఁ బద్మనయన। యాయువు సిరియు మనవశంబులయ్యె నేఁ। డెవ్వఁ గొఱతలంప నిజ్జగమున ॥ క॥ అనిపలుకు నన్నదాశ నతరముఖనేత్ర నాసికాకర్ణములం। దనవరత రోషపావక। జనితశిఖాంచితములక్రమంబుగ వెడలెన్ ॥ వ॥ శూర్పణఖయు తనికి రాఘవులున్నతెఱంగును నిజపరిభవంబు దత్కృతంబగుటయు ఖరదూషణాది రాక్షసవధయును జెప్పి నీకు దానజుండా తక్షణంబ పురసంరక్షణంబునకు నాప్తజనుల నియోగించి సన్నద్ధుండై యొక్కరుండును వెలువడి త్రికూటకూ ర్వతంబులు గడచి సముద్రతీరంబున కరిగి యనేక గనివాసంబైన గోకర్ణస్థానంబునకుం జని యచ్చటం దొల్లి రామునివలనఁ బ్రా ప్త పరాభవుండై ప్రజనంబు నొద్దఁ దపంబు సేయుచున్న నానిందన పూర్వామాత్యు మారీచుం గని యతండును బ్రియసం భ్రమంబుతోడ నతనిం బూజించి కుశలంబడిగి భవదాగమన నిమిత్తంబేమి యనియడిగిన నసురేశ్వరుండిట్లనియె ॥ ఉ॥ శాస విన వే రాముఁడనంగ నెక్కుఁడు విపులదర్పహృదయుఁడై। మనఖకుంకుమలోను గానముగ్రశౌర్యులైన యాద్దను జవరుల మిముపు దండకస్థలంబున నం। దొనరనిగ్భయత్వ మొప్పుచున్న వాఁడు మేట్టియై ॥ గీ॥ వానిఁ బరిభవింపవలయు నన్వ హాయ్యకంబొనర్పుము నఘునాథు। నవిన నధిక భయసమావిష్టహృదయుఁడై। యమరవైరి కిట్టులనియె నతఁడు ॥ చ॥ ఎఱు వు నీవు రాఘవును దీర్ఘభుజాబలరూఢి యాజిలో। మఱకఁ దదీయబాణరయ మోర్వ వంశం బెపినాకికైనన। క్కఱ అయ్యగతి త్తెఱఁగు గాదన కేఖలుఁ బుద్ధి గాఁ। గఱపిన వాఁడు చేటువడుఁ గాలము చేరెనొ కాకయిమ్మెయిన్ ॥ గీ॥ రాము ద్రో నరణమునఁ గడుభంగి మొందికాడ్జైన్యయుక్తిగట్లు। తపసినై తినేఁడు తగద మ్మహాత్ముని। యందు వైరబుద్ధి యధిపనీకు అనినం గలుషించి లంకేశ్వరుండు వానిం జూచి నా పనుపు చేయవైతివేని నిన్నిప్పుడ కృతాంతగోచరుం జేయుదు నని నవా ను కనమనంబున పీని చేతం జచ్చుటకంటెను రాఘవకృతంబైన మరణంబు మేలని తలపోసి మహాత్మా నీకు హితంబు సో

ప్రీతిసదియిష్టంబుగా దేనిభవదీయశాసనంబు గైకొని చేసెదం బనుపుమనినం బౌలస్త్యుం డట్లను నీవు రత్నమయతను స్ఫురణమహా
బలుగలకనకమృగంబవై చని జానకిం బ్రలోభింపవలయు సీతాచోదితుండయి రాముండు నిన్నుం బట్ట సమకట్టిన చేతనతిదూ
రంబుగొనిపోవం బడునప్పుడే సుదర్శనమునన పహరించెదం బ్రియావిరహదుర్మనస్కుండై యతండు చెడిపోవునినినట్లశాక

మారీచుండు మాయామృగంబై చనుదెంచుట.

యనిమారీచుండు ॥ క॥ కనకమృగరూపమునం జని। యినవంశుం డుసతియుం దన్నయెడం బొలయుటయుం। గనిజానకికౌతూ
హల। మునం బ్రియుం బ్రార్థించెహరిణపుంగవుం బట్టన్ ॥ గీ॥ ధరణిసుతయుపాధియుం దన్నుం బ్రేరేపంగ। వివశబుద్ధియగుచు
నవనిభుండు। మృగముం బట్టం దివిరె మృగనేత్ర గావస। ద్విసుతబలుసుమిత్రతనయుపుని ॥ క॥ అసదృశకార్ముకధరుండై।
వసలకయామృగము వెనుకవద్దితరిపుండం। పెనంగంగనగుగం దొడంగెను। వెనరుద్రుండుయజ్ఞమృగము వెనుకొనుమా
ర్కిన్ ॥ వ॥ ఆసమయంబునం ॥ పలచన్నదృష్టిం జేయలంతి నిలుచుం బట్టికయాసాసలం బిజువోవుం బొదలం గుడించుం బొడ
ముం బిటులికి వేదాటుం గ్రమ్మఱిచూచుం జెవిదాచ్చిగల్చునులయన్మట్టాకుం గోరాము నేమజినట్లుం ద్దృణంబు మేయు
చులయర్కమాయామృగంబిమ్ములన్ ॥ వ॥ ఇట్లు దూరంబుగా నెలయించియలయించిననది రాక్షసమాయగాం దలంచి రాఘ
వుండ మోఘబాణంబు దొడిగితడయక మృగంబు నేసిన ॥ క॥ వాలమ్మునాకియొఱలుచు। నాలోన వరాము నెలుంగునట్టియె
లుంగునగా। హాలక్ష్మణసీతాయని। కూలికపటమృగముదన్నికొనుచుంజచ్చెన్ ॥ తరువోజ ॥ ఆయెలుంగేర్పడనవనితనూజ
యాలించితల్లడంబడుచు చిత్తమున। నోయన్నలక్ష్మణ యొలసిమీయన్నయుగ్రరాక్షసబాధనొందంగం బోలు। నాయతభుజ
విక్రమమహాభాగుండత్యంతదుఃఖార్తుండై నిన్నుంజీరె। బోయి వేకావవేపుణ్యగుణైకభూషణ యోదారునవ్వపుషరత్నం
బు॥ అనిననతండమ్మానినికిట్లనియె ॥ గీ॥ అబల పెలవకుండుమఖిలలోకములను। రాఘవేశ్వరునకురణములోన। నెమరంగలం
డెవ్వారుండెవ్వాండునతవికి। నెట్టియెడలదురితమేలసొంచం ॥ క॥ ఇనవంశోత్తముండివ్వడ। చనుదెంచుం బ్రియంబునొందుమజల
జాననా। విని జానకిలక్ష్మణు నెడ। జనితాశంకయయిక్రోధసంభ్రాంతమతిన్ ॥ సీ॥ శీతలం పెలుంగునుమనీ కేలదలవనిజాశినీ
కట్లేలసంభవించె। నతిఘోరశస్త్రవిషాస్త్రులం దొక్కట వేగంబ ప్రాణములోవిడుతుంగాక। యేసేలనినువరియించుబె
బ్బులికాంతయక్కటనక్కపొందానపడునె। యనియిట్లు సత్పురుషాగ్రణి సౌమిత్రిం బడంతియప్రియములుపలుకుటయును।
జెవులుమూసికొనుచుంజిత్తంబు గలంగ। లక్ష్మణుండుదగ్రుం బను హితశౌర్యుండు। సలచాపబాణహస్తుండై తమయన్న। చని
నచొప్పునందచనం దొడంగె ॥ వ॥ అయ్యవసరంబునదశాననుండు ॥ మ॥ కమనీయుంబ జన్నిదంబు శిఖయుం గౌపీనము న్గాథా
తువ। స్త్రముదండంబును గుండియుం గుశపవిత్రంబుం గరంకవృద్ధభా। వముసంధిల్లం ద్రిదండి వేషధరుండై వచ్చెన్ బధ
శ్రాంతిదే। హముసం దోపంగ సీతయున్నెడకు మాయాదక్షుండక్షణతన్ ॥ గీ ॥ వానినిక్కపుమునియకాంవగని రాము। వ
నితకడుభక్తిం బూజించి వన్యఫలము। లొసంగుటయువానిం జేకొననొల్లకసుర। మదనవివశుండై యిట్లనుమనుజాధిప
సత్తికోకిల ॥ ఏ దానవనాయకుం డవహీనసత్త్వుండ రావణాఖ్యాభిరూఢుండలంకవాడ జగత్ప్రసిద్ధము నుత్పురంబాన
తాంగి మదీయవల్లభవై భుజింపంగ రాదెది। వ్యాసుభోగము లిష్టచేష్టితహారియౌవనలీలలన్ ॥ క॥ ఎక్కడిరాఘవుండుకట।
తక్కావయిగుసేకసునజుండగిలియడవులన్। బ్రాక్షము లంబడసగునే। తక్షుముమదినింకనొందుతలంపులుదకుణి ॥ వ॥ అనిన
వినివై దేహిభయకంపితదేహయగుచు నతనికిట్లనియె ॥ సీ ॥ ఇట్లాడనచణమేయే నేపనీ వేడవత్తు పతారాగణంబుతోడ।
నాకసంబంతయునవనిపైం గూలినవసమలిరస్నినవనధులెల్ల। నింకినం జంద్రదినేశ్వరులనోన్యవిపులతేజంబులు వీడిపడిన।
నేసేలయన్యులనెడదలంగామింతుంగరిణియేనాంటసూకరముంగలయు। మహితకమలమధురసమధురసాస్వాదన। పరవ

రావణుండు సీత నెత్తుకొని లంకకుం బోవుట.

శాత్మయైన భ్రమరకాంత। రిత్తబుద్ధికట తేగపువ్వులరన। మానునెట్లు బేలవైతిగాక ॥ వ ॥ అనిపలుకుచనొయ్యనొ
య్యనందొలంగ జనిన నస్తురాత్ముండతిభయంకరంబుగాజంకించి యమ్మగువం బట్టుకొనిగగనంబునకెగసి లంకాపురాభి
ముఖుండై యరుగదొడంగిన నయ్యింతియెంతయుండలంకియిట్లనివిలాపంబు సేసె ॥ ఉ॥ దేవతలార యోధరణిదేవతలా
రజగత్త్రయోన్నతుండై వెలుంగొందు రామునిభల్లాంగన జానకి నేనునన్నుమో। హావిలుండొకక్రూరుండుకొనుచున్నాడు

...డుక్ గ్వసక్। గావ రేపుణ్యమూర్తియశము(గ్రై కొనరే యజెమీవు మొ కెర్-దర్ * క॥ అగయేష్య(గ(వ్వష్య ములనఘు(డు గిరిగహ్వరాంతరాలయగతు(డై । వీనియసుతు(డు దేజో ।ఘను(డు జటాయువను పక్షి కారుణ్యవ సక్ * క ॥ ఎఱకలుగలకులశైలము। తెఱ(గు మెఱ యరయము నెరయ దిపికి నెగసి బి।ట్టుఱుము జలధరముక్రియను।కర్కశ ధ్వనమెల్లన ద్రువనార్చు చు(గడిమిక్ * ఉ ॥ ఓరి దురాత్మ యీయబల నోడక యేటికి(బట్టినా(డవ(।భోరుహనేత్రవిక్షు మెట(బోయిన(బ్రాణముగొందు లింకను। గ్రారివిభేదివిక్రముజటాయు నెఱుంగవె యెంచు దర్పదు। ర్వారు(డు వీ(డ దాశర సుగవర్గసఘూనను వద్దశాననుక్ * మ ॥ ఘనపక్షాహతుల(బ్రకాండపరిఘాఘాతంబులం దీవ్రశా । తనఖోచ్ఛేదము బ్రదీప్తశరవేగక్రీడలం గ్రూరచం । చువిపాతంబుల(బ్రౌఢసంతముఖ విస్ఫోటబులం దక్షగేం । ద్రనిశాటేంద్రు లొ సాధనసమగ్రస్ఫూర్తినొప్పెం గడుక్ * చ ॥ పటుతరపక్షిపక్షముఖపాదనఖప్రవిఘాతఖండిత । స్ఫుటితశరీరు(డై హులశోణితధారలు మేన(గ్రమ్మ(గా(। డటసము పాంతనిర్గళితధాతురసారుణసాంద్రనిర్ఝరో। త్కటకులశైల నశక(డు(డు నిల్చె నకంపితస్థితిక్॥ తదనంతరంబ ॥ తెఱపిగని దానవేశ్వరు(। డు అక(గ్ర పాణము న వాఖసూత్రము ల్లెస్కిల్ ।నటికిన(గూలెనతండిల।న అవఱలై పవనహతమహా భ్రము వోలెక్ * వ॥ ఇట్లు జటాయువుం గూల్చి రావణుండక్షీణ యంబున నరుగు నెడ జానకి తనదు కెర్-న్వరులేమిం జేసి నిరాశయైయొక్క శైలశృంగంబునందు(గొందఱు వానరులు వ లంగుచున్నం గని తనకట్టినపుట్టంబు కొంగు చించి భూషణంబులు ముడిచి తత్ప్రదేశంబునవైచెం బ్రక్కవదనుండును లంకా పురంబునకు జని యందశోకవన మధ్యంబున నాసుమధ్యను నిది తదీయరక్షణార్థంబు రాక్షసీనివహంబు నియోగించె ట రాఘవుండు మాయామృగంబు వధియించి మగుడ జనుదెంచువాడు వనికెదురుగా వచ్చు లక్ష్మణుం గని రాక్షసగో రంబయిన వనంబున జానకి నొంటి నునిచి వచ్చితవ్వ సేసితని పలుకుటయు సుమిత్రానందనుండు ధాత్రీతనయ దన్నవ మానించి పలికిన తెఱంగు సెప్పిన ॥ అక్కర ॥ కనకమృగమట్లు తన్నుదవ్వుగా(దిప్పి తెచ్చుటకు। వనజముఖినేక తనను వ్యవనమున నుంచునిధి। వెనుకనయనుజుండు వచ్చినవిధమునకు మదిలోన। నసఘు(డెంతయు వగచుచు మనరిగె నాశ్రమమునకు వ॥ ఇట్లు చని చేతనారహితంబయిన శరీరంబునుం బోలె సీతావిహీనంబై యున్న పర్ణగృహంబు గను(గొని రాఘవుండు మూర్ఛితుండై లక్ష్మణప్రయత్నంబున( గొండొకవడికి దెలివొంది నంతనయ్యన్నయుం దమ్ముండును దత్ప్రదేశంబు యందు సుందరిం బడవుచుం జనువారు ముందట * గీ ॥ కులిశపాతభంగుర మైనకులనగంబు। కరణి(బడియున్న గృధ్ర గాంచి బుద్ధి। నదియు రాక్షసమాయయౌనని తలంచి । యేయసమకట్టుటయు విహగేంద్రు(డెఱి(గి * క ॥ ఓయయ్య యేను జటాయువన(గ(బర(గు పక్షిన రయ(డు నన్నుక్ । మీయయ్య దశరథక్షితి। నాయకునకు( బ్రియసఖు(డనా పుణ్యవ రల్ * వ ॥ డాయ(జనుటయు నతండు వారితో రావణుండు వైదేహి(గొనిపోవుటయు( దదర్థంబై తానునడ్డనంబో రిపెన(గుటయుం జెప్పి రావణుండరిగిన దెస యెఱుంగించి విగతజీవుండయ్యె నయ్యిరువురు నవ్వాలు గు తేనికి సగౌరవంబు నగ్నిసంస్కారాదికరణీయంబులు నిజజనకునకుంబోలె శేషంబుగా నాచరించి దక్షిణాభిముఖులై చనిచని * చ ॥ ఉరమునయం దు(గన్నులు(బృథూదరదేశమునందు నోరు(బ్ర। స్ఫురితభుజద్వయంబుగులభూమిధరోన్నతభావముం గరం। బుగురు ఉగ్రమైనవికృతాకృతితో(డ నశేషసత్త్వఘస్మరు(డగుచున్న వా(బటును తున్న(గబంధు(గాంచి రచ్చటక్ * గీ॥ అట్టి ధ(డాశరథు లక్ష్మణు( । బట్టుకొని యెబాహుబలమెలర్ప । నత(డుకడు విష(ణ్ణు(డై యన్న ననుజు(డు । మనసునం ముంజూచి యనియెను అయ్య * సీ॥ మహనీయసామ్రాజ్యమహిమవాయుటయు నుబిన్నమరణంబు నాభీలవిపిన।భూమునుం డుదుఃఖమున(జరించుటయు వైదేహి(గోల్పడి వగ(దిరుగుటయును। దుది(బోయి యేనిట్లు దొడరి యీ దానవు వాతబడు టయును వగవనీక(।బై పైన పెక్కులాపదలయ్యెనక్కటధరణీశ నీవు నాధరణి పతయు(* గీ॥ కలసి పూజ్యరాజ్యగౌరవమును

## శ్రీరాము(డు కబంధు(డను రాక్షసు(జంపుట.

న వెలు(।గళుగ నెలమి(జూడ(గాననైతి। నేను దలప నెట్టి హీనభాగ్యుండనో యనుచు ననుజు(డార్తినడలుటయును * గతసంభ్రము(డై రామవిభు(డు గడ(గి । యన్నలక్ష్మణ యోడకు మున్న యేను।గలుగ నీకేల యాపదగలుగ నేర్చు।నను చు కుర్-ననిశితమహాసివెటిక * వ ॥ ఆరక్కసు దావలి చే యిదుని యవ్వేసిన లబ్ధమోక్షు(డయి లక్ష్మణుండు ప్రకటసై

హ కేయూరం ప్రాపిముక్తుండయిన తిగ్మభానుండునుంబోలెఁ బ్రదీప్తుండయి తీక్ష్ణకౌక్షేయకంబునఁ దదీయ దక్షిణహ స్తంబు ఖండితంబు సేసి పార్శ్వద్వయంబు ఛేదించి [illegible]ంబకబంధుండు దివ్యరూపధరుండగుటయుంగని రాఘవుం డువిస్మితుండై * క॥ ఈ వనమునందు రాక్షస । భావంబునునున్న నీకుఁ బ్రకటితదివ్య। త్వావాప్తికైన కారణ । మే విధము నటయును నాతఁ డిట్లని చెప్పెన్ * వ॥ ఏను విశ్వావసుండను గంధర్వుండ బ్రహ్మశాపంబునం జేసి రాక్షసత్వంబునొంది తన్నిమిత్తంబున శాపమోక్షంబునొందితి రావణుండను రక్కసుండు జానకింగొనిపోయి లంకానగరంబున నునిచిన వాఁడు మీకుపకారోపదేశంబు సేసెద నిటఁ బోవఁబోవఁ బంపాభిధానంబయిన సరోవరంబు గలదు దానియావల ఋశ్యమూకంబను శైలంబునందు వాలిసహోదరుండయిన సుగ్రీవుండను వానరుండు నది వచతుష్టయసహితుండై యుండు నీవతనితో సఖ్యంబు సేయుము దానం జేసి నీకుఁ గార్యసిద్ధియగునని గంధర్వుండు వానివీడ్కొని నిజేచ్ఛ జనియె దదనంతరంబ యటఁ జనిచని * సీ॥ కమనీయకమలినీకల్హారకేళకేసరాన్వితజలములవలగ్నవిధియుఁ। దరళతరంగహస్తములఁ బాద్యంబున్న దచక్రసారసనధుపహంసారుతులఁ బ్రియోక్తులురుచిరవాస్తీరనివేశనచ్ఛాయల విశ్రమంబు । మందసంచారితమారుతంబుల నురుతాపనోదనము నుదగిలి నొప్పు ను * గీ॥ నాచరించుచును సముచితాతిథిజన । సేవనమునఁ దనదుజీవనంబు। ఫలమునొందనొప్పు పంపాసరోవరంబు జెమరఁ గాంచిరన్నరేంద్రసుతులు * వ॥ ఆసరోవరతీరంబునఁ గౌసల్యానందనుండు దద్ద్వాశేషవిపమోల్లానంబులవలనం గ్రొత్తయైన [illegible]లంబు దరికొని చేతోవృత్తంబు నెరియింపం బొడఁగిసఁ దాల్మిదొరంగి జానకిం బేర్కొనియాక్రందనవచనవివశుండై [illegible] కిలక్ష్మణుం డిట్లనియె * చ॥ [illegible] రేణ్యాయిట్లు మిము బోటులకుం జనునయ్యాయాపదల్ । వొరసినచోఁ గలంగుట ప్రభుత్వమె లెప్పఁగఁ దాల్మియూనిదు । స్తరతరమాననవ్యధలు దగ్గుము సంభృతపౌరుషుండవై । యరయుము దేవియున్న యెడ యారసి కార్యము దీర్పు మేర్పడన్ * గీ॥ అధిపతిప్పుడను సహాయుఁడభ్య ద్యుఁడనై నయేనుగల్గ నాత్మ నీకు । నేల వగవ నిమహీపతిదత్తంబు । నలఁతడెందుఁ బతిచెనవరజుండు * వ॥ తదనంతరంబ యయ్యిరువురుం బంపాసరోవరంబునం గృతస్నానులయి దేవపితృతర్పణంబులు సేసి చనిముందట నతిబహుళబలాహక వ్యూహసన్నాహ [illegible] తంబులయిన యభంగశృంగసముదయంబులవలన గగనక్రోడ పీడనంబు సేయుచున్న దాని ఋశ్యమూకశైలంబుం జేరి తదుపకంఠప్రదేశంబున విశ్రమించియున్నంత * సీ॥ ఆరాజపుత్రులవారూఢతేజులవీరులను న్నతోదారభుజులఁ గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగమున నుండి తాను నుదనసచివులుఁ [illegible] వారివృత్తాంతము నెఱుఁగంగ సంతతోత్సాహుఁ ధీమంతుశౌర్య। వంతు నుత్తముహితపవంతునిఁ బోనియత్యంతసు[illegible]బని చె॥ గీ॥ వం తఁడు నరిగి నృపతిసుతుల తెఱంగెల్ల। నెఱిఁగి వనచరేంద్రు నెఱుఁగఁ జెప్పి । యుగ్రతేజుఁడైన సుగ్రీవుతోఁ జెల్మి। యొనరసంఘటించె మనుజపతికి * వ॥ సుగ్రీవుండును మున్న సీతాపరిత్యక్తంబయిన తముందటం బడినఁ దారుసంగ్రహించియున్న భూషణనిచయంబుని వేదించినం జూచియతండు సముత్సుకుండై వానికి వానరైశ్వర్యంబు ప్రతికృతంబు సేసి తదీయశత్రుండయిన వాలిం జంపఁ బ్రతిజ్ఞ సేసె సుగ్రీవుండును జానకిం దెచ్చుటకు సహాయంబుగా నొడంబడియె నంతట నందఱు గూడుకొని వాలినివాసంబయిన కిష్కింధానగరంబునకరిగి రప్పుడు భానుసూనుండు * క॥ వాలిగృహద్వారంబున। వ్రాలి రవంబెసఁగనార్చి వదలక బాహా । స్ఫాలనము సేయుటయు విని । వాలిమహారోషదుర్నివారోద్ధతుఁడై * వ॥ సమరసన్నాహంబు మెఱసి వెలువడం బోయినఁ దదీయ వల్లభయగు తార యతని వారించి యిట్లను నేటి చందంబు చూడ సుగ్రీవుండు బలవత్సహాయుండై వచ్చినవాఁడని యెట్లనిన దశరథనందనుండైన రాముండు రావణుచేత నపహృతదారుండయి నిజసహోదరుం డగు లక్ష్మణుండును దానును సుగ్రీవసహాయంబపేక్షించి యతని కార్యంబు దీర్పం బూనె నని వింటి నదియునుంగాక మహాబలులయిన మైందద్వివిదులు నతిలోకపౌరుషుండయిన హనుమంతుండును బ్రసిద్ధబుద్ధియగు జాంబవంతుఁడును నితనికి మంత్రులై యుండుదురు కావున నీవిప్పుడు కయ్యంబునకుఁ బోవుట నాకిష్టంబు గాదనిన నవ్వనచరవీరుండు * క॥ ఆవనితవచనములను। శ్రీవపివయపతు పాతకృత్యంబులుగా। భావించి యాదరింపక। తా వెడలెఁ నూనబాహుదర్పం బెసఁగన్ * వ॥ ఇట్లు

## ——— వాలిసుగ్రీవుల యుద్ధము. ———

వెడలి కట్టెదురసున్న సుగ్రీవుం జూచి యిట్లనియె * గీ॥ ఓరి దుష్టాత్మ యేనిట్లు పోరఁ బెక్కు । మాఱు లెగువంగ సిగ్గఱి పాఱుచుం

దవనికినై। యొదవియుత్సహించియున్నవాఁడు. వ॥ రావణుఁడు రంభానిమిత్తంబయిన శాపంబుగలదు కావున నీయం దుఁబలాత్కారంబు సేయరాదు నీకు నీవలని భయంబు వలదు మఱియు నద్దురాత్మునకుం జేటు దెలుపునట్టి కుస్వప్నంబు గలిగె నదియాకర్ణింపుము * క॥ ఖరములఁబూనినరథమున। విరిసినవెంట్రుకలు వెంటఁ బ్రేలఁగ దశకం। ధరుఁడు బహుల తైలాప్లుత। శరీరుఁడై దక్షిణంబు చనఁగను గంటిన్ * గీ॥ అతనిచుట్టును గుంభకర్ణాదులెల్ల। నరుణమాల్యానులేపనులై విముక్త। వలితకేశులై నగ్నులై వరుసఁ బ్రేత। పతిదిశకు నేగుగతి గానఁబడియె నాకు * ఉ॥ చారుసితాంబరుండు విలసత్సితమాల్యసితాంగరాగుఁడై। ధీరగుణోత్తరుండధికధీనిలయుండు విభీషణుండు వి। స్ఫారసితాద్రిశృంగమున భవ్యుఁడు మంత్రిచతుష్టయాన్వితుండై రమణీయలక్ష్మిఁ బొలుపారఁగ నేఁగలఁగంటి నుమ్మలీ. చ॥ తనసితకీర్తివిశ్వవసుధాగగనాంతరపూరితంబుగా। ఘనభుజుఁడున్నతద్విరదకంధరసుస్థితుఁడై ముదంబుతో। ననుజుఁడు దాను రాఘవకులాగ్రణి సన్మధుసిక్తపాయసం। బొనరభుజింపఁగఁ గంటి వికచోత్పలలోచన నిక్కమింతయున్ * క॥ పులిచేత వ్రేటువడి మైఁ। గలయఁగ నెత్తురులు గ్రమ్మఁగా నేప్పుచన। మ్ములను త్రగాభిముఖివై। కలుషితగతి నరుగు నిన్నుఁ గనుఁగొంటిఁగలన్ * క॥ నాకలనికిఁ లయయ్యెడు। శోకింపకుమమ్మ నీవు సుందరి పుణ్య। శ్లోకుఁ జితశోకు ననతులవి। వేకుఁ బ్రియుఁ బొందఁగలవు వేగమె నీవున్ * గీ॥ అనినఁ ద్రిజట పలుకులవివికవంబుగాఁ। దలఁచె సీతఁ గొంత వనటఁ దక్కి। యాసతోడనుండె నటదశవదనుండు। సీతఁ దలఁచి వివశచిత్తుఁడగుచు * వ॥ తాను దేవదానవగంధర్వాది సంఘంబులనెల్ల జయించియుం గందర్పదర్పంబు వారింపనోపక యాతుఁడై దివ్యమాల్యాంబరాభరణభూషితుండయి సంచరణశీలంబైన కల్పపాదపంబునుం బోలె నొప్పియుండెన యొవ్వనసీతకు విగ్రవనంబునందలి వటభూరుహంబునుం బోలె నతిభీషణంబగుచుఁ డశోకవనమధ్యంబు సొచ్చి రోహిణీసమీపంబునకు వచ్చు శనైశ్చరుండునుం బోలె జానకిం జేరంజని మెల్ల ప్రణయపూర్వకంబుగా నిట్లనియె * క॥ పలవాది రాక్షసపలవని। జాలింబడిన వసె నవులసద్భూషాలీ। లాలంకృతవై నను గృప। నేలికొనం గాదె వేయు నేటికి నింకన్ * చ॥ అనిమిషయక్షరాక్షసవిద్యాచ్చరకిన్నరపన్నగాసురాం। గనలఁ గరంబు చిత్తమునఁ గైకొన కే నమరాంగలీలమై। వినుమది నాదరించుటిది నీదగు భాగ్యముగాదె యింతయున్। వనితయె లుంగవై తిరుగ వంపువిచారము లేమనీయెడన్ * ఉ॥ రాముఁడనంగఁ బేర్మియును రాజ్యముఁ గోల్పడి కానలోన దుర్గ। భూమియ మున్నఁడై నరయొక యల్పమనుష్యుఁడు వానిపై గడున్। బ్రేముడిచేయ చన్ వగల పెల్లునఁ జిత్తముదగ్గిడెల్లగా। నీ మొయిసుండు నీయునికి యేసుఖసంప్రులతాంగి చెప్పుమా * వ॥ పంచుసకల లోకేశ్వరుండ వాకుంగింకరులైపదునాలుగుకోట్లు నిశాచరభటులును నిరువదియెనిమిది కోట్లు రాక్షసులు నెనుబదియాఱుకోట్లు యక్షులును వర్తిల్లు మరునిఖిలధనాధ్యక్షుండైన యక్షేశ్వరుండు నాయగ్రజుండు బ్రహ్మసమానుండగు విశ్రవసుండు మదీయజనకుండు నకు బేసనవినోదపాత్రంబులైన గంధర్వాప్సరోగణంబులు నన్ను సేవించు బంచమలోకపాలుండని నన్నుఁ ద్రిభువనంబులఁ గీర్తితురుభక్ష్యభోజ్యాదివస్తువులును సురేశ్వరగృహంబునం దెట్లట్ల నాగృహంబున నక్షయంబులిట్టి నావిభవంబింతటికి నిమదీయజీవితంబునకు నధీశ్వరివై సుఖంబున జీవింపుమనిన విని వైదేహి క్రోధశోకవ్యాకులయగుచు వానిదెస జూడక యొక్క తృణాంకురంబు వలక్షించి యిట్లనియె * సీ॥ అకట పరాంగననబలఁ బతివ్రతఁ బరికింపఁగామార్తయ్య భామనేను। రాక్షసుండవు నీవు రాగంబు వదిలించుకయు లేనినాదు సంగమునం బెట్టు। గలిగెడునట్టి సౌఖ్యంబెంత యుదియును గాక యాద్యుండైన కమలగర్భు। పౌత్రుఁడననిలోకపాలముఖ్యుఁడ ననిహరసఖుండైన ధననాథునాథు * గీ॥ భ్రాత ననిభవత్ప్రభావంబు సెప్పితి। పట్టిపీవు ధర్మగు ళాటిఁగిదురిత। వర్తనంబు విడువవల దె పెంపేది యి। ప్పగిదిఁ బల్లదములు వలుకఁ దగునె. వ॥ అనిపలికి జానకియు త్తరీయసంవృతవదనయై యతికరుణంబుగా నేడ్చిన నద్దురాత్ముండు వెండియుఁ గొన్ని దుర్వచనంబులువలికియనంతరంబ యంతర్ధానంబునొందె నప్పొలఁతియు నెప్పటియట్ల రాక్షసీరక్షితయైయుండె నని మార్కండేయుండు ధర్మరాజునకు నెఱింగించిన తెఱంగు వైశంపాయనోక్తంబైన యాఖ్యానంబు విఖ్యాతమాహాత్మ్య మనోహరంబుగా నొప్పు * క॥ విమలతరాత్రగుణోన్నత। విమలాదిత్యాత్మజన్మ విలసత్కమలా। రమణీరకమలోజ్జ్వల। విమలాంబుజరేణురాగ వికసితవక్షా * వనమయూరము॥ భూపరక్షదంబసుర భూరుహవికాసో। ద్భాసితకృపారసవిపాకసుగుణైకో। ల్లాసదరహాసహ్రీకలాంఛనమృణాళీ। హాసినవకీర్తివిసరాకలితలోకా॥........*

గద్య * ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునందు
ధ్యోధను ప్రాయోపవేశంబును బాతాళగతులైన దానవులతని నాశ్వాసించుటయు వైష్ణవయాగప్రవర్తనం
బును బాండవులు గ్రమ్మఱం గామ్యకవనంబునకుఁ జనుటయు వ్రీహిద్రోణకాఖ్యానంబును ద్రౌపదీహరణంబును జ
యద్రథుభంగంబును రామాయణకథాప్రవృత్తియునందు రామరావణుల జన్మంబును రాఘవువనప్రస్థానంబు
ను సీతాహరణంబును సుగ్రీవమిత్రత్వంబును వాలివధయును త్రిజటాస్వప్నకథనంబును రావణుమన్మథ
నంబులును నన్నది సప్తమాశ్వాసము.........................................................................



శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము - సప్తమాశ్వాసము.



శ్రీకరసోమాన్వయర । త్నాకరహిమధామధార్మికాంచితవినయో । త్సేకభువనైకవీరమ। హాకావ్యరసప్రసన్న
జనారాధనమతీ ॥ వ ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు పరమతపోనిలయుండైన మార్కండేయు
డు పాండవేయులతో మఱియు నిట్లనియె ట్లు మాల్యవత్కందరమందిరుండైన దశరథనందనుండు నవకందళసుందరంబు
ను జనకనందనీ వియోగదుస్సహంబులునగు ఘనఘనదివసంబుల నెట్టకేనియుం గడపి కరతెశయసాంద్ర చంద్రాతపస్ఫు
వనశీలతసమీరవాహ్యమానవినిద్రకుముదకేదార సౌరభసర్వ్రంబులునతిదీర్ఘయామంబులునైన శారదయామినుల
నైవనోపక యొక్కనాఁడు తమ్మునింజూచి యిట్లనియె ॥ సీ ॥ చూచితె లక్ష్మణ సుగ్రీవుకొఱ గానియమ్మేయి దనపగయ
చిమనము కపిరాజ్యమిచ్చినఁ గైకొని యింద్రియసుఖముల నెంతయు జొక్కినేఁడు మనదిక్కు దలఁపఁడు మనతోడ బల్కినసు
యంబుఁ జెల్లింపఁ జనదెతనకు ॥ గడుకృతఘ్నత సేసెఁ గపికులాధముఁ డసీవసఘుక్షికంధకునరుగుమి పుడు ॥ గీ॥ యద్దురాత్మ
గృపణు నాత్మీయ కార్యతత్పరుని నధికరాగపరవశాత్ముఁ । దొడరి వాలిచనిన త్రోవ నేయనిదిర । మ్మేలతడయునుసకు
నిచట ॥ గీ ॥ నీవుచనకమున్న నెమ్మితో మనకార్యముననకుఁ దగిన యత్నములు ఘటించి । యుండెనేని వాని నొండేమియు
జేయవలదు తోడి తెమ్ము వార్యశౌర్య ॥ చ॥ అనుమఁ దదాజ్ఞఁ బూనియత డాతతకార్ముకహస్తుఁడై గయ బునఁ గపి
ప్రోలికి నిబోయి నవాఁడు ససంభ్రమంబుతో । ననుఁ గులుగాను రాజసుతు నర్థి నెదుర్కొని మ్రొక్కి యర్ఘ్యపూజ సే
రించుచు కపిభునిశాసనమాతఁడు సెప్పె వానికిన్ ॥ వ ॥ చెప్పిన విని భయకంపితగాత్రుండై కపులమిత్రపుత్రుం
మిత్రపుత్రుసకిట్లనియె నయ్యా యేనేల కృతఘ్నుండ నగుదు జానకి నన్వేషించుటకునై బలవంతులు బుద్ధిమంతులు
నరులన నేకుల నలుదెసలకుఁ బనిచితి వారలు సకలవన శైలసాగరనగరగ్రామంబులు లోనుగా భూచక్రంబెల్లఁ
యొక్కమాసంబులోనం గ్రమ్మఱి వచ్చువారై సమయంబు సేసి పోయిరింక నైదుదినంబులు గొఱ అంతయుంతి...యట మీఁ
వైదేహి వార్తఁ గొనుచు రాను దేవరకొలువ వచ్చువాఁడనై యున్నవాఁడననిన సంప్రీతుండై లక్ష్మణుండు ॥ క॥ వానిందో
కొని యా భూనాథుఁ గానుపించఁ బోందుగడదత । ర్యాన స్థానవిశేషము దానెఱుఁగించుటయు విభుఁడు దగ్గయ
రెన్ ॥ వ ॥ పదంపడి పూర్వపశ్చిమోత్తరదిగ్భాగంబులకుఁ జనిన వనచరులరుగుదెంచి రాఘవుంగని దేవా సకలసాగర శైల
లావలయితంబైన భూవలయంబంతయు వెదకితిమి మీ దేవిం బొడగాన మని చెప్పిన నతండు దుఃఖితుండై దక్షిణపుదిశకు
యిన వానరులవలన వైదేహి తెఱం గెఱుంగుదు నను నాసం జేసి ప్రాణంబులు ధరియించియుండెనంత వెండియు నొక్క మా
సంబు చెల్లిన నతండు దుఃఖితుండై యుండఁ గొందఱు వనచరులు వచ్చి సుగ్రీవుంగని యిట్లనిరి ॥ సీ॥ నీవును వాలియు నేఁడును
డునునయముతోఁ బాటించు నాక తోఁట । మధువనంబది యిప్పుడు మనయంగదుండును హనుమంతుఁడును మొదలైన వాన
లు విడిసి జాతాడి ఫలములానెదరు తద్రక్షకులగు మమ్ము రయము మీఱ । భంగించిరన వుడు భానునందనుఁ డాత్మ నంగదప్ర
ముఖులు యామ్యదిశకు ॥ గీ॥ జనిన వారలు గావున జనకపుత్రి గనిరి యిది కాఁబోలుఁ గాక యిట్లు చేయ వెఱవ రేవిధమున

విలఘుతనుశ్రీసనాథహరిహారనాథా ✱ వ॥ దేవాదివ్యచిత్తంబున నవధరింపుము ✱ గీ॥ కథ జగత్ప్రసిద్ధిగాఁ బూర్వ
వ। ర్యార్థయుక్తిఁ జేయనట్టియెడల। యన్నమించుకంతయయిన నవలవదు। వలసినట్లు చెప్పవచ్చియుండు ✱ వ॥
శ్రీమహాభారతంబు సమస్తమరితాపహంబును నభిమతశుభావహంబును గావున నొక్కమహాఫలంబు గోరి జనమే
జయుండు వ్యాసమహాముని కారుణ్యంబు వడసి తదీయప్రియశిష్యుండైన వైశంపాయనునివలన వినిన కథయగుటం జేసి
తత్ప్రకారంబున నడిపెద నదియెట్లనినఁ బరమపవిత్రులగు పాండుపుత్రుల చరిత్రంబు పాఖ్యాన సహితంబుగా వ్యా
ఖ్యానంబు చేయుచుండ వారలవనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనునకి
ట్లనియె ✱ చ॥ మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యులంగనా। సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయవి
గూఢవృత్తిమైనహితులకప్రభేద్యమగు నాపదమూఁడవయేఁడు మత్పితా। మహులు చరించి రంతయు క్రమంబున నా కె
ఱుఁగంగఁ జెప్పుమా ✱ క॥ అనియడిగిన వైశంపా। యనుఁడమ్మనుజేంద్రచంద్రునధికౌత్సుక్యం। బునకలిమికిఁ దనహృద
యం। బున గాఢాదరము భరితముగ నిట్లనియెన్ ✱ వ॥ పాండవులు వనవాసంబు సముచితంబుగా జరిపి పండ్రెండవయేఁ
టికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమంబయినఁ దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండునట్లుగా
వరంబు వడసి యంతకుమున్ను తమవెనుక నడవులందిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడ్కొనివచ్చిన భూసురోత్తము
లవమ్మఁ బరివేష్టించియుండఁ దారనుష్ఠించవంబూని వనివారల కెఱింగింపం దలంచి కరంబులు మొగిచి సవినయంబుగా
నిట్లనిరి ✱ సీ॥ తెల్లంబుగా దేసి కెల్లసుయోధనుఁ జేసిన మహాపదేష్టితంబు। లకటమా తోడ మీరు నడవుల నిడుములఁ బొందితి
రొక్కభంగిఁ బోయెఁ గాల। మిది పదుమూఁడగు నేఁడు మాకజ్ఞాతవాసంబు సలుపంగ వలయు నందు। ధార్తరాష్ట్రులు సూ
తతనయసౌబలులును జెలువ వేతురు దిన్నసన్న। మెఱిఁగి రేనిఁ జాల నెగ్గు నాటిల్లున। ట్లగుట మమ్మింక నతిరహస్యవృ
త్తిమైనిరస్తవిఘ్నులరై చరి। యింపుఁ డనియనుగ్రహింపవలయు ✱ వ॥ అని చెప్పి తట్టిసమయంబున ధర్మనందనుండు విష
ణ్ణహృదయుండై ✱ క॥ ఒకనాఁడేమును నాపదలకు విషమరంగాం చివిప్రులం జుట్టలఁబె। ట్టుకొని సుఖముండఁ బడయుదు।
మొకొ యిప్పాటెందుఁ గలదె యొరులెవ్వరికిన్ ✱ వ॥ అనిడగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుండగుటయు నమ్మహీసురవరులుఁ
దమ్ములును తనని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు తదీయవిషాదాపనోదనంబు చేయందలంచి యిట్ల

ధౌమ్యుఁడు పాండవులనూరార్చుట.

నియె ✱ ఉ॥ ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయవృత్తిస। త్కర్మవిధిజ్ఞతం జతురతా మహిమన్ దృఢబుద్ధి నెవ్వ
రున్ ధర్మజు పాటిగారనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైనయట్టి నీ। పేర్మికి నీడె మర్దశలపెల్లునకుస్సురపిల్లుటారయన్ ✱ వ॥ అట్లు
గాక ✱ క॥ దేవతలకైన నొక్కొ। చోవలయున కాదె శత్రుసూదనవిధికా। లావాప్తికి మునుదమస। ద్భావములడఁచికొ
నియడఁగఁబడియుండంగన్ ✱ సీ॥ నిషధాద్రియందనిమిషపతి ప్రచ్ఛన్నసంచరణమున వర్తించుటయును। నదితిగర్భంబు
నవతారమై వామనాకారమున హరియడఁగుటయును। జననియూరుప్రదేశంబున నతినిగూఢంబుగా నౌర్వుండుదాఁ
గుటయును। ధేనుశరీరశచీముఁడై యజ్ఞాతచర్య మార్తాండుండు సలుపుటయును। వినమె యిట్లుపడిన వీరులుపదపడి తమ
కునగ్గమైనతఱి జయింప। రెట్లు ప్రబలరిపుల నీవును నాపద। కోర్చి భంగపాటు దీర్చికొనుము ✱ క॥ అనవుడు నప్పలుకులు
వినితనచిత్తము కలఁకదేఱ ధర్మతనూజుం। డనుజన్ములదెసఁ జూచిన। ననిలసుతుండిట్లులనియె నాతనితోడన్ ✱ మ॥ భవ
దాజ్ఞాదృఢబంధసంయమితశుంభద్వేగమై కాకనాఁ। డవలీలన్ మనయుగ్రునద్విపము క్రోధావేశదుర్దాంతద। ర్పవిలాసో
ద్భటభంగి నేవడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి। క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీవున్ వేడ్కసంధిల్లఁగన్ ✱ వ॥ అని
నవినిధర్మనందనుండు తెలివొందిన మొగంబుతోడ శిరఃకంపంబు చేసె నట్టిసమయంబున నవ్విప్రులందఱు నొక్కమొగిన
మీతలంపులకు దైవంబనుకూలంబు గావుతనని పాండుపుత్రుల దీవించి పునర్దర్శనంబయ్యెడు మనుచు వీడ్కొని నిజస్థానంబు
లకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారంబెల్లను సముచితప్రకారంబున వీడుకోలు వడసి తమతమ సొంపు వట్లకుం బో
యిన ✱ ఉ॥ తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నురథంబుల తోడఁ గ్రోశమా। త్రమ్మొకచోటికిం జని ధర్మతనూభవుఁ
డంచు నాఁటి రే। యిమ్ములనిచ్చి వేగుటయు నీప్సితకార్యము చేయఁగా విచా। రమ్మొనరున్నచో నమరరాజతనూభవుఁ జూ

చెయిట్లనుర్జ * క ॥ మన మేపురమున నీయం । దనయుండ దొనరుగు దేరఁగా నెయ్యెడఁ బో । యిన నెఱుఁగకుండుదు రెయ్యె
దినములు గడువంగ నెద్ది దెఱఁ గయ్యెడు నో * వ ॥ అనిన నతం డిట్లనియె ॥ గీ॥ ధర్మదేవత నీమనత్కర్మమునకు । మెచ్చి యొస
యఁ బ్రీతి మైనిచ్చినట్టి వరముగలుగంగ మన మేము వర్తనమున । నెచటనుండిన నొరులకు నెఱుఁగనగునె * వ ॥ కురుదే
శంబుచుట్లం బాంచాల చేదిమత్స్య సాల్వ విదేహ బాహ్లీక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు సుభిక్షంబులు జనా
కీర్ణంబులు నతిస్థిరంబులునై నివాసయోగ్యత గలిగియున్న యవి యనివిందు వానియందు మీకుం జూడం బోలిన దొక
నగిన చందంబున నిలుచువారము గాక యనిన బ్రియంబు దిగ్ధర్మనందనుం డిట్లనియె * క ॥ అగునదియట్టిదదైవము । దగ
నిచ్చిన యవ్వరంబు దప్పునె మనకున్ । విగతభయము వాసయోగ్యం । బుగ నెక్కడ చెప్పుమి పుడు పోవఁగ వలయున్ * గీ॥ వా
కుఁజూడ మత్స్యనరపతి సద్ధర్మ । వర్తి సుజనహితుఁడ వార్యబాహు । బలుఁడు గాన నతని బాలనం దుండఁగ । వైనవనుబ
లుచుటభిమతంబు * క ॥ మనలోన నెవ్వఁడేమ్మెయి । పనివెంటను విరటు నసముపడయుడమదియె । ల్లను నేర్పెల్లఁ
యండఁ దనతనమదియున్న తెఱఁగు తథ్యము చెప్పుఁడా * వ ॥ అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌ
రవంబును గాన తని నుపలక్షించుచు నిట్లనియె * సీ ॥ మహనీయమూర్తియు మానవైభవమును సౌకుమార్యంబును సత్య
తయును । మార్దవంబుఁ బ్రభుత్వ మహిమయు నపగత కల్మషత్వంబును గౌరవంబు । శాంతియు దాంతియుఁ ద్యాగంబు భో
గంబుఁ గారుణ్యమును సత్యసారతయును । ధర్మమయక్రియాతత్పరత్వంబును గీర్తి ధనార్జన క్రీడనంబుఁ । గలిగి జను
నేలఁగా నియెన్నండును నొరులఁ గొల్చి తిరుగ వెరవు లేని । యట్టి నీవు విరటు నెట్టి చందంబున । ననుచరించువాఁడ వధిపచెప్పు
ము * క ॥ అనినం ధర్మనిర్నను । మునఁబుట్టిన వగపు భావమున నెఱిఁగియుఁ గీ । టునఁ బుమ్పచుఁ బ్రస్తుత కార్యనిరూప
దశ మెఱయఁగ నతఁడిట్లనియెన్ * క ॥ సన్యాసి వేషమున రా । జన్యుఁ గని యెపుడుఁ గొలిచి సభ్యత్వమునన్ । మాన్యుఁడ
నైపుణ్యకథా విన్యాసము నొనర్తునతని వేడుకపడఁగన్ * క ॥ శౌనస్మార్తనిమిత్త జ్యోతిర్విద్యలు గ్రహించి యోగ్యసన
యసంజాత ప్రాగల్భ్యుఁడనై । చాతుర్యము మెరసి మానసంబలరింతున్ * క ॥ ఆతనితో నొక్కొకమఱి । కౌతూహల
వృత్తి కందగఁగ దొడఁగి మ్రుకుద్యూతంబున గ్రీడింతుం । జేతోముద మొదవ నక్షశిక్షా ప్రౌఢిన్ * గీ ॥ మణిమయములుఁ
దౌతమయములునుసు । వర్ణమయములు నాదిగా వలయునట్టి । యక్షసాళులు గలవునాకభిమతముగ । వానిఁ గొనిపోయి
చూపుదు వరుసతోడ * వ ॥ మఱియు నవసరోచితంబులగు వినోదంబులఁ బ్రమోదంబు పుట్టించుచుఁ బ్రసాదంబునకుఁ బా
త్రభూతుండనయి కంకుండను నామధేయంబు ధరియించి చరియింతు నయ్యుర్వీశ్వరుం డుమత్పూర్వవర్తనంబరసెనేని ధ
ర్మపుత్రుతోడి మైత్రిం దగిలి యతని పాలవసియింతు ననంగలవాఁడనని చెప్పి యనిలతనయు నిరీక్షించి తత్కాలజనితంబు
న ఖేదంబునం దొరుఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పులడంచి ధైర్యంబవలంబించి యిట్లనియె
సీ॥ కడిమి మైసౌగంధికమునయి తులమదమడఁచి కృష్ణకుఁ బువ్వులట్టు దెచ్చెఁ । గిమ్మీరదానవు నమ్మెయి స్రగ్గించి విగతకంట
కము గావించె వనము । బకదైత్యుఁ డోడరి యాభంగి రూపఱఁ జేసి రక్షించె నేకచక్రాపురంబు । నప్పాటఁ బ్రబలు జటా
సురునడరి దండితుఁ జేసి మనఁ లబెట్టించుకొనియె । నితఁడు పుట్టిన కోలెను నెసక మెసగ । దర్పమున నవర్తిల్లెను దగ్రమూర్తి
యకట యొరుచిత్తమున కెక్కు నట్లుగాఁగ । మెలఁగి యేమి విధంబునఁ గొలుచు వాఁడు * అనిన విని భీమసేనుం డిట్లనియె * సీ
పనువంటలవాడనై యానగేంద్రుఁ । గొలిచి గరగరగాఁ గూడుఁ గూరచిత్తు । మునకు వచ్చిన యాచందమున నొనర్చి । నేర్పె
మెలఁగుదుఁ గరము వినీతిమెఱయ * ఉ॥ ఆఱురసంబులం జవులయందులఁ గ్రొత్తలు పుట్టనిచ్చులు । నేర్పెఱుకు భంగిఁ బాక
ములు విన్నను వొప్పఁగ సంఘటించిన । శ్రీమఱఁగఁ బానసీని నొకనింబురిఁ గాననియట్లుగాఁక మే । గాఱియ వెట్టియైనను నొ
కంబు గవంతుదు నెల్లకూరలున్ * గీ॥ వఱియవా పంగఁ దునియగా విఱువవలయు । నెడలఁ గ్రాళ్లను జేతుల దోడ లబట్టి క
డగియ సువుగ జేసి ప్రాయ్యాడుదుగాని । కత్తి గొడ్డలియు మొగనేఁగట్టియలకు * క॥ సూపాద్యతులుఁ డుగలిగిన । నాపురుషుని
తోడి సఖ్యమున గునట్టులుగా । నేపాటనైన నడువఁగ । నోపుదుఁ దత్తద్విదప్రయోగముల మెయిన్ * అట్లుంగాక * గీ॥ జెట్టి
పిసండంబుతోడఁ జేపట్టి పొంత । కారివిఱిచిన యట్టులఁ గలిక పిఱుతు । లాగు వేగంబు మెఱసి చలంబు నెఱపి । మల్లుతన
మున నొప్పింతు మనుజభుని * క॥ పెక్కండ్రు నెక్క పోరున । నుక్కఱిభఁ జింతుఁ జఁపుటు మగండు రాజుం । దనుభ్రీతి

పటు లెంతయు । వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్ ॥ చ ॥ అదియును గాక కోలుపులి నైనను గారెనుబోతు నైన
ను । న్మదకరి నైనను గ్రవ్యగనాథుని నైనను గిట్టి ముట్టి పె । ట్టిదముగఁ గాలఁ గేలను గడించి మగంటిమి యుల్లసిల్లఁ బ । ట్టుదు నడ
గంగ మాత్స్యుఁ డు గడు న్వెఱఁగందుచుఁ బిచ్చలింపఁగన్ ॥ వ ॥ ఇట్లు నానాప్రకారంబుల నతని మున్నన వడయుచు వలలుం
డను నామధేయంబు వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడవని యడిగెనేనిఁ బాండవాగ్రజునకు బానసంబు సేయుచున
సంగల వాఁడ ననిన విని ధర్మతనయుం డమ్మాటలకు సమ్మతించి బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుండగుచు నిట్లనియె ॥ ఉ ॥
ఖాండవ మేర్చి దేవతలు గానక యీశ్వరుఁ గాంచె దోర్బలో । ద్దండ మహాసుర ప్రతతి దర్పము డంచి ప్రియంబొనర్చియా ।
ఖండలుఁ డున్న గద్దియ సగంబు నొందె మహానుభావుఁ డీ । తం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొ
కో ॥ క ॥ అను మాటలు విని సంక్రం । దననందనుఁ డిట్టులనియె దైవంబు కతం । బున నాపను లెక్కచంద । మ్మను వయియు
న్నయ దిదీని నొఁగాదనుఁ డా ॥ వ ॥ అమరనగరంబునకరిగిన యెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన వాసవాకే
సంఘు గరుణించి యీ శాపఫలంబు భవదజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి తదనంతరంబున శాపమోక్షంబు వడ
యుమని దీవించెం గావునఁ బేడితనంబు దాల్చి బాహుల దీర్ఘత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబు
లును మాటు చేసికొని విరాటు కడకుం జని ॥ క ॥ ఉత్తమకన్యాజనులకు । నృత్తము గఱపంగ నాకు నేర్పుగలదు త । ద్వృత్త
మునకు నన్నేలుము । చిత్తమునకు నెక్కుడగు బనులు చేసెద నందున్ ॥ క ॥ అని కొలిచి యే బృహన్నల । యను నామముతోడఁ
గన్యాంతఃపుర వ । ర్తన మొనరించుచు లాస్యక । ళనమున నిపుణుండనయి యతని మెప్పింతున్ ॥ క ॥ మానవపతి నన్నెక్క
డి । దానవు నీవనియె నేని ద్రౌపదికడ సం । మానము వడసి మెలంగుదు । నా నగరున వృత్తగురువునం గలవాఁడన్ ॥ గీ ॥ అనిన
నదివోలు ననిమి యియ్యకొని యజాత । వైరి యల్లన నకులుని వలను చూచి । నెమ్మనంబున నమ్మలి కమ్మ గదుర । నెలుఁగు
చందము వేఱుగా నిట్టులనియె ॥ ఉ ॥ ఒప్పెడు మేను పెంపుగల యుల్లము నాగరికంపు చందముం । జెప్పక చూపకే తన విశేష
ము దెల్పెడుఁ గొల్చు టెంతయున్ । డెప్పర మేమి చేయుదుఁ గడిందివిచారము పుట్టె నెట్లు తం । డప్పరి సంచరించు నెకొ య
న్యులెఱుంగకయుండు నట్లుగన్ ॥ అనిన యప్పలుకులు విని నకులుం డిట్లనియె ॥ గీ ॥ అశ్వశిక్షకుండనయి మత్స్యభూమిభుఁ
గొలుచువాఁడ గుఱ్ఱములకు వలయు । తెఱఁగులెల్లఁ జూచి యెఱుఁగుదు రూపుగా । నరయ నేర్తు వానినను దినంబు ॥ సీ ॥ గోడి
గజాతిలోఁ గొదమపెంటుల నేర్చి నూవుల హత్తించు మార్దవంబు । ద్రాడులఁ బట్టంగఁ దఱియైన కొదమల సంస్థులెఱిం
గి శిక్షించు నేర్పుఁ । గళ్ళెలఁ బదిలంబు గాని గుఱ్ఱంబులఁ గ్రొత్త ముట్టునకియ్యకొలుపు వెరవుఁ । బెనఁగు శూకలముల బిరుదుత
నంబునఁ జలము డింపక తీర్పఁ జాలుటయును । నలవరించిన వాఁడ లాయమున నున్న । యపుడు దోడకించుక యు లేనియట్లు
గాఁగ । మాటిమాటికిఁ బరికించి మగఁడడీల । కెల్లనూఁ జటయగుచు వర్తిల్ల నేర్తు ॥ క ॥ దామగ్రంథియనఁగ నొక । నామము వెట్టు
కొను వాఁడ నాతో నిటి విధం । బా మనుజేశ్వరుఁ డడిగిన । నేమీ కడ వాఁడ నందు నిది తెఱఁగధిపా ॥ క ॥ అనినఁ గడు లెస్సయని
నె । మ్మనమున నూఱడి సభుండమానుష తేజో । ధనుఁడగు సహదేవునిఁ గనుఁ । గొని యిట్లను వగలు మిగిలి కొందలపడుచున్ ॥ చ ॥
అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా । త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు శాంతుఁడు గుంతి ముద్దు సే
యుకొడుకు మేను లేఁతదన యుల్లము మెత్తన యట్టి యీతఁ డెట్లొకొ యొరు నాశ్రయించు విధి యొప్పదె నెవ్వరి నెట్లు చేయ
దగన్ ॥ క ॥ అనుడు నతఁ డుదన చిత్తం । బునఁ దోఁచిన విధము ధర్మపుత్రునితో ని । ట్లని చెప్పె నాతనికిఁ బు । ట్టిన యుత్తలపాటు కొం
త డిందుపడంగన్ ॥ క ॥ కీలారితనమునకు నేఁ । జాలుదు ననికొలిచి మత్స్యజనపాలుకడన్ । మెలగునడవడిఁ దంత్రీ । పాలుం
డను పేర్మితోడఁ బరఁగుదు నధిపా ॥ సీ ॥ వంజలనైనను వలనేర్పడఁగనొక భంగిఁ జేవఁగఁ జేసి పాలుకొనఁగ । బహుగులనైన
నబాటించి పరికించి గోమున మెయిఁ గండక్రొవ్వు దేఱఁ । దెవులు గొంటులనైనఁ దీర్చి సంకటమునకోసి ముందటియట్ల రూపు
చేయ । నఱవలనైనను నలువైన వెరవున మట్టియంటఁగఁ బట్టి కట్టి విడువఁ । బిదుకఁ గదువు చేర్ప బెదరు వావఁగనీరు । మేఁపుగ
లుగు నెడల మెలఁగ మలువ । మృగమునరయు ముచ్చు రేపగలును గొట్ట । నేర్తుఁ బసికిఁ జాలఁ గూర్తు నేను ॥ వ ॥ నన్ను విరాటుం
డు మున్న నీ వెందుండుదని నిరూపించెనేని యుధిష్ఠిరు గోష్ఠంబున కధిష్ఠాతనై యుండుదు ననుచు నని పలికినఁ గొంతేయుఁ
గ్రజుండిది యుక్తంబగునని యనుమతిచేసి పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు నిట్లనియె ॥ చ ॥ ఇది కడుముగ్ధ

౩౪

రాలువను లేవ్వియుఁ జేయఁగ నేరదెంతయు । న్న్నృదు వొక్క కీడు పాటునకు మేకొనఁజాలదు డాత్తదిత్తయెం । టిడనను
డానికోర్వదొక తేనియుఁ దానవరించు చొప్పెటుం । గడుతగనెుడ్లనుంగొలువఁగా వెర వెమ్మియుఁ గల్గునక్కటా,
క॥ అనిన నతని చిత్తంబున । వెను బాటంతయును బాయు వెరవుకలిమియె । ల్లను దెలియనట్లుగాని । ట్లనియెం బాంచాలియు
చితమగు చందమ్మక్ * క॥ సైరంధ్రీ వేషంబునఁ । జేరుదునంతఃపురంబు చెంతకునన్నా । భూరమణుదేవియంతయు
గారవమునఁ బిలువనంపఁగాఁ గందుఁదగక్ * క॥ కనికొలువు చేసికొనిమా । లినినాఁ జనిసాధ్వియిది మలీనసవృత్తాంబున
సొంతఁబోవ దెన్నఁడు నను వ్రేకదనంబుదోఁచునట్లు చరింతుక్ * సీ॥ కలపంబులభినవగంధంబులుగఁ గూర్చి తనువున
నలఁదుమనసువుగాఁగ । మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు వెట్టుమఁ జెలువు మిగులఁ । బువ్వులు బహువి
ధంబులఁ గట్టి ముడికొక్క భంగిగా నెత్తులు వట్టియిత్తు । హారము ల్మెఱయు నొయ్యారంబులుగ గ్రుచ్చియందంద విరుగ
నలవరింతు । వివిధశిల్పములఁ బ్రవీణనై మఱియును । వలయు పనుల వెంట మెలఁగ నేర్తు । మత్స్యరాజు మహిషి మనమున
మక్కువ । నెఱకొనంగ నిట్లు గొలువ నేర్తు * క॥ మును నీ వెచ్చోట నిలుతే । వని మెయి వర్తిల్లుదని నఁ బాంచాలికి నే । నమ చాన్ని
నైతఁ గంబఁ దినగరువపుఁ బనులు నేర్చి చేయుదునందుక్ * అనవుడు ధర్మతనయుండు ద్రుపదనందనకిట్లనియె * క॥ సువ
వంశంబున వృత్తంబును బెంపున గావఁ జాలు పుణ్యసతి వీడు । జ్ఞను లగుతులు వలమున ములు । గనుఁ గొనియేమఱక మెలఁ
గావలయుఁ జామీ * వ॥ అనిన వినియాజ్ఞ సేది సాదర మందస్మిత సుందర వదనారవిందయు యితనికిట్లనియె * క॥ స
రయ నెందును గౌరవ । భారం బెడలంగనీక పాతివ్రత్యా । చారము మైవర్తింతురు । సైరంధ్రీ జాతివారు సౌజన్యమునఁ
క॥ కావున నుచితములగునా । కావెంటం గొలిచితిరుగునప్పుడు మితభా । షా పిరచనమును వ్రతసం । భావనమును గౌరవ
బుఁ బాపభయంబుక్ * క॥ అని చెప్పిన వినియగుఁ బొ । మ్మని కైకొని ధర్మతనయుఁడందఱమును వి । ట్లన పాయత వర్తిల్లుదు
మని తమ్ములతోడ విశ్వయంబుగఁ బలికెక్ * వ॥ ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల స్ని
ధౌమ్యులు రక్షించువారు వంటలవారు మహానసాధ్యక్షులును బాంచాలి పరిచారికలును ద్రుపదుపురంబున నిలుచువారు
రథంబులు గొనియింద్రసేనాదులయిన సారథులు ద్వారకానగరంబునకరుగువారు వీరెల్లను దమ్మెవ్వరైన నమమనవార్త
లడిగిరేని ద్వైతవనంబున మమ్ము విడిచిపోయిరట యెఱుంగ మనంగల వారని చెప్పియు త్తెఱంగున నభ్యంతరపరివారంబుని

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱిఁగించుట.

ల్లనిలువనియోగించి వీడుకొలిపె నయ్యవసరంబున ధౌమ్యుండు పాండుకుమారులకిట్లనియె * క॥ ఎఱిఁగెదు వారికైనను । గఱవకతక్కరుచిత ప్రకారము లెల్లం । గొఱలు హితులట గుటనం । డఱకును జెప్పంగ వలయుఁ దగియెడు బుద్ధుల్ * అది
యునుంగాక * గీ॥ కౌరవాన్వయ జాతులై గారవమునఁ । బెరిగినట్టి మీరొండొకనరునిఁ గొలిచి । మసలి వర్తిల్లి మానావమా
నములప । నోర్చియడఁకువతోడుతనునికియరిది * క॥ వాలి విపిధాస్త్రశస్త్ర । జ్వాలల వెలుఁగొందు పాండవజ్వాలను
బా । భీతలమండం దొడరినఁ । గాలవిరోధంబును చిత కార్యముఁ దప్పక్ * వ॥ కావున మీకు నప్రమాదార్థంబుగా నా నేర్చిన
విధంబున నుపదేశంబు సేయుట యవశ్యకర్తవ్యంబు రాజులఁ గొలిచి యెమ్మెయినయినను బ్రదుకు జనంబులు గీడునొరయ
కుండునట్టి సాధారణనీతి సంక్షేపంబుగా నెఱింగించెద సావధానులగయి వినుండు * క॥ తగఁ జొచ్చి తనకునర్హం । బగునె
డఁ గూర్చుండి రూపమవికృతవేషం । బుగ సమయమెఱిఁగి కొలిచిన । జగతీవల్లభునకతఁడు సమ్మాన్యుఁడగుక్ * క॥ నరనాథు
ఁ గొలిచియలవడఁ । దిరిగితి వాకేమి యనుచుఁ దేఁకువలేక । మ్మరియాద దప్ప మెలఁగినఁ । బురుషార్థంబునకు హానిపుట్టకయు
న్నే * ఉ॥ రాజగృహంబు కంటె నభిరామము గాని లుగట్టఁ గూడదే । యోజన్నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచ
రించునే । యోజవిహారముల్ సలువనల్లమునంగడు వేడ్క చేయునే । యోజవిదగ్ధుఁడై వలుకు నొడ్లకునుండగ డట్లు చేయఁ
గక్ * క॥ పుత్రులుఁ బౌత్రులు భ్రాతలు । మిత్రులనరు రాజులాజ్ఞమీఱిన చోటక్ । శత్రులకాఁ దమయలుక సుఁ । మి
త్రము చేయుదురు నిజశుభస్థితిహానిక్ * క॥ చను వాని చేయు కార్యం । బునకడ్డము చొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా । ను
నుబయిఁ బూసికొనిన దర । మును మెలఁగెడు మెలఁకువ కును ముప్పగుఁ బిదపక్ * గీ॥ రాజునొద్దఁ బలువురకు సంకటంబు
గాఁ దిరుగువనుల నెంత తేజనయినఁ । నానిబుద్ధి గలుగు వాడొల్లరట్లు మీఁదఁ । జేటు దెచ్చు నెట్లు సిదముగుట * క॥ ఊరక

యుండక వలువుర । తోరవ మెసఁగంగఁ బలుకఁ దొడరక యుమదిం । జేరువ గలనాగరికులఁ । దారఁగలసి పలుక వలయు ధరణీశు కడన్ * క ॥ వేఱొక తెఱఁగున నొరులకు । మాఱాడక యునికి లెస్స మనుజేంద్రునకుం । వీఱిమిగలచోటులఁ దా । మీఱిక డఁగి వర్తింపు మెయి కొనవలయున్ * చ ॥ ధరణిపు చక్కఁగట్టెదురఁ దక్కఁ బెఱుందును గానియట్లుగా । నిరుగెలనం దగం గొలిచియేమను నోరెయెటుచూచునొ కొక్కయె । వ్వరిదెస నెవ్వఁడే తలఁపు వచ్చునొ యీతని కంచుఁ జూడ్కి ను । స్థిరముగఁ దన్ముఖంబునన చేరిచియుండుట నీతి కొల్వునన్ * క ॥ నగళులలో పలిమాటలు । తగు నే వెలినుగ్గడింపఁ దన కేర్పడనొ । డుగడం బుట్టింపఁ బతి విన । నగు వని చెప్పెడిదిగాక యాతనితోడన్ * క ॥ అంతిపురము చట్టలికం । భేంతయుఁ గీడంతకంటె నెగ్గతవీద్యో । పాంతచరకుబ్జ వామన । కాంతామలతోడిపొందు కలిమి భటునకున్ * గీ ॥ ఉత్తమాసనములు నుత్కృష్ట వాహనంబులును గరుణఁ దమకు భూమిపాలుఁ । డీఁ దారయెక్కుటెంతటి నన్నన । గలుగువారికైనఁ గార్యమగునె * క ॥ మన్నన పుబ్బక యవమతి । దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశు కడన్ । మున్నున్నయట్ల మెలఁగిన । యన్నరునకు శుభములొదవు నాపదలడఁగున్ * క ॥ జనపతి యెవ్వరి నైనను । మనుపఁ జెఱుపఁ బూనియునికి మదిఁ దెలియ నెఱిఁగి నైనఁ దాను వెలిపుచ్చ నేమును మున్నెట్టి పాలసుం డనుదానిన్ * ఉ ॥ ఎండకువానకోర్చి తనయిల్లు ప్రవాసము చోటనాకయా । కొండును లంగుదు న్నిదుర కుందఁ జెదప్పెను దప్పి వుట్టినా । కొండన రెట్లొకో యనక కార్యము పుట్టినచోట నేలినా । తండొక చాయ చూపిన నుదత్పరతం బని సేయుటొప్పగున్ * క ॥ తానెంతయాప్తుఁడైనను । హీనాయకు సొమ్ము పాము నెమ్ములుగాఁ లో నూనిన భయమునఁ బొరయక । మానినఁ గాకేలగలుగు మానము బ్రదుకున్ * గీ ॥ ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు సుప్తవర్తనములు గాఁగ । సలుపవలయు నృపతికొలువున్న యెడల బాహిరములైన గెలని కెగ్గులగుట * క ॥ వైరులదూతలు నేరము । వారుసరాకృతులుఁ బాపవర్తులు దనకున్ । జేరువగా వర్తించుట । నేరమితుది బొరయఁ జేటు నిందయు వచ్చున్ * గీ ॥ వసుమతీశుపాల వర్తించు నేనుండు । తోడనైనఁ దోమతోడనైన । వైరము సతెఱఁగు వలవదు తా నెంత । పూజ్యుఁడైన జనులపొందు లెస్స * క ॥ కలిమికి భోగములకు దా । ఫలమని తా మెఱసి బయలు పడఁ బెల్లుగ నిచ్చలవిడి భోగింపక వేడ్కలు సలుపఁగవలయు భటుఁడడంకువతోడన్ * వ ॥ అని యిట్లు పురోహితుండు సేవాధర్మంబు లెఱింగించిన ధర్మజ భీమార్జున నకులసహదేవులు ప్రసన్నచిత్తులై యిట్లనిరి * క ॥ తల్లియుఁ దండ్రియు దైవము । నెల్ల సుహృజ్జనులు మీరయిట్లు కొలిచి వర్తిల్లెడు తెఱఁగు లెంతయుఁ దెల్లముఁ జేసితిరి బ్రతికితిమి మీకరుణన్ * గీ ॥ అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీవత్సర । మకటమొట్టులయినను సగిమడఁగి । సంకటములకోర్చి చరియించి యాపద । నిస్తరించిపిదప నెగడవలయు * క ॥ అనవుడు నట్లన చేసెదనుని వారలు భక్తియుక్తి నతనికి సభివందన మొనరించిన దగుదీ । వనలిచ్చెనతండు గాఢవాత్సల్యమునన్ * క ॥ భూదేవోత్తము నాశీర్వాదంబునఁ బ్రీతిఁ బొందివారలు ప్రస్థా । నాదరపరులగుటయును । మ్మోదావహ పుణ్యకర్మములకుద్యుక్తుఁడై * గీ ॥ అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలముగ నొనర్చి కాల్యపూజ దీర్చి । యానసమయమంగళార్థంబులగు మంత్ర । సంచయంబు దగ జపించుచుండె * వ ॥ తదనంతరంబ వారు తపోహులకుఁ బురోహితునకుఁ బ్రదక్షిణంబు చేసి యమ్మహీసురవరేణ్యు ననుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును దోడనయరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణదేశంబు నుత్తరంబునఁ బాంచాలజనపదయామ్యదిగ్భాగంబున సాల్వశూరసేనవిషయంబులలోనఁ గాళిందీదక్షిణతీరంబొఱసికొని పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వ్యాహారంబుల శరీరయాత్రలు నడుపుచు నానావిధ విహారంబులను మనోహర కుసుమకదంబగంధ మకరంద బిందుసందోహ సుందర తరుచ్ఛాయాసేవనంబులను గమలపరాగపరంపరా ధూసరిత భాసుర జలాశయసమవగాహనంబులను సరిత్సంగమ స్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకార పాదపగుల్మలతావలోకనంబులను బక్షికులప్రకారానేకభంగి విరుతాకర్ణనంబులను వినోదించుచుఁ గాననమార్గంబున నరిగి మత్స్యమండలంబు గదిసి ధౌమ్యుని వీడుకొని నవ్విప్రవరుండు నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వారును ల్లుచొరకయడవి తెరువుల నడిచి విరాటునగరంబున కనతిదూరంబ సకాంతారంబునఁ దఱిసి పోవుసమయంబునఁ బథశ్రమంబునూని యాజ్ఞసేని యిట్లనియె * ఉ ॥ డప్పి జనించె వ్రేళ్ళులపుటంబులు పొక్కె దొడం గెగొల్లలొఁ । జిప్పిలఁ జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడున్ వశంబుగా । దప్పురమిచ్చొ టచ్చొటను

నాసలవచ్చితి నెంతదవ్వొకో। యిప్పటి భంగి నొక్కఁడును నేగెడు దానికి నోర్వ నెమ్మెయిన్ ॥ వ॥ అనవుడు * క॥ తనమదిఁ
గరుణయు ఖేదంబును బెరిగొనుచుండ ధర్మపుత్రుఁడు నకులున్ । గనుఁగొని ద్రుపదాధిపనం । దన దెసయాతనికిఁ జూపి పెం
నిట్లనియెన్ ॥ గీ॥ అశకటమనమువచ్చినదికడుదవ్వు నేఁ । డవ్వరంబు సోత్తమనితలంచె। తఱిమినడిచితిమిలతాతన్వియిటు
డఁగొనియె మోచి తెమ్ము కొంతదవ్వు * క॥ అనినవిని పూని గ్రక్కునఁ। జను దేరమి నతఁడు డస్సెఁ జాలండని నెమ్మనమున
నెఱింగి యాతని। యనుజన్మునిఁ బనిచెనతఁడు నలసుండయినన్ ॥ వ॥ సవ్యసాచిం జూచి ॥ ఉ॥ ఇమ్మదిరాక్షి డస్సె మనకీవన
మర్వ్వడి యంగనొందుచో। టిమ్ముమ గాచు నిక్కముగ నేము నుడస్సితి మట్లుగాననీ । వెమ్మెయి నైన దీవి భరియించి పురంబున
మీప భూమికిం। దెమ్మని చెప్పె వాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుప్పకోమలిన్ * క॥ మోచికొని వాసవాత్మజుఁ। డాశ్రి
లువం దేరనిట్టులరిగి పురముదృ। గ్గోచరముగుట యెఱుఁగ దమ్ములఁ । జూచుచు వారలకు ధర్మసుతుఁ డిట్లనియెన్ * క॥ చక్కటిఁ
క్కని మేనులు। నిక్కోదండములుఁ జూచి యెటులుఁగ రెమనమీ । చక్కటి నిలుత మెశస్త్రము। లొక్కెడ దాఁచుటకు వేసమ్మా
జనములకున్ * వ॥ అనిననది గార్యంబని పాండవమధ్యముండా పుమధ్యనొక్క శీతలసిత తాతలంబునడిం చెదక్కన వాడు
నట్లచేయుదమనిని లిచిరట్టినొడఁ బాండవాగ్రజుండు గాండీవిచేతి విల్లుపలక్షించి యాతనికిట్లనియె ॥ క॥ మనశస్త్రాస్త్రం
బులు దక్కినయవి యొకభంగి వీటికిని గాండీవము । గొనఁ బోయితిమేని సురయో। ధనునకు నగపాటు నిశ్చితంబు హింవన్
అనవుడు ॥ చ॥ ఇది పెనుశాముచందమున నెంతయు భీషణమై జనంబుల । న్బెదరఁగఁ జేయునట్లగుటఁ బెట్టిచనన్వలయు
దలంపనా। హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొరదెట్లు జెప్పినం। దుదినొకచోట వైచుట యొదొఁచిన కార్యము
య్యెడుంగటా ॥ వ॥ అనివితర్కించుచుఁ గిరీటి యురియా పుదిత్తంబును త్తలంబు డిపికొని యాయుధంబులు నిక్షేపించు
యకర్జంబుగాఁ బలికి తెలాగ్యస్థలనిరూపణంబునకునలుదిక్కులుం బరికించి ప్రేతభూపరిసర కారణ్యంబునందు ॥ సీ॥ నెక్కి
నకొనలేదినింగి యంతంతకునవులఁ ద్రోవఁగఁ దనరారుదాని । సాగిన శాఖలా శాచక్రముల కొలఁదులు వాఱఁబెట్టంగ
బొలుచుదాని। గవటలొండొంటితోఁ గదియుచు నెడమఁ లుద్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని । లోఁ జొఁపము పవలుప
బెనుజీకటినొదవించి పొదలంగ నొప్పుదానిఁ । గనియొఁ బవమానవివిధవర్తనకళాసి। వర్తిఁ గాకఘూకారవ స్ఫూర్తి జాల
భీతివరిసరవర్తినాభీల భుజగ। చండమూర్తిశమీ తరుచక్రవర్తి * వ॥ కనియన్మహీరుహంబు ధర్మనందనునకుం జూపి యి
ట్లనియె ॥ శా॥ పక్షివ్యాకులమంబరేతనిలయ ప్రాంతోత్థమున్ డాకినీ। రక్షోభూతపిశాచగోచరము దుర్గంధంబు నైప
డఁజె। త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెంతం జేర రాదీశమీ। వృక్షం బెవ్వరికిం దుబెట్టుద మెవృథ్వీనాథ శస్త్రాస్త్రముల్ ॥
క॥ పెనుబోడవు పరవుజొంప । మ్ము నుగలయది దీని నెల్లపురుషులకఁ బ్రరియో । జన మొకఁడు లేమ సేరం। జనఁ జూడఁగనెవ
యనేక్కసమకట్టంగన్ * ఉ॥ కావున దీనియందిపుట కార్యము గైదువలెల్లఁ గేశచ। గ్మావృతసంచయంబగుశవాకృతిగా
నొనరించి కట్టినం। బోవరు దీని దిక్కునకుఁ భూవర నెమ్మదినూఁ ఱడిల్లుమె। చ్చోచవ సియించినఁ బిసవఁ జొప్పడుఁ గ్రస్సరవర్తి

పాండవులు దమయాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట.

కైకొనన్ * వ॥ అని చెప్పియందలున తెఱంగునకియ్యకొనుటయు నతండు గాండీవంబున వలోకించి ॥ చ॥ అనిమిషదాన
వాంబరచరాదికజాతుల నెల్లఁ బోరనీ । దనువునఁ గాదె గెల్చితి నుదగ్రవిరోధిభయావహంబు దీ । నినినొక మ్రానఁ గట్టిన
నిశ్చయముందఁగఁ జేసెదై వమే। మనఁగలదట్ల కాక యనియాత్మ నలందురి మందచేష్టుఁ డై * వ॥ ఎక్కుడించెఁ బాండవా
గ్రజుండు * క॥ సనుజకుల త్రాసకరం। బును రిపుభంజనము రత్నభూషితరూపం । బును గురుదేశాప్లోదక। మును నసిడి
కార్ముకంబు మోపెడలించెన్ ॥ వ॥ తదనంతరంబ భీమనకుల సహదేవుల దెసఁ గనుంగొని * సీ॥ సైంధవయతపాంచాలీ
గర్తలదీనన రొహార్చితి మానధనుఁడ। సౌరాష్ట్రనాధాదిశత్రులు దీనిచేఁ గాదె పుర్దితులై రిఘవభుజుండ । కాలింగపాండ్య
మాగధులనిర్జించ చోనిదియ కైదువ నీకు విదితయశుఁడ । యనిక్రమంబున వారలందఱు విండులు పెంపెసలారవేత్తే
రఁ బొగడి। గొనయములు వదల్పననుమతి సేయుఁడు । వారలట్లచేసి తేరఁ జావ । ములును దొనలు వర్మములునసిమద్గరా
ద్యాయుధములుగూడ నతఁడు గట్టె ॥ వ॥ ఇట్లు పూర్వోక్తప్రకారంబునం బొదివి మహోరగంబులం బెట్టికట్టుచందం
బున బంధించి వానిం గొనుచు నయ్యజాతశత్రుండు ధర్మదేవతాదత్తవరుండగుటం జేసి నిశ్శంకంబయిన యంతఃకరణం

ఋతోడశమీవృక్షసమారోహణంబాచరించి * గీ॥ బ్రహ్మ విష్ణు మహేశదిక్పాలచంద్ర। సూర్యవనదేవతాపితృ స్తుతులొనర్చి। వివియుభయియునుజూచి ప్రార్థించి యొక్క। విపులశాఖనాయుధములు వ్రేలఁగట్టె ॥ వ॥ ఇట్లుగట్టి తదీయాధిదైవతంబులను ధ్యానించి నమస్కరించి * క ॥ నకులనకునాతునదక్కఁగ । నొగులకుమీరూపుచూపకున్నతవిషః। స్ఫురితభుజంగాఘభయః। కరమూస్త్రాలుదాల్చియుండఁగావలయుఁజుఁడీ * ఉ ॥ భీముఁడుగ్రధార్తరాష్ట్రుఁ నెడభీషణరోషముఁ బూదిగ్రమెప్పఁడే। శైనుదమె త్తునోయితనియాగ్రహవృత్తిలోనుగాకమీ । రేమెయినైనవంచనవహించితొలంగుటమత్స్యమీహితం। బేమఱకుండఁగావలయునివ్విధమార్గములోనవారలై * వ ॥ అనివేఁడుకొనివృత్తుఁబుసిగ్గిదానికిఁ బ్రదక్షిణంబుగా వచ్చి ప్రణమిల్లిభీము పేరు దెలసురలి సాంత్వనవచనసమేతంబుగా నతనింగౌఁగిటం జేర్చుకొనియాపునయించితము చేసినవిధంబు తత్ప్రదేశస్థులయినగోపాలాదికులు ద్రజనంబులవిషయిఁగు వెట్టందలంచి వారలకభిముఖులై పాండునందను లిట్లనిరి ॥ చ ॥ ఇదిశతవృద్ధమాజననియివ్వనుమృత్యువుఁజెందెనిట్లు చే । యుదుముసలప్రయుక్తమగుచున్నసనాతనధర్మమి త్తైఱ। గదమానకర్మమొల్లనిదిగానిదిగామునునిశ్చయించిమా । మొకలిటివారొనర్చువిధముంగొనియాశితిమేము య్యోర్వర్ణ * వ ॥ అనియిట్లుపలుకుచుందెలియఁబరికిశస్త్రాస్త్రంబులనిక్షేపణంబు నిగూఢంబగుటకునూఱడిల్లియచ్చ్చవంజవ్వినవసరంబునుపడియున్నంజూచిసహదేవుండనిధర్మతనయుండు దానిచర్మంబొలిపించితెప్పించి శీతవాతాతపవర్షపరిహారంబుగానాయుధంబులకట్టఁబొదివించినఁజేయును దత్సమీపంబుననున్నశవంబు నవలోకించియిదియుం త్రవృత్తిమైనమానవు క ళేబరంబుగావలయునని చునదియును గైదువులకట్టపయిఁ బెట్టికట్టించెఁ విధంబున నత్యంతకుష్టయాచరించిదీనిమగ్గంధంబునవనచరాదులెవ్వరుం జేరరనినవ్వుచు వారలచ్చోటువాసి విరాటపురాభిముఖులయిచనుండి యజ్ఞాతవాసకాలంబునఁ దమరహస్య వ్యవహారంబునకు ననువుగా నేవురపేళ్లును గ్రమంబున జయుండునుజయంతుండునువిజయుండును జయత్సేనుండును జయద్బలుండునననిసంకేతించుకొని యాజసేనీపురస్సరంబుగాఁబుణ్యనదీతీర్థావతరణంబుచేసి తదీయస్నానపానంబులఁబథశ్రమంబవనయించి దేవర్షిపితృతర్పణ మంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబులొనరించిరి తదనంతరంబ యుక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుండయి నిర్మలచిత్తంబునధర్మదేవతందలంచియిట్లనియె * గీ ॥ తండ్రి నీవునాపుదయతోడఁ బెట్టిన। వరముచిత్తగించి వలయుతెఱఁగు। సమయసముచితముగసమకట్టుమయ్యయిా। గాపుమాపులఁదీఁబోకయుండ * వ ॥ అనుచుననుజులదెసకుమూఁవగచిడగ్గుత్తికవెట్టిముఁజియును * ఉ॥ అంబరవర్తివైనఁగనియత్తునిచేనగపడ్డవీప్రాణంబులుమున్ను నిన్నడిగినల్పోరకున్నయవిక్రమప్రభావంబులు వేఁడికొన్న నతివత్సలభావముఁ బొందియాదరార్ద్రంబగుచూడ్కితోఁ బ్రియహితస్థిరభాషలనూఱడింపవే * వ ॥ అని తారుమున్నుభూసురవరు నరణిదేరనరిగిననాఁడు సరోవరతీర్థంబునఁ దమకుధర్ముండు చేసిన మన్ననదోఁపవిన్నవించినవాఁడై కరకమలంబులుమొగిచి ఫాలభాగంబునంగదియించి సంప్రార్థనంబుగా వినయవినమితమస్తకుండగుటయుఁ దదనుగ్రహంబునఁ బాండనాగ్రజునకునున్నయునికిన సన్న్యాసిరూపంబలవడి ధాతువటదండకమండలు కలితమూర్తియయ్యెనయ్యవసరంబున వారందఱు మహాద్భుతంబందవారివారికి నయ్యైవేషంబులకనుగుణంబులగునంబరాభరణమాల్యాద్యుపకరణంబులుసన్నిహితంబులయినంజూచినంతసిల్లియెల్లవారింగలయంగనుంగొని క్రమంబున నొంటిమేయింజను దెండనినియోగించియతండునానావిధంబులయిన యత్నంబులమడిగత్నంబుననిడుకొనినైనయోగంబున విరాటుండువె

ధర్మరాజుసన్న్యాసివేషమున విరటుఁగొల్వవచ్చుట.

కువచ్చిబయలికొలువిచ్చుటం జేసితదాస్థానంబు చేరంజనునవ్వాడు * ఉ ॥ దవ్వులఁజూచిమత్స్యవసుధావతియాచనుదెంచుచున్నవాఁ। డెవ్వఁడొనాదుచూడ్కులకునెంతయు వ్రేఁగయితోఁచెనిట్టితం । డెవ్విధిఁబొందెనోజగములెల్లనునేలఁగఁజాలు తేజమా। మువ్వురతోడజోడగునుమూర్తియతీంద్రునియొప్పగంటిరే * సీ ॥ కరచరణాద్యంగకమ్ములేలోలోరత్నభూషణప్రకరంబు పొందదోఱఁగె । నుభయపార్శ్వంబులనిభఘటలేలొకోచనుదేవు సమదాళిసమితి మొరయఁ। బాయతోలంగుమంచాయత వేత్రహస్తులమొత్తమేలొకొతోడరాదు। ధవళాతపత్రముల్లలుచుగానేలొకొవట్టరుమాక్తిక ప్రభలువెలుఁగ। తఁడురాజగురాజునునింతమాత్ర । గాదుమూర్ధాభిషిక్తవర్గంబునదు। చరణయుగ్మంబు

గొలిపింపఁజాలు సార్వభౌము పదవికిఁ దగియెడు భంగి వాఁడు * క॥ మనకడకు నేమిటికి వచ్చెనొకో యేనిమ్మహాత్ము చెప్పిన
పను లెల్లను జేయువాఁడఁ గోరిన । కనకాంబరవాహనములు తలఁపుగడవఁగ నిత్తున్ * గీ॥ మత్స్యవిషయరాజ్యమహిమయు
న్నందు । గాఁగఁ దలంచె నేనిగారవమున నట్ల చేసి భక్తిననుసరింతునమాత్య। సుతసుహృద్భృత్యయుతము గాఁగ. వ॥ అ
నిసమస్తజనంబులు న దభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు చేయఁ దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరిం
చియతని యాశీర్వాదంబులు గైకొనిసగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచిత సమున్నతాసనంబున నునిచిన
యావనతుండయి * ఉ॥ ఎయ్యది జన్మభూమి కులమెయ్యది యెయ్యది యున్నచోటు పే । రెయ్యది మీరలిందులకు నివ్వు
వచ్చినదానికిం గతం । బెయ్యది నాకు వింతయను నేర్పడఁగా నెఱిఁగింపుఁ డన్న రూ । పమ్యెడు నావుకున్నరవరాగ్రజుఁ
య్యతిముఖ్యుఁ డిట్లనున్ * గీ॥ ఉన్నరూపపలుకు నన్నరు లెక్కడఁ । గలరు తోఁచినట్లు పలుకుపలుక। నైన చందమెత్తె
నంతియ కాకంత। వట్టి చూడఁగల రేమెట్టివారు * అనిమందహాసంబు చేయుచు మఱియును * క॥ నానావిధభూతమయ
ము। మేనతిచంచలము నిజము మే కొనిని క్కఁ। బేనరు చెతుఁ జెల్లింపం। గానగు సత్యంబు నడుపుక్రముమట్లుండెన్ * వ॥ అ
చుమత్స్యమహీవల్లభున వలోకించి * క॥ ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ । సుజనప్రియుఁడయిన ధర్మసుతుసఖుఁడఁ గంక
వ్రజనాశ్రమకలితుండను। నుజవల్లభయోగ్యబహువినోదపరుండన్ * క॥ ద్యూతక్రీడకుఁ గొండొక। నేతుం గపటము
ననోర్వనిజనంబులు నా। చేతి ధనమెల్లఁ గొనివరి। భూతియు నెర్చినవిరక్తి పొకమి వెడలితిన్ * చ॥ నృపనయవిద్యకుఁ
న నేర్పులవడ్డదిగొంత నాకుఁ ధ । ర్మపరులసంగతిం దగిలి మచ్చికనుండుదుఁ బేరుకంకుఁడే । వపుఁగొలువైన వాకునిలువన్న
గొల్వదుగాన నిన్నుఁ భూ। మివతులలోన సాధుజనమిత్రుఁడ వావిని కొల్వ వచ్చితిన్ * గీ॥ వత్సరంబున గడచను వ్రతము
నాకు। దానినీపాలసల్పియు త్సాహవృత్తి। మెఱయ నీకుఁ గృతజ్ఞత నెఱపితొల్లి। యెగ్గు చేసినవారి జయింపఁ బోదు * వ॥ అ
నవినిసంప్రీతచేతస్కుండగుచు విరాటుండతని కిట్లనియె * గీ॥ అట్ల చేయఁడు గురుఁడ రోన్నతాసనములు। వాహనములు భోజ
నములు వస్త్రములును। వలయుభోగంబులును నెల్లవర్తనములు। నాకు నెట్లట్ల మీకును నడపువాఁడ * క॥ నాయనచరులం
దెవ్వఁడు। మీయెడ భయభక్తి లేకమిగిలి మెలఁగెనే । నాయధముని దండింతుఁ గాఁ । జేయుదు నతఁడెంతయుం బ్రసిద్ధుఁడ
యునన్॥ అట్లుంగాక * చ॥ వెలయఁగ మత్స్యరాజ్యపదవిం బగిపాలన చేయఁగా ముదిం। దలఁచుటయెంతయుం బ్రియము మ
మ్ములుఁ బుత్రులు బంధులుం బ్రథా। నులును బలంబు నేను సుమనోపిభుతుల్యుఁడవైన నిన్ను మి। క్కిలియును భక్తిఁ గొల్చెద
తక్కృత్యత నెంచుదు మట్లు చేయవే * వ॥ అనిన విని దరహసితవదనుండగుచుఁ బాండవాగ్రజుండతని కిట్లనియె * క॥ ఏప
హావిష్యము గుడుతును। భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మీఁ । బూని వ్రతంబులు సలిపెద। వానికి నిన్నియు ననువిళ్లు
వలయునె చెప్పుమా * గీ॥ అనిన విరటుఁ డిట్టులనియె నెత్తెఱఁగున। నడవ నిష్టమట్లు నడది మీకు। మనసువచ్చినన్ని దినముల
గడుపుఁడి। చొప్పటన దియ మాకు శోభనంబు * క॥ ద్యూతజ్ఞుల దెసఁ గొండొక। ప్రీతియుఁ గలదట్లు గాక పెద్దలరగు మీ రేతె
ఱఁగున విహరించినఁ। జేతోమోదంబు తగవ సింపుఁడు నెమ్మిన్ * వ॥ అని పలికి కౌంతేయాగ్రజున త్యంతసంతుష్టాంతరం
గుం జేసె * చ॥ పొరిఁబొరిఁ బ్రీతికిం దగన పూర్వవిలోకనమాచరించుఁడ। త్వరమగుసద్వివేకమున భావనిరూపణ చేయఁ
గౌతుక । స్ఫురణగరంబు దత్కరముఁ బొందనయంబునఁ జేర్చు వాక్యవి । స్తరచతురత్వమేర్పడఁగ సల్లపనంబొనరించు నన్
తోన్ * వ॥ ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దాను నుచిత సంభావనాతత్పరులై యుండిరంత।

## భీముఁడు వంటలవాఁడై విరటుఁ గొల్వ వచ్చుట.

సీ॥ చట్టువం బొక చేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి సురియతో బిగియ దిండు । గట్టి వనును జేలకప్పెంతయును జెన్ను చేయఁ
గడావలి చేతియందు। బెడిదంపు కోలలు బెడగొంద బహువర్ణచిత్రితాజినము పై చీర గాఁగఁ । జూపఱు లెల్లనుఁ జూచి కరా
వంబు ప్రేంగైనన త్యంతవిస్మయంబుఁ । బొందుచుండ సమీరణపుత్రుఁ డర్క। జుండు పోయిన దెసదప్పనొండు వలన సమద
వారణపతి గమనమున మత్స్య। ధరణి నాయకు సభ చేరనరుగుటయును * వ॥ అంతంతం గనుంగొని * క॥ ఉలుకును వెఱ్ఱు
పాటును। దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం । డలఘుభుజ విపుల వక్షస్స్థల రేఖాకాంతిఁ బరశత్వముఁ బొందెన్॥
వ॥ ఇట్లతని రూపాతిశయంబునకు నోటువడి చూచుచు నిజాంతర్గతంబున * క॥ విహరింపమాన వాకృతి। సహితంబుగను

హితకార్థిఁ జనుదెంచినవాఁ డ్మహితుఁడో హిమకరుఁడో శచీ। గృహమేధియొ కాకయితఁడు గేవలనరుఁడే * ॥ఏమికులంబు నవాఁడొకో। నామం బెద్దియొగునొకో నాభృత్యులలో।నీమనుజోత్తముఁ డొల్లియు। నేమెఱుఁగుదుమనఁగ నచట నెవ్వరుఁగలరో * క॥అనుచుండ వనితదూరం।బునకల్లన వచ్చి పవనపుత్రుఁడు మనుజేం। ద్రునకు జయశబ్దయుతముగ। వినయంబున మ్రొక్కి విన్నవించె బ్రీతిన్ * శా॥దేవా నాలవజాతివాఁడ నిను సద్భింగొల్వఁగా వచ్చితి। స్సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీచిత్తంబున న్మెచ్చిన। ట్లేవండైఁగను నేర్తు బానసము నండిచ్చోట నేకామన। న్నేవీటన్నిగులంగ నెవ్వఁడును లేఁడే ళంగులం జూచినన్ * క॥పేసవలలుండు గూతు। జీరయునిడిసాతంబు చేసినఁజాలున్।గోరినవంటకములు నా। నేరిమి నగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్ * చ॥అనవుడు మత్స్యభూరమణుఁడాతనికిట్లను నెట్లు శూద్రుఁగా। వినఁదలఁపంగవచ్చు ధరణీభరణక్షమమూర్తి వీవు నీ। కనుగుణమైన యానమును నాసనమున్రుచిరాతపత్రమున్। జనుపరిగొల్వ విచ్చెద గజవ్రజముం బరికింపు మెప్పుడున్ * క॥అనుటయు మొగ్గకుచుండ।బున మోసమ్మగడల్చి భూవిభుఁడు సభా। జనముఱు విననసిలజుఁడిట్లనియెం బ్రస్ఫుటనిర్గళలాపముల్ * ఉ॥నాకవియెల్ల నేలవరనాథులకుం బ్రియమొండునట్లుగాఁ। బాకము సేయ నేర్తు జనపాలక ధర్మసుతుండు పెద్దయుం। జేకొని యొంతు శాసనము చేయుపిధంబున కిచ్చ మెచ్చిపు। ణ్యాకరమూర్తివైననిను నాత్మఁ గొల్చినయట్లకొల్చెదన్ * చ॥ వలసిన నేలు మేను బలవంతుఁడఁగా రెను బోతు దంతిజె। బ్బులి మృగనాథు నింద్రోదరి పోరుమహూరతయుల్లసిల్లఁగా।దలమున లావు విద్యయె యిదర్పము పేర్చి పెనంగు జట్టిమ।ల్లుల విఱుతున్నడిగ్గడెయాలోనన చూడ్కికి వేడ్క చేయుదున్ * క॥కొలువు గొను మొల్లకుండుట। గలిగినఁ బొమ్మనుట యంతకం టెను మేలే। వలసినక్కడకే గెదనీ। తలఁపె మ్యాదియహానతిమ్ము ధరణీనాథా * వ॥ అనిన విని భూనాథుండు సామనయంబుగా నిట్లనియె * ఉ॥ఇమ్మహనీయరూపమున కేడై అగన్గాన నీకు వేడ్క యో। గ్యమ్ము గుభంగిఁ జెప్పితిమి గానిన రోత్తను యొండు గాదునీ। వెమ్మెయినైన నిల్పుటయయిష్టము వంటలమేరవాఁడవై। యిమ్ములను ఉడుసూదజనులెల్లను నీదగు వంపు చేయఁగన్ * క॥అనిహరోల్కర్షంబున। మనమలరఁగ బల్కి మత్స్యమనుజాధీశుం। డనిలసుతు నేలెనాఁతడు। దనమనమున నాజడి

* అర్జునుఁడు పేడిరూపమున విరటుఁగొల్వవచ్చుట. *

ల్లేఁడదవసరమునన్ * సీ॥ కాళ్లయొప్పిదమాఁడు కట్టనుజ్జ్వలము చేయంగనంతుల బాహులంద మెడలఁ। గంచుకమంగంబు కాంతికిమాటుగా మెడ హేమపట్టిక మెఱయుచుండ। వదనంబు కొమరు భావనఁ జేసి వేఁలుగను దుటసొంపలకలబొదుగ (బడఁగఁ। బవడంపుజోత్తులఁ జెవులురూపడగంగఁ బాపటతలకట్టు భంగిఁ గప్పు।మంచుమఱుఁగువడిన మార్తాండుఁడును బోలె।నివురుఁగప్పి యున్న నిప్పుఁబోలె। వేషధారియైనవిష్ణుండుఁబోలెన। వ్విరటుకొలువు చేరనరుఁడు వచ్చె * క॥చనుదెంచి పేడితనమును। వనితారూపంబునసురవాసవసుతుఁడా మనుజాధీశుసభా।జనులకుఁ దనుఁజూపెమంద సంచారమునన్ * వ॥మెలఁగినంగనుంగొని మత్స్యజనపతిభటుడు దనయొద్దివారలతో నిట్లనియె * మ॥ వనితావేషముగల్గియున్నయది చెల్వంబాఁడుచందంబుగా। దునిరూపింపమహానుభావతయనిర్దోమత్వముర్వరాజసం। బును శోభిల్లెడు నెవ్వఁడే నొకజగత్పూజ్యుండు గ్రీడార్థమీ। ట్లొనరం దాల్చిన రూపుగావలయు మీరూహింపుఁడాయట్లగున్ * గీ॥అనినఁబరిజనములు విస్మయంబుగదుర।నిశ్చయము చేసి పలుకంగ నేర్పు లేక। చూచుచుండఁగ నాసవ్యసాచి చేరఁ। జని విరాటనృపాలుతోఁ వినయముగ * క॥నిన్నుఁగొలువంగవచ్చితిఁ। గన్నియలకు నాటగఱపఁగా నోపుదు న। ద్వన్నుతమనా నామంబు బృహన్నలయొఁ బేడినను దునతఁడిట్లనియెన్ * ఉ॥ ఆయతబాహులున్ స్వేడదయైన సమున్నతవక్షమున్ సరో।జాయతలోచనంబులుఁ బ్రసన్నముఖంబును దాత్తరేఖయుం। గాయజు శ్రేణి సేయునన గౌశికమీఱునదంగవిభ్రమ। శ్రీయును నెంపునంగలుగఁ జేసి విధాత్రుఁడు పేడిఁ జేసెనే * శా॥ మూర్ఖోదండచయంబులోన నొకసన్నావాహచావంబు భా।స్వత్కాండంబులు హేమచిత్రతలసద్వర్మంబు నీకెంతయున్।సత్కారంబున నిల్పి వాహనపరిష్కారాంకసంభావ్యసం।పత్కల్యాణునిఁ జేసి వైభవము దర్పంబున్ విజృంభింపఁగన్ * క॥ ఏమునినుమత్స్యరాజ్య।శ్రీమహిమను నెల్లయుక్తిఁ జేయఁదలంతుం।గామా మనోరథమునకు।నీమాటవిరుద్ధమయ్యెనిది యెట్లొకో * వ॥అనిన విని యమ్మహీపతికి బృహన్నలయిట్లనియె * ఉ॥ ఆఁడుదనంబు నిక్కముగ నారసిచూచిన లేదు పుంస్త్వముం। బోఁడిమి తప్పియున్నదిన పుంసకజన్మమవశ్యభోగ్యమై।

వాఁడిమిగల్గుశాపమునవచ్చెఁ బురాకృతకర్మభాగ్యమే । వాఁడును నేర్పునేర్పొలఁగవైవఁగనోర్వకపోవవచ్చునే. * క॥
పు॥ * గీ॥ పండువనులకు సెలవులేకనిక్కఁ జేసి యభ్యసించితి శైశవమాదిగాఁగ । నండలాసకథమును గుండలియును । ప్రే
ణంబు తెలంగనుభేదనంబు * క ॥ విశ్రుతవాద్యములును మఱి । యాశ్రుతిసంభావ్యగీతసుగతులుసద్భా । వాశ్రయము
గజ్జ్యరసాశ్రయములునై నయభినయంబులెఱుఁగుదుర్ * గీ ॥ ఇన్ని దెఱఁగుల శ్రమముసేయింతుఁ జతుర । తావిశే
షములైనపాత్రములనైన । నట్టి ప్రౌఢ్జ్ఞలై మెలఁగునకళలందు । నిపుణనైపథ్యవిధులకునే ర్తునధిప * చ॥ అనుపమవిన్యాస
హృదయంబున గారవమొందనైపుణం । బున ననుచితంబుమైనరసిపొచ్చెము లేమిఁ దదీయ సేవ గై । కొనుటకు నిశ్చయించిన
నహాఁ తువిరాటుఁడు పిల్వఁబుచ్చెన । ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగనప్పగింపఁగన్ ॥ ఇట్లు రావించిన * సీ॥ అల్లు
నంబునయనువుమైకొనఁ జూచునదు పుకాంతికి విరిత తొడవుగాఁగ । వెడవెడన్నూఁగారు వింతయై యేర్పడదారనిపుణులా
నాకుసిసుడ । నిట్టలఁ ద్రోచుచు నెలవులకల మేర తెలుప జిగియెక్కయేర్పడంగఁ । దెలుపునుగప్పును వెలయంగ మెఱుఁగెక్క
తారకంబులఁ గల్కితనముదొడరఁ । జరణములు మనముఁ జన్నులుఁ గన్నులు । జవ్వనంబు చెన్నునివ్వటిల్లు । చునికిఁ జెలువు
చుండను త్తరచను దెంచె । నలరుపిలుతుపువ్వుటమ్ముఁ బోలె * గీ ॥ వచ్చి కొలువుచొచ్చి నెచ్చెలిపింఛనం । తఁ తనిలువఁ బని
చియల్లనల్లఁ గదిసి ప్రౌఢవనితకైవడి ముద్దియ । ముద్దుపుట్టఁ దనకు మ్రొక్కుటయును * చ ॥ తగి చికవుంగిలించి జగ
భుఁడు కల్పపతాయతాక్షి సె । మ్మొగము మొగంబునం గదియ మోపుఁగ గాంగుళులంగ పోలమిం । పుగఁ బుడుకుంబొరిం బ్రా
నపూర్వవిలోకనమాచరించు । గప్పగు మృదుమాలిను జ్వలఖాంఘ్రుర చేష్టయొనర్చునర్తకిన్ * వ ॥ ఇవ్విధంబున గా
లిహూఁతును వలాలింది బృహన్నల దెగనుంగొని సాదర పరిస్మితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాటగఱపందగుపాత్ర
బగు నేయనియడిగిత త్ప్రతివచనంబులయందలి నాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్లఁ దగుసల్లాపంబు చేసి కర్పూరస
హితంబగు తాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబరంబులిచ్చి మణిమయంబులగు నాభరణంబులొసంగి సంభావించి
యవ్విభుండు * గీ ॥ నీవు చతురమతివి నీకు నిక్కన్నియ । నప్పగింప నేలయైన నాకు । హృదయమలరు దీని నిమెడఁగడు నాగ్ర
హ్యమై యుండుఁగాన జెప్పకుండరాదు * క ॥ నెచ్చెలులతోడ నెంతయు । మచ్చిక దనయిచ్చవాడ మరిగినయది మైపిచ్చ
విడిచింతకము । న్నిచ్చేడియ మెఁగుశితుయెఱుఁగదు సుమ్మీ * గీ ॥ బాలకేలిమీఁదిభరము గ్రమంబున । విడువఁగళలయు
ను వేడ్కఁ జొనిపి నయముతోడ నర్తనంబులశిక్షింపు । నెలఁతకేమగడయునీవ కాదె * చ ॥ అనియుచితంబుగాఁ బలికియు
గనహస్తముఁ బట్టితత్కరంబునఁ గదియించి నీ గురువునొల్లఁగంగొని యాంపు మెట్లు నె । వ్వెనటులు భక్తిమైనవు పెంపె
సలారఁగఁ గూడు గూరచం । దనకునుమాకులున్నడపితప్పకయారసి గారవింపుమీ * గీ ॥ ఎల్లచుట్టములుమదల్లియుఁ దో
డును । జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు । గురువయంకనొక్కకొఁ అంతయు లేదింపఁ । జేరి బ్రదుకుబుద్ధిగౌరవమున * కను
నయింటనిచ్చటచొచ్చటనకెచ్చోనైననీబృహన్నలమెలఁగం । జనియెడుమానిసిదనమన । మునకిమ్ముగునట్టిచరితమానవ స్త్రీ

నకులుఁడశ్వపాలకుఁడై విరటుఁ గొల్వవచ్చుట.

చున్ * వ॥ అనియి త్తెఱంగున నయ్యొరువుర నెడొరులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు * ఉ॥ అంబుజముల్ప
ముద్యదరుణాంశునిఁ గన్నవిధంబునన్విశా । నంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ని జొజ్జ్వలాం । గంబునకర్థితోనభిము
ఖంబులు గాఁ జనుదెంచి దైవయో । గంబున భూవిభుండు దురగంబులఁ దేరఁగఁ బంచిచూడఁగన్ * వ ॥ ఆస్థానంబు చేరవచ్చి
ఘోటకంబులను వలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుంగొని పరిజనంబులకుఁ దనిఁ జూపి * క ॥ ఇతఁ డెవ్వఁడొక్కొ సూపు
ని । రతిశయమై మనమునకుఁ బ్రియంబొసఁగెఁ జూ । చితిరే దిత్తంబునుదా । త్తతగానఁగ నయ్యెడున్వదనమునఁ గన్
క ॥ తురగంబులఁ జూచువిధం । బరయఁగ నితఁ డశ్వవిద్యయందు నిపుణతా । స్ఫురణముగలవాఁడగు బం । ధురమూర్తి పరాక్ర
మాన్వితుఁడుగా నొప్పున్ * క॥ మీరెఱిఁగినఁ జెప్పుఁడాతని । పేరెఱుఁగనియట్టులైనఁ బెంపారంగాఁ । జేరంజని యల్లనొ
క్కఁ డారసి యెఱుఁగంగవలయు ననుసమయమునన్ * క ॥ చేరఁ జనుదెంచి పాండవ । వీరుఁడు మత్స్యాధిపునకు వినతుండై
దే । వా రాజవాహనములకు । వారువములనరయ నేర్తు వలనేర్పడఁగన్ * వ ॥ దామగ్రంథియను వాఁడ నాకు నశ్వవి
ద్యంబున నిపుణత్వంబెల్లను గలదవధరింపుమని యిట్లనియె * సీ ॥ అవయవలక్షణంబాయఃప్రమాణంబు గర్భంబులిం

గితాకారణంబు। మాత్రాంతరమువయోమానంబు దేశకాలోచితాహారప్రయోగభంగి। జాత్యనురూపశిక్షావిధిక్ర మగతవ్యాయామసాత్వప్రవర్తనంబు। వ్రణదవిషాదాదిబహువిధ చిత్తధర్మముపోషణప్రకారము చికిత్స। పరిచయ ముబుధరణిపాలకమిందటి। రూపురేఖ మెఱయఁజూపనేర్తు। బవరమైననాకుఁ బనియేమియనఁ జేతి। బలిమికలిమి నేఱవఁ దలఁపుగలదు ✱ వ॥ అనినవిరాటుండతనికిట్లనియె ✱ క॥ నీకుఁడగుపదపియిచ్చెద। నాకలిమికి నెల్లరత్నణంబొనరింపం। గాకహయశిక్షకుఁడవగు। నాకోలఁదియెయిట్లు పలుకుటనుచితమరయన్ ✱ గీ॥ అనుచునకులుఁడిట్టులనుదేవతనుతను। నేర్పువచ్చలవలననెగడి బ్రసుక। వలయు గాకనగ్గలముదప్పినమేలం। కువలకలువలియ్యకొనుటసగునె ✱ ఉ॥ ధర్మ సుతుండు పెంచెవనుఁదానతురంగమశాస్త్రశిక్షలం।గర్మఠుఁజేసియాత్మతురగంబులకెల్లను నాయుక్తుఁగా। నర్మిలిని ల్పియాగియూఁబ్రియంబున నాయెడ వాఁడు నాఁటికిం। బ్రేమ్మివహించుచుండనడిపెంఁదనతమ్ములలోనివాఁడిగాన్ ✱ క॥ అభిభఃమరాజ్యసుఖలీ। లావిముఖతవెడలి బంధులందొరఁగియత్థే। ప్రావాసతబ్రుంకుడువడి। పోవుటనెచ్చోటఁగడుప్రఁ బ్రోతునొయనుచున్ ✱ క॥ తిరిగితిరిగిలోకోత్తర। చరిత్రుఁడు సుజనుండు మత్స్యజనవిభుఁడు యుధిష్ఠిరునట్లయనఁగవినిని నుఁగరమనురాగమునఁ గొలువఁగానియ్యెడకున్ ✱ క॥ చదుదెంచికాంచినానే। ర్చినతెఱఁగునవిన్నపంబు సేసితినన్నుం। బనిగొనఁదలచిననిలిచెద। నమమానము గలిగెనేనియరిగెదనధిపా ✱ వ॥ అనవుడు ✱ ఉ॥ ఆనరనాథుఁడిట్లనియెనశ్వములంబరికిం చియుచిక్కయుండు। పేనిఁమరంగశాలలకునెల్లను ముఖ్యుఁడవై తదీయనా। వానియతిప్రకారకరణంబులఁ ద్రిమ్మఁగుచున్నవా రిముఁ నేనెటులట్లనీవరసియిచ్చమెయింబనిగొమ్ము నెమ్మితోన్ ✱ క॥ అనిచెప్పియధికసన్మా। ననపూర్వము గాఁగమ

సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట.

త్స్యనరపతిమాద్రీ।తనయుండగన్పెవాతఁడు।దనమదిఁ బ్రియమందెవతనితమ్ముండంతన్ ✱ క॥ భావనశాంతత్వము నిజ।భావంబుననూష్మలతయుఁ బ్రకటంబులుగా। నావిధుఁడు మనుజవేషం। డైవచ్చెనొశిఖరితియయ్యెనొయనఁగన్ ✱ క॥ తలుసులపొదియొకదెసఁ బె।య్యాలదామెనయొక్కవలననను వైయుండన్। మొలమోపిపెక్కుచుట్లం। బలుద్రాటం జుట్టిగోవభావంబమరన్ ✱ చ॥ నునుపెలగోలచేకొనిమనోహరమైతనమేనురాజుచూ।పునుబ్రజచూపుకులుందిసువఁబు వ్వరవత్రవిభ్రంబులైనలోం। చనములుమూర్తిదెల్పఁగనసంభ్రమతంజనుదెంచెనల్లన। ల్లనవెడభీతిదోఁపజములన్వెడగ య్యెడుదృష్టిఁజూచుచున్ ✱ వ॥ ఇట్లువచ్చి మత్స్యమహీవల్లభునంతంతం జేరివినయావనతుండగుచునిట్లనియె ✱ క॥ నీపసు లఁగావఁబెట్టుము।భూపాలకనన్ను నేమబూనియరసిన్। గోపజ్ఞులురుజవడనొరు। చేపడవేన్నఁడునడప్పఁజేడ్పడ వెండున్ ✱ గీ॥ తొలవపోకుండ మెకములుగఱవకుండఁ। బాడిదఱుగకయుండనాపాటిగొల్ల। లిచ్చమెచ్చఁగనీదృష్టికె క్కఁగడుపు।నరయనేర్తునన్నెలుమ ధరణినాథ ✱ వ॥ అనిన విరటుండు పాండవావరజునకిట్లనియె ✱ ఉ॥ ఎక్కడిమాట గొల్లతనమించుకయేనియు లేదు నీయెడం। జక్కనిమేను నీగరువ చందముఁ గాంతియుఁ జూడవచ్చినన్। న్నిక్కువమీవుమార్య శశీనిర్మలవంశజులైన రాజులఁ।దొక్కమహానుభావుతనయుండవుగావలయున్నరోత్తమా ✱ గీ॥ వలయుపదవియందు నిలిచినారాజ్యమంతయును జక్కవెట్టినయమువిక్ర। మంబునడుపునంతమానిసివైయుండి।కుత్సితంపుబ్రదుకు గోరఁద గునె ✱ వ॥ ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నీకిచ్చెద మత్స్యదేశంబున భవదభిమతస్థలం బొసంగెద మదీయసేనాపరిపాలనంబు చేసివర్తిల్లుము ✱ క॥ అనవుడుఁ బాండునృపాలక।తనయుఁడు మ్రొక్కుచు విరాటధరణీ శునకిట్లనుహీనపలుఁడ బాలుఁడ। మునువాగరికపుఁగార్యములవెరవెఱుఁగన్ ✱ గీ॥ వసులఁగాచికాని బ్రమకఁగౌర వుల ప్రా।తలము నేను మున్ను ధర్మపుత్రు। పశుగణంబు నెల్లఁబాలింతు నమ్మహీ। వరునిచిత్తమునకువచ్చువాఁడ ✱ వ॥ తంత్రీపాలుండనంబరఁగినవాఁడనాచేతం గ్రేపులుపురాణించుటంజేసికొండొకకాలంబు నీకడపులంబెనుతునేనగున నికైకొనిననాఁబోతుపంధితంబుమూర్గొనిన।బైగాలివీదిన గొడ్డనకై నసుజాలునిలుచునుంగిటియదను ద్రిక్కయనుడా నికెనాపేరుచెప్పినఁజాలుమఱియునుబసికివలయుతెఱంగులెల్ల నెఱుంగుదు వేయుఁక్కపనికింగానుగానియేనీవెంటనీమన సువకయుంజా దునావలనం బ్రయోజనంబుగొనవలయు నేనినొండుమాటలుదక్క పసులంబరికింపనియోగింపుము ✱ చ॥ అనుటయునెట్టకేలకుధరాధిపుఁడట్టులకాకయంచు నా। తనివదనంబుచూచియుచితంబగునేనిఁ బ్రియంబయేనినె।ట్లు

నుగురుకార్యవర్తనములుఁ రూపు దియింపకయుండునేనిగో । ధనములకెల్లరక్షణము దప్పరతం దగఁ జేయు ముఖ్యులన్ ✱ క॥
మున్నుగలగోపవర్గము । నిన్నుం గని కొలిచి భక్తి నీవని చేయన్ । మన్ననమానిసి వైనీ । వున్నంగడు మేలకాక యొన్న

## ద్రౌపది సైరంధ్రీవేషమునను దేవఁగొలువ వచ్చుట.

నిగలదే ✱ వ॥ అనిపలికి యతఁ డయ్యభిమతంబున లిపి వినిపి పెనల్లెవురు విరాటుంగొల్చి రి తదనంతరంబ ✱ క॥ గారవమున ని
జదేశాచారము మైనల్లియున్న జటియగు కబరీభారంబు విచ్చి తుఱుముగ । సైరంధ్రీవేషమునను సముచితభంగిన్ ✱ క॥
వలపలి వికచ్చనకంచుక । మలగంగాఁ మటి నిను తెలు చమూఁపుఁడుపుట్టం । బల్లవడఁగట్టి జట్టావ । లక్కలమున నవ్వీఁగుచన్నుఁగ
వగప్పితగన్ ✱ క॥ పరిచారికాత్వరేఖా । పరిణతి దనమేన నచ్చుపడ భావనకుం । దిరమైతలకొను నంతః । కరణముతోఁ బర
మముద్రుపదకన్యక చొచ్చెన్ ✱ వ॥ ఇట్లు చొచ్చిన ✱ సీ॥ పరమొయిలప్పిన బాడరిను నగాంతి గదలిన యమృతాంశుకళయనఁగ
జెనుఁబంచుమీఁదఁ బర్వినవికాసముదప్పి చెలువుగుందిన సరోజినివిధమున । ధూమంబు ప్రేసవినఁ దుఱఁగలి మెఱుఁగులు
ఁగిమాసిన దీపకభంగి । ధూళిపైఁ బొరసినఁ దొంగలించుట మానిలావణ్యమెడలిన లతిక మాడ్కి । గంధశారికావేష
కతనమూర్తి యుజ్జ్వలత్వంబు నుడిగియుండఁ బాంచు । తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజవీథిఁ బౌరజనంబు
ల్వేలఁ జూచి ✱ ఉ॥ రోహిణియొండెనొండెను నరుంధతి గాక మనుష్యజాతియే । యీహరిణాక్షి చెల్వమునకే దైవ
జూచ్చెలు వాఁచి కోలుగా । దాహితగౌరవంబగు శుభాంగము దేజముఁ జూడ బుద్ధిసం । దేహముఁ బొందుచున్నది సఖీజన
నిట్టిదె యేజగంబులన్ ✱ వ॥ అనుచు నంతంతం జేరి ✱ క॥ నీవెవ్వ రేమి పనికై । యేవలనికిఁ బోవుచుంటి యిది నావుడు నద్దే
యు సౌముఖ్యము సం । భావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్ ✱ గీ॥ పసుగట్టి వాలుదానన నాకెవ్వరు । కడుపు
ను వెట్టి కట్టఁ జీరయిచ్చి సాకతమున నేలుదురట్టివా । రలఁ బనులు సేసి మెలఁగు బుద్ధి ✱ క॥ వచ్చితి ననవుడు విని జను
లెచ్చెరువున సందియంబున నందెఱు మదితో । నిచ్చెలువ కడుఁపు కూటికి । నెచ్చటనైన నిలుచునె యొదివలుగునే ✱ వ॥ అను
చుఁ గనుంగొనుచు మూసరికొనుచుండం బాంచాలరాజనందన రాజమందిరంబు చక్కటికి నరుగు నవసరంబున ✱ క॥
ముదమొదవ రమ్యహర్మ్యము । తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారా । స్పదమగు నెలవున మెలఁగెడు । సుదేష్ణ జా
లకములఁ జూచెం బ్రీతిన్ ✱ వ॥ ఇట్లు తెలుగు నమత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున ✱ ఉ॥ ఏ
క్కడనుండి యెక్కడకు నేగెదు నోయిది యొక్క కాంతరూ । పెక్కడు పెంపుసొంపునను గేర్పడుచున్నది దానివీఁక యి
మ్ముక్కచు నీచభామినులచొప్పునఁ బల్కెడుఁ బోతులుంగడు । న్వెక్కసమంది చూచెదరు వేగమ తోడ్తెమ్మని రంతు నెమ్మితోన్ ✱
క॥ అనిపలికి పనుపఁ బ్రాంతం । గని లెఱువు రవోయి ద్రుపదకన్యకతోని । ట్లని రివిరాటమహిషి నినుఁ దనపాలికిఁ బిలువఁ
బంపె దయ పెంపెసఁగన్ ✱ అనవుడు ✱ క॥ తనతలఁపు నెరసెనని యా । వనితారత్నంబు నయవైభవము సతీ । తన
వొందిన చందంబునఁ । జనియెం గేకయసుతానుచారికలబడిన్ ✱ వ॥ ఇవ్విధంబునం జని సౌధంబు పరిభాగంబెక్కి ✱ సీ॥
పదతలంబుల కెంపు పరఁగిన తలముపుంపు మిళితమైన చందము వహింప । నంగంబు ననుగాంతి యడరిన గోడలు వేమలు
న మణిమయ విధము నొందఁ । గన్నుఁగవ మెఱుఁగులు గదిసిన ముందరఁ బుష్పోపహారంబు సొలుపు దాల్ప । వేనలి కప్పు వ్యాపించి నీ
డ నీలదుకూలంపు మేల్కట్టు కొమరు వడయఁ । దానుఁ జొచ్చిన కతన మత్స్యక్షితీశు । నింటనిమ్మయిఁ గ్రొత్తయొప్పెసఁ గ మెసఁ
గ । నస్మహాదేవియున్నెడ కల్లనల్లఁ । బాండు శాతనూభవ పత్ని యరిగె ✱ వ॥ కేకయరాజనందనయును ✱ చ॥ కనుఁగొనిగా
రవంబున మొగంబునఁ గేలుఁ బురఃప్రసారముం । దనువునను ప్రభావమును దంతమరీచుల సామినిగ్రమం । బును దమలోఁ
గడలుకొనఁగ భూషిత శాసర శేఖ నిందుర । మ్మనవుడు నంతనంత ద్రుపదాత్మజ చేరి వినీతి నిల్చినన్ ✱ క॥ ఆపాదమస్తకము
డ ద్రూపము వీక్షించుచుం గుతూహలమడరన్ । భూపాలమహిషి యిట్లను । నాపోలం తుకతోడ ముచితమయ్యెడుభంగిన్ ✱
గీ॥ ఏదికులము నామ మెయ్యది యెవ్వరి । దాన వేమిపనికిఁ బూని యిప్పు । డేచటు బుద్ధిఁ దలఁచయే గెడవింతయు । నెఱుఁగఁ జె
ప్పుమాకు మెఱుఁగుఁబోఁడి ✱ వ॥ అనిన విని యాజ్ఞసేని యిట్లను సైరంధ్రీజాతిసంభూత నభిధానంబు మాలిని పురుషపం
చకసనాథనై యుండుదు నొక్క కారణంబున నుద్ధతులగు విరోధులచేతం బతులసన్నిధిం దలపట్టి యాడ్వంబడి వనంబున
కరిగి వ్రతంబు మైవల్లప్ప సహితంబుగావ న్యాహారంబులం గాలంబు గడపుచుం బ్రహ్మచర్యంబు నడిపితి నిటమీఁద నియ

గోచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంతగలమనీవుధర పత్నివని వినుటంజేసి వానేర్పువమల వెంటనీకడవిలు వందలందియుందువచ్చితిననవుడు సుధేష్ణయిట్లనియె * క ॥ సురగరుడఖచరవిద్యా । ధరకిన్నరయక్షసిద్ధతరుణులలోనీ । వరయఁగ నొక్కతవసుది । వ్వారికింజను దేరఁగతము బొంకక చెపుమా * క ॥ అనవుడు దరహసితము మో । మునకుఁ జందగు నొడవుగాఁగ ముద్దియ యేగ్రుష్ణుని దేవి సత్యభామకుఁ । బనిసేయుదుఁ దొల్లి పిదపఁ బాంచాలికడన్ * గీ ॥ తగవు మైఁబరిచారికాధర్మములకు । నెల్లఁ జాలి వర్తించితిఁ దల్లి వినుము । నాకుఁ బ్రాణంబు ప్రాణమైనన్నుఁ దన్న । కాగ భావించియాత్మవిగారవించు * నీవును ॥ క ॥ నీచములయ్యెడి పనులకు । నాచాలమియెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా । నీచిత్తంబునఁ గైకొని ! యాచారము దప్పకుండ నరయుము నన్నున్ * వ ॥ అనియిట్లు దేవజాతియనుసందియంబు వాయంబలికి మఱియు * కలశములు గూర్పజహ్ను విధ । తిలకంబులు వెట్టవింత తెఱఁగున బలు పూవులుగట్టఁ గట్టి మాడువం । దలముడువఁగ సరులు గ్రువ్వఁ దడ్డయా నేర్తున్ * తు ॥ అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లను । వ్విమనీరూపము చూచి మాన్యనీయుప్విళ్లూను నేనేమేయిం । బనిగొందుండగ నింతులుండగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె । మ్మనముల్ విస్మయమందఁ జూడరు భామావల్కులింకేటికిన్ * క ॥ దుర్భరయగుటను గర్కటి । గర్భముధరియించునట్లు గైకొని నాకై । నిర్భర విధ్వంసకా । పిర్కానము దెచ్చికొనుట వెరవై యున్నే * గీ ॥ అనిన నీతలంచినట్లుగా దేర్పడ । వినుము నాదు పతులు వెరవులావు రఘువిక్రమంబుఁ గలుగు గంధర్వులేవ । మఱియు నన్ను నొక్కమాత్రయైన * క ॥ నీచమతి నన్ను నెవ్వఁడు । చూచిన వారాత్రిలోనఁ జూచుచు దెగఁదా । రాచపలుహరిహరాదులు । గాచిన బలవిక్రమములఁ గర్ణములైనన్ * క ॥ బంధుశతంబులు గార్యము । బాంధములై శక్తిసంపదాభీలతమై । సింధురసదృశతనున్నను । సంధులు సంధులెడలించి చంపుదురతనిన్ * వ ॥ గావునఁ బురుషులు నాకడం దెఱచి చూడ వెఱతురది యునుంగాక * క ॥ నాదిత్తము తాదృశులకు । గోచరమే యస్మదీయకులజనసం । ఆచరణమహిమ యట్టిది । యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్ * చ ॥ మనమున నూఱడిల్లుమనుమానుమునన్ను నేలుమే । వనులును దాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే । ర్పునభయాభక్తులున్మె అయ్యెం పుజేసెదఁ దజ్ఞులైనన । జ్జనులును మెచ్చవర్తనము సాధులు వృద్ధులు మెచ్చ సల్పెదన్ * క ॥ ననుఁగుచ్చితంపుఁ బనులకుఁ బనకరయెంగిలికి లోను పలు పకతసుము । న్ననతోడనగయా వారల । కనురాగము నెఱపి కొలుతురస్మత్పతులున్ * గీ ॥ అని సంతసిల్లియ ద్దేవి సైరంధ్రి । నూఱడిల్లఁ బలికి యునిచికొనియె । నంతిపురము చరితకలవడ మెలఁగుచు । నుండె నవ్వధూటి యుదుముదమున * క ॥ ఇవ్విధమున నయ్యేవురు । నవ్యేలఁ దియ సకలజనుల కజ్ఞాతముగా । నవ్విరటు ప్రోలఁ బ్రమదము న్వాటిల వసించిరు చితనిభృతత్వమునన్ * వ ॥ అనిన విని వారల వర్తనంబట మీఁదఁ జెప్పిన తెఱంగెఱింగింపుమనిన ॥......*



ఉ॥ బాంధవశౌత్రవాకలితభావభవాభవపాశబంధసం । బంధవిరామ రామవరివక్త్వవివేకనిరూఢభక్తహృద్గ్రంథివిభేదనాపరమకారుణికావరిమాణదూరదుః । ఖేందనపావకాయితసమీక్షణనిత్యమహోభ్భుతప్రభా ॥ క * అన్నమయత్వాదివిరా । మోన్నతివాఙ్మనసదూరయోగిస్మేరా । భిన్నాకారచ్ఛన్నా । చ్ఛిన్నాత్మీయప్రకాశజగదాధారా * మాలిని ॥ కమలభవకిరీటగ్రామపద్మావలీసం । గమసుఖదపదాబ్జాగాధభక్తిప్రకారా । ప్రముదితమునిశశ్వద్ధ్యావనాగమ్యరమ్య । శ్రమపరిణతమూర్తీ శ్రౌతశాఖాగ్రవర్తీ ॥

గద్య * ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజితిక్కన సోమయాజి ప్రణీతంబయిన విరాటపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

## శ్రీమహాభారతము - విరాటపర్వము - ద్వితీయాశ్వాసము.



శ్రీమదపాంగాలోకన । ధామసకృత్సంగరూఢ తాదృశవిభవో । ద్దామాశ్రితలోకాలో । కామయనిర్హరణనిపుణ గోహరనాథా * వ ॥ దేవా జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబులయు

ల్లంబులురంజిల్లరాజునకువినోదంబులువిధోక్తప్రకారంబుల సలుపుచునొక్కొక్కమాటుమధుగప్రసంగంబుగానా
నెత్తంబున గెలిచినవిత్తంబులుతమ్ములకొసంగుచుండు వాయునందనుండవ్వంటకు మిగిలినమాంసంబు లమ్మినైనట
నిచ్చులుసహోదరులకిచ్చుచుండువివ్వచ్చుండు సంగీతప్రసంగంబున మెచ్చువడసినకనకాంబరాదులు సోదరులకుంజె
ర్చుచుండునకులుండుదురంగప్రసంగంబునంగనిన ధనంబులుతోడంబుట్టువులకుఁ బెట్టుచుండుసహదేవుండు గోవులఁ
జూచిభూవల్లభుండు సంతోషించిన సమయంబున సముపార్జితంబులగు పదార్థంబులన్నియు నన్నలవశంబు సేయుచు
నారలకు గోరసంబులంపిసలుపుచుండు ద్రౌపది తన్నరసికొని తిరుగువీరులంగన్నులారంజూచుచు చిత్తంపునడ్డ
మెలంగుచుండు * గీ ॥ ఇట్లుతమతమవర్తించు నెడలసకల । జనములకుహృదయానురంజన మొనర్చి । తాలిపుయిల్లు
యడఁకువతగవు మెలపు నెఱిదెఱంగును బాటింప నేర్పు గలిగి * క ॥ ఉన్నతజీవివిధదేశో । త్పన్నులునద్భుతవిధా
బలవిక్రమసం । పన్నులునగుమల్లులువిభ । వోన్నతుఁడగువిరటుపాలనుద్భటవృత్తిన్ * క ॥ తెమలోనమాటలాడెను
మయింబుననెక్కుడువిశాలోరస్కుం । డమితబలుఁడు వచావన । సమమూర్తిస్ఫూర్తియధికసంరంభమునన్ * క
అన్నరపతికడ్డైకురనిల్చియిట్లనియె * గీ ॥ నేలనాలుగుచెఱఁగులనృపులకొలువులందు నేమవర్తించితినవనినాథ । యుర్వి
చినాయెదురబాహాప్పళించి । గడవఁజాలినమల్లులఁగాననెందు * చ ॥ అనునెడవానియుగ్రపమదాకృతియుఁ బలుకు
క్యవృత్తియుం । గవిసినిమల్లులెల్లభయకంపిత మూర్తులుదాల్చిహాయువ । లఘనుగనువిచ్చిచూడను మొగంబెఱయుంగ
జాలకున్న న । జనపతి వేడ్క మ్రోటువడుచందముగాం దియ్యఖిప్తిరుండనుఁగ * క ॥ వీఁకిమార్కొనఁజాలెడు । వానిక
వానిధర్మతనయునిపురిలో । నానానియుద్ధలంపటు । నేనొక్కనిగంటినివ్వడింపులనతఁడుఁగ * క ॥ మనబానిసీఁడ
లుం । డనుశూద్రుఁడువాఁడుదెల్లమధికబలుల నోర్చినవాఁడనేకమల్లుల । నినుమెచ్చింపంగఁజాలునీజనదధిపా * క
అనవుడుభూపతిపిలువం । బనిచెనతనినతఁడునపుడుభయభక్తులతోఁ । జనుదెంచిమల్లవర్గము । గని మైపెరుగంగలిచెకౌ
తూహలియై * వ ॥ అట్లునిలిచినపవనతనయునవలోకించియావనీవల్లభుండమ్మల్లముఖ్యుంజూపియితనితోడియుద్ధంబునకు
సన్నద్ధుండవుగమ్మనిననతండు ధర్మతనయుకనుసన్నగైకొనియమ్మత్స్యవిభునకు వినయంబుతోనిట్లనియె * గీ ॥ అధిప
ధర్మజుపాలనున్నప్పుడతని । వేడుకకుఁదగఁబెనఁగుదువింతలైన । యట్టిమల్లులతోనిప్పుడట్లపోలె । నీదువేడ్కకుఁబెనఁగె

(*)భీముఁడుమల్లునితోయుద్ధముచేయుట (*

దనేర్చినట్లు * వ ॥ అనిమెత్తనయియ్యకొనిగజ్జించిగజాలస్యంబునం బ్రేంకణంబుచొచ్చి భూపాలునిముందటభుజాస్ఫా
లనంబుచేసి మ్రొక్కిమఱలు నెడనంతకమున్న మల్లగవరుండునన్నరపతియనుమతివడసిక్రొ తవరికరబంధుండైయుఁ
దెంచియచ్చటునికిం జేసి యతండునునిలుచుతుండును । బరస్పరమూర్తులవలోకించి యుద్ధరంగంబుమన్నుఫాలప్రదేశం
బులధరియించి శరీరంబులపైఁజల్లుకొని రెండుచేతులముచి వ్రేళ్లనుగొడ్డొకపుచ్చికొని యొండొరులదెసకువైచియు
తంబులను నవసవ్యకరంబులవాకుంచిత సవ్యబాహుతలంబులనప్పళించు చప్పుళ్లగలసి యొక్కరుండుమల్లచఱచిననా
దంబునవీతెరపింతానకంబునగలిచికిదిసినవ్వుడువృకోదరుండు * సీ ॥ ఉపతాయిలోఁదనకొదవినదోరహస్తసము
పిప్రేయకసమదవృత్తిఁ । బాసిక్రమ్మఱఁజేరుబలువిడివాఁడుపైనడరినఁబెరుగకయవనిగ్రుంగి । నిలుచునెత్తెఱఁగున
లసినయప్పుడకొంగపోయి యవలీలఁగూలవైచు । జలికిఁబట్టినమును సన్నుపువిన్నాణములుదొరకొన్నసముట్టికొనఁడు
గాలిదెసఁజొరవచ్చుటగానుపించు । నుడుగుసీసానఁబట్టియనుప్పళించి । పోవనిచ్చుమగుడనేఁడపోఁగఁజేరు । నెడలపరిసే
యునగుతడవీకహత్తు * వ ॥ మఱియునసేకగతులమోజలె ఫెలయుచుఁగొండొకసేపు విరాటునకువినోదంబుసేసి
గీ ॥ కచ్చయమరఁబటికాళ్లను జేతులు । వ్రేలమత్తగజములీలమెఱయ । ముష్టిబలువునెఱయమ్మక్కనవాతను । నెత్తురు
లుకమల్లునెత్తివైచె * వ ॥ ఇవ్విధంబునపిసరి నేలతో వ్రేసివీవునమండివెట్టిన * క ॥ పెలుకుటితాళంబీమదిఁ । దలవియ
పుగాకధరణితలముగరపుటం । బులనప్పళించెవాఁడ । కొక్కలువాప్వగవిడచి మెఱసెఁగుంతీసుతుఁడుఁగ * వ ॥ ఇవ్విధం
బునమహాబలుపట్టి యాజెట్టినెట్టనగెల్చినమత్స్యవతి మెచ్చితనకిచ్చిన ధనంబులచ్చటి యర్థిజనంబులకు విచ్చనిజని
సంబునకుంజనియా మఱియుని త్తెఱంగుననతనికివేడ్కసలుపుచుండు జిక్కనిమల్లులు లేనితఱినంతిపురంబు నింతయుఁ

నోహటించితిక్ ॥ క॥ మొగమోడఁడితఁడు గౌరవ । జగతీశుఁడు విఱిగినపుడు జవమున వెనుకం। దగిలియిది జూడ మాడఁ
గ। నగునెడ గాదు మవలయుననియె నతనితోఁ ॥ గీ॥ అనిన నతఁడు వెఱగున త్యాదరంబును । సంతసంబు మానసమున
బెరయ। నవయవములనం భ్ర మావేశ మేర్పడ । గారవమున విజయుఁ గౌఁగిలించె ॥ క॥ వినయంబు మిగులఁ గుంతీ।తన
యాగ్రజు పాదపీఠతలమున ఫాలం । బును వ్రేంద సాగి మ్రొక్కియ । తనికౌఁగిలి వడ సెసమ్మదముడఁ బుకొత్తక్ ॥ గీ॥ శ్రీ
తియును మడింప భీమునిఁ గవలనా। లింగనంబు చేసి యంగకములఁ। బులక లెగయఁ గేలుదల మోడ్చి ధర్మజు। నాననమునఁ జూ
డ్కియ డరనిలిపె ॥ ఉ॥ అత్తఱి లేదివచ్చి తనయన్నలఁ దమ్ములఁ గానుపించెన । యుత్తరకఁ గుసుండు తగ వ్రేంఁడఁ గనవ్వ
డపిల్వఁ బంచెమా । తోన్నత్తముఁడార్యమిత్త్ర సచివోత్కర సోదర వర్గ పుత్త్రకో । దాత్త భటాది యోషల ముదంబునఁ
బాండవ దర్శనార్థియై ॥ వ॥ ఇట్లు సమస్త జన సమేతంబుగా ధర్మతనయ సేవా తత్పరుండై తదనుమతి సముచితరుచిరా
సనంబుననుండి విరాటుండంతఃపుర వర్తులం బిలిచి యంతయు సుధేష్ణ కెఱింగింపం బనిచి పాంచాలిం డగిన తెఱంగున గార
వింపు మనట్లు గావించెనట్టియెడ ధనంజయుండతని కిట్లనియె ॥ గీ॥ చాల దుస్తరమైన యజ్ఞాతవాస । వత్సరంబు భవద్గృహా
సగుప్తి వలనఁ గడపితిమతి సుఖావాస వృత్తి । వృత్తి నేము నిర్భయుల మైవిందులట్ల ॥ అనిన విని విరాటుఁ డతని కిట్లనియె ॥ ఉ॥
పనన వేఱ యొక్కెడ నెయిట్లనఁ గాఁ దగునయ్య యిమ్మెయిం। గానన దేశవాసములఁ గాఱియ కోర్చియడంగి యుండియు।
పూని కదీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా। మానదయాసమృద్ధి సను నొందుట కాదె సురేంద్ర నందనా ॥ అవ
వలికి ధర్మనందనుఁ జూచి ॥ చ॥ ధరణియుఁ బట్టణంబు హయదంతి రథంబులు గోవులుద్భటో । త్కరమును వమాత్య వర్గము
నుఁ గాగల రాజ్యమితండ యేలు ని। ర్భరమున నేను బుత్త్రులు సుబంధులు దమ్ములుఁ గొల్చియుండెదక్। గరిపురి కెత్తు నట్టివ
నిగ్గలిననోపినయంత సేసెదక్ ॥ చ॥ అనవిని యుత్తరుండు తగ నజ్జనపాలుని తోడ నిట్లను । న్మనకొక రాజ్యముం గల దెవ
న్నను నిన్నును మొన్న నిన్న వీ । రనితర సాధ్య శత్త్రు విజయంబునఁ గావిన యప్పుకగ్గఁ జే । సిన యది దక్క దానిమాటఁ జెప్పఁగ
నేటికి నింత వింతగక్ ॥ వ॥ ఇది సిద్ధంబటు చెల్లుం గాక యించుక విశేషంబు గలదు వినుము ॥ చ॥ సవినయవృత్తిఁ గొల్వు మిటఁ జన్న
దినంబుల వీరు నీటు పైఁ । గవిసిన నివ్వలట్ల యధికంబగు తేజము డాచి యున్కిడి। ట్టివిధము సావబాధతను డెందములూజటఁ
బొందియుండ నేరవు మనకెట్లు గానఁ దగఁ బ్రార్థన సేయుట యుక్తమిత్తఱిక్ ॥ వ॥ అదియునుం గాక ఋషి ధనవర్గంబులు వీరి
చ్చిన యపియట్లగుట వేడ్క సేయవు తగను। తనమగు కానిక యీవల । యనుదోడ్తెరంగఁ బనుపు ముత్తరఁ బ్రీతిక్ ॥ వ॥ అ
నిన విని మత్స్యమహీవల్లభుండు మనంబలర మంత్త్రుల మొగంబు సూచి కుమారి కనలంకరించుకొని తెండని నియోగించిన
వారును బ్రియంబునఁ జనితత్కార్య శ్రవణసంప్రీతయగు సుధేష్ణయనుమతంబున ॥ క॥ వదనికి రాఁబులుగడిగిం। మద
నాస్త్రము రేఖ గలిగి మానిని మెయిచె। న్నొందవఁగయి సేసి రప్పుడు । ముదితా జనములు ప్రమోదమున లలితముగక్ ॥ వ॥

## విరాటు నిమంత్రులుత్తరను బాండవుల యొద్దకుఁ దోడ్తెచ్చుట.

ఇట్లు శృంగారంబు సేసిన నమ్ముద్దియ కుసుమ త్తాఫల ప్రాలంబమాలికలతోడి గొడుగు వట్టించి యత్యాదరంబున నయ్యమా
త్యులు దోడ్తెర ధారాధర నికర మనోహరయగు వజ్జ్వలలక్ష్మియుం బోలె వచ్చుచున్నం గని విరాటుండెదురు వోయి పురో
హితులును బంధుజనంబులుం దానును బొదివికొని పాండవాగ్రజు నగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివా
రంబుగా దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యిట్లనియె ॥ క॥ ఎఱుఁగమి నింకిట నీ పెద్దఱికంబు దలంచి యేమి తప్పుగలిగి
నక్। మఱచి దయఁ జూడుమిట్లం। డఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్ ॥ వ॥ అని జానజతనూజుల జూపి మఱియు నం॥
ఇమ్ముద్దియ నర్జునునకు। నిమ్మివని బంధుజనులకిం డఱుఁగడుక్ । సమ్మతమెల్ల ప్రజకు నే। నిమ్మెయి నిముఁ జేరి బ్రతుకుటిష్టంబ
ధిపా ॥ క॥ అనిపలికిన విని కుంతీ। తనయాగ్రజుఁ డింద్ర సుతు వదనమాలోకిం। దిన నాతఁ డిట్టులనునమ్మను జేంద్రుఁడు విను
మునుండ మత్స్యాధిపు తోక్ ॥ క॥ ఈకన్నియఁ గోడలిగాఁ। గైకొనియెదఁ గావియిది తగదు చితవృత్తిక్। నాకడ నబల మెలం
గుట। లోకము శంకించునన్ను లోలాత్మునిఁగాక్ ॥ వ॥ అదియునుం గాక నృత్తగీతాదుల యెడ నిక్కోమలికి గురుండనైననా
కునివ్విధంబు ధర్మంబు గాదు గావున ॥ మ॥ హరిమేనల్లుఁడు బాహువీర్యపటు శౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం। దరుఁడావా
డసవిత్త్రుఁడంచిత కళాదక్షుండు దారుండుగా । తగ సంరక్షకుఁడాద్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసియ । ట్యుడతే

జుండువరించుఁగాక యభిమన్యుం డీసరోజాననకు ॥ అనినవిని మత్స్యమహీకాంతుం డత్యంత సంతుష్టాంతరంగుండై ॥ గీ॥
అర్జునునివియ్యమనియెడునంతకంటెఁ । గడవఁ బెంపునా కెయ్యది కార్యనిశ్చ । యంబు ధర్మతనూభవుండానతిచ్చు । నాఁడు
మనమెల్లఁగావించువారము దియు ॥ గీ॥ అనిననతనికిట్టులనుఁ బాండవాగ్రజుం । డింద్రతనయుఁడుచితమెఱిఁగి పలికె । నిట్లు
సేయువారమివ్వుడు చుట్టాల । కెల్లఁ జెప్పి పుచ్చుఁడీ శుభంబు ॥ వ ॥ అనినిశ్చయించెవిరాటుండును గౌరవాన్వయసంబంధం
బున మాత్స్యవంశంబు పావనం బయ్యెనని పలుకుచు ధర్మజ భీమార్జున నకులసహదేవులకుఁ గ్రమంబున నుత్తరఁబ్రణా
మంబు సేయించినవారు దీవించి యంతః పురగమనంబునకు ననుజ్ఞ సేయ నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సముచిత సము
చితపరివార పరివృతయై యరిగిన యనంతరంబ మహావ్రాత్రిమలరావించి లగ్న నిరూపణంబు సేసి యాదవపాంచాలాది
బంధుజనుల నెల్లఁ బెండ్లికిఁ బిలువ రెండు దెఱంగుల వారును గాలరులం బనిచి రజాతశత్రుండును విరటుఁ గారవించి తారత
నిపాలనఁ జ్ఞాతవాసంబు సుఖవృత్తి నడిపి కొనుట వాక్రుచ్చి గుణంబులు గొనియాడు మనీవు మాకు వాసుదేవు నట్ల కాక సా
మాన్యబంధుండ వే యనిసంభావించి వినయనిభృతుండగు నతని నందిగి చిపునః పునరాలింగనంబు చేసిన నతండును ససంభ్ర
మపరిజనసముచితసముపనీయ మానంబులగు వాచావిధోపకరణంబులం గౌంతేయులకు వివిధోపచారంబు లాచరించి మ
హోర్స్నామజ్జనభోజనంబులునడిపెనంత నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుం జనిచని నడుమ విడిసిన యెడం గర్ణశకుని
మశ్శ్యాసనులదుర్మంత్రంబు వట్టి గాంగేయుని వచనంబుల ప్రమాణంబులు చేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱు
ఱింగియాతని పాలికి దూతంబుత్తెంచిన వాఁడును నేతెంచి కాంచి యిట్లనియె ॥ గీ॥ సాగియజ్ఞాతవాసవత్సరదినములు । నిండ
కుండంగమున్న పార్థుండు బయలు । మెఱసి సమయంబుదప్పెనీవెఱిగి దీని । కేది తగునది సేయుము మేదినీశ ॥ వ॥ అనిపున
ర్వనవాసకరణంబు దోఁప వాడిన నవ్వియధిష్ఠిత సత్యవ్రతుండై నయుధిష్ఠిరుండ తనికిట్లనియె ॥ క ॥ నిండె సమయాబ్దము
లునిం । కొండనలేదిపుడచని సుయోధనుతో భీ । ష్ముండును గురుఁడు వినఁగా । నిండె ననుమునిండె నిండె వికల్పంబునకున్ ॥
చ ॥ అని తగఁ జెప్పి పుచ్చ జని యాతఁడు తప్పక చెప్పెనంతయు । న్వినిధృతరాష్ట్రసూనుఁడు వివేకవిహీనత వాఁడి రాత్రి
కొ । ల్వునగురు భీష్మకర్ణకృపులుం దనతమ్ములునుండ ధర్మనం । దనునకుదూతఁబుచ్చిన విధంబు ప్రకాశము సేయ కిట్లనున్ ॥
గీ॥ మనము మోసపోయి యనిమిషపతిసూతి । తోడఁ బోడిచితిమి యదోషవృత్తి నతఁడు సమయకాలమంతయుఁ గడచిన । వ
చ్చె నొం యెఱుంగవలయు నిజము ॥ క॥ అనినవినియెటి మాటలు । వినువారలునగ రెయే నువివ్వ బ్బుఁడువ । చ్చిన యపుడ తెలు
వనేవల । దను మానము సమయకాలమట మునుగడచెన్ ॥ క ॥ అనవుడు భీష్ముని పలుకులు ॥ వినియందఱుసమ్మతించి వీడ్కొడి

శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడవచ్చుట.

యేఘ । ల్గునుఁడనిరి వలియుఁ బురికిం । జనియెను మఱునాఁడు కురలసైన్యంబులతోన్ ॥ వ ॥ ఇవ్విధంబున బ్రకాశులై పాం
డునందనులు శమీవృక్షనిక్షిప్తసమస్తసాధనంబులు పూజాపూర్వకంబుగాఁ దెచ్చికొని యుపప్లావ్యంబున వసియిం
చి మత్స్యమహీనాథుండు వంపు సేయం బెంపు మిగిలి పౌరజానపద నానావిధోపహారంబులు గైకొనుచు బహుయత్నంబు
లకు భాజనంబులై మహనీయ విభూతి శోభిల్లనున్నంత వాసుదేవుండు బలభద్రపురస్సరంబు గా సాత్యకిసమేతుండై సు
భద్రాభిమన్యులం దోడ్కొని కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండు సాంబుండును యుయుధానుండును రుక్మిండును నన క్రూరుం
డును నింద్రసేనాది పాండవసారథులును రథారూఢులై కొల్చి రామటియును ననేకయాదవకుమారులును గరితురగస్యం
దననిబిడంబులగు బలంబుల తోడనిరుగెలంకులనడువం జనుదెంచి ॥ గీ ॥ భవ్యవిభవంబుతోను పప్లావ్యపురము । సొచ్చినం
గ్రమమునఁ బాండుసుతులుదనకు । నెదురువచ్చిననాహ్లాదమెసక మెసఁగఁ । దత్సమాగమయోగ్యవిధంబు నడిపె ॥ వ ॥ బ
లదేవప్రముఖులకును దదీయసందర్శనసముచితసమాచారంబు లొనర్చి సుభద్రాభిమన్యులం బాంచాలి పాలికిం గొని
పోవ నభ్యంతరజనంబుల నియోగించి ॥ క ॥ లలితమణిమయవిభూషణ । ములురుచిరాంబరములును బ్రమోదమెడదని
ట్టలముగ హరికుంతీపు । త్రులకెల్లను విచ్చిపిదప ద్రోవదికిచ్చెన్ ॥ వ॥ ఇట్లుగట్టనిచ్చి వేలు వేల రథకరితురగదాసదాసీజ
నంబులనొసంగి పద్మనాభుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారుచుండె దదనంతరంబ ॥ సీ ॥ ద్రుపద
మానిభుఁడు పుత్రులుదాను జతురంగబలములతో వచ్చె పాండుసుతులఁ । గాంచి వారలు దమ్మెగరమునం బ్రీతిమైగార

వింపఁగ సందేగాశిరాజు। శైబ్యుండుఁ బదపడి సైన్యసమేతులై చనుదెంచి ధర్మనందనుఁడు సేయు। సత్కారముల గాఢసన్తోషంబును బొంది రవ్విరాటుండును నంతవట్టు। వారలకుఁ దత్తదుచితప్రకారములఁ బ్రి। యంబు దలకొనసంస్థానంబు సేసె। మఱియు బహుదేశముల బంధుమాన్యమిత్ర। వర్గములు వేడ్కఁ బెండ్లికి వచ్చెఁ గలయ * వ॥ ఇవ్విధంబున రెండు దెఱంగుల చుట్టంబులునైన భూపతులు తమతమవిభవంబులు మెఱసి వచ్చియుండ విరాటుండు పురంబున నుత్సవంబు సాటించిన * క॥ కలువడములు మణితోరణ। ములుఁ గట్టిరి క్రముకకాంక మోచాస్తంభం। బులు నాటిరి కుంకుమమునఁ। గలయంపులు మ్రుగ్గులిడిరి కర్పూరమునన్ * క॥ వివిధాలంకరణంబుల। నవకాంతి వహించి పట్టణంబు వివాహో।త్సవమాధవలక్ష్మికి లలి। తవనంబై యొలమి కలిమి తావలమయ్యెన్ * ఉ॥ తానను దేష్ణయుక్ సుతులుఁ దమ్ములు బంధులు గంధమాల్యానాల్ వానవరత్నభూషణమునఃప్రియమాంగలిక ప్రసాధనా। నూనవిభూతిమత్స్యవిభుఁ డుజ్జ్వలలీల వహించి భూమిదే, వానయనాదికృత్యవరులైన జనంబుల గారవించుచున్ * వ॥ గరువంపు సంభ్రమంబుతోడ నిజమందిరంబునందు * సీ॥ అమలరత్నప్రదీపావలి మెఱుఁగిడఁ బనిచి మణిస్తంభపఙ్క్తి గ్రొత్త। జిగిఁ దళుకొత్తునట్లుగఁ దొడరించి విచిత్రవితానముల్ చెలువు మిగులఁ। గట్టించి నూత్నముక్తాదామములతోడఁ గుసుమమాలికలెడ గ్రుచ్చి ప్రేలఁ। గీలింపవియమించి కేవలమంగళభూరుహపల్లవతోరణములు। సంఘటింపనిరోగించి చందనమునఁ। బలిణియాగారములు కంగఁ బాణియాణి। గలుగుముత్తియముల మ్రుగ్గుగానొనర్పఁ। జతురపుణ్యాంగవాజవతతి నమర్చె * క॥ వైదికలౌకికవిధిసం। పాదితవివిధార్హవస్తుభరితత్వమునన్। వేదిక పొలుపగునట్లుగ। మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్ * క॥ ఉత్తరనలంకరింపను। దాత్తాభరణాదివస్తుతతి యొసఁగిన రెం।ద్రోత్తముఁడు నేర్పుగల చెలి। కత్తియలం బనిచెఁ బ్రీతిగడలుకొనంగన్ *

## అభిమన్యునివివాహమహోత్సవము,

వ॥ ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుండగు మత్స్యమహీనాథుండు మౌహూర్తికాదిశిష్టజనములు పరివేష్టింపనుండి లగ్నంబాసన్నంబై వచ్చెనని ధర్మతనయున కెఱుఁగింపఁ బనిచిన నతండును ననుజతనుజసహితంబుగా నలంకృతుండై వివిధప్రసాధనశోభితులగు సమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరుగలవారువంబులను మట్టపుదట్టంబు సేసికొని మణిగణంబులు నంబరనికరంబులుఁ బువ్వుపుంజంబులు ఫలప్రచయంబులులోనుగాఁ గల యారోగ్యవస్తువులవిస్తరిల్లిన క్రాంతముం పటనడువ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వందిజనవాక్యసంతానంబులు నెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటుమందిరంబునకేతెంచి శంఖజయఘంటాపణవాదినిక్వణంబులతోడ నెదురొక్కనిచల్లు సేనలు గైకొనుచుం జొత్తెంచిన * క॥ విరటుఁడు సంభ్రమమునునా। దరమును భక్తియును వాత్మఁ దలకొనఁ బూజా। పరుఁడై సమయసముచితా। చర్ణంబులు నిర్వహించెనసద్ధలీలన్ * గీ॥ విహితపరిపాటితో విప్రవృద్ధజనులు। పుణ్యకర్మపరంపరఁ బూనినడువ। నర్థిఁ గృష్ణయుధిష్ఠిరపార్థమత్స్య। వరులు దెఱయొద్దన వధూవరుల నిలిపి * వ॥ సాంవత్సరికదత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యరవంబులు సెలంగ నంతఃజయెత్తించిన * ఉ॥ వీనులఁ దియ్యమెక్కఁ మువ్విన్న పరస్పరరాగవృత్తిలో। నూనినఁ జూచు వేడుకలనువ్విళులూరెడు నేస్తంబుల। చొచ్చినొకయింత పేపు నెడ సొచ్చుటకోర్వక యుండనున్నయ। మ్మానినియుం గుమారుఁడును మానని కారము లంకురింపగన్ * వ॥ అన్యోన్యావలోకనంబు సేయు నవ్వేళ * సీ॥ వరుచూడ్కి ముద్దియవదనంబుపై వ్రాలి తివుటమైనను గాంతితీపు గ్రోలు। సుందరీరత్నంబు చూపు మనోహరు నడుగులయొప్పుపై నల్లనడచుఁ। బతివిలోకనములు పడఁతుక మైదీఁగఁ గల యంగఁ బలుమఱు మెలఁగుచుండు। వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున నెగసి మోమున సోఁకిమగిడి వచ్చు। నెండొరుల లేఁత చెమటలనూని వ్రేఁగు। నడిపచాప్పున నవయవభంగులందుఁ। దగిలి మఱుపునఁ దడయనిద్దఱవిశాలనయనదీప్తులు నెఱుకవబయలువడఁగ॥ తదనంతరంబ * గీ॥ ఒండొరుల దోయిళులనిముపొందఁ జేయ। నతుత ప్రారంబులన్యోన్యమస్తకములఁ బోసిరి మందారకల్పలతలు। విరులగమియనొండొంటిపైఁ గురియునట్లు * చ॥ లలితతనూవిలాసములలజ్జకతంబునఁ జేసి ముసుగ్ని। చ్చలవిడిఁ బర్వఁగా వెరవు సాలక యారలు వాఱుచూపులన్। లవిదలఁ బ్రాలువోయునెడలందగ వ్రేంధిన నాలుకొల్పి యయమ్మలఁ బరఁగింతురొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్ * గీ॥ చిత్తనుఁ గాఢరా

గంబు చేతఁజూపు। తెలుఁగుదోఁపఁ గెంపారెడు లేఁబోఁడి మృదులపాణిఁ గుమారుఁడు మెలపు మైఁ గ్రహించెఁ బల్లవాలం
బిమ త్రైభలీల॥ ఇట్లు పాణిగ్రహణం బాచరించి * క॥ పెనుగుదుటనిడి చూతం। బును నవమాలికయుఁ బోలె బొలుపొంది
రతం। డును నమ్ముగ్ధయు నేకా। సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యముఁ గ * సీ॥ కోర్కులు గెడగూడు కొనిపార మేదిన
చిత్తంబులూఁ బటఁజిగుళులొత్తఁ। బులకాంకురములకుఁ దల తాఁకులై యిరు మేనుల మవ్వంబు మిగిలి పొదలఁ దఱి వేచిచనఁ
బోయి తడఁబడి మార్పడి వడిచూపులాదటఁ బయలుపడఁగఁ। జెమటలతావులు తనలోనఁ గలసి కేళి కొక్క సౌరణమయి చొప్పు
చేయ। గాఢసంపన్నర్మభంగులఁ గలుగునట్టి। పెండ్లి సమయకృత్యంబుల నొడలి సౌఖ్య। రసము పెన్నిటఁ బోరిఁ బోరిఁ గ్ర
మ్మఁదేర। సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు * వ॥ ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణి
భూషణంబు లురుచిరాంబరంబులుఁ గర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ దాంబూలంబులతోఁ బళ్లెరంబులఁ బచరించి పాండ
వులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురోహితప్రకరంబునకుం గట్ట నిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధా
నంబు లంతఃపురవర్తులైన యర్హజనంబుల చేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజ ప్రశతియును లోకోత్తర తురంగదశసహ
స్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనంబులక్షయు మఱియు నానాప్రకారంబులగు ధ
నంబులు నరణం బిచ్చె నమ్మహనీయ మహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగనలవలనను నృత్తగీతాదివైచి
త్రను మనోహర నారీజనంబులవలనను వినూత్నరత్నమయ భూషాదిసమస్తాలంకరణ విరాజమానులగు సుకుమారచతురపరి
హాసాది విలాసంబులవలనను బ్రభూతవిభవవిభ్రాజితులగు రాజసూనుల మాననీయగుణలలిత విహారవిశేషంబుల
వలనను బాంచాలయాదవ కేకయాది బాంధవవ్రాతమహిమాంచిత సంచరణంబులవలనను మత్స్యమనుజపతిమందిరం
బు పరమసంపద్భరితంబై యుండెనని చెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు॥......................................*

---

క॥ కుంతీనందను లట్లత్యంతవిభవ మెసఁగఁ బరిణయము చేసి సుహృ। త్సంతోషోజ్జ్వలులై తదనంతర
మెబ్భంగి నడిచి రనవుడుఁ బ్రీతిగా. చ॥ అమృతమయాత్మభక్తిసుగమానుభవోజ్జ్వలదివ్యవర్తిమ। త్స
మయగతానుభావపురుషత్రయతావివిధస్వభావని। ర్భరమహృదయైకవాసమునిరంజనసత్యవిలాస
దోషసం। గమవినికరవావరమగౌరవధుర్యపదప్రవర్తనా * క॥ దుర్వహవటుతావత్రయ। నిర్వావ
ణకరణబోధనిర్మలజనహృ। త్పర్వాచరణమహాసుర। గర్వహరణతత్వసంప్రకాశనకరుణా॥
మాలిని * నిగమకుసుమగంధోన్మేషపూతాభిధానా। సగుణవిగుణలీలాసామ్యసాక్షిత్వనా
నా। జగదవనవిధానస్థైర్యదత్తావధానా। నగశరధినివాసానందసంస్తూయమానా॥

గద్య * ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధా
రాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన
విరాటపర్వంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.
ముగిసెను.

---

శ్రీకృష్ణార్పణము.



ఉ॥ తిక్కనసోమయాజి జగతీనుతసద్గుణరాజి సత్కవుల్ ప్రెక్కువిధంబులం దనదు పేర్మి
నుతింపమనోహరంబుగా। నెక్కుడు వేడ్కఁ దొల్లి రచియించిన భారతమందుఁ దద్దపెం।
పెక్కు విరాటపర్వమిది యొల్లెడ నిచ్చలు మెచ్చు గొల్పెడున్॥............................*



౧౯౪



# శ్రీరస్తు.

## శ్రీహయగ్రీవాయనమః.



# శ్రీమదాంధ్రభారతము.

## ఉద్యోగపర్వము - ప్రథమాశ్వాసము.

శ్రీగౌరీపల్లవపుట। యోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ। యోగీంద్రసంతతాంత। ర్యాగనుపరిపాకరూపహరిహరనాథా ✻ వ॥ దేవా వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె ✻ గీ॥ ఎలమినభిమన్యుపెండిలియవ్విధమునఁ। జేసియుల్లాసలక్ష్మికైసేసిమత్స్య। మనుజపతియన్వయంబుపావనముచేసి। దినచతుష్టయానంతరమునఁ బ్రియమున ✻ వ॥ ధర్మతనయుండుతమ్ములుంగొడుకులుం బరివేష్టించియుండ విశాలరమణీయంబగు విరాటుకొలువుకూటంబునకరిగియుండు ✻ క॥ విరటుఁడుఁ జాంచాలుండును। హరియునురాముండువారియనుజతనూజుల్। పరిణయసమాగతాఖిల। ధరణీశులుఁ గొలిచియుండఁ దద్దయునెమ్మిన్ ✻ వ॥ ఉన్నసమయంబునసభాసదులైనమానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణయుధిష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ బాండవకార్యార్థియై కృష్ణుండు తదీయవచనంబులువారించి వారలఁ గలయంగనుంగొని యిట్లనియె ✻ వ॥ కపటద్యూతమునందుసౌబలునిచేఁ గౌంతేయులాత్మీయరా। జ్యపదభ్రంశముఁ బొంది సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం। గుపితస్వాంతులుగాక తత్సమయసంక్షోభంబుగాకుండఁగా। విపినావాసముగూఢచర్యయునుగావింపం దలంపొప్పదే ✻ గీ॥ తలఁచినట్లవ్రతమునలిపియమ్మాడ్కిఁ బం। ద్రెండువత్సరములుపాండవేయ। లకటక్రూరసత్వయాతుధానావలి। తోడఁగాననమునఁ గూడిమనరె ✻ క॥ పదపడిదుస్తరమగునీ। పదమూఁడవయేఁడుగడవఁ బడుటయరిదిత। మ్మనెరెఱుఁగమికైయాపద। లొదవిన సైరిందరిట్టియునికియుఁ గలదే ✻ క॥ మీరలుధర్మజువర్తన। గౌరవమెఱుఁగుమరకాదె కావుననాగాం। ధారీతనూభవులకును। వీరలకునుహితముగావివేకప్రౌఢిన్ ✻ గీ॥ ధర్మమార్గంబుదప్పకతలఁపుడొక్కట। తెఱఁగుధర్మువుదప్పియుధిష్ఠిరుండు। వడయనొడఁబడఁడయ్యెంద్రపదవియైన। నుచితగతినెంతవడసిననుల్లసిల్లు ✻ వ॥ కావునఁ బాండవులకుఁ బితృధనంబగురాజ్యంబు కపటద్యూతంబున దుర్యోధనుండపహరించుటయు నదివీరలుదిగ్విజయంబుఁ జేసియులవరించికొన్నపదంబగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులుపరిభవించినందెగియితండు వారలకుఁ గీడుసేయరోయమియు మీరెఱుంగుదురీరెండుదెఱంగులవారికింబంచుకువందగుట యుందలపోసితగినకార్యంబు సెప్పనర్హులగైననునాకన్నంతచెప్పెదవినుండు ✻ క॥ కుంతీతనయులుసమయము। శాంతతమైనడిపితమభుజాబలమునుదు। ర్దాంతోద్యమశౌర్యమునెఱిఁ। గింతుమనుచునున్నవారుకినుకెదఁగదురన్ ✻ క॥ వీరితలంపెఱిఁగినగాం। ధారీతనయుఁడుసుహృద్వితానముఁ గూర్పం। బోరఁ బరిమార్తుఁ గొంచెపు। వారైయున్నెడనయనియవశ్యముగడఁకన్ ✻ క॥ అలఘుబలవిక్రమోదా। త్తులకైననుదళములేకదౌర్గత్యముమై। గెలువఁగవశమెసహాయము। కలిమిననంతంబులగుపగఱసైన్యములన్ ✻ క॥ కావునఁ బాండవపతుము। భూవల్లభకోటియిచటఁ బ్రోవగునెమ్మైనావీరులునీవీరులు। దేవాసురులట్లయనికిఁ దెగుచఁ రుగడిమిన్ ✻ వ॥ ఇదియిక్కడికార్యంబునకుఁ దోఁచిన తెఱంగక్కడివారిచిత్తవృత్తియెట్టిదగుట యెఱుంగమెదిరితలంపెఱుంగక యిది కార్యంబనినిశ్చయింపనగునే కావుననీయవసరంబునఁ దగినమానిసినందులకుంబుచ్చువలయు దుర్యోధనుండువీరికిరాజ్యంబుపాలిచ్చిన మేలట్లుకాకతక్కినయప్పటికిఁ బోలినపనిచూచుకొందమనిపలికినవినిబలదేవుండియ్యకొనిరాజలోకంబునాలోకించియిట్లనియె ✻ క॥ హరివాక్యమువింటిరెయిదియిరుదెఱఁగులజనములకునుహితమునుధర్మో। త్తరమునునైయున్నదియిం। పెరపునశక్యంబుమనకువీరలఁ దీర్పన్ ✻ చ॥ తమసగపాలుగోలువడిదానినయప్పుడుగోరువీరికిన్। సముచితవృత్తినిచ్చితమసామునసంతసమందియుక్కియా। కృతకృతరాష్ట్రసూనునకుదాననపాయనములేకయుండుఁగా। పనుడిగివీసుసేయుదురుబాంధవమిజ్జగముం బ్రియంవదుకన్ ✻

వ॥ కావున నీకార్యం బెడసేయక యొక్కరుండును వలయువాఁ డనుం జనియభిమతంబు సాధించు నప్పుడు॥ గీ॥ మాటపొం
దెఱంగిరి యోట మైనల్లన। చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి। కనుగుణంబుగాఁగ నాననుండగుచుఁ బ్రా। ర్థించి యడుగ దన్నఁ దె
లుఁగుపడదు ॥ వ॥ అది యెట్లనిన ధర్మనందనుండు తనయుద్ధతికిం బుఱులోడి మై వడిగలనడవడిం బ్రవర్తిల్లుచుండి యు
జూదంబు వెంట మోసపోయి తొడరి చిక్కనంబడియె నదియును నతం డక్షవిద్యాపాటవంబు తనకు మిగుల లేమిం జేసియు
బంధుజనంబులు తన్ను వారించుటయుం దా నాడుటమాని గాంధారరాజునియమించినం దత్కళాకౌశలంబు నంబరిణతుం
డుగావున నాశకునియాడి యుధిష్ఠిరుం డోడిన యొడ్డెల్ల గెలుచుచు వచ్చె నట్లగుట నాతనియందును గొంతలేదు తెలం
గున వారలధర్మపరులని నిందింప నాకునికిం గారణంబుగా వీరలు పుట్టిన మానిసి వినయంబుతోన యి కార్యంబు దీర్చికొ

॥ సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁ గూడదని చెప్పుట. ॥

నిరావలయునని న సాత్యకి కోపించి యిట్లనియె ॥ గీ॥ ఇట్టు లాడఁ దగునె యిది నీకపోలుని। న్నెమనంగ నేర్తు నిత్తెఱంగు। పాడి
గాఁగఁ బూని పలుకంగఁ జెనియొడ్డి। యాదరించువారి నందుఁ గాక ॥ క॥ వేడుకపుట్టిన జూదం। బాడెనె ధర్మజుఁడు వారలం
దఱు సభలోఁ। గూడికొని బిలిచి బలిమిన। యాతని కపటజయముగొనుట యది తగవగునే ॥ క॥ ధర్మతనూభవు దెసముపూర్వ
ము రూపించి సభనొకండును మైమైఁ। బేర్మి చెడకపోనేర్చునె। ధార్మికులిం కెట్టివారు తథ్యఁబరయఁగా ॥ చ॥ పలికినచంద
ము న్నెఱపి పైతృకమైన నిరాజ్యభాగమి। మ్ములఁ బడయుం డలంచి బలముం జలము న్నెఱపంగడంగుపీ। రలు నోరు వేఁడ
బోదు రెయ గాతులు సాధులమెత్తు రేరణం। బులజయులక్ష్మి చేకొనుటఁ బోలునె యొండొక రాజధర్మముల్ ॥ గీ॥ సముచిత
ములసుహూటలఁ జక్కఁబడక। తక్కెనేనుక్కివుండసుధార్తరాష్ట్రుఁ। గ్రూరశరముల నేసియ్యకొలుపువాఁడ। నవని
క్రాంతేయులకునిచ్చునట్లుగాఁగ ॥ క॥ భీమార్జునులకు రణమున। నేమగలును ప్రతియె వీరు నేనును సైన్యోద్దాములమై గ
డిచిననే। భూమీశులు నెదిరి బ్రదికిపోవంగలరే ॥ గీ॥ కవలవారుఁ గొడుకుగమియుఁ బాంచాలవ। ర్గంబు వృష్ణివరులుఁ న
డఁగి రేని నొక్కమాత్రలోనసువ్వెత్తుగోనరెను। రోయ్ధనాదిశతము రుద్ధపడిని ॥ క॥ ఈమత్స్యపతిసహాయుఁడు। గా
మాకుం దీర్పరాని కార్యము గలదే। సామాద్యుపాయపరుఁడు। ద్దామ భుజాబలయుతుండితఁడు గేవలుఁడే ॥ క॥ నామతి
మునఁ గార్యము సతి। గ్రాహముసేయుట యెప్పగాకీలోనన్। సామవచనంబులకు ఱు। భూమీశ్వరుతోడనాడఁ బుచ్చె
దరే నిన్ ॥ ఉ॥ దైన్యము దక్కి దూతయు చితంబుగఁ బాండుసుతు పాలుపాలురా। జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెను
నన్నలోకసా। మాన్యవిధిం దగం గరిసుంబునని బ్బనఁ బుద్ధి కొందము। న్యోన్యవిరుద్ధభాషణములాడిన దప్పలమాతఁ
డొందెడున్ ॥ వ॥ అనిన విని ద్రుపదుండిదివోలు బలదేవు మాటమాటగాదు బలపరాక్రమవంతుండును సహాయసంప
న్నుండును దుష్టాత్ముండును నైన దుర్యోధనుం డుప్రియవచనంబుల రాజ్యంబు పాలిచ్చుటకొడంబడమి సిద్ధంబు యుద్ధంబు
నంగాని చక్కంబడదని పలికి సాత్యకియుం దానిట్లనియె ॥ క॥ మృదుభాషణముల దుర్జన। హృదయములు ప్రసన్నతాముహిమఁ
బొందునె యొల్లిదముగఁ గొనియంతంతకు। మది మెక్కంగాక దురభిమానము పేర్మిన్ ॥ వ॥ అదియునుంగాక ॥ గీ॥ హాటకై
ద్రోణభీష్ములుసుమతియనక। యనుసరింతురు ధృతరాష్ట్రుఁడును దనూజ। తృష్ణమానిన వాఁడు రాధేయు బోటి। తులువ
లెల్లను నతని సద్బుద్ధియండ్రు ॥ వ॥ కావున నతండు దుర్వినీతుండై యుండు నెల్లభంగుల సమరంబు గాఁగలయది యీస
మయంబున బలంబులం గూర్చికొని పిలువం దగు రాజులం బిలువం బంచి యుద్ధసన్నద్ధుల మై యుండవలయు సుయోధనుండు
ను దొడాసపడి పుచ్చును దితపరులగు నరపతులు దొలుతఁ జెప్పిన వారికి సహాయత్వంబుఁ జేయఁ జూతురు మనము వెసగల
కాలకుల వేగంబు ద్విశల్య కేకయ జరాసంధతనయ ధృష్టకేతు ప్రభృతులైన భూపతులకును వారి వారి బంధుమిత్రజనం
బులకు నెఱింగించుట కార్యంబిది నాకుం బోలిన తెఱంగని పలికి తనకెలన సముచితాసనంబున నున్న విప్రవరుం జూపి ॥ క॥ ఇ
తఁడు మదీయాగ్రపురో। హితుఁ డితనికి నెల్లపనులు నెఱుఁగించి తగఁగా। ధృతరాష్ట్రు కడకుఁ బనుపుఁడు। చతురవచనరచ
నఁగ నపి సంప్రీతి మెయిన్ ॥ ఉ॥ ఆతని సమ్ముఖమ్మునఁ దదగ్రణమాజుకడన్ ధురున్నది। జాతుని సన్నిధింగల సంభవునో
ద్దఁ గ్రమోదితంబుగా। నీ తెఱఁగిట్టులాడుమని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా। నీతి మెయిం దగం బలుకు నెయ్యములాభ
ము పెంపుఁ జొప్పడున్ ॥ వ॥ అనిన వాసుదేవుండు పాంచాలపతి వచనంబు లుచితంబులై యున్నయని యిట్టింగిన చేయ

వలయునని పలికి మఱియు నిట్లనియె * క ॥ కౌరవులును బాండవులును । వారయ నాకొక్కరూపయట్లగుటం దగఁగా । వారును వీరును దమతమ నేరిమి మెయిం ధరణియేలి నెగడంగఁ జూతుర్ * గీ ॥ పెండ్లికి నిబ్బంగిఁ బిలిచిన బ్రియముతోడ । నేగుదెంచితి మిన్నాళ్లు నెల్ల యొప్పి । దములఁ జూచితి మియ్యెడఁ దడవు గాఁగ । నిలువఁదీఱదు పోయి రావలయు మాకు * వ ॥ అని పలికి క్రుపదు నాలోకించి మీకు సమాకెల్లవారికి గురుస్థానంబు మీమాటయసిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు మిమ్ము శాంతనవుండును గొనియాడు మీయందు ద్రోణకృపాదులు సఖ్యంబు పాటింతు రట్లగుటం జేసి * గీ ॥ పాండవార్థమైయొక్కరుఁ బనుపమీక । భరము మీ పలుకండ అపలుకు మీరు । తెలుఁగు పఱుపంగ మిగిలియు ద్రేకులైన । వారు సెప్పుదురు విపుల విచారవిభవ * క ॥ పొందైన లెస్స విరసవు । గ్రందయ్యెడు చంద మైన రాజులనెల్లన్ । ముందర రావించి క్రమం । బొందఁగ మమ్ముఁ బిలువఁ బంపు డొయ్యనఁ బిదపన్ * క ॥ మీపనుపున రాజ్యము పా । లీ పాండుతనూభవులకు నీకున్న భుజాటోప భయంకరుఁ డర్జును । కోపానలపడ విముట్టికొనదే వారిన్ * చ ॥ అని గమనోన్ముఖుండయి మురాంతకుఁ డా ద్రుపదుం బు ధర్మనం । దనుఁడు వృకోదరాదులగు తమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద । న్ననుప హలాయుధ ప్రభృతి యాదవలోకము తోడ రాముడం । బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వలవైభవంబునన్ * వ ॥ వివాహమహోత్సవంబున సవచ్చి నతక్కటి రాజులును సమరసన్నాహంబునకై తమతమ పురంబులకుం జనిరి తదనంతరంబ * క ॥ సమరమునకుఁ దగును ద్యో । గమునం బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు మ । త్స్యమహీనాథుఁడు నుత్సా । హము సేసె ద్రుపదవిభుఁడు నాయితమయ్యెన్ * వ ॥ ఇట్లు సన్నద్ధులై వెండియుఁ బిడిసితపసుకు సమరసక్తులైన రాజుల పాలికిం దగిన దూతలం బనిచి రంతనట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనమిత్రగణంబైన రాజలోకంబునెల్ల రావించిన * క ॥ ఇభ తురగ స్యందన గతిరభసంబునఁ బృథివి యద్రువ రాఁ దోడఁ గిరిభూ । విభులును దిక్కుల నుల లోకభయంకరలీలను భయకటకంబులకున్ *

## ద్రుపదుఁ డనఁ బురోహితుని దుర్యోధనుకడకు దూతఁగాఁ బంపుట. *

వ ॥ అట్టియెడ నజాతశత్రు ననుమతివడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుండైన తనపురోహితుం గురుపతి పాలికిం బనుపువాఁడై యతని రావించి * క ॥ హితుఁడవు మతిమంతుండవు । చతురవచనకోవిదుఁడవు సమయజ్ఞుఁడవు । న్నతవంశవర్ధనుఁడవు । గిత వేదివి నెచ్చెలి విసుకృతి వట్లగుటన్ * గీ ॥ నాకుఁ గర్తవ్యమగు పనిసేకుఁ జేయఁ । దగవు గావున నెల్లవిధములం బూని । పాండవార్థంబు ధృతరాష్ట్రు పాలికరిగి । నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు * వ ॥ అని చెప్పి యొకంబ తెచి యతనితోఁ బుట్టి మఱియు నిట్లనియె * క ॥ ఏను కొడుకు గొన్న వేదురు । గోనికొట్టిన తిండి కాండు మతిలుండతఁ డా । జనపతి చందము ధర్మజు । నసుపమశీలంబు నెఱుఁగు నదియట్లుండెన్ * గీ ॥ పుడమి పాలు పాండవులకు నడుగఁ బోయి । నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన । యుచితమాడి వనంబుఁ బొందొందియున్న । దొరల భృత్యుల మనములు దిరుగఁ బడవె * క ॥ గురుభీష్మాదుల మనములు । దురమునకుం జొరక యుండ దుర్యోధనుఁ డా । తురుఁడై యొడఁబడుపఁగని । ప్పురుసున నేర్పైన నతిచ్చ వహుబలమెల్లన్ * ఉ ॥ పాండుతనూభవుల్ వడిన పాటులు బాంధవులకెల్లఁ దెల్పుచుం । బండితవృద్ధసజ్జనుల పాలికిఁ బోయి సలోచితంబుగాఁ గుంకుటచూపి చెప్పుచుం బ్రియోక్తులం దక్కటివారికెల్ల మే । లొండొక చంద మొప్పదని యుల్లములం దలపోయఁ జేయుదున్ * వ ॥ మఱియు సమస్తజనంబుల మనంబులుం బ్రియోక్తులనిక్కడ వ్రాలునట్టి యుపాయంబు లెన్నిగల వన్నియును వ్యైతగవు మైనా చరించరియించునది యిచ్చట విరాటుకొలువు కూటంబున నంబుట్టిన కృష్ణాదుల సంవాదంబు తెఱుఁగు మమున మెఱింగిన యది యతదనురూపంబుగాఁ బలికి పాండవులకుం దేజోలాభంబు గలుగంజేయుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్ర గాంగేయ విదుర గురు కృపాదుల యిండ్లకరిగి నానాఁటికి వారిచిత్తంబుల తెఱంగెఱింగి ప్రవర్తింపుము దైవగతిం జేసి నీయాడినసూత్రంబునకు సుయోధనుండొడఁబడియెనేని యదియ సకలజనసమ్మతంబైన విధంబు దానన జాతశత్రుండును బ్రీతుండగుఁ బోయిరమ్మని నిశ్చయంబు సేసిన నమ్మహీసురవరుండు * క ॥ మును పాంచాలవిభుని వీడ్కొని ధర్మజు భీమునకు నకులసహదేవుం । గనియును మతుఁడై యందఱు । ననుపఁ గమన్నన లువడసి యరిగెం బ్రీతిన్ * వ ॥ అంతనక్కడ సుయోధనుండు సకలరాజన్యసామాన్యంబుగా గోపాల దేవు పాలికి దూతంబుచ్చుట తగవగు నెయుని విచారించి * క ॥ వెరవు మెఱుఁగ దానకలివయ । పరిజనసహితముగ నరిగెం బటుతరగతి । న్మురరిపుని హోదఱీలా । సరి

ణతుఁడై వేగిరంపుఁబయనములఁదగన్ * వ ॥ చని తదీయపురప్రవేశంబుచేసె నాదివసంబున ధనంజయుండును గో-
విందుంగానవచ్చె నట్టియెడ * గీ ॥ అతఁడు పవళింపమును గౌరవాధినాథుఁ । డగ్గితలయంపిడెసనున్న తాసనమున । నుం-
డెఁబదపడి కాల్కడయొద్దికల్లఁ । జనవినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి ॥ వ ॥ అంత * క ॥ మేలుకని కృష్ణుఁ డర్జును । నాలోకించి
మఱికౌరవాధిపుఁ గని త । త్కాలోచితబహుమతి మైఁ । జాలఁ బ్రియంబిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్ * వ ॥ తదనంతరంబ *
ఉ ॥ వారలఁ జూచి కేశవుఁడు వచ్చిన కార్యము సెప్పుఁడన్నన । క్కౌరవనాథుఁడిట్లనియెఁ గయ్యము సేయువగన్ సహాయముం ।
గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరునీ । కార్యము నొక్కరూపహృదయంబునఁ బేర్చిన బాంధవంబునన్ *
క ॥ మున్నే నుగాన వచ్చితి । నిన్ను సుజన్ములైనవారు నెన్నిమిమునుము । గ్గన్నఁదగంగైకొందుర । సమున్నతసౌజన్యసార-
యుతుఁడవు నీవున్ * వ ॥ కావున లోకంబు పాడి విచారించి నాకుఁ దోడుగావలయు ననిన వాసుదేవుండిట్లనియె ॥ ఉ ॥ నీవి-
టమున్న వచ్చితి విని కన్ను పార్థునిఁ దొల్లఁ గాంచితిం । గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగఁ దోడుపాటు స । ద్భావము దీ-
నికిం దెఱఁగు తప్పక యుండఁగ నేర్పరించెద । న్నీవల పెట్టులట్ల తగ నీవును నీతఁడుఁ గోరుకొండొగిన్ * క ॥ నాపాటియపదివే-
వురు । గోపాలురు గలరు సమరకోవిదబాహా । టోపాభిరామమూర్తులు । చాపాద్యాయుధకళావిశారదచిత్తుల్ * క ॥
నారాయణాభిధానులు । వారలు కయ్యంబు సేయ వారొక్కెడనే । నూరక నిరాయుధవ్యా । పారతమైనుండువాఁడ బె-
రమాపుఁడనై * క ॥ వారొకతల యేనొకతల । యీరెండు దెఱంగులందు నెయ్యది ప్రియమొ । వ్వారికిఁ జెప్పుఁడు తొలితొ-

(*) అర్జునుఁడు శ్రీకృష్ణుం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట. (*)

లి । కోరికొనన్ బాలునికిఁదగుంబాడి మెఱుఁగన్ * క ॥ అనిపలికి హరికిరీటిం । గనుఁగొని కోరికొండిక వునీవు గావున నీవున్ । మునుగోరఁ-
బాడియనవుడు । వినికృష్ణునిఁ గోరికొని యొలిజయుండెలమిన్ * గీ ॥ దానికాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి । నపహ-
రించికొనినయట్లు గాఁగఁ । దలఁచి చెన్నుమీఱ బలములఁ గైకొని । చనియెఁ బ్రీతి రామసదనమునకు * వ ॥ చనియతనిం గనిస-
న్మానంబు వడసి తనవచ్చిన కార్యంబెఱింగించిన దుర్యోధనునకు బలదేవుండిట్లనియె * క ॥ అభిమన్యువివాహమునకుఁ ।
బ్రభువర్గంబెల్లఁ గూడఁబడియుండఁగ నా । సభ నీకై యేఁ బలికితి । నిభపురమున మాట పుట్టదిట్లీవు వినన్ * వ ॥ దానికిఁ గొంద-
ఱసహ్యపడి పాండవపక్షపాతంబునఁ బ్రతికూలవచనంబులు పలికిన నవికృష్ణునకుఁ బ్రియంబులై యుండె నట్లగుటం జేసి ॥
గీ ॥ అతనిఁ బాసి యొక్కయంతఁ బ్రొద్దైన నిలువఁ । జాలమియెమూలముగ విరసంపుమాట । లాడనొల్లమి నేమియు ననకయుంటి ।
నుండి యొకనిశ్చయమ్ము మైనున్నవాఁడ * వ ॥ అదియెట్లం టేని * క ॥ మీరును వారును జలమునఁ । బోరెడు నెడ నెవ్వరెట్లు
వోయిన విను మే । నూరక యుండుదుఁ దోడై । వ్వారికిఁ బోనింత నిక్కువం బెఱింగిన్ * వ ॥ అనిన విని దుర్యోధనుండు దా-
నికియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని వాసుదేవునామంత్రణంబు సేసి కృతవర్మసాలికిం జనిన నతఁడొక్కయ-
క్షౌహిణితోడఁ దన్నుఁ గలయవచ్చువాఁడై యూఱడం బలికినఁ బ్రియంబంది నిజపురంబునకరిగెఁ దదనంతరంబ కృష్ణుఁ
డర్జునునకిట్లనియె * క ॥ నారాయణగోపాలుర । భూరిపరాక్రములఁ గురువిభుఁడు గొనసంగ్రా । మారంభరహితు నన్నుఁ ।
గోరికొనుట నీకు మేలగు నెతలపోయన్ * క ॥ అనుటయు నాతఁడు హరికి । ట్లను నేను రణంబునకు సహాయంబొల్ల । స్వానసు
ప్రసిద్ధుఁడవు నీ । వని చేసినఁ బేరు నీకయగు నెప్పాటన్ * వ ॥ నీకైదుమరై జయంబుగొనరాదట్లగుటం జేసి విజయమూలంబగు
నీతోడు నువలయు నీవు సహరంబు సేయకునికియ ప్రియంబు కావున నిన్నుం గోరికొంటినని చెప్పి మఱియు నిట్లనియె * క ॥ సా-
రథ్యంబొనరింపుము । పార్థకృపాలీల నెల్లభంగులననికిన్ । గౌరవమునఁ జిరకాలము । గోరినయది దీని నిమ్ము గుణరత్ననిధీ *
క ॥ అనినఁ గిరీటికి హరియి । ట్లను నీదగు కోర్కి దీర్చుటది నాకు వ్రతం । బనఘా తగ సారథ్యం । బొనరించెద నీకు ననమయుద్ధ-
శ్రీఁడగ * క ॥ అని యూఱడించి నరుఁదో । డ్కొని ధర్మతనూజునొద్దకుం బ్రియ మెసఁగం । జనుదెంచెం గార్యాలో । చనమును
దగఁ జేయ బుద్ధిశౌరి దడంకన్ * వ ॥ అంతనట శల్యుపాలికిం బోయిన దూతల తనింగని సముచితాలాపంబుల సమరసహా-
యత్వంబుఁ గోరి పిలిచినఁ బ్రీతుండై యతండును బుత్రమిత్రసమేతంబుగా నానాసేనాసంకులంబుగాఁ గదలి పాండ-
వులున్న యెడకు నిత్యప్రయాణంబుల నడచు సమయంబున * గీ ॥ ఇంతయును విని కౌరవాధీశ్వరుండు । దక్షులగు నాప్తజన-
ములఁ దక్షణంబ । మద్రనాథుని చనియెడు మార్గమునకుఁ । బుచ్చి యెడ నెడ నతులవిభూతి మెఱయ * సీ ॥ అరుదారు మేలుక

ట్లాయితంబై చూడనొప్పారితనువగుచప్పరములుఁ । బలువులై చెలువంబుగరగరికయుఁ దియ్యతెలినీరు గలిగినదీర్ఘికలు
ను। బొడవులై మువ్వంచఁ బొలుచునట్లుగ నేనుఁగులకుగుఱ్ఱములకుఁ గొట్టములును। ముందరబయలైనచందంబుచతురాభిను
తములౌ నాస్థానమంటపములు । బియ్యములుసు నేయి పెరుగునుగూరగా । యలునువంటకట్టియలునుగడ్డి ఖాణములును
బెల్లుగానొడఁగూర్చిని । గూఢవృత్తిఁ దానుగూడనడిచె * వ ॥ ఇవ్విధంబున విడిదలపయనంపు సంపదలు పెంపిరివొ
వందమకు సమకట్టిన సమస్తవస్తువులయవైకల్యంబునకు శల్యుండుసంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులంజూచియి
ట్లుచతురంబుగామనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకులైనయుధిష్ఠిరామాత్యులెవ్వారు వారలందోడ్కొ
నిరండు వారలు ప్రసాద దానంబున కర్హులనివలుకునవసరంబున నటమున్న వారిలోపలం గలసి పలుదెఱంగులఁ బనులు
సేయుచున్నతనపల్లాయనంబు వారిలోమఱువడి యున్న కౌరవేశ్వరుం డమ్మాటలువిని యతనికిం బొడసూపనిది
యసమయంబని సముచితంబుగాఁ దన్నెఱింగించికొనిన నతండును సంభ్రమంబున గాఢాలింగనంబుచేసి కనకాస
నంబుననునిచి యిదియంతయునిమ్మహాత్మునుద్యోగంబుననయ్యెం గావలయుననినిశ్చయించి వినయంబు మెఱయ నీకె
య్యదియిష్టంబు దానిఁగోరు మిచ్చెదననిన గాంధారీనందనుండు పరమానందంబునుబొంది యిట్లనియె * క ॥ సత్య
సరస్వతిపగుమా । చిత్యవిశారదమునీమచిత్తమునీయా । దాత్యంబు మెఱయనాపన । మాత్యుఁడవై పూనినపు
మత్సైన్యంబుల * గీ ॥ తలఁపఁబాండవులునుధార్తరాష్ట్రులునీకు। నొక్కరూపభక్తియుక్తిఁజాల । నీవునన్నుమా
ననీయ్యనిఁగాఁగన । నుగ్రహించితగఁబరిగ్రహింపు * చ॥ అనవుడుశల్యుఁడియ్యకొనియట్టిదకాదెపిభేదబుద్ధినా । మ
నమునలేదుపాండవసమాజముమీరునునొక్కరూపకా । వునదిలెస్సమాటతగవుందలపోయఁగమున్న ప్రీతిఁగాం । చి
ననినునెమ్మిఁగూడుటయ చేయుదునట్టులమెల్లభంగులన్ * ఉ ॥ దానఁగొఱంత లేదభిమతంబిదిగాకయుఁ గల్గెనేనియుం ।
బూనిదొనర్తునన్నఁగురుపుంగవుఁడెంతయుఁబొంగినీవుస । న్మానముచేసినాకిటులమాత్యుఁడవైనవిధంబుకంటె మే।లై
నతికెవ్వకోర్కి యొకండారసిమాటిన నెంచఁగల్గునే * వ॥అనినవిని వికచవదనుండగుచు మద్రేశ్వరుండు * క॥చనునీవు
హాస్తినగరం। బునకేనును బాండుభూవపుత్రులఁ బ్రీతిం । గనియటవత్తునవశ్యం। బును వారలఁజూడవలయుఁ బోయెదన
నినన్ * గీ॥అట్లకాక వేగమటఁ బోయినురలుండు। వరముమఱువకుండవలయుమిమ్ముఁ । జేరినెగడువాఁడఁగారుణ్యము
ననిట। నరసియుండుఁడనియెఁగురువిభుండు * క॥దరహాసముతో మద్రే । శ్వరుఁడాలింగనముచేసి సందియవడకే। వరుస

*శల్యుఁడు పాండవులంజూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.*

మనిపలికెనాతఁడుఁ । గరిపురికింజనియెమదివికాసముఁబొందన్ * వ ॥ శల్యుండుపప్లావ్యంబునకుంజని స్కంధావా
రంబుదరియంజొచ్చి ధర్మనందనునివాసంబునకరిగిన నతండుదమ్ములుందానును ద్రౌపదియు సుభద్రయు నభిమన్యుప్ర
భృతికుమారవర్గంబును నెదురువచ్చి కృతప్రణాములై తోడ్కొనిపోయి కాంచనాసనంబుననునిచి యర్ఘ్యపాద్యాదివి
ధులనర్చించికుశలంబడిగిన సర్వంబునుకుశలసంపన్నంబయని వారలనందఱనభినయించి యుధిష్ఠిరుంబునరాలింగనంబు
చేసియిట్లనియె * క॥జనరహితంబగువనమున । ననుజన్ములుద్రుపదభూవరాత్మజయునునీ । వునునింతకాలమలయక।
యునికికడుఁగాదుష్కరము మహోదాత్తమతీ * గీ ॥ దానికంటెనరిదితలపోయనజ్ఞాత । వాసముజ్జ్వలాంగభాసమా
ను। లైనమీకుమీదయానూనృతాదుల । పెంపుమిముఁ గడనఁబెటకున్నె * క॥ఇమ్మహియెల్లనునీమది । యుమ్మలికకుఁజా
లనొచ్చెనుర్వీశ్వరనీ। విమ్మెయినిప్పుడఖిలమతి । తమ్ములుగడచుటకుసమ్మదమ్మునఁబొదలెన్ * వ॥అనియుచితసంభాష
ణంబులుచేసిదుర్యోధనుండు తన్నుంగాంచినవిధంబును నతండు ప్రార్థించినతెఱంగును దానికిఁదానియ్యకొనుటయుం
జెప్పినధర్మతనయుండిట్లనియె * గీ॥మేలుచేసితిరొక్కని మెచ్చివాని। కోర్కి దీర్చుటపెద్దలగుణముగాదె। యదిమదీయ
చిత్తమునకుహర్షకరము । తివిరియొక్కటి వేఁడెదనవధరింపు * వ ॥ పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయనున్నవాఁ
డుకర్ణుండుపార్థుతో నెప్పుడుమచ్చరించుచుండు వీరిరువురకుసంగ్రామంబైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యంబొన
ర్పంపమీరకానియొక్కండొకొండు లేఁడుగావున నవశ్యంబమీకుఁ గర్ణసారథ్యంబు కర్తవ్యంబుగాఁగలయది. సమరస
మయంబుననిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంకపుట్టించి పార్థురక్షింపవలయు నకృత్యంబనియనుమానింపకుమ

ప్రార్థనంబంగీకరించి యెల్లభంగుల నిర్విఘ్నంబునుష్ఠింపవలయునని యభ్యర్థించిన సమ్మతించి శల్యుండిట్లనియె * క॥ అ
ర్జునదివ్యోలును నాపం । దగవట్టిదకర్ణుననురథంబుగడపనీ । వగుదనికోరినకౌరవ । జగతీపతి ప్రార్థనంబుసలుపఁగవల
యుఁగా * క॥ కర్ణుని సారథినయినను। నిర్ణయముగ నేను బార్థునింగాచెదనా । దుర్ణయవిచారు నెమ్మెయిఁ। గర్ణుకఠోరంబులా
డికలఁతుంబోరన్ * గీ॥ దర్పమును దేజమునుమాయఁదరలఁబలికి। చిక్కువఱచిన నేయంగఁజేతులాడ । కుఁకిరాఘాతనా
జునర్జునుఁడుతీవ్ర । బహుళబాణపరంపర పాలువఱుచు * చ॥ ఇదియొకటేలనీవుఁగఁదినెయ్యదిగోరినఁజేయువాఁడ
నాఁ। డదయతనూతసూతిసభనాడినమాటకుఁజాలనొచ్చినా । హృదయము తెల్లనీవలన నెంతయుఁబత్తము సేయునక్క
టా। యదియునుగాక మీపడినయాపద లెవ్వరినొవ్వఁజేయవే * గీ॥ ఇట్లుపడితిననుచు నెడనీవువగవకు । గారవమున నీవు
నోరథమ్ము । ఫలమునొందు నెల్లభంగుల దేవత । లయినఁబడుదురొక్కయవసరమున * క॥ వాసవుఁడుతొల్లినిజకాం
తాసహితముగాఁగనధికదైన్యముఁబొందె । నీసంపద పెద్దయెవిధి । సేసినగతిఁబడకయుండశివునకువశమే * వ॥ అనిన
ధర్మనందనుం డింద్రుండుశచీసమేతంబుగా నట్టిదురవస్థ యేమికారణంబున నెత్తెఱంగుననుభవించెననియడిగిన మద్ర
పతి తొల్లింటియితిహాసంబుగలదువినుమనియిట్లనియె దేవతలయందుమాన్యుండై త్వష్టయనుపేరంబరఁగువాఁడు వాస
వునకుఁగీడుదలంచి మూఁడుదలలవానినొక్కనిసృజియించి విశ్వరూపనామధేయం జేసిననతండింద్రపదవిగోరి ఘోరత
పంబుసేయుచున్నదానికి భయంబంది నిలింపతి యప్సరస్త్రీలఁ దత్తపోభంగంబు సేయుండని నియమించిపంచిన * క॥
వారివిలాసంబులనువి । హారములవిలోకనములనాలాపములన్ । మారవికారంబాతనిఁ । జేరదయన్నాకపతియుసిగ్గ
దఁగదురన్ * గీ॥ తలరియమ్మునిఁదెగఁజూచిధర్మరహితుఁడగుటయెవ్వరునెఱుఁగనియట్లుగాఁగ। నేఁడుగాలంబుగడపిన
నెట్టిఁగీభూత । గణములాక్రోశమొనరింపఁగానతండు * వ॥ తనదుష్కర్మంబు ప్రకటంబగుటకురోసి యొక్కవిషమ
వ్రతంబాచరించిసముద్రతరుధరణీస్త్రీజనంబులయందు బ్రహ్మహత్యవిభాగించిపెట్టి నిజకల్మషంబుఁబాపికొనిమునిగ
ణసమేతుండై సముల్లాసంబునం బొందియునికికిఁద్వష్ట్ర కోపించి * గీ॥ అనపరాధుఁడపోనిధినధికశాంతి। యుక్తుఁజంపిన
పాపాత్మునకపట్టి। మ్రింగఁజాలెడువానిను త్తుంగదేహు। నేనుసృజియింతుఁజూడుఁడీయాక్షణంబ * చ॥ అనుచుఁగ
డంగినిష్ఠమెయినగ్నిముఖంబొనరించివేలిమిం। దనయుసృజించిలోకవిదితంబుగవృత్రసమాఖ్యయిచ్చిమ। ద్వినుతతపోబ

## * ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు చేయుట. *

లంబునఁబ్రదీపితతేజుఁడవై జయింపునీ। వనినియమించిపంచెనమరాధిపుతో సమరంబుసేయఁగన్ * చ॥ పనిచిననాతఁ
డుంజనియె బాహుబలంబున నేచివాసవుం । డనికెదురేగుదెంచె నిటులద్భుతసంగరమైనచోటన। య్యనిమిషనాథుఁబట్టు
కొనియంగదవృత్రుఁడు మ్రింగె దేవత। ల్మనమునబెగ్గడిల్లఁగఁజలంబుబలంబునఁజూపియుగ్రుఁడై * వ॥ ఇట్లుమ్రింగినఁద్రి
దశగణంబులు తత్క్షణంబయాదైత్యునకునావులించునట్టి యాలస్యంబావహించిన * గీ॥ అసురనాథుఁడునలసతయసర
సిల్లి । యావులించిననత్తఱిని మరశిభుఁడు । దనశరీరంబుసంకుచితంబుచేసి । కడుజవంబునఁగుప్పించి వెడలనుఱికె *
క॥ వెలలిబలరిపుఁడుచలమునఁ। గలహమునకుఁజొచ్చెవృత్రుఁ ఘనబాహుబలం। బలవికిమీఱెనుదంష్ట్రి వి। మలతపమునఁజేసి
సురలమనములుదలఁకన్ * వ॥ ఇట్లధికబలుండైన వృత్రునాటోపంబు సైరింపఁజాలక సురపతి దెరలి మరలిపఱచి
మందరగిరిశిఖరంబునకరిగినంగనుకనిఁజనియునిమిషులతనిం గూడుకొనివృత్రవధోపాయంబుఁ జింతించుచుండ నవ్వాస
వుండునుదనమనంబుననిశ్చయించి * క॥ హరిఁగాంచియతనిచెప్పిన। వరమోపాయంబుసేసి బ్రదుకుదమనినన్। సురల
దియొకర్జమనియా । మురమర్దనుకడకుఁజనిరిమునులుండారున్ * వ॥ ఇట్లుదివిజానీకంబును మునిలోకంబును బాకశా
సనుంబురస్కరించికొని * మ॥ చనియాదైత్యునితెఱంగుసెప్పియతులోత్సాహంబుమైనెవ్వడున్। దనుజవ్రాతముత్రు
ళ్లడంచిదివిజేంద్రశ్రీవిలాసంబుపెం। పునఁబొందించుటనీకునైజముగదా భూతేశ ఘోరారిమ । ర్దనసంక్రీడమొనర్పు
లోకములకత్యంత ప్రమోదంబుగాన్ * క॥ అనిననవినియొకటిసెప్పెద। వినుఁడాతనితోడనమరవిభుననుఁదగఁబొందొ
నరింపుఁడొక్కసమయంబుననడపవఁగులిశధారఁబొందుదు నేనున్ * వ॥ మదీయతేజోవిశేషంబునంబురుహూతున
కుత్సాహంబుజనియింపం గలయదియప్పుడసాయాసంబునంబగతుగెలువనగుననిగడా ధరుండూఱడిలంబలికినబలసూద

సప్రముఖ నిఖిలసురలోకంబు నంతసిల్లి మగిడివచ్చి వృత్రుకడకు మునిజనంబులం బుచ్చిన వారును జని యతని కిట్లనిరి॥
క॥ భుజబలదుర్జయుఁ డింద్రుం। డజేయుఁడవు నీవు నీకు నతనికి ననిలో। విజయ మదక్కదు మీరే। ద్విజగంబులు నెవ్వరణము
సేయఁగ నేలా ॥ క॥ మైత్రిసుఖంబుం బోలునె। శాత్రవ మెమ్మెయి దలంప శక్రశ్రీకిం। బాత్రమవై యింపుగఁ దమి
త్రుఁడవగు మిదియ మేలు మీ యిద్దఱకున్ ॥ వ॥ అనవుడు వృత్రాసురుండు తేజంబు వాసికి నాసపడియెడు మాయిరు
వురకు సఖ్యంబు సమకూర నేర్చునే యనుటయు నమ్మునులు సత్పురుషసాంగత్యంబు సంభవించినం జేయమి నీతి గాదు సు
హేంద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు గావున నతనితోడి చుట్టఱికంబు మేలనిన నొడంబడి యతండు వారల కిట్లనియె॥
క॥ ఏ నెక్కుడు తెఱఁగునసె ప్పెదఁ। దానిం గాదనక చేసితగ చెప్పఁగ సం। ధానము దృఢముగఁ జేయుఁడు। నాకేశునకు నాకు నధిక
ప్రీతిగన్ ॥ వ॥ అది యెయ్యది యనిన నార్ద్రంబైనదానను శుష్కంబైనదానను దరువునఁ బాషాణంబునన శస్త్రంబుల దివం
బున రాత్రియందును నేను వధ్యుండు గాకుండవలయు ననిన దానికి నొడంబడి యవ్వరంబు లొసంగి వృత్రవజ్రధరులకు మిత్ర
భావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగి సురనాథుండు సుఖంబుండి పెద్దగా
లంబున కుందనమనంబునఁ బాయని వైరంబు సైరింపం జాలక దామోదరు పూనికయు మునిజనంబులు సేసిన సంధివిధంబుని
రూపించి రిపుం బరిభవింప రంధ్రాన్వేషణంబు సేయుచుండి యొక్కనాఁడు ॥ చ॥ జలనిధితీరభూమిఁ దనశత్రుఁ గనుంగొని వీ
ని నిపుడు దోర్బల మెసఁగఁగం గనాడు భిదురంబునఁ ద్రుంచెనగా త్రిగాదు తాఁ। దలఁపదివంబు గాదిది యుదగ్రపరాక్రమ మెమో
గ్యసంధ్య నా। యలవుఁ జలంబుఁ జూప నెపమై తగు సాధన మెద్దిగల్గునో ॥ క॥ అని తలఁచుచు నచ్చట నొక। వననిధిఫేనంబుఁ జూచి
వాసవుఁ డార్ద్రం। బును శుష్కంబును గాదిది। యనుచుం గులిశమునఁ గూర్చి యధికరయమునన్ ॥ గీ॥ దానవృత్రుని వ్రేయ
నత్తఱి మురారి। యందుఁ దగ సంక్రమించి యయ్యసురుఁ జంపె। జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ। నఖిలలోకములకు మో
దమావహిల్లె॥ వ॥ ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం జని యెమ్మెఱియును భూతసంఘంబి
ట్లు బ్రహ్మహత్య సేయం దగునే యని యతని నిందింపఁ బ్రభుత్వసంపద చెడుటయు ॥ గీ॥ నీచదశకు వచ్చి నిషధాచలం
బున। కరిగి సురవరేణ్యుఁ డడఁగియుండె। నమరులెల్లఁ గలఁగి యన్యోన్యపీడన। భయముఁ బొంది కూడఁ బాఱి తమకు॥

## దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిఁ జేయుట.

క॥ కావలియై సురరాజ్య। శ్రీ వాలింపంగఁ దగు విశేషంబున సం। భావితుఁడు నహుషుఁ డని చని। యావిభుఁ గని తారు ము
నులు నతనికి నెమ్మిన్ ॥ వ॥ పాకశాసను తెఱం గెఱింగించి ॥ క॥ రమ్మింద్రపదవి చేకొని। మమ్మెల్లను నరయు మనిన మానవ
పతి నా। కన్నహిమకుఁ దగు మాహా। త్మ్యమ్ము గలదె నన్ను నేల యలఁచెద రనినన్ ॥ వ॥ అంత నిలువక యత్యంతప్రార్థనంబు
సేసి ॥ క॥ యమవరుణాదిత్రిదశులు। తమతమశక్తిప్రభావదర్పంబులు భూ। రమణునకుం బంచి యిచ్చిరి। ప్రమోదమె
సఁగంగ మునిసభామధ్యమునన్ ॥ వ॥ ఇవ్విధంబున నిచ్చి యధికబలసమన్వితుం గావించి తోడ్కొనిపోయి పూజ్యంబగు దివి
జరాజ్యంబున కభిషిక్తుం జేసిన నతండును బరమధర్మపరుండై కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది సమస్త
దేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చికొని మహానుభావుండై దివ్యమునిసేవ్యంబైన యద్దేవేంద్రపదంబుఁ జేకొ
ని తుంబురు నారదాది వీణానాదంబులం జేలుచు వినోదపాత్రంబులగు రంభాద్యప్సరోగణంబులు గొలువ నభిమతభోగం
బు లనుభవింపుచు మదంబు మిగిలి మన్మథాధీనుండై వర్తిల్లు సమయంబున నొక్కనాఁడు ॥ గీ॥ మహితలావణ్యమున నస
మాన యనఁగఁ। జనిన పౌలోమి యానహుషునకు నయన। మార్గగోచర యగుటయు మదనబాణ। భిన్నహృదయుఁడై ధృ
తిఁ బాయఁ బెట్టి యతఁడు ॥ క॥ సురలోకరాజ్యపదవీ। గరిమంబున నున్న నన్నుఁ గవయం బరమా। దరలీలఁ జనుర యగునీ।
సరసిజముఖి రామి యేమి చందమొ తలఁపన్ ॥ క॥ అని యప్పౌలోమిం బిలుపిం। చిన నదియును భయము నొంది శీఘ్రమ దే
వేజ్యునిసదనమునకు శరణం। బనుచుం జనుటయును వాసవాచార్యుండున్ ॥ వ॥ పరమాదరంబున నద్దేవిం గారవించి నిన్ను
నహుషు దుర్జయంబు బొరయకుండ నరయువాఁడ నాఖండలుండు నా యత్నంబున నవశ్యంబును దడయక వచ్చు నని
యూఱడించిన ॥ క॥ అదియెల్ల జెఱఁగి కోపం। బొదవఁగ నహుషుండు గురున కుచితమె యే న। మ్ముదితం బిలుపింపఁగఁ దన। స
దనంబున నునుచుట యనియె సంక్షుభితుండై ॥ చ॥ అనుడు మునీంద్రులు సురలు నక్కట నీ మహనీయగౌరవం। బునకుఁ బ

వినిమునుప్రాఁకియిమ్మెయివివేకముగౌతముభార్యఁబొక్కఁగా । సన్నుఁడె
శాంగనంగవయుబుద్ధిజనించఁటయీాడుగాదునా । వినిమునుప్రాఁకియిమ్మెయివివేకముగౌతముభార్యఁబొక్కఁగా । సన్నుఁడె
దఁగోరుచోఁగఁఅవఁజాలరుమీరదియెట్లుసెప్పుఁడా * వ॥ అనుచునతండుకోపించినభయంబునవారలుపౌలోమినతనిపా
లికిందెచ్చువారై పూనిబృహస్పతికడకుంజనియద్దేవివినుచుండనిట్లనిరి * క ॥ నహుషుఁడుమహేంద్రపదవీ । సహితుఁ
డుశచికిఁవరింపఁజనునాతనిలో । కహితంబుగాఁగఁబుచ్చుము । మహాత్మ తద్చిత్తమునయమర్షంబడఁగఁగ * క ॥ అన
ఘుశోకంబడరఁగనిమిషగురుఁజూచియిట్టులనుశచియిటుపం । చినదూఱుగాదెననుశుచి । యునిమీాకొనియాడుటెల్ల
నన్నృతముగాదే * వ ॥ అనినవినిదరహాసితవదనుండగుచుఁబురుహూతపురోహితుండు * క॥ నహుషుండువనుచువాఁ
డటె। విహితానుష్ఠానపరులువీరటెపోలో। కహితఁబటెయిదిమనకుఁ। మహనీయమకాకయెట్లుమానఁగవచ్చుఁ * వ॥
అనియుల్లసంబాడియనిమిషులనుబుషులనుజూచియిట్లనియె * గీ॥ శరణుసొచ్చినరక్షింపఁజాలియుండి। కడపిపుచ్చినసూ
ర్ధ్వలోకములుదప్పుఁ । బుణ్యకర్మంబులఫలతఁబొందుననఁడె । కమలగర్భుండుతొల్లిజగద్ధితముగ * వ ॥ అనియనుకూ
పాలాపంబులనిషేధించిపలికిన వారలట్లైనిటమీఁదఁగర్తవ్యంబెయ్యదియూహింపుమనిన నద్దేవినహుషుపాలికింజనిస
ముచితంబుగాఁదదీయసాంగత్యంబున కెడపలికికొని వచ్చునదియటమీఁద మనమందఱముం బురందరునకభ్యుదయంబ
య్యెడు తెఱంగాచరించువారమనుటయు వాచస్పతివచనంబులకు సంతసించి సురసంయమిసంఘంబు లరిగినయనం
తరంబ * క॥ పౌలోమియునానహుషుని। పాలికిఁజనుటయునతండుభావజవికృతి। వ్యాలోలమానసుండయి। లీలాసంభా
వనాలలితముఖుఁడయ్యెఁ * వ॥ అట్టియెడ * ఉ॥ అల్లనయింతియిట్లనియెనారసివాసవుకల్మిలేమియుం। దెల్లముగానెఱింగి
కొనితేఁకువలేకటవచ్చుటొప్పునా। యుల్లముశంకితంబగుచునుండఁగవేగిరపాటుమేలెనీ । వెల్లనెఱుంగుదిప్పుడెడయిచ్చు
టయుక్తమునాకుఁజూడఁగఁ * వ॥ అనియొడంబఱిచికొంతొకకాలంబెడపలికికొని యింద్రాణియునుగుడంజనుదెంచిన
నసురగణంబును మునిజనసహితంబుగ విష్ణుదేవుపాలికి రహస్యవృత్తింబోయి జిష్ణునిదురితంబువాపుటఁగోరిన శౌరిక
రుణాయత్తచిత్తుండై * క ॥ హయమేధంబుననాకుం। బ్రియమొనరింపంగవృత్రభేదికిబుణ్యో । దయమగునావుకు

ఇంద్రుఁడునహుషుతేజోపిశేషంబుచూచిమఱుఁగువడుట.

వారలు। రయమునఁజనిరందఱుంబురందరుకడకుఁ * క॥ చవియతనినశ్వమేధం । బునఁగల్మషరహితుఁజేయఁబురుహూ
తుండుం। దనపురికినరిగినహుషుం । గనితత్తేజోవిశేషకంపితుఁడయ్యెఁ * వ ॥ ఇట్లువృత్రారితనబ్రహ్మహత్యవాయు
టయొకానినహుషునంతబలంబులేమింజేసిభయాకులితచిత్తుండై * క ॥ ఎందేనిఁజనియెనాతని । సుందరియునునెమ్మన
మునశోకోద్రేకం। బొందిపురందరుఁడరిగిన । కందువయేనిప్పుడెట్లుగాంతునొయనుచుఁ * వ ॥ నిశాసమయంబుననుప
శ్రుతినారాధించినఁదదీయాధిదేవతనీసత్యంబువలననీమగనింగనియెదవనిచెప్పియనంతరంబ సాకారయైపొడచూపినఁబౌ
లోమినీవెవ్వరనియడిగినసదియునుభవత్పాతివ్రత్యసత్యశౌచంబులకుఁబ్రియంబంది వచ్చితినుపశ్రుతిననిచెప్పినీకుంబాక
శాసనుంజూపెదరమ్మనితోడ్కొని హిమవంతంబునుత్తరంబునమంజువంతంబనుశైలంబునకరిగిదానియందుశతయోజన
విస్తీర్ణంబైనయొక్కసరోవరంబుసొచ్చియచ్చటనొల్లసిల్లుపంచవర్ణకమనీయంబులగు కమలంబులలో నొక్కనాళంబుభే
దించి ముందటఁబ్రవేశించె నింద్రాణియుందోడ నచనితదీయతంతు మధ్యంబున సూక్ష్మరూపంబున నున్నసుర
పతింగన్నంత నయ్యుపశ్రుతియదృశ్యంబగుటయు * క ॥ పతిసన్నిధివడసిమహో । ద్ధృతమంచెదుశచితదీయపూర్వ
సుకర్మ । స్తుతిసేయుచునిలిచిననతఁ । డతివంగనిసంభృతాదరాత్ముఁడగుచుఁ * ఉ ॥ ఇచ్చటనేనునిల్చుటిదియెట్టులె
ఱింగితినన్నుఁగాననీ । వచ్చినకార్యమేమియన వద్యగుణోత్తరసెప్పునావుడుం । బొచ్చెములేకయానహుషుపోయి
నపోకలు వానికిందగం । జెచ్చెరగాలయాపనముసేసినభంగియుఁ జెప్పెదేవియుఁ * వ ॥ చెప్పియుపశ్రుతిలె
ఱంగునతని కెఱుంగించి దేవానీవిత్రిజగత్ప్రకాశుండవైభవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి
నన్నురక్షింపకతక్కిననుక్కివుండగునతనిపాపనిశ్చయంబుననాపడవచ్చుననినవినివల్లభకుదివిజవల్లభుండిట్లనియె * క ॥ ఆ
నహుషుబాహుగర్వము । నూనంబై యున్నయదిసముజ్జ్వలముగస । న్మానప్రవృద్ధమగుటను । దానంగాలంబువేచె
దనుజయమునకుఁ * చ ॥ తలఁయుగునంతకుఁదివునుదగ్గతనైచుటనీతినీవునా । కఅపినయటుచేయముతగంజని

యాతనిఁ గాంచి నన్నునె। త్రైలింగుసనైనఁ బొందఁగ మదిం దలపోఁతయకల్గనేనిఁ గ । చ్చఁ బమునివర్గవాహనుఁడవై చను
దెమ్మనుమంతఁదీ తెఱఁగ ✱ గీ॥ అనిననట్ల కాక యనిపఁకవీడ్కొని। యింతినహుషుపాలి కేగుదెంచె। నతఁడుదమకమడరియు
ద్దేవిఁ బెద్దయు। నాదరించియిష్టమాడుగుటయును ✱ వ॥ ఇంద్రాణియిట్లనియె మునినిరూపించినసమయంబు కొండొకతడ
వుగలదు కాలంబగుటయునన్ను వరియించెద నీవుమహామునివాహనుండవుగావలయు నదినాకుఁ బ్రియంబు నీకునన్య
సామాన్యంబైనయానంబు తేజోవిశేషకరంబగు ననిన నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుండై ✱ గీ॥ ఏనుదక్క నా
రులకెవ్వరికైనన। వ్వాహనంబు నెక్కవశమె నీకు । నస్మదంబుగాఁగ స్వర్నిగ్రహము నా । యందలంబు మోవనరుగుదెం
తు ✱ క॥ అనివనితఁ బంచియప్పుడు। మునులం బిలుపించి మార్గ్యమునఁదనకున్వా। హనముగఁ జేసి యొకింతయు। నను మా
నములేక తిరిగెనతఁడెల్లెడలన్ ✱ క॥ వనిపాలోమియు సురగురు। గనినహుషుఁడు వేఁచియున్న కాలం బెడలే । దనిమిష నా
థునకిట్టటఁ। ననుగ్రహము సేయవలయునవహితబుద్ధిన్ ✱ వ॥ శరణాగతనైన నన్ను రక్షింపవలయుననిన నతండిట్లనియె ✱ క॥
ఆనహుషువలన నాపద। రానీనాతనికి నాతురతగావింపం । బూనియొనర్చెద వేలిమి। దానను మునివాహనతగతస్థైర్యుం
డగుచున్ ✱ క॥ వెరవుననీపతియునికియు। నరసెదననియూఱడించి యప్పుడవైశ్వా। నరునర్పితుఁ జేసిపురం। దరుని తెఱఁగు చె

✱ అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట. ✱

ప్పియతనిదడవంబనిచెన్ ✱ వ॥ పనిచిన వహ్నియు వనితారూపంబునం జని మనోగతియగుటం జేసి సర్వదిశలును భూమ్యం
తరిక్షంబులును గిరివిపినంబులును గొండొకసేపువెదకుచు గలయం జూచి సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి వాచస్ప
తికి నత్తెఱంగెఱుంగించి నాకు జలంబులు ప్రవేశింప రామి నందుఁ బరికింప నేరనైతి నవ్వులవలన నగ్నియు బ్రాహ్మణులవలన
క్షత్రియజాతియు నశ్మంబులవలన లోహంబును నుద్భవించె వాని వాఁడిమి యెల్లయెడలను జెల్లుఁ దమతమజన్మస్థానంబుల
యందడంగుఁ గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధంబగనవివి యనినిమిషగురుండు హవ్యవాహనునత్యంతగౌర
వంబునం గనుంగొని ✱ మ॥ సకలస్థావరజంగమంబులు భవత్సాన్నిధ్యమాత్రంబున । న్వికసిల్లుం గ్రతువైభవంబులుఁ జ
తుర్వేదంబులుం నీవ పో। వకనీయందజలంబులుం గలుగు విశ్వవ్యాపివైయున్ననీ। కొకచో నెట్టులగమ్యమయ్యెనినునీవ్వా
హింపుమింపారఁగన్ ✱ ఉ॥ ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీకభివృద్ధిఁ జేసెదం । గానవిశంకతన్ సలిలగామివిగ
మ్మనినం గృశానుఁడుం । బూనికనేగి వారినిధిభూరినదీసరసీతటాకసం । తానము రోయుచుం జనిశతక్రతుఁడున్న సరోవ
తంబునన్ ✱ ఉ॥ అంబురుహంబులం గలయనారసిచూచి యొకండునాళసూ । త్రంబుననున్న యింద్రుఁగని రాగమునన్
గురునొద్దకగ్నిశీ । ఘ్రంబున నేగుదెంచి తనకన్న తెఱంగెఱుఁగింప నాతఁడు । ల్లంబున నుల్లసిల్లి సురలమ్మునులం దగఁ గూడి గ్ర
క్కున్నన్ ✱ మ॥ దివిజాధీశ్వరు పాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁడై । వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీ
తుఁ జేసి వర్ధిష్ణంబగు నీదుకృత్యము ననుష్ఠింపంగ నీవుత్సహిం। పవు నీకేమికొఱంతవృత్రవధయే పాపంబు రూపింపుమా ✱ క॥
శరనిధిఫేనంబున నా। హరిపొందిజగద్విరోధియగు వృత్రుని దా। బరిమార్చ నీకు విజయము। దొరఁకొనియెం గాక దీనదోస
ముగలదే ✱ వ॥ అనిసముచితంబుగా సంబోధించిన గురునిసంభాషణంబుల నిర్దోషుండై నిజరూపంబు వహించి సకలసురము
నిసహితంబుగా నతనిసంభావించి జంభారికర్తవ్యం బెయ్యదియని యడిగిన నాచార్యుండితం డెఱింగినను విస్పష్టంబుగా
నహుషువృత్తాంతం బంతయు వివరించెదం గాక యని తలంచి యిట్లనియె ✱ క॥ నాఁడట్లు నీవు నీదగు । పోఁడిమి చెడి యడఁగుట
యును భువనంబులకై । వ్వాఁడు నురక్షకుఁడయ్యెడు । వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము నేముల్ ✱ ఉ॥ ఒండొరు చేతఁ
బీడవడనోపకరక్షకుఁడైన వానినా । ఖండలతుల్యు నేమిగతిఁ గాంతుమొకో యనుచున్న చోటను । ద్దండబలైకరక్ష్యము
శతక్రతురాజ్యము దానినేలన । న్యుండు సమర్థుఁ డే యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్ ✱ వ॥ అయ్యవసరంబున
మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుపాలికిం జని మనంబుల మనుజుండను ననుమానంబు దక్కి యతని నింద్ర పదవి
బరిపాలించుటకుం బ్రార్థించిన నతండును దానుహీనబలుండనని శంకించినఁ దమతమ తేజోబలంబులయంశంబుల తనికొ
సంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన ✱ క॥ మహనీయభవత్పదవీ। మహితుండై నహుషుఁడే దిముదమున ధర్మ।
స్పృహ దక్కి తన్ను నిప్పుడు । వహియింపఁగ నస్మనీంద్రవర్గముఁ బనిచెన్ ✱ గీ॥ ఇదియ కాముమఱియు నెన్నె నిదుర్వ్యన।

యములుగలవు వానికలసినిన్ను! వెదకవచ్చితిమి వివేకహీనుండగు। నతనిఁ జేయుపనిప్పుడవసరంబు * వ॥ అదియెట్లంటేని వినుము నాఁడు మహారిపంపునం జేసిన యశ్వమేధంబున నీవపగతకల్మషుండవై నను నహుషునకుఁ దేజోహాని లేనిం జేసియు తని నాక్రమింప రాదయ్యె నిప్పుడు మహామునుల నధఃకరించియతండు నిస్తేజుండై యున్నవాఁడు గావున నీచేతం జెడని ల్లనుటయుఁ దురగమేధఫలపరిపాకంబ యింక నుత్సాహంబు సేయుమనుచున్న సమయంబున యమవరుణకుబేరులును సోమసహితంబుగా నరుగుదెంచి పురందరుం గాంచిన నతండు ప్రియంబంది యప్పటి కార్యంబు తెఱంగు వారల కెఱింగించి తగినసంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి దృష్టివిషయదుస్సహుండైన నహుషు గెలుచు నుపాయంబు విచారించు సమయంబున * క॥ కష్టుండగు నానహుషుఁడు। నష్టాత్ముఁడయ్యె దివిజనాయక నీయా। తత్కృష చరితమున సురలకుఁ। దుష్టిగ నిజరాజ్యసంగతుఁడవగుమనుచుఁ * [illegible]రించి దీపించిరంత * క॥ మునివరుఁడైన యగస్త్యుఁడు। చనుదెంచిన శతమఖుండు నమ్మతి నుతిఁ దా। సనమిడి యర్ఘ్యము పాద్యము। నొసరిచి యిట్లనియె సవినయోక్తి నతనితోన్ * గీ॥ అధిక విభవమెనఁగ నసమానశక్తిన। నాథుఁడగుచునున్న నహుషుఁ డిప్పు। డేమికతన భాగ్యహీనుఁడై యుజ్జ్వల। శ్రీ దొఱంగె మునివ

## * అగస్త్యుఁ డింద్రునకు నహుషు పదభ్రష్టతఁ దెలుపుట. *

రేణ్య చెపుము * వ॥ అనిన విని యమ్మునీంద్రుం డమరవరున కిట్లనియె నన్నహుషుని మోచి వేసరియున్న మునులతనికడ గోష్ఠిని వేదంబులనుండి బ్రహ్మణ్యంబులైన మంత్రంబులు గోసంప్రోక్షణంబునందుఁ జెప్పంబడియుండునవి నీకుఁ బ్రమాణభూతంబులగునే యని యడిగినం బాపనిశ్చయుండై యతండు మంత్రంబులు ప్రమాణంబులుగావనిన నేనవ్వాటని షేధించి పూర్వాచార్యులచేత నభినందితంబులగు మంత్రంబులు నిందించుట యజ్ఞానంబని వివాదంబు చేసిన నతఁడు కోపించి మదీయమస్తకంబు దన్నిన నతని నింగనుంగొని పుణ్యహీనుండును దేజోహీనియును దీనుండును నగుట యుపలక్షించి నీవు పూజనీయులైన మహామునుల నిన్ను వహింపం బనిచితివి వారలుగొనియాడు మంత్రంబులు గర్హించితి వదియునుం గాక నన్ను నవమానించితివి గావున నింద్రపదభ్రష్టుండవై బహుసంవత్సరంబులు భూలోకంబున నురగరూపంబునను ండుమని శాపంబిచ్చి పదంపడి యనుగ్రహించి భవదీయవంశజాతుండైన యజాతశత్రుండను పేరుగలిగి యుధిష్ఠిరనామధేయుండైన యొక్క సత్పురుషుని సందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయువాఁడవనినఁ దత్క్షణంబ * క॥ స్వర్గపదభ్రష్టుండై। దుర్గతికిం బోయె నతఁడు దుష్టాత్ములకున్। దౌర్గత్యము సుజనులకున। సద్గతి సద్గతియ యనఁగ నటయిరు దేతలఁ బర్క్ * మ॥ అనినన్ దేవతలుం దపోధనులు నత్యానందముం బొందిరా। మునిఁ గీర్తించె నమర్త్యనాథుఁడును మోదంబు సంధిల్లన। య్యానురాగంబు చరాచరంబులకు హృద్యంబయ్యె నగ్న్యప్సరో। జనముం గ్లౌశిఖిం గానవచ్చె శుభదైశ్వర్యంబు శోభిల్లఁగన్ * వ॥ తదనంతరంబ * ఉ॥ పావకుఁ డాదిగా దిగధిపాలురు కిన్నరసిద్ధసాధ్యులున్। దేవసురుండతో నచను దేరఁగ వైభవము ల్లసిల్లనై। రావణదంతి నెక్కి యమరావతికిం జనియింద్రుఁ డాశచీ। దేవియుఁ దాను మోదమునఁ దేలిరభీష్టవినోదలీలలన్ * వ॥ ఇవ్విధంబున మహానుభావుండగు మహేంద్రుండు * క॥ ఆజ్ఞాభంగంబైనం। బ్రాజ్ఞేతరునట్లదుఃఖపడియుండఁడె తా। నజ్ఞాతవాసమునఁ గా। లజ్ఞతఁ జరుపండె యన్యులకు వగపేలా * క॥ కావున మీపడినయర। ణ్యావాసక్లేశమును మఱి యజ్ఞాతవిధిన్। సేవకులరైన బానికి। నోవకుఁడీ మీరు లఘుగుణోవృత్తులరై * వ॥ అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయంగనుంగొని * ఉ॥ కౌరవనాథుఁడా నహుషుకైవడి నాశముఁ బొందువాఁడ వ। శ్రీరమణీయుఁడై జయముఁ జేకొను ధర్మజుఁడంబురాశివేలారశనాసముజ్జ్వలవిలాసమనోహర మేదినీవధూ। సారసముగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దాను దమ్ములున్ * వ॥ అని పలికి వెండియు నతండు పాండవాగ్రజునకిట్లనియె * క॥ సౌఖ్యంబులు నొందుజగత్ప్రఖ్యాతులు చెందుదగఁ బురందరవిజయో। పాఖ్యానము విన్నసుద। వ్యాఖ్యానము చేసినక్ జనావలి కధిపా * క॥ మోహారమున మెచ్చుచుండఁగ। నీహరివిజయంబు వినిన నరేంద్రుఁడు రిపుసం। దోహంబు గెల్చుటకు నసం। దేహంబించుకయు లేదధీరవిచారా * వ॥ అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి మహానుభావా భవదీయభాషణశ్రవణంబునఁ జిత్తంబులం కడేరెనని సంభావించి యతనికి నుచితంబులగు మజ్జనభోజనంబు లొనరించి యనంతరంబ యతండు పయనంబునకును ద్యోగించిన * గీ॥ అతని ననుపనేగి యధికసంప్రీతి నే। తెంచునప్పుడ యుధిష్ఠిరుండు। రణములోన నీవు రాధేయుఁ బలుకులు

మఱువకుండవలయుననుమ్ము దలంచి * క॥ అనుటయుమ ద్రేశ్వరుఁడా। తనినూఅడఁబలికిగాఢతరముగనాలిం। గన మొనరిం
చిచనియెమా। స్తినగరికిబలమ్ముతోనతిత్వరితగతిన్ * వ॥ అట్టియవసరంబున * మ॥ సకలాదాతిభయంకరుండగుచుమత్సా
హంబువాటించి నేలకన్ ద్రేఁగయ్యేడుభంగివచ్చెరణలీలాకౌతుకంబొప్పఁడా। నొకయక్షౌహిణితోడఁబాండవబలంబు
ల్లాసముంబొందసా। త్యకిబాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢిసంధిల్లఁగన్ * వ॥ అంతం జేదిపతియగుదృష్టకేతుండును
నుజరాసంధనందనుండగుసహదేవుండును నొక్కొక్కయక్షౌహిణితోడంజనుదెంచిరి సహోదరులేవురు గేకయపతు
లేకాక్షౌహిణీసమేతులై యేగుదెంచిరితదనంతరంబ * క॥ కొడుకులుఁదానునుగుఱ్ఱపు। దడములఁగరిఘటలభటరథ వ్రా
తములం। బుడమిచలింపఁగ ద్రుపదుఁడు। గడువేడుకఁదోడుసూపెఁగౌంతేయులకున్ * వ॥ అనియును నొక్కయక్షౌ
హిణికింగలిగెనయ్యవసరంబుననునుజతనుజసమేతుండును భార్గవీయమహిపాలసహితుండునునై యొక్క యక్షౌహి
ణీయొడ్డనంబుదీర్చి * క॥ చిందముల మ్రోఁతపగతుర। డెందంబులతోడదిక్కటీసంధులనం। దందఁబగులింపఁగుంతీ। నందను
లకుఁదోడుమత్స్యనాథుఁడుచూపెన్ * వ॥ పాండ్యవిభుండులోనుగాఁ బలుదెసలనుండివచ్చిన బలంబొక్కయ
క్షౌహిణికింగలిగియొప్పె * క॥ పదక్షౌహిణులిమ్మెయిఁ। గూడెం బాండునృపసుతులఁగ్రూరాహవసం। క్రీడావి
నోదమునకుం। దోడుపడంబూనియతికుతూహలవృత్తిన్ * వ॥ ఇవ్విధంబునంగూడి పెచ్చుపెరిగియుధిష్ఠిరుసైన్యం
బుకయ్యంబునకుఁగాలుద్రవ్వుచునుండెనంత నక్కడంగిరాత కాంచన సైన్యనిచయంబులం గూర్చికొని సమరంబునకు
నమరి యేకాక్షౌహిణింగల భగదత్తుండు సుయోధనుంగలసె భూరిపరాక్రముండయిన భూరిశ్రవుండును మహాబ
లుండైన శల్యుండును నేకాక్షౌహిణీసమేతంబుగ నేగుదెంచిరి వారలయట్లసన్నద్ధులయి కాంభోజనాథుండయినసు
దక్షిణుండును యవనేశ్వరుండునువచ్చి రత్తెఱంగున ససుకట్టిజయద్రథప్రముఖులయిన సింధుసౌవీర నరపతులరుగు
దెంచిరి మాహిష్మతీపతియగునీలుండును యాదవవీరవరుండగుకృతవర్మయునవంతీశ్వరులు సోదరులునగు విందానువిం
దులిరువురునుంగా నన్నలువురు నొక్కొక్కయక్షౌహిణీతోడంజనుదెంచిరి శకటియును బలుదెసలనుండివచ్చికూడిన
వాహినులుమూఁడక్షౌహిణులకుంగలిగెధార్తరాష్ట్రులకుఁదోడువడంబూనినయవిపదునొకొండక్షౌహిణులయ్యె నట్టియె
డ * క॥ సవరణలనొప్పి యనిఁబాం। డవబలముల మార్కొనంగడంగుచునత్యు। త్సవమునఁబేర్చిన సేనల। కవకాశము లేదు
విడియహస్తిపురమునన్ * క॥ నానాముఖములవిడియం। గానియమించెనుబలంబుఁగౌరవపతియా। సేనలదొడలకునిలు
వఁగ। నైనను నెకలేమినధికహర్షంబెసఁగన్ * వ॥ ఇవ్విధంబునం గురుజాంగలంబున రోహితకారణ్యంబునమరుదేశంబు
ననహిచ్ఛత్రంబునఁ గాలకూటంబునగంగాకూలంబున వారణావతంబున వటస్థానంబునవిచ్చలవిడివిడిసి ధనధాన్యా
దిసమస్తవస్తువులకలిమింజేసి యేలమిమిగిలియున్నంత * క॥ పాంచాలమహీవల్లభు। పంచిన భూదేవుఁడు చితభంగిన్నగ
రికేఁ। తెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం। గాంచి కృప ద్రోణవిదురగంగాసుతులన్ * వ॥ వారివారిమందిరంబులకుం జని కనిసము
చితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యోధను సందర్శనంబునునిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రున
భిముఖుంగావించి యొక్కనాఁడక్కౌరవేశ్వరు పేరోలగంబున సమస్తసేనాపతులనుగలయుంగనుంగొని యిట్లనియె * సీ॥
ధృతరాష్ట్రపాండుభూపతులుసహోదరులగుటయు వారలయాత్మజులకుఁ। దమతమతండ్రులధనములుగై కొనఁదగుట
యుమీకునందఱకుఁజూడ। నుచితంబకాదె యట్లుండఁదొల్లింటిచందంబునుమీకుఁదెల్లంబకాదె। ప్రాణగొడ్డములగుపనులు వా
రలఁదీర్పఁదలఁచినపుణ్యంబుకలిమిఁజేసి। బాహుబలమొప్పనిజరాజ్యపదవిఁబొంది। యున్నవంచన మెయిమహిఁగొన్నతె
అఁగు। నెఱుఁగుదురకాదెదీనికి నెల్లనియ్య। కొనియెనీ పెద్దరాజు నేమనఁగనేస్తు * శా॥ నారీరత్నమునట్లు దెచ్చిసభలోననవ్వా
రలుంజూడఁగాఁ। జీరుల్ ప్రోవులుగాఁగనొల్చుటయులక్ష్మింబుచ్చికోలున్న సాహా। గ్రారణ్యస్థలినిల్వఁబంచుటయు దైన్య
వ్యక్తిమైపలుకన్। సైరింపందగు పాండుపుత్రులకనీ సంధిక్రమంబొప్పదే * క॥ వీరలవృత్తముఁబాండుసు। మారులవ
ర్తనము తెఱఁగుమాత్సర్యము లే। కారసిధృతరాష్ట్రునకున్। గారవమున బుద్ధి సెప్పఁగాఁదగుమీకున్ * గీ॥ పాండవులుకౌర
వులతోడిపగకునొల్లరఖిలభూప్రజానాశకమగుటఁజేసి। వారలసదనితలఁపంగవలవదిక। ధర్మపరులైనకతమునఁదగవున
డిచె * వ॥ అందుఁగూడినవియేడక్షౌహిణులింతఁగూడినవివదు నొకండక్షౌహిణులనితలంతు రేనివినుండు * క॥ బాహుబలమున

నుండు భీముండు। సాహసరసికాత్ముండయిన సాత్యకియును జూడ। గ్రాహవభూమి సహస్ర। క్షౌహిణులట్లగుటమీకు చూ
డ రేయెంతయున్ * క॥ గాండీవధన్వు నాహవ। పాండిత్యముం దలంపన తనిభుండనమున మా। రొండును నీ యొక్కండు గడంగుట। కొం
డంగనితగరు తాంకం గోరుటగాదే * క॥ ఆభీభత్సుని భూరిభు। జాబలమును హరిమీ వారశౌర్యము శరవి। ద్యాబహులతయును బం
దికి। నైబవరముం జేసినట్టి హరుండయె బుంగర్ * వ॥ అదియునుంగాక * మ॥ విశిథోపాయపదాయణుండు రిపుదోర్వీర్యాప
హార క్రియా। ప్రవణోద్యోగుండు మంత్రరతుండు శ్లాఘా ప్రావీణ్యగణ్యుండు ధై। ర్యవివేకాదిగణోత్తరుండఖిలవిద్యాజా
లసంవేది మా। ధర్మజుండాదికిం గూటంబాండవేయులకు సాధ్యం బెద్దియు నింగల్గునే * గీ॥ అదనుదప్పకుండ నస్మదాత్ములనెమ్మిం
బిలువంబంచి హితము ప్రియము రెండు। పక్షములకు నగుటపాటించితగవు మైంది। గొంతభూమియిచ్చి కూడిమనుండు * చ॥ అ
నవిని భీష్ముండిట్లనియె నక్కట భాగ్యము గాదె పాండునం। దనులొక యాపదం బడక ధర్మగతిం దగ నలుగురున్ సుహృ। జ్జన
ములం గృష్ణునిం గలసి నమ్మదనొందుటయుం బ్రశాంతిమై। మనములనీదు దక్కుమ్రుచ్చ మార్గము వట్టుటయున్ దలంపం
గన్ * క॥ నీవాక్యము విప్రస్వా। భావికమై యిట్లు శ్రుతికిం బనుపంబైనం। భావింపం గార్యమునయ। మేవిధము
ననభకునీతయిష్టంబగునే * చ॥ సమయము నూంది పాండవులశక్తుల చాపనమున్ డినాంఢబ। న్నము వడిచన్నదై
న్యము వనంబునం బడ్డవిషాదవేదనా। శ్రమము పిరాటువీటలఘుసంచరణంబున డాంగియున్నదుః। ఖము నజగంబె
ఱుంగ దెయ్యల్లమ్మలంబులు సంగంబాడియే * క॥ పితృధనమగు పాలుచితి। స్థితివారలకిచ్చి నిర్విశేషుండైయీ। పతి
లోకము మెచ్చంగ నిజ। సుతనివహమునట్ల వారిం జూడంగవలయున్ * వ॥ అట్లుంగాక * చ॥ కడవంగ జూదమాడియవ్వం
గాదననేరకసత్యభాషణం। బెడలినవచ్చు ధర్మగతి హీనతకోర్చకరాజ్యహీనతం। బడుటసునోర్చి ధర్మజుండు పవంచిన
సైరణచేసెగాక క। య్వడి నెఱింగన్ కెట్టినుగ వారును నోర్తురె యిజ్జగంబులన్ * వ॥ అనిన విని కర్ణుండు గనలి యిట్లనియె * క॥
జనులెల్ల నెఱింగిన యీ। పనియేటికి నుగ్గడింప బలుమలు ధర్మో। ధనునకయిశకుని జూదం। బున మేదినిగెలిచె ధర్మపుత్త్రు
డోడెన్ * గీ॥ దీననేమి తప్పు కాననునేగిన। యతండు సమయవృత్తినాక్రమించి। తండ్రిపాలు మాకుండగునంచు నని
వెట్టి। తనముచేసిరాకతప్పు గాక * క॥ వికటుండు ద్రుపదుండుం దోడుగ। బరవసము ననెత్తి పిడికిలి మినడిగినం। గు
రుపతియు వెఱచి యిచ్చునె। ధరలోం జక్కనగ మిట్టితగవులుగలవే * వ॥ అనిన గాంగేయుండు కటకటం బడి కర్ణునకిట్లని
యె * ఉ॥ చిక్కని పోటుమాని సిపిసీవినువారలు నవ్వ నేమిగా। నెక్కుడు మాటలాడెదవహీనపరాక్రమశాలియస్త్ర
ము। డొక్కండ యార్యవరన్నలనుగ్రరణంబున గెల్చెనిన్ననేం। డిక్కడమాటలన్ గెలిచెదీవతనిన్ నరరాజుకొల్వునన్ *
క॥ నరుడాలవెనుకవచ్చినం। గురురాజు గంగనీవు గురుండును గృపుండున్। గురుసుతుండు వీనంగవారల। చరసమయము
జెగుటయేను జెప్పనె తెలియన్ * గీ॥ అనిన ధృతరాష్ట్రుండాపగాతనయభక్తి। ననునయించి రాధేయునింగినిసి ప్రి
యము దోంపందానిట్టులనియె నాద్రుపదమనుజ। పతిపురోహితుతోడ సంభ్రమము మెసంగ * ఉ॥ మంచిగనేను బంధులు
నుమంత్రిజనంబులుం బెద్దలు నివ్విచా। రించిన నుస్తభూప్రజకుం బ్రీతిగ బిడ్డలపాలికిప్పుడు। త్తెంచెద సౌమ్యునొక్కరు మదీయ
ము నోంగతివారింగూడి వ। ర్తించు తెఱంగుం గైకొనుట తెల్లము కౌరవజాతికెంతయున్ * గీ॥ నీవుమున్నేగు మని యతనికిం భూ
ష। ణాంబరమ్ములతోడం దమ్ములంబుం బెట్టి। వీడుకొలిచ్చి పుచ్చినవిప్రవరుండు। పాండురాజతనూజుల పాలికరిగె * వ॥ ఇట్లు న
నివారలం గనియాతండు సముచితసంభావణంబులం దనపోయివచ్చిన కార్యంబు తెఱంగెఱుంగించెనట ధృతరాష్ట్రుండును
బుత్త్రమిత్త్రవృద్ధామాత్యసహితంబుగా నాస్థానమంటపంబున నాసీనుండై యుండి సంజయుం గావించి యతనికిట్లనియె *

### ధృతరాష్ట్రుండు సంజయునిం బాండవులయొద్దకుం బంపుట.

గీ॥ పాండునరపాలసుతులుపప్లావ్యమునకు। వచ్చియున్నారు నీవేగి వాసుదేవ। సహితముగ వారిం గని తద్విషాదమేని
భంగి బాయునమ్మైయిం దగంబలుకవలయు * క॥ వినయయ్యమీరువనవా। సాయాసముని స్తరించియభ్యుదయమునన్। డా
యుటవినిముదితాత్ముండనై యుంటిం బుత్తెంచెనన్ను ననుమీ మొదలన్ * అని చెప్పి చుట్లనున్న వారలతో నిట్లనియె * క॥ మఱో
ధనుండు కార్యా। కార్యజ్ఞుండుగామినట్టి కలంకగలిగెంగా। కార్యులుదృఢధైర్యులురణ। ధుర్యులునగు పాండుసుతులు వో
పాన్వితులే * క॥ క్షీరోదకగతి మననును। వారలునుం గలసిబ్రదుకవలవదె నెమ్మిన్। వారిషుమలంబడదగియొడు। వారే

పిన్నభాగ మేలువారలు గారే ✻ గీ ॥ మనలనింక నమ్మరన్నతాత్మ లన్యాయపరులు గర్వులనుచుఁ బాండుసుతులు । కూడి
మనుటకియ్యకొన నేరరైనన ధర్మజుండు గలఁడు తగవు నడుప ✻ వ ॥ అని పలికి వెండియు ✻ మ ॥ మనకీడు దగవచ్చు నేమనము
దుర్మానంబు వాటించితిమొ । ప్పని కార్యంబులు వట్టి వారికి దగం బాలిక గర్వంబులా । డిననకట్టంబగు నల్క నర్జునుఁడు గాం
డీవంబు మోపెట్టి కృష్ణుని సాంగత్యమువై జగత్త్రితయ సంక్షోభంబుగా వింపఁడే ✻ గీ ॥ అలఘు గదఁ బుచ్చికొని భీముఁ డతిర
యమునఁ గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగ నగఁ యుటాత్మ భావించినఁ గంప మడరు । నిక్క మెవ్వఁ గుమారొత్తినిలు
చువారు ✻ సీ ॥ కవలగ్రజన్ములకంటె నేమిటఁ గీడు ద్రుపదుఁ డల్పుఁడె తత్సుతులు బాహు । గర్వసమగ్రులు గారె వి
రాటుండు నాతని తమ్ములు నాత్మజులును । ననము లేసాత్యకి యలంతులఁ బోయెడువాఁడె వృష్ణికుమారవరుల నేప । లట్టి
యోధుల సోనరవాయి గొండు రేవాండ్యంపు కేకయపతులు నాదిగాఁగ్లైన బంధులు మిత్రులు నగ్గలికలఁ । గొఱతవడియె
డు వారె యండ అనుగెల్వ । నోపినరురు ద్రుసికు నైన నొవ్వరాని ధర్మపుత్రు కోపమునకుఁ దలఁక వలదె ✻ వ ॥ అని పలికిన జ
యదికక్క మొగంబై యెల్లవారును వినసిల్లనియె ✻ గీ ॥ నీవు ధర్మజుపాలికి నెమ్మనరుగు । మతఁడు పేరోలగంబున్నయవస
రమునఁ గాన్పించి తనికి నను జవర్గ బుకుసు । బంధులకు సింపువుట్టంగఁ బలుకుమచట ✻ క ॥ నెయ్యము వాటించి కడుఁ ది
వ్య మెసఁగ నలుకలెల్లఁ దీఱునటుగాఁ గయ్యనునపులఁ పులోనుగ । నయ్యమనందనుఁ డమానునట్టి తెఱఁగుగాన్ ✻ వ ॥

✻ సంజయుండుపప్లావ్యంబుననున్న పాండవుల యొద్దకు వచ్చుట ✻

శాంతిప్రకారంబున నగార్యంబున డిపియొక్కటి యైనను నట యొసఁగూర్చి గమ్ము గథం బెక్కపొన్నని తగిన తెఱంగున వీడ్కొ
లిపినఁ జనసంజయుండు పప్లావ్యంబుఁ జొచ్చి మాధవు నందిరంబునకరిగి యభ్యంతర వినోదంబుల నరసహితుండైయు
న్నయన్నారాయణునకుఁ దనరాక మెఱిగించి పుచ్చి తగఁ బ్రవేశించి భయభక్తి వినయసంభ్రమంబులు మెఱయ వార
లంగాంచి యమ్మహాత్ములిరువురసంభావనంబులు పడసి సంప్రీత చేతస్కుఁడై నాఁడు ధర్మతనయుం డొడ్డోలగంబు
న్నసమయంబున వచ్చి సముచితంబుగా నతనిం గని సాష్టాంగదండ ప్రణామంబుగావించిన నతండుం బ్రియపూర్వకం
బుగా నాదరించి సమీపంబున నునిచి నంగొలిచియుండి యతనికిట్లనియె ✻ గీ ॥ భాగ్యమున నిన్నుఁ గనుఁగొనంబడసి నాము । చూ
డ్కి చరితార్థమయ్యెనస్తోకపుణ్య । ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్ర ధరణినాథుఁ । డింప మీయునికి పని ప్రియమెసక
మెసఁగ ✻ క ॥ అనుజులు నీవును ద్రోవని । యును బుత్రచయంబు నున్న యొగతేసుం । బున తెఱఁగారయఁబుత్తె । చెని
తాంతస్నేహపూర్ణ చేతోవృత్తిన్ ✻ వ ॥ అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె ✻ క ॥ ఆరాజు మాదెసం గల । కారుణ్య
ముకతమునను సుఖంబున నిట్లు । న్నారము నినుఁ బుత్తెంచిన । గారవమునె నా మదిని కాసముఁ బొందెన్ ✻ క ॥ అమ్మను జే
శ్వరునకు సే । మమ్మె పుత్రకులు సుఖులె మనుమలు సమ్మో । దమ్మునఁ బెరిగెద రేనగ । రమ్మున జనులకును సుఖపరంపరగల
దే ✻ సీ ॥ ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును సుఖమున్నవారె సుశ్లోకుఁడైన । భీష్ముండు గుశలియె పెద్దతనంబి
చ్చియాతని గౌరవులనుసరించి । మెలఁగుదురె బ్రాహ్మణులకు మన్ననగ్గలియుండు నేమేమర్థి నొసఁగినట్టి । వృత్తులు సె
ల్లునె యొత్తోరువోష్ఠలవలనఁ బుట్టమగదా కెలఁకులందుఁ । బుట్టినప్పుడు గాండీవభుజబలంబు । దలఁతురె భీమసేను గదాపి
హార ముగ్గడింతురె కవలు మహోగ్రరిపుల । భూములంతంతకొత్తుటసొగడ బడునె ✻ మ ॥ ఒకనాఁడాతమమునం దటం
బులు మబ్బునా రాటమై నేలరో । త్రికోనంగా బసరంబులన్గెలువఁ గాఁ దెల్లంబుగాఁ జూచి పాం । డుకుమారాలి నుతిం
పకుండదు రెయాటోపంబునన్ ఘోషయా । త్రకు గంధర్వులు వచ్చినప్పటిచరిత్రంబాత్మలం బాయునే ✻ క ॥ వినుము
మనము సుధ్యస్థులు నునియగ్గుడు నెపరిసఁ జయహాయిట ము న్నె । వ్వనికిని మాఁ చముఁ బ్రాణం । బును దగఁ దక్కించ కొనఁగఁ
బోలు నె చెపుమా ✻ క ॥ దుర్యోధనుకింటందను । శౌర్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా । తుర్యంబు మెఱయఁ గర్ణుని । యా
శ్రిత్వము చెల్లుచున్నయదియె నెమ్మిన్ ✻ వ ॥ అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజు నొద్దనవి నీతులు
నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు మఱియు వివిధప్రకారులయి వెరసియుండుదురు వారొకళ్లొకళ్లమా
టలం బోయెడు వారుగారు కావున వారి నంతయనఁ బని లేదు నా విన్నపంబు చిత్తగింపుము ✻ క ॥ పొందొందఁగఁ గనలఁ జితినీ ।
పిందుశిశిరమయి నిర్మలహృదయంబున వా । రండఱకును సేమంబట । ముందర లేకున్న నేఁడు మొదలుగఁ గలుగున్ ✻ క ॥

ధృతరాష్ట్రభూపతికిన్ । స్థితకతమున్ జిత్తమొకవిధముగామినుతో । స్థితిమాన్పఁడు నాఁడు వసన । సకృతపిదవంబుట్టియి
పుడు శాంతుండయ్యెన్ * గీ ॥ ఇట్టిచందంబు లెల్లను నీవు పుణ్య । చిత్తవృత్తి మైసైచినఁ జెల్లివచ్చు । నీయజాతశత్రుత్వంబు
నఖిలలోక । విశ్రుతముగాదె ధర్మప్రవీణహృదయ * చ ॥ జగములనెల్లెడన్ మరితసంతనసంబు జయింపఁ గోరిసాల్వ
గంబర మేషిసల్పిన వెలు గుసుహీనులట్టివారికిన్ । దగవుసుటివసత్వరుపదత్తములై చన జీవనంబులెం । తగుమనుమైన
మాత్తు రెపనంపడియాయువు శ్రీయునొల్లరే * ఉ ॥ ఒక్కొక్కచోఁ గడంగి ప్రతియోధులు మార్గోమునప్పుడాత్మల । న్నొక్క
సిమోములంబొడము నెవ్వగతోడ జనంబులిట్టియం । దక్కటభీముఁడైననును యజ్ఞుఁడైననుమాద్రిపుత్రులం । దొక్క
రుఁడైన నీపగఱనుక్కడఁగింపరె యంచు లెల్లెడన్ * క ॥ వారొకయాగ్రహావృత్తిం । గూరియుగ్రంబు సేఁతకుంజాల
రుమ । ర్వారబలులయ్యుఁ బాండుసు । మారులు శాంతాత్ములంద్రు మహిజను లెల్లన్ * క ॥ నలువుర దమ్ములు భవదా । ప్త
లుఁగృష్ణుఁడు వినుచునుండ భూవరనీకేఁ । గొలువున నుపిన్నవింపం । బలుకులుగలవ వధరింపు వరిపాటి మెయిన్ * చ ॥ అన
వుకవీ గెతమ్ములునునా ప్తులుఁ గృష్ణుఁడు వీరెతక్కకొ । ల్వునఁగలయట్టి సర్వజనులున్వినుచుండెదరయ్య నిన్ను నే । మ
నుమనిపంచెఁ జెప్పుమదియంగయు నేర్పడనన్న ధర్మనం । దను గురువంపుపల్కుల విధంబున నమ్మదిలోన నల్కచున్ ॥ గీ ॥
సంజయుండు కృష్ణుసన్నకు వీక్షించి । పవనతనయుఁ బార్థుఁ గవలద్రుపద । తనయు సవినయముగఁ గనుఁగొని ప్రీతిబాంధ
లునత్స్యధరణిపాలుఁ జూచి ॥ వ ॥ సావధానులరై వినుండని పలికి యుధిష్ఠిరు దెసకు మోమొప్ప కేలు నిగిడించి యిట్లనియె
ఉ ॥ శాంతతఁ బొందికార్యము దెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మన । త్యంతము దేటియన్నిటఁ బ్రియంబునఁ బంచె నసప్త
నాకుఁదే । రెంతయు వేడ్కఁ దాన ప్రియమేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచెని । ట్లింతఘటించెఁ బొందునను నకీపదనం దెలివ్రెం
దఁగాదగున్ ॥ క ॥ చులుకని కార్యము సేయం । వలఁచుట మీయట్టి సర్వధర్మజ్ఞులు శాం । తులు ననఁ బ్రసిద్ధులగు పె । ద్దలకుం ద
గవగునె యెవ్విధంబునఁ జూడన్ * గీ ॥ మసుఁగుఁ జీకయందు మసిదాఁకినట్లు మీ । సత్కులమునఁ గల్మషంబు కొర । వేంద్రక
తనఁ బొందెనింతయుఁ బాపంగ । నీవనే ర్తుధర్మనిపుణహృదయ ॥ చ ॥ అఖిలజగత్తుయంబున జయాపజయంబులు రెం
డునుం పదిన్ । సుఖములు గానియాపనికిఁ జొత్తురె యుత్తములట్లుగాకయా । నిఖిలసుఖంబు లేమిటికి నీవనివృద్ధజనంబు
బాలురన్ । సఖులను బంధులన్ గురులఁ జ పితయే నిదయాపయోనిధీ * ఉ ॥ పెట్టని కోటనీకుహరిభీముఁడు నగ్జునుఁ డుగ్రకారణం
బునఁ । దొట్టిన మంటలాకొలఁదియోధులె సాత్యకియున్విరాటుఁడుం । జుట్టపుమేరియుగ్రగణ శోభితుఁడీ ద్రుపదుండు ని
న్నుట్టట్టనవచ్చు నేసురలకైననునొల్లవుగాక చిన్నకన్ * వ ॥ మఱియు నొక్కఁడ ॥ ఉ ॥ ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు
ద్రోణసుతుండును గర్ణశల్యులుం । బ్రాణములాసువోధను సపాలివయం గృపనిజానుజన్ముల । క్షీణపరాక్రముల్ సు
తుల జేయులు బాహ్లికసోమదత్తులు । స్థాణుకైన నొండురు వశంబె జయింప వఁగవారి నేరికిన్ ॥ గీ ॥ అధిప యిట్టి మీకు నన్యో
న్యకలహంబు । నాకుఁ జూడ మేలనంగ రాదు । రెండుపక్షములకుఁ బ్రియము హితంబును । నాత్మఁ గోరువారి నడిగి చూడు *
వ ॥ అనిపలికి సూతనందనుండు కొలువుగలయంగనుంగొని ॥ మ ॥ మొక్కెదవాసుదేవునకు మోడ్చెదఁ జేతులు సవ్యసాచి
కిం । దక్కటిమిత్రబాంధవహితప్రియమంత్రివయస్యకోటికిన్ । మ్రుక్కుచు విన్నవించెద సుమాయలుదక్కియనుజ్ఞ
చేయుఁడీ । యక్కరుణాకరుల్ శరణ మేనిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్ * వ ॥ అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ
బాండవాగ్రజువదనంబునం జూడ్కి నిక్కపిదే వాయుపశమించుటలెస్స యిమ్మేయికిం గురుపితామహుండును సంతసిల్లునా
తనికనుమతంబైన తెఱఁగు సర్వలోకసమ్మతంబగు విధంబనిన విని ధర్మనందనుండు సంజయునకిట్లనియె * ఉ ॥ నెయ్యము
దప్పనెండొంటినీ చెపినోఁకైనె నామపల్కులం । దియ్యడ సంజయా యనికి నిమ్మెయి సుల్కెడుమాకు వారితోఁ । గయ్యము ద
క్కమస్కతగుకార్యము గాదొకొ పోరెతంబు లే । కయ్యెడ మనర్థసిద్ధి వెడఁగై నను నొల్లక యొంటు సేయునే * క ॥ జనుల
కు నెల్లను బథ్యము । లనఁగా ధర్మానుగతములనఁగాఁ బొగడం । జను పనులు సేయు భీమా । ర్జును లేదుష్కర్మమునకు రోయని
వారల్ ॥ క ॥ మదిసుఖము గోరి మొఖం । బొదవంగల కార్యములకును త్సాహము సే । యుదు రొప్పనితృష్ణంబడి । చదురే
మియు లేనియట్టి జనులాతురులై * గీ ॥ యోగ్యతృష్ణఁ దగిలియు దితంబు కొలఁదిమై । నడుచుచుండువారు జెడిదములకు నం
తసొత్తురెట్లు సంతాపకారులు । కాక పెనుకువలు సుఖంబులగునె ॥ వ ॥ భోగంబులు వలదాయనితలంతురేని * గీ ॥ వస్త్ర

మాల్యానులేపనావసరములను। జతురరథూర్యత్రయంబులసమయములను । నేమువెలిగాఁగమాతండ్రియిచ్చు నెట్లుపు
త్రులనపట్టినమ్మేలపోవ ద్రోచు * వ ॥ అయిననునొకమాటచెప్పెదనమచిత్తుండవై వినుమనియిట్లనియె * క॥ తానైన
నపుడుపవ్రుఁ। డై నీతిపథంబుపిడిచెనకుటపతికి । మ్మైననుజక్కని తెరువునఁ । బూనినడువుడనుచనిపుడుబుద్ధులు సె
ప్పెద * క ॥ ఎదిరిందమయట్టులకా । మదిఁవలఁచినఁబొసఁగుగాకమాకుంగుడుమింపిడిదెమీరు వ్రక్కగొనుఁడని। చదు
రడఁచినమననుపొందుచక్కంబకు నే * వ॥ అనిచూపిచెప్పి వెండియు * ఉ॥ సంపదదక్కయుండఁగనశక్తులనంజనుసమ్మఁబి
ల్చిపూ। జింపనతండు బేలెపతి సెప్పెడు వారలబుద్ధినాఁడుమ । న్నింపఁడెయింక నేలయగునీవడియాసలవచ్చిరి త్తగాఁదిం
పకుమానుమాతనిచరిత్రమునీకునుమాకువింతయే * క ॥ తగుమాటలాడఁబికేయుండగుననికైకొను నెయెన్నఁడైననుగొ
డుకు। న్నాఁటినిగలఁడనియెడు నమ్మికజూచుచునుంతుపవముద్రింగినయెనిక * క ॥ జూదపుసిరియాసపడఁ। గాదనివి
దురుండు సెప్పఁగా నప్పడుక । ర్ణాదులపలుకులువినిపతి । యాదరణము సేయకున్ననంతనతీఱుక * క ॥ ధృతరాష్ట్రుం
డిటఁమీఁదను। సుతులునుశకునియును సూతసూనుండును నే । గతినడిపించిరివారల । మతమయనష్టించుగాక మరలంబకు
నే * క॥ కార్యము తెలియగిట్టదినీ। వార్యచరితమునకుఁ జొచ్చియూడెదునీకా । దుర్యోధనునవినయమని। వార్యంబనియెఱుఁ
గరామినలనూ వెడఁగో * క ॥ చక్రధరు లెక్కగొనఁడువ। రాక్రమునిధియర్జునునకు రాధేయభుజా। విక్రమ మెదుసుగఁ
గొనిన। ర్వక్రముఁ జేసికొను వాఁడు రాజ్యంబెల్లన్ * వ॥ అనిపలికి వెడవెడయలుకపొడమినమఃజియనిట్లనియె * శా॥ చాపా
చార్యుండుభీష్ముఁడుంగృపుండునశ్వత్థామయుంగర్ణుఁడున్ । భూపశ్రేష్ఠుఁడుదారుమున్నెఱుఁగ రేపో రెట్లుకయ్యంబు
లా। శాపాశంబులుచుట్టలావెలుఁగమింజావేఁడిమారొంతురిం। తేపోతమ్ముఁగపధ్వజప్రభలయందీభూతులం జేయవే *
క॥ మునుమమ్ముఁబొగడెపదపడి । యనివారలగెలుచుటరిదియనిసాత్త్వగఁజె । ప్పినమాటకు నేనొడఁబడ । వినుసంజయ
పతుపాతవృత్తివిడువుమీ * స్రగ్ధర ॥ గాండీవజ్యారవంబుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా। దండంబేపారి
శుంభద్గదజడియుచురౌద్రంబుగాఁ ద్రోఁచినన్ వే । ఉండద్వంద్వంబుమాడ్కిందటిమికవలుమాద్యద్గతిందాఁకినంజా। కుం
డంబోకుండఁగౌరవ్యులకుఎశమెబిట్టుక్కమూర్ఛిల్లకుండన్ * కావున * చ ॥ రణముల వారలన్ గెలువరాదనుపల్కుల
టుండఁగనున్నస । ద్గుణుఁడవునీవువచ్చితి ప్రకోపవశమునంబుగఁబల్కితింక సై । రణతగఁ జేయువారమువ గాభవ మొందియు
మున్నువారిదు। ర్గుణములుసైచుటీవు నెఱుకొంతయెఱుంగుదు మింతయేటికిన్ * ఉ ॥ ఇంకనునట్లకాతలఁపు మేమొకకీడు
సపుందోడంగమా। శంకలుడక్క మయ్యకుపిచారముగల్గినయేనిబాంధవం । బంకుర మొత్తమావలననక్కటికంబొలయం
గనుమ్మునే। వంకకుఁబోవనీక గరువంబుజగంబు ప్రశంససేయఁగన్ * క ॥ రండనిపిలువఁబనిచిప్పా। లిండనికొడుకులకుఁ జె
ప్పియుంక్రుప్రస్థం। బొండెనువేఱెయు పట్టణ। మొండెనుమాకిచ్చియనుచుటుచితముగాదే * ఉ॥ నావినిసంజయుండునరనా
థునకిట్లను నెట్టితప్పుయుం। బోవఁగఁ ద్రోచితాలిమియపూనుదుగావుననిన్నిమాటలి । ట్లీపుపినంగనాడియును నేఁదనివోవ
కవిన్నవించెద। న్నీపిభవంబహింసయుననింద్యచరిత్రముగాక యల్పమే * క ॥ పాలీకకౌరవులుదు। ర్నీలతఁ జెడఁదలఁ
చిరేనిచెప్పెదరుధిరా। ఖీలాన్నముకంటెనుగడు। మేలగుభిక్షాన్నమైనమీనడవడికిన్ * వ॥ అదియెట్లంటేని * సీ॥ రాజసూ
యమహాధ్వరంబట్లుసలిపిసద్ద్విజులకుసురలకుఁ దృప్తిఁ జేసి । శాంతియుదాంతియుసకలలోకంబులుపొగడంగ బ్రతికినపు
ణ్యమూర్తి। విట్టినీచరితంబహింసాకళంకితమగు టెంతయొప్పెడునదియుఁగాక । దుర్ణయవృత్తిదుర్ద్యూతంబుపుట్టించి
యింతలుచేసినయట్టివారి। నేలగర్వంబుచెల్లంగనిచ్చిజగము । చేతఁదిట్టులువడునట్లు చేసిపోయి। తేలయడవులరమ్మయిని
డుముగుడిచి। తేలతాల్మియెఘనముగానింతపడితి * క॥ తుదిఁబోయిక్రూరకర్మా। స్పదమగు తెఱఁగునకుఁ దొడఁగిబంధులగు
రులన్। వెదకివధియించుసౌఖ్యం। బదియేటికినార్యనింద్యమస్థిరమరయన్ * గీ ॥ అల్పులకుమ్రింగఁ జేఁదైనహాలహలము।
భంగిఁబొంగెడుకోపంబుమ్రింగి కొనఁగ। నీలగళు నెన్నియెన్నంగఁబొలునట్టి। నీవుసాలినగాకేల నెగడుఁబేరు * చ ॥ అన
పుడుఁబాండురాజతనయాగ్రణిసంజయు మోముఁజూచియి । ట్లనునదియేలనీపలికిపట్టిదధర్మువులట్లయుండిబో । ధనులర
యంగవచ్చుననధర్మములై చెడుఁగొన్నిధర్మవ । ర్తనములుగాకతోఁచుదిధర్మములై చనుఁగొన్నికర్మముల్ * వ ॥ కా
వుననీవునన్నుదూఱఁదలంచితేనినాచేయునది యధర్మంబనినిరూపించి మఱిదూఱుము కోపంబువారింపందగునహింసయు

యుత్తమధర్మంబగునట్లయినను వంశమానకులును లోకకంటకులునగు పాపాత్ములనిర్మూలంబుగాఁ జేయుట ధర్మంబని పె
ద్దలచేతవిందుము ఇదియట్లుండె సంగ్రామంబు రాజులకుధర్మంబవుంగాదని నీవ చెప్పినట్లుగాక యిదికర్తవ్యంబనిమనలశా
సించవాసుదేవుండుగలండు మనకీపితరక్షింబేటికినితండు ధర్మాధర్మవిదులకుఁ దురుండు కార్యాకార్యనిరూపకుండును శిక్షకుం
డు బితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుండితని పంపునఁగాదె యదువృష్ణిభోజాంధకసృంజయకేకయప్రభృతిభూపతి ప్రకరం
బు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది విశేషించి మాకునితనిబుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలంబగుటమా
కునితనివచనంబులవశ్యంబున లంఘనీయంబులనినవిని జనార్దనుండు సంజయునకిట్లనియె * ఉ ॥ పాండుతనూజకోటికి
శుభంబుగఁ గోరుమనెప్పుడుఁ బికే । యుండును బుత్రపౌత్రసహితోజ్జ్వలుఁడై కడుచేటు మేలెయం । చుండుదునట్లు
గానఁ దెలిపెంద్రిందియతండటవీరిఁ దేర్పఁగా । నిండుమనంబుతోఁ బనిచె నిన్నిదికిం బ్రీఁబొందిరా * గీ ॥ నీవునుచిత్తవృత్తి
నెయ్యంబుధర్మంబు । వినయమొప్పఁ దెలిపివీరు శాంతిఁ । బొందునట్టిభంగిఁ బొసఁగఁబలుకుటయును । నాకునసమ్మతంబౌనశ్రైని
పువ * గీ ॥ అఘయిట్టులంతయునుదలఁపంగఁడు । నేనసినట్టులుండెనేనియపుడు । పాండవాగ్రజన్ము పలుకులచందంబు । మా
డసంధిలేనిచొప్పదోఁచె * క ॥ అదియట్టిదసంధానము । తుదనెమ్మియుఁ నెగలునెల్లదుర్యోధనుఁ డున్మదుఁ డుద్ధృతశాస్త్ర
భూపిభు । హృదయంబు తెలియంగఁ గొంతయెఱుఁగుదుముగదా * క ॥ ఆరాజు చేయునెయ్యము । గౌరవమునఁ జెప్పెదీవు
డుతీపులుగా । వీరునమపాలువడయక । నేరిమిమాటలనుదేటనేర్తురె చెపుమా * ఉ ॥ వీరలుపెద్దద్రవ్వకొంకి వెంటనా
డంబడితేటిశాంతులై । క్రౌగకోటి గూడిమనఁగావఁదిఁ గోరుట పెంపుతాల్మియుం । గారుణికత్వముం వగవుగాదెజగం
బునపాలితంద్రిపా । లీఁనిత్తెంపుసేసిపయి నెత్తిన నెత్తిరిగాక ద్రోహమే * క ॥ వినుమపమానమువడియి । ట్లునికిఁబడ
యుసాగడుకం బెనుజ్జ్వలులై మా । రొక్కనినదిలెస్సయట్లై । నువీరికిఁబోలుమేలునాకుంజూడఁగ * వ ॥ సంగ్రామంబు
రాజులకుధర్మంబుగాదని నీవుచెప్పినయని యుధిష్ఠిరుండుగన్న ఉగాఁగదాద్విజాతులకు యజనాదికర్మ కరణపి భాగంబుధ
ర్మశాస్త్రాచార్యులువిధించునప్పుడు రాజులిచ్చువారుగాని వేఁడుకొనువారుగారని చెప్పుటసకలలోకప్రసిద్ధంబుసర్వ
వర్ణాశ్రమధర్మపరిపాలనంబు సేయునట్టి రాజులుతారునిజధర్మంబు వదలుదురేయదియునుంగాక పాడితోడియర్థ
వంబునందమకుఁ గల్గినకలిమియనుభవింపునసత్పథంబున నడచుచుండఁదమ్మోరులన్యాయంబుచేసి నప్పటికిగదాయీ
శస్త్రాస్త్రంబులింద్రాదులనుపెద్దలుగావించిరి నీచెప్పిన ధర్మంబులు కౌరవులకుం జెప్పవలదెవారలుగదామీదెఱు
గకకొఱతనులుక్కులై చెడుతెరువునంబోయెడువారనిపలికిమఱియునిట్లనియె * క ॥ వెట్టనసభలో నేవుర । కట్టైమరన
రాత్రితనముగాఁ గెంతయుఁదా । రెట్టితులువలో ద్రౌపది । నట్టువఁ జీరరోయలుజూడమాడరెయెందుకు * వ ॥ అనవుడుసం
జయుండుదేవానీచిత్తంబుననిడెదినినింతగొనియాడిననుగ్రంబాడుఁ గూడ నేయననవాసుదేవుండిట్లనియె * ఉ ॥ అత్తతీర్థ
ష్మముఖ్యులగునచ్చటివృద్ధజనంబులెల్లనెూ । రెత్తక యూరకుండిరిమహీశ్వరుచిత్తమెఱుంగకున్కిఁదా । నొత్తకవాఁడు
లంగియనోపఁడయక్కట మాన్పఁగన్నది । నొత్తకుఁ గాదు లోకములచిత్తము లెల్లను సంతసింపవే * ఉ ॥ తిట్టులఁబోయి
యకొఱలువు తేఁకువవారలలోనికింతదా । నట్టులునస్సేఁయఁడ దయాకృతిముండలవట్టియాడ్పఁగా । నెట్లునహిం
చెమూవసతి । యేడ్పుతెలుంగున కెట్టులో గ్సేనీ । పట్టునసేమమారయఁగఁబంచుట కెట్టులు నేగ్సేఁగ్రమ్మరక్క * చ ॥
ఇదితగదంచునడ్డపడు నింతకునేరకసభ్యులందఱు । న్మదిమదినున్నయట్టిమొఱమాలినికింపదుఁ దానకాదకో । లోప
పిదానఁ జేసిసభనోచ్చెముదక్కెనఁ బాండునందనుల్ । బ్రతికిరిగాక యయ్యెడరురాచకొమారుల కోర్పునట్టిదే * వ ॥
సంజయావినవేయప్పుడుసభాసదులకుఁ గర్ణశూలంబులగునట్లుగాఁ గర్ణుండు * క ॥ లేరిచటమగలుసీకును । వీరలుఁజూదము
ననోడిపిడచరినిన్నుఁ గా । వారిజలోచనసీపై । గూరిమిగలఁగని వెదకి వెదకికొను మొరుఁ నఁడే * క ॥ ఇరుఁకునది వాఙ్మయమను
శరమైహృదయంబు నాటిచలియించకదుర్భర వేదనఁ జేయంగాఁ । జిరకాలముదచ్చికెన్సచే సెనెుచెప్పుమా * వ ॥ మఱియు
దుశ్శాసనుండు వీరలందఱు గొడ్డువోయినవారలు పౌరుషంబుగలవారని సియిం దెవ్వఁడనియె నతండు చెప్పినట్లు వీరలు
గొడ్డువోయిరిగాక వీరిదెసవారికి నేమిఫలించెవెండియుఁదత్సమయంబునఁ బుట్టినమాట లుగ్గడించునట్టియవిగావునం
ధికార్యంబస్యంతదుష్కాలంబు దీనిఘటియింపం జేయనశక్యంబనితలంచెదనయినను * సీ ॥ పాండవేయులఁ దగఁ బ్రార్థి

చియంపలకక్కటరమేనై ననరుసుదెంచి । కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు పాలు జేసినమృత్యుపాశమునకుఁ । దప్పరే
వారలుతగవును నేర్పను నామీఁదనిలుపుటనాకుఁగీడె । నన్నుమన్నింతురన్యాయంబు సోరనినామాటకు వారోడఁబా
టు లేక । యుండ్రుదురు కేరడములాడుచుండి రేని । గదిసిపాండవబాణాగ్ని గాదును వ్వే । తమ్ము దమలోభమను చిచ్చుదరి
కొనలఁగ । దెగిన వారయిపోదురింతియుతలంప * వ॥ అనిపలికి వెండియు నిట్లనియె * గీ॥ రోషమయమహాతరువుసుయోధనుఁడు
రు । స్కంధమందులోనఁగర్ణుఁడలరుఁ । గొమ్మ సౌబలుండుగుసుమఫలంబుదు । శ్శాసనుండుమూలశక్తితంత్రి * గీ॥ ధర్మజుం
డుధర్మతరువర్జునుఁడుఘను । స్కంధమనిలసుతుఁడు శాఖకవలు । పుష్పఫలము లేనభూసురులును వేద । ములుఁదదీయమై
నమూలచయము * క॥ ఈ రెంటియందునరసియ । సారంబివిగాఢసారసహితంబివినా । నేరవలయునదియనుగా । కేరా
పంబయ్యె నేమియీ నేమిటికిఁ * మ॥ ధృతరాష్ట్రుండునుబుత్రులున్వనముకుంతీనందనుల్ సింహముల్ । మతిసూహిం
పనసహ్యమైనవనమున్నద్దింతు రెందున్వనా । వృతవృత్తంబులుగానిసింహములకున్వేగంబచేటౌండుగా । సతతంబొం
దుటగార్యమీయుభయమున్సంతుష్టిమైనున్కికిఁ * క॥ పరిచారకులై యుండుదు । రరివర్గవ్యతికరమునకగ్గుదురువీ
రిఁ । సరిదనకొడుకుల మెలపిన । తెరువున మెలఁగింపఁదగదెధృతరాష్ట్రునకుఁ * క॥ పనిపనికై వచ్చెదఁ । దానెప్పినమే
లుగాకదప్పఁదలఁచినఁ । దాననెగడెదమేము । మ్మానవనాథునకుఁ జెప్పుమామాతమెల్లన్ * వ॥ అనినవినిసంజయుండుధ
ర్మతనయుంగనుంగొని యట్లైనను గడులెస్సగదా దేవా నావచ్చినకార్యంబు సఫలంబయ్యెఁబనివినియెదనని వాసుదేవున
కునట్లువిన్నవించి భీమార్జున నకులసహదేవసాత్యకిఁ విరాటద్రుపదులవీక్షించిమీయందఱచేత ననుజ్ఞాతుండనుగదాపోయి
వచ్చెదనాయాడినమాటలయందేమియుఁదగనియట్టివి లేవుగదా యనుటయుఁబాండవాగ్రజుండతనికిట్లనియె * గీ॥ పో
యివత్తుగాకయీయన్నియందఱు । వినఁగనాడితివుచిశదభంగి । నొక్కమాటయైననుచితంబుగానిది । గలదె యిట్లనంగ
వలయునెట్లు * క॥ ఎఱున్నరూపువలుకఁగఁ । దుదిఁగటకటఁబడవునీవుదుర్ణయమును బె । ట్టిదమును బెందునునగుపలు । కొ
దవదునీనాలుకకునరోన్నతయెపుడుఁ * క॥ నీవొండెవిదురుఁడొండెను । గావలయుంగాకయిట్టికార్యంబులకుఁ । రా
వేఱకలరెతగవా । రీవినయము నేర్పఁగలదెయితరులకెందుఁ * చ॥ అరిగినయప్డుపెద్దలగునందలివిప్రులనెల్లఁగాంచి
యా । దరమున వారి సేమము చితంబుగనారసి వెండిగానృపమీ । గురునిబితామహుంగృపునిఁగూర్తుకు వారలునాకునాన
మ । స్కరణముగాఁగవారికధికప్రియభక్తినమస్కరింపుమీ * సీ॥ మాతండ్రిగని నేను బ్రీతిమెుక్కటగాఁగదండప్రణా
మంబుదగనెనర్పు । దుర్వృత్తిబొరయునాదుర్యోధనునిసేమమడిగితినని చెప్పుమతనితమ్ముఁ । డగుటకుఁదగియెడునాడు
స్సేనునికుశలమారయుముతక్కనుగుమార । వర్గంబునెల్లనువనితాజనంబులను చితంబుమైసుఖమునిక్కయడుగు । విదురుశ
ల్యుఁగాంచివినయంబుదోఁపంగ । నాడు ద్రోణతనయునక్కచేర్చి । కొంటిననుము బాహ్లికునిసోమదత్తుభూరిశ్రవసునఁ
దలఁచిప్రియము నెఱపు * వ॥ మఱియుగుణవృద్ధులువయోవృద్ధులునగుభూపతులును గృతవర్మనుగర్ణశకునిసైంధవప్ర
భృతులును దక్కటిరాజలోకంబునుగయ్యంబునకుఁదోడువచ్చిన సకలదేశాధీశులనుంగని యెవ్వరితోడనెవ్విధంబునం
బ్రణామవినయ బాంధవమైత్రివాత్సల్యంబులగు నయ్యైప్రకారంబుల మద్వచనంబులుగాఁబలికి యుచితంబు మెయి
నుపచరింపుము * క॥ దాసీదాసజనములకు । దాసీనముగాక యుండఁదడయకయేమి । త్రాసంగమొందిశత్రుని । రాసం
బొనరించితమ్ము నరసెదననుమీ * క॥ పోయిన మొగము ననచ్చటఁ । జేయు తెఱంగెల్లనీకుఁజెప్పితిఁబిదపన్ । మాయయ్యపె
ద్దకొలువున । చాఱొడకయిట్లనంగవలయుంజుమ్మీ * చ॥ అనఘభవద్బలంబునయాపదయించుకలేకపాండునం । ద
నులునిజాప్తబంధుసహితంబుసుఖస్థితినున్నవారుత । జ్జనకునిరాజ్యపీఠముననమ్మదమొందఁగనిల్పిశైశవం । బునప్ర
ఘత్వమిచ్చితగఁబ్రోచితివారలవిశ్రుతంబుగన్ * ఉ॥ ఇప్పుడుపేతుచేసికృపయేమియులేకవిహీనవృత్తివా । రొప్పనిఁ
బొందఁజూచుటిదియొప్పునెయింతనెనంతసింపరా । దెప్పుడునంతకంతకటకెక్కుడుగోరినఁజాలకుండదే । యొప్పదెకూ
ఁమునిక్కమనకొప్పనివారలయుక్కదక్కఁగన్ * వ॥ అనితదవసరంబునంబితామహుతోనిట్లనుము * చ॥ అడఁగఁగనీకశంతను
నియన్వయమున్ గలిగించితీవయి । వ్వడుదగనీమతంబుననపొందొడఁగూడఁగఁజేర్చిపౌత్రులన్ । నడికినధర్మవృత్తికినిజా
యనసంబొలఁగించిమన్నినం । బుఁఘమిజనంబురాజులునభూసురులున్నినుఁబ్రస్తుతింపరే. అని వెండియు * క॥ ఇంతలువుట్టి

నచోటను। శంతనునందనయహింసాశాంతిపరుండై। కౌంతేయాగ్రజుండాలము। సొంతఁబోనెల్లఁడనుముబుధులియ్యకొనఁగ * సీ॥ ఆసమయంబుననచ్చటి వారెల్లనినునట్లుగాసుయోధనునితోడ। బాహుబలాఢ్యులబలవిహీనుల క్రియవెడలంగఁజేసిన వెఱ్ఱితనము। నత్యంతచిరకాలమడవులఁగొండలబాధలఁబెట్టినపరుసదనము। సభలోననట్లు పాంచాలరాజాత్మజందలపట్టియీడ్చినతులువతనము। ధర్మపుత్రుండు సయిరించెఁదథ్యమీవు। గురుకుమారులననిమ్రింగికొనకుమొరుల। సౌమ్యునకు నాసపడఁదగదిమున్నారి। పాలువారలతోఁగూడి బ్రతుకుమనుము * వ॥ ఏముగలహంబొల్లకపొందుగోరుటతమకుమేలుతనమనంబున దరికొన్నతృష్ణానలం బాప్పనోరులబ్ధంబుసొరమిం జేసియేనబుద్ధి సెప్పవలసెఁ దనయుద్ధంగలమోహవీడు లెయ్యెడలలేమి తెల్లంబయిననుమాకుఁదోడుధర్మంబుగలదదియునుంగాక యఖిలలోకసేవితుండైన కృష్ణుండు పెనుప్రాపుగావునఁదమకునమ్ము గెలువఁగొలఁదిగాదది యట్లుండె నేను భీమసేనాదులకుం దమకుంబెద్దవాఁడనగుట వీరువారనుమదీయ ప్రార్థనాభంగంబుసేయక నాదగు శాంతియుదాంతియుఁ జెల్లించిననన్నలజడిపెట్టకపోరితంబుడిగి తమతమధనంబులుగుడిచి సుఖంబుండుటమనపెద్దలకుండకొటిబుద్ధిమంతులకును సంతోషంబగుఁబెద్దయీనోపఁడయ్యెనేని కుశస్థలంబునువృకస్థలంబును వాసంతియువారణావతంబునింద్రప్రస్థంబునఁజాలుఁగాదేని మఱియు నెందేనియునొక్కటియగునట్లుగాఁదనతోఁబుట్టువులమేవురకునిలువ తావులయిదిచ్చినసర్వశాంతియగునట్లయిననంపలి బంధుమిత్రసహాయజనంబులుగలసినవ్వుచుం దెగడుచునునికి మనమనంబులకుఁబ్రియంబు సేయుఁగురుపాంచాలయాదవమాత్స్యులుపరస్పరప్రీతిసంపాదకత్వసంపన్నులై బ్రదుకుటనాకుఁగోరిక యింతయునమ్మహాపురుషునకుం దెలియం జెప్పుమనినసంజయుండు దేవా నీయాడినమార్గంబంతయు నడిపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియంబట్లు సేయువాఁడుగాక యనుచుం బ్రణామంబుచేసినసంజయునకుధనంజయుండిట్లనియె * క॥ బాలసఖుండవునాకును। నీలెస్సదనంబు నేమునీకువిడిచితిమి। శ్శీలురమగుటయుశైశవ। లీలమొదలుగాఁగమునుదెలియదె నీకున్ * మ॥ బలమత్తాకృతియైనభీముఁడనుశుంభత్కుంభిసంరంభము। న్నిలిపెన్నాఁడునునంకుశంబయి తుదిన్నేఁడుంసముద్రేకము। న్మలఁగంజేయునజాతశత్రునికృపామాహాత్మ్యంబుచాలంగ వా। రలకేలానయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా * వ॥ అనిపలికిధర్మతనయానుమతంబునసంజయునకుసపరివారంబుగా సముచితప్రకారంబున మజ్జనభోజనంబులొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులాచరించి మణిభూషణచిత్రాంబరంబులొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవునివీడ్కొని చనియెనని చెప్పిన * క॥ వినియత్యంతకుతూహల। మునఁబొదలుచుసంజయుండును న్నెచ్చటికిం జనియెను నెవ్వరితో నే। మనియెను వినవలతు మునీ జనాధిపచెపుమా * అనియడిగిన * ఉ॥ భూరికృపానుషంగమునిపుంగవచిత్తసరోజభృంగసం। సారదవప్రవర్ష సురసంస్తుతదివ్యగుణప్రకర్షదో। స్సారనిరస్తదైత్యశమశాలిఘనస్థితినిత్యలోకని। స్తారకశీలనిర్వృతిపిశాలనిరంజనపాపభంజనా * క॥ శ్రుతిమౌళిరత్నమూర్తీ। శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ। రతిపతిపితాహితార్తీ। సతతసమాచరితభక్తజనసంగార్తీ * మాలిని॥ సదయవిమలదృష్టీ సంశ్రితక్షీరవృష్టీ। హృదయకమలవాసా హేయమాయానిరాసా। విదితనిఖిలభూతీశ్వరశ్రౌర్ధ్వహేతీ। సదసదుపరిధాత్మాసంభృతానందవర్త్మా॥........*

గద్య * ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజితిక్కన
సోమయాజి ప్రణీతంబైనయుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీహయగ్రీవాయనమః.

## శ్రీమహాభారతము - ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము.



శ్రీవిస్తారకరణకరుణా వేశోదారశశ్వదమలాకారా। భావవికారవిదూరశు। భావహనామప్రకారహారిహరనాథా * వ॥ దేవా వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె నివ్విధంబున వీడ్కొని సూతనందనుండు పవనజవంబులగు తురంగం

బుల బూన్చినయరదంబు నెక్కి తడిమికొని ప్రొద్దు గ్రుంకునంతకుం గరిసొచ్చి నగరికరిగి యంతర్గపురంబున నున్నధృ
తరాష్ట్రునకుం దన రాక యెఱింగించి పుచ్చి యాతనిం గాంచి యమగుల కెఱిగిన నమ్మహీవరుండును నత్యాదరంబున నెత్తి
సమీపంబున నిలిపినం గొలిచియుండి చేతులు మోడ్చి యిట్లనియె * ఉ॥ దేవర పంపునం జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ నా।
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు నీకు నమస్కరించె నం।భావన చేసె నాకిచటి బంధుల నెల్లఁ దలంచె మీ సుఖ।శ్రీవిభవం
బులుఁ జుతుల సేమము నన్నడిగెం బ్రసన్నుఁడై * గీ॥ అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నయ్య జాత। శత్రునకు సేమమే యె
నుజన్ములెల్ల।సుఖులె బంధులుఁ దనయులు సఖులు మంత్రి।వరులు సంప్రీతి మెఱయుచున్నవారె యచట * వ॥ అనిన సంజయుండి
ట్లనియె * క॥ వారెల్లను భవదీయ।స్ఫారబలము గారణముగ సౌఖ్యంబునను।న్నారమ్మనిపలుకు మురునిజ।మారయఁ గాన
ట్లు కాదె యది జననాథా * క॥ ధర్మజునకు భోగంబులు। ధర్మువులట్టింపు గావు ధర్మంబులపై।నిర్మలబుద్ధి వహింపఁగ।గూర్మి
కడుం గలఁడతం డఖిలవంశసిధీ * ఉ॥ మానుషశక్తి యొల్లఁడు సమంచితదైవమయాదియుం దుపీ।పైనయతండు పుణ్య
మును బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ। సూనుప వశంబె కాని యొకచొప్పదలంపవు కర్ణసౌబలా। ధీనము కార్యనిశ్చయము
తెల్ల మునీ మతమొప్పదేమియుఁ * గీ॥ ఆలుబిడ్డలేనియట్టి త్రిమ్మరియగు।కొయ్య గాఁ దూడుకుదుటఁ బెట్టి।కుడుచు వారలిట్టి
క్రొవ్విదంబులు సేయఁ।జొచ్చ టిచ్చ గించి చూతురయ్య * చ॥ కొడుకులఁ గాన రేన్నృపులకుం దితతేజుల నెందు నెమ్మెయిం।
జెడు తెరవైన చోఁ దగవు సెప్పక యొప్పఁ గించి చూతురే। పుడమి జనంబులెల్లనిను బ్రువ్వఁగఁ దిట్టఁగ వించును క్కనో।చ్చె
డు మది యెప్పుడుం జెవులు చీములు గట్టెడు కౌరవేశ్వరా * చ॥ చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ని మ్ముఁబట్టి యార్ప
బో।న్మల క్రియ నాడుచుండు మురుమానక నీవును యోధనుండువా। రలసి యొక్కప్డు పాండుసుతులాగ్రహవృత్తిఁ జొచ్చి
రేని నీ।చలము బలంబునుం గులముఁ జక్కఁగఁ జేయరె యొక్క వ్రేల్మిడిన్ * క॥ వినుము యుధిష్ఠిరు సైరణ।మన వారలు వెఱపు
గా మర్థింతురు డీ।కొనఁ గంద రేకొండఁ। గనియోట మి వెట్టినట్లు కౌరవనాథా * క॥ అనుజులకు నడ్డపడియే।మిని జేయఁ
గలేమిఁ జూచి మెచ్చితిగాకి।పును సాధు రేఁగె నేని।న్వినుతలపాలమున నకాసినిలు వదుసుమీ * చ॥ అనయము పుట్టెజూదము
నయప్పుడె యెంతయుం జిచ్చు వెట్టికా। ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మే। తనిపుని యెల్లవారలు నధ
ర్మము నీపయిఁ బెట్టునంతను।న్వినఁ డును గానఁ డుంబిద పనీకుము నాకు మురల్ప వచ్చునే * చ॥ అశయమునొచ్చు చున్నయవి
యంగములెల్లను వేగ వచ్చుట। న్మనము వశంబు గాదు జననాయక ప్రొద్దును బోయె నిప్పుడే। బనివినియెల్లి పుత్త్రులును బం
ధులు నాప్తులు నీవు నేర్పడ। న్వినమన కార్యమంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్ * గీ॥ అనిన నట్లకాక యని సంజయుని
వీడు।కొలిపి కొంత ప్రొద్దు సరుబిభుఁడు। కార్యచింతమునిఁగి కంచుకునొక్కరుఁ। బిలిచి వేగ విదురుఁ బిలువుమనియె * వ॥
వాఁడును సత్వరంబుగాఁ జనియతనిం దోడ్తెచ్చి కానుపించిన నమ్మహీవరుండత్యాదరంబున విదురుం దన యొద్దనునిచి
కొని యతనికిట్లనియె * గీ॥ పాండురాజసుతుల పాలికిఁ జనియిపు।సంజయుండు వచ్చి సమ్ముఖమున।నన్నుఁ జాలదూఱి నాకు
రేపచ్చటి।పనులు చెప్పువాఁడ ననుచుఁ జనియె * క॥ అప్పటినుండియు నెవ్వగ। గప్పికొనినఁ జిత్తవృత్తి కలఁగెడు మేనున్।
నిప్పులఁ బొరలిన యట్లయి।చొప్పడదించుకయు నిద్ర శుద్ధవిచారా * వ॥ అనిన విదురుండిట్లనియె * క॥ బలవంతుఁ డుపైనెత్తిన।
బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు మ్రుచ్చిలి వ్రేఁగునతఁడుఁ గామాతుల చిత్తుఁడు నిద్ర లేకపొందుదు రధిపా * క॥ ఇ
క్కొఱు అగాముల లోపల।నొక్కటి నీ చిత్తవృత్తి నొదవెనొ యొరుసో। మ్మొక్కటి గుడువఁ దలంచితొ।నిక్కముగ తమేని చె
పుమ నిద్ర చెడుటకున్ * గీ॥ అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ। ధర్మసుతు మాట చొప్పెవ్విధం బొయెఱుఁగ।కునికిఁ జే
సి చింతిల్లితి నొప్పుదీవు। తెలియఁ జెప్పి నాయలమట మలుగఁ జేయు * చ॥ అనవుడు నిట్లను న్విదురుఁడక్కట ధర్మసుతుండు
బాంధవుం। డును జెలికాఁడు నుం దగు శుభంబు డును బ్రగ్గడయున్ గురుండు గాఁ। డెన్నపవరేణ్య నీకుఁ బ్రకటీకృతసత్యుఁడు
శాంతమూర్తి స। ద్వినయవివేకశీలములవిశ్రుతుఁడాతఁడు గీడువల్కునే * గీ॥ నీవు గొడుకువారి నెఱి లేక పఱిచితి।ర
దియ చాలు నుచికమైన పాలు। పంచియుండు పిల్లి పట్టినయట్టి వు। చేసియున్న నేల చెల్లనేర్చు * వ॥ మీరు శకుని కర్ణదుశ్శా
సనుల మీఁద రాజ్యభారంబు పెట్టికొని యుండు టది తుదముట్ట నేరదదియట్లుండని * క॥ తమఁ దారెఱుఁగుట వేగపు। ద
మిదాలిమ విడువుగలుగుట యు లేని ప్రభు। త్వము గల దెవ్వారియందీ। నుమానుషములొక్కఁడు పట్టి చూడఁగ లమే * వ॥

యుధిష్ఠిరుండు నీవుం గన్నతండ్రి వనితగవు నమ్మి చాల సైరించియున్నవాఁడది నీవ యెఱుంగుదనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె * గీ॥ సంజయుని చేతఁ గార్యంబు చందమెల్ల । నెఱిఁగి మనకెద్ది సేయంగ దెఱఁగుదానిఁ । బనిచి చేయింపుమిప్పుడు నా మనము దల్లడిలుట హితభాషణంబుల డిందుపఱుపు * వ॥ నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరంబొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లుగా భవద్వచనామృతంబు వెలిగొల్పుమనిన విదురుం డిట్లనియె * క॥ జనులకు నోడఁబాటు గుణవిధి । మనసునఁ జుచు లోకనింద్యములను డుగు చుమి । ఱిన యొకనికలిమి పలుకక । మనుజులతోఁ బొండిసొసఁగి మనటొప్పునృపా * క॥ కోపమును బ్బును గర్వము । నాపోవని యునికియును దురభిమానమునిఁ । ర్వ్యాపపారత్వము ననునివి । కాపురుషగుణంబులండ్రు కౌరవనాథా * క॥ పలినవానిని దైవము । వాలినిబంధులను సముచితారాధనసం । శీలతఁ బ్రీతులఁ జేయని । పాలసుఁడా ఫలములాసపడుమనుజేంద్రా * క॥ నెమ్మి గలవారి నెల్లరు । తమ్మెల్లని వారి వెనుకఁ గలుమరథిక । త్వమ్మె ఱిఁగి మెఱిఁగి తొడరుదు । రిమ్మె ఱుఁగనియట్టివారలిభపురనాథా * క॥ ధనమును విద్యయు వంశంబును దుర్మదులకు మదంబుఁ బొనరించును సజ్జనులైనవారికడఁకువ । యును వినయమునిఁ యెచ్చునుర్వీనాథా * క॥ అరిదివిలు కానియుజ్జ్వల । శరమొక్కనినొంచుతప్పి చనినఁ జనునే । ర్వరిష్ఠునైన వానినీతి । స్ఫురణము పగరాజునతని భూమియుఁ జెఱుచున్ * గీ॥ ఒకటి గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి । మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి । యేనిటిఁ గెల్చియాఱింటి నెఱిఁగి యేడు । విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు * క॥ పినమధురాహారంబులు । గొనటయుఁ బెక్కండ్రు నిద్రగూరిన యెడ మే । ల్కనియునికియుఁ గార్యాలో । చనము దెరువు నడుచుటయును జనదొక్కనికిన్ * క॥ నడవడియును మున్నిటం । గడవం బెట్టంగ నోడకరణిం దగి తా । నొడఁ గూడు నననసత్యము । గడదినగుణమింక నొండు గలదే యరయన్ * క॥ క్షమియించు వారిఁ గనిచా । లమి వెట్టుదు రైననుండలం పననూన । క్షమయకడు మెఱయుతొడవు । త్తమరూపము గూరువారు దాల్తురు దానిన్ * క॥ పురుషుఁడు రెండు దెఱంగుల । ధరనుత్తముఁడనఁగ బరఁగుఁ దా నెయ్యెడలం । బరుసములు వలుకనికిన్ । దురితంబులు వేరయు పనులు దొఱఁగుట వలనన్ * గీ॥ చెల్లియుండియు నయిన యిరణ సేయునతఁడుఁ । బేదవడియును నర్థికిఁ బ్రియము తోడఁ । దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య । పురుషులని చెప్పి రార్యులు కురువరేణ్య * గీ॥ పాడిదప్పకుండఁ బడసిన యర్థము । పాత్రములకు నీగి పాత్రములకుఁ । బెట్టను నికీయనంగ నెట్టన రెండువి । ధములఁ గీడు దొడరు ధరణీనాథా * గీ॥ వేఁదిజూదంబు పానంబు వేఁటపలుకు । ప్రల్లదంబును దండంబుఁ బరుసవనము । సొమ్ము నిప్రయోజనముగ వమ్ముసేఁత । యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల * గీ॥ తగినవేషంబు తనుఁ దాన పొగడుకొనమి । నొచ్చియును గీడు వలుకమి యిచ్చువగవ । కునికి తన కెంతనడువక యున్నఁ బథము । దప్పకుండుట నడవడి కొప్పఁ జేయు * క॥ చెలిమియు సంభాషణమును । బలిమి వివాదంబు ద్రోపుఁ బాడియుఁ దమయం । తలవారితోన తగునది । కులహీనుల తోడ నైనఁ గొఱగాదధిపా * గీ॥ కొంచమైననుదగఁ బంచికొను వమేలు । పనుల యెడ దుఃఖనోర్చియల్పంబు సుఖము । ననుభవించుట హితము శత్రునకునైన । నిచ్చుటయ లెస్స యడిగిన యెడ నృపాల * క॥ తనలోకము గొనియాడఁగ । విని యుబ్బఁడు సజ్జనుండు వెండియు గఁడుమే । లూనరించుఁ గీడొకించుక । యును దన దెసఁ దోఁపనీక యుడుగుచువచ్చున్ * వ॥ ఇట్టిచందంబులు ధర్మనందనునికిం గలవని పలికి విదురుండది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి యిప్పుడు పేక్షించి వారలు వెలినుండ నూరకుండందగునే తగు పాలిచ్చి వారి రావించి నీకొడుకులతోడ వారింగాన డుపుటయుచితంబు మీరును వారునొక్కటియైయున్న దేవతలకైనం దేఱిచూడరాదనిన న మ్మాటలు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె * గీ॥ హితము కర్తవ్యమును దగ నెఱుఁగు దీవు । ధర్మసుతుచందనుః సువిదితంబు నీకు । నట్లుగావున నెఱిఁగింపు మఖిలకార్య । జాతమును జిత్తతాపోపశమముగాఁగ * క॥ అనుడు విదురుఁ డాతనికిట్లను నిమ్మెయి నన్నొత్తియడిగినఁ జెప్పం । జనునున్నరూపు సెప్పెద । వినుమవధానంబుతోడ విమలవిచారా * ఉ॥ డకెక్కను రాజ్యమంచు నకటా యిటు తమ్ముని భాగమీకనీ । వెక్కటి మ్రింగఁ జూచెదవి యెట్లు ఱుగన్ విను మీను లోలతన్ । గ్రక్కన నామిషంబు చవిగాలము మ్రింగిన చాడ్పుచూవె యి । ట్లుక్కవుఁడైననీకొడుకు లిన్నిటులాడఁగూడునే * క॥ ఆవినిని రుత్తరుండయి । మనుజేంద్రుఁ డుకొంత సేపు మాన్పడి తలఁపు । ల్పెనఁగొనని ద్రాహానిం । దసువలయఁగ విదురుతోడఁ

దానిట్లనియెఁ * క॥ ఇంతదాఁక నీదు పలుకుల । డెందము తాపంబు గొంతడిందు పడియెనా । కుందగ నయానయంబుల । చందం
బులు చెప్పు మంతఁ సౌజన్యనిధీ * వ॥ అనిన విని విదురుండిట్లనియె * గీ॥ కమియఁ బండకుండఁ గాయఁ గోసిన చవి । చేటు గాక వి
త్తు చేటు గలుగుఁ । బక్వమగుడుఁ గోయ ఫలమిచ్చుఁ జెడదు బీ । జంబు కార్యసిద్ధి చందమిట్లు * గీ॥ మాలకరి పుష్పములు గోయు
మాడ్కిఁ దేటి । పువ్వుఁ దేనియఁ గ్రోలు లేశపోల్కి నెమరు । గందకుండఁ గొనునది కార్యఫలము । బొగ్గులకు బోలె మొదలం
టఁ బొడువఁ జనదు * క॥ వరుల ధనమున కవిద్యా । పరిణతికిం దేజమునకు బలమున కమనం । బెరియఁగ నసహ్యపడున । న్నరుఁ
డు దెవులు లేని వేదన బడు నధిపా * క॥ ఎదిరికి హితమును బ్రియమును । మదికిం పున గాఁగఁ బలుకు మాటల దిక్కై । యొక వి
నను లెస్సయటు గా । కవియదియన కూరకునికి యొంతయు నొప్పున్ * క॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ । గలఁకయు ధర్మం
బుఁ బాపగతియును బెంపుం । జులువతనంబును వచ్చును । బలుకు బడిన కానఁ బొసఁగఁ బలుకఁగ వలయున్ * క॥ బెడిదము గ
గ త్తిగొడ్డలి । పొడువఁ దెగిన మ్రానఁ జిగురు పొడము పలుకులం । జెడఁ మనిసిన కార్యంబుని । గుడ నేరదు పిదప నెట్టుఁ గురువంశ
నిధీ * క॥ తనువున విరిగిన యమ్ములు । ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురతన్ । మనమున నాటిన మాటలు । విను మెన్నియు
పాయములను వెడలునె యధిపా * ఉ॥ అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడు పల్కక్కట్టి లేదు నీకొడుకు
లొండొరు మీఁది నికృష్ట వాక్యము । ల్పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచునుండఁగ నీవు దానికిన్ । మ్రొక్కక వించునుండెదను
రూప మె నీకిది కౌరవేశ్వరా * గీ॥ చేటుకాలమైనఁ జెట్ట మాటలు నెఱి । గాని తెరువు వట్టి కర్జములును । దగవులట్ల తోఁచుఁ ద
గయె కునవియ వి । నీతులని వానను నిశ్చయించు * వ॥ నీ బుద్ధి పాండవులతోడి విరోధంబు నెమరలంబడమి పాపంబింతియె
కాక యేమి సేయుదము మన కులంబున దేజోధైర్యధార్మికత్వాది గుణంబుల గరిష్ఠుండైన యుధిష్ఠిరుండు నీ సిరికి వెలియై
యట్లుండుట తగవగునే నీ పెద్దతనంబుఁ జూచి సైరణవాటించి యున్న వాఁడనిన విదురుదిక్కు మొగంబై ధృతరాష్ట్రుండు నీ
చెప్పిన నీతి వాక్యంబుల నామనంబు తనివోవదింకను జెప్పు మనవుడు నతండు వెండియు నిట్లనియె * గీ॥ సకల పుణ్యకర్మచయ
మును నొక దెస । విను ము పాడి దప్పకునికి యొక్క । వలను దీని శ్రుతులు తెలిపెడు నెడఁ బాడి । కలిమియంద పెద్ద గాను పించు * గీ॥
పాడి గలిగిన నిహలోక ఫలము లెల్లఁ । జేకుటయ కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు । ధరణిఁ బరఁగుఁ బాగత్తయెందాక నంత ।
కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు * వ॥ తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచ
నుండును నంగిరసుండను విప్రు కొడుకు సుధన్వుండును దమతమ ప్రాణంబు లొడ్డగా నొడ్డియొక్క ధర్మసందేహంబున
కుఁ బన్నిదంబు సటిచి తన్నడిగిన నితండు కొడుకితండు లాఁతియని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి యతని చేత నిజ
తనయుని జీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రతికించెం గావున నీవు ధర్మంబు విడువక యధర్మోపహతులైన నీ కొడు
కులవలని పక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము వారును వీరును నాపద లేక బ్రదుకుదురు నీవు శోకంబు పాలుగాక తక్కు
దువని చెప్పి వెండియును * క॥ పాపంబులు కర్జములని । యేపునఁ జేయంగ నవియు నింపగు ధర్మ । వ్యాపారంబులు గార్య
ము లై పరిణతిఁ బొందె నేసినట్టుల చెల్లున్ * చ॥ అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని నార్యులే । మది దలఁపం
గ వారలు సమంచిత ధర్మము పల్కరేనిన । ట్టిదియు నుధర్మ్మ వేతగ ఘటించిన నిక్కము లేని దేని దా । బదిలపు నిక్క మే యొక
నెపంబిడఁ జొప్పగు నే సభూవరా * ఉ॥ నీతిపథంబునన్ బ్రదుక నేర్చుటయుత్తమభంగి శౌర్యపం । జాతము లై కరంబమరు
సంపదలొందుట మధ్యవృత్తియ । స్ఫీతములైన భారవహ జీవనముల్ దలఁపంగ నష్టముల్ । నీతికి బాహ్యులైన ధరణీవర మెత్త
రె వారి నుత్తముల్ * గీ॥ కయ్యమునకు నెపుడుఁ గాలు ద్రవ్వుదురు నీ । పుత్రులెల్ల సూతపుత్రుఁ డాది । యసుత దీయమంత్రు
లంత కమ్ముఁ దర । బిరుదులీవు నీతి తెరువు సొరవు * క॥ పాండవులు శౌర్యమొల్లరు । ఖండిత నీతి ప్రకార కార్యము మేలై । యుం
డుదు రేదు రేచినఁ దుది । మండుదురాగ్రంగ రాదు మఱి యెవ్వరికిన్ * క॥ తమ తండ్రి భంగి నీకును । సముచితముగు భక్తి చే
సి సజ్జననుత మార్గమునడుచు వారల నీ । కమలమతిం గన్న కొడుకులట్లరయఁదగున్ * వ॥ అని పలికి మఱియు నిట్లనియె * క॥
కారణము లేక యనుసుప । కారపరత్వమున నెరుల కార్యంబులకు । న్వారని యలజడిఁ బడియెడు । వారల చూచెదు గడ
యు వారికి నధిపా * చ॥ ఒకరుని చేతి ప్రోపునుదదున్నతి ప్రాపునుగాంచి యొల్లవెం । టకను గొఱంత లేక సొగడం దగు
సంపద నొందునట్టిదా । తకు మదిఁ గీడు చేసిన కృతఘ్ను నిపీనుఁగు నైన రోఁతవు । ట్టకక బలింపఁగు కక్కలు నొడంబడు నేసను

వంశవర్ధనా * వ॥ కావునఁ గృతము దలంపమికీఁ బాండురాజు నీకుం బరమభక్తుండు పాండవులునుం దేజోలాభంబులు
గావించినవారలు వారల నాదరింపుమని చెప్పి వెండియు నిట్లనియె * గీ॥ బ్రదుకుచెడుట పొగడఁబడుట తొలంగుట। యో
గవేడఁకొనుటయిట్లునుఁ జేటునుఁ। గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడ నెడ। వానికింత యేల వగవ నధిప * క॥ వగబలముద
బుసురూపకు। వగచినమతిదప్పుఁ దెవులు వచ్చుఁ దుర్గా। వగచినలంగినఁ బ్రియమగుఁ। బగతురకును వగచుట దుఃఖప్రాప్తి
వమఁ ఖ్యా * వ॥ అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె * క॥ రిత్తయుపచారముల నే। నుత్తముఁడగు ధర్మతనయు నుడికించితి దుర్వ్యా
త్తులగు మత్సుతుల కతన। మిత్తియగుం బోరవగలు మిగులక యున్నే * వ॥ నెవ్వగలు నివ్వటిల్ల నీకు నిలుపునట్టి వియెయ్యది దా
ని నెఱుంగింపుమనిన విదురుం డిట్లనియె * గీ॥ నియతతపమును నింద్రియనిగ్రహంబు। భూరివిద్యయు శాంతికిఁ గారణములు।
వానియన్నింటికిం బైమేలైన శాంతి। కారణము లోభముడుగుట కౌరవేంద్ర * వ॥ అని వెండియు * క॥ జ్ఞాతులపోషితము ను
గో। వ్రాతము నాశ్రమము విప్రవర్గము చనవుల్। నాతులు గారింపమియు ను। బ్రీతిం జననిచ్చునతని పెంపొప్పు నృపా *
క॥ అలమికొని యొండొరుల ప్రా। పులఁ బ్రాపుల నెలమి కలిమిఁ బొంది బహుజ్ఞా। తులు నెమ్మిఁ గూడఁ దామర। కొలని క్రి
య నాసిరికిఁ బట్టగు దురుజ్జ్వలులై * చ॥ కరితురగాదిఘట్టనయు గాలియు నొంపదె యొంటినున్న యి। త్తరువున నేఁ భూ
రుహవితానమగుం బయియున్న బాధలం। బొరయనె యున్నదమ్ములును బొందిన నేరికి సాధ్యులట్లుగా। కెరవయిఁ బల్చి
నం గెలని కెల్లిక మైపరివోదు రెంతయుఁ * వ॥ కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుం బ్రాపై పోడిగిన నెది
రికిన జేయులగు దురుపరుల యొత్తులేని రాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వః పాసంబునం గుందిన కొంతేయుల దడయ
క తెచ్చియు దితవదఁ బిచ్చి నిలుపుట నీకొడుకులకు నిలుపు గావించుటయని చెప్పిన నతియు నిట్లనుఁ బ్రియవాదులెందును గల
రప్రియంబులుగా కేమియని పథ్యంబు పలుకువారు లేరు జూడం బుత్పన్నుడే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక పథ్యంబు
పలికితిఁ దినీకురు దియింపక రోగికిఁ బథ్యాహారంబు తలకంటగించునట్లయ్యె నైన నిప్పుడుం జెప్పెద వినుము కాకంబులం గయి
కొని మయూరంబులఁ బరిహరించుచందంబున మార్జాలంబులఁ బాటించి సింహంబుల యెడ ననాదరంబు సేయుపిధంబున
సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితివి నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁక మిడుంగులు సోఁకినట్లు తల్లడిం
చెదవు కులంబునకై యొకనిఁ దొరుంగుట యనీతియని పెద్దలు సెప్పుదురు మత్సయవసుండై సద్బుద్ధి సెప్ప వినం డేని మనము
దుర్యోధనుం దొరంగిన నేమియగునది యట్లుండే సంపదసహాయంబున పేటించియుండు సహాయంబు సంపదను ద్దేశించి వర్తి
ల్లునిట్లొకటొకటి పొత్తునం గాని సిద్ధింపవు గావున నీసంపద పాండవులకును వారిసహాయత్వంబు నీకునుం బ్రియంబొన
రింప నొండొరుల కలయుట మేలుగాక మనలావు వెలిసేయుట లెస్సయగునే కురువంశనిస్తారకులగు భీష్మయుధిష్ఠిరులు
ను నవక్రవిక్రములగు కర్ణార్జునులును బ్రతాపధాములగు భీమదుర్యోధనులును శస్త్రాస్త్రపారగులగు నభిమన్యులక్ష్మణ
ప్రభృతికుమారులును శాపానుగ్రహసమర్థులగు ద్రోణద్రుపదాది పరమాప్తులును వారివారి బంధుమిత్రజనంబులు
ను నొక్కమొగంబై నీపనుపు సేయుచు నయవిక్రమంబుల ప్రతిహతంబులై నడువం బృథివి శాసింప భవదీయవిభవంబు
జ్జ్వలంబై యొరుల కెడలేక చెల్లుచున్న నెంత యొప్పగు నోయట్లు విచారింపుము పాండవులు ధీరమతులై వైరమెత్తక
యాకకతొలంగియుండి రేనియుఁ గతిపయదివసంబుల లోఁ జీకాకుపడి చెడుం గాక గాంధారీనందను చేత వసుంధరాపరిపా
లనభారంబు నిర్వహింపం బడునే యనినవిని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె * గీ॥ నీవు చెప్పిన మాటలు నిర్మలములు। ని
పుణసమ్మతములు రాజనీతిమార్గ। బోధకంబులు నైననుఁ బుత్రు విడువ। నోపఁ ధర్మో జయతి యని యుండువాఁడ * వ॥ అనిన
విని విదురుం డిట్లనియె దేవాజ్ఞాతులు గుణహీనులైనను విడువందగదనిన సకలగుణసంపన్నులై భవత్ప్రసాదంబు గోరు
చున్న కొంతేయులందిఁగ విడువఁ జనునే యేను నీకు హితంబు గోరుచున్నవాఁడన నిశ్చయించి నా బుద్ధి వినుము వారిజీవ
నంబునకుం గొన్ని యలంతిపల్లెలైనను దుర్యోధను నొడంబఱిచి తెలంగు పఱిచిన లెస్స యగుఁ జూచెద నతని విడువవలయున
ని చెప్పితినీ పెనకువం బశ్చాత్తాపంబు పుట్టుదానికి నప్పుడు ప్రతీకారంబు లేదు కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతో
డ సంధిసేయవలయు నట్లుంగాక * క॥ తమలోని పొల్లకుసుసమ। రము చేసినఁ గాని చావు రాఁజన దెశరీ। రములాధివ్యా
ధిజరాసమన్వితములగుటఁ జేటు సహజం బరయఁ * చ॥ గజతురగాదిసంపదలు గాంతలతోడి విహారలీలలుం। బ్రజకను

రాగ మొందఁ బరిపాలన సేయు క్రమంబుఁ బోరుల । న్విజయముఁ బొంది పేర్పుటయు నస్ఫురితాభరణానులేపవ । స్త్రజనితవైభవంబుగల రాజులుఁ బోయిరి గాక నిల్చిరే ॥ క॥ కావునఁ జెవికిం జేఁదగు । నీ వాక్యము వినినఁ జాలు నిహపరసౌఖ్య । శ్రీవిభవములకుఁ గీర్తికిఁ । దావలమై వెలయు టింత తథ్యము సుమ్మీ ॥ క ॥ తగ నీ లోనూహింపుము । దిగవిడువక ధర్మతనయు ధృఢమతివై పాం । డుసుచందము కొడుకులకుం । బ్రె×డలకుం జెప్పి తీర్పు పెంపేర్పడఁగన్ ॥ గీ ॥ అనిన నాంబికేయుఁ డనునీ వ పలుకులఁ గలఁక దేఱె బుద్ధి తెలివి నొందె । నిట్లు సేయువాఁడ నిదియ కర్జము ధర్మ । మును యశంబు లాభమును దలంప ॥ చ॥ అనుడు ముదంబు నెమ్మియును నాత్మఁ జెనంగొననన్నతోఁడని । ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కార్యవృత్తి నూ । ల్కొని మొనయొదనుంగని యశంకిత నిశ్చయమైయతండు వా । లినదెస వాలకుండిన బలేమము పోటుల కుం బ్రియంబ గుర్ ॥ వ॥ అని పలికి నట్టూర్పు నిగిడించి ॥ క॥ దైవంబు నేర్పు గాకిటు । పోవఁగ నే నేర్తు నేరఁ బొమ్మని పలుకం । గావశ మెఱఁగన కెవ్వఁడు । దైవము పౌరుషముకంటె దగ గణినాథా ॥ వ॥ అనిన విదురునకు వైచిత్రవీర్యుండిట్లనియె ॥ గీ॥ ధర్మపథము సునీతితత్త్వంబు తెరువు । నిర్మలములగు పలుకుల నీవు నాకుఁ । దెలియఁ జెప్పితి పరమార్థదృష్టి యెట్టి । వాక్యములఁ గల్గుఁ జెప్ప

## ✱ సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబు సెప్పుట. ✱

ము వానిననఘ ॥ వ॥ అనియడిగిన విదురుఁ డతనికిట్లనియె నాకుఁ దోఁచిన యన్నియు నా నేర్చినట్లు నీకెఱుంగించితి నత్యంతగుహ్యంబులగు నర్థంబులు పురాణుండయ్యును గుమారుండగు సనత్సుజాతుండు తెలుప నోపుఁ గాని యిటమీఁద నాకుఁ దెలియదనిన ధృతరాష్ట్రుండమ్మునీంద్రుండు నాకెంతదవ్వు నీవ యవియును జెప్పుమనిన నేను శూద్రయోని జాతుండ వేదాంతవేద్యంబులగు నర్థంబులు నాక గోచరంబులమ్మహాత్ము బుద్ధి నేనెఱుంగుదు దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు నతండు దెలుపం జాలుననిన ధృతరాష్ట్రుండతికుతూహలుండై ॥ గీ॥ మునికుని వ్వాడ తసిఁగను తెలంగెయ్యది । యనుటయను నెఱుంగననిన విదురుఁ డధిక భక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత । వత్సలత్వనిధి సనత్సుజాతు ॥ వ॥ ఇట్లు దలంచుటయుఁ దివ్యజ్ఞానమాననీయుండగు నమ్మునివరేణ్యుండాతనికిం బొడసూపిన విదురుండతని వచ్చుటయుగ్గడించుచు వినయంబున నతని నెదుర్కొనిదండ నమస్కారంబులాచరించి యున్నతాసనంబిడి యర్ఘ్యపాద్యంబులిచ్చి ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబులునుం జేసి ధృతరాష్ట్రునకుం జూపి విదురుండిట్లనియె ॥ క॥ దేవా దేవరకృప నీ । భూవల్లభుఁడమలతత్త్వబోధకమై సౌఖ్యావహమగు వాక్యచయముఁ । దావినఁ గోరుట యుమిమ్ముఁ దలఁచితి భక్తిన్ ॥ వ॥ మీరును గారుణ్యాతిశయంబున విజయంబు చేసితిరి గురుసమాశ్రితులగువారెద్దన సుఖదుఃఖంబులుఁ బ్రియద్వేషంబులు లాభాలాభంబులు నాదిగాఁ గల ద్వంద్వంబులం బడక ప్రదుకుదు రట్టి పరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం గావించి రక్షింపవలయునని ప్రార్థించిన నంబార్థివుండును దదనురూపంబులగు నాలాపంబుల నారాధించిన బ్రసన్నుండయి సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబులగు వివిధవాక్యంబుల సోపానక్రమంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుండెయ్యది యేర్పడ నడిగెనది వివరించుచు హృదయపుష్కరకలితంబగు పరతత్త్వంబు ప్రతిపాదించునట్టి గూఢోక్తులు ననుగ్రహించుచుండె నెట్టకేలకుఁ బ్రభాతంబగుటయు ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు చేసి యద్దేవముని యంతర్ధానంబు చేసె నట్టిసమయంబున ॥ గీ ॥ తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రులన్నదమ్ములతోవిగ్రహంబు గొనుట । కుమ్మలించి వివర్ణత నొందినట్లు । గందిమొంతయుఁ జెలు వేదె జందురుండు ॥ క ॥ కుముదములు తారు నొక్కట । బ్రమదంబున నుండి వాని పదవి దొలఁగినన్ । దమతన్నిలువఁగఁ దగదను । క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్ ॥ ఉ ॥ ఎత్తిన వేక కంధరములెత్తి మొగంబులు సాచి చూచుచుం । జిత్తములున్న గుడ్చితమచెందెడు నిక్కలుకొసి యింపుడ । కొక్కొత్తకనొక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చు చెయ్యువలం । జిత్తలు కేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్ ॥ మ॥ మను సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటులె । ల్లను నోలి న్వెడలంగ రేకులు సముల్లాసంబునన్ వీఁక మె । క్కనఁ బెక్కు చుగ్రందు పొందెడలి వీఁకన్ గేసరంబుల్గడ । ల్కొనఁ దోడ్తో మధువుబ్బఁ జేరెలమిఁ బొల్పొం జెందె నంభోజము ॥ చ॥ వెడ వెడ నిద్రఁ బొందిక నువిచ్చిన పాంథులమీఁద దాడివోఁ । దడఁబడ నొండొరుం బిలుచు దర్పము పంపుబలంబు లోనియ । యుక్కడు కరణిం జెలంగె శుక కోకిల భృంగ తతుల్వనంబులం । దెడనెడఁ బల్కులఁ గూయను సొగయింపఁగ మ్రోయఁ

గఁదద్విరావముల్ ✱ సీ॥ పద్మరాగంబులుపచరించునరుణోదయంబుకాంతికిఁజెలువంబుమిగులఁ । బరువంబుఁజెప్పనవి
రులరాల్చుచుఁదరుచయముచక్కలులేఁచదలఁజెనయ । నరవిరినెత్తావియడరించునున్నిద్రవిటపీటిసౌరభవితతివోద
లనలంతఁజీరినరెమ్మకలునెఱిదీర్చుజక్కవలుచెందొవలకేళటయొనర్పఁ । దెల్లవారుచున్నదివియల్లలార్పుచు । సోణ
గండ్లయందుఁజొచ్చిసుడిసి। తిరిగివేగుఁబోకతెమ్మెరలెలదీగ । కొనలువంకనొత్తుననలఁబ్రోచు ॰ గీ॥ అంతనుదయశైల
మునునశోకద్రుమ। సమితియందుఁగాంతిచారుభంగి । నెఱయవిరిసితొలుతనెగసినయుజ్జ్వల। స్తబకమనఁగఁబద్మసఖు
డుదయించె ✱ సీ॥ ఉర్వీధరంబులనొప్పెడుజేవురుచరులకాంతికినునుమెఱుఁగువెట్టి । ధరణీజవల్లలతావితానముపల్లవ
ములకుబైట్టిపవన్నెయొసఁగి। యరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళలకుఁజిగిదళముకొల్పి । చక్రవాకద్వయసం
తతియెఱకలకోమరారుకెజాయ క్రొత్తఁజేసి। తనదుబాలబింబమనుపమేయప్రభా । పటలజటిలగగనభాగమగుచు।ను
ల్లసిల్లిజగముతెల్లనువిలసిల్లఁ। బూర్వశిఖరిమీఁదఁబొడిచెనినుఁడు ✱ వ॥ ఇట్లుసూర్యోదయంబగుటయుధృతరాష్ట్రుండుతత్కా
లోచితాచారంబులునిర్వర్తించితగుతెఱంగుననలంకృతుఁడయి యాస్థానమంటపంబునకువచ్చి పేరోలగంబిచ్చినఁ గుం
భసంభవకృపకృతవరాశ్వత్థామకర్ణాములగుదొరలును భీష్మవిదురబాహ్లీక సోమదత్తభూరిశ్రవఃప్రభృతులగుబంధు
వులును దుర్యోధన దుశ్శాసనప్రముఖులగు కుమారవర్గంబును లోనుగాఁగలసమస్తపరిజనంబులువచ్చి బలసియుండిర
య్యవసరంబునసంజయుండువచ్చివాకిటనిలిచి ఫణిహారులవలనఁ దన్నెఱింగించి కొలువుసొచ్చి సముచితప్రదేశంబునం
గూర్చుండి తనమాటలువినుటకు చిడిముడిపడుచున్నకొలువుఁగలయంగనుంగొనియిట్లనియె ✱ గీ॥ పాండురాజతనూజు

✱ సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు చెప్పుట. ✱

లపాలికిర్థి । నిమ్మహారాజు వనుపంగ నేగిధర్మ । పుత్త్రుఁగాంచితి నాతండు మైత్రిమెఱయఁ । గౌరవుల సేమమెల్ల
వేర్వేఱనడిగె ✱ వ॥ మఱియుఁ దగువారలనెల్ల నయ్యైయుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున
మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించెనేనును భూనాథుండుగఱపిన తెఱంగునఁ గొఱంతలే
కుండఁబంధుత్వంబునకువలయుమాటలాడిపదంపడికార్యంబుప్రసంగించినాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన
వచనంబులింత యొప్పనేయనియగ్గించిన ధృతరాష్ట్రుండవహితుండై యడుగఁ దానయ్యుధిష్ఠిరునకుం జెప్పినభంగులున
గండువానికినెల్లను తర్తఁబిచ్చిన తెఱంగును నెఱిఁగించి ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధనునకుం గ్రమంబున
వారివారితోనాడుమనినియమించిన చందంబును ధర్మనందనుండుపలికినపలుకులు పరిపాటితేటపడం జెప్పెదననిసూత
సూనుండువెండియునిట్లనియె ✱ గీ॥ ఏచుపప్లావ్యపురమునకేగితొలుత। వాసుదేవార్జునులఁగంటివారునీతి। పథముదప్పని
మాటలుబలిమిదోఁచు । నట్లుగానాడిరవివినుండాదరించి ✱ వ॥ అనినవినిధృతరాష్ట్రుండువాసుదేవుచిత్తంబెట్లుండెన
తండేమనియెననియడిగిన నతనికి సంజయుం డిట్లనియె ॰ ఉ॥ తానునుసత్యభామయును ద్రౌపదియున్నరుఁడుం రహ
స్యగో। ష్ఠీనిరతాత్ములైసుతులుచేరసిచొరనియట్టిచోటఁగాం । దానివహంబుగొల్వఁ బ్రముదస్థితినుండియు బిల్వఁబం
చెన । న్నానలినోదరుండుహృదయంబుననీదెసనార్తియెట్టిదో ॰ వ॥ ఏనును దత్ప్రకారంబు ఫణిహారులవలనమున్న
యెఱింగినవాఁడనగుటఁ గంచుకంబును శిరోవేష్టనంబుధరియించి వినతవేషుండనైపోవునప్పుడు కృష్ణార్జును లనేకమణి
మయభూషణప్రభాభాసితులయి యొక్కసెజ్జనయున్నవారు కృష్ణుండువవ్వాలించియుండి చాదనచరణంబులర్జును
డుతొడలపైనిడుకొని కూర్చున్నవాఁడు సత్యభామయుఁ బాంచాలియు గద్దియలపైనున్నవారు సవినయంబుగా నేనును
దండప్రణామంబుచేసిన నన్నాదరించి కృష్ణునిచేసన్ననర్జునుపనుపునఁగనకరత్నమయంబగు నతనిపాదపీఠం బతండు
వెల్చినకాళ్లుదిగిచికొననిడ్డబుముద్దియలెత్తితెచ్చి నాకుంబెట్టిన నేనును దానింగరతలంబున నంటుచు ధరణీతలంబునం
గూర్చుండికేలుమొగిడ్చిఫాలతలంబునంగదియించినీలవర్ణులుబాహుబలమదభరితులునునయి యేనుఁగుదోయిం బోలెను
న్నయమ్మాధవ ధనంజయులఁ జూచునప్పుడు నాకుహర్షాశ్రుపులకలునుదదనంతరంబ భయంబునుం బుట్టెనట్టియెడ ✱
క॥ ఈయిరువురుఁబంచినపని । సేయుదురటెధర్మజునకుఁ జేకుఱునితలం। పేయదియతనిందొడరుట। వేయేటికిజమునిశిరము
వ్రేయుటగాదే ✱ వ॥ అనితలంచుచుండనమ్మహానుభావులు నన్నుసంభావించితాముపయోగించునటియున్నపానంబు

లును దమకుం గట్టఁ దగినట్టి వస్త్రంబులును దాము దొడుగునట్టి భూషణంబులు నాకును నొసంగి ప్రియంబెసంగ గారవించిన నే
నును నా పోయిన కార్యంబు విన్నవించిన విజయుండును బలు మొగంబుతో దానికి నుత్తరంబు పలుకం దొడంగిన వారించి వారి

*** సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడు చెప్పిన మాట లెఱింగించుట. ***

జొదరుండిట్లనియె * గీ ॥ వినుము సంజయ ధృతరాష్ట్ర విభుని పెద్ద । కొలువునందుఁ దత్పుత్రులు గురుఁడు గృపుఁడు । నా
పగానందనుఁడు మొదలైన సకల । జనులు వినుచుండఁగా నిట్టులను మునీవు * గీ ॥ అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లులనగ్ని
పుట్టినట్టి దయ్యో మీకు । నార్ప వెరవు లేమ నేర్పు మైనింకఁగా । వింపవలయు వనులు వినుఁడు మీరు * సీ ॥ కలయట్టి వివిధార్థ
ములు నశేషంబుగఁ దగ నొసంగుం డు సత్పాత్రములకుఁ । జెలులఁ జుట్టముల నాశ్రితుల రావించి సత్కరింపుఁడు సంతసం
బెలర్ప । నిచ్ఛానుగుణముగ నింద్రియసుఖముల ననుభవింపుఁడు హృదయంబు లలర । నాండ్రను బిడ్డల నన్నివిధంబుల గార
వింపుఁడు ప్రియపూరితముగ । మఱియు నెవ్వరి చిత్తమెత్తెఱఁగున నందు । వాటమై యుండునది యెల్ల వలయునట్లు । సేసి విహ
రింపుఁ డింకెడ సేయకు నికి । నడువుఁడు చేతఁ బ్రాణంబు లిడికొడంగి * వ ॥ అని చెప్పమింతయే మిటికంతేని * ఉ ॥ ఎందును నెవ్వ
రుం బడని యెంతయుఁ గష్టపు పాటు వచ్చినం । గొందల మంది పాండువిభు కోడలు దవ్వులనున్న నన్ను గో । విందుఁడా కావు
మంచుఁ బలవించుటయిం గగఁ రాని యప్పనో । లెందలఁ బోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్మదిన్ * గీ ॥ ఇట్టియేఁ
దేరుగడపంగ నెందును తిక్కి । నెక్కు గాండీవమేత్తెఱ నెక్కు వెట్టి । రెండు దొనలను బూని కిరీటి యనికి । వచ్చు వేఁడెల్లి యొందు
ఁబో వచ్చు మీకు * వ ॥ అని పలుకునప్పటి వారి యెత్తికోలు నీకొడుకు విడుపోవమి యనునదలంచి భయంబందితి నితండు
వారల నెఱుంగండు భీష్మద్రోణుల ప్రాపును గర్ణు గర్వంబును దన్ను గెలిపించునని నచ్చి తోడ రేఁచునని నవిని ధృతరా
ష్ట్రుండర్జునుం డేసునియె నని యడిగిన నతనికి సంజయుండిట్లనియె * క ॥ నరుఁడలుకవొడమి యనునుసు । స్థిరుఁడై తన యెట్టి సె
లల చెలువునఁ గెందా । మరలందెగడెదు కన్నుల । నరుణచ్ఛవి నెఱయ నిట్టులనియె నరేంద్రా * గీ ॥ ఆసుయోధనుండు న
తనికిఁ దోడ్పడు । నరుగుదెంచినట్టి ధరణి నాథ । నయము వినుచునుండ సంజయ నావచ । నములు గాఁగ నిట్లనంగవలయు * ఉ ॥
పాండువియగ్రనందనుఁడు పాలసుగందగనీఁడ యేనిమా । కొండన నేల మేల దిసు యోధనుఁడింత కుమున్న పెక్కు లు
ద్దండతఁ దాను జేసిన విధంబుల కెల్ల మేఱుంగు వెట్టిన । ట్లుండెదు గాక యేనును వృకోదరుఁడుం బ్రియమందు నట్లుగాన్ *
క ॥ మాయిరువుర తోఁగయ్యము । సేయన తండియ్యకొనినసిద్ధించెనకా । దేయుచిత చరితుఁడసుకాం । తేయాగ్రజుకార్య
మట్టితెఱఁగొప్పఁ గదా * క ॥ వనవాసంబున భూశ । య్యను ధర్మజుఁడున్న యట్టి యాయాసమువో । వునె యుంపశయ్యా
మర్యాదనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిన్ * ఉ ॥ సూనృతమూఁది బన్నములు నూడక లోననడంచినట్టి కో । పానలమే
దియున్న నిబిడాటవి పైఁ బ్రసరించు తీవ్రదా । వానలుఁ బోలి శాత్రవచయంబు పయింగవియించి నిల్చినం । గాని యుధిష్ఠిరుక్
సరకు గాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్ * మ ॥ గదసారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముఁడు న్మదమాతంగచ
యంబు నుగ్గుగ లసన్నానారథవ్రాతము । ల్పుదియన్భూరిహయవ్రజంబు పొడిగా సంరంభ తుంగాంగుఁడై । కదియంజూ
చి బలే సుయోధనుఁడు భాగంబిచ్చు రాజ్యంబుకన్ * సీ ॥ కొల్వు లిపీఁకమెగొదగొని తేళ్లకును ఉరుకు తెఱంగున దఱియఁజొ
చ్చి । పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టిదంబుగ వీచు చందమున నడరి । కసిమసంగి నమారికడఁగి జీవుల మీఁదనుగ్రతఁ గవి
యునట్లు రువడించి । యాఁకొన్నలయరుద్రుఁడాగ్రహంబున జగత్ప్రచయంబు మ్రుచ్చు భంగిఁ బొదివి । నకులుఁడు నుద
దనుజుఁడు సాత్యకియు నాసు । భద్రతనయుఁడు నెదిరిన బలము నెల్ల । బెదరఁ జెదరఁ బకల్పడఁ బెల్లుసావఁ । జేయఁగని
కౌరవులు సంధి సేయువారు * ఉ ॥ చిత్తము లుల్లసిల్లన లసింహకిశోరములొక్కమైమదో । న్మత్తగజావలిం బొదువుమా
డ్కిన రాతిబలంబు ముట్టియు । ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్రు లేవురు । న్నొత్తుదురీఁ చేర్చినను నింగని మీ
నృపుఁడల్కదీఱెడిన్ * మ ॥ చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహాజింబ్రాణముల్దావకు । జ్జ్వలులై సేనడువన్విరా
టుఁడును బాంచాలుండు నేపారు నే । నలయుద్రేకము రౌద్రముం బెనువనానా హేతి ఘోరంబుగాఁ । దలపడ్డం గని గాక
ప్రకటదురేగాంధారీసుతుల్మాటలన్ * చ ॥ తఱిమి శిఖండి తన్నొరులు దాఁకఁగ నెవ్వరి దిక్కుఁ జూడకే । డెత్తఱవనపూ
ర్కమైమునమున ధీరత నిల్పి రథంబుఁ బల్విడిం । బఱపి కురుక్షితీశుఁడను బ్రహ్మకువేయును నిండభీష్ము పై । కుఱికిన గాక మాకు

సగము మారకయుత్తు రేమీర మేదినిన్ ॥ శా ॥ విద్యుద్దండము లిల్చి పొల్చిన గతి న్వెల్లందమై యొండెడన । స్మద్యోధావలి మానసం
బున నుత్సాహంబు రెట్టింపదృష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ నీక్షించి గా । కుద్యోగించుట కేల తక్కు
దురుమీఁద గ్రాహవక్రీడకున్ ॥ సీ ॥ గాండీవగుణరవం బొండొండఁ జెలఁగంగ శరపరంపర లాకసంబు గప్పఁ । బ్రతిశిఖ
ములు ఖండితములై రాలంగ నెదిరి సైన్యంబుల మదగజాది । చతురంగములు నజ్జరితంబులై యవయవభేద మెఱుఁగనియ
ట్లుగాఁగ । మనిసినఁ దొరఁగు నెత్తురులును మెదడును నెమ్ములు నెఱచియు నెనసి సమర । తలము ఘోరంబుగాఁగ పిధ్వజ
ముధవళ । హరులు శోభిల్ల నొగలపై హరియెలర్ప । దేవదత్తంబు మ్రోయ దోతెంచునట్టి । రథముఁ గనికాని కానఁడు రాజ
రాజు ॥ శా ॥ బాలక్రీడ మహాసుర ప్రకరముల్ భంజింపఁ డే యొప్పవుం । త్రైలోక్యంబును భక్తియుక్తి దగ నారాధింప
దే యట్టిశౌ । ర్యాలంకారు మహాత్ము దాసరకు సేయం డచ్యుతున్ సమ్మతం । డేలాగై కొను నా సుయోధను నియందెగ్గది
యూహింపఁగన్ ॥ వ ॥ ఏమ పితామహ గురు కృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగంబున కై తొడరిక
య్యంబు సేయువారము కౌరవులకుఁ బుణ్యనియెవ్వరు మాతోఁ బెనంగినను వారి శస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబులగు
ననితలంచెదము పండ్రెండువత్సరంబులు వనవాసంబున నిడుములఁబడి జనపదంబున నబ్దము మూఁడగు నేఁడజ్ఞాతవాసా
యాసంబ ట్లనుభవించి వచ్చి మాతండ్రి పాలికిఁ బెనంగుము మ్మింద్రాదిసుర సహాయులయ్యు నధార్తరాష్ట్రులు గెల్చు
వారే నిధర్మంబుకంటె నధర్మంబు బలవంతంబైన యది యగునింతియ కాని మా చేయునట్టిదికి డై నది గాదేమి వాసుదేవు
నిమున్నడికొని నడుతుము గావున నీ యుద్ధంబున జయంబు మాకు సిద్ధంబ యొల్లభంగుల గ్రణసహితంబుగా గాంధారీనంద
నులందునిమిత్తేమి భూమి గొనుటతప్పదు గాండీవంబు దివియక యనుగు నసువడియెడు బాణంబులు తన యంతన తూణీ
రంబుల వెడలెడు దోలూష్ణ మహానాగంబునుం బోలెఁ గరవాలంబు తాన యొఱ వెలికి నిగుడుచున్న యది కావున మాకవ
శ్యంబును సంగరంబు సంభవించుఁ బాశుపతాది దివ్యశరంబులం గురుపక్షప్రజాక్షయంబు చేసి శాంతింబొందెదము సూ
తనందనా నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు వినికురువృద్ధుండగు బాహ్లీకుండును బితామ
హుండగు భీష్ముండును గురుండగు కుంభసంభవుండును శిష్యుండగు కృపాచార్యుండును గురుపుత్రుండగు నశ్వత్థాను
యు సద్బుద్ధియగు విదురుండును ధర్మాచరణకల్యుండగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికిరది యయ్యెడు సుయోధ
నాదులాయుష్మంతులగు వారకాకయని పలికెనని చెప్పిన విని మందాకినీనందనుండంతయు విని కురోధనునకిట్లనియె ॥ సీ ॥
నలినగర్భుండును పెద్దకొలువునను న్నెడసురపతి ప్రముఖుల చూడ్కులెల్ల । మెఱయు తేజంబున మిఱుమిట్లుగొన సిద్ధ అచ్చ
టనోసి కొంచరుగఁ జూచి । మీరెవ్వరిమ్మెయి మీరుండ సరకు సేయని యట్లు వోయెడు నట్టి వార । లని బృహస్పతి బ్రహ్మ నడి
గిన నతని కిట్లనియె నా చతురాస్యుఁ డాదరమున । దపము పెంపును బల శౌర్య దర్పములును । గలిగి లోకహితార్థంబుగా
జరింతు । రేయుగంబున నరుండు నారాయణుండు । ననఁ బ్రసిద్ధికనెక్కిన మునులు సుమ్ము ॥ వ ॥ అని పలికి వెండియు ॥ క ॥ అనిమి
షహితమునదనుజనాశనమును జేయుదురధర్మ సంగ్రామమున । గ్గినచోటధర్మపరులగు । జనముల గెలిపింతురధికసంగరం
భమునన్ ॥ వ ॥ దేవాసుర యుద్ధంబునప్పుడింద్రుండు వోయి వీరి నారాధించి తోడడిగినఁ జని దెంచి పౌలోమ కాలకేయా
దులగు ననేక దైత్యదానవులం జంపి యింద్రునకుఁ జయంబు గావించి రది మొదలుగా వీరలనెల్లవారలు నెఱింగియుండ
రిదియొక్క తేజంబ రెండు దెఱంగుల వెలుంగుచుండునని చెప్పె విమో పార్థుంబు జన్మాంతరంబు నొందిన యమ్మహాత్ము
లుగదా యీయర్జునుండును వాసుదేవుండును నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు నొడిచి నివాతకవచ కాలకే
యులనఱువది వేవురనిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె వాసుదేవు పరాక్రమంబు కంసనరకాసుర ప్రముఖ నిఖిలదుష్ట
నిగ్రహంబున బ్రసిద్ధంబుగాదె తెలియవినుమున్న రూపు సెప్పెద ॥ క ॥ ఆయిరువురు నొకతలఁపున । నా యోధనమున
కునడుచునట్టి దయేని । న్వేయేల మనము కామెదు । రైయే డ్తెఱఁదాఁక హరున కయినను వశమే ॥ క ॥ సారథియు రథియునై
యొక తేరం గృష్ణులతి ఘోర తేజస్స్ఫురితస్ఫారత దోఁచిన నైనను । ధీరత వాటించి పిదపఁ దెలిసెదవు బలే ॥ వ ॥ అనుచు
నాసుయోధనును పలుకుంచి శాంతనవుండు మఱియు నిట్లనియె ॥ క ॥ మది నా మాటకొకింతయు । బెదరవు కార్యంబునందుఁ
బ్రియము గలిగియుండుదు కౌరవులకుఁ గాలము । తుదిమోకాకిట్టి గర్వితుని నేమందున్ ॥ గీ ॥ హితములగు నాదు వచనం

ఖలిపురుషినని । వాఁడవై తేనియప్పుడు వారువడిరి । వీరువడిరనుమాటలువినుగాక । శకునికర్ణదుశ్శాసనుల్ సన్మతిం
వ * వ॥ దుష్టకష్టనికృష్టాత్ములగునిమ్ముఁవ్వురుఁ జెప్పెడుబుద్ధులుగాఁ యొండువిశేషము సేయవచ్చునని పలికినఁ గానీనుం
డుగనలిగాంగేయునకిట్లనియె * గీ॥ ఇట్టులాడఁదగునె నెయ్యే నేమి చేసితిఁ। గొలిచి కుడిచి పాడియలవుఁ జలముఁ। బలుకుటెండు
నెగ్గపతికిఁ బుత్త్రులకును। మనుమలకుహితంబ యొనరనడుతు * క॥ కాని తెఱఁగయినని నంతటి। మానిసిఁగా నేల చేయుమనుచు

* భీష్ముఁడు కర్ణుని దుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట. *

జేంద్రుఁడున। నీన్నెఱిఁగిన మాటలు। నీనోర వెడలఁదగునె నిండినసభలోన్ * వ॥ అనినవిని భీష్ముండు ధృతరాష్ట్రున కిట్ల
నియె * గీ॥ ఒకటనైనను వారియందొక్కఁడైన। చిఱుతవానిని బోలఁడు సిగ్గులేక। పాండవుల గెల్తు నేనని పలుకుచుండు। వీ
నిరజ్జులుతులువలువింను తగిలి * క॥ మగఁటిమి వారికి వీఁడెమ్ము । దగనమ్మి సుయోధనుఁడు విరోధము గొనిన । ర్వాసు
ణాధ్యులు బలవంతులు । నగుపాండునృపాలసుతులనవమానించెన్ * ఉ॥ ఒక్కఁడొకండనేకవిధయుద్ధజయంబులు
గొన్నవారువా । రొక్కఁడనేమి సేసెనితఁడీతని తమ్మునిఁ గూలనేసియు । క్కొక్కనపార్థుపైఁ గవిసె నేవసులాతఁడు
గ్రమ ఱింపఁగా । నొక్కఁడలేఁడె వీఁడు భవదాత్మజుఁ గొల్వఁడె ఘోషయాత్రలోన్ * వ॥ ఈదుర్జాతుండు కర్ణుం
డెఱుంగక నీతి బాహ్యుండై వలసినట్లు ప్రేలరిమాటలాడుచుండు నీవును గైకొని వినుచుండుదువు మేలకాక యని భీ
ష్మ పలుకు పలుకువిని ద్రోణుండమ్మహారాజుతో నిట్లనియె * ఉ॥ శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు కాఁడె యు
త్యంతహితంబులీ పలుకులాహవ మొప్పదు ధర్మసూతితోఁ । బొంతము మేలు దేవపతిపుత్త్రుఁడు సంజయుతోడ నాడిన। ట్లం
తకు నోపు మీకుఁ దెగియంతనుఖాండవదాహమాదిగాన్ * గీ॥ శరశరాసనములుధరియింప రెట్టులె । వ్వరు నమగత
నంబువలనుగలిగి । కయ్యమున జయంబు గైకొనరే యొరు । లర్జునుండు విజయుఁడనఁగ నెగడె * క॥ మనవీట నెక్కా
దయ్యె । గ్జునునకు సరివీఁటివానిఁ జూడఁగ లోకం । బున నెందు లేమి తెల్లగ । బనుమానము లేదు తొడగనను నేవాన్ *
వ॥ అని చెప్పియప్పాటం బరమహితోపదేశంబు చేసెస భీష్మద్రోణులపలుకు లాకర్ణింపక వారికి సదుత్తరంబులీక వారల
తోడం దొదనురూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వేఁడియుఁ బాండవులవలని వార్తలడుగుటకు సంజయునిక్కు
మొగంబైనఁ జూచి యిరుపక్షంబులులం ప్రాణంబుల దెసనిరాశులైయుండి రమ్మహీపతి సంజయునితో నిట్లనియె *
గీ॥ ధర్మపుత్త్రునకిక్కడితలఁపుభంగి। యెట్టులిందుల సైన్యంబులెల్లఁ గూడి। యునికవినియని కెవ్వరిఁ గొనియతండు। కౌరవుల
మీఁద నెత్తఁగాఁ గడఁగు వాఁడు * వ॥ అనినవిని సంజయుండు వెచ్చనూర్చి ఱిచ్చపడి మూర్ఛవోయిన చందంబున డెందంబున
గుడం జేష్టలు వక్కఱయుండి కొండొక సేపునకుఁ జిత్తంబొక్కింత చేసికొనియక్కటా యీ భూపాలుం డింత వేలగునె యుధి
ష్ఠిరుండెవ్వరిఁ గొనియెత్తివచ్చువాఁడని యడుగుచున్నవాఁడింత యెఱుంగని వాఁడెంత చెప్పినను దెలియనేర్చునే యితని
భంగి యిట్టిదనినఁ గొడుకుల తెఱంగు వేఱె యెన్న నేల యేమింక నేమను వాఁడనైనను నన్నడిగిన మాటకుం దగినమాఱుమా
టవలుక వలయునని కాదె యనితలంచి ధృతరాష్ట్రునకిట్లనియె * చ॥ వినుమునరేంద్ర పాండుపృథివీపతియగ్రసుతుండు సం
ధిసే । యనమఁదిఁ గోరుచు మీరుతనయయ్యసగంబును భూమియీకత । క్కినవుటి కానిముందరఁ గొరకీడుతలంపఁడు మీబలం
బునె । ల్లను నొకచీరికిం గొనఁడు లావున నేలఁగొనం దలంచెడిన్ * వ॥ అతండెవ్వరిం గొనియెత్తివచ్చువాఁడని యడిగితివినీ
వెఱుంగనివారలం దెవ్వరుగలరవధరింపుము * మ॥ బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారీణుఁ గీచకనిర్మూ
లనకేళిలోలుఁ సమరోత్సాహైక శీలప్రవర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా । హకు భీముం గొ
నివచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్ * వ॥ మఱియును * మ॥ ఆటవిన్నందినయట్టివానిఁ బొడవెంతన్నట్లు ఫాలా
క్షుని నెక్కటికయ్యంబునఁ గన్నఫల్గును భుజాగర్వంబు జాలెక్కింపుమం । తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై
నెత్తివ । చ్చుటకుం గొంకు నెవీపు చక్కనయి నిల్చుంగాక మీసైన్యముల్ * గీ॥ నకులుసహదేవుఁ గొని ధర్మనందనుండు
మొనసి కౌరవబలములమట్టికొనఁగ। దలఁచితటి వేచివచ్చుట ధరణినాథ। సింగములఁ బట్టి వేఁటాడుభంగిగాద * గీ॥ ద్రౌ
పదేయులు నా సుభద్రాసుతుండు। నుక్కుతునియలుగా రేమి మ్మకుక్కమాఱ। వరులఁ గొని యెత్తువాఁడయి వచ్చు ధర్మ
పుత్త్రుఁడిదినీకుఁ జూడంగఁ బోలదెట్లు * వ॥ అని చెప్పి వెండియు నిట్లనియె * క॥ వృష్ణికులోత్తముఁడా। కృష్ణునితమ్ముండుసా

త్యకేయుదవదహనా। తృష్ణప్రతాపదీప్తులు। కృష్ణాసోదరులు దలఁపఁ గేవలులె నృపా * సీ॥ శౌర్యోజ్జ్వలుండు పాంచాల భూనాథుండు మహితవిక్రముఁడగు మత్స్యవిభుఁడు । నధికధైర్యాన్వితులతనితమ్ములుసుగ్రతేజస్కులైన తదీయసుతులు । నన్నదమ్ములు ప్రతాపోన్నతులేవురు కేకయపతులు నక్షీణబాహు । శక్తియుక్తులు జరాసంధసూనుఁడు సహదేవుండు నాజయత్సేనవిభుఁడు। వినుము శిశుపాలతనయులు వీరధనులు । దృష్టకేతుండు వృషభుండు తీవ్రరణవినోదియదుభర్త చేకితానుండు దర్పఘనుఁడు శైబ్యనృపాలుండు గలఁడు గాదె * క॥ వీరెల్లఁ బాండురాజకుమారుల పాటునకుఁగుందుసునములతోడ। న్వారిపగదీర్పఁగడఁగెడు। వారలు గాకందులాఁతివారలు గలరే * వ॥ భీమసేనుసూనుండు ఘటోత్కచుండు తంత్రికం బెనులావును భీకరంబును గలవాఁడు మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు మఱియు నర్జునను త్తరంబునం గలుగు నరనాయకులు నా నాసేనాసమన్వితులై వచ్చి విచ్చియున్నవారు బిడికిలింత సనుచున్న వారదియునుం గాక * క॥ సకలభువనములు నఱచే। తికిఁ దేరం జాలునట్టిధీమంతుఁడు దే। వకికొడుకు గలఁడు ధర్మజు। నకి నాతఁడె త్రిశాకనిలు

* ధృతరాష్ట్రుఁడు భీమసేనుపరాక్రమంబు దలంచి దుఃఖించుట. *

చు నెయ్యధిపా * వ॥ అనిన ధృతరాష్ట్రుండు సంజయునకిట్లనియె * క॥ వారి దెసనీవు చెప్పిన। యారథికులు ప్రబలులగుదురందఱునైన। న్వారెల్లను నొకతలయు। మ్మారుతి యొక్కతలబలప్రమాణముఁ జూడన్ * ఉ॥ భీముఁ దలంచి నన్నమును భీతిఁ గలంగుచునుండు నాకు రే। లేమియు నిద్ర రాదతని యేడ్తెఱమార్కొనఁ జాలునట్టివాఁ। డీమొన లేఁడతండలుక నెత్తిన యా గద కాలదండము। ద్దామవిలాసుఁడై కురుకదంబములో విహరింపకుండునే। గీ॥ చిఱుతనాఁడును వాఁడు నాశిక్షఁ బోఁడు। నీరు దివ్వకుఁ జొత్తురు వైరమెత్తి। వానిచేఁ బీడవడియును మానరది య। కాదె యీభేదమున కెల్లఁ గారణంబు * క॥ సమరమున దైత్యదానవ। సమితియునాతని కెదురుర్వఁ జాలదు భుజయు। ద్ధమున జరాసంధుని నొక। నిమిషంబున గెంటె నొరులు నిలుతురె యెదురన్ * ఉ॥ బామలల్కస్ముడివడ్డ రౌద్రరసము ప్పొంగఁ గదనర్వ భుజా । గ్రములం దెవ్వఁడు నాకుమాఱు అనుచు శౌర్యస్ఫూర్తిశోభిల్లదు। ర్దమలీలం గపియంగ భీముఁ గని ధైర్యం బేది కౌరవ్యసై । న్యములంతం తఁ గలంగఁ బాఱిన టులైనా మోమున న్ప్రేలెడిన్ * క॥ కరవాలము గదమొదలగు। పరికరమేమియును లేక బాహుబలమునం। గరిగతిన డరి నన్వృకో । దరునొక్కఁడు మొదుర నిల్చి తలపడువాఁడే * గీ॥ ప్రళయకాలసముద్రము భంగి బొంగి । కదుభయంకరుఁడగు భీముఁ గడవనీఁడు। వశమే నాపుత్రులకు విధివశము వొందె। యెదిరిదమ్మును నెఱుఁగరు సుదముకతన * క॥ చిచ్చునకుఁ బోడుకరువలి। వచ్చు గతిన్ భీముమర్ని వారవిహారం। బచ్చుపడఁగఁ బ్రాపైవి। వ్వచ్చుఁడు వేసవచ్చు గాండివంబును దాల్చన్ * వ॥ సంజయా వినుము న్నరూపు సెప్పెద * క॥ ఆయర్జునుమగఁటిమి కెన। యే యుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే। నీ యెదుర నాడినంతయుఁ। జేయుట కతఁడో పురిత్తసెప్పెడు వాఁడే * ఉ॥ ఎక్కడు గాండివంబును తికెక్కి వెలుంగుట మీఁదఁ గేశవుం। డక్కజమైన తేజమది యానపడంతు తనంతనర్జునుం । డొక్కఁడ వైరిసేనలకు నొడ్డినమంట ప్రతాపమూర్తులి । ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రవు వేఁడిమికోర్వ వచ్చునే * క॥ దివిజదనుజనహితములగు। భువనములన్నిటను మహేంద్రపుత్రుఁడు విజయోత్సవలీలఁ గ్రీడసల్పుం। దవులంబడఁ డెందునత్యుదగ్రబలమునన్ * వ॥ అనిపలికి వెండియు * క॥ కురుసేనఁ బాసి గెలుచుట। కరము భరము గాదు నరుని గాండీవమునం। బెరిగిన యస్త్రములమఁటలు। దరికొని తెగఁ గాల్చునట్టి దయయసుఁ జుమ్మీ * వ॥ భీమార్జునులకోలం దులుభీష్మద్రోణులెఱుంగు నంతకంటె నెవ్వరెఱుంగుదురు గెలిగియు మానుషంబు వాటించి సేన మొగంబున నిలుతురు కీర్తిపట్టి ప్రాణంబులు విడుతురింతియుకాని చేయునది లేదది యునుంగాక పౌత్రులగుటయు శిష్యులగుటయుగాంగేయునకు గురునకు సామాన్యంబగుటం జేసి రెండు దెఱంగుల వారికిపీరోక్రూవమనక డనున్న తప్పునకు మనముందర నిలువవలయుననుచు నుండుదురింతమాత్రకుం గాబీరలకింతవలసె నేను దైవాధీనంబుకతంబున భిక్షలనొత్తిచెప్ప నియమింపనుంజాల మొదలవిదురుండేమని చాటిచెప్పెనని యంతయుం బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికింజేటు మూడుట దోఁచుచున్నది మందబుద్ధియు లోభోపహతుండునునై దురభిలాషంబున దుర్యోధనుఁడెంత చేసెఁ గాలవిపర్యయంబునఁ గౌరవులకుఁ గడవరాని యవస్థ వచ్చె సంజయా నేనేమి సేయుదు నేఁడు జొత్తునెద్ది తెరువెవ్వరు శరణంబు వారిరువురుగలయంత నెపోయె నేవినుచునిముడియునిట్లనియె * చ॥ అనుజులునట్టి వారు ద్రుపదాదిసుహృజ్జనులెల్లనంతకం। బెనుబలవం

తులాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు సద్వినయవివేకశీలములవిశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం । దనకు వశంబు
సేసికొను దానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్ * గీ ॥ సత్యశౌచధర్మశాలి దయాపరుం । డట్టిధర్మపుత్రు నాక్రమింప మనము
దలఁచు టెల్ల మంటపై మిడుతలు దగ్రవృత్తి నుఱికి కడలఁచునట్లు * వ ॥ కావునఁ బాండవులతోడి భండనంబునఁ గులక్షయం
బగుట దప్పదు శాంతిఁ బొందుట మేలు మఱి వారల కది ప్రియంబగు నేని దానికిం దగిన యత్నంబు చేసెదననినవిని ధృతరాష్ట్రు
నకు సంజయుం డిట్లనియె * క ॥ దేవర యానతి యిచ్చిన । యీ వాక్యము లెస్స నాఁడు నీ వయ్యుపేక్షం । బోవిడిచి యింక నుసిఁ జే
వత్తురు వారు వీరి చేటొప్పదు రే * వ ॥ అది యెట్టంటేని ॥ క ॥ వారు దెసలొత్తికొని యుధ । రారాజ్యం బిచ్చుసేయి రాపొ గో
తా । రారణ్యపీడఁ బడియును । రారాజుం జెఱకుఁ బాపరాముని మెఱుఁగన్ * వ ॥ అట్టి మేడనైనను * క ॥ రావించి తగవు మై
నం । భావింపవ కాక నాఁడ పాండవు లలుకం । బోవిడువ రెమ్మి గులుదురే । నీ వచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్ * వ ॥ అనిన వి

## దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యంబు చెప్పుట.

విని దుర్యోధనుండు తండ్రి కిట్లనియె * చ ॥ అడవులఁ గోడలం బడి మహాపదఁ రూపటిచన్న వారిని । ప్పుడు గొని వచ్చి కృష్ణుఁ డొక
ప్రోవుగఁ గూటువ మూఁకఁ గూర్చినం । బాడుతు రెపాండునందనులు ఘోరవరయేటికి నింత భీతి నా । కడిమియు లావు నీవ దు
గాగ నుతింపకు గెల్తు నెమ్మె యిన్ ॥ గీ ॥ పరశురాము జయించిన బల్లిదుండు । భీష్ముఁ డవనీశ లీతని పేరు వినిన । బాఱు చుం
డుట యెఱుఁగవే పాండుపుత్రు । లనఁగ నెంతటి వారి తండ్రి గానేని * క ॥ కృపుఁడును గురుఁడును రయోనిజు । లపరిమితభుజా
బలాఢ్యు లాహవకేళీ । నిపుణుల జేయులు వీరలు । కపితాత్మకులైన మాకుఁ గొను నేమహుఁడున్ * క ॥ ఈశ్వరవరజనితుఁ
డు హరి । శశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని । తైల్యశ్వర్యధురంధరుఁ డీ । యశ్వత్థామకలుగ మునకని వెఱ పేలా * గీ ॥ సహ
జకుండలుండు శౌర్యధుర్యుఁడు సము । ద్దీర్ణబాహుబలుఁడు కర్ణుఁడింతఁ । గలఁడు వీని కెదురు గలఁడని యెన్న మా । ధర్మపు
త్రు పాలధరణినాథ ॥ క ॥ విను మునఁ దేశ్వరకర్ణుని । పెనువుమ హేంద్రుండు వచ్చి ప్రియమున శచక్కై । తనున ర్థింపఁగని
చ్చెను । గొనుమని లోకంబు లెఱుఁగఁగుండలయుగమున్ * వ ॥ వీరలా ధర్మపుత్రాదుల చేతనకాదెవ్వరి చేతనుం జెడమి
తెల్లంబు బాహ్లీకసోమదత్తభూరిశ్రవశ్శల్యసింధురాజగాంధారరాజప్రభృతి మహావీరులు వీరలకం టెశక్తిసమగ్రులు ద
క్కటి రాజలోకంబును సహాయులై వచ్చిన వివిధ దేశాధీశులును నాతోడి సుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికమై నగ్నినై
నను బొకను సముద్రంబైన నీఁదను దెంపు సేసి పొంపిరివోవుచున్నవారు గావునఁ బాండవులకు మాదిక్కు దేఱి చూడనుంగో
లంది బాదను మానింపకు మిట్లునుంగాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచితోడు వచ్చిన వారు విచ్చిపో
యి భృత్యులును విగతులై వారె పోటుమానసులును బంధుమిత్ర సహాయులును బ్రజానురాగంబునుం గలిగినట్టి వారైన
నది ప్రాప్తకాలంబింతియె కాక యేమింక వారి యడుగులొత్తను గోలి బదుకు వను బాటిపోవనుం జాల మెల్లభంగుల సమ
రంబు సేయుదము నాతలంచి నట్లొండె వాసుదేవుండు దలంచినట్లొండె నయ్యెడు నట్లైన మేలయింతవట్టును నిశ్చయంబని
పలికి మఱియు నిట్లనియె * గీ ॥ కులములోఁ దలవంపగు కూడును సువఁ । బంపఁ జూచెద వక్కటా పగతురట్టి । వారు పైనెత్తివ
చ్చినఁ బోరికోప । మనుటధృతి చేటె కాక పొందగు నె చెపుమ * క ॥ నీవు బతిమాలి కొడుకుల । చావునకును జేటునకును జా
లకయిమ్మె । వావిడిచియ బదినంగడు । నే వపడరె జనులు నిన్ను నేమననేర్తున్ * గీ ॥ భీమసేను నిసీవింత పెద్ద చేసి । పెక్కు
భంగులఁ జెప్పితి యక్కుగలఁడు । గదకు నేర్చునం చొంతయు బెదరెడతఁడు । నన్నుఁ బోల మి యెఱుఁగవే నెరవరెన్న * మ ॥ గ
దనాతో సరిమూఁడు లోకముల నేఁగానంజలం బెత్తియు । న్మదుఁ డాభీముఁడు నన్ను నిందొడరి నవ్వజ్రప్రహారంబు బె । ట్టిద
మై తాఁకినఁ గూలు పర్వతము మాడ్కిం గుంభినిం గూలద్రె । సెదనా కోర్కి గదాగదారణము వచ్చెం బెద్దగాలంబునన్ * గీ ॥
అతఁడు వడిన వెండి యాసేనఁ గొత్తల । సేయనొక్కఁడు లేమి సిద్ధమింత । యెఱిఁగి వెఱచి కాదె యేనూళ్లు లైనను । దమకుఁ జా
లనని యె ధర్మసుతుఁడు * వ ॥ అర్జునుండు గలండని తలంచితివేని * గీ ॥ కర్ణుపడసిన యాశక్తి గలుగఁ బోర । బ్రదుక వచ్చునె న
ననకు నదియుఁ గాక । యతని భీష్మాదియోధుల యతులితాప్ర । మేయదివ్యబాణంబులు మ్రింగికొనవె * వ ॥ దుశ్శాసనదు
ష్ప్రహదుర్ముఖవివింశతి వికర్ణచిత్రసేనాదులగు నీ కొడుకులొక్కఁ డొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుమరట్లుగాన భ
యంపడవలవదవధరింపుము సహజకుండలమండితుండును శౌర్యధుర్యుండును సముద్దీర్ణబాహుబలుండును నగు కర్ణుండు

నవీరు నొక్కఁడు మొగంబై త్రోచి నడిచిన సవ్యసాచి యొక్కరుండ కాఁ బాండవుల నెల్లనొక్కత్తున వైచికొన నోపుమరది యనుం గాక మాకు నక్షౌహిణులు పదునొకండు వారికి నేడు మా సైన్యంబు సారవంతంబు వారి బలంబు నిస్సారంబు మమ్మ వ్విధంబున జయింతురీ యెక్కువ దక్కువలు విచారింపక వలవని వెఱపుగట్టుకొని ముకూర్తి యారక వగచుచున్నవాఁడవు నిన్నవగవకుండను డు పంజాల మంతియ కానిత క్కెల్లపనుల కుంజాలుదు మని సంజయు దెసం గనుంగొని సుయోధనుండిట్లని యె * క॥ నానా దేశంబుల బలు। మానుసుల గూర్చికొని సమత్సరబుద్ధిం। దానేమని యొఘనయ్యాను । సూనుండాతని తెఱం

## సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజు నిశ్చయంబెఱిఁగించుట.

గు సూతము చెప్పుమా * వ॥ అనిన విని సంజయుండిట్లనియె * ఉ॥ ఆతఁడు భండనంబసిన నాచ్చినమూ రెకు వేర్చు నెంతయుం। బ్రీతి వహించి తమ్ములొక పెండ్లికిఁ బోయెడునట్లయున్నవా । రాతెలి వెందునుం గల దెయందలి నాయకు లెవ్వఁడొక్కఁడు మా। చేతుల తీఁట వుత్తు మను చిత్తమె కాని చలింప రేమియున్ • గీ॥ నరుని పాశుపతాది బాణముల పెంపు । భీము గదసొంపు నన్ని యుద్ధామ లీలం। జెలంగి వెఱ పేదియక్కడి బలము మును సరు। గవిసి యెప్పుడు గయ్యమునకుఁ గాలు ద్రువ్వ * క ॥ నావుడు నది యాసంజయ। కై వారము చేసెదీవు కాంతేయుల వా। రేరణ సాధనమ్ములు । గా వెఱవక తొడరు వారు గౌరవులపయిన్ • వ॥ అనిన సుయోధనునకు సూతనందనుం డర్జును దివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తంబుల మహాభావంబులు వేఱువేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమనకులసహదేవుల యరదంబులు దురంగదివ్య శరగదా ఖడ్గాది సాధనంబు లిట్టిట్టివని యెక్క డంబలికి విరాటద్రుపదాదులకు వలయు నుపకరణంబులుకొ అంతలేమి యెఱుంగించిన ధృతరాష్ట్రుండింతగల బలుమానుసులెవ్వరికిన సాధ్యులు వీరి సాధించు తెఱం గూహించి రేయని యడిగిన నతనికి సంజయుండిట్లనియె * సీ॥ గంగాసుతుండు శిఖండిపాలు తనికిఁ బ్రాపు మత్స్యేశ్వరు బలముకుంభ। భవుఁడు ధృష్టద్యుమ్ను పాలు తనికిఁ దోడుపడు ద్రౌపదీ పుత్రపంచకంబు। రారాజుఁ దమ్ములు మారుతి పాలు కుమారులందఱు నభిమన్యు పాలు । శకుని సైంధవులు నశ్వత్థామ కర్ణులు తక్కుచేఁ బోనిదండి మగలు। సవ్యసాచి పాలు సాత్యకి పాలు కృత। వర్మ చేకితాన వసుమతీశు । పాలు సోమదత్తుఁ డాలంబునకు నిట్లు। నిశ్చయించిరి చటన్నృపవరేణ్య • క॥ నకులుఁడు సహదేవుండును। శకునియులూకాది సుతుల సారస్వతులం । బ్రకటబలులై నకాళిం। గకులను సమయించువారు కౌరవనాథా * క ॥ కేకయులు మనలఁ గలసిన । కేకయుల జయించువారు కృతపుణ్యుఁడు సు। శ్లోకుఁడు ధర్మతనూజుఁడు। లోకోత్తరు శల్యుఁ దాగెలువ వాఁడధిపా • వ॥ అట్టి పలుకుల పలుకు సమయంబున నచ్చోటం గొందఱు జనంబులు ధర్మనందనునుద్దేశించి * క ॥ ఇతఁడెక్కడ మద్రమహీ। పతి యొక్కడ నితనికిఁ దఁడు పాటి యె యనుచుం। బ్రతివచనంబుల శల్యుని। యతిబలశౌర్యములు వారికాతఁడు సెప్పెన్ * వ ॥ ఇట్లు గాక యు నెవ్వరి మొగంబున నెవ్వరు వడిరి వారికి వారచాలియుండు వారని యివ్విధంబునఁ గ్రొవ్వుమిగిలి కొఱంతలేని తెగువం దేజరిల్లుచున్న వారు నీకు నీకొడుకునకు నెయ్యది కర్జంబై తోఁచె నది యు చేయుం డనిన విని విచిత్రవీర్యతనయుండిట్లనియె • క ॥ నాకొడుకులకెక్కుడి బ్రదు। కేకొలఁది దలంపనిప్పుడెన్నిన వీరా । నీకంబు నొర్వ వచ్చునె । యీ కౌరవ సైన్యములకు నేమను వాఁడన్ * క॥ రాజు యుధిష్ఠిరుఁడై పూరి। తౌజయమొదఁ గూర్పనున్నఁ దత్సైన్యము రా। రాజిట్లు సరకు సేయమి । నాజన్మము దుఃఖభాజనంబగుటఁ జుమీ • క॥ నాకుడు పనేల వశమగు । నీకూడిన భూపతులకు నింతియ కాలం । బైకడచన్నది సంజయ। నీకీవగ పేలయింక నిలుపుము పలుకుల్ • వ॥ అనిన విని దుర్యోధనుండు నిజజనకుతో నిట్లనియె • ఉ॥ ఏమును బాండునందనులు నేక కులంబునం బుట్టి యొక్కచో । నే మొక్కఁడైనఁ జేయగెడ నెప్డుఁ జరించిన యట్టివారము । ద్దామబలంబు శౌర్యమును వర్ప్రము వారికకల్గి వారు సం। గ్రామమునన్ జయింతురనఁ గానొకనిశ్చయ మెట్లు గల్గెడున్ • ఉ ॥ వారికి వారి వారికిటు వర్ణన చేసెదుగాని మమ్ము మా। వారిఁ దలంపవివ్వడమి వారికిఁ బాయను మాకు నంతయుం । జేరను మత్కృపాజితవిధిసిద్ధము దీని నెకండు మాన్పఁగా। నేరఁడ కారణంబమది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్ • వ ॥ అనిన విని సూతనందనునకు నంబికానందనుండిట్లను నాకొడుకున్మత్తప్రలాపంబులు సేయుచున్న వాఁడింతియ కాక సత్యధర్మనయపరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను బ్రబలుండైనను బెనుకువకీడగుగాక మేలగు నేయది యట్లుండె నేనొక్కటియడిగెద సంజయా చెప్పుము • క॥ సమరమున కుఁబురికొల్పుచు। నుముఁదలఁచిననుల్లిసుట్టుమాటలఁ దచ్చి । త్రములుఁడి

కించుచుఁ బాండవ। సమితిం గడఁగించువారు చట నెవ్వరొకో ॥ * క ॥ నావుడు సంజయుఁ డిట్లను। దేవా పాండవుల యలుక దృ
ష్టద్యుమ్నుం। డే వెరవు మాటనైనను। నేవోసిన యగ్నిభంగి నెగడఁగఁ జేయున్ * వ ॥ అతండు ధర్మతనయుతో నిట్లనియె
గాంగేయ కుంభసంభవాది మహావీర క్రూరసత్త్వబహుళంబును గరిఘటాగిరికదంబ కలితంబును దురంగనికర తరంగవి
రంపరా ఘోరంబును గు కౌరవసేనాసముద్రంబునకు నేనొక్క చెలియలికట్టయై నిల్చెదన నవుడు నయ్యుధిష్ఠిరుండు నీ
వింతకుఁ జాలుట యెవ్వ రెఱుంగ రిట్లు సంగరంబున మమ్ముద్ధరింపుమనియె నిట్లు గొనియాడిన నాతండు నాదెసం గనుంగొని
సంజయా మీవారల కెల్లఁ దెలియం జెప్పు మీశ్వరాది దేవతలు సమకట్టిన సవరణగల యగ్గుచుచేత నిర్జింపంబడిన
యుత్కృష్టజాతుల నేకులు గలుగుట యెఱుంగుదురు కాదె మర్త్యు లతని కెంత పెద్దయిట్టి జెట్టి వెన్నుదన్ని చూడఁ గలండు
గావున మమ్ముబోఁట్లెల్లఁ బోక పెనంగినఁ బోరు భరంబైనఁ బ్రాణంబులపై వచ్చుటకంటెఁ బరమదయాపరుండైన పాం
డవాగ్రజు మతులు సొచ్చి బ్రదుకుం డనుమంతలంతలు తప్పులు సేసితిమని తలంపక వలవ దెంతలు సేసిననుఁ గౌంతేయపూర్వ
జుండు శాంతిసుధానిధి యగుటం జేసి శరణుఁ జొచ్చినం గాచు ననిపలికె ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె *

*ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి చేయుమని చెప్పుట.*

క ॥ పరిజనులకు నీకును నిర్ధరలో సగబాలు చాలుఁ దక్కటి సగముం। గరము చితంబుగఁ బాండవ। వరుఁడగు ధర్మజున కిచ్చి బ్ర
దుకుము నెమ్మిన్ * చ ॥ పెనుకువ నాకయేల మన పెద్దల కెవ్వరికి య్యకోలు గా। దను చితవృత్తిగా నగురుఁ డాదిగ నాప్తులు
బంధుమిత్త్రులుం। గొనకొని సోరికిం జొరరకుంతిత తేజుఁడు ధర్మపుత్త్రుఁడా। తనిఁ దగఁ గూడి మనిక్క ప్రమదంబుగఁ గౌరవ
జాతి కెంత యున్ * వ ॥ అని వెండియు * క ॥ కర్ణుండు రేఁచి పెట్టఁగ। దుర్ణయపరులై నశకుని దుశ్శాసనులీ। నిర్ణయ మే మేలననీ।
కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్ * వ ॥ అనినఁ గటకటంబడి సుయోధనుం డిట్లనియె * క ॥ నీచెప్పెడి పెద్దలు ద్రోణా
చార్యులు మొదలుగాఁగ ననికొల్లనివా। రై చాలనివారిం గొని। యేచక్కం బెట్టువాఁడ నేఁ బాండవులన్ * శా ॥ రాధేయుం
డును దుస్స సేనుఁడును బోరఁ బ్రాపుగాఁ బాండవ। క్రోధజ్వాలల నార్తు నొండొకడు నాకుం దోడె నీవింకన। న్నాథం
బెట్టకు వాఁడిసూది మొన మోపం జాలునంతేని నే। నీ ధాత్రీతలమీను వారలకు నాకేలింత సేగింబడన్ * వ ॥ అనిన గాంధారీవ
ల్లభుం డతనకిట్లనిరె * గీ ॥ నీకు నంత వగవ నీ పోవు తెరువునఁ। బోవువారు గాఁగఁ బూనియున్న। వారికెల్ల నేను నగ చెదఁగ
య్యంబు। వలవదుడుగుమయ్య చలముఁ గొనక * చ ॥ ఉభయబలంబులుం బొగడను గ్రతభీముఁడు విస్ఫురద్గదన్। రభస
మెలర్పఁ గుంభములు వ్రయ్యఁగ వ్రేసిన నెత్తురొల్కఁగా। నిభములు పిండుకావి సెలయేఱులతోడి నగంబులట్లు సం। క్షుభి
తములై మహిం బడఁగఁ జూచి తలంచెదు సాదువాక్యముల్ * చ ॥ ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర
నే। ద్దెఱనులు మాడి నంబుడమిఁ ద్రెళ్ళిన నీదగు సైన్యమంతయు। న్నఱికినఁ బడ్డ ఘోరవిపినంబు విధంబున నున్నఁ జూచియు।
త్తఱి నయి నందలంపుము హితంబగు నావచనంబుఁ బుత్త్రకా * వ ॥ అనిపలికి యతని వలనం బిలువు గానక మనంబు మరలంబె
ట్టికొని కొడుకులు జయింప నోపుదురో కోయను నాసం జేసి సంజయు దిక్కు మొగంబై పాండవ కౌరవ పక్షంబులం గలవా
రల తారతమ్యంబు లడుగుచుం గొలంది మలుదలపోయుచు నాతని వచనంబులందున విచారంబునను బలాబలంబు నిశ్చ
యించి పాండవేయు లెక్కుడవుట యెఱుంగుచుఁ గ్రమ్మఱ నా సూతపుత్త్రుతో లెక్కలు వెట్టుచుం బోలించుచుఁ బెద్దయుం
బ్రొద్దు వితర్కించి కౌంతేయుల శక్తి దైవశక్తియు గాంధారేయుల శక్తి మానవశక్తియుం గాఁ దలంచినవాఁడై యంబికా
నందనుండు సజనందనుతో నిట్లనియె * క ॥ నరుఁ డగ్నిదేవుఁ దనకును। వరదునిఁ గాఁ గొలిచినాఁడు వానికిఁ గేతు। స్ఫురణంబా
దిగఁ గలసం। గరపరికర మెల్ల నతఁడు గావించెదయున్ * వ ॥ అదియునుం గాక ధర్మదేవతయును వాయుదేవుండును వాస
వుండును నశ్వినులును వారికిఁ బాండురాజుతోడివారు వారికొక్క కీడునుం బొరయకుండ రక్షింతురు గావున భీష్మద్రోణ
ప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి తెల్లంబు * క ॥ దేవత లేటికిఁ బార్థుఁడు। దేవసముఁడు గాఁడె వాఁడు దివిజుల చే
తం। బోవని దైత్యులఁ జంపఁడె। నీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా * వ ॥ కౌరవులకు వచ్చిన యిమ్మహాభయంబునకుఁ
బ్రతికారంబు శాంతి గడచిన దిలేదెన్ని భంగులం జూచినఁ గయ్యంబుడుగుట మనకుఁ గర్తవ్యంబై యున్న యది యుపశమిం
పనయ్యాదీక్షు వైరంబు వలవదనినఁ దండ్రికిఁ గొడుకిట్లనియె * క ॥ దేవతలగ్గునుదకుఁ దో। డై వత్తురనం గవలవదదియెట్ల

నిర్జరా । దేవత్వము రాగద్వే । షావేశము లేమిఁగాదె యైనది మొదలన్ ॥ వ ॥ కావున వారొక్కళ్లొక్కళ్ల వారు గారట్లుగా శపథపాతులై పూనిన త్తరయేని యది దేవత్వంబు గాదట్టి దేవత్వంబునన గ్గనుండును సురక్షితుండు గానేరఁడు నీకు నావనికిఁ జింత వలవదని పలికి వెండియు నిట్లనుఁ జెరిగివచ్చు కార్చిచ్చును డుపను పాషాణవర్షంబు వారింపను మహా వాయువు నిలువను నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడిపింపను నా సేనన డచునప్పుడు వలసిన చోట జలంబులుత్పాదింపను జాలుదు సింహ శరభ శార్దూల వ్యాళాది క్రూరసత్త్వ సంరంభ స్తంభన ప్రకారంబెఱుంగుదు మిత్రశత్రువిషయంబులైన శుభాశుభంబుల వలయు భంగి నావహింప నేర్తు మఱియు నానావిధసిద్ధిప్రదంబులగు మంత్ర ధ్యానానుష్ఠానంబులు నాకుఁ గలవు నీ చెప్పిన యగ్ని ప్రముఖ దేవతలం బ్రసన్నులగునట్లుగా నారాధించిన వాఁడ వారికి నాకుం బోలేను

## దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబులు చెప్పుట.

హానుభావంబు గలిగినఁ బదుమూఁడు వత్సరంబులబ్బంగి నడుమ లంబడుచు రేవి నుము చెప్పెద ॥ క ॥ పనలిగిన వారి నిసుకలై ననురక్షింపనో పరమరులలిగినం । బూని చెడకుండఁగా తును । మానవులొక్క సరకె నాకు మనుజాధీశా ॥ గీ ॥ గర్వమున నాడుమాటలు గాఁ దలంప । వలవ దిదియెల్ల నిక్కంబు వసుమతీశ । నన్ను నేఁ జెప్పికొందు నేయెన్నఁ డైన । నాత్మ సంస్తుతిపాతకమవు నె చెపుము ॥ వ ॥ ధర్మతనయాది పాండవేయులు ద్రుపదాది పాంచాలురు విరాటాది మాత్స్యులును వాసుదేవాదియాదవులును మఱియును గేకయ పాండ్యమాగధ చైద్య ప్రముఖ నిఖిల దండనాయకులును నా బారిం బడి మున్నీరు సొచ్చిన యేనుఁగుల చందంబున నడంగి పోవుట యవధరించెదు గాక వారెల్లఁ దేజోధైర్య పరాక్రమోపాయ విచారవివేకంబులు నా మెత్తువత్తురె పితామహ ద్రోణ కృప అశ్వత్థామలు శస్త్రాస్త్ర విషయంబుగా నేమేమి యెఱుంగుదురంతెంత నేర్తురదియెల్ల నెఱుంగుదు నంతయు నేర్తునని పలికి యందఱు వెఱఁగుపడియుండ దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగఁ బాండవుల వలని మాటలాడుచుండఁ గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె ॥ క ॥ గురునలుక నాకు నస్త్ర । స్ఫురణ వెడలెనం ద్రుజనులు బొంకెదిపూజా । పరత మెయిన మ్మునీశ్వరు । కరుణవడసి మగుడఁ బడయఁగాంచితిఁ బ్రీతిన్ ॥ ఉ ॥ కావున నస్త్రశస్త్రముల ఖండితసంపదనొందియుండదే । వావలికైన నన్నుఁ జెనయన్ భరమే గలుగంగ నర్జునుం । డేవిడిపించు మేదినిఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా । నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్ ॥ శా ॥ గాంగేయాదులు నీకడన్ని లిచి వేడ్కం జూడఁగా సర్వసే। నాంగాంగంబుల మీఁద గాలియనుజిట్టాడంగ నీకేనుఁ పీఁ । కంగొంతేయులఁ దాఁకి తత్తనువులుగ్ర స్ఫారబాణాలిఁ గూలం గోదండవిలాసము న్మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్ ॥ వ ॥ అనిన విని సూతనందనునకు మందాకినీనందనుఁ డిట్లనియె ॥ క ॥ కాలుఁడు ప్రేరేపఁగ నిటు । ప్రేలిన యంతట నెనెన్నఁ బెద్దగఁ దలఁపం । బోలు నె మాకును నుడుగుము । చాలుదువీ వెల్ల పనులు సాధింపంగన్ ॥ ఉ ॥ కూలెదు వారె పాండవులు ఘోరపుఁ బోర నొకండొకండయి । చాలెదు వారలెల్లను నజావఁ గ్రమంబున సేనలన్నియుం । గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదురీతియ గాక నోరిచే । టేల వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా ॥ గీ ॥ దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి । చేతఁ గవ్వడి వసునని చూతు వేని । వాసుదేవుని చే వది వ్యర్థ్యలయ్యెఁ । దునియలయ్యె నబ్బొడియయ్యెఁ దొరుగు భరణి ॥ క ॥ సర్పముఖశరము గలదని । దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు హరి పెం । పేర్పడఁ గనదియ కాదఁట । తీర్పవలయు వాని నెల్లఁ దీర్చునరుఁ డనకైన్ ॥ అనిపలికి ధృతరాష్ట్రుని తో నిట్లనియె ॥ క ॥ జ్ఞాతులు తమలోఁ బొందినఁ । జేతో మోదమునఁ జెలఁగి చెలు వొందు మఱి । న్నీతిం బాసిన విగతవి । భూతింగడుఁ గొఱవులట్లు పొగయుచు మరధిపా ॥ వ ॥ కావునఁ దమలో విరోధంబు వాసి దుసంభాషణ భోజనాది సత్కారంబులను సవినయ వర్తనంబులను బ్రీతులై నజ్ఞాతులిహ పరార్థ సాధకులగుదురని చెప్పి వెండియు ॥ క ॥ విను మేనొక శైలమునకు । మును భూసురవర్గసహితముగ నొకపనికిం । జనుఁ నెడఁ జనరాని తటం । బున నొక జున్నుం డెదానిఁ బొగడిరి తజ్జ్ఞుల్ ॥ గీ ॥ దీని తేనెయుఁ ద్రావిన మానవులకు । జరయు రుజయు నడప్పియుఁ జావుఁ గల్గ । దనఁ గఁగొందఱు బోయలు విసికడఁగి । యుఱికి మొఱకులై చఱిఁ బడను ఱెకిరవుడు ॥ వ ॥ ఇట్లు ఱెకిస్సృతిఁ బొందిరట్లు గాన వినీతులై నీకొడుకులు పుడమి యెల్లను దారయేలు మనుగి చూచెదరు గాని తమపాలిసిపోవుటం గానరు వీరర్జునుతోఁ జెనంగి మాన ప్రాణంబులు దక్కఁ జుకొను వారే యట్లుంగా

కసమునఁబలుసై నను గయ్యంబున వీరాముడు వారాముడు తలపోఁతలవిరోలనీ లోనికి ధర్మనందనుం డెబ్బకొనుటయ నీకుం గర్తవ్యంబని వ బాహ్లికుండు ధృతరాష్ట్రునకిట్లనియె * క ॥ కనుబ్రమసిన తెరువరితన । కనపాయంబై సమార్గచరసితగనెఱిఁగినవారు సెప్పఁగాఁ గై । కొననికరణిఁడగిన వెంటఁ జొరవకటా * వ ॥ అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనునకిట్లనియె * మ ॥ కొడుకాయే నెటులట్ల బాహ్లికుఁడు నీకుం గూర్పు భీష్ముండునీ । యెడప స్నేహముఁడు వీరిమాట వినుమేమీము వ్వురున్నన్నాల్ । పడయంగాఁ దగునట్టి వారము వినుం బ్రాగ్గించెదకా ధర్మజు । న్విఘువఁ గాఁ దగదిమ్ము వారలకు నుర్వింబాలు నెమ్మిండగఁ * క॥ అని వెండియుఁ దగవొడఁబాటు నఁ జొరమినపుడు దాఁ గొడుకు తోడఁ గడుం గినిసి ధరణీశ్వరుండిట్లను గొలువున నున్న వారలందఱు వినఁగ * గీ॥ బవరను లుగా వెవిటిగిన బారసాపవచ్చు నే యొక్కరుండు విశ్వచ్ఛందతి పసులఁ బెట్టించునపుడు నీబలము విఱుగ దుర్యోనే నీవు గ్గుంపు నచటలేరె * ఉ॥ అని రాధేయు నొక్కమొగంబై పలికియును * గీ॥ వాటికోలఁది గాదు నారాయణుఁడు నొగ । లెక్కఁ గెలన భీముఁ డేది నడవ । ననుజతనుజ సహితుఁడై వచ్చు విష్వచ్చు పార్థుఁ నంగవశమె మనకు గర్ల * చ॥ బలమును దర్పమున్ మెఱయ బంటుతనంబున నీవు పాండవేయులననివార్యనంగడఁగ టొప్పెదు తెంపఱ జచ్చిశు స్థుఁడై । పలుకులు మాన్పు భృత్యుఁడసు పాడికలం చెదవిట్లు మేలెయు । చ్చలమునఁ నీ

*కర్ణుఁడు భీష్ముని పైరోషముచేత నస్త్రసన్యాసంబు చేయుట.*

సుయోధనుని చావు నీకోర్చుటగా దెయింతయుఁ * వ ॥ అనినవిని కానీనుండు సంక్షుభితమానసుండై యిట్లనునిదియెల్లనిట్లయ్యెనట్లుగాక తక్కినయది యట్లుండె నదీసూనుండు నన్ను నిరాకరించి పలికిన పలుకుల ఫలంబనుభవించెడుఁ గాక యని యతని నుద్దేశించి యిట్లనియె * గీ ॥ నీవు నాలావు కోడ్పాటు లేక యుండ వలయునీ తెరు నంతకుఁ గలననిలువ నాయుధంబులు విడిచితినంత మీఁద । మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ * వ ॥ అని శస్త్రసన్యాసంబు సేసి కొలువున నిలువనొల్లక విగ్గనలేచి పోయెనట్టి యెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె * క॥ అంతకుఁ జాలఁడె కర్ణుం డింతకు మును బాసయిచ్చియున్నఁడు బొంకం డింతటి మానిసి యలిగినఁ । గౌంతేయుల కెట్లు బ్రదుకఁ గా వచ్చు ననిశ * క ॥ అని వెండియునిట్లను నాతని మాటల కెట్లుగడఁగి ధర్మతనయుతో । నని సేయక తక్కవునీ । వనుమాన ము వాయఁ జూడు మతని నిన్నుఁ గ * వ॥ ఏను బాహ్లిక ద్రోణప్రముఖులు గనుంగొనుచుండ బ్రతివీరుల నేక సహస్రంబుల సమయించెద బవప రాధేయురణంబును జూచెదవుగాక యనినవిని దుర్యోధనుండు కర్ణపక్షపాతి యునవి నీతుండునునగుటం జేసి సహింపక పితామహుతో నిట్లనియె * చ॥ ఎఱిఁగి యెఱింగి యొండెమది నేదియొ యుంగక యొండెనెపునం । దఱు వినఁ బాండునందనులు దర్పితులై యని గెల్తురం ప్రముం । దఱ నిను బాహ్లికున్ గురుని దక్కిన వారి నినమ్మి నేను నే । డైఱనని సేయఁ బూని తెగడింది మగంటిని తోడఁ జాలదే * ఉ॥ కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరులేల సద్భటా । కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము మాకు సీ । యర్ణవవేష్టిత క్షితి యనర్గళ విక్రమ మొప్పఁ దక్కు చూ । నిగ్గయ మెల్ల నిట్టిద వినీతి యొనీతి యొ చూచు మీతు దిర్ * క॥ అను పలుకుల కు విషాదము । దనుకఁగ ధృతరాష్ట్ర విభుఁడు దననందను నే । మనియుం బలుకఁ జాలక । వెను బాటునని ట్టులని యొపి చురుని తోడఁ * గీ॥ మృత్యుపాశోపహతుఁ డయ్యె మీఁదెఱుఁగక । సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ డకట నాశముఁ బొందు వాఁడయ్యె మనకు । నింకఁ జేయంగఁ గల పని యేది చెప్పుము * వ॥ అనిన విదురుండ తనికిట్లను మన వారలు మున్న దుర్బలులు తమలోనం బెనంకువలయు విరసవచనంబులాడుచు నింతలు పుట్టించికొనుట యర్జునునకుఁ గార్య సాధనం బింతియు కాక యేమనువారము వారలు బంధు మిత్ర సహోదరులుం దారును నొక్కతలంపు వారలై యున్న వారు వలవని యీ వెంగలి మాటలు విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడుపుట దక్క మనకుఁ జేయం దగు పని వే ఱొండు గలదే యని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయు చెప్పిన కార్య వచనంబులకొఱఁత వినంగలవాఁడై యతని దిక్కు మొగంబై * క॥ మును నవరుసతోడఁ దనతలఁ । చినయున్నియు నీవు వినఁగఁ జెప్పితగవుమై । నినువీడుకొల్పు నెడన । ర్జును డే సునిశ్చయంబుఁ జెప్పె జూతము చెప్పుమా * క॥ అనియడిగిన సంజయుఁ డిట్లనుఁ ముదిఁ బార్థుఁడు నిశ్చయము చేసియు యోధనుతో నిందలి పెద్దలు వినఁగా ననుమన్న పలుకు వినుము నరేంద్రా * మ ॥ కురువంశోత్తముఁడైన ధర్మజుఁడు నాకుం దండ్రి పాలించుగాక । ధరలో సామ విధానపల్కవిని యుక్కాదర్పంబు మైనీకత నిక్కరయెనింజటులాస్త్ర దీయపశిఖాగ్ని జ్వాలలం దాహంతు । ల్వరసంబెత్తు మహార్తరా

ప్రతతి నైశ్వర్యంబుతోఁగూడఁగన్ * వ॥ అనిపలికి కౌఁగిలించికొని భూషణాంబరాదికమనీయవస్తువులొసంగిన నేనును బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులం బెట్టె ధృతరాష్ట్రుండును జెప్పవడి యూరకుండె నప్పుడయ్యిరువురుపాలనసంజయుండొక్కరుండు దక్కనయ్యాస్థానంబుననున్న సమస్తజనంబులు నుద్విగ్నలై తమతమనివాసంబులకుం జనిరి తదనంతరంబ * క॥ తనుజవశవర్తియగు నమ్మనుజేంద్రుఁడు తనసుతుండు మూర్ఖింపఁగనో। పునొయ్యని పాండుతనూజుల । యనుమతిసంజయునకిట్టులనియెమఱియున్ * సీ॥ ఈ రెండు వీళ్లందుఁ దారతమ్యంబుల నెఱుఁగుదు పోరైన నెవ్వరోర్తురిది నిశ్చయింతమేయెందు నుపాయంబు పౌరుషంబును గలవారు గలరు । చూతము చెప్పుచున్న సూతనందనుఁడు నన్నడిగెదవే నొండున కుగ్గవలదు। నీయయ్యసాత్యవతేయుఁడీ మొదకు వేంచేయునట్లుగ భక్తిచేసి తలఁపు । పిలువఁ బంపు గాంధారి వారలు సునీతిరతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞహృదయుల । బుల్లమున నీక సూయాదులొాదవె నేని । వానిమాన్పంగ నేర్తురు మానవేంద్ర

### కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట.

* వ॥ అనిన విని యంబికానందనుం డట్లు కాక యని యొకకంచుకిం బిలిచి గాంధారి రావించి సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమునిం దలంచిన దివ్యబోధమహనీయుండైన యమ్మహాత్ముండు విజయం చేయుటయు నందఱుఁ దండప్రణామంబులు చేసి సముచితాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించియున్న సమయంబున ధృతరాష్ట్రుండు విన్నవంబు సేయక మున్నె యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయులచిత్తవృత్తులు తానయెఱింగిన వాఁడగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతనికిట్లనియె * క॥ నీవు సమస్తము నెఱుఁగుదు। గావున నీకూరకుండఁ గాఁడగదు ధరి। శ్రీవల్లభుఁడడిగినపని। యీవిధమని తెలియఁబలుకు మేను వినంగన్ * వ॥ అనినఁ బ్రసాదంబని సంజయుండు ధృతరాష్ట్రునకిట్లనియె * క॥ ఆసేనకు నీసేనకు। వాసియడిగెదవు నన్ను వసుదేవసుతుం। డాసేనఁగలఁడు తత్సము। నీసేనం జూపుమాన వేశ్వరనాకున్ * వ॥ వాసుదేవుండెట్టి వాఁడని యడిగెద వేనిం జెప్పెద * చ॥ జగములనన్నిటిం దనవశంబుగఁ జేసిన వీరుభంగముగ। బగయులలాటలోచనుఁడు పావకఁ జేర్చినయట్టి బాణునో । క్కగడియలోన గర్వమడఁగం బరిమార్చె సురేంద్రకల్పకం। బుగ రమలీలఁ దెచ్చె హరి భూరిపరాక్రమ సుప్రసిద్ధమే * గీ॥ అధిక దుష్కరంబులైన కార్యంబులు। క్రీడవోలెఁ జేయఁగేశవుండు। విను మతండు పార్థు నెనసియేకాత్ముఁడై। యుండుఁ బూర్వభవసఖుండుగాన * వ॥ అట్టి వాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వసమరసాధనంబులయందును సూక్ష్మరూపవ్యాపియై నిలిచి వారికి విజయంబొసంగుచుండునని మఱియు నిట్లనియె * క॥ వలువు బు పాండుతనూజుల। కొలఁదివితర్కించెదీవు గాథంబది యు। దెలియంబలికెద వారికి। బలమును సత్వంబు హరియ పార్థివముఖ్యా * వ॥ హరిమహత్త్వంబు విన్నవించెద నవధరింపుము * క॥ ఒకతలసమస్తజగములు । నొకటజనార్దనుఁడు నిలిచియొకతలయయినన్ । సకలమ్మునపారమతిం। డొకరుఁడ సారంబు చాలనుత్కృష్టుఁడగున్ * క॥ తలఁపునన వాసుదేవుఁడు । గలిగింపను నిలుపనడఁపఁగా మోపు జగం। బుల మఱియును గ్రీడార్థము। పలువోకలఁ బోవుచుండుఁ బౌరవనాథా * క॥ ఎక్కడ నడచును సత్యం । బెక్కడ ధర్మంబు పరఁగు నెక్కడఁ గలుగుం। జక్కటి నిలుచుం గృష్ణుం। డక్కడ నతఁడున్న కతన నగు జయమధిపా * సీ॥ పురుషోత్తముండెల్లభువనంబులును సదానయఖిలభూతాత్మకుఁడై విహార। లీలవిచేష్టించు నీలోకములమాయఁ బెట్టి యొక్కొక్కమఱి పుట్టి పెరిగి। కర్మాచరణములు గైకొని వర్తించు శిష్టరక్షణమును దుష్టనిగ్ర। హంబును దనపనులుగ నట బాండవుల నెపంబిడుకొని ధర్మబాహ్యులైన। నీతనూజులనిక్క మనిగ్రహింపఁ। దలఁచి నాఁడమ్మహాత్ముండు తథ్యమతిని । నిట్టిచందంబు వాఁడని యెఱిఁగి యెవ్వ। రాశ్రయింతురు బ్రదుకుదురట్టివారు * క॥ అనవుడు ధృతరాష్ట్రుఁడు వి। ష్ణుని నెఱిఁగెడి విధము నాకును దెలియఁగనీ। కనియున్నతెఱఁగుఁ జెపుమా। యనుటయు సూతసుతుఁ డిట్టులనునాతనితోన్ * వ॥ విద్యయు నవిద్యయు ననఁగా రెండుగల వవిద్యామూషితుండై తమోగ్రస్తుండైన వాఁడు విష్ణు నెఱుంగ నేరఁడు విద్యాసంపన్నుండెఱుంగు ననిన విద్యయన నెట్టిదవిద్యయనెట్టిదెద్దానివలన నీవాసరేశ్వరు నెఱింగితివవి యిట్టివని చెప్పుమనిన నాంబికేయునకు సంజయుం డిట్లనియె సాత్వికరాజసతామసవికారంబుల త్రిప్పులం బడక ధర్మంబాచరించుచు భావశుద్ధిగలిగి యుండుదు వీనవచ్యుతు

నెఱుంగుమువిద్యయిట్టిదినీకుమంద కెవ్వరికైననునతనినెఱుంగుటకు నిదియతెరువిట్టిది గావివిధంబవిద్యయనిచెప్పినన తండునిజజనంపమునితోనిట్లనియె * క ॥ వనకాపుత్రుఁడుసంజయుఁడీ।తనియుపదేశంబువట్టిధర్మమునమముకుం।దునినాత్రయుం పవయ్యాయ। తనిఁబొందినబ్రదుకుదీపుఁదమ్ములునతుల్యా * వ ॥ అనినసుయోధనుండుడమఱుదయ్యెకునిట్లనునిజగంబు ల। న్నినొకటన్రింగెనేనియును సెట్టనసర్వముగాచెవేనియుఁ । న్నిసుముమునుపందుఁడర్జునునినెచ్చెలినాఁజెవులారవించు నింకనతనినొక్కభామునకుఁగాధృతిపెంపవఆనాత్రయింతునే * గీ ॥ అనినగాంధారికిట్లనుజనవిభుండు।నీతనూజుండుధ ర్మవినీతిబాహ్యుఁ।దుద్ధతుండీసుమూనినాబుద్ధివినఁడు। వీఁడుచెడుఁగానిబ్రదుకంగ లేఁడుసుమ్ము * ఉ॥ నావుఁడుఁదల్లియిట్టు లనుకలదనుతోఁపదియేలయయాయయవ్వు । శ్రీవిభవంబులన్నమున శేవసుహృజ్జనులందొఱంగఁగా । సీవుగడంగెవిట్టియవినీ తులుదుంగలదేవ్వరోదరుం। డైవిభిఁతంపఁగామెరులకాఁగఁగవచ్చునెయింక।బుత్రకా * వ ॥ అనియెనట్టియెడంగృష్ణ ద్వైపాయనుండుధృతరాష్ట్రునికిట్లనుం గృష్ణుండు నీకుంగూర్చునీపుఁజరమాప్తుండైన సంజయునతనిపాలికింబుచ్చితి దిలెస్సకార్యంబయ్యెవీఁడును నన్మహాత్మమహనీయప్రభావంబున్నరూ నెఱుంగువీనిబుద్ధిపినియదేవునాత్రయింవుము తండేకాగ్రచిత్తులైయారాధించువారికిఁ జేరువయగుంగామక్రోధోపహతులై తమతమధనంబులం దృప్తులుగాక యన్యాయంబునవర్తించువారలకుదూరంబైయుండు నెల్లభంగులనాతనిఁజొచ్చిబ్రదుకుమనినం।బ్రసాదంబట్లచేయుదున నవిదిత్రవీర్యనందనుంతు సూతనందనునింగని వాసుదేవనామనిర్వచనంబునాకుఁ దేటపడంజెప్పియతనింబొందునుపా యంబుపదేశింపవేయనియడిగిన * గీ ॥ ఎల్లయందునుదావసియించునెల్ల। యదియుఁదనయందువసియించుటంబ్రవా సు।దేవుఁడనుపేరికర్థంబుతెల్లమింత। యెఱుఁగుజనులందుఁదగవసియించుశుభము * గీ ॥ అతనిఁబొందుసుపాయంబునం తరంగ।నిగ్రహముగాఁగవార్యులనుగ్రహింతు। రోపెచిత్తవికారంబులుడిపియేక।బుద్ధిగొలువఁబ్రసన్నతఁబొందునతఁ డు * వ।నీవునుబలుబుద్ధులుడిగిగోవిందునాత్రయింపుమనినఁబ్రజ్ఞాచక్షుండిట్లనియె * క॥ నాకునయనేంద్రియముగతి। లేకుండుటకంతవగపులేదఖిలమనో।జ్ఞాకారుఁడైనహరినా। లోకింపంగానమికిఁగలుగువగపెపుడుఁకా * ఉ ॥ ఆతనిఁగ న్నులారఁగనహర్నిశముంగనుఁగొంచునుండువా । రేతపమాచరించిరొయుపేంద్రునినాశ్రితవత్సలున్విని। ధ్యాతకలం కుధర్మనిరతుంగరుణాకరుసర్వలోకవి । ఖ్యాతుఁబవిత్రమూర్తిశరణాగతరక్షకునాత్రయించెదకా * వ ॥ అనివలికిపవర మశాంతుండై పారాశర్యునుద్దేశించి దేవాయేనువాసుదేవునిశరణంబుసొచ్చిబ్రదుకువాఁడననుచుఁ గృతాంజలియగు టయువ్యాసమహామునియునాశీర్వాదంబుచేసియంతర్హితుండయ్యెధృతరాష్ట్రుండును దుర్యోధనసంజయులనిజనివా సంబులకుంబోవంబనిచితానునుగాంధారియునభ్యంతరమందిరంబునకుంజనియుచితవ్యాపారంబులఁబ్రవర్తిల్లుచునుండె ననిచెప్పినవీనిపదంపడిపుట్టినవిశేషంబులెట్టివియెఱింగింపుమనుటయుఁ * శా॥ నిత్యానిత్యవివేకవైభవసమున్మిద్రాంతరంగ స్ఫుట। ప్రత్యక్పూర్వరమేశవిశ్వజగదారాధ్యామహానంతది । వ్యత్యానందవిభుస్వభావమహితాసంపత్సమాధానదో॥గ్ర త్యవ్యాహృతిసంప్రవర్తనవిద్ధశ్రీపదాంభోరుహా * క॥ వ్యాసాదిమునిప్రోక్తమహాసందర్భప్రమేయతారాధకనిర్మ। ల్లాసానైర్గుణ్యసము।ద్భాసిరహస్యానుభావభక్తాధీనా * మాలిని॥ సమవనిమితచూడానవ్యరత్నప్రభాసం।గమరుచిర పదాబ్జాగర్వదుర్వారదైత్యో।ద్యమబహులతమోమార్తాండబోన్నక్రీడనప్ర।క్రమలలితవిలాసాగాధభక్తిప్రకాశా॥*

గద్య॥ ఇది శ్రీమదుభయకవిమిత్రకొమ్మనామాత్యపుత్త్రబుధారాధనవిరాజితిక్కన

సోమయాజిప్రణీతంబైనయుద్యోగపర్వంబునందుద్వితీయాశ్వాసము.

శ్రీహయగ్రీవాయనమః.

శ్రీమహాభారతము - ఉద్యోగపర్వము - తృతీయాశ్వాసము.

శ్రీవాగ్విభవారోగ్య।ప్రావీణ్యప్రాభవానుభావమహితసా। ఖ్యావహపదస్మరణకరు।ణావేశకటాక్షకిరణ హరిహరనాథా * వ ॥ దేవావైశంపాయనుండుజనమేజయునకిట్లనియె * గీ॥ సంజయుఁడుదన్నువీడ్కొనివనినధృష్ట

సుతుఁడు మఱి నాఁడు తమ్ములను తులనిష్ట । భృత్యవరులను దొరలను బిలువఁబనిచి । యెల్లవారలు వినుచుండ నిట్టులనియె ॥

## ॥ శ్రీకృష్ణుని రాయభారము. ॥

క॥ మనమును జనార్దనుఁ బాలికిఁ । జని కౌరవసభకు నతని జనుమని ప్రార్థిం । చి మేలు బంధుహితగుణ । జనముల తోరణము గాక సంప్రీతియగున్ ॥ వ ॥ అని పలికి వారలందఱు బలసి చను దేరమాధవు మందిరంబునకరిగి యతని చెంతను సత్కృతుండై సమస్త పరిజనంబులుం బరివేష్టింప నెక్క పార్శ్వంబునం బాంచాలియును మునిత పరిచారి కాపరివృతయై యుండ నతండు మందానను సుఖాసీనుండై యుండి యతని తోనిట్లనియె ॥ క॥ ఆపదగడవం బెట్టఁగ । నోపి శుభంబైన దాని నొడఁగూర్పను మా । కీవు పుట్టువునకుఁ బాండు । ఁడొమ్మో పాలుఁడవు నిన్ను జూపి చని యెను హాత్మా ॥ గీ॥ సమయమిది మిత్రకార్యంబు చక్కఁ జేయ । నీకతంబున మేము వినీతుఁడైన । యాను యోధనుతోడి పోరాటదక్క । యనుభవింతుము మామాయంశ మగు ధరిత్రి ॥ వ॥ నీకు మేము వృష్ణ్యంధకాది కుమారులతోడి వారము మమ్ము దురితంబులు వొరయకుండ సంరక్షింపు మనవుడు వాసుదేవుండు నీ వంచిన యట్ల చేయఁగలవాఁడ నెయ్యది తలఁపు చెప్పుమనిన నజాతశత్రుండు నీవు కరినగరంబునకరిగి కౌరవులతోఁ దగిన మాటలాడి తెలుంగు సేయవలయునని ప్రార్థించి యతని నియ్యకొలిపి యిట్లనియె ॥ సీ॥ మాండ్రె తలఁపును మానిని నందనుచందంబున నిన్న నాసంజయుండు । పలికిన పలుకులఁ దెలిసెఁ గదా నీకు వారి చిత్తము భంగివాఁడెలుంగుఁ । బాలుపంపని యీక యేలి మాటలన మమ్ములు కదీర్చెదరు తారధిక దుష్క । రంబైన యా సమయంబేము పదుమూఁడు వత్సరంబులు సల్పి వచ్చియుండఁ । గులము పాడి నడుపదలఁ పడవతిచెడఁ । దలఁచె నేనికొడుకు వలన నట్టి వాఁడు గాక యతని వక్రతమాన్పలేఁడంతకంటెఁ గలదె యెడరు మాకు ॥ క॥ జననియును సమస్త బాంధవజనులును ప్రియము నుండ వారి శాంతులఁ గాఁ జే । యను నెమ్మి గ నెక్కటి యై । మానను మందేఱఁ గేదియును నికిమా పౌరుషమే ॥ క॥ ఇచ్చు జబంధులు నీవును । నెచ్చెరుపడి వినుచునుండ నయిదూళ్లను మా । కిచ్చిన నజాలునంటిని । బొచ్చెముగా దింత పట్టు పృగ్గము సుమ్మా ॥ శా॥ ఆ దుర్యోధనుఁడంతమాత్రయును జేయంజాలఁడో కావివెం । పేసం గ్రూరత కోర్వరాదు సరి నా కేలం మనేగ్రాసవా । సో దైన్యంబులు వచ్చునా యరయునీ చుట్టాలకుం గావున క । మోదంబందుటగల్గు గౌరవులు నేముం గూడి శ్రీ నొందినక ॥ ఉ॥ అక్కటలాఁతులైనఁ బగ తైన నుజంపఁగ గౌరనేలయొం । డొక్కఁ తెలుంగు లేదె యరి యొప్ప దెబంధు సుహృజ్జనంబులా । దిక్కున నన్న వారు గణుతింపఁగ సంపదకై వధించిదా । తెక్కటదోషమందుటను నీదురవస్థల కోర్వ వచ్చునే ॥ వ॥ అని పలికి పాండవాగ్రజుండు వెండియు ॥ గీ॥ క్షత్రధర్మమితక కష్టము సుమ్మె వెఱ । ధర్మమాచరింపఁ దగదటంచు । గానశస్త్ర జీవికయతగియున్నది । యెనవంశనాశమనభిమతము ॥ వ॥ అదియునుంగాక ॥ గీ॥ కలహమగుడు లక్ష్మి గావించు బ్రాహ్మణము । నియును జేయుదింత నిక్కవంబు । వలువు రొకనికొడి పాటుటఁ లిష్టు । లనద చేతఁ జెడుటయు ఘటించు ॥ క ॥ జయమగునో దుమునుని । శ్చయమొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా । జయము మరణంబుకం టెపు । దయపుట భేదనము సేయుఁ దత్యాలబనఘా ॥ క ॥ కానవశ్యము పెను వగానియుపాయమునఁ బఱంగడ తేర్చి ధృతిం । బూనిన దుచు నెవ్వం డెడ । దానం జెయి పెట్టికొనియతిడుని ద్రించున్ ॥ గీ॥ పగయ కలిగె నేని పాము న్నయింటిలో । నున్న యట్లకాక యుఁఁబడిక్ల్లి । యుండు నెట్లు చిత్తమొకమాటు గావున । వలవదిక దీర్ఘ వైరవృత్తి ॥ చ ॥ పగయడఁగించుటెంతయు శుభంబది లెస్స యడంగు నే పగం । బగవగ గొన్న మార్కొనక పల్కకయుండఁగ వచ్చునే కడుం । జెగ మొదలె త్రిస్తోవఁబగ తీవ్రకయుండిన గౌర్యమొందునే । మిగతిఁ దలంచి నంబగకు మేలిని లేదు ధ్రువంబు కేశవా ॥ ఉ ॥ కావున శాంతిఁ బొందుటయ కర్జము దానదియట్టులుండ శ్రీ । గావ లెనంచుఁ బోరితము గామిలుంగో లేదె మెల్లసొమ్ములుం । బోపుటయుం గులక్షయము పుట్టుటయు న్వెలిగాఁగ నొందు మై । నే విధినైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా ॥ చ ॥ మనము నఁబత్తు పాంత గతి మా దెస మాను ముధర్మనీతి వ । ర్తనములు రెండు చక్కఁ లహితంబును బెంపును గల్గునట్టిచో । ప్పునపిదురాదిసజ్జనుల బుద్ధికి రాను చితంబుతోడి మె । ల్పునఁ బరుసందనంబునను భూపతు ల్లెల్ల వినంగ నాడుమీ ॥ చ ॥ తగవులఁ బోక రాజు చెడిదంబులు పల్కినయేని సైఁచు మొ । ప్పుగ నిలుమీ గురుత్వముఁ బ్రభుత్వము నుంగల పెద్దవారి మా । టగొనని యాను యోధనుక డన్నిలువన్న మెల్లగారవం । బుగఁ గురువృద్ధు వల్కుదలఁపుం జననిచ్చిన మెచ్చ రేజనుల్ ॥ మ॥ సుతు వాఁడై వినయంబు చేకొనక యేచో వ్యందగంబల్కెగా । ధృతరాష్ట్రుండవి విసిరిఁ జేసినను సం

ధిఁ బంగరాదంచు వే । గతెగం బాఱకు తెంపు సేయ నెడ లోకం బెల్ల మెచ్చం బ్రకా । శితధర్మస్థితి నొంది మా మనము దిక్చిం
తంబుగాఁ జేయు మీ ॥ గీ ॥ ఇన్ని సంకటములఁ బ్భంగి నెంతయు । నొగులు వృత్తి నెప్పు డీర్పు । వెజ్జు వీవ కావె వేయేల యే
విధి । నడుపఁ దలఁచితదియ నాకుఁ బ్రియము ॥ వ ॥ అని చెప్పి తలంచికొని వెండియు నిట్లనియె ॥ క ॥ నీవు సుయోధను పాలికిఁ బో
వఁగవలదని యనొక్క బుద్ధి పొడమెడుఁ గాఁ । గోవిందయతఁడు మంత్రులు । గావలమునఁ జక్క వినరు కార్యవచనముల్ ॥ గీ ॥
కుటిలమతు లవినీతులు క్రూరకర్ము । లట్టి నీచులకడకు నిన్ను నుపఁ జాల । నీవు సంకటపడియెడు దేవపదవి । యైన నే నెల్ల నొంటి
యందరుం గుటుడుదు ॥ చ ॥ అనవుఁడు గృష్ణుఁ డిట్లనియె నా ధృతరాష్ట్రుఁ డు నట్టివాఁడ తత్తనయుఁ డయేల నీ పలుకు తథ్యము నీ
తలఁపే నెఱింగితిన్ నమున శంక దక్క మువినన్ పలు తేవిను మేను నిక్కము । ల్లిన సచటంగలం డెరణ కేళికి మార్గా నొక్క
డేనియుఁ ॥ క ॥ పనుపుము కౌరవసభకేఁ । జను టెట్లును మేలయర్థసంసిద్ధియగుఁ । ఘనకొకట బావము తా । కునికిఁ గత
మైన పలుకు లొండెను గలుగుఁ ॥ వ ॥ అని పలికిన యుధిష్ఠిరుం డిట్లనియె ॥ గీ ॥ మేలు గాక నీకుఁ బోలిన ట్లైనను । దరిగి యేము వా
రున ర్థిఁ బొంది । యుండు నట్లుగాఁగ నొకఁ బాటు గావింపు । మెల్లభంగి మాకుఁ దియ లెస్స ॥ క ॥ నమ్మెలుఁ గుదెవరి నెఱుఁగు
దు । నెమ్మి యెఱుఁగు ధర్మసిద్ధి నెఱి యెఱుఁగుదువా । క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు । పొమ్మెవ్వఁడ నీకు నేను బుద్ధులు చెప్పన్ ॥ సీ ॥

* కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు చెప్పుట. *

అనిన ముకుందుఁ డిట్లనియె సంజయుని మాటలును నీ వన్న పలుకులును వింటి । నీ మది ధర్మైకనిష్ఠమై యున్నది వైరంబు విడువ
రు వారు ద్రోణ । భీష్ములు గలరని బిరుదులై యున్నవారు నెగ్గాజన్యులకడ గికుడువ । నక్లేశవృత్తి రాజ్యము చవిగన్న వా
రేల యిత్తురు నీకుఁ బాలు చెపుము । ధార్తరాష్ట్రులు సడికిఁ ధర్మమునకు । నళుకరెన్నఁడు విడువు దైన్యంబు పాడువు । క
య్యమరి వర్జయమునఁ నలుగు నిహపరములుఁ జిరకీర్తియును బాండురాజతనయ ॥ మ ॥ గురుభీష్మాదులు చూచుచుండ
సభ మీకుం గీడు నాఁ డట్లుము । వక్రులై చేసిరి యంత చేసియును బశ్చాత్తాపముం బొందరో । వరు నారెన్నఁడు నట్టిచోటఁ గృ
పయుఁ బంధుత్వముం దక్క మో । వ్వరు గోపింప రేయా దురాత్మకుల గర్వక్రౌర్యముల్ సూచినన్ ॥ వ ॥ కపటపు నెత్తంబు నె
పంబుగా మిమ్ము జెడ లనడుచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పుయిలోటదక్కి కలకల నవ్వుచుం బలికి
న పలుకులు గ్గడిఁ బవచ్చు నే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతులరయి యుండియు సత్యంబు
పాటించి యూరకపోక సూచి యచ్చెరుపాటుతో నుమ్మలింపుచుండి రిట్టిపాట్లం బోయెడు వారు దైవోపహతులై మున్న
చెడియుండుదురు గావున వారలం జెఱుపమఁ జులుకన క్రూరాత్ములగు కౌరవు లెల్లవారికి వధ్యులు గాఁదగుదురు నీకేల
య వధ్యులైరి పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు ॥ క ॥ మీ తండ్రికి భీ
ష్మనకును । జేతోముద మొదవ భక్తి సేయనతగు నీ । తాతలకడ కేఁ జనివి । ఖ్యాతంబుగ నీదు వినయ మభివర్ణింతుఁ ॥ క ॥ చె
లుబుం జుట్టలు దేశం । బుల రాజులు వినఁగ నిదు పుణ్యచరిత్రంబులు నీవు ధర్మమార్గము । దలఁచుటయుం దెలియఁ బలికెదం
గురుసభలోఁ ॥ వ ॥ దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలిన మాటలాడుటయుఁ దండ్రి యతని వారింప నేరమికిఁ
దోడు పేకుకుండ యుటయుఁ జూచి మీ తొల్లింటి పాట్లును దలంచి యెల్లవారును వారి నిగర్హింతు రింతియ కాక మనకు నెండేని
వలయు నా యోపినంతయుఁ బెక్కు భంగుల సంధియ కావింపం జూచెద నవ్విధంబు సిద్ధించిన మేలు కాదె యట్లు కాక తక్కినన
చ్చోటి యుత్సాహంబు చందంబు మనంబునం జేయంగలవారి వర్తనంబులు కొలంచులు నెఱింగి నీకు విజయంబగు విధంబున మం
జను దెంచెద ॥ గీ ॥ ఆ సుయోధను ముక్కన నావిగలుగఁ । బుడమి నీకీడు గావునఁ బోరకలుగు । నేను గయ్యాపు శకునం
బు లెన్ని యేనిఁ । గంటి నీవను త్సాహివి గాఁ గదగము ॥ వ ॥ చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొ
ల్పికొనుచు నానల్పంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయు ననిపలికిన విని వృకోదరుండు దామోదరు
నకిట్లనియె ॥ క ॥ సమరంబు గలుగునను చును । మము వెఱపింపంగవలదు మాధవ నీవా । కుమతియగు ధార్తరాష్ట్రుఁ డుశ
మించు కార్యంబునకుఁ బు సౌజన్యనిధీ ॥ వ ॥ అని వెండియు ॥ శా ॥ పాపాత్ముం డుమదాంధుఁ డాతులువ నీపం పెట్లును జేయఁ
గా । నోపం డడ్డము చెప్ప రెవ్వరును మానోద్రేకముఁ గర్వముం । గోపంబు దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటం బో
మున । కై ప్లైపోనిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుఁ జూడుమీ ॥ ఉ ॥ చొచ్చినచోటఁ జొచ్చి తెగఁ జూచెదనంచుఁ గడంగు

నాకు నెల్లను బలుకంగ నోటలాడు। గలవె యైనను జెప్పెదఁ గన్నయంత ॥ మ ॥ ధృతరాష్ట్రుండశీలోభదూషితుండు
భాత్రీభాగమీ నేర్పునే । సుతుఁడుం గష్టుఁడు సంధియేలయగునంచున్మన్నకై పెక్కునా ట్టితలంప చ్యుతనీకుఁ దెల్లినదిగాఁడీ
వంబుది వ్యాప్రసం। తతియుం బెట్టినయట్లయుండఁజుమాఁ జింతంబావగాదొకడే ॥ ఉ ॥ నీవ్రైసరింపఁ బూనినపనింగ సులో
దరకీడువుట్టునే। కావనినల్లయుండియవుఁ గార్యములట్లనుటంబ్రయత్నసం। భావన సేఁత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధిపొం
దుచో। దైవము దోడ్పడన్వలయుఁ దథ్యము రెండును నీవినోదమా ॥ ఉ ॥ నేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు పథ్యుల
న్ననే। వ్వారికిఁ బోల జేసు జనవత్సల నీవిటులంట వారుసు। మ్మీరసమె కీడ్పతిచియిలతలు సేసినదానినీశుదిం। గూరిమినె
వ్వసొంపునను గోపము పెంపునఁ గాదె యారయన్ ॥ ఉ ॥ వినుము జిత్తగింపు ద్రుపదాత్మజ నా సభ నట్లు చేసినన్। దాంక సైఁ
ప లెన్సయని దైన్యముఁ బొందుటకోర్చియమ్మెయిం। గానన భూమికిం జనుట కామునికోత్తము నీ వెఱుంగవే। కాననసీమం
విపాండవులఁ గౌరవులంపఁగ నూర్పు నేర్పునన్ ॥ గీ ॥ అలవెఱుంగక ధార్తరాష్ట్రులు గడంగి। మమ్ముఁ బఱిచిన పాటు
లు మానసమునఁ। జపుటఁ బెట్టినవిత్తులచంద మొంది। యంకురింపక చెడిపోయె నంబుజాక్ష ॥ వ ॥ అమ్మెఱుఁగుల నెమ్మెయి నయి
నను ॥ క ॥ ఒకఁ బఱిచి నమాకు వారికిఁ। బుడమి నగము చేసి పొందిపొసఁగి మనుచునుం। డెడునట్టి తెఱఁగు సేయుట। కడు మేల
వి గౌరవము సుఖంబును జేయున్ ॥ క ॥ నీకట్టిది చిత్తమునకు। రాకుండిన యేని వలదు తొండిమ్మెయి మీ। రీకార్యము సేయుండ
నె। మాకానతియిమ్ము కంసమర్దన తెలియన్ ॥ మ ॥ హితమిట్టింగిది మాకు ధర్మువు తెఱంగిట్లుండునంచేనునీ। మతి బోధింప
వలంతి నే హితము ధర్మంబున్ విచారించి చూ। చితగం బొప్ప నియేది పంచి తదనిశ్చితంబునం జేసియు। న్నతిఁ బొందంగల వా
రమైనను నికృష్ణా నేఁడు గావచ్చునే ॥ వ ॥ అనినవిని కృష్ణుండు విజయునకిట్లనియె ॥ చ ॥ వెరవునలావునం గృషికి వేఁయు విధం
బుల మేలొనర్చి పం। డొరఁగొను నేఁ ఫలంబు దఱితోఁ దగు వర్షము లేక యున్ననే। వ్వరుసున లెస్స చేసినను పౌరుషముల్ ఫ
లియించు టెల్లనా। దరణమునం బ్రసన్నమగు దైవము చేతన చూవె ఫల్గునా ॥ ఉ ॥ కావున సంధికిం బురుషకారము నైన ర్పెద
నోపినంతయున్। దైవము సేఁత యెట్లగు నెదాని నెఱుంగను రొ నుండుసు। భావన చేసి పాలొసఁగు పాడి యెకక్కిన చా
ల్యమాదిగా। నేవిధినైన నుంజెఱుపనింతలు పాపములాచరించునే ॥ వ ॥ అదియెల్లనట్లుండె ఇచ్చట విరాటుపసులం బట్టిం
పనీవుపోయిన యప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు ॥ ఉ ॥ వచ్చినవాఁడు ఫల్గునుఁడవశ్యము గెల్తుమనంగ
రాదు రా। లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే। హెచ్చును గుందు గుందొడరు టెల్లవిధంబుల కోర్చునట్ల
గాకెచ్చఁ దలంచరొక్కమెయి నిత్తఱి బొందగు చేతయుందగున్ ॥ వ ॥ అనియె దానికతండుత్తరంబిచ్చిన విధంబు ॥ గీ ॥ మ
నకుఁ బొందు రాజతనయవర్గమునకు। నెట్లు పొందుగలుగు నేను రాజ్య। భాగమీను సమరభంగికవిక్రమ। నిరతిఁ బూనుటి
దియు నిశ్చయంబు ॥ వ ॥ అనిపలికె నదియెంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమి కాదె యామాటలఫలం బప్పుడకె నియువాక్స్తా
త్తుండు వెండియుఁ దెలియండు ॥ గీ ॥ అతని గుణదోషములచందమట్లయుండె। నాకు ధర్మజు బుద్ధి ననడుపవలయు। నిత్రైవం
గాచరింపంగ నేఁగియ చటు। నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు ॥ చ ॥ అనినముకుందుతో నకులుఁడల్లనయిట్లను నీకు ధర్మ
జుం। డునబవనాత్మజుండునరుండుం దగఁ జెప్పుటరిత్తగాదుమా। మనములరణ్యవాసముల మత్స్యమహీపతిపాలనున్న
యద్దినములభంగి కావు కృపదీవ్రతఁ గుందిన చందమయ్యెడున్ ॥ క ॥ కడవఁగ నోకళ్లసరము। నడిచిన నొకిఫలమఁజె
ప్పునమువవల సునే। చెడు తెరు వాకౌరవ్యుల। కడనిలుచుం గాక మనసు గౌగ్యం బేలా ॥ సీ ॥ గోగ్రహణంబున గోటెనెంత
యుమెత్తవడగండుడు రె వాసు పద్మనాభ। నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడినబలము లేడక్షౌహిణుల దొరలును। బాం
చాలయాదవ పాండ్య కేకయ మాత్స్యులోగిఁ దెంపు నెఱుఁగక యున్నవారె। భీమార్జునుల లావు పెంపును నీసహాయంబు
నెఱుగుటకలుగ రెట్లు। గురుఁడు గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును ట్టు। చెప్పి వారిఁ జక్కఁ జేయ రెట్లు। కార్యమీవు చెప్పఁ
గావిమరుండువి। నంగ నెట్లు గాదనంగ వచ్చు ॥ వ ॥ అట్లుగాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రులాదరింపసంతుదావా లెనీ
యినప్పుడయ్యాకార్యంబు చక్కనగునని నినివిని సహదేవుండు వాసుదేవునకిట్లనియె ॥ ఉ ॥ రక్కసమాటలాడె దరు రాజు
దమ్ములు వారిలోన నీవొక్కటియైనఁ గాదనక యూఁకొనియుండుట యెంత కంటె మే। లక్కట యిట్లు వేఁడికొననైనను
నీయెదవోసు రోధనుం। డెక్కడ భూమిలో నసగమిచ్చుట యెక్కడి దానవాంతకా ॥ మ ॥ తలఁ సంగూడు నెయింత లేసి

మీ ✱ గీ॥ అనిన బాహ్లికాదులగు కురువృద్ధుల । నాత్మజన మఁ గృష్ణు నాదరింప । కతఁడు రాజసమున నవ్వుడు దిగ్గన । లేచిపోయె సంచలించె గొలువు ✱ గీ॥ అతని వెనుకనె కర్ణుండు ననుజగణము । శకుని యును వారిపొందై నజనపశుబును । బోయికమ్మెయిఁ జని యొక్క ప్రోవుగట్టి । వేఱ యంతంత నుండిరి గారడమున ✱ ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు ✱ చ॥ ఇతఁడిది యేల క్రొవ్వి ధరణీశుఁడనంచు వృథాభిమానియై । మతి సెడి లోభమోహమదమత్సరముల్ తనుఁ ద్రిప్పనిట్లసం । గతముగఁ బోయె వీని వెనుకం జని రేమి తలంచి రో మహీ । పతులః వీరుగొందఱతి భారపుమానుసు లేమి సేయుదుర్ ✱ గీ॥ అని జనార్దనుఁ గనుఁగొని యకటకాల । పక్వమయ్యె నీ నరపతి ప్రచయమునకు । ననుచుఁ దగు వారి దెసఁ గలయంగఁ జూచి । తగవు మెయిన్నిట్టులని యెనన్న గధరుండు ✱ శా॥ ఈదుర్యోధనుఁడింత గర్వియగు నే యీ యాయున్నవారెల్లనా । చేదైన్యంబును బొందుటొప్పదని చర్చింపఁడయి యాభంగికిన్ । లేదే యొండు దెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింపరా । దే దుష్టాత్మకు నీచు నాకరుని బోదే నీతియీ జాతికిన్ ✱ ఉ॥ కంసుఁడు నిట్లు తండ్రి మది గండెఱు భంగియొనర్చి ధర్మవి । ధ్వంసము చేసినం గులమువారలు నా కెఱుగింప నేనుదు । ర్మానసము గాయు వైద్యుని క్రమంబున నాతనిఁ ద్రుంచియవ్వరో । త్తంసముఁ జేయనే జనకుఁ డద్విపథమొప్ప దెమీరు చేసినన్ ✱ గీ॥ అంతతోడ నెల్లయాపదలును దీఱు । వంశమధికగౌరవంబు నొందుఁ । గూడిమనుటగలుగుఁ గురుపాండవులకని । తెలుఁగుచూడ మీకు నను అవకాదె ✱ వ॥ అనిన విని ధృతరాష్ట్రుండు దరిపడి సదుర నకిట్లనియె ✱ గీ॥ బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగ । నేర్పవచ్చి కొడుకుఁ దేర్చిపోవుఁ । గాన వేగ నీవు గాంధారిఁ దోడితె । మ్మనుడు నరిగి యతఁడు నట్లచేసె ✱ అద్దేవియు ✱ క॥ చనుదెంచి యుచిత పీఠం । బున నున్నం గురువిభుండు పెలఁతుక తోన । ట్లను నీతనూభవుఁడు దుర్వినయంబునఁ జని యొసిట్టి వెంగలిగలఁడే ✱ క॥ నీవైనఁ జెప్పి శాంతుం । గావింపఁగ నోపుదేని గౌరవకులమీ । గోవిందు శాసనముసఁ భావింపఁగాంచి చెడక బ్రదుకుఁ జుమ్మీ ✱ గీ॥ అనుఁడు నీపుత్రుఁడవినీతుఁడగుట యెఱిఁగి । యెఱిఁగి వాని వశంబున నేల పోయె । దీవు పాండవులకు నేమియిచ్చితే నేని । సడ్డపడ నెవ్వరికి వచ్చునధిప చెపుము ✱ క॥ అని గాంధారి పతియుఁ దాననుని విదురుం బనిచె నంధనుం బిలువనతం । డును మొగము జేవుఱింపఁగఁ జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁడై ✱ వ॥ మున్నుదనతోడం జనిన వారలందఱుం జొచ్చి యటనిలువనిట వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుండై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికిఁ ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకు తెరువును నిజశక్తియు సహాయంబు కొలందియుఁ గులజన చిత్త ప్రకారంబును బాండుపుత్రుల బలపరాక్రమంబులుం దెలియునట్లుగాఁ దెఱంగువడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకపథంబుల నాడిన మాటల దెస ననాదరంబు చేసి యుద్ధతిం గ్రమ్మఱం జనియతండు కర్ణాదులం గలసి

## దుర్యోధనుఁడు శ్రీకృష్ణునిఁ బట్టుకొని చెఱఁబెట్టఁ దలంచుట.

వారుసుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి ✱ క॥ హరి తలఁపొప్పదు భీష్ముని । గురునిఁ గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టన్ । గరముత్సహించుచున్నాఁ । డరయనతనివచన రచననంతయుఁ దెలిసెన్ ✱ క॥ మును దాఁ గంసునిఁ బరిమా । ర్చినచందము వారికెల్లఁ జెప్పెడువనరుఁ । మునుసనముగడఁగి వేస । ట్టిసకార్యంబుసఁ జలంబు డింపకుఁడింకన్ ✱ గీ॥ పట్టియాతనిఁ జెఱ బెట్టి పాండవులకు । దిగులు పుట్టింతమంతటఁ దెగక యెత్తి । వచ్చిరేని యనిర్జింపవచ్చుఁ గౌరవ । వెల్లఁ బుద్ధి నను రగంబు లేమి సేయు ✱ వ॥ అని విచారించి రిట్లు దుష్కార్యాలోచనంబు చేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులగు దుష్టచతుష్టయంబు మొదలుగాఁ గలుగు సపినీతులుదై తేయమర్దను మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున ✱ చ॥ అడఁకువ లేక యుస్కి యురియాడుట యొండొరుఁ గూడకుండుటల్ । బుడిబుడి మాటలాడుటయుఁ బోవుచు వచ్చుచుఁ గ్రందు గ్రమ్మఱం । బడుటయుఁ దెల్లమైన మను వప్పు గఁ దాఁ బరికించి యుస్కి న । ప్పుడు హరిఁ బట్టు సంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్ ✱ గీ॥ బరటుకొనిపోయి కృతవర్మఁ బన్నెఁ బనిచె । నీవు బలమును వాకిట నిలువుమేను । లోపలికి నెల్లఁ జాలెదఁ బాపబుద్ధు । లన్న దెసఁ జప్పిరనిశ్చయముగఁ జెప్పి ✱ వ॥ ఇట్లు పరమాప్తుండగు హార్దిక్యునటఁ బుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకునత్తెఱంగెల్ల నెఱింగించి తత్పనుపున గౌరవేశ్వర బాహ్లిక భీష్మ విదురులతో నిట్లనియె ✱ మ॥ అదె కౌరవ్యులశక్తి మఱ్ఱనతఁ జేయఁ బూని పైఁ బాఱఁ జూ । చెదరిమ్మెఁ దమచేతఁ జీఱు నెజయశ్రీకాంతుదై త్యాంతకుం । బోదువందారుడలంచు తెల్లననలం బుంజీరబంధిపఁగా । మఁడనూహించి నయట్లకాక తమ దుర్మంత్రంబులం బోవునే ✱ వ॥ అనిన విదురుండదరిపడి వైచిత్రవీర్యు

నకిట్లనియె * ఉ॥ భూవరనీతనూభవులు పుణ్యు లనగణ్యపరాక్రము లాహవంబునం। దేవలమర్త్యులుం గాదలఁచి కట్టినమట్టిం దారుసంటపై। వారి రిపుక్రమ్ము నాశలభవర్గము చాడ్పున నగ్నిదిపోదెకా। లావధి యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్ * వ॥ అనుటయు గోవిందుండు దలఁచి విననంబి కానందను నకిట్లనియె * ఉ॥ రోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింత చేతసం। తోషము నీవు ప్రాభవముతోడఁ గనాకు ననుజ్ఞయిమ్ము నిర్దోషత నేను నోపుకతిదోర్బలదుర్జయులైన వారిపై। ద్వేషము సక్కఁ బెట్టి జగతీవరయంతికపోయి వచ్చెదన్॥ అనవుడు సంభ్రమమున నజ్జనపతి దుశ్శాసనాదిసకలపరిజనంబును నాదుర్జనుఁ గొనిరమ్మని విదురుం బనుపుటయు నునచంజనియితఁడు * వ॥ సపరివారంబుగా మరోక్షధనుండో డ్డెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుండిట్లనియె * చ॥ అలవియె బుంగకిట్లు దనుజారికి గీడొనరింపనీవు నీ। తులువలు నుత్సహింపతిరి దుర్మతులాగసమీకు మీకుఁ జేసలవడఁ బట్టవచ్చునె మహాద్రిఁ గదల్పఁగ గబ్బోలు నేకవానలు జమరంగశక్యమె వినాశముఁ బొందెద రేమి సేయుదున్ * గీ॥ అనిన విదురుఁడిట్టులనియె సుయోధను। తోడ బాలకేళిఁ ద్రోడఁ గిలిలఁ గృష్ణుఁ డెచట నెచట నెవ్వ రెవ్వరి నేమి। సేసె సేసిన వెయేల చెకియె దిట్లుం వ॥ అనియె నట్టియెడఁ గట్టెదురనున్న యక్కురుపతికుమారునకుఁ గంజాక్షుఁ డేనొక్కరుండన యని తలంచి యెదుర్మడంబునం బొంది పట్టను త్సాహంబు చేసి తనువుదరహాసంబు సేయు వాసుదేవుఫాలప్రదేశంబున బ్రహ్మ యువత్సంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్రయమ వరుణకుబేరులు నాదిత్యమరుద్విశ్వదేవాశ్వినులుద్భవించిరి హలగాండీవమండితబాహులు బలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబుల నునిజాయుధహస్తులగు యుధిష్ఠిరభీమనకులసహదేవులు వీపునవివిధప్రహరణపాణులగు యదువృష్ణిభోజాంధక వీరులూరుల ను బ్రభవించిరి జనిత నానాహస్తవిన్యస్తంబులయి శంఖచక్రగదాఖడ్గశక్తిశార్ఙ్గప్రముఖనిఖిలసాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసావివరంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణనిభప్రభలు వెడలె నిట్టి దుర్నిరీక్ష్యంబగు నత్తేజోరూపంబుఁ గనుంగొనం గొలఁది గాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసంబులఁ జొత్తిల్లుచిత్తంబులతోడం గదలకుండ నప్పుండరీకాక్షుండు నారదాదిమహామునుల వలనను భీష్మవిదురద్రోణసంజయుల యందు ననుగరుణాతరంగితంబగు కటాక్షవీక్షణంబులయి వారలకు దివ్యదృష్టి యొసంగిన నాపుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండి రయ్యవసరంబున * గీ॥ దేవదుందుభివ్రాతంబు దివి రెఁగల్పె। వృక్షపుష్పధారామయవృష్టి గురిసె। సిద్ధసాధ్యవిద్యాధరశ్రేణిభక్తి। నిచ్చుజయజయశబ్దంబు లెసఁగెఁ బదల * వ॥ అప్పుడు ధృతరాష్ట్రుండమ్మహాసంకులంబు విష్ణుని విశ్వరూపవిజృంభణంబు గావలయునని యూహించి * క॥ కరుణింపుము సంశ్రితభయహారణధురీణ సహింపు మజ్ఞానమునీ। శరణము వేడెద నుభవచ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే * చ॥ అనుడు దయార్ద్రచిత్తుఁడగు నప్పరమేశ్వరుఁడిచ్చె దృష్టి యజ్జనపతికద్భుతంబడర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం గనుఁగొని భక్తి మ్రొక్కె నినుఁ గంటి గృతార్థుఁడనైతి వంక నెల్లనొరులఁ జూడఁ జూచు నయనంబులు నొల్ల నుపోత్తము సంహరింపవే * క॥ అనిన వలుకుల కునచ్చటి। జను లెల్లను ప్పాలు సితవిశాలాక్షుఁ గనుంగొను చుండిరపుడు దమ నెమ్మనమ్ము లాశ్చర్యరసనిమగ్నంబులుగాన్ * వ॥ తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతంబొడఁ గూడ నతనికన్నులెప్పటియట్ల కావించి నిజవిశ్వరూపప్రపంచంబును పసంహరించి మునీంద్రుల నామంత్రణంబు సేయ నమ్మహాత్ములంతర్ధానంబు సేయఁ దాననుసముత్థితుండై యంతకు మున్న సన్నిహితులై యున్న కృతవర్మకరంబును సాత్యకిహస్తంబు నవలంబించి యూరక వెడలెనని చెప్పిన * గీ॥ ఇవ్విధమునఁ గృష్ణుఁ డేగిన పిదప టెక్కథవినంగ నాకుఁ గౌతుకంబు మనమ్మున నిండి గడలుకొనుచున్న యది వివరించి చెప్పుము నివ రేణ్యయనుటయు * ఉ॥ భక్తమనః ప్రమోదకర పాదసరోజ వికాసచేతనా। శక్తిమయప్రభావముని సంస్తుతసాత్యవతేయ భారతీ। ప్రోక్తనిగూఢ సంప్రకటభూమ సమాశ్రయవత్సలత్వ ముఖ్యరక్తకృపాభిరామగుణవర్ధననిష్కళనిత్యపుష్కలా * క॥ అవ్యయనిర్మలవిభవా। దివ్యప్రభవా సుఖైకదీప్తానుభవా। సువ్యక్తనిత్యయతిసం। సేవ్యసుసాంగత్యలోకజీవనకృత్యా * మాలిని॥ రవిశశిమయనేత్రా ప్రస్ఫుటత్కాంతిహృద్యా। నవజరఠవికారన్యాలీలానవద్యా। వివృతనిగమశాఖావిస్మృతాగైకవేద్యా। వివిధనయతచర్యావృత్తచిత్తప్రసాద్యా॥ ......... ...........

గద్య * ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజితిక్కన సోమయాజిప్రణీతంబైన యుద్యోగపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ హయగ్రీవాయనమః.

## శ్రీమహాభారతము- ఉద్యోగపర్వము -చతుర్థాశ్వాసము.

శ్రీనత్తులసీపల్లవ। దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమస్రో । ద్దామప్రభాస్థిమాలా। శ్యామాయితవిపులవక్షహరిహరనా
థా * వ॥ దేవా వైశంపాయనుండు జనమేజయునకిట్లనియెఁ గృష్ణుండ ట్లెఱింగిన వెడలిన విస్మితయై గాంధారియభ్యం
తరమందిరంబునకరుగఁ గౌరవులెల్లను బంధుమిత్రసహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగంబుగఁటి వెట్టికొని
కట్యాంతరంబులుగడచునప్పుడు దారుకుండు తేరునొగలపైనుండి పాదసూపి కేలు మొగిచి ఫాలభాగంబుపైఁ గదియించి
నందత్ప్ర దేశంబుననిలిచి వారల దెసమరలిచూచి మీరింక నిలువుఁడని పలికిన నాఁబికేయుండు పుండరీకాక్షుం జేరినిజ
తనూజునుపలక్షించి * ఉ॥ పీకును బాండుపుత్రులును వేరముకక్కొపాసంగిమనికై। పోరితమాడియేనటులుబద్ధులుసె
ప్పినభాగియుండులా। చారమునిర్వహింపఁబలుచందము లందగదుఃఖపాటునీ। కౌరవజాతికెంచెలిసెఁగాదెగదాధరనీ
మసన్నిధిక్ * వ॥ అనివెండియు * గీ॥ నీకుశుద్ధుఁడనగుటనిఖిలబంధు। మిత్ర గురుజనకోటికిధాత్రి కెల్ల। నంబుజాక్షునిర్దో
షుండనగుటగాన। నా తెఱంగునీవెఱుఁగుట నాకుఁజాలు * వ॥ అనినవినియచ్యుతుండు బాహ్లికభీష్మ ద్రోణకృపప్రముఖని
ఖిలశిష్టజనంబుల నాలోకించి * గీ॥ ఇప్పుడీసభఁబుట్టినయింతవట్టు। మీకుఁ దెల్లంబుగా దెయీ మేదినీవిభుండుదానేమి
టికినిమ్ముఖ్యుండఁగాను। దప్పుతన దెస లేదని చెప్పివిడిచె * వ॥ కావున నాకు నియ్యోడఁదడయఁబనిలేదు పోయివచ్చెదధర్మ
పుత్రునకునీవృత్తాంతంబంతయు నెఱిఁగింపవలయునని పలికి వారలనామంత్రణంబుచేసినవాఁడయి రథారోహణంబు
చేసి ధృతరాష్ట్రుండును నచటిజనంబులును వెనుకంజనచని కుంతీగృహద్వారంబున నరదంబుడిగి * క॥ వారండటుదన
తోడన। గారవమున నసుగు దేర్రఁగాఁ జొచ్చి మహోబా। దారుండుకుంతిచరణాం। భోరుహములకెఱఁగివినయభూషణుఁ
డగుచున్ * క॥ కౌరవసభఁ దానాడిన। గౌరవవాక్యములు కార్యశిక్ష క్రమవా। క్పాగములుసుయోధనున। ప్రారంభ
మునల్పవచనపద్ధతిఁ జెప్పెన్ * వ॥ ఇట్లు ధృతరాష్ట్రకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱిఁగిం
చిమాధవుండువఱియును * గీ॥ కురుకుమారులుదమయంతపడిచి క్రొప్పి। మీఁదెఱుంగరుమా కేమిమేలకాక। నాలుకబు
గ్రోయున్నదునానలముదగిలి। యెఱుగొనంగనిసంప్రీతియొసకమెసఁగు * వ॥ పాండుకుమారులపాలికింబోయెదవారికిం
దగినబుద్ధులానతిమ్మనిన నద్దేవిక్రమోపజీవులయినముచికుందుండును సృంజయుండునను తొంటినరపతులచరితంబు
లు చెప్పి యుధిష్ఠిరుండు వీరివినఁడో కోయని పలికి యెల్లవారునువినుచుండ వేఁడియునిట్లనియె * ఉ॥ రాజులకెందునాగయ
బరాక్రమజీవనవృత్తితక్కనొం। డోజనిషిద్ధముండ్రమునులుత్తమసత్త్వులువంశధర్మముల్। పూజితభంగిఁ జేయ
దురుబుద్ధిహీనులువారుఁదక్కని। స్తేజపుకూటికియ్యకొనిదీనతఁబొందుదురంబుజోదరా * క॥ నీవియ్యంబులుసంధియు
కావింపఁబడిరిపీరిఁగలయుటగష్టం। బావెరవుదప్పటయమే। లైవచ్చెంబొమ్ము విమువుమనుమానంబున్ * మ॥ నిజవం
శోచితవీరవృత్తమునకున్నేమంబుగానాకపి। ధ్వజుఁడుత్సాహముసేయకున్నఁ గటాదైన్యంబువాటిల్లదే। భుజదర్పో
ద్ధతుఁడైనభీమునకు నీపొందొప్ప నేనీవుసు। త్వజగన్మాన్యుఁడవిందురాఁడగు నెదైవంబెట్లుదప్పించునే * వ॥ అనియంతనిలు
వకగొంతియిట్లనియె * క॥ మాఱిచిరే ద్రౌపదిఁ గొలువునఁ। బఱిచినబన్నంబుధర్మపథముందోలఁగన్। వెఱచుటకప్పటికిదిద

— శ్రీకృష్ణుఁడుగర్ణునిఁ దనరథంబెక్కించుకొనికొన్నిరహస్యోక్తులుపలుకుట. —

గుఁ। జెఱిచినచోవెదకవలదెచిరతరకీర్తిన్ * వ॥ అనిపలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొనియచ్యుతుండు మ్రొక్కినదీవిం
చియేను సుఖంబున్నదాననని పాండవులకుం జెప్పుము చేతులలావునం గలిగిన జీవనంబున బ్రదుకుండనుము పోయిరమ్మ
నిపీడుకొలిపిన సింహగమన సుందరంబుగా వెడలితోడనతగిలివచ్చుధృతరాష్ట్రాదులనిలువంబనిచి గోవిందుండు కర్ణుదె
సంగముఁగొని నన్నవిచి వత్తువుగానిరమ్మని కరంబుసాచి చెయివట్టి తనయరదం బెక్కించుకొని సాత్యకి వెన్నడి నెక్క కె
లనం జను దెరఁగడలిచని యనుపవచ్చిన కృతవర్మనుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగు నవసరంబునం బౌ

ఠలోకంబు * ఉ॥ అక్కటవాసుదేవుపను పాదరణంబునఁ జేయరై రిపీ రెక్కడిబుద్ధిమంతులని యెంచుచునందురులోక
మెల్లఁ బే। యిక్కవ ద్రష్టుటందలఁప నెల్లక పాపము చేసిరిట్టిమై । నుక్కివు లెందునుంగల రె యొప్పగువో ధృతరాష్ట్రనం
దనుల్ * వ॥ అని మఱియును నేకుల నేక ప్రకారంబుల బలుకుచునిరు గెలంకుల జూచుచుండఁ బుండరీకాక్షుండు పురం
బు నిర్గమించె నిట ధృతరాష్ట్రుండు మగిడి కొలువుకూటంబునకు వచ్చి యప్పటి వారలు పరివేష్టింపనుండి కృష్ణునివలని
మాటలాడుచున్న సమయంబున సుయోధనుతో భీష్మద్రోణులిట్లనిరి * చ॥ పలుకు నెయిట్లు గొంతిపినిబమ్మరపోయితిమిం
త బెట్టిదం । బులగు నెమాటలియ్యమయుఁ బుణ్యుఁడు కృష్ణుఁడు గార్యవాదముల్ । పలికె మనట్టివారు బెగఁ బాటిరిధర్మజ
వారి రాశికిం। జెలియలికట్టవా సెమన చేనగుకజ్జముచంద మెట్టిదో * వ॥ అనిపలికి వెండియు * శా॥ మాపంజూడఁగఁ బోలు
కార్యానిధి ధర్మప్రీతినీ వేగిసు। శ్లోకండై నయుధిష్ఠిరుంగనిజనస్తుత్యంబుగా శాంతిమై । నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే మె
పొప్ప దెంచుమదిన్ । శోకంబొందక వేగ మైకడలి కృష్ణుం జూడ బోవే నృపా * వ॥ అనిన విని దుర్యోధనుండు మొగంబు
రాజుచుండ నూరకుండె గాంగేయుండును గురుండును దిగ్గున లేచి యతని నవలోకించి * క॥ కురునృపవినుసంసారము। దని
ద్రోక్కన వారమిం కఁ దలఁ కెదమేసం। గరము నమ నేమినీకై । పొరలితి మెక్లైననగుసబోయెదమనుచున్ * క॥ అరిగిరి రాజు
నునభ్యం। తరమునకుం జనియె రాజతనయుం డుబహిః । పరివారముఁ బొమ్మనిమిత । పరిజనుఁడై యేగెనాత్మ భవనంబున
కున్ * గీ॥ అంతనక్కడ నచ్యుతుఁడరిగి యరిగి। యధికసంప్రీతి దలకొనఁ గుంతి తనయు। నాననంబు పీక్షించి యిట్లనియె నెమ్మి।
నన్యులెవ్వరు వినకుండ సతనిలోడఁ * సీ॥ నీవు వృద్ధజనోప సేవివిధర్మసంవేదివి తెలియంగ వినుము సిద్ధ। మంత్రబలంబున సమా
క్రాంతవరముగఁ గన్నియ తఱిఁ గొంతిగన్న వాఁడ । వసుటఁ బాండునృపాలునగ్రసుతుండవు ధర్మమార్గంబున ధర్మతనయుఁ।
డాదిగాఁగల తమ్ములం దఱు నా చేత నెఱిఁగినీయడుగుల కెఱఁగి నరల। పుత్త్రమిత్త్ర బంధుభూరి సేనాపను । న్వాతముగాఁగఁ
గొలిచి నిన్ను రాజ్య। భారవహనమునకుఁ బట్టంబుగట్టను। జ్వలుఁడవ సుదురమ్ము వారికడకు * వ॥ ఏను నిన్ను సామ్రాజ్యంబు
నకునభిషిక్తుం జేయుదు నీవుతోలుత వెడలునప్పటి మహా ర్తంబున యువరాజై యుధిష్ఠిరుండు నీరథంబున నుండి నీకు
ధవళచామరంబులు వైవను వాయుపుత్త్రుండు సితచ్ఛత్త్రంబు పట్టను సవ్యసాచి సారథ్యంబు సేయఁ బాంచాలయాదవ మా
త్స్యులులోనుగాఁగల రాజలోకంబుతోడఁగవలు నభిమన్యుప్రభృతి కుమారులు నెఱయబెరయ నేమెల్లం బరివేష్టించి వత్తు
మిట్లు మహేంద్రతుల్యవిభవంబున మహనీయుండవగుచు మహీచక్రం బేలుమని చెప్పి మఱియును * క॥ పాంచాలరాజపుత్త్రి
యు। సంచితముగ నిన్నుఁ బొందు నాఱవ వరుసన్। సంచితపుణ్యుఁడ వీవొక। యించుకయును వేఱు సేయకే తెమ్ము వడిన్ * వ॥

*కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగిన యుత్తరంబులిచ్చుట.*

ఇట్లైనఁ గుంతికిసమస్తబంధుమిత్త్రులకుఁ బ్రియంబగు నని వినిరహస్యంబుగా రాధేయుండు మాధవునకిట్లనియె * చ॥ వెఱవె
డ నేను దొల్లియిది వింటినినుంగనిమంతినిర్దయం। జెఱఁదివై చిపోయెఁ గృపఁ జేకొనిసూతుఁడు దెచ్చె తామయు । స్నేహకుల
కానకుఱ్ఱఁ బ్రియకుండగనిచ్చినఁ జేఁపెఁజన్నులప్పుడఁ తియునప్పుడాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీలయై * క॥ మూ
త్త్రపురీషాములుదను । గాత్త్రముల దింకవారుగౌరవమెసఁగం। బుత్త్రుండని సంవర్ధిత । గాత్త్రునిగాఁ జేసె నింతకాలముఁ
గూర్మిన్ * క॥ నేఁడింక నెఱిఁగి యెవ్వుల। వాఁడఁగ దాయనుచు నేనువారిఁ దొరంగం। బోఁడిమి చెడదే యదిఁగడు । వాఁడి
గలదె నాకునకట వారిజనాభా * వ॥ వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుంగలవాఁడవని నన్నుఁ జెప్పితి పరా
ధయు సూతుండును నాకు జాతకర్మాదిసమస్తసంస్కారంబులు సముచితంబుగా నాచరించి రట్టితల్లిదండ్రులకుఁ బుత్త్రకృ
త్యంబులు నిర్వర్తింపక వారలం బాసియేను వచ్చుటధర్మంబగునే యని పలికి వెండియు * క॥ సోదరులుఁ బ్రియులు నరజులు।
నా దెసఁ బెక్కండ్రు వారినందఱ విడువం। గాదని యూహింపక దా। మోదరనన్నిట్లు పిలుచుటుదితమె నీకున్ * వ॥ అదియు
నాదెసఁ బెక్కండ్రు వాని నందఱ విడువం। గాదని యూహింపకదా। మోదరనన్నిట్లుపిలుచుట దితమె నీకున్ * వ॥ అదియు
నుంగాక * ఉ॥ సూతసుతుండు వీఁడనక సూనులతమ్ములకంటె నాకునఁ। బ్రీతి యొనర్చి తేజమును బెంపును నాదెస నాఁడు
నాఁటికి। మైతనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండు నే। నేతగ వెదియాకురుకులేశ్వరుఁ బాయ దమమ్ముట్టవచ్చు
నే * క॥ ననునయ్యుజ్జునునకు నెదు। రని పెద్దయునమ్మియుండు నక్కటదుర్యో। ధనుఁ డా నమ్మికవమ్ముగఁ । జను నే పాండ
వులఁ గలయఁ జననాకనఘా * గీ॥ ఏను నర్జును నెక్కటియెక్కటిం దల । పడక యున్నాఁగ నెపుడు నిజనులు । నందు నే

నువచ్చుటతనికినపకీర్తి । యవిననాకు వేఱేయడుగనేల ॥ క ॥ హితముపదేశించితినీ । వతినిర్మలబుద్ధివగుటనైనసనిది
నా।మతిసారమతహాస్యము రా।శ్రితముగ బాటింపుమయ్య చిత్తములోనన్ ✽ వ॥ అదియేమిటికంటేని ✽ గీ॥ ధర్మతనయుండు
దాను వాతమ్ముఁడగుట । యెఱిఁగె నేనిసామ్రాజ్యమేలపూను । నట్టిధార్మికుఁడాధిపత్యంబుఁ జేయ । వలదె శాశ్వతమై
యుండఁ బుడమి కెల్ల ✽ క ॥ అనుజులు ఋత్విజులుగ నీ।పనియిటు సేయుమని నీవు పద్రష్టవుగా।విను కురుకుమారవరుపశ।సన
మున రణయజ్ఞమతఁడు సమ్మతిఁ జేయున్ ✽ వ ॥ దానఁ బుణ్యభూమియగు కురుక్షేత్రంబున మము బోట్లెల్లను సద్గతిఁబడ
యఁదురుగాక యనిన విని వాసుదేవుండు సూతనందనునకిట్లనియె ✽ మ ॥ దయనాయాడిన మాటగైకొనవు సంతాపంబు
వచ్చుఁజుమీ । స్థయమెట్లుండుదునిక నర్జునునితో మాత్సర్యమైనం బరా । జయము మొందెదు వ్యతియుండెఁగాక గెలువ శా
క్యంబె పెక్కేండ్రకిం।తియ కాలంబయియుండ నీ మనముశాంతిం బొందఁగా నేర్చునే ✽ క ॥ గాండీవముక వదోనలునా।ఖం
డితదివ్యాస్త్రములు నెగలపై నేనుం। జండభుజబలము నై యు । ద్దండతనకుఁ డెదుర నెదురఁ దరమే నీకున్ ✽ వ ॥ ఎల్లభం
గులఁ బాండవుల గెల్తురదియట్లుండె నీవు పొమ్ము సుయోధనునకును గురుభీష్ములకును మీకుం దోడువచ్చిన రాజులకం దఱ
కుం జెప్పుమి మ్మాసంబు సౌమ్యంబై సమశీతోష్ణంబయి పుష్పఫలోపేతంబును సమగ్రధాన్యంబును సులభయవసేంధ
నంబనుచనొప్పియున్నయది యెనిమిదిదివసంబుల నమావాస్య వచ్చు నదిపుణ్యదినంబు నాఁడు భండనంబు కావలయున
నినఁగా నీనుండుకమలనాభునకిట్లనియె ✽ క ॥ కలవు నిమిత్తస్వప్నంబులు కౌరవపాండవులకుఁ బోరగుదానన్। గెలువయ్యు
ధిష్ఠిరునకును।గలదెఱుఁగుదు నీవు చెప్పఁగా నేమిటికిన్ ✽ వ ॥ ఇట్లు గానఁ గదా యేనందు రానని పలికి మఱియును ॥ దీనికి మా
లముశకునియు। నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ।సూనులు వారలుఁ గలసిన। రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా ✽ వ॥
ఈ సమరసముద్రంబు గడవ నీదినిన్నుఁ గని యెదఁగా దేని స్వర్గలోకంబునం గాంచెద నీవింక నేమియుం బలుక కుము పనిపు
నియెదనని కౌఁగిలించుకొనిన నట్లకాకపొమ్మని విష్ణుండు వీడుకొలుప రాధేయుండు రథావతరణంబు చేసి కనకరత్నమ
యంబగు తనయరదంబెక్కి కరిపురంబునకరిగె నచ్యుతుండును సాత్యకింపన తేరెక్కించికొని దారుకుం జూచి పదపదపోని
మ్ము పొమ్మనిపలికి లలితాటోపకలితుండగుచుఁ జనియె నట్టియెడ విదురుండు విషాదంబుతోఁ బాండురాజమహిషిపాలికిం
జనియిట్లనియె ✽ ఉ॥ అక్కటకౌరవాన్వయమహార్ణవమింకెడునట్లు పుట్టెనిం। దొక్కరుఁడై నఁ గేశవహితోక్తికి మేకొనఁ
డయ్యె నర్జునుం । డెక్కటిదానఁ జాలుఁదమునిండఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁబెం । పెక్కిన పాండునందనుల యేడ్తెఱ దొ్రో
యఁదా రెఱుంగరే ✽ గీ॥ అన్నివడియును బంధుక్షయంబు సేయ।నొల్ల కెల్లవిధంబుల నుపశమంబు । గోరఁ బాండవేయు
లు వారికిట్టి। దొసఁగు వచ్చు నెతులువలతోడఁ బుట్టి ✽ వ ॥ అని వెండియు నివ్విధంబు మాటలఁ బాండవుల ప్రఁగయ్యంపుటలజ
డియయిన వగపు దోఁపనాడుచుఁ గొండొకప్రొద్దునిలిచి నిజనివాసంబునకుం బోయి నయనంతరంబ కుంతియిట్లని వితర్కించె ✽
మ ॥ తమ వారింజెరి కై వధించుటదిసద్ధర్మంబె యక్లేశకృ । త్యమె తాఁ గయ్యము ద్రోణభీష్మకృపకర్ణాటోపముల్ వాస్చ
ట।ల్పమునం దీఱునె యెందు నర్జునియుఁ జెప్పండుం గ్రోధదీ। ప్తముఖీ మాదులమీఁదఁ దకొ్కరులకుత్సాహంబులేదాజి
కిన్ ✽ వ॥ అనియివ్విధంబునఁ బెక్కులు చింతించికొని కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదరస్నేహం బావహించెనేని
మైన నాహవంబువలని కడంక యుడుగకుండునె యని విచారించి యతనిపాలికిం బోవ నిశ్చయించి యాచిత్తప్రకారంబున
వెడలి యతఁడనుష్ఠానార్థంబు భాగిరథికరిగినాఁడనివిని తత్ప్రదేశంబునకరిగి యతనికిజపకాలంబయినఁ జూచి వెనుకవల
నం గూర్చుండఁ గొండొకసేపునకు జపంబు దీర్చి దిక్కులు గలయంగనుంగొని యమ్మహాదేవిం గాంచి కానీనుండు సంభ్రమ
వినయంబులతోడ నేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాదంబు చేసి నీవు విజయంచేసిన కా

✽ కుంతీదేవి కర్ణునకు నతఁడు దనపుత్రుండగుట దెలుపుట. ✽

ర్యంబేమి నాకుం జేయం గలవవియెయ్యది యానతిమ్మనినఁ గుంతియు కొంతంబ కానీనునకిట్లనియె ✽ సీ ॥ వినుము సూతాన్వ
యంబున నీవు పుట్టుట బొంకేను మాకుంతిభోజునింటఁ । గన్నెయై నాఁడు భాస్కరుని నారాధింప వరమంత్రబలమున వచ్చి
యతఁడు। సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు నాకుఁ గావునఁ బాండునందనుండ । వసుధ ధర స్థితినట్టి నీవితరులఁ గొలువ నే
టికి।గురుకులవరేణ్య।ధర్మతనయాదులై ననీతమ్ములకును। ధార్తరాష్ట్రులకును నీవతగుప్రభుండ । వేలుమీఁదొక మెల్లనీకే

లరాధ। కొడుకితండనుతకుఁ వకొడుకుసుజ్జ * క॥ అనిపలికినయవసరమున। నినబింబములోననుండియిదినిజమిబ్బంగినవె
గడవన్న మేలగు।నను వాక్యము వెడలెఁగర్ణుఁడాకర్ణింపన్ * గీ॥ దానివినియునపుడు రాధానుతుండు। దిరుగఁబడనిమ
నంబుతో ధీరవృత్తిఁ। దల్లికిట్లను నీమాటతథ్యమగును। నైననొక్కటిసెప్పెదనవధరింపు * క॥ క్షత్రియసంస్కారముల
కుఁ। బాత్రముగానీవునన్నుఁ జాటింపవయా। మాత్రఫలమునకునీకేఁ। బుత్రుఁడననివచ్చుటింకఁ బోలునెచెపుమా * వ॥
సూర్యప్రభావంబునం జేసి నంత్యంబుగాకతక్కనేనియు వాజన్మంబుపరమరహస్యంబై యున్న యదిదీనఁ బ్రకాశంబు
సేయుటమనకెంత మేలదియు నుంగాక * గీ॥ విజయువిక్రమంబువిఖ్యాతమై యుండ। నేనుగుంతికొడుకభానుజుండ।న
నుచునతనిఁగూడనంగిననతనికి। వెఱచిపోయెనన రవేయునేల * క॥ కడిఁదిపగఱనేఁదీర్పఁగఁ। గడవఁగనీఁదంగఁదలఁచుక్షా
త్రవభునిం। జేడుఁగాకయంచునిత్తఱి। విడువఁదగునెయతనివలన వెలసిన వాఁడన్ * క॥ కౌరవులచేతఁగుడిచిన। వారికి
నదీనమెట్టి వారునుసంగ్రామారంభంబునఁ బాయుదు। రేరాజులుమనలఁ దిట్టరేయప్లైనన్ * వ॥ యనవశ్యంబునుదు
ర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు * ఉ॥ నీవలుకెంతవోలిననునిర్ణయమిట్టిదకానియొందులే। దీవనిమీఁదభార
మునినీవిటవచ్చితిగానఁ బాండవుల్ । చేపడి రేనిచంపనఱ సేయకచెప్పెదసవ్యసాచిపైఁ। గోపము పెద్దవాఁడుసమరా
రినబిట్టఱఁజంపుదుఁ జుమీ * గీ॥ సవ్యసాచిచేతఁ జచ్చుటయనుగీర్తి। కరమయతఁడుఱోనుగాఁగనేవు। రేనుఱోనుగాఁ
గనేవునుగానినీ। కొడుకులైదురనుటవిడువమింక * చ॥ అనుటయుఁ గుంతిదేవిహృదయంబునశోకమువెట్టిల్లని।ట్ల
నునిదిదైవసంఘటనమక్కటరొట్లునుదప్పనేర్చునే। యనుపమసత్యవిస్ఫురణనాడినమాటలుమఱ్ఱకన్ననీ। యమజు
లనల్వురంగడవమర్జునుచేఁతకుసమ్మతించితిన్ * గీ॥ అనుచుఁ గౌఁగిలింపఁగర్ణుండట్లకాక।నిప్రియంబుమెఱయవినతుఁ
డైన।నరిగెనవనమునకునద్దేవియాతఁడుఁ। జనియెనిజనివాసమునకుఁ బ్రీతి * వ॥ అక్కడవాసుదేవుండుచిత్రప్రయా
ణంబులనుపప్లావ్యంబునకుం జనిధర్మతనయుచేతం బూజితుండై భీమసేనాదులు విరాటద్రుపదముఖ్యులుఁ దగువారలుఁ
దన్నుఁ గాంచిన వారి నెల్లనభినందించి కొలువుననుండియుధిష్ఠిరుతోనిట్లనియె * గీ॥ ధార్తరాష్ట్రులున్మత్తులుదగినపలు
కులేలవినిసంధి సేయుటకిచ్చగింతు। రెదిరిఁదమ్ము నెఱిఁగిరయేని వార। లంతలంతలుసేయుదురయ్యనాఁడు * వ॥ అని
యెల్లవారునువినఁదనపోయివచ్చిన కార్యంబెఱుంగించి పథశ్రమంబువుచ్చువాఁడయి పుండరీకాక్షుండు నిజమందిరంబున
కరిగె నాఁటిరాత్రిధర్మనందనుండనుజసహితంబుగా నుచితప్రదేశంబుననుండి గోవిందునిరావించి నీవుసుయోధను

* శ్రీకృష్ణుఁడుధర్మరాజునకుఁ గౌరవసభఁ బుట్టినవిశేషంబులు దెలుపుట. *

తోఁ బలికినచందంబెయ్యదియతండేమి విధంబుననుత్తరంబిచ్చెననియడిగిననచ్యుతుండిట్లనియె * క॥ కయ్యముగాని తె
ఱంగున। నెయ్యంబగునట్లుగాఁగ నెఱిఁబలికితినే। నెయ్యడశుభంబుసత్యం। బెయ్యదియెఱుఁగంగఁబథ్యమెయ్యదిదా
నిన్ * గీ॥ బహువిధంబులఁ బలుకు నాపలుకులెల్లఁ। జెవిటికైవడిఁదనపెడచెవులఁబెట్టి। యీఱితాఱలుమఱుమాటలిచ్చి
యపహసించె సుయోధనుఁడు వేయుఁ జెప్పనేల * క॥ అనినవినిధర్మజుండి। ట్లనునప్పుడుతండ్రియువితమాడఁడె భీష్ముం
డునుగురుఁడువిదురుఁడుండ।క్కినపెద్దలుఁ జెప్పరేతగినచందంబుల్ * క॥ నావుడుహరియిట్లనుస। ద్భావమునవిచిత్ర
వీర్యతనయుఁడుదగనా। నావిధములఁ జెప్పెనసం। భావనవినఁడతఁడు పలుకుఁ బ్రతిమాటంబుల్ * సీ॥ శంతనుపుణ్యవం
శంబుఁ గురించినచందంబునంబికానందనుండు। జాత్యంధుఁడై యుండసామ్రాజ్యమంతయుఁ బాలించి పాండున్నపాలుఁడ
తనిఁ। గొలిచియుండుటయునుగురుకులంబునకెల్లఁ దేజంబుగామీరుదిగ్విజయము। చేసికావించినసిరివారువంచనఁ గొ
నుటయుఁ సత్యమకుఁ గితముగ। నీవుసమయంబునడపిననెఱియుఁదండ్రి। పాలుమీకునీఁదగుటయుఁ బాడిలేమి।నరయఁజె
ప్పుదురుకౌరవులనియుఁ బెద్దలెల్లఁ జెప్పిరి మొగమోటయింతలేక * క॥ అలయకయందఱుచెప్పం। గలయంతయుఁ జెప్పి
రతఁడుకటకటఁ బడియె।కొఱలువు వెడలిపోయెందు।మ్మలుగగ్నుఁడు రాజలోకముందోననుగన్ * వ॥ ఇట్లుకొడుకుమునుకు
నుండై యరిగినధృతరాష్ట్రుండు గాంధారిరావించి * క॥ తగవిదురుఁ బంచియాతని। మగుడఁగఁ బిలిపించె నాయమయుఁ
దనయునకు।న్వగయనుమూర్తియువెరవును।మిగిలినవచనములసంధి మేకొనఁజెప్పెన్ * వ॥ ఎవ్వరెంతచెప్పిననుగైకొ
నకకడంగి దుర్యోధనుండుదనకుంగల వారలనెల్లనుగురుక్షేత్రంబునకునడువుండని చెప్పంబని చెభీష్ముని సేనాముఖంబు

చేసికొని యెత్తివిడియంగల వారి ధృతరాష్ట్రుల నిశ్చయించెను నారోపనంత సామవాదంబులాడితి నారదాదిమ
హామునులును సుయోధనునకు బుద్ధులు సెప్పినట్లు చేసితి నేమిటంబోకున్నగినుకc దెచ్చికొని ఝంకించియు భంగించియు
ధిక్కరించియుc గృణీకరించియుం జూచి కార్యంబు భగ్నంబగుటకొల్లక వెండియు శాంతవచనంబులు పలికితినతం డశక్తిదు
ర్జనత సేయుం జూచిన సమానమంబులను వానింగొన్ని వెడమాయలు వన్ని పెక్కుపోకలం బోయితి నెన్నివిధంబుల సంధి
యకావలయునని పొరలంగల యంతయుం బొరలితిన ప్పాపాత్ముండెట్లును జక్కంబడక తనచలంబుతోడన పొట్టుపోరల
య్యోగయ్యంబు వోడుచుంగాని యవశ్యంబు రాజ్యంబు పాలిచ్చువాడు గాడు కౌరవులయెడ దండంబు దక్కనొండు
పాయంబు లేదు మీకుం బోలిన తెఱంగు సేయుండనిన ధర్మతనయుండు తమ్ములం గనుంగొని యిట్లనియె * క ॥ కురుసభc బు
ట్టినచందము। హరియంతయుc జెప్పె నింక ననుమానము లే । దరిమర్దనమునకయ్యెడు । వెరవుం జేవయును మెఱయ వెడ
లుcడుకడcక * వ॥ అనిపలికి యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుండై యచ్యుతునవలోకించి * క॥ కురువంశము ద్రుం
చుటకుం। జొరcజాలక నామనంబు సుడివడియెడు నే । వెరవున దొరcకొనదు కడే। సరసీరుహనాభ పొందు సంపాదింపc *
వ॥ నామనంబును దమ్ములతలంపును నీవెఱుంగుదు ధృతరాష్ట్రుల చందంబును భీష్మద్రోణ విదురాదుల చిత్తంబులు
నెఱింగి వచ్చితి మాకు ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యంబు నిశ్చయింపుము నిన నారాయణుండట్లనియె * ఉ॥ యుద్ధమ కార్యకా
ర్యమున నొండొక టెయ్యది గల్గుc జెప్పుమా । బుద్ధులు చెప్పువాక్యములు పోలవిసండన నేలయట్టిచో। బద్ధనిc జేయcజూచెన
నుcబట్టి సుయోధనుcడిలకనయ్యసంబద్ధునితోడ సంధికినుపాయము నామదిcదోcపదెమ్మెయిc * వ॥ అని చెప్పి విదురుc
డేకాంతంబున నాడిన మాటలును భీష్మద్రోణబాహ్లీకాదులగు పెద్దలకు ధృతరాష్ట్రుల దెసం బుట్టిన క్షోభంబును గుం
తిగౌరవ్యులు వినంబలికిన పలుకులును బ్రకటించి ధర్మపుత్రు పైc బాపంబు లేకుండ దెలిపి సమరంబవశ్యకర్తవ్యంబుగాని
శ్చయించెనట్టియెడc దమ్ములన్న మొగంబునcజూడ్కి నిలిపి యూరకుండిరతండు వారలc గలయం గనుంగొని యిట్లనియె * ఉ॥
కౌరవకోటి చేత మనకిప్పుడు పాటు దలంపు వచ్చినం । గ్రూరవిచేష్టితంబునకుc గొంతియెడం బడె బంధువర్గమున్। ఘోరము
గావధించుటకుc గొల్లొనకున్నది బుద్ధి మీరుని। ర్ధారణ సేయcడా పిత మధర్మమునయ్యెడు వృత్తమెట్టిదో * వ॥ అనిన వివియ
ర్జునుండతనికిట్లనియె * చ॥ హితమును ధర్మముం దగవునిట్టిది నామనమేను నేర్తును । చ్యుతుcడు సమస్తధర్మపరిశోధకుc
డావిదురుండుc బాండుభూ । పతిసతియుc దగంజెలుకు పల్కుల సందియమెల్లc బాసెని। ట్లితcడు రణంబు సేయcడనిన నింకవి
చారములెల్ల నేటికిc * గీ॥ అనిన నట్లకాక యఖిలధర్మజ్ఞాన। ఘనుcడు మనకు నేడు గడయcదాన। శౌరి నిశ్చయింప సంశయం
బేటికి। సంఘటింపుcడుగ్ర సమరవిధము * వ॥ అని యుధిష్ఠిరుండు తమ్ములతో నెట్టకేలకుం దెసువ చెప్పె * క॥ బాహుగర్వము
వివిధవ్యూహవిధిజ్ఞతయుc గలిగియొక్కరుండేడ । క్షౌహిణులు నడిపి భీష్మో । త్సాహమునకు నోర్పు చాపధరుcడెవ్వcడొ
కో * వ॥ అట్టివానికి వాహినీనాయకత్వంబిచ్చి యభిషేకంబు సేయవలయు * గీ॥ అనిన సహదేవుcడిట్లను నధిపపుత్రపౌ
త్రసోదరవంతుండు బాహువీర్య। ఘనుcడు మనకాప్తcయcబయిమని చెమత్స్య। దేశపతిగాcడె సేనాపతిత్వమునకు * వ॥ వి
నవుడు నకులుండు * చ॥ బలమును బెంపుc జేజమును బాహుబలంబును నగ్గలంబు పె। క్కులెఱుcగుc గార్యఖడ్గములకుంద
గుతొవలు ద్రోణులందు భీష్ములదెసc గోపముం గలcడనోఘపరాక్రమశాలినీ బలం। బులకధినాథుcగా ద్రుపదభూ

ధృష్టద్యుమ్నాదులకు సేనానాయకత్వంబు నిర్ణయించుట.

పతిc బట్టముగట్టుటొప్పు సుc * వ॥ అనుటయుc దదనంతరంబ ధనంజయుండు * సీ॥ అగ్నికుండమున ద్రోణాచార్యునను వా
శమొనరించువాcకె నై యుద్భవించె । రథరథ్యములు ధనుర్బాణములును దనుత్రాణ ఖడ్గములును దామలీలc । దనతోడ జ
న్మించె దహనశిఖామూర్తి భుజవీర్యవిక్రమస్ఫురణశాలి । సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుండగు ననితలc జెన నాతcడు ద
క్కనొరులు । భీష్ము తాcకోర్వరుగ్రపుబిరుదుధైర్య । ధనఘనుండు శిఖండి భీష్మునకు మృత్యు। వై జనించినవాcడు మహాబ
లుండు । దండనాయకుc జేయనతండుc దగును * వ॥ అనవుడు ధర్మనందనుండు గోవిందుం జూపి యితండు సకలచరాచర
తారతమ్యంబు వేదిc శేషించి మనకు నితని మాట విజయ మూలంబుగావు నిమ్మహాత్ముండు నిరూపించినవాcడు వరూధినీ
ముఖ్యుండు * క॥ అనుటయు దామోదరుcడి । ట్లను ధృష్టద్యుమ్నుcడగ్రుcడగు నభిషేకc। బొనరింపుము పేర్తొలగ। మునన

క్షౌహిణులకెల్లముఖ్యుఁడుగాఁగ * క ॥ సురగంధర్వఖచరకిం।పురుషాదిసమస్తదివ్యభూతంబులబం।ధురభూరివ్యూహంబుల।విరచనములనెఱుఁగునితఁడువీరోత్తముఁడౌ * క ॥ నీయొద్దిరాజులందఱు। ధీయుక్తులువిక్రమప్రదీప్తులయ్యె। వేయేటికిధృష్టద్యు।మ్నాయత్తము సేయుసైన్యపంతయునధిపా * వ ॥ అనినవిని యక్షౌహిణులకుం బ్రత్యేకనాయకులనునీవనిర్దేశింపుమనుటయునతండు * గీ ॥ సేనసంఘమునుగలవారు లేనివారు। ననకతగువారిఁజెప్పెదనఖిలసమరపండితులనెట్టివారికిబలములేదు। నధుపఁజూలించియభిషేచనంబొనర్పు * వ ॥ అనిననట్లచేయుదువాగెవ్వరెవ్వరుని నూపింపుమనియడిగినఁగుంతీనందనునకు దేవకీనందనుం డిట్లనియె * సీ ॥ పటుపరాక్రమనిధిపాంచాలపతియునమానుషతేజుండుమత్స్యభూవిభుఁడు। శత్రుభీకరమూర్తిసాత్యకియునుజరాసంధాగ్రతనయుండుశౌర్యఘనుఁడు। సహదేవుఁడునుధైర్యశాలియాదవశిరోమణిచేకితానుండుమహితవిభవ। ఖనియగుశిశుపాలతనయుండు దోర్దర్పధుర్యుండుదృష్టకేతుండుసమరలంపటుండుశిఖండియులావువెరవు।గలరునీమెచ్చనసురక్తిగలుసాలఁ।బెంపుగలుసుక్కుముట్టినటింపఁగలరు। కోరిపతులుగఁజేయుమక్షౌహిణులకు * వ ॥ అనిదండనాథులనిశ్చయించి వెండియుం * క ॥ నుసైన్యమునిస్సార। బకయఁగనీబలములెల్లనతిగృధ్నులునీ।వరవాయిఁగొనకనడుపుము।ధరణీశ్వరసేనముఖముదైవమునీకున్ * క ॥ నీయనుజులుదిఃజులకునజేయులుధృతరాష్ట్రసుతులఁజెలుచుటవ్రేఁగె।తోయజనాభముగజలీ।లాయత్తముగాదెయొత్తుమాహవమునకున్ * వ ॥ అనినిర్ణయించి నారాయణుండునిజనివాసంబునకుంజనియెధర్మతనయుండును దమ్ములుందానును బ్రియంబంది రాత్రిసుఖనిద్రచేసి రేపకడఁబాండవాగ్రజుండనుజదనుజాంతకసామంతమంత్రిపురోహితసహితంబుగాఁబేరోలగంబునమండిసమస్తపరివారంబునువినఁగార్యనిశ్చయంబుఁదెలియంబలికితగువారలతోసముచితసంభాషణంబులుచేసి మహనీయమహిమవెలయం బుండరీకాక్షుపనిచినట్లుపాంచాలనాథప్రముఖులనక్షౌహిణులకునధిపతులుగా వేఱువేఱ యభిషేకించి శ్వేతవంశజాతుండగుటంజేసిశ్వేతుండనఁబ్రఖ్యాతుండగుధృష్టద్యుమ్ననకునుత్కృష్టప్రకారంబున నభిషేకంబొనర్చిసర్వసేనాధిపత్యంబునకుంబట్టంబుగట్టి యయ్యైనమంద్రనుదక్కటిదొరలనుంగనుంగొని మధురవాక్యంబులనగ్గించికౌరవులతోడికయ్యంబునకుఁగురుక్షేత్రంబునవిడియంబోదమనిచెప్పి వారినెల్లధనంజయునకుంజూపి * ఉ ॥ ఎప్పుడునెయ్యెడంబొదివిపింపంనఱుసుండవగనీవుకటికికి। తెప్పయుఁబోలెమాటయినెఱింబనులారసియొజ్జచాప్పనం। జెప్పవవీరిబుద్ధిగానిచేయుముకార్యమునీమరతుగా।నిప్పరమేశ్వరుండుగలఁడిచ్చుశుభంబనిచూపెఁగృష్ణునిన్ * వ ॥ ఇట్లుగాంభీర్యధుర్యుండైనయుధిష్ఠిరుండువరిష్ఠప్రభువులచిత్తంబులారాధించి సర్వజనసమ్మతంబుగా సమరోత్సాహంబుచేసి మహోల్లాసంబునఁబ్రస్థానభేరిసముఖవంబందిన * సీ ॥ పేరెండదాఁకినబీటలువాఱెనవచ్చిగోడలమాడ్కిఁబగిలెదిశలు। కాఁగినయెసగులకరణనిబొరిఁబొరిశరనిధులుప్పొంగిపొరలఁబడియెఁ। గిలమునుపైఁగీలించి గాలికెత్తినచాపఁ బోలిమిన్నంతయుబూరటిల్లెఁగులపర్వతావళిపలిశభయంబునబెదరివాపోవుచక్కెమరుసెలఁగె। ధాత్రికుమ్మరిసారెవిధమునఁదిరిగెఁ। జిత్రరూపులభంగినిశ్చేష్టితంబు।లయ్యెసర్వభూతములుఁబ్రయాణభేరి।భూరినిష్ఠురఘోరభాంకారపదర * వ ॥ ఇట్లు ప్రస్థాన

పాండవులు కౌరవులతోడి యుద్ధంబునకు వెడలుట.

భేరిసెలంగ సకలసైన్యంబులు దండనాథ సమేతంబుగాసన్నద్ధంబులయ్యెమఱునాఁడు * ఉ ॥ భూరివిభూతిఁబెండ్లికినిబోవుతెఱంగునఁబాండునందనుల్।దారునుబుత్రులుగాహరియుఁదమ్ముఁడునుజ్జ్వలచారులీలస్నం। గారముచేసిసన్నదజనికాసమెలగ్పఁగవీరసంభ్రమో। దారసముద్ధతిఁజనిరిద్రౌపదియున్నెడకుండఁబోదగన్ * వ ॥ ఇట్లుచనియమ్మహాదేవినామంత్రణంబుచేసి తత్ప్రభృతిపుణ్యస్త్రీకరకలితలలితాక్షతంబులుగైకొని విప్రాశీర్వాదంబులుచేకొనుచుభద్రపాఠకశ్లోకంబులాకర్ణించుచు శోభనపదార్థంబులుగనుంగొనుచు నాంగికమాంగల్యసూచకంబులు సేకొనుచు వెడలునప్పుడు * క ॥ తగుశంఖకాహళాదిక।మగుమంగళతూర్యసంచయముగంభీరం। బుగమ్రోసెజయముఁదెలుపుచు।జగతీశ్వరుమ్రోలవాకసముదీటుకొనన్ * క ॥ మనుమునిజయప్రయాణం। బనుమోహంపంగనాసుధాంశుఁడుచనుదెం।చినకరణిగొడుగుకుంతీ।తనయాగ్రజుపాలవతిసితప్రభనొప్పెన్ * వ ॥ అట్టియెడనమ్మహీవల్లభుండు * క ॥ ఉచితగజేరివంది।ప్రచయముకీర్తింపనెక్కెరథముఁదోనరగ। ఖచియించినవజ్రంబుల। రుచులనుబొలుపారుసీవురుబుజె

రయంగన్ ॥ తదనంతరంబ ॥ సీ ॥ వక్షస్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావు గెడలవా గెలుధరించి । నెగలపైహరి యొప్పనగచరకేతువు మెఱయంగ నరదంబు మెఱుఁగులడర । దివ్యకిరీటంబుదీప్తులు భూనభోంతర మెల్లఁగలయంగఁబరఁగుచుండ । గాండీవతూణయుగ్మమ్ము పూర్వాపరభాగంబులకున వాభరణములుగఁ । దెలిమొగముతోడ నల్లనే తెంచియెక్క । పార్థుఁ డేమనఁ బొడసూపి భూపతికి మ్రొక్కె । దేవదత్తంబు పూరించె దేవదేవు । పాంచజన్యంబు మున్నగాఘల్లుమనఁగ । ॥ భీముండుంగవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో । ద్దామస్ఫీతరుచు లెవ్వెలుంగ రథసంతానంబుల నుండి ॥ శా ॥ భీముండుంగవలుంగుమారులునుసంప్రీతిన్గదాద్యాయుధో । ద్దామస్ఫీతరుచుల్వెలుంగరథసంతానంబుల నుండు ॥ భూమీశుంగని యగ్రభాగమున కొప్పం బెంపు మ్యోజ్జ్వల । శ్రీ మిన్నంది గవచ్చి శంఖములు గర్జిల్లంగ బూరించుచున్ । చెలువొందన ధిపు నుంజేయుచున్ ॥ క ॥ నిలిచిరి తక్కటిదొరలును । బలుమానుసులును మహాగ్రభంగి సవరణల్ । అప్పుడు పాండవాగ్రజునకభిముఖంబుగాఁ జనుదెంచి ॥ క ॥ సాష్టాంగ మెట్టున నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్ ॥ ఆగ్గిసమరా । వష్టంభంబొప్ప దివ్యవాహనలీలో । త్కృష్టగతి న్మంగలి య్యై । దృష్టద్యుమ్నుండు వాలిచె దేజోత్సహిమన్ ॥ వ ॥ ఇవ్విధంబునఁ జాగు భీషణంబుగా సన్నద్ధుండయి యుధిష్ఠిరుండు గదలి శుభశకునంబులు సేకొనుచు నడచె వెట్టిన సమయంబున నెల్లవారి పరిచారకులును శకటాది సకలసాధనంబులును బటగృహంబులును మొదలుగా వలయు వస్తువులొడఁగూర్చి వెడలిన దండు పటుపయి సముద్రంబుగాఁ బువ్వొవు చందంబయ్యెనట్లరిగి ధర్మపుత్రుండు కురుక్షేత్రంబు దరియఁజొచ్చి ఋష్యాశ్రమంబులకు దేవబ్రాహ్మణాయతనంబులకు నలజడిగాకుండఁ బరిహారంబు సేయుచుఁజని స్వచ్ఛకాష్ఠజలసమృద్ధంబయి తగియెడు సమస్థలంబున హిరణ్వతియను పుణ్యనది పొంతపడిదలగా నిరూపించి యచ్చో నిలిచె దవసరంబున ॥ గీ ॥ విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ । బాంచజన్యంబు ధర్మజవార్థులాది । గాఁగఁ దమతమ వీరశంఖంబులెల్ల దొరలు నెత్తిరి దిపిమ్రోఁతదూటుగట్ట ॥ వ ॥ తదనంతరంబ యొక్కరమ్యప్రదేశంబున రాజమందిరంబును నుచితస్థానంబుల సమస్తజననివాసంబులునై రమణీయబంధురంబును సింధురాశ్వశాలామాలికామనోహరంబును గావించెల్లపడి సేవీటి చుట్టును దిరిగి నద్ధృష్టద్యుమ్నుండు సురక్షితంబు చేసి వచ్చె రాజును దొరలును దమ్ములును సకలపరివారంబును దగిన తెఱంగున నుండిరి నానావస్తుబహుళసంభారంబుల మహోదారంబగుచుఁ బాండవస్కంధావారం బునహనీయాకారంబున నొప్పెనంతనక్కడ ॥ క ॥ చారుల చేనంతయు విని । కౌరవపతి వినని యుట్లకగ్గామలతోఁ । బేరోలగమున పిగతవి । కారుండై యిట్టులని యెగర్వమెలర్పన్ ॥ క ॥ తనవచ్చిన కార్యము మని । మనుకూలతఁ జేయకున్న హరియలుక మెయిన్ । జనియెం బాండుతనూజులు । మనముఁ గినుకూననట్టి మాటలు సెప్పన్ ॥ చ ॥ మునుమన చేత భంగపడి మ్రుచ్చరియుండుటఁ జేసి పాండునం । దనులును నెత్తి వత్తురుచితంబుగ సంగరమెట్లు గల్గుఁ బే । ర్చినబహుసైన్యముల్ బయలఁ జేరఁదగస్వడియింత మెల్లిదం । డని పురిఁ జాటఁ బంచి దొరలందఱు సంబడి సేయుఁడే డ్డెఱన్ ॥ వ ॥ మనకు విడిదల కురుక్షేత్రంబని పలికి దుశ్శాసనుం జూచి నీవును గర్ణుండును గాంధారపతియును సమస్తంబును సమకట్టుండనుటయు వారలు ప్రియంబునం బని వూని వెడలి దండు సాటించి తగువారలకెల్ల నెఱింగించి పుచ్చిన సకలపరివారంబును బ్రమోదంబునొందె భూవల్లభుండును గొలిచి యున్న వారలం బోవం బంచి వలయు నెడకుం జని తగనవర్తనంబున నుండె నట్టి సమయంబునఁ బ్రయాణోచితంబులగు బహుప్రకారవ్యాపారంబులయందుఁ దత్పరులైన దొరల నానాచేష్టితంబులను గరితురగరథంబులకు సవరణలు సమకూర్చు చతురపరిచారకుల సంభ్రమంబునను వివిధాయుధంబులు రవణంబులు నాయితంబులు సేయఁ బ్రవర్తించు పదాతివర్గంబుల సంరంభంబులను నవ్యైసతకులు పయనంబునకనువు సేయు బలుమానుసుల తిరుగుడు వడుటలను బురంబు సమరోత్సాహంబునఁ జంద్రోదయంబునకు మహార్ణవంబును బోలె ఘూర్ణిల్లుచుండె నంతనయ్యాపతదిన ముఖంబున ॥ క ॥ త్వరితగతి సముచిత । కరణీయములాచరించి కమనీయాలం । కరణోజ్జ్వలుఁడై యెలమిం । గురురాజేతెం

## దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట.

చెంగోలువు కూటంబున కున్ ॥ ఇట్లు వచ్చి దుశ్శాసన ప్రముఖనిలఖిల సహోదరపరివృతుండై యుండె ॥ సీ ॥ అరిభయంకరుఁడు ద్రోణాచార్యుఁడును రణోత్సాహలంపటుఁడు రాధాసుతుండు । శరతత్త్వవేదియశ్వత్థామయును భూరిబాహావిలాసుండు బాహ్లీకుండు । శౌర్యవైభవశాలి శల్యుండు మైత్రీసంపన్నదిగ్గజుఁడగు సుయోధనుఁడు నతులశక్తి । సాగదుర్జయమూర్తి భూరిశ్రవుం

డును దర్పోజ్జ్వలుండు గాంధారపతియు । నుగ్రతేజుండు కృతవర్మయును బ్రతాపఘనుండు కాంభోజుండును బరాక్రమ
ధనుండు సింధురాజును బతులుగాం జేసెం గోరి । కొనంగం దగువారలగుదురక్షౌహిణులకు * వ ॥ అని మది నిశ్చయించి తత
గనండు అంబిల్వంగం బంచి వారితో నపనిమాటలాడి వినయంబునం బ్రార్థన చేసి మీరలీ యొనరిన సైన్యములు పదునొకొంటి
కిం బ్రాభవమాచరింపం జొచ్చిన సకలంబునొప్పునభిషేకము గైకొనుండుత్సవంబుగక * క ॥ అనవుడు నందఱు నొగా
కనిసంతసమందనధిపుండభిషేకించెఁ జనులెల్ల సంప్రమోదం బునం బొదలంగ నప్పుడతివిభూతి ప్రభలక * వ ॥ ఇట్లుమ
హాపసమాన వెలయనక్షౌహిణీ నాయకుల సముకట్టి రాజరాజు పితామహునిపాలికి వారిం దోడ్కొనిచని సవినయంబుగానతని
కిం బ్రణామంబు చేసి వారలం జూపి వీరలమున యక్షౌహిణులు పదునొకొంటికిం బతులం గావించితి నిన్ని సైన్యంబులు నొక్క
లావున వర్తించుచందంబు చూచి కొనవలయునని చెప్పి చేతులు మొగిచి యిట్లనియె * చ ॥ నెఱిబడి యాజిని మ్మొనలు నే
రవుగూడి తగంజరింపనిం । దఱిమిన సొక్కమైచనక తప్పంగదా బహుదేశవాసులం । దఱునని సేయు హో వెరవు సప్పక చె
ల్లుటయొట్లుగల్గుని । త్రైఱంగొకచాలు వానిబలుతీర్పునంగాక పొసంగ నేర్చునె * గీ ॥ అమర సైన్యములును దమయంత వర్తిం
ప నేరవునికి నాకుమారు మొగము । గానొనర్పవల సెంగా దెసమస్తసేన । నలమునీవయరసినడపవలయు * క ॥ తారలకు
ను జంద్రుని గతిం గౌరవులకు మేటివి వకావున నీవి । భారంబు వూనిమముంగడ సేరువడసునెమ్మి యిం బ్రసిద్ధచరిత్రా * గీ ॥
సర్వసేనాధిపత్యంబు నిర్వహింప । నీవు దప్పనింకొక్కరు నీవయరసి । పంపు మాకలం డేవరక్షింపు మమ్ముం । బూని పట్టంబు డా
ల్పుముపొడిచి గెలుము * వ ॥ అనిన విని గాంగేయుండు గాంధారేయున కిట్లనియె ॥ గీ ॥ మీరుం బాండుసుతులు నారయ నాకొ
క్క రూపకార్యమున్న రూపు పలుక । వలయుంగయ్యమైన వత్తు మీలోన నా । యునికిచందమునకు నుచితమదియ * క ॥ సే
నాధిపత్యము నుదగం బూనెదననుమారొకనంగం బురుషుల నుర్విం । గానంగిరీటికొకనికి । నే నోర్వన తండు శతము లెక్క
డెఱుంగుక * క ॥ పెఱవారి నెల్లం డరమిడి । నఱుకుదుంబాండుక్షితీశనందనులను రూ । పఱంజేయం జేతులాడవు । దఱుమ
రు నామీందనత్యుదగ్రత వారుక * వ ॥ అప్పటికిం దగినభంగి యయ్యోధుని యట్లుండెదననిపలికి మఱియు నిట్లనియె * గీ ॥ మును న
కర్ణునొండెదనెన్నండెగయ్యంబు । సేయంబనుపుమిట్లు సేయువాండ । వైనంగాని సకలసేనాధిపత్యంబు వూననేరంజు
మ్ము భూపతనయ * వ ॥ అనినం గర్ణుండు కౌరవపతికిట్లనియె * క ॥ ఇప్పుడు క్రొత్తగదీనిం జెప్పంగా నేలమున్న చెప్పితిం గాదే యె
ప్పుడు భీష్ముండు వడునే నప్పుడ నికివచ్చువాండననిసభలోనక * గీ ॥ అనిన నట్లకాక యనిసర్వసేనాధి । పత్యభారపట్టబంధ
మునకు నియ్యకొనియె భీష్ముండయ్యగ్గలికం గొని । యాడెం భుజప్రముదితాత్ముండగుచు * క ॥ భేరీమృదంగశంఖములు లా
రవములు సెలంగం జేయుండని పనిచి మహాహో । దారపతాకామ్యస్నవ । గౌరవములు నడిపె నెల్లకడలం బురిలోక * వ ॥
ఇట్లు పట్టణాలంకారంబొనరించి రత్నకాంచన కలధౌతమయంబులగు కలశంబులం దీర్థజలంబులు దెప్పించి మణిప్రకరంబు
నంగుసు మనికరంబున మంగళతరుప్రచయంబున మహౌషధి నిచయంబున విహిత మంత్రంబు లనుచిత తంత్రం
బుల ఋత్విక్పురోహిత సహితుండై తత్సంస్కార ప్రకారం బాచరించి * క ॥ గురుండును గృపుండును నల్గనసు । సురులను
మోదింపబాహ్లికుండు మొదలుగా । గురుజాతి యొలర్పంగన । న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెక * గీ ॥ ఇవ్వి
ధంబున నభిషేకమెలమిం జేసి । వరమభక్తి నక్షౌహిణీపతులం జూపి । వీరికిని సైన్యములకును మీరయొడయ । లను
చుం బట్టంబు గట్టె శంతనుతనూజు * క. ॥ అత్తఱిం బాషాణంబులు । నెత్తురు నెమ్ములును గురిసె స్ఫురదనదా । యత్తమయిన
భము పిడుగులు మొత్తంబులు వడియె నగరమున నెల్లెడలక * క ॥ దానికి జనులుత్సాహవిహీనతం బొందంగం గౌరవేంద్రుం
డు నానా । దానాదులయిన శాంతివి । ధానములొనరించి యానతత్పరమతియై * క ॥ తల్లియుం దండ్రియు వెఱంగునం బుల్లవ
డంగ వారికడకుం బోయి తడయంగా । నొల్లక పయనము వీడ్కొ । లెల్లను వనయుచ్చుం దెల్పియిట్లనియెం దగక * గీ ॥ గెలువుమనివ
న్నదీవింపవలయుందల్లి యనుచు గాంధారికిని మ్రొక్కి వినతుండయిన । నెచ్చటను ధర్మముండు నచ్చటికిని జయమగు
నటంచు నప్పుడా సాధ్వి యనియె * వ ॥ అనవుడు * గీ ॥ వెడలి తమ్ములుం దగువారు వివిధభృత్య । గణముం దానును నేల గ్రక్కద
లంగడలి । రాజరాజు గాంగేయుం బురస్కరించి । కొనిసముద్ధతి నడిచె దిక్కులు వడంక * వ ॥ నడిచి కురుక్షేత్రంబు దరియంజొ
చ్చి యందొక్క రమణీయ ప్రదేశంబు విడిదలగా నిరూపించి నిలిచి భానుసూనుండును దానును మెలంగి యెల్లవారి నవిడి

యుండినదుష్టజనివాసంబుగావించినఁ గౌరవేశ్వరసహోదరు వారుఁ బుమున్నువారణపురంబున నెవ్వరెయ్యెడవసియిం
యుండినదుఃఖజనివాసంబుగావించినఁ దుశాచందంబుననందంబై యొప్పెనిట్లు రెండుపీళ్లును సన్నద్ధంబులై నసమయంబున ✽ ఉ॥ సంధికనేగి కార్యము పొసంగకకృ
ష్ణుని రాకయుఁ గాసుహృద్బాంధవసంఘము క్షముగఁ బాండవ కౌరవవీరులట్టిది । క్రొంధురకంధరంబులడఁగించుబలంబు

—— ✽ బలరాముఁడు పాండవులవీడుకొని తీర్థయాత్ర పోవుట. ✽ ——

లపెల్లుతోడఁగ శౌర్యాంధత నాజకైత్రుటయు నాబలభద్రుఁడు విగ్రహనారూఢుఁడై ✽ వ॥ తివయపరివారంబు పరివేష్టింపరయి బు
నంజనుదెంచి సముచితప్రకారంబున ధర్మనందనుం బేరోలగంబునం గనిసంభ్రమాలింగనాసనార్ఘ్యపాద్యంబులనతని
చేతసంభావితుండై దామోదర భీమార్జునసకులసహదేవులయభివాదనంబులాదరించి పాంచాలవిరాటప్రముఖులను
వారలవినయంబులనభినందించియాదొరలతోఁ దత్కాలయోగ్యములైతసంభాషణంబులు చేసి యనంతరంబ వారికిట్లని
యె ✽ క ॥ కౌరవపాండవులెంత యుఁ గ్రూరతవాటించి బంధుకోటికిఁ ఖిలోర్వీశ్వరమణులకుం జేటుగఁ బోరికిఁ దెగిరిట్టి
ఘోరవుంబనియగునే ✽ గీ॥ ఇట్టిదానికి నోర్వక యెన్నఁడేని కృష్ణుతోడనేఁ జెప్పితిఁ గనిసియిరుదెఱంగు వారికిందగఁ జెప్పి
సంగతంబు సేయుమని యెంతసెప్పినఁ జేయఁడయ్యె ✽ క ॥ పలుకులపొందెఱుఁగనివా రలఁ బూజావాక్యములఁ దిరంబై
తనకుం దెలుపంగఁ దగదేయనుని । యలుక మెయిఁ సంధిచెఱిచి హరియే తెంచెన్ ✽ గీ ॥ వీరువారును సంబంధవిషయబం
ధులగుటసరిగా దెహరికిఁ దానర్జునునకుఁ బక్షపాతంబు సేయుచుఁ బాండవులను బెట్టుచోటులుగానక పట్టి క్రూరు ✽ ఉ॥
కావున వీరికిన్ జయముగల్గుటనిశ్చయమెల్లభంగులన్ । జావునిజంబు వారికిని సంశయమైయిటులుండదీని నే । ట్లేవినఁ జూ
డనేర్తుఁ దగనింత ప్రవీణులనేన చేసితిం జూవెసయోధనుంబవనసూనుని నె డొరుఁజంపఁ జూతు నే ✽ క ॥ హరియెఱుఁగనిచ
క్కటియుం గురుపార్థునునాకు నెఱుఁగఁ బోలు నెయిూని । ష్ఠురత వినఁ జూడఁ జాలక సరస్వతీతీర్థముకుఁ జనియెదఁ బుద్ధి ✽
వ॥ మీకుం జెప్పిపోవచ్చితిఁ బోయివచ్చెదననిపలికి బలదేవుండు వాసుదేవధర్మపుత్రులొడంబడియనుపఁ దీర్థయాత్ర వోయెఁ
దదనంతరంబ ✽ సీ ॥ కృష్ణునిదేవి రుక్మిణిసోదరుఁడు రుక్మియనురాజు బలవిక్రమాన్వితుండు । శార్ఙ్గగాండీవవిజయములు
నాఁగలదివ్యచాపములఁ దృతీయమైన చాపంబుగలవాఁడు సైన్యసమేతుఁడై చనుదెంచి ధర్మజుఁ గనితదీయసత్కారములు
గాంచిసముచితాసనమ ననుండియక్కాలమున నున్న వీరు । తెల్లవినఁ గిరీటికిట్లను సమరంబు సేయవెఱచితేని చెప్పనాకు నె
దురులేరు జగతినెవ్వరు నీకుఁ దోడ్పడి జయింతు నెట్టిపగఱనైన ✽ వ ॥ అనితన్నునాక్రమించితనతోఁ బుట్టువు రుక్మిణింగొని
వచ్చిన యాకృష్ణుసన్నిధిని సిగ్గులేక యాడినమాటలు వినిచిఱునవ్వునవ్వుచుఁ గవ్వడియతనియాననంబాలోకించి ✽ గీ॥ చె
నసి గంధర్వసేనని గ్రహించునపుడు । మత్స్యనాథు గోవర్గంబు మరలఁ దెచ్చు నెడను దప్పెనీ యందువయొఱుఁగనైతి నింకనేఁ
గానితోడుగ మ్మెచటికైన ✽ వ ॥ అనియతనితరమునకుఁ దగినయట్లు పలికిన నతఁడియును ✽ క॥ మున్నేనసహాయుఁడనై చన్న
గలెంజనఁ గనైనచందంబయ్యెన్ వెన్నుఁడుతోడుగలఁడు వెఱపెన్నఁడు లేదింక మాకు నేమిటికైనన్ ✽ చ ॥ వెఱచితిదో
డువమ్మనుచు వేఁడిననాఁటికివత్తుగానినా । వెఱపిటులున్నయారథికవీరులు దీర్చెదరొల్లనిన్ను నీ యెఱుఁ డకేఁగితోఁడు ప
డు మొల్లరు నెవ్వరికేనినన్న నే దైఅనతఁ జేగికౌరవపతింగనియట్టులు బెట్టునల్కన్ ✽ క ॥ అతఁడిపయేటిమాటలు నీతో
డగుటొల్లఁ బొమ్మనినరుక్మి వృథాయాతాయాతపిపణ్ణుం దైతనపురమునకుమగుడనరిగెం జెలుచన్ ✽ గీ ॥ ఇట్లుబలదేవ
రుక్ముల కిద్దఱకును గయ్యముఁ జనసాహంబుగలుగదయ్యెఁ గానితత్కాలోకమ్మునఁ గలుగున్నపతి కౌరటియిరు వాఁడుం
దునుగూడెనవికి ✽ వ॥ అట్టియెడనిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించియిట్లనియె ✽ క ॥ బవనముకీడని నె
ఱుఁగదుర్వినీతుండై నకొడుకునదలిదియొమపం । దిపిరియు నోరాడనుబెట్టి వనశంబప్పనికిమనకువగపంకేలా ✽ క॥ ఎ
య్యెదిగానున్నదియది । యయ్యెడఁ జేయునదిగలదెయవనీశులకుం । గయ్యంబునఁ జచ్చుటమే । లయ్యెప్పెడు లేస్స
గాకయదియట్లుండెన్ ✽ వ॥ రెండుపీళ్లును గురుక్షేత్రంబునవిడిచిన విధంబుట్టిన విశేషంబులు గలవేని యెఱింగిం
పుము ✽ గీ ॥ అనినసంజయుఁ డిట్లను వకటకొడుకు మీఁదఁ దప్పెల పెట్టనీ మీఁదికొఱత నీకుఁ గానఁ గావచ్చు నెనీవెఱుంగకుం

—— ✽ సంజయుఁడు ధృతరాష్ట్రునితో నులూకుఁడు పాండవులనాడిన మాటలు చెప్పుట. ✽ ——

డఁబలుచు నెయ్యాతండు పాండుసుతుల ✽ ఎ॥ ఆపనికడవంబడియొవారలు పనియెదవేనివినుము దుర్యోధనుండు దుశ్శాసన

నికగ్గులతో విచారించియాలూకుఁ బిలిచి నీవుపోయి పాండవులం గని వాసుదేవు సన్నిధిని బాంచాలవిరాట ప్రముఖులువి
నంబలుకుమని చులుకనివరుసనిమాటలుగఁ జెప్పి పుచ్చిననతండును * క ॥ చనికొలువునధర్మసుతుం।గని సుయోధనుఁడు చె
ప్పఁ డగాననునియమిం। చినమాటలుగొన్నిగలవు। వినుమలుగకయనినతఁడు వినియిట్లనియెన్ * గీ ॥ నీకు నెఱుఁగ నేల నిన్ను
నా ముదిమం।తుండు సెప్పుమనిన తులువమాట। లెన్నఁగలవు వాని నన్నింటి నుమాన।మింత లేక యాడు మెల్లవినఁగ * అనిన
నలూకుఁ డిట్లనియె * సీ॥ కయ్యంబునకుఁ బెద్దకాలమేని యాఁబూదిపట్టివచ్చితికడుబరవసమున । సంజయుతో మీరుశంక
లేకాడినయొకుడుమాటలు పెక్కుగలవు। భూమిభాగము గోలుపోయినయలుకకు ద్రౌపదిబన్నంపుదైన్యమునకుఁ। దగ
మగచిబంటవై తఱిమి యదిబాహుబలాస్త్ర। ద్యలుచూపననితలంచి। నిలువవలయు నీకుఁ గలవారి నెల్లను।గూర్చి మోహరింది
కొనికడంగి। నడుపుసమరమున కునడికినఁబోదింక ।దప్పఁ గ్రుంకఁ జనదు తఱిఁ జోటులును • క ॥ ఆతతబలుఁడగుభీష్ముని। చే
తిబలువుద్రోణునంపసెలలవియఁ టయుఁ।జాతురవిరెండుకృష్ణుని। చేతనసకలంబుచక్కఁ జేసికొనుండా * క॥ వార్ధిగతి
వాలమ్ములు। వారింబడియస్త్రమునకు బ్రదుకవశమె మీ। వారెల్లనెఱుఁగరేయా । వీరులది వ్యాస్త్రశస్త్రవిభవసమృద్ధిన్•
అనిభీమసేనుఁ జూచి • క॥ ఈవాయుపుత్త్రుఁ డాజిం। గ్రావును నేడుస్ససేనురక్తంబనియెం। ద్రావంగ శక్యంబే నిం।ద్రా
పుమనంగా దెయింతకఁదడవేమిటికిన్ * క॥వినుమూతికప్పవిధమున। నినునీవెయెఱుంగు దెఱుఁగ నెరవు గర్వం। బునవావ
లికొలఁదికంబున నొకమఱిపట్టువడకపో నేర్చెదవే• అనిపలికిసవ్యసాచిం జూచి • గీ ॥ వినుము గాండీవమను నొకవిల్లు
తాటి। పొడవుగలిమియుఁ గృష్ణుండు పూనితోడు।గూడుకొనివచ్చుటయు నెఱుంగుదుము వీని । కెల్లశంకింతుభూమిపాలీము
గాని * క॥పవనజుగదయును నీగాం।డివమును నెటఁబోయెనంగడికిఁబాంచాలిం।దివిచికొనివచ్చు నెడఁబరి।భవమెఱుఁగవె
బీర మేలపలికెదు దోడ్తోన్ • చ ॥ వలలుడవన్విరాటుకడవంటలవాఁడయి భీముఁడుర్బృహ।న్నలయన నాఁడు పేడివయి
నానయొకింతయు లేక నీవు। గలసుసుదైన్యమొందికడుఁ గాఱియఁబొందితి రుర్విఁ యేలునా। నలఁబడిసవ్యసాచి యిదిశౌర్య
మొ బాహుబలంబొ చెప్పుమా * ఉ॥మాయలునింద్రజాలములు మాధవుఁడిందునఁ గొన్నవన్నినం । బాయుపురజ్జు లెప్పు
డునవారణనీవెటులాడి చేసియు। న్వేయును నేలపాగ్గులు నొవిష్ణులువేపదివేలు వచ్చినన్। జేయుదు మేము గయ్యమొకచీఱి
కయైన ను బంటు ఇయిత్తునే * అనినకులుఁ జూచి • క॥ దామగ్రంధియనంగా। వేమిడికొనిపిరటుగుఱ్ఱములఁబట్టుచునీ।వా
మెయినుండితిరాజ్యము। పైనుమఁతనుగాక నీకుఁ బౌరుషమేదీ • అనిసహదేవుం జూచి • క ॥ వెడదంత్రీపాలుండవు।గడు
హీనతవిరటుపసులఁగాచితినొనీ।పుకమిఁగలనే మొయనుమా।నడికొర్చితి గాక నీకు శౌర్యముగలదే * వ ॥ అనిభీమార్జు
ననకులసహదేవులం దొరులఁ జూచుచు నాననంబులుచలింప మొగంబులు జేవురింపఁ గ్రోధాయత్త చిత్తులయియున్నం
గనుంగొని నవ్వుచు నారాయణుండులూకునకిట్లనియె నీవుపోయి సుయోధనుతో నెల్లవారలు వినుచుండనిట్లనుము • గీ॥ బ
వర మెల్లియబిసవైవై బరవసంబు।గలిగి నిలువుము చావక తొలఁగ గాదు । కృష్ణసారథికంబగు జిష్ణురథము । తొడరి నీవెంటఁ
జొచ్చినఁ దోనచొచ్చు * క॥రిత్తలురజ్జులవాఁడే।మత్తగజాయుతబలుండు మారుతియనిను।వృత్తుండగు మశ్శాసను। నె
త్తురురము వ్రచ్చి త్రావునీవుం జూడన్ * వ॥అనియిట్లుహరి పలికినయనంతరంబ యర్జునుండులూకునకిట్లనియె * క ॥ వారు
గలరు వీరుగలరు । పోరికిననిచెప్పెదీవుపొంగారుచుమీ। వారినిమిమ్మును రేపుగ । దారూపేర్పడఁగఁ జూచెదం గితవసుతా•
తనభుజశక్తి లేక యొరు దర్పమునయ్యాఁ దిపరాక్రమింపవ। చ్చినసదిచెల్లు నేకులపిశిష్టుని సుంత్రతువృద్ధు నార్యు భీష్ముని నె
నకొల్పి సేనలకు ముఖ్యుఁడవీవని యుబ్బఁ జేసియు। నునదలపెట్టి చంపికొనఁ జూచెను యోధనుఁడింత నేమునన్ • చితవ
తలఁపెట్ల భీష్ము భుజదర్పము లోకముకంటె నెక్కుడు। తననొకభంగినంపగొనితప్పముఁ జావు నకంచునున్నవాఁ। డనిఁ ద్రో
ణుస్సగొండు మురయంబున నాతని వెండి ద్రోణులం। మనము ముదమ్మపుసూతసుతుఁ దోలుదుమంతటవాసమానెనన్ * క॥
అనుజులతనుజులచావులు। గనుఁగొనితఱితానుభీముగదచేనిలఁగూ । లినయప్పుడె నదుర్యో।ధనుఁడుమదిందలఁచుఁ గాక
వినుమప్రతముల్ * వ॥అదియట్లుండె నీవు వేగపోయి రేపకడమీరాజుం గలనికి నడిపింపుమనియె నవ్వాసు ధర్మనందనుండు
సూసునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి దృష్టద్యుమ్ను నవలోకించి యెల్లియ్య బనిమన సైన్యంబుల కెఱుం
గనిసర్వసన్నాహంబులు సమకట్టుమని పనిచి కొలువు విరిసచనియె దృష్టద్యుమ్నుండును ద్రోణుఁ దునత్వంబడసిరి

యుబ్బుచు వేడ్క లెభీష్ముం దలపడఁ గంటినని యుప్పొంగు శిఖండితోడుగా రాజశాసనంబుఁ ద్వరితించె నిట సుయోధనుం డు
వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునుల పలుకులున్న రూపు విన్నవించిన నతండు కన్నుదెఱఁగసుం గొ
సమస్తసేనలకు రేపు బవరంబని చెప్పి పుచ్చుము సకలసాధనంబులు నాయితంబులు సేయుమని పనిచిన నతండు నట్ల చేసె ని
ట్లుభయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లెనని ధృతరాష్ట్రుండు సంజయునకిట్లనియె * క॥ విను ము
హరితోడుగల యర్జును గెలువఁ బితామహుఁ జొప్పడునే యా। పనిఁ బలుపుము లూఁకనిచె । ప్పిన మాటల కేమియు నిర్వపిప
వఁగొలుపుర * అనిన వినియఁ బికానందనునకు సూతనందనుం డిట్లనియె • గీ॥ అయ్యులూకు పలుకులన్నియు విని భవత్సైన
యుతోడ నిట్టులనియె భీష్ముఁ। డేను గెలుగ వెఱవ నేటికి సేఁకలఁ। గాతు నీవు మెచ్చఁ గౌరవేంద్ర * క॥ నడిపింపఁగఁ బొడిపిస్సిపఁ
గ। నెడమఃడు వైకలఁగినప్పు డేర్పఉపఁగ నేఁ। గడు నేర్తుఁ బేర్చు వాడను। కడిమియనీ సైన్యమునకు గపిసేన గాదె * క॥ అనినం
గురురాజిట్లను। వినుము పితామహ మహాస్త్రవిత్తములనఁగాఁ । జగ నీవును నాచార్యుం । డను గలుగఁగ నాకు నెన్నఁడు
నువెఱపేలా * గీ॥ పనుగంధర్వకిన్నరదానవాది। దివ్యభూతంబులకును భీతిల్లనని నఁ। బాండుపుత్రుల మాత్రకు భయము
నాకు। నెక్కుడిది వ్రేల్మిడి నవారి యుక్కు మడఁతు * అని పలికి మఱియు నిట్లనియె * క॥ నీయందు వారియందుఁ। జేయంగలవా

* భీష్ముండు దుర్యోధనుతోఁ గౌరవులలోని యతిరథ మహారథాదుల నిరూపించి చెప్పుట. *

నుసల విశేషంబులఁ జిత్తాయత్తంబుగఁ జెప్పుము। నీవేఁటుఁగని యపియు లేవు నిక్కపుఁ దరముల్ • క॥ అనవుడు నీవిట్లడిగిన,
విని యూరక యుండఁదగదు పినుమేర్పడనె। ల్లను నున్న రూపు సెప్పెద । మనవారల వారి వారిమానము లధిపా * అని గాం
గేయుండిట్లనియె * సీ॥ నీవతిరథుఁడవు నీతమ్ములందఱు సమరథశ్రేష్ఠులు సమరమునకుఁ। బరుసనివీరులు పాంచాలసేన నిర్జిం
తురు నను నేన చెప్పికొనఁగ । నేరనాయే ద్దె అమీ రెఱుంగుదు సుభోజాగ్రణి కృతవర యతిరథుండు । దృఢవేదియాతండు
దీర్చు నెంతటిపనినైనఁ గైకొని శల్యుఁ డతిరథుండు। వాసుదేవుతోడి యీసువాఁ డల్లుర । పిడిచె నిన్నుఁ గూడి విక్రమమున॥
బేరుకొనఁగఁ జాలు భూరిశ్రవసుఁ డతిరథుఁడు సుమ్ము మేటి రణములోన। అని పలికి మఱియు నిట్లనియె • క॥ విను సైంధవుఁ
డు మహారథుఁడని బోక పెనంగు నతని నా ద్రౌపదికై । పెనుపఱిచి జిచిరి కుంతీ। తనయులవారలకెదుర్పఁదనము జేసె •
వ॥ కాంభోజరాజగు సుదక్షిణుండు సమరథుండతని పాలశభబృందంబులు మేలుగలుగుఁ బాండవబలంబులం గలంచు మా
హిష్మతీపతియగు నీలుం డతిరథుండతనికి సహదేవునకుఁ దెగనిపగ యైయుండు ధానం జేసి యాలంబున నోలమాసగొనండ
వంతిదేశాధీశులగు విందానువిందు లగ్రథులు పరస్పరస్నేహంబున సాహసికులై యొకిల్లొకళ్లం బెట్టి పోవక పోరుమరు
త్రిగర్తపతు లేవురుతోడం బుట్టువులు మహారథులు గోగ్రహణంబునం బడిన బన్నంబుఁ బాపికొనం గడంగుదురు వీరికి భుజ
బలంబగ్గలంబై యుండు * క॥ సమరథుఁడు బిరుదు లక్ష్మణ। కుమారకుం డేచి మొనలఁ గోల్తల జేఁయా క్షామిము నెల్లమిసలుభ
జగ। ర్వము మదముం గలఁడు కోనఁడ రాతుల నధిపా • వ॥ బృహద్బలుండు సమరథుండు కోసలబలంబులతోడం గడంగిచి
చ్చియునన బిడికిలింత మనుచుండు దండధారుఁ డర్ధరథుండు సేనపఱుపు గలండు బెట్టిదంబుగాఁ గయ్యంబు సేయు * గీ॥ అ
తిరథుల కెల్లనిప్పటియందు మేటి। కృపుఁడు తన పెంపు వాటించి గెలుచుఁ జచ్చుఁ । గాని నాలుగు దెఱఁగుల సేనలకుమ । దివి
యుఁడిలచుక యును నరదేవముఖ్య • క॥ శకుని వినుసమరథుఁడు పాం। డుకుమారులతోడ నెప్పుడుం బగగొనివా । రికిఁ గీడు
రోయుకృత్యులు। ప్రకటబలులు గలరు నేచ్చ బవరంబునకు * మ॥ వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ
గాండీవితోఁ। బురుడింపందగువాఁడు వీని కెనయీ భూలోకసంచారులె । వ్వరు లేరీతఁడు బ్రాహ్మణుండనిన భావంబునఁ
గా నోర్వమిం। దరమూహింపఁగ లేదు కాని జముచందంబయ్యెడిం బోరులక * సీ॥ అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁడం
దలి ముందలి విలుకాండ్ర కెల్ల గురుఁడు। హితుఁడు నీకెంతయు నేచిన మొనలితం డడరిన జమరినయట్లు ప్రాంతు। వృద్ధనియిత
ని భావింపరాదని లోననంగ విస్ఫురణంబు భంగిచూడ । నగ్గుసు పైఁగూర్మి నతని నోనేయఁడు సచరాచరములైన జగములె
ల్లనొక్కమొగమై కడంగినఁ జిక్కవఱుచు। దివ్యబాణజాలంబులు దీటుకొలిపి। ప్రాణములు డాపఁడీతనిపాటిదొరలఁ గా
నమే రాజ్యములయందుఁ గౌరవేంద్ర • క॥ అతిరథుఁడు బాహ్లికుఁడు నను। మతులితబలుఁ డతని యట్ల యాత్మజుఁడును విశ్రు
తశక్తి సోమదత్తుం। డితనికి సమరంబు ... * క॥ ... హాలాయుధుఁ। డసమానబలుండు సమర

ఘాగ్రణి వినుపాండుసుతులయెడ రోషము గలఁడసంఖ్యామాయాబలమున నరులఁ గలంచుఁగా * గీ॥ వినుము ప్రాగ్జ్యో
తిషాధీశుఁ డనుపమానశక్తియు భగదత్తుండు సమరథుండు। గజము నెక్కి తా నేనికకయ్యమైన। నేర్పునైరావణము మీఁ
దిమిండుఁ బోలి * వ॥ గాంధారరాజులగు వృషకుండును నచలుండును సమరథులు మానిసితనంబు మానసులంగల

*భీష్ముఁడు కర్ణుని నర్ధరథుఁడని చెప్పుట,*

వారు మీకి సమరోపాయంబ జేయంబై యుండు * సీ॥ నీమఁద బ్రెగ్గడయును నెయ్యంపుఁ జెలియునై కయ్యంబునకు నెప్డుఁ గాలు
ద్రవ్వుఁ। బాండుపుత్రులతోడి పగకుని న్నెసకొల్పి కొలువున రజ్జులు వలుకునట్టి। రాధాసుతుం డర్ధరథుఁడు కుండలములు గ
వచంబుఁ బోవుట కారణముగ। బీఱువోయిన వాఁడు వీఁడేడి కృపయే నపరసురాముండు శాపమునవిని। యస్త్రవీర్యంబుఁ
జెడి చెనట్లగుట వీఁడు। పార్థుమార్కొని మానంబు ప్రాణములును। దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి। యెల్లవారికి నెంత
యుఁ దెల్లమధిప * క॥ అనవుడు గురుఁ డిట్లను। కర్ణుని చందము మున్న గడఁగరోయఁడు పోర। న్వైను మేదిరి నెలుంగఁడు గా। వు
ననీతం డర్ధరథుఁడవుం దలపోయఁగా * వ॥ అనిన విని రాధేయుండు గ్రోధతామ్రేక్షుండగుచు గాంగేయున కిట్లనియె * క॥
ఒంటమి లేనిది యొంటర। మింటర ములు వలుకుటు చిత మే యర్ధరథుం। డంటినను నేమి తక్కువ। గంటివి చెపుము య్యానీవు గ
న్నదిగల దే * గీ॥ నెవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల। కేను గురుపతిఁ జూచి సహింపఁబోము। సురనదీపుత్ర విను నాకుఁ జూ
డ నర్ధరథుఁడవు దీవు లావు బీరంబునరయ * వ॥ అని పలికి కొలువుఁ గలయం గనుంగొని * చ॥ హితుఁడని నమ్మఁగాఁడు గునెనీత
నిఁ గార్యపు మాటలిట్టివే। పతిఁ జెనకూర్మి నాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచును। న్నతులకు మేదినీశులకు నానఁగఁ బల్క
టగాక యిట్టివా। రితవులు తంత్రికి కీసుతుల కేమున నేర్తుము పెద్దరాజులారా * వ॥ అని దుర్యోధను జూచి యిట్లనియె * ఉ॥ కర్ణము
దప్ప నీ యెదుఁ గష్టపుమాటలు కేల యోర్తుని। దుర్జనుఁడైన శాంతనవు దోర్బల మేటికి నీతఁ డొక్కఁడు। న్వార్జితుఁడైన నేమి న్న
పవర్గము నుండుట యొంటఁ బోయినే। యజ్జునపశుపోతి యితఁ డాలము మేకొని సేయఁడుం జుమీ * గీ॥ చాలఁ గాలంబు వోవని
చతురులైన। వృద్ధజనముల బుద్ధులు విందుగాక। ముదిసి పదిదప్పి నోరికి నొకటివినట్లు। పలుకు వెడఁగుల మాటలు పాడియగు
నే * క॥ సేన మొగమీతఁ డయినం। బూని మహీనాథులాజిఁ బోడి చెదరేదు। ర్మానియనికాదె యితని। తోనడచుట కొల్లనై తిదు
రమునకధిపా * వ॥ అనిన భీష్ముండు సూతసూనున కిట్లనియె * చ॥ ముదుకఁడనైన నా భుజబలమున్ జలమున్ వివిధాస్త్రశస్త్ర
సం। పదయు చుబోయి నీ గురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా। కెదిరిన వాఁడు పెక్కండల నేఁ యిరోయెయిందుఁ జగంబు
నా। ముదిమియు నీసమారతయు మున్నెరుసన్ని జయుండెఱింగెడుఁగా * క॥ అనుమానింపక సభలో। నను నేఁ జెప్పికొనవ
లసె నాకిమ్మెయి క। ర్ణనిఖుఁడ వగు నీ యెడనీ। సునఁగీడు బలుక వలసె సూతతనూజా * గీ॥ కార్యమునకును నీయుద్ధ
మునకీవు। గలుగఁ జేటు వాటిల్లెనీ కౌరవులకు। దీనిమము భోటం లెల్లను దిర్ప నెట్లు। చాలెదము మంచి బంటవు సక్కనసుమ *
చ॥ నెపమిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవవచ్చునే। కుపితమనస్కుఁడై నసుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డలె
ల్లఁజ। న్నపిదప నెట్లు జొచ్చెమరణంబున కప్పుడు సావకున్నదై। నృపు పరివారముం బలియునైన నెఱింగెదరెల్ల చందముల్ *
వ॥ అని పలికి దుర్యోధనుఁడు పలకింపక కన్నుతో వెండియు నిట్లనియె * గీ॥ సూతపుత్రయితఁడు నాతలఁ బెద్దమో। పెత్తినమ్మి
యున్నయట్టి చోటఁ। గ్రందు సేయ నాకుఁ గాదని సైరించి యున్నఁ బ్రదికితింక నూఁగకుండు * వ॥ అనియాడి మొగంబు గం
టు వెట్టికొని యున్న సురనదీనందను దిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింపనగునె నన్నును గార్యభారంబు నం
జూచి నా ప్రయత్నమునకై సర్వంబును సహింపవలయునని తేర్చి యంగరాజుం గనుంగొని మీరిద్దరు నొక్కటిమైభరంపడియుప్ప
నిసక్కఁ జేసికొనక మీలోన నిట్టియొకవుమాట లేల యని సోదివిపనికి తదనంతరంబ పాండవ పక్షంబు వారల తారతమ్యంబు
లు విను వాఁడై యమ్మాట వుట్టించిన నతనికి భీష్ముం డిట్లనియె * గీ॥ పాండుపుత్రులనర్దెసదండిమగల। గలసిజంబేను జెప్పి
నఁ గర్ణుఁ డునను। నొచ్చునీవిత్తమెట్లగునో యెఱుంగ। నాకు నిజ యేమి పనిరిత్తనడుమనుండి * వ॥ అనిన మఱియు సుర్యోధనుం

*భీష్ముఁడు పాండవవీరులయందతిరథమహారథాదుల నిరూపించి చెప్పుట,*

డు దత్తమియడుగుటయు నిట్లనియె * గీ॥ అతిరథుండు యుధిష్ఠిరుఁ డగ్నికల్పుఁ। డాహవంబున ప్రతిహతుఁడు భీముఁ డ
తిరథశ్రేష్ఠుఁడతనిమహాబలంబు। మానుషము విక్రమంబ సమానమధిప * క॥ సమరథులుకవలు భుజగ। ర్వమున బలి ప్ర

మముదుర్నివార్యంబులు వారి సేనంబులు నిశ్చయములు తమ మొనఁ గుమించి పెట్టుదు రుదగ్రధిషా * సీ ॥ వారండఱు
సద్ధర్మవైభవంబునఁ దపస్సంపద నెక్కుడు జనుల కెల్ల । ధనువున నాలంబులను బాణతులు దాఁకో గురుపసులకు నోర్వరా
ని కొల్లలగలరు పెక్కులు పరాక్రమములు వేత్వేఱఁ జేసినవీరు లొక్కు । మొగసాయి తాఁకిన వెగడందరుండు నేమన సేన
మున్న వమానపాటు దుర్గభపాటు గలిగి తొడరంగవచ్చిన । వాసుగా నన లతిఁ బోరు ప్రాణమా సపడక రూపించంతయు
ఁజెనఁగుదు రదిసహించి నిలుచ టరిది మనకు * మ ॥ నరుఁ డీమానము వాఁ డనంగవశమే నాకంత వారెంచు నెవ్వఁడు లేఁ
క నబుట్టరాపురికి మర్వారోగ్యముండై నయా । హరి యుండో డతె యేమి చెప్పఁ జనతం డా సేనలం గాచు నెక్కురుక్షం
గీటడఁగించు నీ బలముల గాండీవదుర్దాంతుఁ డై * వ ॥ అనిన విని యక్కొరుకులపు నున్న రాజుల మనంబు లెల్లను జేవ చెడియె
భీష్ముండును వెండియు నిట్లనియె * సీ ॥ ద్రౌపదేయులు మహారథు లేవురును వారితరము యుత్తరుఁడును ధరణినాథ యతిరథ
వర్యుఁ డయ్యభిమన్యుఁ డర్జునవాసుదేవుల కైనవచ్చువాఁడు । లఘుచిత్రములు నేర్పు రావును దాన్మియుఁ గలఁడు మతం ద్రుపల
పాటువలఁచు మంఁడు । గావున బెడిదంబుగాఁ బోరు సాత్యకి యతిరథోత్తముఁడు శౌర్యాన్వితుండు । పాండవ స్నేహస
క్తుఁడై యుండుఁ గాన । నలుకమన మీఁద బెద్దయుఁ గిగిపెనఁగు । వీరలింక లుఁ బరుసని వారు సమర । ధరణినెప్పింతురీ
యోధవరుల నెల్ల * మ ॥ అలఁతిం బోరు మహారథుల్ ద్రుపదమత్స్యాధీశు లుగ్రద్భుజాబలశౌర్యాఢ్యులు పాండురాజ
సుతసంబంధప్రియస్నేహముల్ । గలిమిం జేసి తదీయసైన్యములకుం గా నెచ్చియుం జచ్చియుఁ । గెలుపింపం దమకింది
చొత్తురని కేకీభూతచేతస్కులై * గీ ॥ వీరగుణము బలము వీక్షయుఁ గలఁడు మహారథుఁడు శిఖండి యతని తమ్ముఁ డతిరథుండు
దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ డుగ్రతేజుఁ డనికి నుగ్రునట్ల * క ॥ అతని సుతుఁ డర్ధరథుఁడా ధృతవర్ముఁడు పిన్నవాఁడు
త్రిశ్మాటకాఁడై మతిహీనత శస్త్రాస్త్రప్రతతిపరిశ్రమము లేక పాలసుఁడగుటన్ * గీ ॥ చేదిభూమిభుండు శిశుపాలతన
యుండు ధృష్టకేతుఁ డధికధీరమతి మహారథుండు భోజుఁడను రాజునను జులు నట్టి వార తెంపుగలవుగలరు * వ ॥ ఉత్తమో
జుండును యుధామన్యుండును క్షత్రదేవుండును జయంతుండును నమితౌజుండును విరాజుండును సత్యజిత్తుండును నంబరఁ
గు పాంచాల కులప్రదీపకులు మహారథులు మత్తమాతంగబృందంబు చందంబున శత్రుబలంబు పయింగవిసి కోలాహలం
బుగాఁ గలంపం జాలుదురు కేకయపతు లేవురు సహోదరులు మహారథులు కిడిందిమగిలు తెంపుగలరు రథంబుల మొ
త్తంబులతోఁ గార్చిచ్చుపగిదిం బొదువుదురు కాశీశుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాస్యుండు శంఖుండు పినాటజ్ఞా
తులు మహారథులు వివిధాయుధవిద్యావిశారదులు వారి పోరు భరంబై యుండు * సీ ॥ చిత్రాయుధుండును జేకితానుండు
మహారథు లిద్దఱు నర్జును నకుఁ గూర్తురు కయ్యాన కోర్తురు నేర్తు రాయుధముల కెల్లన త్యుగ్రులవ్విధము వారచంద్రదత్త
వ్యాఘ్రదత్తులు వినుము సేనాబిందుఁ డనునృపాలుఁ డతిరథోత్తముఁడు మారుతపుత్రు నెనయఁ డొక్కండు మనసేనఁ
జిక్కువఱుచు బాండ్యుఁ డతిరథుండు బలగంబుగలవాఁడు । సమరథుండు గాంగ్యుఁ డమితబలుఁడు । కుంతిభోజుఁడాతి
కోవిదుఁ డతిరథుఁ డతని యొద్దిజోము లధికబలులుం వ ॥ రోచమానుండు మహారథుండు దేవసమానుండు * గీ ॥ అతిరథుల కెల్లఁ
దలదండ్రి యట్టివాఁడు యసురపిభుఁడు ఘటోత్కచుండు హైడింబ । కొడుకు మాయాబలంబున నొడుచు బగఁజు నతనికిఁ డ
దానవానీకము గల్గుఁ బు * వ ॥ తోఁచిన వారిం బేరుకొంటి నింతియ కాని రెండు పీళ్లను మంచి మగలు పెక్కుగ్రు గలరని చెప్పి
గాంగేయుండు * క ॥ పాండవుల దిక్కు వీరుల ఖండితబలులైన నా మొగంబునఁ బడియుద్దండతఁ జూపఁగ లేరుశి । ఖండిని
నొక్కరుని జంపఁగాసి మమారా * క ॥ అనవుడు దుర్యోధనుఁడా । తః మీరు వధింపమికిఁ గత మేమి యొకో వినఁ దగు నే
నిం జెప్పుఁడ । యన టయుట్లని యెభీష్ముఁ డతనికి నెమ్మిన్ * వ ॥ ఏ నా శిఖండినిం జంపమికి మూలంబు చాలం గలదు దప్ర

భీష్ముఁడు దుర్యోధనునకంబోపాఖ్యానంబు చెప్పుట.

పంచంబంతయు వివరించి చెప్పెద నాకర్ణింపుము * సీ ॥ శంతనుపిమ్మట సత్యవతీదేవి యనుమతితోడఁ జిత్రాంగదునకు
సామ్రాజ్యపలంబు సమ్మతిఁ గట్టితి నప్పు కాలంబున నతఁడు దివికేఁగ దత్పరోక్షావస్థఁ దదనుసంభవుని విచిత్రవీర్యుని రాజుఁ జే
సి పెండ్లి సేయంగఁ దివిరి కాశీపతికూఁతులు కన్యలు మువ్వురు గలుగుట యును । నాతఁడ స్వయంవరమున నఖిలనృ
పతులఁ బిలుపించె నది యెఱిఁగి తల్లి కెఱుఁగించి ... పోయి తినరడమె * వ ॥ ఇప్పి

ధంబునం జని యమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబికయు నంబాలికయు నను ముప్వురు ముద్దియ
లం బట్టి రథంబు పయిం బెట్టికొని రా నచ్చటి రాజు లెల్లను జతురంగబలంబులతో వచ్చిన నన్నుం బొదివిన విశిఖానలంబు వేఁడిమి
చూపి వారి నిలువరించి యరుగుదెంచి సత్యవతికి నప్పొలంతుల నొప్పించిన నదేవి విచిత్రవీర్యునకు వారల వివాహంబు సే
యను ద్యోగించె నట్టియెడ నమ్మువ్వురయందుం బెద్దయది యైన యంబ యను కన్యక నాతో నిట్లనియె * గీ ॥ సౌంభపురవ
ల్లభుండైన సాళ్వు మీఁద। దలఁపు గలదు నాకతఁడును దగులు గలిగి। యుండు వాదెస నీవు ధర్మోత్తరుండ। వతని పాలికిఁ దగున
న్నను పవయ్య * క॥ అనవిని సత్యవతికిఁ జె। ప్పిన నాయమ పనువ నంబఁ బెంపుగ వృద్ధాం। గనలం దోడుగ నప్పుడు। పనిచియని
చితిని జనంబు ప్రస్తుతి సేయఁగ * వ॥ ఇట్లు పనిచి తక్కిన కన్నెల నిరువురం బాణిగ్రహణంబు సేయించితి • క ॥ అంబయున
ట సాళ్వుని కడ। కుం బోయిన నతఁడు భీష్ముఁ గొనిపోయిన దా। నిం బడచుం గైకొన ధర్మంబే కన్యాత్వ మెడలెసగు వానీకుఁ *
వ॥ ఇంక నిన్ను భార్యఁగా వరియింపం దగు నే యనిన కామశరపీడితయగు నక్కోమలి యతనికిట్లనియె * గీ॥ తమ్మునికిఁ గాఁగ భీ
ష్ముఁ డుదగ వృత్తి। గన్నియలఁ గొనిపోయెఁ గాన బలిమి। నన్నుఁ గొనిపోయె నా చేత నిన్ను వినిన। యపుడె పుత్తెంచెదూ
షింపన ఘతగునె * వ ॥ మా తండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించినకతంబున నింతవుట్టె భీష్ముం
డు నాచెలియం డ్రుందన తమ్మునకిచ్చి నన్ను నీకడకుం దగననిచె దీన నేమి తప్పని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక
తన్నుం జేకొనక సాళ్వుండు * క ॥ కరుణంబుగ నేడ్చుతలో। దరి భోసామ్మి చటనింకఁ దడయక మునిమం। దిరము వెడలంగన
డిచిన। నరిగె నదియు నార్తచిత్తయై వికలగతిన్ • వ॥ చని చనియవ్వేలం దియిట్లని వితర్కించె • గీ॥ సాళ్వునకుఁ గాని యపుడసం
సారమునకుఁ। బాసితి నింక భీష్ముని పాలికేల। యరుగ నాతండు మూలమీహాని కెల్లఁ। గాన నాతని సాధింతుఁ గాకయే
ను * క॥ గాంగేయు గెల్వ నెవ్వరి। కింగోలఁది యెతపము పెంపి గెలిచెదఁ గాకం। చుం గాంత సని యె సంయమి। పుంగవులొక
కొందఱున్న పుణ్యస్థలికిన్ * వ॥ చని వాగలకుం దనవృత్తాంతంబుఁ జెప్పిన వారిది రాజులు సేయు పని సాధులచేతం జక్కం
బడు నేయునిననవ్వనిత తపశ్చరణంబునకు వచ్చితి ననవుడు నీవు సుకుమారివి నీకిది చొప్పడునె తండ్రి పాలికిం బొమ్మిదియ
పరమధర్మంబని పలికిన వారికన్నారీరత్నం బిట్లనియె * క ॥ ఎవ్వరు నెఱుఁగక యుండఁగ। నివ్వనమునఁ దపము సేతయుని
ర్ణయమే। నెవ్వారికడకు నేమని। యెవ్విధిఁ బోనేర్చు దాన నేటికి బంధుల్ * వ ॥ అని చెప్పు నవసరంబున నయ్యాశ్రమం
బునకు హోత్రవాహనుఁడను రాజర్షి వచ్చిన నమ్మును లభ్యాగతపూజలు చేసిన యనంతరంబ యఁబంగనుం గొని యిక్క
న్నియ యెక్కడిది దీని విషాదంబునకుం గారణం బేమని యడిగి వారివలన దానిజన్మప్రకారంబును దద్వృత్తాంతంబును వి
ని తన కూఁతురగుట యెఱింగి యయ్యంగన విన దపస్విజనంబులకుం జెప్పి యప్పొలఁతిం దనయంకతలంబున నునిచి
కొని వెండియు నడుగ నవిస్తరంబుగా నచ్చేడియ సెప్పిన విని శోకించి యవ్విషమప్రకారంబునకు నిస్తారంబుఁ జింతించి • ఉ॥ నీ
కిది యేటికిం దపము నింద్యచరిత్రవు నీవు నిన్ను నేఁ। జేకొని కాతు నొక్కగతిఁ జెప్పెద భార్గవరాము నాశ్రితా। శ్రీకరుఁ గాన్ప
మా పదలు చెందఁగ నీఁడతఁ డాశ్రయించినన్। శోకము దక్కుమన్న విని సుందరి యల్లన నాతపస్వితోన్ * గీ॥ పరశురాముఁ
గానఁబడ యుట యెక్కడఁ। గలుగు నాతఁ డెట్టుగరుణ సేయు। ననఁ దపస్వి యిట్టులను మహేంద్రంబను। పర్వతమునఁ జేయు
చుఁ బరమతపము • వ ॥ నన్ను మన్నించుం గావున మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు నందుఁ బొమ్మనుసమ
యంబున నంబరశురామశిష్యుండగు నకృతవ్రణుండను ముని వచ్చి యతిథిసత్కారంబులం బూజితుండై యున్నఁ బ్రియపూ
ర్వకంబుగా నా హోత్రవాహనుండు భార్గవుం డెయ్యెడ నున్నవాఁడని యడిగిన నతం డిట్లనియె * క ॥ తన ప్రియసఖుఁడ
వు నీవని। మునిజనులకుఁ జెప్పుచుండు ముదమున నిన్నుం। గనుఁగొనఁగ నెల్లియిచటికిఁ। జనుదెంచు ననేకశిష్యసంఘముతో
డన్ * గీ॥ అనిన విని యెల్లవారలు నధికహర్ష। మెసఁగ నున్నంత మఱునాఁడ యేగుదెంచె। భార్గవుండమ్మునీంద్రులుపర
మభక్తి। నర్చలిచ్చిరి హోత్రవాహనుఁడుఁ గనియె * వ॥ కని పరశురాముని సంభావనసంభాషణంబులు వడసి కాశిరా
జకన్యకం జూపి యిది నా దౌహిత్రి దీని వృత్తాంతం బంతయు వినుమని యమ్మానినిం గానుపించిన నదియును * చ ॥ కనుఁగవన
శ్రుధారలొలుక గంజరణానతయైన రాముఁడి। ట్లను విను హోత్రవాహనునియట్టుల నేనును నీకు నీమనం। బునఁ గలవం
తయంతయును బుచ్చెద నాకడ నేఁటితిం। నీ వనటఁ దొలంగఁ బెట్టి గరువమ్ము నఁ జెప్పుము దీని మూలముల్ * వ ॥ అనిన విని యి

మ్మహాత్మునకు నంబ తనవృత్తాంతంబంతయు సవిస్తరంబుగాఁ జెప్పి నీ వార్తశరణ్యుండవు నాపరిభవంబు దీర్చి నన్ను రక్షిం
పు మనవుడు నతం డిట్లనియె * క ॥ పరిభవము రెండు ముఖములఁ। దరుణీ తోఁచినది సాల్వుఁ దగఁ దేర్తునా యు। ధ్ధరుఁడగు భీ
ష్ముని దేర్తునా। కరము ప్రియం బెద్ది హృదయగతముం జెపుమా * చ ॥ అనవుడు నింతి యిట్లను మహాపురుషా నను సాల్వుఁడే
కఁగై। కొనఁ డది చాలు భీష్ముదెసఁ గోపము నామదిఁ గ్రాలియుండు నా। తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చ
టన్నిన్నుఁ గనియొ పరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్ * గీ ॥ అనిన నా చెప్పినట్ల గంగాత్మజుం డు। నేయుఁ జేయక త

పరశురాముఁ డంబఁ దోడుకొని భీష్ముని యొద్దకు వచ్చుట.

క్కి నశితశరముల నతనిఁ బడవైతు నాఁ అడుమ బలనీకుఁ। వవము సేయంగ నేటికిఁ దనువుడయ్య * క ॥ అనిపలికి పరశురాముఁ
డు। చనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ తోఁ। జనుదేరఁ గురుక్షేత్రం। బునకుద్గతిఁ గాశిరాజపుత్రిం గొనుచున్ * వ ॥
వచ్చి సరస్వతీతీరంబున విడిసి తనరాక నాకెఱింగించి నేను ఋత్విక్పురోహితప్రభృతి విశిష్ట బ్రాహ్మణసమేతంబుగాఁ
బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున కరిగిన నమ్మహాత్ముండును మదీయభక్తివినయసంభ్రమంబులు సంప్రీతిన
భినందించి యర్ఘ్యలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో నిట్లనియె * గీ ॥ బలిమి మున్నేల తెచ్చితి యిప్పడఁతి మగుడఁ। ద్రోచి
పుచ్చంగఁ దగునయ్య నీచవృత్తి। వచ్చె దీనిఁ దమ్మునికి వివాహ మింక। నైనఁ జేయుము పలుచుట యనుచితంబు * క ॥ అనట
యుఁ నననమా తెలియ। న్వినుమిది నాతోడ సాల్వవిభునకు నేఁ గూర్చినదాన నతనిపాలికి। నను వుమునన్నని నఁగా దెయని చితి
మసుడక * గీ ॥ ఇంక నా తమ్మునికి దీని నెట్లు పెండ్లి। సేయ నేరుతు ననుడు నా చెప్పినట్లు। సేయవైతేని నిన్ను నీచెలులఁ జుట్ట
ములను జంపుదు ననియె నమ్మునివరుండు * వ ॥ ఏనుఃనయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుపనంతకం
తకు నతనికిఁ గోపం బగ్గలంబైన వెండియు * గీ ॥ గురుఁడ వేసమగ్రకోదండవిద్యామహత్త్వ మిచ్చినాఁడ వలుక దగునె। కా
రణంబు లేక యీరస మెత్తి యిట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున * చ ॥ గురుఁడని నన్నెఱుంగుదనఘుండవు నావచనం
బునందనా। దరణముఁ జేసితిన్నియువిధంబులఁ బల్కెదు భక్తితోడ నీ। వెరవులు దక్కి మీయబల వేగమ పెండిలి సేయుమం
తతో। మరలు మదీయకోపశిఖినాన దు వేతెఱఁ వేయుఁ జేసితిన్ * వ ॥ అనిన ధర్మాచరణంబున కింత పట్టెపెనంగంద
గునె పరాసురక్తిచిత్త్యుయుగుమగువ నిల్లాలిం జేయుమను వారుంగలరే యిట్టియకృత్యం బాచరించుటకంటె నీచేత నెట్లయి
నను లెస్స తొల్లి పెద్దలు చెప్పిన చొప్ప వధరింపుమని యిట్లంటి * గీ ॥ గర్వియై కార్య మిట్టిద కార్యమిట్టి। దనియెఱుంగక లోకం
బు చను పథమునఁ। దిరుగకున్న దవృత్తి వర్తించునట్టి। వానిగురునైన దండింపవలయు నండ్రు * క ॥ అను మాటకుఁ గాలానల।
మును బోలెను మండి కయ్యమునకాయితమై। మొనలేర్చి వేగనిచటికిఁ। జను దెమ్ము నే భార్గవుండు సంరంభమునన్ * వ ॥ అను మా
ట కేనిట్లంటి * క ॥ చులుకదనంబున విప్రున। కలుగం గాదని యు గురుఁడవై యుండుదువం। చలయక తెలిపితిఁ గాకిటు। కలు
మీ నీరణము సేతనిజమగు నేనిన్ * క ॥ తుత్రియులఁ దొల్లి యలుకకుఁ। బాత్రము చేసితఁట నాఁడు బలియుఁడు గంగా। పుత్రు
ఁడు పుట్టమిఁ గాదే। యాత్రయి నీకేల చెల్లునెఱుఁగ వెనన్నున్ * క ॥ ఏనొక్కరుండన వచ్చెద। గాని బలము దేను నీవు గ ఆపనశ
స్త్రా। స్త్రానేకవిధవిలాసము। దానవలయు సేన గాదె తథ్యం బరయన్ * వ ॥ అనిపలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి సత్య
వతి కింతయు విన్నవించి యద్దేవి యనుమతి వడసి సర్వసన్నాహసమేతంబగు రథం బెక్కి విప్రాశీర్వాదంబులు సెలంగ వె
డలి వచ్చి కురుక్షేత్రంబుఁ జేరియుంజను నెడ భాగీరథి భామినీరూపంబున నరుగుదెంచి తన్నెఱింగించి మదీయభక్తి నభినందిం
చి యే నా యుత్తంబై పోవుటకుఁ గారణంబడిగి నా చేత నత్తెఱంగెఱింగిన దియ్యైనన్నుం గినిసి భార్గవు పాలికిం జని నీశిష్యుండు నిర
పరాధుండు నాకొడుకు నకలుగం దగునే యని చెప్పి యతని యందుఁ బలుకు గానక మగుడ నేతెంచి నావలన మెత్తపాటు లే
కున్నను జనియె నప్పుడు సిద్ధవిద్యాధరమునిగణంబులు కౌతుకంబునం గనుంగొనుచుండ నేను జమదగ్నితనయున కనతిదూ
రంబునం దేరు డిగ్గి వినతుండనై నిలిచి మీరు భూమాదులరై యున్నవారు రథస్థుండనైన నాకు మీతోడ సమరంబు సేయనగు
నే యనిన యనంతరంబ యతండు దివ్యంబులగు రథరథ్యంబులు శస్త్రాస్త్రంబులును గలిగి యకృతవ్రణుండు సారథిగా సమ
రసన్నద్ధుండయి తోఁచినం జూచి రథా [illegible] దిసుగుణంబు సారించి నాతునగ్గించి తనకును మస్కరించి

## భీష్ముఁడు పరశురామునితో యుద్ధంబుచేయుట.

కడంగినప్పరశురామదేవుండు ✽ క ॥ శరవర్షము నామీఁదం। గురిసిన సేనాక్షముననఁ గుదియించితినా। యరదము పొంతకు
నయియా। చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరకయుండన్ ✽ క ॥ ఒకమొగి నలువదియమ్ములఁ। బ్రకటబలుండై నపరశురాముఁ
డు నాయం। గకములు దాఁకఁగ నశ్వ। ప్రకరము నానాటసూతు పైఁబడ నేసెన్ ✽ క ॥ దానికి నవ్వుచు వేగం। బేనొకభల్లం
బుదొడిగి యేసితి సాంద్ర। జ్యానాదభరితరోదసి। యైనతదీయోగ్రచాపమటమటించుదునియన్ ✽ ఉ ॥ ఒండొకవిల్లువుచ్చి
కొనియుజ్జ్వలరోషమహానలార్చులొం। డొండ మొగంబుపై నెగయ నుర్వి చలింప గుణధ్వనిక్షమము। ద్దండశరదీప్రమార్గ
ణశతంబున నాయరదంబు ముంచెరా। మండుపియచ్చరప్రకరము ల్లలఁగందుచుఁ బ్రస్తుతింపఁగన్ ✽ క॥ ఉలకమదీయాం
ఉచ్చిపోయి నచోటుల నెలుకుశోణి। తమునసర్వాంగకంబులు పడిసియొప్పెఁ। జిగురుతలుచునఁ గెజాయమిగిలి చెలువు। వడ
యుక్రొమ్మోవిచాడ్పున భార్గవుండు ✽ క॥ నెత్తురువడిసిన మూర్ఛా। యత్తుండై సోగయుటయును నాతనిఁ గనియు। ద్వృత్తి
ఋత్రియధర్మో। ప్తాత్తంబగు తేజమొల్లఁబాసైతోఁచెన్ ✽ వ॥ అప్పుడు మనంబున నన్ను నేనగర్హించుకొనుచుండితి ✽ గీ॥ అంతఁ
దెలిసి రాముఁడతికుపితాత్ముఁడై। యేటుపాటు దెంచు నెసక మెసఁగ। నప్రమేయశరములడరింపనతిసత్వ। రమున నేను బ్రతి
హతములు సేసి ✽ క॥ సురుచిరస్త్రమేయము హ్యా। శరఘున వారించె నతఁడు సరభసమునను। ధూరశిఖిబాణం బేసిన। గురుఁ డువ
చితిదివిజగ। ణమ్మంబరవీథిఁ గీర్తనమ్మొనరింపన్ ✽ గీ॥ రాముఁ డంత్యకాలానలోద్దామలీల। మండి నాయురస్థలమొక్క మార్గణ
మున। నేసె నచ్చటనున్నమునీశ్వరులును। గాశిరాజకన్యకయును గడఁగి యార్వ ✽ క॥ ఆఁ శితాస్త్రఁబెట్యోది। యోనాకుం దె
లియదదిమహోగ్రతనాటం। గానొచ్చి పడితి నరదము। పైనప్పుడు సూతుఁడచ్చోటు వాపెరథంబున్ ✽ గీ॥ చేతనుండనైయే
నువచ్చూ సూతుఁగినిసి। రాముఁ డున్నెడకప్పుడుగ్రమ్మఱంగ। రథముఁ దోలించి బాణపరంపరాని। కుఱ్ఱఁజేసితి నంబ నెమ్మన
ముపలఁక ✽ వ॥ ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దుగ్రుంకినప్పుడు రణంబు పసంహరించుచు రేపకడఁ దొడంగుచుఁ బె
నంగ నిరువది రెండు దివసంబులు సనినము అనంటికయ్యంబున నేను గడంగి ✽ క॥ కడు బెట్టిదముగఁ గదియం। బడి హయములు నొ
వ్వఁ ధనువు భగ్నంబుగఁ జే। ద్పడి సారథి దెబ్బలఁ గదన। మొకలు వినుగ నేసిననుమహాస్థితి గురుఁడున్ ✽ క ॥ ఒకశక్తి
వై వనజికితి। నకుటిలముగ శక్తిదశకమడరించినను। కకుతుంచితి బహుశక్తుల। నికరము వడగించినం మునిమితిం బెలు
చన్ ✽ క॥ విస్మయమునొందు భార్గవు। నస్మత్క్రమపు జలాఘు వారూఢము గా। నస్మితుఁ డనగుచుఁ బటువీ। ప్తిస్మేరాస్త్ర
ముల నేసితిం బరవశుఁ గాన్ ✽ వ ॥ ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధిక శోకసమాకులత్వంబు నొంది
హాహాకారంబు లెసంగ నున్నంత ✽ గీ॥ తెలిసియతఁడు వేగదృఢతీవ్ర నారాచ। పఙ్క్తి గురిసినన్నుఁ బారవశ్య। మంది నేలకొ
ఱుగునట్లుగఁ జేసిమ। తూ్సూతుమస్తకంబుఁ దునియ నేసె ✽ వ ॥ అట్టియెడ నెనమండ్రు విప్రులు వయోరూపంబుల
నొప్పువారు నన్నెత్తి సేదదేర్చి రథంబుపయిం బెట్టి గగనగమనంబునం బోయిరంతకుమున్న మందాకిని నాకన్నరూపంబు
నానరథంబునొగలపయి నుండి మదీయరథ్యంబుల పగంబులు ధరియించియున్న యది యేనుంగనుంగొని నమస్కరించిన
దీవించిచనియె వెండియు ✽ క ॥ సారథ్యంబును జేయుచు। ధీరత వాటించి రామదేవునితోడం। గ్రూరాస్త్రంబులఁ జకుర

## భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట.

వి। హారంబొనరించితినిసురావళి వొగడన్ ✽ వ॥ ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయంబగుటయు నెప్పటియట్ల చనియా
రాత్రియే నేకాంతంబున దర్భశయనంబుననుండి సురభూసురవర్గంబులందలంది భక్తిం బ్రణామంబులు చేసి పరశురా
ముని జయింప రాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె నతని నాజి జయించుటగలుగు నేని మీరు నాకుం దోఁచి యూఱడింప
వలయునని ప్రార్థించి నిద్రించుచుండం బవలున న్నెత్తి రథంబుపయిం బెట్టిన యెనమండ్రు నుబ్రఖాత సమయంబున నంగ
లలోన వచ్చి ✽ గీ॥ నీవు నేమును నొక్కటి నీకు వెఱవ। నేల గాంగేయ తాము జయించునట్టి। శరము సమ్మని మోహనాస్త్రం
బు నాకు। నిచ్చి పోయిరి క్రమ్మఱ నెక్కడేని ✽ వ॥ ఏను మేలుకాంచి సంతోషించి తత్స్వప్నమంత్రస్వరూపంబును బ్రహ్మోపాసన

హారప్రకారంబులు నుజ్జత్తంబున సలిషికొని కాలోచితకృత్యంబులాచరించి యొక్క సారథి నంగీకరించి యరదంబు పూన్పిం
చి సన్నద్ధుండనై సత్వరంబుగా సమరంబునకరిగినం బరశురామదేవుండు * క॥ నిన్న నరసచ్చిపోయితి। వున్నయరయు
నేఁడు దీర్చి యుడిపెద నీగ। ర్వోన్నతి యింకెటఁ బోనగు। నన్నెఱుఁగవె యట్టిఁడనుచు నాపైఁ గపిసెన్ * క॥ కవిసినఁ గడం
గి యేనును। గవియించితి నంపవెల్లి గడుఁ గ్రూరత భా। ర్గవుఁడును మద్గాత్రంబున। విషధాస్త్రప్రతతి నించి వెగడొందించెన్ * వ॥
ఏనుఁ గోపించి * గీ॥ రయము మెఱయంగ నొక్క నారసము ఫాల। దేశమునయందు నాటించి తీవ్రశక్తి నురము వైచినఁ దూ
గాడి మొఱుగ నూఁది। వట్టి యకృతవ్రణుఁడు దేర్పైఁ బరశురాము * క॥ అప్పుడు తెప్పిఱి కన్నుల। నిప్పులు రాలంగ నన్ను నిశ్చ
లదృష్టిం। గప్పక చూచి యలఁతిన। వ్వొప్పఁగ బ్రహ్మాస్త్రమాతఁ డుగ్రత నేసెన్ * క॥ తెగగొని బ్రహ్మాస్త్రము నేఁ దగ
వేసిన నొక్కటొక్కటి దారొక్కని రెండున్। గగనంబంతయుఁ దేజ। స్స్థగితముగాఁ జేసె సురలు దైత్యులు దలఁకన్ * గీ॥ స
కలభూతసంక్షోభసంజనకమైన। యట్టియేడఁ గని యిది తఱియని తలంచి। మోహనాస్త్రసమంచితావాహనంబు। సే
యుటయు నజరాచరశ్రేణి మ్రోసె • వ॥ తదనంతరంబ * క॥ ఉడుగుడుగు మోహనాస్త్రము। విడువకుమను నెలుఁగు
తోడ వేగంబునన। య్యేడకేసుదెంచి నారదుఁ। డెడమడుగించుకయు లేక యిట్లను నాతోన్ * క॥ గురునకు నవమానము నిష్ఠుర
వృత్తిం జేసెదీవు సూచితమే యి। ప్పురుసున విరసపు నడవడి। కురువంశప్రభవ యిట్లు గూడునె చేయన్ • వ॥ అని సువ్యక్తంబు
గాఁ జెప్పి * క॥ వీరె వసువులాకసమున। గారవమున బుద్ధి సెప్పఁగా నీకిడకుం। డా రేగుదెంచిరనిక। న్నారంగాఁ జూపె నాకున
య్యేనమంద్రన్ • వ॥ ఇవ్విధంబున నాకుఁ గలలోఁ దోఁచిన యప్పటివిప్రవరులు సన్నిధిచేసి నన్నుఁ జూచి నగుమొగంబులతోనె
ఱుంగనివారపోలె యిట్లనిరి * క॥ నారదముని త్రైలోక్యస। మారాధ్యుం డితని పలుకులాగమవాక్యో। దారములు వినుము వీ
నిం। గ్రూరత వాటింపఁ దగదు గురువిషయమునన్ * వ॥ అనిన విని యేను సమ్మోహనాస్త్రంబేయుట యుడిగి బ్రహ్మాస్త్రం
బు దీపింపం జేసితి నప్పుడు జామదగ్న్యుం డదియెల్ల నెఱింగి యోటమి యొక్కించుకొని చలంబు మిగిలియున్నం దజ్జనకుం
డు జమదగ్నియుఁ దదీయపితృగణంబును నతనికి సన్నిధిచేసి వేఁడుకొని శాంతవచనంబులం దేర్చి యిట్లనిరి * క॥ వినుము వ
సుమూర్తి యితఁ। డనన్యసామాన్యతేజుఁ డాహవభూమిన్। మనకు జయింప వశమె భీ। ష్మునిఁ బ్రునకగు నెరోషమును
వత్సరమున్ * గీ॥ సమరముడుగు నారాయణసఖుఁడు నరుఁడు। సవ్యసాచి నాఁ నింకొక జన్మమొంది। యితని వధియించఁగా
నితరేతరజనము। లకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన * వ॥ అనిన నతఁడు పోక పెనంగిన వెండియు నేకప్రకారం
బులం జెప్పి యమ్మునులు నాకడకుం జనుదెంచి యుపశమనవాక్యంబులు పలికి జామదగ్న్యుతోడం దమయాడిన మాటలు దే
టపఱియ నప్పుడు పొడసూపిన జాహ్నవియుం దారు బహువిధంబుల నన్ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం
దోడ్కొని యరిగి యుగ్రమ్మఱ మత్సమీపంబునకు వచ్చి యొట్టకేలకుఁ జలంబుడిపిన నేమిరువురము దివ్యాస్త్రంబులుప
సంహరించి సమరంబుడిగితిమయ్యెడ నయ్యేనమండ్రు విప్రులుం జేరి నాతో నిట్లనిరి * గీ॥ గురుఁడు బ్రహ్మవిదుఁడు కుంతీత
తేజుండు। పరశురాముఁ డతనిపాలి కీవు। భక్తి మెఱయ నేగి ప్రణమిల్లి తదనుగ్ర। హంబు వడయవలయు ననఘ యిపుడు * వ॥
అని చెప్పి యతని కడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్నిప్రముఖులును భాగీరథియును జని నీశిష్యుండు దేవ
వ్రతుండు వానియెడఁ బలుగందగునె వాఁడు తగవుమాలిన పని చేయఁజాలక పెనంగెనింతియ కాని విరోధిగాఁడు వానిం గరు
ణింపుమని చెప్పి నన్నుం బిలిచినం బోయి యేనమ్మహాత్మునకు సాష్టాంగదండప్రణామంబు చేసిన నతండు దీవనతోఁ గ్రుచ్చి
యెత్తి కౌఁగిలించుకొని గాంగేయా నీశక్తికి భక్తికిం బ్రీతుండనైతి నని సస్నేహంబుగా సంభాషించి యంబ నవలోకించిన
న్నభీష్ముండు గెలిచె నావలన నయ్యెడు పని యింతియ నీ వింక నీకుం జూడం బోలినగతిం బొమ్మనిన నమ్మానిని దేవా యిది యిట్టి
దని నీవోపినంతయుం జేసితి నీచేతం బోకున్న నేమి సేయుదు నేను దపంబు పెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబుననైనను
జలంబు సాధ్యంబు సేయుదు నట్లు చూడుమని పలికి పోయిన నమ్మునిజనపితృదేవతాసమూహంబును భృగునందను నన్నునా
మంత్రణంబు చేసి యంతర్ధానంబు చేసె భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్ను తనతో వచ్చిన తపోధనవర్గముం దాను
నుమహేంద్రశైలంబునకుం జనియె నేను మగిడి యెడనెడ నుర్వీసురుల యాశీర్వాదంబులు సంభావనవచనంబులుఁ బ్రస్తు
తివాక్యంబులుఁ గర్ణంబుల కింపు సేయ [illegible] పూర్వకంబుగా నంతయు నెఱుంగించిన నద్దేవి యభి

నందించి * గీ ॥ అంబవృత్తాంతమరయంగననుదినంబుఁ। దగినవారలఁబుచ్చుచుఁ దలఁకుచుండు। నేనునదియాదిగాఁజింత

* నారదుఁడు భీష్మునకంబవృత్తాంతంబంతయుం జెప్పుట. *

నేపుదక్క । నుక్కయుండియు రాజులను క్కడంతు * వ ॥ ఒక్కనాఁడు పారాశర్యనారదులంగని యక్కార్యం బుభయందోఁపవిన్నవించినవారలుదైవాధీనంబగువాని మానుషంబువలన వారింపవశంబుగాదీ చింతవిడువుమని రందు నారదుండు కాశీశ్వరకన్యక తెఱంగు వినుమనియిట్లనియె * సీ॥ ఆతన్వియమునానదీతీరమున కేగి యత్యుగ్రమగు తపమాచరించి । యందుండి కౌశికునావాసమాదిగాఁగలుగుసిద్ధాశ్రమంబులకు నెల్లఁ । జరించి తీర్థప్రదేశంబులనిష్ఠుర వ్రతములుసలుపంగవచ్చినీదు। జననిజాహ్నవియిట్లువనితలకతిదుష్కరములగుబహునియమములునీకు। నడుపఁగతమేమి యనుచునన్నాతివలుకు। వద్దియవమానపడితిశాంతనవుచేత । నపరజన్మంబునందైననతనిఁజంప । నేనుజాలుటకైయిట్టి దాననైతి * వ॥ అనినవినిభాగీరథికుటిలవ్రతచారవగుటనీవీతనువుపిడి యిదేఱయిపాఱంగలదానవింతియకాని యొండుగా నేరవనిననవ్వేలందినవ్వచనరకుసేయుకయిగితొల్లింటికంటెను దీవ్రంబగుతపశ్చరణంబునం బ్రవర్తించుచుమత్స్యదే శవాసినియైయుండియొక్కనాఁడునిజవ్రతఫలంబులోనసగంబుననంబయనుపేరనదియై యమ్మండలంబునం బరఁగియు న్నసగంబునను దనరూపుసెడకుండ వహించికొని జాహ్నవీప్రభావంబు నాత్మీయప్రభావంబునగెలిచి వెండియు * క॥పుణ్యాశ్రమదేశములన । గణ్యంబగుతపముసేయఁగారుద్రుఁడుగా । గుణ్యమువాత్సల్యముదా । క్షీణ్యముమెఱ యంగనింతికిఁబొడసూపెఁ * క ॥ మునులచ్చెరువందకనుం। గొనశంభుఁడునిల్చివరముఁగోరుమనుడుభీష్ముని నాఁకున జంపఁగా దొరఁకొనునట్లుగనొసఁగుమనియెఁగోమలినెమ్మిన్ * వ ॥ అనవుడునద్దేవుండట్లకాకయనియనుగ్రహించిన నంబయెత్తెఱంగుననదియెప్పుడుసమకూడుననియడిగిన * సీ॥ ఈమేనువిడిచినీవేగినయ్యాషద్రుపదభూవిభునకుఁదొల్త పుత్రి।వైపుట్టిపిదపఁబుత్రాకృతిఁగాంచిశిఖండినామమునసుద్దండబాహా । బలమునఁగోదండపాండిత్యమునుబటుశౌ ర్యంబుగలిగిప్రశస్తికెక్కి। యనిఁజంపఁగలదానవాతనినామాటతప్పదూఱకుమనిచెప్పిహరుఁడు । సనియెనాప్రొద్దుసమి ధలుసాలఁగూడ । వైచియనలంబుగూర్చియవ్వనితక్రోధ । దీప్తమూర్తియైభీష్మువధించుదాన।ననుచుసొదసొచ్చెము నులకునద్భుతముగ * వ ॥ అట్టియెడద్రుపదుండ నపత్యయగుతనమహిషికిఁషాదంబుదీర్పందివుకుటనుగాంగేయుతోడి రోషంబునను శివునినుద్దేశించితపంబుచేసినన్నదేవుండుప్రత్యక్షుండై వరంబువేఁడుమనిన భీష్మువధియించునట్టి వానినొ క్కపుత్రునొసంగవలయుననుడు * గీ ॥ కూఁతురైపుట్టిపదపడికొడుకుఁదనముఁ। గాంచిభీష్మునినాజిరంగమునఁజంపు। నట్టియుజ్జ్వలాపత్యంబుపుట్టునీకుఁ। దప్పదిదియనిరుద్రుండుసెప్పెననియె * వ॥ద్రుపదుండునుబ్రీతుండైనిజప్రియకున వ్వరంబెఱుంగించెఁ దదనంతరంబకాశీశ్వర కన్యకచైతన్యంబుదరంబునం బ్రవేశించిన * క ॥ పాంచాలరాజభార్యస। మంచితగర్భంబుఁదాల్చిమఱుపడఁగూఁతుం । గాంచినిజపతియుఁదానును । వంచనఁగొడుకనిరియెల్లవారునువినఁగన్ * వ ॥ ఇట్లుపుట్టినబిడ్డకుఁ బుత్రప్రకారంబునజాతకర్మాదికృత్యంబులునిర్వర్తించిశిఖండియనుపేరువెట్టి యతిప్రచ్ఛన్నం బుగాఁబెనిచి రహస్యంబుతెఱంగా కన్నియకుంజెప్పియక్షరశిక్షాదులాచరించి ద్రోణాచార్యుపాల శస్త్రాస్త్రపరి శ్రమంబు సేయింపుచుండ జవ్వనంబుచేరువకుండటియగుటయు నక్కగువంజూచివగచితల్లిదండ్రులుదమలోవిచారిం చివేగంబవివాహంబు సేయవలయుఁబరమేశ్వరువరప్రసాదంబుకొఱంతపడన నెఱసినప్పుడునెఱయుఁగాక యనినిశ్చ యించిదశార్ణదేశాధీశుండగు హేమవర్మయను రాజుకన్యకందగినతెఱంగునంబాణిగ్రహణంబుచేయించి తెచ్చియున్నం త * గీ ॥ అక్కమారిచతురయగుటశిఖండివ । ర్తనమునెడఁబ్రమాదమున నెఱింగి । యగ్గడింపనెల్లకూరకయెఱుఁగని। యదియుపోలెనుండెనాత్మనొచ్చి * వ ॥ ఇట్లుదశార్ణవిభుపుత్రియెఱింగిశిఖండి పురుషుండుగాకుండుట తనదాదికిం జె ప్పిననదియునప్పుడన్నరనాథునకెఱుంగించి పుచ్చిననతండు విషాదరోషంబులనొంది దూతంబుత్తెంచినవాఁడు వచ్చి పాంచాలపతింగాంచియిట్లనియె * చ ॥ కొడుకనితెచ్చియిట్లుగనెకూఁతువివాహముసేయదీననీ।వడసినలాభమెద్దినగు బాటగునింతియకాకయెల్లనే । గ్వడనెఱుఁగంగవచ్చితినరాతిభయంకరుహేమవర్మనా। గడమునగాసిచేసితిమగంటిమినీ దెసనైనఁజూపుమా * గీ॥ అనిననగుచువానికనుద్రుపదుండిది।యేటిమాటలిట్లులేలసేయ।వచ్చునింతవెఱ్ఱివారునుగలరె

యు। తెలియఁగఁ బోనఁగ కునికి యెఱుఁగరాదె * వ ॥ అని వెండియు నేర్పునం దీర్పుమాటల నేకం బులాడి నిక్కం బరయం జూచి న వానికిం జోరవయిాక క్రోపు చేసి వీడ్కొలిపి పుచ్చినం బోయి వాఁడు నిజనాథునకవ్విధంబు విన్నవించిన * క ॥ కోపోద్రేకంబున నతఁడా పాంచాలపతి మీఁద నతులిత సైన్యాటోపమున వచ్చి పురి పరి। ఘా పరిసర లతము చుట్టుగై కొని విడిసెర * వ॥ ఇట్లు విడిసిన * గీ॥ పట్టువడ్డ మృచ్ఛు పగిది నిబాంచాల। ధరణీవిభుఁడు దనకుఁ దాన చేటు। రాకకు న్వలంచి యేకాంతమునఁ బత్ని। యొకతె తయును గొల్వనూరకుండె * వ ॥ తదీయ దండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తించిరంత సూర్యాస్తమయ సమయంబగుటయు రెండు వీళ్లును భండనంబుతోడి వేడుకం జేసి వేగుట వేచియుండె * క ॥ అప్పుడు శిఖండి మరణము। దప్పఁగ సడికొంచు ప్రతివిధానము సేయ। జొప్పడమిఁ దలఁచి యెరులకుఁ। జెప్పక వెసనరిగెఁ బురము చెంతన

*శిఖండి యక్షుని వలనఁ బురుషత్వంబు నొందిన వృత్తాంతము.*

డవిక్కా * వ ॥ అవ్విపినంబు స్థూలకర్ణుండను నొక్క యక్షునికి నివాసంబై యునికిం జేసి నిర్జనంబై యుండుటఁ శిఖండియు న తెలంగ లేకుంగుంగాపున నతని నుద్దేశించి యందుఁ జొచ్చి తత్ప్రదేశంబున మహనీయ సుందరంబగు తదీయ మందిరంబు నకరిగి యచ్చటఁ బ్రాణపరిత్యాగంబునకుఁ దగు విధం బాచరింపం బూనిన * ఉ ॥ యక్షుఁడెఱింగి వచ్చి యిటులాడిచావఁగనేల చెప్పుమ। ఖ్యాతిభవన్మనోరుజకు నౌషధమే నొనరింతు నన్నఁ దా। లాతుఁడు దక్క నెవ్వరికి నాపని సేయఁగ రామునాదు చిత్తశుభ। పుంస్త్వమే నుదగఁ దాల్పక మానదు గుహ్యకోత్తమా * క ॥ అనితన వృత్తాంతం బా। తనికెఱుఁగఁగఁ జెప్పుటయు నతండును జిత్తంబునఁ గరుణ వుట్టి యెంతటి। నని యిది యేని తు సమయ పరిపాలనతోఁ * క ॥ నా పురుషత్వము గైకొని। వేపోయి దశార్ణపతికి వెలయించి నమీ। యాపదలు దొలఁగి చనఁ బొడ। నూపుము పదినాళ్లదాఁక। సూనృత మొప్పఁ * క ॥ అంతవునంతకు నీదగు। కాంతారూపంబు నేను గయికొని యెదని। శ్చింతను మగుడం జనుమని। యింతికిం బురుషత్వమిచ్చె నెంతయు వేడ్కన్ * గీ ॥ ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ దాల్చి। వీడుకొల్ప శిఖండియు వీటికేగు। దెంచి నిజమందిరంబు సొత్తెంచి తల్లిదండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప * క ॥ తన తెఱఁగంతయు నెఱుఁగిం। చిన నద్భుత హర్షమగ్న చేతసులై త। జ్జననీజనకులు బహువిధ। వినుతులఁ గొనియాడి రంత వేసవయయ్యెన్ * వ ॥ తదనంతరంబ సూర్యోదయ సమయంబగుటయుఁ గాలోచిత కరణీయంబులు నిర్వర్తించి పాంచాల విభుండు సంబంధి తోడ వలయు మాటలాడం దగువారలం బనిచి రావించి సంభ్రమంబు లేక వేగిరపడక నాగరిక ప్రకారంబున శిఖండి పురుషత్వంబు తేటపఱిచి యతని మాటగ్రిద్దించి సంతసపఱిచి సపరివారంబుగా నద్దశార్ణపతికి మజ్జన భోజనంబు లొనర్చి కట్టనిచ్చి యతని యనునయాలాపంబులు గైకొనియనిచి పుచ్చినతండు తన్నుం దాన నిందించికొనుచు నిజపురంబునకుం బోయె నట్టియెడ నయ్యక్షవరు మందిరంబు చక్కటికిఁ గ్రీడార్థంబు కిన్నరవిభుండు విమానారూఢుండై చనిదాని యొప్పుగనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింత సేపునకుఁ జుట్టలున్న గుహ్యకుల తోనిట్లనియె * క ॥ మన మిచట నిలిచియుండఁగ। మనమున శంకింపక యిట్లు మసలిన వాఁడీ తనిగర్వమేల యిక్కడఁ। జను దేరక నిలుచు టెట్లు సైపఁగవచ్చున్ * వ ॥ అని పలికి యలుక మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరులా గుహ్యకు నరసి తద్వృత్తాంతంబంతయు నెఱుంగించి దేవా సిగ్గుపెంపున తానేరకున్నవాఁడని విన్నవించిన

—(*)స్థూలకర్ణునకుఁ గుబేరుని వలనఁ స్త్రీత్వము గలుగుట.(*)—

గీ॥ అయిన నేమి పిలువుఁడని పిలుపించిన। వచ్చి మ్రొక్కె టక్కనువనితయైన। యతనిఁ జూచి యింక నవుదానికిట్టుల। యుండుగాక యని విభుండు పలికె * వ ॥ అనవుడు స్థూలకర్ణుండు మదలఁకి దండప్రణామంబు చేసియుండె నప్పుడుకొలిచియున్నవారు ధనదునకుం గృపవుట్టనల్లనఁ దెచ్చినన ట్లేని వీఁడు శిఖండి యాయువుగలంత కాలంబును గాంతాకృతియై యుండెపడంబడి నిజరూపంబుఁ దాల్పుం గాక యని యనుగ్రహించి యరిగిన * గీ ॥ గుహ్యకుండు విషాదంబు గూరి యుండ। నచ్చటికిఁ గొన్నిదినములకరుగు దెంచెఁ। దల్లిదండ్రులకెఱుఁగించి తగవు మెఱయ। సమయనిర్వాటించి పాంచాలసుతుఁడు * క॥ వచ్చినఁ గనుఁగొని నీ దెసఁ బొచ్చెము లేదింక మగిడి పొమ్మిదివిడనీ। కిచ్చిన రూపని గుహ్యకుఁ। డచ్చుపడం బలికె నతనికంతయుఁ దెలియన్ * వ॥ చెప్పి వీడుకొలిపి న శిఖండి యత్యంత ప్రమోదంబునం దండ్రి కడకు వచ్చి యత్తెఱంగెఱిగించిన నాతండు ప్రీతుండై దేవసురుద్విజపూజనంబులాచరించి ద్రోణాచార్యుపాలనవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె * క॥ అ

నిచెప్పినారమండుదా । నునుసత్యవతీసుతుండునుండమయిచ్చం । జనిరిశిఖండిచరిత్రము । జనకర్ణవరంపరం బ్రశస్తంబ
య్యెఁ * వ॥ఇవ్విధంబునఁ గాశీపతికన్యకసిద్ధమూర్తియై నెగడె నేనునుగలననంగనాపూర్వులనంగ నాభిధానులనంగ
నాకారులనువధియింపకుండ వ్రతంబుపూనినవాఁడంగావున నంగనాపూర్వుండగుశిఖండిభండనంబునం గోదండపాం
డిత్యంబు నెఱపి నన్నుఁజంపననొంపనగడంగినను నేను బ్రతిగాఁగడంగితి నేనినింతకంటెను దుర్యశంబుగలదెయే నెట్లైనన
గుడుంగాని భగ్నవ్రతుండనగుట కోర్వనిదినా తెఱంగు * క॥ అనిచెప్పినదేవవ్రతువినతవచనములు ప్రభుండువినితనది
త్తంబుననొక్కింతవగచియా । తనకీమగతనముపూనికతగుననివలికెఁ * వ ॥ తదనంతరంబకొలువునంగలయండఱు
సమరవిషయంబులయిన సల్లాపంబులుసేయుచుండఁగొండొకసేపువినుచుండి సుయోధనుండుసురనదీసూను నకిట్లనియె *
గీ॥పాండవులకుఁగలుగుబలములన్నియుసమయింపనీకుదినములెన్నివట్టు । గురుఁడుగృపుఁడుగురుసుతుండుకర్ణుండునెం
తెంతమానమునవధింతురనఘ * వ॥అనినవినిగాంగేయుండిట్లనియె * క॥అనిఁబాండవసేనలఁజంపవుజెఱుపను నేముచాలు
భంగులనీకిట్లనుమాననువాయఁగనడు । గనతగుఁగడులెస్సవించుఁగాకనరేంద్రా * వ॥ నాచాలెడుకొలందిచెప్పెదఁదక్క
టివారు తమతమచాలుటలు తారచెప్పెద రదియెల్లను బిదప విందుగానిమున్ను నీకొక్కబాసయిచ్చెద వాకర్ణింపుము *
క॥మీఁటుగలరథికులనునొక । నాఁటికి వేవురవధింతునరుశకములునో । నాటిపడవైచునంతకు । వేటాడెదఁ బ్రతిబలంబు
వీరులనెల్లన్ * వ॥అట్లునాకయ్యంబుచేయుదివసంబులలోన * క॥పదివేలఁజంపఁగానోపుదు నేనను నెత్తికొలువుట్టినయ
దినీ । వదునొకయక్షౌహిణులనుజతురుగనడిపింతు నేదిరిసైన్యముగలఁగన్ * వ ॥ అనిపలికి వెండియు * క॥నీవడిగినపనియే
ర్పడఁ । గావినుమే నొక్కనెలఁ దెగం జేయుదు నా । నావిధదివ్యాస్త్రంబుల । లావునఁ బాండవులబలంబుల నెల్లన్ * వ॥
అనవుడు గురుకృపాశ్వత్థామకర్ణులంగనుంగొని గాంధారీనందనుండు మీమీచందంబులెట్లనిన నాచార్యుండుమందస్మి
తాననుండగుచునిట్లనియె * గీ ॥ ఏనుముదిసినవాఁడమహీశయెట్టు । లైననోపినభంగినీయనుఁగుతాత । పోలినన్నిది
నంబులఁజాలవచ్చు । నబ్బలంబులననిసమయంగఁ జేయ * క ॥ అనినఁగృపాచార్యుండీ । యినుమడిదివసములఁదీర్ప నే
నోపుదునా । వినిగురుతనూభవుండు పది । దినములఁగడతేర్తుననియె ధీరవిచారా * వ ॥ అంతయువలుకులాకర్ణించికర్ణుండు *
క॥నానాస్త్రశస్త్రచయబడ । బానలమునంగవియఁ జేసియత్యుగ్రతనే । నేనాళ్లనయపాండవ । సేనాసాగరమునివురఁ
జేయుదునధిపా * వ॥అని ప్రతినఁ జేసినఁగలకలనవ్విగాంగేయుండు * చ ॥ పలుకులకేమియన్నియునుబల్కనగుఁగామన
గాజునోర్దమా । వ్వలికెదువారు లేరువినుపాండవమధ్యముగాండివంబుదీ । ప్తులుమిఱుమిట్లుగొన్నకనుదోయిగుణధ్వని
వ్రయ్యలైనవీ । నులునయినన్ బలేపలుకునూల్కొనకుండుటసూతనందనా * వ॥అనియెనివ్విధంబున నీకొడుకుకడంబుట్టి
నవిశేషంబులు ధర్మతనయుండుచారులవలనవిని తమ్ములరావించి వారలతోనిట్లనియె * సీ॥ మనచారులిప్పుడుచనుదెం
చి రావీటనుండిదుర్బుద్ధిసుయోధనుండు । కొలువునగాంగేయకుంభసంభవకృపాశ్వత్థామకర్ణులవలనుచూచి । యనిఁ
బాండవులబలమంతయుసమయింపఁజాలుదురెంతేసికాలమాన । మునవనన్నభీష్ముండుదనకొక్క నెలవట్టుననియెద్రోణుం
డునున్నట్లపలికెఁ । గృపుండురెట్టిసెప్పెఁగృపికొడుకోపుదుఁ । బదిదినములననియెబాహువీర్య । ఘనుఁడుగానసూతతనయు
ఁడేనాళ్లన । తీర్చనేర్తునని ప్రతిజ్ఞచేసె * వ ॥ అనిచెప్పియర్జునుంగనుంగొని వారుతమతమయోపినచందంబులుచెప్పిరినీ
చేతఁగౌరవబలంబులెంతదడవునకుం దెగునాకుం జెప్పుమనిననతండిట్లనియె * గీ ॥ వారలంతకుఁజాలనివారెనీబ । లముల
సమయింపనోపెదులావువెరవు । కలరకాకయారాజుతోఁబలికిబాస । దప్పవచ్చునె వారికిధరణినాథ * వ॥అనిదరహాసో
ల్లాసభాసితవదనుండై * మ॥అనుమానంబదియేలనీమదిమదీయస్ఫారబాహాబలం । బునిరూపింపఁదలంచితేనివినుమేవుంజే
వయుందోఁపఁగృష్ణునితోట్పాటునఁ జేర్చియేఁగడఁగినంజూర్ణంబుగావింతునా । కక్కనిమేషంబునదేవదానవులులోఁగా
నీత్రిలోకంబునన్ * వ॥అదియెట్లంటేనిఁగృత్రిమకిరాతుండైనపశుపతి మెచ్చిజగత్సంహారసమయంబునందాను బ్రయో
గించునట్టిపాశుపత మహాస్త్రంబు నాకిచ్చెనదినాయందు సన్నిహితంబై యున్నయదిగావున శత్రునిరాసంబనాయా
సంబై యుండు నప్పాశుపత మహనీయప్రభావంబుభీష్ముండున్నరూపెఱుంగఁడు ద్రోణకృపాశ్వత్థాములు నెఱుంగరు
కర్ణునకెఱుకగనెంతదవ్వట్టి ఘోరసాధనంబున సమస్తంబునుసమయించుటయు [illegible] తక్కినయాయుధంబులఁ

ధంబయ్యెడు నదియట్లుండె నీపాక్కఁడి బోరి వైరులంబరిమార్చినం బౌరుషంబుదీపించుననితలంచెదనప్పట్టికివలయు సారథంబయ్యెడు నదియట్లుండె నీపాక్కఁడి బోరి వైరులంబరిమార్చినం బౌరుషంబుదీపించుననితలంచెదనప్పట్టికి ధృష్టద్యుమ్నుండును శిఖండియుత్తమౌజుండుయుధామన్యుండుఘటోత్కచుండు మొదలయినజగజెట్టులున్నవారుమఱియు ననేకులు వీరలయ ట్టివారయందఱంజెప్పనేల యేనుంగువోలె నీలావునీవెఱుంగవుది విజులకునజేయఁడవు నీయొక్కనికిఁ ద్రిభువనంబునె దురెనీవునిక్కంబలుగవుగాక నీవలిగిననెవ్వరెట్లయ్యెదరోయటుచూడుము నీసైన్యంబుల నెవ్వరికి నేమి సేయవచ్చుమ నకువిజయానందంబు సులభంబయినివలికెనని సంజయుండుధృతరాష్ట్రునకుం జెప్పెనని వైశంపాయనుండు జనమేజ యునకుం జెప్పుటయు॥.................................................................................................*

చ॰ కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశస్తవా। గమృతరసప్రసారకలితాంచితసేకవిధిప్రకర్ష సం। గమముదితోల్లసన్నయనకందళితప్రహసద్గయాలతా। సుమహదుపాశ్రయప్రమదశోభితవిశ్వజ గన్మధువ్రతా * క॥సమయబహుత్వారణ్యా। భ్రమణపరిశ్రావ్యదంతరంగనితాంతో। ద్యమసరళమా ర్గదర్శన। సమర్థపుణ్యాభిధానసకృదుచ్చరణా॰ మాలిని॥ అవగమితరహస్యాష్టాంగయోగప్రకారోత్స వగురుకరుణావిస్తారగాఢప్రశాంతి। ప్రణవహృదయపద్మోద్భాసితజ్ఞానసారా। ద్వవహితవరమానం దానుభూత్రైకరూపా॥.................................................................................................*



గద్య॥ఇది శ్రీ మదుభయకవిమిత్రకొమ్మనామాత్యపుత్రబుధారాధన విరాజితిక్కనసోమ యాజి ప్రణీతంబైనయుద్యోగపర్వంబునందుసర్వంబును జతుర్థాశ్వాసము.

శ్రీమహాభారతము-ఉద్యోగపర్వము
సంపూర్ణము.

మ॥ పొదలంజేయుముదంబునక్కవుల కెప్డున్ సాధుశబ్దార్థసం। పదఁబెం పారియ శేషదోషములమాన్పంజాలినానారసా। భ్యుదయోల్లాసముపేర్మిగల్గిమ హినీయుద్యోగపర్వంబుదో।హదముంగూర్చుచుగద్యపద్యములహృద్యాంబై కరంబెల్లెడన్॥



